# ఆంధ్రపత్రిక

## తొమ్మిదవ సంవత్సరాదిసంచిక

ఇందు

## స్వరాజ్యసమస్యలు భాషావాఙ్మయచర్చలు

విశేషాంశములు

[illegible]జనులచే వ్రాయఁబడిన అమూల్యవ్యాసములును అనేకచిత్రపటములును గలవు

[illegible]కా ముద్రాలయమున ముద్రితము : ఆంధ్రపత్రికాధిపతిచే ప్రకటితము

6-7, తంబుసెట్టి వీధి, జార్జి టవును, మదరాసు

1918_వ సంవత్సరము మే నెల 1_వ తేది

శ్రీరస్తు

శ్రీమహిషాసురమర్దిన్యై నమః

# కాళయుక్తినామ సంవత్సర సిద్ధాన్త పంచాఙ్గమ్

శ్లో॥ శ్రీకల్యాణ గుణావహం రిపుహరం దుస్స్వప్న దోషాపహం గంగాస్నాన విశేష పుణ్యఫలదం గోదాన తుల్యం నృణాం,
ఆయుర్వృద్ధిద ముత్తమం శుభకరం సంతానసంపత్ప్రదం నానాకర్మసుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతామ్.
శ్రీమద్బృందారబృందాగ్రాం మహిషాసుర మర్దనీం, జగతాం మాతరం నిత్యం నిత్యప్రత్యూష ముపాస్మహే.







ఈ పంచాంగము

మహారాజరాజశ్రీ శ్రీరాజా వాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వర ప్రసాద్ బహద్దర్ మన్నె సుల్తాన్
చింతలపాటి వంటు జమీందార్ సర్ దేశముఖ్ మన్నె ఖాన్ సర్కార్ ఆస్థానాధీశ్వర
అగ్రరా దొరవారి సంస్థాన పండితుండయిన

## పురాణం రామచంద్రశాస్త్రిచే

గుణింపబడి

బ్రహ్మశ్రీ, పురాణం - రామకృష్ణ శాస్త్రిగారిచే పరిష్కరింపబడి

ఆంధ్రపత్రికా ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

ఫలితాంశము:—ఈ సంవత్సరము రాజు శుక్రుడు, మంత్రి శని, సేనాధిపతి శుక్రుడు, సస్యాధిపతి బుధుడు, ధాన్యాధిపతి సూర్యుడు, అర్ఘాధిపతి శుక్రుడు, మేఘాధిపతి శుక్రుడు, రసాధిపతి బృహస్పతి, నీరసాధిపతి చంద్రుడు, నాలుగు దూముల వర్షము. పూర్వాపర సస్యములు చక్కగ ఫలించును. కందులు శనగలు మొదలగు రక్తధాన్యములు, రక్తభూములు తెల్లధాన్యములు బాగుగ ఫలించును. తేనె నెయ్యి మొదలగు రసద్రవ్యములకు ధరలు కలిగియుండును. చైత్రమున గొంచెముగ వర్షించును. వైశాఖమున యెండలు తీక్ష్ణముగ నుండును. ఆహారధాన్యములు సులభము లగును. జ్యేష్ఠమున బహువాయుసహితోష్ణబాధ గలుగును. కాని యచ్చటచ్చట వర్షములు ప్రారంభించి భూమి చల్లబడును. ఆషాఢమున ఖండవృష్టి. శ్రావణ భాద్రపదములయందు చక్కగ వర్షించును. ఆశ్వయుజ కార్తీకములయందును సస్యోపయోగ మగునటుల చక్కగ వర్షించును. పశునాయకుడు గోపాలుండగుటచే పశువులు తృణసమృద్ధి గలిగి వర్ధిల్లును. జ్యేష్ఠ శు 3 భౌమవాసరమున సరస్వతీనదీ పుష్కరప్రవేశము గలుగును. రాత్రివృద్ధి గావున సుభిక్షముగ నుండును. పంటలు పడమటి సీమల కధికముగ ఫలించును.

రాజా శుక్రః మంత్రీ శనిః
సేనాధిప శ్శుక్రః సస్యాధిపః కుజః
ధాన్యాధిప స్సూర్యః అర్ఘాధిప శ్శుక్రః
మేఘాధిప శ్శుక్రః రసాధిపో గురుః
నీరసాధిప శ్చంద్రః.

### ద్రోణనామకో మేఘః.

మేఘోః ప్రాగ్దిగ్భాగే మేఘ స్యోత్పత్తిః. మేఘఫలం. శ్లో. నిరంతరం మహావర్షం మధ్యదేశే లభైవచ, అశుభం సర్వలోకానాం ద్రోణమేఘస్య లక్షణం.

### చతురాఢకపరిమితం వర్షం.

ఆఢకప్రమాణం. శ్లో. షష్టియోజన విస్తీర్ణం శతయోజన మాయతం, ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే దశభాగా స్సముద్రేషు భూధరేషుచ సప్తచ, ద్వౌభాగౌ భువి పర్జన్య ఏవంవర్షస్య లక్షణం.

### వర్ష ధాన్యాదయః.

వర్ష ౦౧౫ ధాన్యం ౧౯ శీతం౧౧ తృణం ౧౯ ఉష్ణం ౨ మారుతం ౨ ప్రజావృద్ధిః ౧౯ నాశః ౧౯ రాజవిద్వేషం ౧౧ ఉగ్రం ౯ పుణ్యం ౯ పాపం ౯ వ్యాధయః ౧౧ వ్యాధ్యుపశమనం ౨ ఆచారః ౧౧ అనాచారః ౧౧ జన్మాని ౧౧ నాశః ౧౯ దేశోపప్లవం — దేశస్వాస్థ్యం ౧౩ చోరభయం ౧౩ నాశః ౧౧ అగ్నిభయం ౫ అగ్నిశాంతిః ౫ మృగోపద్రవః ౧౩ మృగక్షయః ౯ కీటకభయం ౭౧ కీటకక్షయః ౧౧ మూషకవృద్ధిః ౫ నాశః ౧౨ సర్పభయం ౧౫ సర్పక్షయః ౧౯ కామః ౯ లోభః ౨ మోహః ౯ మదః ౧౨ మాత్సర్యం ౫ సుఖం ౧౯ దుఃఖం ౧౫ భోగః ౩ విడంబం ౧౫ మనోవేదనా ౧౨ ద్వేషః ౧౩ ప్రతిష్ఠా ౨ అప్రతిష్ఠా ౧౨ దుస్స్వఫలం.
పురుషోత్పత్తిః ౨ స్త్రియః ౧౩ ధాతురా శుక్రవాసరే త్రయోదశీ
శౌర్యం ౧౧ దుష్టనిగ్రహః ౧౯ శిష్టానుపామయోగే కాలవకరణే
అసత్యం ౨ విశ్వాసః ౫ అవిశ్వాసః ౧౧ దయయే రవేరార్ద్రా ప్రవే
యా సత్యం ౧౯ న్యాయం ౧౨ అన్యాయం ౧౯॥ రాత్రౌ సస్యాభి
౧౩ కాపట్యం ౧ నిష్కాపట్యం ౫ ధార్మికం క్రే శాంతికరం ప్రో
గోమాయువృద్ధిః ౧౦ నాశః ౨ సస్యకీటకవృద్ధి పూర్ణఫలం ప్రోక్తం
వృద్ధిః ౧౩ నాశః ౪ మశకవృద్ధిః ౧ నాశః ౧౦ తు కాలతిధ్యాదిజం
నాశః ౧౩ వృశ్చిక వృద్ధిః ౧ నాశః ౧౦ సస్యకీట
౬ పశువృద్ధిః ౨ నాశః ౮ శుకవృద్ధిః ౬ నాశః ౯వ ఫలం.
౮ నాశః ౮ క్షుధా ౧ తృష్ణా ౩ నిద్రా ౨ ఆలస
౧ శాంతం ౧ క్రోధః ౫ డంబం ౫ మిత్రభేదః ౨
నిష్పత్తిః ౨ ఫలనిష్పత్తిః ౧౧ ధేనువృద్ధిః ౧ నాశః ౭
౪ నాశః ౭ మృగవృద్ధిః ౧ నాశః ౭ ఛాగవృద్ధిః రవేర్మేష ప్రవే
అశ్వవృద్ధిః ౯ నాశః ౪ గజవృద్ధిః ౪ నాశః ౭ ఉష్ట్రస్య కలహా ప్రదా
౭ విప్రవృద్ధిః ౭ నాశః ౧ క్షత్రియ వృద్ధిః ౧ నాశః శే శ్మేష ప్రవే
౭ నాశః ౯ శూద్రవృద్ధిః ౯ నాశః ౭ మ్లేచ్ఛవృద్ధిః గౌడదేశయోః
సంకరవృద్ధిః ౪ నాశః ౪ మరకతవృద్ధిః ౩ మాణిక్యవృద్ధి
వృద్ధిః ౩ వైడూర్యవృద్ధిః ౯ గోమేధికవృద్ధిః ౭ పుష్యరా
ఇంద్రనీలవృద్ధిః ౪ ప్రవాళవృద్ధిః ౯ మౌక్తికవృద్ధిః ౪
వృద్ధిః ౯ సువర్ణవృద్ధిః ౧౪ రజతవృద్ధిః ౧౦ తామ్రవృద్ధిః ౬.
వృద్ధిః ౧౦ లోహవృద్ధిః ౭ అయోవృద్ధిః ౮ త్రపువృద్ధి ౧౦
౧౦ రసవృద్ధిః ౬ వ్రీహివృద్ధిః ౧౪ శాలివృద్ధిః ౭ శుభుత్థవస్తువులు
తిలవృద్ధిః ౧౭ మాషవృద్ధిః ౬ ముద్గవృద్ధిః ౮ సర్షపవృద్ధిః జీర్ణము
వృద్ధిః ౭ ఆఢకవృద్ధిః ౧౭ గోధూమవృద్ధిః ౧౭ కోద్రవవృద్ధి. దీని
సావము
మేర్పడి

### అర్ఘాధిపస్య శుక్రస్య ఫలం.

శ్లో॥ అర్ఘాధిపే యదా శుక్రే సర్వధాన్యార్ఘ వృష్టికృత్, శ్వేతధాన్యం సుఫలితం సుభిక్షం స్యాచ్చ భూతలే. ఇదం ఫలం సర్వదేశేషు ప్రశస్తం.

### మేఘాధిపస్య శుక్రస్య ఫలం.

శ్లో॥ అతివృష్టి స్సుభిక్షంచ సస్యవృద్ధి ర్నిరామయం, క్షీరప్రదా స్సదా గావః శుక్రే మేఘాధిపే సతి, ఇదం ఫలం సర్వదేశేషు ప్రశస్తం.

### రసాధిపస్య గురోః ఫలం.

శ్లో॥ తిల తైలగుడక్షౌద్రా యేచాన్యే మధురాదయః, అర్ఘవృద్ధ్యై ప్రజాయంతే జీవే యది రసాధిపే. ఇదం ఫలం కొంకణ మాగధ దేశయోః ప్రశస్తం.

### నీరసాధిపస్య చంద్రస్య ఫలం.

శ్లో॥ ముక్తాఫలం రత్న సువర్ణబీజం కాంస్యాది వస్త్రాభరణంచ సర్వం, వృద్ధిం గతం స్యాచ్ఛుభదం హిమాంశౌ చంద్రో యదా నీరసనాయకో భవేత్. ఇదం ఫలం మాళవదేశే ప్రశస్తం.

### రవేరార్ద్రా ప్రవేశకాలస్యఫలం.

ఏ తత్సంవత్సర జ్యేష్ఠ శు ౧౨ శుక్రవాసరే త్రయోదశీ ఘటికా స్వాతీ రాధా నక్షత్రే సాధ్య నామయోగే కౌలవకరణే సూర్యోదయాది ౪౧-౧౪ ఘటికా భోగసమయే రవేరార్ద్రా ప్రవేశాత్ తత్కాల తిధ్యాదీనాం ఫలాని. శ్లో॥ రాత్రౌ సస్యాభివృద్ధిః స్యాత్ త్రయోదశ్యాం జయప్రదం, శుక్రే శాంతికరం ప్రోక్తం మైత్రే ప్రాణినాం శుభం భవేత్. సాధ్యే పూర్ణఫలం ప్రోక్తం కౌలవేతు సుభిక్ష కృత్, రవే రార్ద్రా ప్రవేశేతు కాలతిధ్యాదిజం ఫలం.

### భరణ్యాది షణ్మండల గత చంద్ర ఫలం.

మహార్ఘః.

ఇదం ఫల మాంధ్రదేశే ప్రశస్తం.

### మేష సంక్రాంతి ఫలం.

ఏ తత్సంవత్సర చైత్ర శు ౩ శనివాసరే దివా రవేర్మేష ప్రవేశాత్ ఫలం. శ్లో॥ దివాచే న్మేష సంక్రాంతి రనర్ఘ కలహప్రదా, అపరాహ్ణే లోక పీడా శనివారే ల్పవృష్టికృత్, రవే ర్మేష ప్రవేశేతు కాలతిధ్యాదిజం ఫలం. ఇదం ఫలం ద్రావిడ గౌడదేశయోః ప్రశస్తం.

---

## సురతి ద్రావకము

### సీసా 1-కి వెల రూ. 1-0-0 వి. పి. రూ. 1-4-0.

మూత్రద్వారమునుండి విషద్రవము మూత్రనాళము వరకు బోయి అక్కడ చిన్నపుండు అగుటవలన శగరోగము ఏర్పడును. ఇది అంటురోగము. ఒకరివలన మరి ఒకరికి ఏర్పడును. దీనివలన సంతానము గలుగుటకు భంగము రావచ్చును. దీని ముఖ్యలక్షణములు:

మూత్రము వెడలునపుడు పోట్లు మంటలు; మూత్రద్వారమునుండి తెల్లటిగాని, ఎర్రటిగాని, పచ్చటిగాని, చీమువంటి ద్రవము వెడలుట, పొత్తికడుపు నరములు బిగదీయుట; మూత్రకోశమున పోట్లు, తరుచుగా మూత్రవిసర్జనము చేయుట, మూత్రము బొట్లుబొట్లుగా వెడలుట మొదలగునవి రోగము ప్రారంభించిన వెంటనే సురతి ద్రావకము ఏడుపూటలు సేవించిన నాళముదగ్గర పుండుమాని చీమువంటిద్రవము కట్టి మూత్రము ధారాళముగా వెడలును నాళముల యందలి జిల మానును. ఈద్రావకము పాతశగరోగములగూడ నతిత్వరలో మాన్పును. రోగము త్వరలో పూర్తిగ కుదురుటకు మూత్రమార్గమును శుభ్రముగా నుంచవలయును. అందుకొరకు ఆమార్గము పిచికారుపెట్టి కడుగుట యుక్తము. కోరువారలకు పిచికారియును అందులకు ఉపయోగించుమందును రూ. 0-8-0 లకు పంపబడును.

ఈమందు కోరురోగి పురుషుడైనది స్త్రీయైనది, ఎంతకాలమునుండి బాధపడుచున్నది రోగివయస్సు వ్రాయవలయును. మందు వైద్యులు మలబట్టి మార్పుచేయవలసియుండును.

శగరోగము తగిలినవారు జాడ్యము నయమగువరకు స్త్రీసాంగత్యమును ఆట్టితిలంపులను మాని విశ్రాంతి గలిగి యుండవలయును.

## జీర్ణ రసాయనము

### 25 మాత్రల డబ్బీ వెల రూ. 1-4-0.



అజీర్ణమునలన భుజించిన వస్తువులు రక్తమునకు సరిగా నూరవు. అజీర్ణము మిగిలిన రోగములకు కారణము. దీనివలన జీర్ణకోశము లందు రసస్రావము క్రమముగ గలుగక దుర్బల మేర్పడి ఆయువు క్షీణించును.

1. ఆకలి లేకపోవుట, 2. అగ్నిమాంద్యము, 3. మలబద్ధము, 4. కడుపు నొప్పులు, 5. అరుచి, పులిత్రేపులు, 6. వికారము, గుండెలలోను రొమ్ములోను మంట, బరువు, 7. తలనొప్పి, తలగిమ్ము, 8. చిక్కిపోవుట, 9. జ్వరము, 10. వెన్నుపూసమీదను ప్రక్కను గుండెలలోను పోటు, ఆయాసము మొదలగునవి. ఈ గుణములన్నియు నొకసారియే కనబడకున్నను అజీర్ణము వీటికి ప్రధానకారణము. అజీర్ణలక్షణములు కనుపించిన వెంటనే జీర్ణరసాయనము మాత్రలను సేవించిన జీర్ణశక్తి హెచ్చును, మలబద్ధము మానును. రక్తము పుష్టిజెందును. ఆకలి హెచ్చును.

చిరునామా:— అమృతాంజనము డిపో,

బొంబాయి లేక మద్రాసు.

## అమృతాంజనము అన్ని తలనొప్పుల మాన్పును.

## గురుచార ఫలం.

అబ్దాది వృషభరాశిస్థిత గురు ఫలం. శ్లో॥ వృషరాశిగతే జీవే పశు స్త్రీ శిశు నాశనం, మధ్యవృష్టి స్సస్యహాని నృపాణాం సమగం మహత్, ఇదం ఫలం జ్యేష్ఠ శు ౭ పర్యంత మతి ఊర్ధ్వం మిధునరాశిస్థిత గురుఫలం. శ్లో॥ సురేంద్రవంద్యే భువి యుగ్మరాశిం గతే క్షితీశాః కలహోత్సుకాః స్యుః. ఈతేర్భయం శస్త్రభయం ప్రజానాం క్వచిత్ప్రవర్షంతి పయోధరాశ్చ. ఇదంఫల మబ్దాంతం. ఏతత్సంవత్సర జ్యేష్ఠ శు 3 భౌమవాసరే సురస్వతీ పుష్కర ప్రవేశః.

## శనిచారఫలం.

అబ్దాది కటకరాశిస్థిత శనిఫలం. శ్లో॥ కుళీరగే సూర్యసుతే ధరిత్రీ సువృష్టి సస్యార్ఘ ఫలాన్వితా స్యాత్, వైశ్యోత్తమాః పంచన దాంతికాశ్చ సర్వేపరోగా జాని వినాశ మీయుః. ఇదం ఫలం భాద్ర పద శు ౧౦ పర్యంత మతిఊర్ధ్వం సింహరాశిస్థిత శనిఫలం. శ్లో॥ మృగేంద్రసంస్థే రవిసుతే చరాగా జనాస్సు్య గజాశ్చ ప్రధాన గాశ్చ, బాహ్లీక గాంధారక చీనకోష్ఠ సబ్రాహ్మణికా స్స్యు గజికాశ్చనష్టాః ఇదం ఫలం ఫాల్గున బ ౪ పర్యంత మతిఊర్ధ్వం వక్రగత్యా కర్కటకరాశిస్థితస్య శనేఃఫలం పూర్వమేవోక్తం. ఇదంఫల మబ్దాంతం. అబ్దాది పుష్యమీనక్షత్రస్థితస్య శనేఃఫలం. శ్లో॥ పుష్యేశనౌ వణిక్ప్రయావనాశ్చ లయాంయాంతి. ఇదంఫలం వైశాఖ శు ౧౧ పర్యంతి మతఊర్ధ్వ మాశ్లేషానక్షత్ర స్థితస్య శనేఃఫలం. శ్లో॥ హంతి సార్పస్థిత స్సూర్య సూనుర్జలరుహోరగాన్. ఇదంఫలం భాద్రపద శు ౧౦ పర్యంత మతఊర్ధ్వం మఘానక్షత్రస్థితస్య శనేః ఫలం. శ్లో॥ పిత్ర్యస్థితోర్కజః బాహ్లీకచీనగాంధార వైశ్యహా స్యాత్. ఇదంఫలం ఫాల్గున బ ౪ పర్యంత మతిఊర్ధ్వం వక్రగత్యాశ్లేషానక్షత్రస్థితస్య శనేః ఫలం పూర్వమేవోక్త మిదంఫల మబ్దాంతం.

## జ్యేష్ఠశుక్లప్రతిపద్యుక్తవారఫలం.

శ్లో॥ దుర్భిక్షయుద్ధామయభీతయశ్చ నృపా స్సదా క్రోధయుతాః ప్రమత్తాః। సస్యాని మధ్యాని భవంతిలోకే జ్యేష్ఠాగిమే యది భానువాసరే.

## ఆషాఢ శుక్ల పంచమీ యుక్తవారఫలం.

అలిఖితం.

## ఆషాఢ శుక్లనవమీ యుక్తనక్షత్రఫలం.

శ్లో॥ ఆషాఢే శుక్లపక్షేతు నవమీ స్వాతిసంయుతా, వాయుస్సర్వత్ర సంవాతి భూమకా బీజం నవాపయేత్.

## తత్కృష్ణపక్ష రోహిణీయుక్త తిథిఫలం.

శ్లో॥ ఆషాఢే కృష్ణపక్షేతు రోహిణ్యేకాదశీయుతా, సర్వసస్యసమృద్ధిః స్యా ద్వృష్టిసంపూర్ణతా భవేత్.

## పౌషకృష్ణామాయుక్త వారఫలం,

సస్యవర్ధనం.

## అస్మిన్నబ్దే పశునాయకో గోపాలస్తస్యఫలం.

శ్లో॥ పశువృద్ధి స్సుభిక్షంచ బహుసస్యార్ఘ సంపదః, సంపూర్ణతృణవృద్ధిశ్చ గోపాలే పశునాయకే సర్వమాంగళ్య నిశ్చితః దశాంశాధికగ్రాసః.

## గురుశుక్రమౌఢ్యనిర్ణయః.

వైశాఖ బ ౬ ప్రభృతి జ్యేష్ఠ బ ౬ పర్యంతం గురుమౌఢ్యం. ఆశ్వయుజ శు ౧3 ప్రభృతి పౌష శు ౧ పర్యంతం శుక్రమౌఢ్యం.

## మకరసంక్రాంతిఫలం.

ఏతత్సంవత్సర పౌష శు ౧౨ సోమవాసరే ౫౪-౧౪ ఘటికా



భోగసమయే రవేర్మకర రాశి ప్రవేశత్వాత్ తత్ఫలం సంక్రాంతిపురుష లక్షణం చాభివర్ణ్యతే. శ్లో॥ త్రిశీర్షం ద్విముఖం చైకపంచవక్త్రం త్రినేత్రకం, లంబకర్ణం రక్తదంతం లంబభ్రూదీర్ఘనాసికం. అష్టబాహుం ద్విపాదం చ వికృతం కృష్ణవర్ణకం, స్త్రీపుంరూపంచ విజ్ఞేయం సంక్రాంతి వర లక్షణం. అస్యపురుషస్యధ్యాంక్ష నామధేయ స్తస్యఫలం వైశ్యనాశః. చందనోదక స్నానం తస్యఫలం

సుభిక్షం. విచిత్రాంబరధారణం తస్యఫలం శుభం. కుంకుమగంధానులేపనం తస్యఫలం స్త్రీణాం సుఖిష్టం. వకుళపుష్పధారణం తస్యఫలం క్షుద్భయం. రజతభూషణం తస్యఫలం మహార్ఘః. తామ్రపాత్రధారణం తస్యఫలం లోహనాశః. భక్ష్యాహారః తస్యఫలం ప్రజాపీడా. మాతఫలభక్షణం తస్యఫలం నటవినాశః. అస్యా యుధధారణం తస్యఫలం క్షుద్వ్యాధ్యగ్నిభయం. పీతచ్ఛత్రం తస్యఫలం శుభం. వరాహవాహనం తస్యఫలం రాజపీడా. ఊర్ధ్వస్థితావస్థా తస్యాః ఫలం క్షామడాంబరం. ఉత్తరదిగ్యానం తస్య ఫలం తద్దేశక్షామడాంబరం. సలజ్జాచేష్టా తస్యాః ఫలం శుభం. పశుఫలందుర్భిక్షం. తిథిఫలముత్తమం. వారఫలంక్షేమం. కాలఫలంకాకనాశః. శ్లో॥ సంక్రాంతి పురుషైర్ధార్య వర్ణద్రవ్యం సవృద్ధిదం, తస్మాత్సర్వ ప్రయత్నేన వర్ణ ద్రవ్యం నివర్తయేత్. సంక్రాంతి పురుషోత్పత్తి కాలేదానం స్వశక్తితః, కూష్మాండాదీని విప్రేభ్యో దద్యాచ్ఛ్రేయోభివృద్ధయే.

## ఆదాయవ్యయాః.

మేష వృశ్చికయో రాదాయః ౨ వ్యయః ౮. వృషభ తులయో రాదాయః ౧౧ వ్యయః ౧౪. మిథునకన్యయో రాదాయః ౧౪ వ్యయః ౧౧. కర్కాటక స్యాదాయః ౮ వ్యయః ౧౧. సింహస్యాదాయః ౧౧ వ్యయః ౫. ధనుర్మీనయో రాదాయః ౫ వ్యయః ౧౪. మకరకుంభయో రాదాయః ౮ వ్యయః ౮. సర్వాదాయః ౫౯ సర్వ వ్యయః ౭౧.

## కందాయాః.

| అశ్వి | భ | కృ | రో | మృ | ఆర్ద్రా | పున | పుష్య | ఆశ్లే |
|---|---|---|---|---|---|---|---|---|
| ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ |
| ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ |
| ౩ | ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ |
| మ | పూఫ | ఉఫ | హ | చి | స్వా | వి | అనూ | జ్యే |
| ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ |
| ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ |
| ౦ | ౩ | ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ |
| మూ | పూషా | ఉషా | శ్ర | ధ | శ | పూభా | ఉభా | రే |
| ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ |
| ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ |
| ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ |

## వర్షాది యోగములు.

చైత్రమున రవి వాయుచండ వాయు నాడులయందు బుధగురువులు వాయునాడియందు రాహుకేతువులు దహననాడియందు సంచరించుటచే శుష్కవాయువులు మెండుగ నుండును. శనికి ముందు కుజుడు నడచుచున్నందున రోగభయము గలుగును. కుజశనులు మేఘనాడియందు శుక్రుడు జలనీరనాడులయందు సంచరించుటచేఁ గొంచెముగ వర్షించును. వైశాఖమున రవి బుధులు వాయుచండవాయునాడులయందు గురు రాహుకేతువులు దహననాడియందు శుక్రుడు దహనవాయునాడులయందు సంచరించుటచేఁ దాప మధికముగ నుండును. గురునకు వృషాంత్యసంచారము గలిగినందున నాహారధాన్యములకు ధరలుండును. కుజుడు జలనాడియందు శని మేఘసుధానాడులయందు సంచరించుటచేతను గుర్వస్తమయయోగ ముండుటను వర్షించును. ఉత్తరాకుజావరయోగ ముండుటచేఁ గొన్నిస్థలముల వర్షింపక పోవచ్చును. జ్యేష్ఠమున రవి దహననాడియందు బుధుడు వాయుదహననాడులయందు గురువు దహననాడియందు శుక్రుడు వాయుచండవాయునాడులయందు రాహువు వాయునాడియందుఁ గేతువు దహననాడియందు సంచరించుటచేఁ బడమటిగాడ్పులు మెండుగ నుండును. కుజుడు జలనీరనాడులయందు శని సుధానాడియందు మాసాంతమున బుధుడు నీరజలనాడులయందు సంచరించుటచేతను రోహిణీశుక్రయోగ మున్నందునను వర్షించును. మాసాదియందు గురుకేతుసమాగమయోగ ముండుటచే యుద్ధభయము గలుగును. ఆషాఢమున రవి జలమేఘనాడులయందు బుధుడు మేఘసుధానాడులయందు గురువు నీరనాడియందు శని సుధానాడియందు సంచరించుటచేతను శన్యస్తమయము గలుగుటను బుధుడు పుష్యమియందుండి యుదయించుటచేతను జక్కగ వర్షించును. కుజశుక్రులు దహననాడియందు రాహువు వాయునాడియందుఁ గేతువు దహననాడియందు సంచరించుటచే ఖండాంతరమున ఖండవృష్టి గలుగును. శని కుజులకు నడుమ బుధుడు నడచుటచేతను, ఈ మాసమందున శ్రావణ భాద్రపద మాసములయందును గాలసర్పయోగ ముండుటచేతను రాజకలహములు మెండగును. శ్రావణమున రవి బుధ శుక్రులు సుధామేఘనాడులయందును గురువు నీరనాడియందును శని సుధానాడియందును సంచరించుటచేతను శన్యుదయముగుటను బుధసర్వనూ శుక్రయోగముండుటను జక్కగ

## శుభముహూర్తనిర్ణయః.

చైత్ర బ ౨ ఆ, అనూ, రాత్రౌ వివాహాదీనాం మీనో రహితః
„ బ ౩ సో, జ్యే, దివా, డోలారోహణస్య వృషభః పక్షక రహితః
„ బ ౬ గు, ఉషా, రాత్రౌ వివాహాదీనాం మీనః పక్షకరహితః
„ బ ౧౧ సో, ఉభా, రాత్రౌ వ్యాపార ప్రారంభస్య మీనోరహితః
వైశా, శు ౨ ఆ. రో, దివా, వివాహాదీనాం వృషభోరహితః
„ „ „ „ రాత్రౌ వివాహాదీనాం మీనోరహితః
„ శు ౩ సో, మృ, దివా, వివాహాదీనాం వృషభోరహితః
„ శు ౭ శు, మ, రాత్రౌ వివాహాదీనాం మీనో రహితః
„ శు ౧౦ సో, హ, రాత్రౌ వివాహాదీనాం మేషో రహితః
శ్రావ, శు ౮ శ, హ, రాత్రౌ వివాహగృహప్రవేశాదీనాం మిథునం రహితం
„ శు ౯ సో, చి, రాత్రౌ వివాహాదీనాం మిథునం రహితం
„ బ ౨ శ, ఉభా, రాత్రౌ వివాహాదీనాం మిథునం రహితం
„ బ ౮ గు, రో దివా, వివాహాదీనాం కన్యా రహితా
మాఘ శు ౩ సో, శత, దివా, అన్నప్రాశనాదీనాం మీనోరహితః
„ శు ౬ గు, అశ్వి, దివా, ఉపనయనాదీనాం మీనోధ్వకరహితః
„ శు ౧౩ బు, పున, దివా, ఉపనయనాదీనాం మీనోరహితః
„ బ ౧ శ, మ, దివా వివాహాదీనాం మీనోరహితః
ఫాల్గున బ ౧ సో, ఉఫ, దివా వివాహాదీనాం మేషోరహితః

వాస్తువిషయము:— భాద్రప దాశ్వయుజ కార్తికమాసములఁ బూర్వశిరస్సుగా, మార్గశిర్ష పౌష మాఘమాసముల దక్షిణశిరస్సుగా, ఫాల్గున చైత్ర వైశాఖమాసములఁ బశ్చిమశిరస్సుగా, జ్యేష్ఠాషాఢశ్రావణమాసముల నుత్తరశిరస్సుగా, వాస్తుపురుషుడు వామహస్తము దలక్రింద నిడికొని శయనించును. అతనిదృష్టి చేఁ బాదములఁ గలదిక్కున నాయామాసముల నిండ్లు కట్టఁగూడదు.

గౌళిపతనఫలం:— శిరసి కలహః. లలాటే బంధుదర్శనం. భ్రూయుగ్మే రాజానుగ్రహః. భ్రూమధ్యే నిరర్థకం. ఉత్తరోష్ఠే ధనవ్యయః. అధరోష్ఠే ధనలాభః. నాసికాగ్రే వ్యాధిసంభవః. దక్షిణకర్ణే దీర్ఘాయుః. వామకర్ణే వాణిజ్యలాభః. నేత్రయుగ్మే కారాగృహప్రాప్తిః. చుబుకే రాజదండః. వక్త్రే భయం. కంఠే శత్రునాశనం. దక్షిణభుజే సదారోగ్యం. వామభుజే స్త్రీసంభోగః. వామమణిబంధే యశః. దక్షిణమణిబంధే పీడా. స్తనయుగ్మే దోషః. ఉదరే ధాన్యలాభః. వక్షసి నాభౌచ ధనలాభః. పార్శ్వయో ర్బహులాభః. ఊరుదేశే పితృరిష్టం. జానుజంఘయో స్సుఖం. పాదయోః ప్రయాణం పృష్ఠభాగే శుభం. నఖేషు ధనవ్యయః కేశాంతే మృత్యుభయం. గౌళిపతనఫల మేవం ద్రష్టవ్యం. కృకలాసస్యాపిచ మేవఫలం.

యోనిపొంతనము:— అశ్వినీ శత తారలు గుఱ్ఱములు. భరణీరేవతు లేనుఁగులు. కృత్తికాపుష్యము లజములు. రోహిణీ మృగశీర్షలు పాములు. ఆర్ద్రామూలలు శునకములు. ఆశ్లేషాపునర్వసులు పిల్లులు, మఘాపూర్వాఫల్గుణు లెలుకలు. ఉత్తరాఫల్గునుత్తరాభాద్రలు గోవులు. హస్తాస్వాతు లెనుబోతులు. చిత్రావిశాఖలు పెద్దపులులు. అనూరాధా జ్యేష్ఠలు లేళ్లు. పూర్వాషాఢా శ్రవణములు కోఁతులు. ధనిష్ఠాపూర్వాభాద్రలు సింహములు. ఉత్తరాషాఢాభిజిత్తులు ముంగిసలు. వీనిని విచారించి విరోధజంతునక్షత్రములు గల స్త్రీపురుషులకు వివాహముఁ జేయఁగూడదు.

## అబ్దాదికృత్యము.

సంవత్సరాది దినమున నుదయమున లేచి వర్ణాచారక్రమమున స్నానసంధ్యాద్యనుష్ఠానములఁ దీర్చుకొని మిత్రబంధువర్గముతోఁ గూడి వస్త్రభూషణాదుల నలంకరించుకొని యుదఙ్ముఖుఁడై కాని ప్రాఙ్ముఖుఁడై కాని దైవజ్ఞసమ్ముఖమునఁ గూర్చుండి విఘ్నేశ్వరుని సరస్వతిని నవగ్రహములను దైవజ్ఞుని బ్రాహ్మణులను గురువును బూజించి సాంగోపాంగముగ సంవత్సర ఫలమును వినవలయును. ప్రథమయామమున శర్కరాజ్యఘృతసమ్మిశ్ర మగు నింబకుసుమమును భక్షింపవలయును. ఇట్లొనరించెనేని సంవత్సరమంతయు సౌఖ్యదాయకమయి యుండునని శాస్త్రము.

దైవజ్ఞ లక్షణము:— శ్లో. అద్వేషీ నిత్యసంతోషీ గణితాగమపారగః, ముహూర్తగుణదోషజ్ఞో వాగ్మీ కుశలబుద్ధిమాన్, శాంతశ్చాచ్యుత వాక్సౌమ్య స్త్రికాలజ్ఞో జితేంద్రియః, నిత్యకర్మరతో యోగీ సదైవజ్ఞః ప్రకీర్తితః. దశదినకృతదోషం హంతిసిద్ధాంతవేత్తా త్రిదినజనితమంహ స్తంత్రవేత్తా నరాణాం, కరణభగణ వేత్తా చైకరాత్రోత్థపాపం జనయతి బహుపాపం త్వేకనక్షత్రసూచీ. అవిదిత్వైవ యచ్ఛాస్త్రం దైవజ్ఞత్వం ప్రపద్యతే, నక్షత్రసూచీసభవేత్సర్వకర్మబహిష్కృతః.

## పంచాంగశ్రవణఫలం

శ్లో. యశ్శృణోతి మధు శుక్లపక్షకే వర్ష నాథ సచివాదికం ఫలం, ప్రాప్నుయా ద్దురితముక్త విగ్రహ శ్చాయు రర్థమతులం యశస్సుఖం, కన్యాకనీకాంచన దిగ్గజానాం గవాం సహస్రం సతతం ద్విజేభ్యః, దత్వా ఫలం యల్లభతే మనుష్య స్తత్తత్ఫలా వ్యబ్దఫలం చ శృణ్వన్. ఆయుర్వృద్ధిం పుత్రపౌత్రాభివృద్ధిం నిత్యారోగ్యం సంపదం నిర్విఘ్నాయాం, అచ్ఛిన్నా నా ముత్సవా నామవాప్తిం యచ్ఛంత్యేతే వత్సరాధీశముఖ్యాః. రాజామంత్రీ సస్యనాథో రసేశ స్సేనాధీశః ధాన్యపో నీరసేశః, అర్ఘాధీశః కించ మేఘాధినాథో దద్యుః శ్రేయః శృణ్వతాం తత్ఫలాని. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

కుజచారః.

చైత్ర, శు ౯ గు, పూఫ ౩ వక్రీ కుజః
,, శు ౧౨ సో, కుజవక్రత్యాగః
వైశా, శు ౧౧ మం, ఉఫ ౧ కుజః
,, బ ౭ శ, ఉఫ ౨ కన్యాయాం
జ్యేష్ఠ, బ ౧ మం, హ ౧ కుజః [బుజ్యే కుజః
ఆషా, శు ౧౨ శ, చి ౧ కుజః
,, బ ౯ గు, చి ౩ తులాయాం కుజః
శ్రా,, శు ౫ సో, స్వా ౧ కుజః
,, బ ౧౨ సో, వి ౧ కుజః
భాద్ర, శు ౧౨ మం, వి ౪ వృశ్చికే కుజః
,, బ ౨ ఆ, అనూ ౧ కుజః
ఆశ్వ, శు ౬ శు, జ్యే ౧ కుజః
,, బ ౧౧ బు, మూ ౧ ధనుషి కుజః
కార్తి, శు ౧౪ ఆ, పూషా ౧ కుజః
మార్గ, శు ౨ గు, ఉషా ౧ కుజః
,, శు ౬ సో, ఉషా ౨ మకరే కుజః
,, బ ౫ ఆ, శ్ర ౧ కుజః
పౌష, శు ౬ బు, ధ ౧ కుజః
,, బ ౧ శు, ధ ౩ కుంభే కుజః
,, బ ౯ శ, శ ౧ కుజః
మాఘ, శు ౧౧ మం, పూభా ౧ కుజః
,, బ ౯ సో, పూభా ౪ మీనే కుజః
,, బ ౧౩ శు, ఉభా ౧ కుజః
ఫాల్గు, బ ౭ శ, పశ్చాదస్తమితః కుజః
,, బ ౧ సో, రే ౧ కుజః

బుధచారః

చైత్ర, శు ౭ బు, బుధవక్రారంభః
,, శు ౧౧ ఆ, పశ్చాదస్తమితో బుధః
,, బ ౧౨ మం, ప్రాగుదితో బుధః
,, బ ౩౦ శు, బుధవక్రత్యాగః
వైశా, బ ౮ ఆ, కృ ౨ వృషభే బుధః
జ్యేష్ఠ శు ౨ సో, ప్రాగస్తమితో బుధః
,, శు ౧౧ గు, మృ ౩ మిథునే బుధః
,, బ ౧౨ శు, పున ౪ కర్కాటకే బుధః
ఆషా, శు ౬ ఆ, పశ్చాదుదితో బుధః
,, శు ౧౫ మం, మ ౧ సింహే బుధః
శ్రావ, శు ౬ మం, బుధవక్రారంభః
,, శు ౧౦ శ, పశ్చాదస్తమితో బుధః
శ్రావ, బ ౧౨ సో, ప్రాగుదితో బుధః
,, బ ౩౦ గు, బుధవక్రత్యాగః
భాద్ర, బ ౯ శ, ఉఫ ౨ కన్యాయాం బుధః
,, బ ౩౦ శ, ప్రాగస్తమితో బుధః
ఆశ్వ, శు ౧౧ బు, చి ౩ తులాయాం బుధః
,, బ ౧౪ శ, వి ౪ వృశ్చికే బుధః
కార్తి, శు ౩ బు, పశ్చాదుదితో బుధః
,, బ ౬ శ, మూ ౧ ధనుషి బుధః
మార్గ, శు ౨ గు, బుధవక్రారంభః
,, శు ౫ ఆ, పశ్చాదస్తమితో బుధః
,, శు ౧౫ మం, జ్యే ౪ వృశ్చికే వక్రీబుధః
,, బ ౮ బు, ప్రాగుదితో బుధః
,, బ ౧౧ శ, బుధవక్రత్యాగః
పౌష, శు ౬ బు, మూ ౧ ధనుషి బుజ్యే బుధః
,, బ ౧౦ ఆ, ప్రాగస్తమితో బుధః
,, బ ౧౩ బు, ఉషా ౨ మకరే బుధః
మాఘ, బ ౧ శ, ధ ౩ కుంభే బుధః
,, బ ౧౩ శు, పశ్చాదుదితో బుధః
ఫాల్గు, శు ౨ మం, పూభా ౪ మీనే బుధః
,, బ ౩౦ సో, బుధవక్రారంభః

గురుచారః

చైత్ర, శు ౧౫ శు, రో ౪ గురుః
వైశా, శు ౨ ఆ, మృ ౧ గురు
,, బ ౨ సో, మృ ౨ గురుః
,, బ ౬ శు, పశ్చాదస్తమితో గురుః
జ్యేష్ఠ, శు ౨ సో, మృ ౩ మిథునే గురుః
,, బ ౧ మం, మృ ౪ గురుః
,, బ ౬ ఆ, ప్రాగుదితో గురుః
ఆషా, శు ౧ మం, ఆర్ద్రా ౧ గురుః
,, బ ౨ గు, ఆర్ద్రా ౨ గురుః
శ్రావ, శు ౪ శ, ఆర్ద్రా ౩ గురు
,, బ ౭ బు, ఆర్ద్రా ౪ గురుః
భాద్ర, శు ౧౩ బు, పున ౧ గురుః
ఆశ్వ, బ ౩౦ ఆ, గురువక్రారంభః
మార్గ, బ ౨ గు, ఆర్ద్రా ౪ వక్రీ గురుః
పౌష, శు ౧౨ సో, ఆర్ద్రా ౩ వక్రీగురుః
మాఘ, బ ౪ బు, ఆర్ద్రా ౨ వక్రీగురుః
,, బ ౩౦ ఆ. గురువక్రత్యాగః
ఫాల్గు, శు ౧౨ గు, ఆర్ద్రా ౩ బుజ్యే గురుః

శుక్రచారః

చైత్ర, శు ౨ శ, శ ౩ శుక్రః
,, బ ౪ మం, పూభా ౪ మీనే శుక్రః
వైశా, బ ౨ సో, అశ్వి ౧ మేషే శుక్రః
జ్యేష్ఠ, శు ౧౩ శ, కృ ౨ వృషభే శుక్రః
ఆషా, శు ౧౦ గు, మృ ౩ మిథునే శుక్రః
శ్రావ, శు ౫ సో, పున ౪ కర్కాటకే శుక్రః
భాద్ర, శు ౮ శు, మ ౧ సింహే శుక్రః
,, బ ౧౧ సో, ఉఫ ౨ కన్యాయాం శుక్రః
ఆశ్వ, శు ౧౩ శు, ప్రాగస్తమిత శ్శుక్రః
,, బ ౫ గు, చి ౩ తులాయాం శుక్రః
కార్తి, శు ౧౪ ఆ, వి ౪ వృశ్చికే శుక్రః
మార్గ, శు ౯ బు, మూ ౧ ధనుషి శుక్ర
పౌష, శు ౧ శు, పశ్చాదుదిత శ్శుక్రః
,, శు ౨ శ, ఉషా ౨ మకరే శుక్రః
,, బ ౧౨ మం, ధ ౩ కుంభే శుక్రః
మాఘ, బ ౬ శు, పూభా ౪ మీనే శుక్రః
ఫాల్గు, బ ౧ సో, అశ్వి ౧ మేషే శుక్రః

శనిచారః

వైశా, శు ౧౧ మం, ఆశ్లే ౧ బుజ్యే శనిః
జ్యేష్ఠ, బ ౨ బు, ఆశ్లే ౨ శనిః
ఆషా, బ ౧ బు, ఆశ్లే ౩ శనిః
,, ,, ,, పశ్చాదస్తమిత శ్శనిః
శ్రావ, శు ౧౨ సో, ఆశ్లే ౪ శనిః
,, బ ౮ గు, ప్రాగుదిత శ్శనిః
భాద్ర, శు ౧౦ ఆ, మ ౧ సింహే శనిః
ఆశ్వ, శు ౧౨ గు, మ ౨ శనిః
మార్గ, శు ౭ మం, శనివక్రారంభః
మాఘ, శు ౨ ఆ, మ ౧ వక్రీశనిః
ఫాల్గు, బ ౪ గు, ఆశ్లే ౪ కర్కాటకే వక్రీశనిః

రాహుకేతుచారః

జ్యేష్ఠ, శు ౧ ఆ, జ్యే ౪ వృశ్చికే రాహుః
[మృ ౨ వృషభే కేతుః
శ్రావ, శు౪ఆ, జ్యే౩ రాహుః మృ౧ కేతుః
ఆశ్వ, శు౮ ఆ, జ్యే ౨ రాహుః రో౪ కేతుః
మార్గ, శు ౧౧ శ, జ్యే౧ రాహుః రో౩ కేతుః
మాఘ, బ౧ శ, అనూ ౪ రాహుః రో౨ కేతుః

గౌరీపంచాఙ్గము. దినప్రమాణమునుగాని, రాత్రిప్రమాణమునుగాని, ౮-చే భాగింపఁగా వచ్చిన లబ్ధము ముహూర్తము.

పగటి ముహూర్తములు. | రాత్రి ముహూర్తములు.

| | ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని | ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ౧ | ఉద్యో | అమృ | రోగః | విషః | ఉద్యో | రోగః | విషః | శుభం | రోగః | జ్వరః | లాభః | సుఖం | అమృ | విషః |
| ౨ | లాభః | విషః | ఉద్యో | అమృ | విషః | జ్వరః | అమృ | అమృ | లాభః | ఉద్యో | రోగః | రోగః | జ్వరః | ఉద్యో |
| ౩ | విషః | ఉద్యో | జ్వరః | శుభం | జ్వరః | అమృ | జ్వరః | జ్వరః | ఉద్యో | కలహః | విషః | కలహః | కలహః | శుభం |
| ౪ | అమృ | లాభః | లాభః | ఉద్యో | లాభః | కలహః | ఉద్యో | రోగః | ధనం | లాభః | ఉద్యో | లాభః | లాభః | అమృ |
| ౫ | శుభం | జ్వరః | అమృ | రోగః | అమృ | లాభః | శుభం | కలహః | రోగః | రోగః | శుభం | ఉద్యో | శుభం | కలహః |
| ౬ | ధనం | అమృ | ఉద్యో | శుభః | విషః | సుఖం | లాభః | లాభః | అమృ | లాభః | లాభః | జ్వరః | ధనం | రోగః |
| ౭ | అమృ | లాభః | విషః | ధనం | కలహః | ధనం | ధనం | ఉద్యో | విషః | ఉద్యో | ధనం | లాభః | అమృ | లాభః |
| ౮ | విషః | ధనం | లాభః | అమృ | జ్వరః | లాభః | లాభః | రోగః | జ్వరః | ధనం | లాభః | ఉద్యో | విషః | లాభః |

నవగ్రహములు ఆయాస్థానములనుండునప్పుడిచ్చెడి ఫలములను దెలియఁజేయు చక్రము.

| | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రవిః | చలనం | భయం | సంపత్ | మానహానిః | చాంచల్యం | శత్రునాశః | దేహపీడా | రోగః | భయం | లాభః | ఆరోగ్యం | వ్యయః |
| చంద్రః | సౌజన్యం | వ్యయః | లాభః | హానిః | శిక్షా | శుభం | లాభః | వ్యయః | వ్యాకులం | లాభః | సుఖం | దుఃఖం |
| కుజః | క్షేమః | హానిః | లాభః | భయం | వైకల్యం | ధనలాభః | కలహః | భయం | వ్యయః | చలనం | లా. | రోగః |
| బుధః | బంధనం | లాభః | వ్యయః | శుభం | దారిద్ర్యం | ఆరోగ్యం | వ్యసనం | సంతోషః | దుఃఖం | శుభం | సుఖం | వ్యయ |
| గురుః | గమనం | ధనలాభః | ఆపత్ | వ్యయః | సంపత్ | దుఃఖం | ఆరోగ్యం | హానిః | ధనలాభః | హానిః | సంతోషః | పీడ |
| శుక్రః | ఆరోగ్యం | భాగ్యం | సౌఖ్యం | సుఖం | పుత్రలాభః | వ్యయః | క్లేశః | భయం | ధనలాభః | సౌఖ్యం | లాభః | హా |
| శనిః | ఆపత్ | హానిః | సంపత్ | రోగః | పీడా | శుభం | దండనం | దుఃఖం | రోగః | జాడ్యం | లాభః | క్లేశ |
| రాహుః | భయం | కలహః | సౌఖ్యం | మృత్యుః | ధనవ్యయః | సుఖం | భయం | మృత్యుః | సంతాప | కలహః | లాభః | హా |
| కేతుః | భయం | విరోధ. | సౌఖ్యం | హానిః | క్లేశః | తోషః | భీతిః | హానిః | కలహః | కలహః | లాభః | క్షే |

# ఆనందామృత సిద్ధాది యోగములు.

| ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని | |
|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | మృగ | ఆశ్లే | హస్తా | అనూ | ఉషా | శత | ఆనంద యోగము |
| ౫ హస్తా | ౬ శ్ర | ౭ అశ్వి | ౮ అనూ | ౯ పుష్య | ౧౦ రే | ౧౧ రో | అమృతసిద్ధయోగము |
| మూలా | శ్రవ | ఉభా | కృత్తి | పున | పూష | స్వాతీ | అమృతాదియోగము |
| విశా | పూషా | ధని | రేవ | రోహి | పుష్య | ఉఫ | ఉత్పాతయోగము ౯ గడియలవఱకు |
| అనూ | ఉషా | శత | అశ్వి | మృగ | ఆశ్లే | హస్తా | మృత్యుయోగము ౫ గడియలవఱకు |
| జ్యే | అభి | పూభా | భర | ఆర్ద్రా | మఘా | చిత్రా | రంధ్రయోగము ౪ గడియల వఱకు |
| భర | చిత్రా | ఉషా | ధని | ఉఫ | జ్యేష్ఠా | రేవ | గ్రహజన్మయోగము ౯ గడియలవఱకు |

౩-౮-౧౧ ౨-౭-౧౨ ౫-౧౦-౧౫ ౧-౬-౧౧ ౪-౯-౧౪ సిద్ధతిథి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ౧౨ మ | ౧౦ విశా | ౯ ఆర్ద్రా | ౩ మూ | ౨ రో | ౬ శత | ౭ ఆశ్లే | త్రిపుష్కరయోగము |
| ౧౨ | ౧౧ | ౫ | ౩ | ౬ | ౮ | ౯ | దగ్ధయోగము ౬ గడియల వఱకు |
| మఘా | పుష్య | కృత్తి | మృగ | మూ | రోహి | శ్రవ | యమకంటక యోగము ౭ గడియల వఱకు |
| పూఫ | ఆశ్లే | అనూ | ఉఫ | లా | స్వాతీ | ధని | |

## శుభాశుభ తిథివారనక్షత్ర లగ్న నిర్ణయః

| సం | శుభములు | తిథులు | వారములు | నక్షత్రములు | మాసములు | లగ్నములు | శుద్ధులు | యోగ్యకాలము |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | గర్భాధానము | ౨, ౩, ౫, ౭<br>ద్వి, తృ, పం, స<br>౧౦, ౧౩<br>ద, త్ర | ౨, ౪, ౫<br>సో, బు, గు<br>౬<br>శు | ౪, ౫, ౬, ౭, ౮, ౧౨, ౧౩, ౨౪,<br>రో, మృ, ఆ, పున, పుష్య, ఉఫ, హ, చి,<br>౧౪, ౧౬, ౧౭, ౨౧, ౨౨, ౨౩, ౨౪,<br>స్వా, వి, అనూ, ఉషా, శ్ర, ధ, శ,<br>౨౬, ౨౭<br>ఉభా, రే | ౧, ౨, ౩, ౫<br>చై, వై, జ్యే<br>శ్రా ౮, ౯, ౧౧<br>కా, మార్గ, మా<br>౧౨,<br>ఫాల్గు | ౨, ౩, ౪, ౫,<br>వృ, మి, క, సిం<br>౬, ౭, ౯, ౧౧<br>క, తు, ధ, కు<br>౧౨<br>మీ | ౮ | పూర్వరాత్రి |
| 2 | సీమంతము | ౨, ౩, ౫, ౭<br>ద్వి, తృ, పం, స<br>౧౦, ౧౧<br>ద, ఏ<br>౧౩, ౧౫<br>త్ర, పూ | ౧, ౩, ౫<br>ఆ, మం, గు | ౧, ౪, ౫, ౭, ౮, ౧౪, ౧౫, ౧౨, ౧౩,<br>అ, రో, మృ, పున, పు, ఉఫ, హ, చి, స్వా<br>౧౭, ౧౯, ౨౧, ౨౨, ౨౩, ౨౪,<br>అ, మూ. ఉషా, శ్ర, ధ, శ,<br>౨౬, ౨౭<br>ఉభా, రే | ౧, ౨, ౩, ౫,<br>చై, వై, జ్యే,<br>శ్రా ౮, ౯, ౧౧<br>కా, మార్గ, మా<br>౧౨<br>ఫాల్గు | ౧, ౯, ౧౨<br>మే, ధ, మీ | ౯ | పూర్వాహ్ణము |
| 3 | నామకరణము | ౨, ౩, ౫, ౭, ౧౦<br>౧౧, ౧౩, ౧౫ | ౨, ౪, ౫<br>౬ | ౧, ౪, ౭, ౮, ౧౨, ౧౩, ౧౫, ౧౭, ౨౧,<br>౨౨, ౨౩, ౨౪, ౨౬ | ౧, ౨, ౩, ౧౧,<br>౧౨ | ౨, ౪, ౬, ౭, ౯,<br>౧౨ | ౮ | పూర్వాహ్ణము |
| 4 | డోలారోహణము | ౨, ౩, ౫, ౭, ౧౦<br>౧౧, ౧౨, ౧౩,<br>౧౫ | ౨, ౪, ౫<br>౬ | ౧, ౪, ౫, ౭, ౧౨, ౧౩, ౧౪, ౧౫, ౧౭,<br>౧౮, ౧౯, ౨౧, ౨౬, ౨౭ | ౧, ౨, ౩, ౫, ౮,<br>౯, ౧౧, ౧౨ | ౨, ౩, ౪, ౭, ౯,<br>౧౨ | ౮ | దినమందు |
| 5 | అన్నప్రాశనము | ౨, ౩, ౫, ౭, ౧౦<br>౧౩, ౧౫ | ౨, ౪, ౫<br>౬ | ౧, ౪, ౫, ౭, ౮, ౧౨, ౧౩, ౧౪, ౧౫, ౧౭,<br>౨౧, ౨౨, ౨౩, ౨౪, ౨౬, ౨౭ | ౧, ౨, ౩, ౫, ౮,<br>౯, ౧౧, ౧౨ | ౨, ౩, ౪, ౬, ౯,<br>౧౨ | ౧౦ | పూర్వాహ్ణము |
| 6 | కేశఖండనము | ౨, ౩, ౫, ౭, ౧౦ | ౨, ౪, ౫<br>౬ | ౧, ౫, ౭, ౮, ౧౩, ౧౪, ౧౫, ౨౨, ౨౩<br>౨౪, ౨౭ | ౧, ౨, ౩, ౧౧,<br>౧౨ | ౨, ౩, ౪, ౬, ౯,<br>౧౨ | ౧౦ | పూర్వాహ్ణము |
| 7 | కర్ణవేధ | ౨, ౩, ౫, ౬, ౭,<br>౧౦, ౧౧, ౧౨<br>౧౩ | ౨, ౪, ౫<br>౬ | ౧, ౫, ౬, ౭, ౮, ౧౨, ౧౩, ౧౪, ౨౦,<br>౨౨, ౨౩, ౨౬, ౨౭ | ౧, ౨, ౮, ౯,<br>౧౧, ౧౨ | ౨, ౩, ౪, ౯, ౯,<br>౧౨ | ౮ | దినమందు |
| 8 | అక్షరాభ్యాసం | ౨, ౩, ౫, ౬, ౭,<br>౧౦, ౧౧, ౧౨ | ౨, ౪, ౫<br>౬ | ౧, ౭, ౮, ౧౩, ౧౪, ౧౫, ౧౭, ౨౨, ౨౭ | ౧, ౨, ౩, ౧౧,<br>౧౨ | ౧, ౪, ౧౦, ౭ | ౮ | పూర్వాహ్ణము |
| 9 | ఉపనయనం | ౨, ౩, ౫, ౧౦ | ౧, ౨, ౪<br>౫, ౬ | ౧, ౩, ౫, ౭, ౮, ౧౨, ౧౩, ౧౪, ౧౫, ౧౭<br>౨౧, ౨౨, ౨౩, ౨౪, ౨౬, ౨౭ | ౧, ౨, ౩, ౧౧,<br>౧౨ | ౨, ౩, ౪, ౧౨ | ౮ | పూర్వాహ్ణము |
| 10 | వివాహం | ౨, ౩, ౫, ౭, ౧౦<br>౧౧, ౧౩ | ౪, ౫, ౬ | ౪, ౫, ౧౦, ౧౨, ౧౩, ౧౫, ౧౭, ౧౯,<br>౨౧, ౨౬, ౨౭ | ౧, ౨, ౩, ౧౧,<br>౧౨ | ౧ ౨, ౩, ౪, ౫,<br>౬, ౭, ౮, ౯,<br>౧౦, ౧౧ | ౭ | పూర్వాహ్ణము<br>రాత్రి |
| 11 | యాత్ర | ౨, ౩, ౫, ౭, ౧౦<br>౧౧, ౧౩ | ౨, ౪, ౫<br>౬ | ౧, ౫, ౭, ౮, ౧౩, ౧౭, ౨౨, ౨౩, ౨౭ | ౧, ౨, ౩, ౫, ౮,<br>౯, ౧౧, ౧౨ | ౧, ౨, ౪, ౭, ౯,<br>౧౦, ౧౨ | ౦ | దివారాత్రము<br>లు |
| 12 | నూతన వస్త్రధారణం | ౨, ౩, ౫, ౭, ౧౦<br>౧౨, ౧౩, ౧౫ | ౪, ౫, ౮ | ౧, ౪, ౫, ౭, ౧౨, ౧౩, ౧౪, ౧౫, ౧౭,<br>౧౯, ౨౧, ౨౨, ౨౩, ౨౪, ౨౬, ౨౭ | ౧, ౨, ౩, ౫, ౮,<br>౯, ౧౧, ౧౨ | ౧, ౨, ౩, ౪, ౫,<br>౬, ౭, ౮, ౯,<br>౧౦, ౧౧, ౧౨ | ౦ | దివారాత్రము<br>లు |
| 13 | వ్యాపార ప్రారంభం | ౨, ౩, ౫, ౭, ౧౦<br>౧౧, ౧౩ | ౨, ౪, ౫<br>౬ | ౧, ౪, ౫, ౮, ౧౦, ౧౨, ౧౩, ౧౭, ౨౧,<br>౨౨, ౨౪, ౨౬, ౨౭ | ౧, ౨, ౩, ౫, ౮,<br>౯, ౧౧, ౧౨ | ౨, ౪, ౮, ౧౦,<br>౧౧, ౧౨ | ౮ | పూర్వాహ్ణము<br>రాత్రి |
| 14 | గృహప్రవేశం | ౨, ౩, ౫, ౯,<br>౧౦, ౧౧, ౧౫ | ౪, ౫, ౬ | ౪, ౫, ౧౨, ౧౪, ౧౭, ౨౧, ౨౩, ౨౪,<br>౨౬ | ౨, ౩, ౧౧,<br>౧౨ | ౨, ౩, ౬, ౯,<br>౧౧, ౧౨ | ౧౨ | పూర్వాహ్ణము<br>రాత్రి |
| 15 | నిషేకము | ౨, ౩, ౫, ౭,<br>౧౦, ౧౩ | ౨, ౪, ౫<br>౬ | ౧, ౪, ౧౨, ౧౩, ౧౫, ౧౭, ౧౯,<br>౨౧, ౨౨, ౨౪, ౨౬, ౨౭ | ౨, ౩, ౪, ౮, ౯,<br>౧౧, ౧౨ | ౨, ౩, ౫, ౬, ౭,<br>౯, ౧౧, ౧౨ | ౮ | పూర్వరాత్రి |

THE PRINCE OF WALES



వేల్సు యువరాజు గారు

GENERAL SIR ARCHEBOLD MURRAY



జనరలు సర్ ఆర్చిబాల్డు ముర్రే

THE AMBULANCE CAR. M. A. C




అమ్బులెన్సుబండి. ఎమ్. ఏ. సి

# ప్రస్తావన

ఓమ్ నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైకమూర్తయే - నిర్మలాయ ప్రశాన్తాయ దక్షిణామూర్తయే నమః

ప్రపంచమహాచరిత్రమునం దొక వత్సర మస్తంగత మైనది, సృష్ట్యాదినుండియు ౧౯,౫౫,౮౮,౫౦౯ అబ్దములు ముగిసినవి. పింగళసంవత్సరము గతించినది. కాళయుక్తిసంవత్సర మారంభ మైనది. ఆనంద సంవత్సరమునం దారంభ మైన మహాసంగ్రామయుగము భీకరాకృతి దాల్చి లోకక్షయము చేయుచున్నది. భీకర సంగ్రామము మహాసంక్షోభమునకు కారణంబుగ నున్నది. యూరపుఖండమును భస్మీపటలము చేయుచున్న సంగ్రామదావానలము అమెరికా ఆసియా ఖండములకు వ్యాపించుచున్నది. మాతృదేశసీమాంతములందు సంగ్రామానలాంకురములు రగులుట కవకాశము లేర్పడు నను సూచనలు గోచరం బగుచున్నవి. మాతృదేశ సంరక్షణమునకు ప్రబలప్రయత్నములు చేయఁబడు చున్నవి. భారతపుత్రు లాయుధపాణులై కృతనిశ్చయులై మాతృదేశసంరక్షణపరాయణు లగుటకు సమయ మాసన్న మైనది. సకల దేశములందును జీవయాత్ర దుర్భరం బగుచున్నది. ఆహారపదార్థములు వస్త్రములు పరికరములు దుర్లభము లగుచున్నవి. అపార మైన సంపదలు యుద్ధనిర్వాహణమునకు వినియోగపడుచున్నవి. సంసారవ్యయభారము దుర్భర మగుచున్నది. ద్రవ్య మదృశ్యముగ నున్నది. కష్టములు ప్రబలుచున్నవి. అశాంతి పర్యాప్తం బగుచున్నది. భావికాలపరిణామ మగమ్యగోచరంబుగ నున్నది. కాళయుక్తిసంవత్సరమునందు నిగ్రహానుగ్రహసమర్థుఁ డైన సర్వేశ్వరుఁడు రౌద్రరూపమును శమింపఁజేసి సౌమ్యాకృతిని దాల్చి లోకమునకు శాంతిని ప్రసాదించుఁగాత!

కాళయుక్తిసంవత్సరమునకు శుక్రుఁడు రాజు, సేనాధిపతి, అర్ఘాధిపతి, మేఘాధిపతి; ఫలము సస్యసమృద్ధి, సుభిక్షము, క్షేమము, అతివృష్టి. శని మంత్రి; ఫలము ప్రజాపీడ. కుజుఁడు సస్యాధిపతి; ఫలము ఎఱ్ఱనేల పంటలు. సూర్యుఁడు సస్యాధిపతి; ఫలము భయము, రక్తసస్యములు. గురువు రసాధిపతి; ఫలము మధురాన్నములు. చంద్రుఁడు నీరసాధిపతి; ఫలము శుభము, వృద్ధి. సామాన్యఫలము అతివృష్టి, సస్యసమృద్ధి, సుభిక్షము, శాంతి, ఆనందము.

శ్లో॥ అతివృష్టిః కాళయుక్తివత్సరే సుఖినో జనాః,
సస్యవృద్ధిశ్చ సస్యానాం సంపూర్ణానందతా భువి.

లోకమునకు దైవజ్ఞనిర్ణీతఫలము సంప్రాప్త మగుఁగాత!

మహాసంగ్రామమువలన పత్రికానిర్వాహణము దుర్భర మగుచున్నది. యుద్ధారంభానంతరము కాగితముల ధర రైదు రెట్లు పెరిగినది. ఇతరనిర్మితపదార్థములవలె కాగితములు నయితము విదేశనిర్మితములు. విపరీత మైన క్రయము నిచ్చినను విదేశములనుండి కాగితములను పడయుట దుర్లభముగ నున్నది. ముద్రణమున కవశ్య మైన యితరపరికరముల ధరయు విపరీతముగ పెరిగినది.

దైవానుగ్రహమువలన తొమ్మిదవ సంవత్సరాది సంచికను ప్రచురించి ఆంధ్ర ప్రపంచమునకు సమర్పింపఁ జాలినందులకు పత్రికానిర్వాహకులు కృతజ్ఞులు.

కాళయుక్తి సంవత్సరాది సంచిక

గతసంవత్సరమున దేశమునందు స్వరాజ్యాందోళనము ప్రబలినది. హిందూదేశమంత్రి మోంటేగు గారు రాజ్యాంగసంస్కరణముల విషయమై ప్రజాభిప్రాయము నన్వేషించుటకై కార్తికమాసమున భరతఖండమునకు విచ్చేసిరి. వారు రాజప్రతినిధిసమేతులై దేశమునందు సంచారము చేసి విన్నపములను గైకొనిరి. రాయబారములను వినిరి. నాయకులతో సంప్రతించిరి. భరతవర్ష గతసంవత్సరవృత్తాంతమునందు మోంటేగు గారి సమాగమము ప్రముఖత గాంచినది. హిందూదేశమంత్రికి రాజ్యాంగసంస్కరణముల విషయమై అధికారులు జాతీయనాయకులు శాఖానాయకులు సంస్థానాధీశులు తమతమ యభిప్రాయములను విశదము చేసిరి. మోంటేగు గారు భిన్నాభిప్రాయములను సావధానముగ పరిశీలించి మిన్నుఫర్డుప్రభువుతో సంప్రతించి సంస్కరణ విధానమును సిద్ధము చేసిరట్లు వదంతి గలదు. సంస్కరణముల రూపమును నిర్ణయించుట వర్తమానకాలమునం దసాధ్యము. కర్టిసు గారి సంస్కరణవిధానము ప్రసాదింపఁబడు నను వదంతి గలిగినది. మోంటేగు గారు

సుఖముగ స్వస్థలమును చేరిరి. అచిరకాలమున వారు ప్రచురింపఁదలఁచిన రాజ్యాంగవిధానము స్వరాజ్యస్థాపనమునకు మూలబీజముగ నుండుటకు భగవంతుఁడు తోడ్పడుఁగాత!

చెన్నపురి రాష్ట్రాధికారుల నిరంకుశకార్యములు, ముఖ్యముగ బిసెంటమ్మగారి నిర్బంధప్రవాసము, విశేషమైన యశాంతిని గలిగించి స్వరాజ్యాందోళనమున కుత్తేజమును గలిగించినవి. నిరంకుశాధికారమును గర్హించుచు చేసిన సభలు తీర్మానములు ప్రజల దృఢాభిప్రాయములను వ్యక్తము చేసినవి. ప్రజలు విషాదోపహతులై నిర్వీర్యులై స్వధర్మనిర్వహణమును గనలేనపుడు వారియం దాత్మవిశ్వాసము నుదయింపఁజేసి స్వరాజ్యోద్యమము నుద్ధరించిన సర్ సుబ్రహ్మణ్యయ్యరు భారతీయుల సన్మానసంస్మరణములకు పాత్రుఁడు. వర్తమానకాలమునందు జాతీయస్వాతంత్ర్యధర్మము జాతీయసంరక్షణధర్మము స్వయంనియోగధర్మము లోకము నాకర్షించుచున్నవి. ఈ ధర్మములను స్థాపించుటయె మహాసంగ్రామమునకు ఫలము. కాళయుక్తి సంవత్సరాది సంచికయందు ప్రచురించిన వ్యాసములలో ప్రజల చిత్తముల నాకర్షించిన స్వరాజ్యస్థాపనవిషయము ప్రముఖము. సంచికయందు ముప్పది వ్యాసములు కొన్ని పద్యములు ప్రచురితములు. అందు 10 వ్యాసములు స్వపరిపాలనాది జాతీయ సమస్యలకు సంబంధించినవి గలవు. వ్యాసములందలి విశాలభావములు ప్రజాశయంబులకు ఆంధ్ర ప్రపంచప్రబోధమును విశదము చేయుచున్నవి. సంచికయందు 150 చిత్రపటములు ప్రచురితములు. చిత్రపటములందు ఆంధ్రుల రాయబారము భారతమహిళల రాయబారము స్వరాజ్యప్రతినిధుల రాయబారము రాజ్యాంగసంస్కరణ విచారణోపసంఘము (రాజప్రతినిధి మాంటెగు భూపేంద్రనాథ బాసు చార్లెసు రాబర్టుసు చెన్నపురి గవర్నరు మొదలగువారు) బ్రాహ్మణేతర నాయకులు సామ్రాజ్యమంత్రులు వైశ్యనాయకులు మున్నగు విషయములకు సంబంధించినవి గలవు. లోకమాన్య తిలకు మహాత్మ గాంధి సర్ విశ్వేశ్వరయ్య రామానుజాచార్యుల చిత్రపటములు ముద్రితములు.

ముఖపటము

భారతమాతృస్వరూపము ముఖపటముగ ప్రచురింపఁబడినది. చిత్రపటమునం దొక మూల బ్రిటీషు పతాకమును మరొక మూల స్వరాజ్య పతాకమును గలవు. ఇరు పార్శ్వములందు హిందూ బౌద్ధ దేవాలయముల పటములును మహమ్మదీయ క్రైస్తవ ప్రార్థనామందిరముల పటములును రాజదంపతుల పటములును గలవు. మధ్యభాగమునందు కమలాసన శోభామూర్తి చతుర్భుజ భారతమాత విరాజిలుచున్నది. భారతమాత తన హస్తములందు బ్రిటీషుపతాకసహితమైన స్వరాజ్యపతాకమును త్రిశూలచక్రములను అక్షమాలను గలిగియున్నది. ఈ ముద్రలు మాతృదేశబలమునకు సామ్రాజ్యరక్షణమునకు భారతీయవిజ్ఞానమునకు చిహ్నములు. భరతఖండమునందు ప్రపంచవ్యాప్తము లైన ముఖ్యమతములకు జాతులకు సంయోగము సాహచర్యము గలిగినది. భారతమాతకు హిందువులు బౌద్ధులు మహమ్మదీయులు క్రైస్తవులు ఆత్మగర్భసంజాతులైన భారతీయులు. జాతి మత విలక్షితంబైన దేశభక్తిని సోదరప్రేమను అక్షమాలాకృతిని భరతమాత బోధించుచున్నది. ఆత్మసంరక్షణయోగ్యము లైన చక్రమును శూలమును ఉభయహస్తములందును ధరించిన భరతమాత సుబలత్వమును ప్రకటించుచున్నది. మహాశోజ్వలంబును మహాబలయుతంబును దివ్యంబును నైన మాతృస్వరూపపు సంకీర్తనము సంభావనము సందర్శనము ఫలితమైన దేశారాధనమునకు సాధనములు. పాలకపాలితులు స్వప్రయోజన విముఖులై మాతృదేశారాధనపరాయణు లగుటకు హిందూదేశమంత్రి మాంటెగు గా రచిరకాలమున ప్రచురింపనున్న రాజ్యాంగసంస్కరణ విధానము విశాలమై దూరాధిరూఢమై స్వరాజ్యస్థాపనమున కనుకూలమై భరతవర్షాభ్యుదయమునకును బ్రిటీషుసామ్రాజ్యబలమునకును లోకకల్యాణమునకును మూలబీజముగ పరిణమించుఁగాత!

అమూల్యమైన వ్యాసములను వ్రాసియు చిత్రపటములను పంపియు నితర విధముల సహాయమును చేసియు కాళయుక్తి సంవత్సరాది సంచికను ప్రచురించుటకు తోడ్పడిన మహాజనుల కనేకవందనంబులు.

కాళయుక్తి సంవత్సరమునం దాంధ్రులు సంకల్పసిద్ధులై కామితార్థములను పడయుదురుగాత! సర్వేశ్వరుఁడు సమస్తలోకములకు సుఖమును శాంతిని ప్రసాదించుఁగాత!

# లోకవృత్తాంతము

సహయజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః - అనేన ప్రసవిష్యధ్వ మేష వో స్త్విష్టకామధుక్.

విశ్వ మనంతము. ఆద్యంతరహితము. అనంతరూపపరిశోభితము. విచిత్రరూపపరికల్పితము. ఆత్మాధిష్ఠితము. ఆత్మభాసితము. ఆత్మస్థము. విశ్వావృతంబు లైన భావములు రూపములు ప్రజావికాసమునకై నిర్మింపఁబడినవి. విశ్వవికాసమునందు యుగములు మహాయుగములు మన్వంతరములు గలిగినవి. దేశములు ఖండములు గోళములు గ్రహములు తారాగణములు నశించినవి. జీవజాలములు విలయము నొందినవి. విలయపరంపరలు పునర్నిర్మాణంబునకు సాధనంబు లైనవి. చరాచరరూపంబు లైన జలచరములను భూచరములను ప్రజావికాసమునకై సృష్టి సృజించి తత్కాలమున ప్రజావికాసంబును నిర్దేశించెను. ప్రజాప్రసవప్రయత్నములందు జీవజాలంబులకు సంరంభము సాధారణసాధనంబుగ వినియోగించుచున్నది. చరముల పోషణమున కచరము లాధారములు. జంతువుల పోషణమునకు ఉద్భిజ్జము లాధారములు. ఉద్భిజ్జములు జంతువులు మనుజుల దేహపోషణమున కాధారములు. మనుజులు పితృలోకపోషణమునకును దివ్యపురుషుల పోషణమునకును ఆధారభూతులు. ప్రజాప్రసవమునకును ప్రజోపభోగమునకును వ్యాప్తం బైన లయవృత్తంబునం దాద్యంతనిర్ణయము దుర్లభము. లయమునందు సృష్టియు సృష్టియందు లయము ప్రకృతిసిద్ధములు. ప్రజావికాసార్థము సంప్రాప్త మైన సంరంభపరిణామము దుఃఖమయము, శోకాన్వితము. ప్రపంచపరిణామము దుఃఖశోకమయం బై సమ్మోహమును గలిగించుచున్నది. సామ్రాజ్యములు నశించినవి, నశించుచున్నవి. జాతు లంతరించినవి, అంతరించుచున్నవి. ప్రజలు దుఃఖపరంపరల ననుభవించిరి, అనుభవించుచున్నారు. దుఃఖశోకసాగరతరణము దుస్తరముగ నున్నది.

### యజ్ఞారాధనము

అవతారపురుషు లీ పరమరహస్యమును లోకసంగ్రహార్థము వెల్లడి చేయుటకై తమ జీవితంబులను వినియోగించిరి. బుద్ధదేవుఁడు ప్రపంచమును తరింపఁజేయుటకై సంపదలను రాజ్యమును సంసారమును పరిత్యజించెను. ఏసుక్రీస్తు మానవుల ముక్తికై ప్రాణములను సమర్పించెను. శ్రీకృష్ణుఁ డాత్మసిద్ధికి యోగమార్గమును జూపెను. సకలవేదములు సకలశాస్త్రములు సకలకర్మములు ప్రజల జీవితసాఫల్యమునకు సాధనంబులుగ నున్నవి. ఈ పరమార్థగ్రహణము సుఖమునకును విపరీతగ్రహణము దుఃఖమునకును మూలములు. ప్రజాప్రసవమునకై సర్వేశ్వరుఁడు మహాయజ్ఞమును ప్రసాదించెను. ఆ యజ్ఞమును ప్రజలు జాతులు తమ సంస్కారమునకును దేశమునకును కాలమునకును తగిన రీతి ననుష్ఠించుచు సుఖదుఃఖముల ననుభవించుచుందురు. యజ్ఞరూపము లనంతములు. కర్మయజ్ఞము తపోయజ్ఞము యోగయజ్ఞము స్వాధ్యాయయజ్ఞము బ్రహ్మయజ్ఞము యజ్ఞమునకు వివిధాంగములు. యాజకులు యజ్ఞరూపమునకు సదృశ మైన ప్రతిఫలమును పడయుదురు. స్వార్థపర మైన యజ్ఞము పాపమునకును దుఃఖమునకును బంధనమునకును, పరార్థపర మైన యజ్ఞము పుణ్యమునకును సుఖమునకును మోక్షమునకును హేతుభూతములు. యజ్ఞవిదులు యజ్ఞశిష్టామృతభుజులు సుఖమును శాంతిని బ్రహ్మత్వమును పడయుదురు. యజ్ఞవిముఖులు యజ్ఞఫలభుక్కులు దుఃఖమును నాశనమును పొందుదురు. వివిధము లైన యజ్ఞములకు కర్మములు మూలబీజములు. యజ్ఞములందు ద్రవ్యయజ్ఞము లధమములు. జ్ఞానయజ్ఞములు శ్రేష్ఠములు. స్వార్థపర మైన ద్రవ్యయజ్ఞపు ఫలము వర్తమానమహా

దారుణసంగ్రామమునందు సందర్శనీయము. ద్రవ్యయజ్ఞజనకమైన భోగఫలము దారుణము, విపరీతము. త్యాగఫలము సౌఖ్యము, పరమార్థము. యజ్ఞాచరణమునకు చతుర్వింశతితత్త్వరూపంబైన దేహము క్షేత్రము. మనోబుద్ధిచతుర్వింశతితత్త్వంబులు సాధనంబులు. తత్త్వసిద్ధి మహాఫలము.

యజ్ఞభావము విశాలము. విశ్వము యజ్ఞరూపభావంబునందు ప్రతిక్షిప్తము. దేహబలవికాసమునకు కర్మయజ్ఞములును ద్రవ్యయజ్ఞములును మనోబుద్ధివికాసమునకు దానాధ్యయనతపోయజ్ఞములును ఆత్మోపలబ్ధికి ఆత్మయజ్ఞమును పరికల్పితములు.

"త్వం బ్రహ్మా త్వం యజ్ఞ స్త్వం లోకః"
"యేషై శేష యజ్ఞా స్తేషాం సర్వేషాం యజ్ఞ ఇత్యేకతా"
—బృహదారణ్యకము.

సకలయజ్ఞములకును ఫలము ఆత్మవిజ్ఞానము. ఆత్మజ్ఞానోపలబ్ధికి ప్రతిబంధకములైన యజ్ఞములు భయావహంబులు. ఆత్మజ్ఞానోపలబ్ధికి సాధనంబులైన యజ్ఞములు ముదావహంబులు.

### ప్రాచ్యవిజ్ఞానము

ప్రాచ్యప్రపంచమునందు ముఖ్యముగ భరతఖండమున సకలయజ్ఞములు ఆత్మసామ్రాజ్యప్రాప్తికి నియమితములు. లోకవ్యాప్తములైన మహామతములు ప్రాచ్యదేశసంజాతములు. ప్రాచీనతమంబైన హిందూమతమునకు భరతఖండము జన్మస్థానము. ఏకేశ్వరోపాసన విరాజితంబైన యూదమతమునకును త్యాగప్రదంబైన క్రైస్తవమతమునకును ఆసియాఖండము జన్మస్థానము. అహింసాధర్మమును ప్రతిపాదించిన జైనబౌద్ధమతములకు ఆర్యావర్తము జన్మస్థానము. మతభ్రాతృత్వమును ప్రతిపాదించిన మహమ్మదీయమతమున కాసియాఖండము వాసస్థలము. బ్రహ్మజ్ఞానప్రదంబులును జీవేశ్వరతత్త్వప్రతిపాదకంబులునైన ద్వైతాద్వైతసిద్ధాంతంబులకు భరతఖండము నిలయము. తత్త్వపరిశోధనమునందు భారతీయమహర్షు లగ్రగణ్యులు. పాశ్చాత్యతత్త్వవేత్తలు కాంటు స్కోపాణ్ హావర్ టాల్‌స్టాయి ప్రభృతులు ఉపనిషదమృతంబు నాస్వాదించి జీవితపరమార్థమును కనుఁగొనిరి. ఆధ్యాత్మికతత్త్వవిచారణమునందు భారతీయతత్త్వజ్ఞులను మించిన తత్త్వజ్ఞులు లోకమునందుఁ గానఁబడరు. పాశ్చాత్యతత్త్వశాస్త్రమునకు మూలాధారమైన యవనతత్త్వశాస్త్రమునకు భారతీయతత్త్వశాస్త్రమె మూలాధారము. ఆర్యులకు సకలసంస్థారములును ఆత్మాధిష్ఠితములు. అన్నము బ్రహ్మము. ఉదకము బ్రహ్మము. కర్మము బ్రహ్మము. విశ్వమంతయు బ్రహ్మమయము. విశ్వమునందు బ్రహ్మాతిరిక్తంబైన పదార్థము అదృశ్యము. పరమేశ్వరుఁడు సర్వాంతర్యామి. పాశ్చాత్యమతబోధకులు బోధించెడి రీతిని సర్వేశ్వరుఁడు స్వర్గవాసి మాత్రమె గాఁడు. బ్రహ్మాధిష్ఠితంబైన విశ్వరూపమునందు బ్రహ్మత్వజ్ఞానము జీవితపరమార్థము. బ్రహ్మము నిత్యము, సత్యము. విశ్వము అనిత్యము, అసత్యము. అస్తిభాతులందు అస్తి నిత్యము భాతి అనిత్యము. ఆనందము జ్ఞానవైరాగ్యములందు సాధ్యము గాని తృష్ణోపభోగములందు సాధ్యము గాదు. ప్రాచ్యులకు జీవితపరమార్థము వైరాగ్యము. పాశ్చాత్యులకు జీవితపరమార్థము తృష్ణావిలసనము. ప్రజలకు సుఖము శాంతి ఇంద్రియార్థములవైరాగ్యమునందు సాధ్యము గాని తృష్ణాపూరణమునందు సాధ్యము గాదు. పాశ్చాత్యుల యాదర్శము ఆధిభౌతికము. పాశ్చాత్యుల సర్వారంభములకును భౌతికవికాసము ఫలము. విజ్ఞాన మాధిభౌతికము. జీవిత మాధిభౌతికము. దివ్యాంబరములు సుందరమందిరములు మృష్టాన్నములు మాంసాశనము మద్యపానము భౌతికబలవికాసమునకు తోడ్పడినవి. స్వోత్కర్ష దురభిమానము అహంకారము మమకారము పాశ్చాత్యరాజ్యధర్మమునకును జాతీయసిద్ధాంతమునకును వర్తమానదారుణసంగ్రామమునకును మూలబీజములు.

ప్రాచ్యుల యాదర్శము ఆధ్యాత్మికము. ప్రాచ్యుల సర్వారంభములకు ఫల మాధ్యాత్మికము. విజ్ఞాన మాధ్యాత్మికము. జీవిత మాధ్యాత్మికము. కాషాయాంబరములు పర్ణశాలలు ఫలాహారము శాకాన్నము ఆత్మజ్ఞాన

వికాసమున కనుకూలించినవి. నిరహంకారము త్యాగము దైవప్రత్యయము ప్రాచ్యుల సుఖశాంతులకు మూలములు. వర్తమానదారుణసంగ్రామము తృష్ణావర్ధితం బైన విపరీతపరిణామమునకు నిదర్శనము. భర్తృహరి తృష్ణావర్ణనము వ్యక్తులకువలె జాతులకును అన్వయించుచున్నది.

వ. నిధి యను శంక భూతలము నిచ్చలుఁ ద్రవ్వితి, నావచే మహో
దధిఁ దరియించితిన్, శిఖరి ధాతువు లూఁదితి, రాజుఁ గొల్చితిన్,
వ్యథ గొని ఘోరమంత్రజప వర్ధి నొనర్చితిఁ, జిత్తశాంతి నే
విధమునఁ బొందనైతిఁగద; నే మద మందఁ గదే దురాశరో!

—భర్తృహరి.

పాశ్చాత్యనాగరికతకు తృష్ణాసంజననము బీజము. తృష్ణావ్యాపనము ప్రయోజనము. తృష్ణోపభోగము ఫలము. పాశ్చాత్యమతబోధకులు పాశ్చాత్యవర్తకులు పాశ్చాత్యాధికారులు పాశ్చాత్యసైన్యములు తృష్ణామహాతరంగములను దిగంతములకు వ్యాపింపఁజేసిరి. తృష్ణాతరంగంబు లశాంతికిని అశాంతి లోకవ్యాప్తం బైన మహాసంరంభంబునకును కారణంబులు. పాశ్చాత్యరాజ్యముల మహాతృష్ణకు ఆ రాజ్యముల లోకవ్యాప్తంబు లైన సామ్రాజ్యములు పరిశ్రమలు వాణిజ్యము వ్యాపారము నిదర్శనములు.

బ్రిటీషు ద్వీపముల విస్తీర్ణము 1,21,391 చదరపు మైళ్లు. జనసంఖ్య 4,53, 69,599. బ్రిటిషు సామ్రాజ్య విస్తీర్ణము 1,27,47, 324. జనసంఖ్య 43,35,14,000. ఫ్రెంచి దేశవిస్తీర్ణము 2,07,054 మైళ్లు. జనసంఖ్య 3,96,01,509. సామ్రాజ్యవిస్తీర్ణము 38,00,000 మైళ్లు. జనసంఖ్య 4,40,00,000. జర్మను దేశవిస్తీర్ణము 2,08,780 మైళ్లు. జనసంఖ్య 6,49,03,423. జర్మను సామ్రాజ్యవిస్తీర్ణము 20,37,80 మైళ్లు. జనసంఖ్య 6,50,00,000. అమెరికా సంయుక్తరాష్ట్ర విస్తీర్ణము 29,73,890. జనసంఖ్య 9,19,72,266. చీనాసామ్రాజ్య విస్తీర్ణము 42,77,170. జనసంఖ్య 43,35,53,030. జపాను రాజ్యవిస్తీర్ణము 2,60,919. జనసంఖ్య 6,86,06,654. రుష్యా సామ్రాజ్య విస్తీర్ణము 87,45,657. జనసంఖ్య 16,48,28,800. భారతసామ్రాజ్యవిస్తీర్ణము 17,89,156. జనసంఖ్య 31,26,32,537. తురుష్క సామ్రాజ్య విస్తీర్ణము 7,58,960. జనసంఖ్య 2,45,77,300. ఆస్ట్రియా సామ్రాజ్యవిస్తీర్ణము 2,67,101. జనసంఖ్య 5,10,59,810.

యూరపుఖండవాసులు ఆసియా ఆఫ్రికా అమెరికా ఆస్ట్రేలియా ఖండములందును ఆస్ట్రేలియా ద్వీపములందును గల భూభాగము నంతటి నాక్రమించుకొనిరి. లోకమునందలి నిర్జనప్రదేశము లన్నియు పాశ్చాత్యుల యాక్రమణమునందు చేరినవి. పాశ్చాత్యుల భూతృష్ణకు వారి యధీనమునం దున్న పరదేశములు నిదర్శనములు. స్వల్పరాజ్యము లైన బెల్జియము హాలండు ఇటలీ దేశములకు నయితము విస్తీర్ణము లైన వలస రాజ్యములు గలవు. ఏకరాజ్యాధిపత్యము బహురాజ్యాధిపత్యమునకును బహురాజ్యాధిపత్యము ఖండాధిపత్యమునకును ఖండాధిపత్యము బహుఖండాధిపత్యమునకును బహుఖండాధిపత్యము ప్రపంచాధిపత్యమునకును ప్రపంచాధిపత్యము విశ్వాధిపత్యమునకును ప్రేరకములు. విశ్వాధిపత్యము లభించినను రాజులకు జాతులకు తృష్ణాపూరణ మసంభవము.

"మాన్ధాతా చ మహీపతిః కృతయుగాలంకారభూతో గతః,
సేతు ర్యేన మహోదధౌ విరచితః క్వాసౌ దశాస్యాన్తకః ?
అన్యే చాపి యుధిష్ఠిరప్రభృతయో యాతా దివం భూపతే !
నైకే నాపి సమం గతా వసుమతీ, నూనం త్వయా యాస్యతి."

—భోజచరిత్ర.

పృథివ్యాధిపత్యమునకు ప్రారంభ మైన సంరంభము జలాధిపత్యమునకు వ్యాపించినది. జలాధిపత్యమునకై వ్యాప్తం బైన మహాసంరంభము వ్యోమాధిపత్యమునందు పరిణమింపఁగలదు. సకలలోకభూతాధిపత్యము అస్థిరము. స్థిర మైనను దుర్లభము. సులభ మైనను దురారాధ్యము. సమారాధ్య మైనను గహనము. లోకచరిత్రము సామ్రాజ్యముల యనిత్యతను విశదము చేయుచున్నది. అశోకచక్రవర్తి కళింగరాజ్య విజయానంతరము పశ్చాత్తప్తహృదయుఁడై లిఖించిన ధర్మశిలా

శాసనము రాజ్యకాంక్షులకు నిరంతరము సంస్మరణయోగ్యము.

కాళింగుల వినాశన మశోకచక్రవర్తికి మహాసంతాపమును కలిగించిన రీతిని వర్తమానమహాసంగ్రామవిలయము యూరపురాజ్యాధికారులకు ముఖ్యముగ జర్మను చక్రవర్తికి మహాసంతాపమును కలిగించుఁగాత! ఆ మహాసంతాపము స్వయంనియోగధర్మస్థాపనమునకును స్థిరశాంతిస్థాపనమునకును సాధనము కాఁగలదు.

### జాతీయాహంకారము

పదునెనిమిదవ శతాబ్ది యంతమువఱకును లోకమునందు రాజ్యలోభము రాజుల నావరించినది. అలెగ్జాండరు నెపోలియను మహామహులు, లోకసామ్రాజ్యములను స్థాపించుటకు సమకట్టి విఫలమనోరథు లైరి. పదునాల్గవ లూయి యూరపుఖండాధిపత్యమును వహింప సమకట్టి పరాభవము నందెను. వర్తమానకాలమునందు లోకసామ్రాజ్యసంపాదనమునకై సమకట్టిన జర్మను చక్రవర్తియు విఫలమనోరథుం డగుట సహజము. పూర్వము రాజుల నావరించిన రాజ్యలోభము పందొమ్మిదవ శతాబ్దినుండియు జాతుల నావరించినది. పాశ్చాత్యజాతులందు ప్రవర్ధమానం బైన భోగాభిలాష జాతీయావయవనిర్మాణమునకును జాతీయబలమునకును కారణము. యూరపు రాజ్యములందు ప్రవర్ధమానం బైన భాగ్యాభిలాషయు భోగాభిలాషయు అధికారాభిలాషయు పరపీడనమునకును ఆత్మవినాశనమునకును హేతుభూతములు. ధనార్జనమునందును రాజ్యసంపాదనమునందును సుఖారాధనమునందును యూరపు రాజ్యములలో మితిమీఱిన స్పర్ధ యేర్పడి నిశ్చలమైన జాత్యభిమానము దృఢముగ స్థాపింపఁబడినది. యూరపు ప్రజలు ఏకమతావలంబకులు; సమానధర్మసాంప్రదాయాచారబద్ధులు. కాని, జాతీయవైరమును జాతీయమాత్సర్యమును ప్రబలములు. స్లావులు ట్యూటనులు కెల్టులు సాక్సనులు క్రైస్తవమతావలంబకు లయ్యును స్వలాభాపేక్షాపరులై వైరబద్ధులై మత్సరగ్రస్తులై పరస్పరవినాశనమునకు పూనుకొనిరి. స్వార్థపరత్వమునకై విలసితం బైన పాశ్చాత్యజాతీయధర్మము పరపీడనమునకును లోకవిలయమునకును మూల మైనది. పాశ్చాత్య జాతీయనిర్మాణము ఆధిభౌతికము, దయాదాక్షిణ్యరహితము. జర్మనులు ఉద్ధత్యముగ లోకవినాశమునకును ఆత్మసంహారమునకును ఉపక్రమించిరి. లక్షల కొలఁది యోధులు జాత్యభిమానప్రేరితు లయి మాతృదేశమునకై ప్రాణసమర్పణంబును చేసెడి విధము విస్మయమును కలిగించుచున్నది. జాత్యభిమానము మితిమీఱినపుడు మహావేశపూరితం బై వివేకరహితం బై ప్రయోజనశూన్యం బై యనర్థపరంపరలకు కారణం బగుచున్నది. జర్మనుల స్వదేశాభిమానము స్తుత్యం బైనను తదుపయోగము గర్హ్యముగ నున్నది. శ్రీకృష్ణుని యాసురపురుషలక్షణాభివర్ణనము జర్మనుల జాత్యభిమానమును తెలుపుచున్నది.

ఇదమద్య మయాలబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్,
ఇదమస్తీ దమపిమే భవిష్యతి పునర్ధనమ్.
అసౌ మయా హతశ్శత్రు ర్హనిష్యే చాపరా నపి,
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ.
ఆఢ్యోఽభిజనవా నస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః.

*   *   *   *

ఆత్మసంభావితా స్తబ్ధా ధనమాన మదాన్వితాః
యజంతే నామయజ్ఞైస్తే దంభేనాఽవిధిపూర్వకమ్.

అహంకారపూరితులు మిన్ను మన్ను గానరు. అభిమానోపహతచేతస్కులై స్వోత్కర్షపరాయణులై చిత్తవిభ్రాంతులై విప్లవకారు లగుచున్నారు. స్వార్థపర మైన కర్మములు జ్ఞానము ద్రవ్యయజ్ఞములై పరపీడనమునకును ఆత్మహానికిని కారణంబు లగుచున్నవి. గాఢ[illegible] జాతీయాభిమానము స్వలాభపోషణమునకై వినియో[illegible] చుటకు యూరపు రాజ్యములు రాజ్యదేవతలను [illegible]క్షించినవి. యూరపుఖండమునందు స్థాపిత మైన నూతనరాజ్యధర్మముయొక్క ఫలము భావికాలమునందు విశదము కాఁగలదు.

### ప్రజారాజ్యసమాశ్రయము

ప్రజలు రాజ్యము అన్యోన్యసమాశ్రయపోషణముల వలన ప్రవర్ధితములు. వర్తమానయుగమునందు ప్రజలకును రాజ్యములకును గల యవినాభావసంబంధము స్థిరపడినది. ప్రజలే రాజ్యము. రాజ్యమే ప్రజలు. రాజ్యము ప్రజాధీనము. ప్రజలు రాజ్యాధీనులు. రాజ్యము ప్రజాస్వామ్యత్వాధీనము. ప్రజలు రాజ్యాధికారాధీనులు. శాసనములు ప్రజానిర్మితములు. అధికారులు ప్రజానియుక్తులు. రాజ్యము ప్రజాయత్తము, ప్రజారక్షితము, ప్రజాపోషితము. రాజ్యధర్మభావము జర్మను సామ్రాజ్యతంత్రమునందు సుప్రతిష్ఠితము, సుప్రకాశితము. ప్రజలు నిర్బంధసైన్యశిక్షను పడసి సర్వమును రాజ్యదేవతకు సమర్పింప సంసిద్ధులై యున్నారు. యుద్ధరంగమునందు జర్మను ఫ్రెంచి యోధులు చూపుచున్న త్యాగశీలము ఆశ్చర్యజనకము. విజయకాంక్షులై నిర్భయముగ లక్షల కొలది యోధులు శతఘ్నులకు బలి యగుచున్నారు. యోధుల త్యాగమునకు వారి శిక్షణము మాతృదేశాభిమానము జాతీయాభిమానము కారణములు. ఈ సుగుణంబులు లోకహితార్థము వినియోగపడునపుడు సుఖము స్వార్థసిద్ధికై వినియోగపడునపుడు దుఃఖము సంప్రాప్తంబగుచున్నవి. బ్రిటీషుసామ్రాజ్యాధికారులును ప్రెసిడెంటు విల్సను గారును ఈ సుగుణములు లోకహితార్థమై వినియోగపడుటకు ప్రయత్నింపవలయు నని ప్రకటించుచున్నారు. వారి ప్రయత్నములు సఫలములైనయెడల యజ్ఞఫలము పవిత్రవంతమై శ్రీకృష్ణభగవానుండు చేసిన గీతోపదేశమునకు సదృశంబుగ నుండఁగలదు.

భోక్తారం యజ్ఞతపసాం సర్వదేవమహేశ్వరం
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి.

ప్రాచ్యుల భారము నెల్ల తాము వహించుచున్నా మని పాశ్చాత్యరాజనీతిజ్ఞులు ప్రకటించుచున్నారు. ప్రాచ్యరాజ్యాక్రమణమును పాశ్చాత్యులు స్వప్రయోజనార్థమై చేసిరి గాని ప్రాచ్యుల తరణార్థమై చేయలే దని ప్రపంచచరిత్ర చాటుచున్నది. ప్రాచీప్రతీచీసంసర్గమునందు ప్రాచ్యులకు తరణోపాయ మేర్పడుట కాక తాన్యాయము. రాజ్యాంగములందు ధర్మచింతన మసంభవము. సకలము న్యాయసూత్రబద్ధమై ప్రవర్తించుచుండును. జర్మనుల రాజ్యవ్యాపనాకాంక్ష స్వయంతీర్ణమున కేర్పడినది గాని పరుల సంతరణమున కేర్పడ లేదు. ఆత్మసంరక్షణము ఆత్మోపభోగము ఆత్మవిజృంభణము రాజ్యవ్యాపనమునకు మూలాంకురములు. జర్మను లీ కార్యమును సాధించుటకై ఏఁబదేండ్లనుండి ప్రయత్నము చేయుచుండిరి. జర్మనుల దురుద్దేశము నింద్యంబైనను వారి పూనిక దూరదృష్టి ప్రశంసనీయములు.

### స్వయంతరణము

లోకమునం దెవరి తరణోపాయమునకు వారు కర్తలు. తరణోపాయమున కవసరమైన సకలసాధనంబులను కలిగియుండుటకు జాతులు ప్రయత్నించుట ధర్మముగ నున్నది. ఆత్మసంరక్షణమున కవశ్యమైన సాధనసంపద లేనపుడు జాతియవిజృంభణము జాతీయవికాసము జాతీయసంరక్షణము దుర్ఘటంబగును. పరపోషణము పరాధీనత స్వకీయవిజృంభణమునకు వికాసమునకు ప్రతికూలములు. ఈ తత్త్వము ననుసరించియె స్వయంనియోగధర్మము జాతీయస్థితికి మూలబీజ మని పాశ్చాత్యరాజనీతిజ్ఞు లందఱును అంగీకరించుచున్నారు. రుష్యా పరివర్తనమునం దీ ధర్మ మంగీకృతము. జర్మనులు రుష్యాసంధియం దీ ధర్మము నంగీకరించిరి. స్థిరశాంతికి స్వయంనియోగధర్మము మూల మని ప్రెసిడెంటు విల్సను లాయిడు జార్జి గార్లు ప్రకటించిరి. భారతజాతియొక్క వికాసవిజృంభణములకు స్వయంనియోగధర్మావలంబన మవశ్య మని దేశకాలపరిస్థితులను పరిశీలించినవారికి విశద మగుచున్నది. బ్రిటీషుసామ్రాజ్యమునందు వర్తమానభారతజాతీయస్థితి దుర్భరము, దుస్తరము. దేశస్థితికిని ప్రజాబాహుళ్యమునకును తగిన వికాసము విజృంభణము బలము కలుగలేదు. వర్తమానపరిస్థితులందు కలుగుట దుర్లభము. బ్రిటీషు సామ్రాజ్యమునకును సామ్రాజ్యాంతర్గతంబైన భరతఖండమునకును శుభస్థితి కలుగుటకు బ్రిటీషు ప్రజలకీ సత్యము హృద్గతంబు గావలయును. ఏతత్ప్రయోజనము కలుగుటకై భరతఖండమునందు రాజ్యాంగాందోళనము పర్యాప్తంబగుచున్నది.

## సామ్రాజ్యభాగములయొక్క విస్తీర్ణమును జనసంఖ్యయు వ్యాపారమును

| దేశము | విస్తీర్ణము | జనసంఖ్య | దేశము | విస్తీర్ణము | జనసంఖ్య |
|---|---|---|---|---|---|
| బ్రిటీషు ద్వీపములు | 1,21,377 | 4,64,07,087 | మధ్యమ అమెరికా | 8,600 | 50,000 |
| యూరపు | 1,21,512 | 458,78,500 | వెస్టు ఇండీసు | 12,300 | 1,730,000 |
| ఆసియా | 2,187,550 | 323,158,000 | దక్షిణ అమెరికా | 97,800 | 3,1 ,000 |
| ఆఫ్రికా | 3,618,245 | 49,58,150 | ఆస్ట్రేలేషియా | 3,214,685 | 6,210,000 |
| ఉత్తర అమెరికా | 3,893,020 | 7,458,000 | మొత్తము | 1,31,5 ,685 | 43,42,86,650 |

| ఖండములలోని రాష్ట్రములు | ఎట్లు లభించినది | వత్సరము | చదరపు మైళ్లు | జనసంఖ్య | ఎగుమతులు | దిగుమతులు |
|---|---|---|---|---|---|---|
| యూరపు | | | | | పౌ. | పౌ. |
| సంయుక్తరాష్ట్రము | మాతృదేశము ...... | — | 121,030 | 45,500,000 | 744,650,000 | 599,000000 |
| మాను ద్వీపము | „ ...... | — | 230 | 50,000 | — | — |
| ఛానలు ద్వీపములు | „ ...... | — | 70 | 97,000 | — | — |
| మాల్టా గోజా | సమాధానమువిూఁదనిచ్చివేయఁబడి | 1814 | 120 | 211,000 | 2,620,000 | 980,000 |
| జిబ్రాల్టరు | „ „ [నది | 1713 | 2 | 20,000 | 8 6,000 | 24,000 |
| ఆసియా | | | | | | |
| హిందూదేశము | జయింపఁబడినది ...... | 1757-1897 | 1,90,000 | 315,000,000 | 152 000,000 | 171,000,000 |
| సింహళము | సమాధానమువిూఁదనిచ్చివేయఁబడి | 1801 | 2,550 | 4,100,0 0 | 12,500,000 | 13,500,000 |
| స్ట్రెయిట్ సెట్టిల్మెంటులు | „ „ [నది | 1785-1909 | 1,660 | 700,000 | 45,000,000 | 38,000,000 |
| సంయుక్తమలయారాష్ట్రములు | „ „ ...... | 1874-1888 | 27,700 | 1,000,000 | 12,000,000 | 22,000,000 |
| ఇతరమలయారాష్ట్రములు | „ „ ...... | 1909 | 14,200 | 800,000 | — | — |
| హాంగ్ కాంగు | „ „ ...... | 1842-1906 | 390 | 440,000 | — | — |
| వీహైవాయి | „ „ ...... | 1898 | 300 | 160,000 | — | — |
| ఉత్తరబోర్నియో | ఇచ్చివేయఁబడినది ...... | 1877 | 31,100 | 204,00 | 1,100,000 | 1,300,000 |
| బ్రూనెయి | సమాధానమువిూఁదనిచ్చివేయఁబడి | 1888 | 4,000 | 30,000 | — | — |
| సరవాక్ | రక్షణార్థము చేరనది [నది | 1888 | 50,000 | 650,000 | 500,000 | 1,000,000 |
| సైప్రసు | సమాధానమువిూఁదనిచ్చివేయఁబడి 19 4-లో కలుపుకొనబడినది [నది | 1878 | 3,600 | 275,000 | 700,000 | 790,000 |
| ఆఫ్రికా | | | | | | |
| కేపురాష్ట్రము | సమాధానమువిూఁదనిచ్చివేయఁబడి | 1814 | 277,000 | | | |
| నెటాలు | కలుపుకొనఁబడినది [నది | 1843 | 35,400 | } 5,100,000 | | |
| ట్రాన్సువాలు | „ „ ...... | 1900 | 110,400 | | | |
| ఆరంజిఫ్రీ స్టేటు | „ „ ...... | 1900 | 50,400 | | | |
| బసుటోలాండు | „ „ ...... | — | 10,300 | 350,000 | 39,000,000 | 68,000,000 |
| బెచ్వానాలాండు | „ „ ...... | 1895 | 275,000 | 126,000 | | |
| రోడీసియ | „ „ ...... | 1889 | 450,000 | 1,750,000 | | |
| గాంబియ | సమాధానమువిూఁదనిచ్చివేయఁబడి | 1807 | 4,000 | 146,000 | 756,000 | 735,000 |
| గోల్డు కోస్టు | „ „ [నది | 1672 | 80,000 | 1,400,000 | 4,02 ,000 | 4,307,000 |
| సియెర్రాలియోను | „ „ ...... | 1787 | 34,000 | 1,100,000 | 1,400,000 | 1,500,000 |
| ఉత్తరనైజీరియ | „ „ ...... | 1891 | 255,700 | 10,000,000 | | |
| దక్షిణనైజీరియ | „ „ ...... | 1891 | 7 ,000 | 7,000,000 | } 6,500,000 | 6,100,000 |
| సోమలిలాండు | „ „ ...... | 1884 | 68,000 | 300,000 | 250,000 | 215,000 |
| తూర్పుఆఫ్రిక | „ „ ...... | 1888 | 182,000 | 4,000,000 | 1,850,000 | 1,200,000 |
| ఉగండ | „ „ ...... | 1894 | 223,500 | 2,50 ,000 | 630,000 | 400,000 |
| జాంజిబారు | „ „ ...... | 1890 | 1,0 0 | 200,000 | 1,000.000 | 1,100,000 |
| న్యాసలాండు | „ „ ...... | 1891 | 300,000 | 1,000,000 | 280,000 | 175,000 |

MEMBERS OF THE ANDHRA DEPUTATION WHO WAITED ON THE SECRETARY OF STATE AND THE VICEROY



హిందూదేశ కార్యదర్శి గారిని రాజప్రతినిధి గారిని సందర్శించిన ఆంధ్రవిజ్ఞాపకవర్గసభ్యులు

THE GRAND RECEPTION TO THE RELEASED INTERNEES AT MADRAS



విడుదల కాఁబడిన నిర్బంధితులకు చెన్నపురివా రొసఁగిన స్వాగతము

LOK. TILAK'S DEPUTATION TO ENGLAND



లోకమాన్య తిలకు గారి ఆంగసందేశము

| ఖండములలోని రాష్ట్రములు | ఎట్లు లభించినది | వత్సరము | చదరపు మైళ్లు | జనసంఖ్య | ఎగుమతులు | దిగుమతులు |
|---|---|---|---|---|---|---|
| ఈజిప్టు | ఆక్రమించుకొనబడినది ...... | 1882 | 400,000 | 12,000,000 | 28,000,000 | 29,000,000 |
| సుదాను | జయింపబడినది ...... | 1898 | 1,000,000 | 2,000,000 | — | — |
| మారిషసు | ,, ఇచ్చివేయబడినది | 1810-181 | 720 | 370,000 | 2,?00,000 | 2,500,000 |
| సిచిలీసు | సమాధానముమీద ఇచ్చివేయబడి[నది] | 1814 | 1?0 | 23,000 | 78,000 | 110,000 |
| ఆసెన్షను | ఆక్రమించుకొనబడినది | 1815 | 40 | 150 | — | — |
| సెయింటుహెలీన | జయింపబడినది ...... | 1673 | 47 | 3,500 | 42,000 | 6,000 |
| **అమెరికా** | | | | | | |
| ఒంటారియో | జయింపబడి ఇచ్చివేయబడినది | 1759-1763 | 407,250 | | | |
| క్వీబెకు | ,, ,, ...... | 1759-1763 | 706,850 | | | |
| నోవాస్కోషియా | ,, ,, ...... | 1627-1713 | 21,500 | | | |
| న్యూబ్రన్సువిక | సమాధానముమీదనిచ్చివేయబడి[నది] | 176? | 28,000 | | | |
| ప్రిన్సుఎడ్వర్డు ద్వీపము | జయింపబడినది | 1745-176? | 2,200 | | | |
| బ్రిటీషుకొలంబియ | అధినివేశింపబడినది ...... | 1670 | 355,900 | 7,200,000 | 140,000,000 | 79,000,000 |
| మెనిటోబా | ,, ............ | 1813 | 251,900 | | | |
| అల్బర్టా | ,, ............ | 1670 | 255,800 | | | |
| సస్కాచెవాను | ,, ............ | 167 | 251,700 | | | |
| పశ్చిమోత్తర రాష్ట్రములు | ,, ............ | 1670 | 1,250,000 | | | |
| న్యూఫౌండ్లాండు | సమాధానముమీదనిచ్చివేయబడి[నది] | 1583 | 40,000 | 240,000 | 2,700,000 | 2,400,000 |
| జమెయికా | జయింపబడినది | 1655 | 4,200 | 850,000 | 3,050,000 | 2,710,000 |
| బాహామాసు | అధినివేశింపబడినది ...... | 1629 | 4,400 | 56,000 | 358,000 | 276,000 |
| లీవర్డు ద్వీపములు | ,, ............ | 1623-1659 | 750 | 140,000 | 640,000 | 503,000 |
| విండ్వర్డు ద్వీపములు | ఇచ్చివేయబడినది ...... | 1763,178? | 510 | 200,000 | 830,000 | 800,000 |
| బార్బడాసు | అధినివేశింపబడినది ...... | 1605 | 170 | 196,000 | 1,460,000 | 1,086,000 |
| ట్రినిడాడు, టొబాగో | జయింపబడినది ...... | 1797 | 1,860 | 330,000 | 4,700,000 | 4,500,000 |
| బ్రిటీషు గయానా | జయింపబడి ఇచ్చివేయబడినది | 1803-1814 | 90,?00 | 310,000 | 1,700,000 | 1,577,000 |
| బ్రిటీషు హొండురాస్ | ,, ............ | 1798 | 8,600 | 40,500 | 700,000 | 550,000 |
| బర్మ్యూడా | అధినివేశింపబడినది | 1612 | 20 | 19,000 | 637,000 | 117,000 |
| ఫాక్లాండు ద్వీపములు | సమాధానముమీదనిచ్చివేయబడి[నది] | 1771 | 6,500 | 3,240 | 100,000 | 620,000 |
| దక్షిణజార్జియా | ,, | 1771 | 1,000 | — | — | — |
| **ఆస్ట్రలేషియా** | | | | | | |
| న్యూసౌతువేల్సు | అధినివేశింపబడినది | 1788 | 310,400 | 1,650,000 | | |
| విక్టోరియ | ,, ............ | 1832 | 88,000 | 1,320,000 | | |
| దక్షిణఆస్ట్రేలియ | ,, ............ | 1836 | 904,000 | 409,000 | 78,000,000 | 80,000,000 |
| క్వీన్సులాండు | ,, ............ | 1824 | 670,500 | 606,000 | | |
| టాస్మానియ | ,, ............ | 180 | 26,200 | 191,000 | | |
| పశ్చిమఆస్ట్రేలియ | ,, ............ | 1826 | 976,000 | 282,000 | | |
| న్యూజిలాండు | ,, జయింపబడినది | 1815 | 105,000 | 1,050,000 | 81,000,000 | 22,000,000 |
| ఫిజి | స్వదేశీయులవద్దనుండి ప్రతిగ్ర[హింపబడినది] | 1874 | 7,500 | 130,000 | 950,000 | 1,060,000 |
| పాపువ | కలుపుకొనబడినది | 1884 | 90,540 | 350,000 | — | — |
| పసిఫిక్ ద్వీపములు | సమాధానముమీద నియ్యబడినది | 1893-1906 | 12,500 | 200,000 | 850,000 | 800,000 |

### బ్రిటీషు సామ్రాజ్యము

భూగోళమునందు భూభాగవైశాల్యము 5,12,30,000 చదరపు మైళ్లు. అందు బ్రిటీషుసామ్రాజ్యవైశాల్యము 1,27,47,324. ప్రపంచమునందలి ప్రజాసంఖ్య 1,72,13,86,045. అందు 43,?5,74,001 ప్రజలు బ్రిటీషు సామ్రాజ్యమునందుఁ గలరు. భూభాగమునందును జనసంఖ్యయందును నాల్గవ వంతు బ్రిటీషుసామ్రాజ్యమునఁ గలదు. భరతఖండవైశాల్యము 17,89,156 చదరపుమైళ్లు. జనసంఖ్య 32.00,00,000. బ్రిటీషుసామ్రాజ్యవిస్తీర్ణమునందు ఏడవవంతు వైశాల్యమును జనసంఖ్యయందు మూఁడుపాళ్లు జనసంఖ్యయు భరతఖండము కలిగియున్నది. భరతఖండము సుజలపూరితము, ఫలవంతము, సహజసంపద్భరితము, జనాకీర్ణము, ప్రాచినసభ్యతాశోభితము, బ్రిటీషుసామ్రాజ్యమునకు శిరోభూషణము. లోకమునందలి నాల్గవ వంతు సంపద్బలమును ప్రజాబలమును కలిగియుండియు బ్రిటీషుసామ్రాజ్యము మహాబలసమన్వితము గాకుండుటకును విషమావస్థ పడయుటకును కారణంబులు విచారయోగ్యంబులు. బ్రిటిషుసామ్రాజ్యము సుబలాన్వితంబైన శత్రుకోటికి దుర్భేద్యమై స్థిరశాంతిస్థాపనమునకు సాధనమై ప్రజాస్వాతంత్ర్యమునకు బలప్రదమై ధర్మపోషణమునకు నిలయము కాఁగలదు.

### బ్రిటీషు ప్రజల శీలము

బ్రిటిషు జాతి శీలము విచిత్రము. ఉదారభావము స్వాతంత్ర్యప్రియత్వము చిత్తస్థైర్యము రాజ్యాంగపరిజ్ఞానము బ్రిటీషుప్రజలకు చిరకాలాగతంబులైన సుగుణంబులు. బ్రిటీషుప్రజల ప్రతిభకు మహాసామ్రాజ్యనిర్మాణమును నిర్వహణమును తార్కాణములు. బ్రిటీషుప్రజలకు స్వోత్కర్ష ఆత్మవిశ్వాసము అత్యధికము. ఉదారభావసత్వరారంభస్వభావము నిత్యనము. ప్రవర్ధమానాబైన సామ్రాజ్యసంరక్షణమునకును వికాసమునకును సదృశంబైన ప్రచలనము బ్రిటీషుప్రజలయందు దుర్లభము. బ్రిటీషు ప్రజలకు పూర్వస్థితిసంరక్షణమునందును మందగమనమునందును విశ్వాస మధికము. సామ్రాజ్యాంతర్భాగములు మాతృదేశమునకత్యంతదూరమునందుఁ గలవు. న్యూజిలాండు ఆస్ట్రేలియా దేశములు 10,000 భరతఖండము 6,000 మలయా రాజ్యము 7,000 కనడా దేశము 4,000 మైళ్ల దూరమునందుఁ గలవు.

### సామ్రాజ్యరక్షణము

బ్రిటీషు సామ్రాజ్యమునకు మాతృభూమి యైన బ్రిటీషు ద్వీపములు 1,21,512 మైళ్లు వైశాల్యమును 464 లక్షల ప్రజలను కలిగియుండి 1,31,53,6?3 మైళ్లు వైశాల్యమును 4,342 లక్షల ప్రజలును గల మహాసామ్రాజ్యమును పాలించుచున్నవి. నాలుగు కోట్ల బ్రిటీషు ప్రజలు 43 కోట్ల సామ్రాజ్యవాసులను పాలించుట యత్యాశ్చర్యకరమైన విషయము. సామ్రాజ్యాంగములకును మాతృభూమికిని గల దూరమును తలపోయునప్పుడీ యాశ్చర్యము ద్విగుణీకృతంబగుచున్నది. బ్రిటీషుసామ్రాజ్యరక్షణమునకును పోషణమునకును బ్రిటీషు నౌకాదళము సాధనముగ నున్నది. దూరస్థములైన సామ్రాజ్యాంగములకు నౌకాదళసాహాయ్యమువలననే గమనాగమనములు సాధ్యములు. బ్రిటీషు నౌకాబలము బలహీనమైన, సామ్రాజ్యాంగముల బంధనములు శిథిలంబులై సామ్రాజ్యరక్షణము దుర్లభం బగును. బ్రిటీషు రాజ్యాంగవేత్తలు గతశతాబ్దియందు నౌకాదళమును బలపఱచి సామ్రాజ్యమును పోషించిరి. లోకమునందితరజాతులు నిద్రావస్థయందు మునిఁగియున్నపుడు బ్రిటీషు ప్రజల ప్రతిభ యప్రతిహతముగ సాఁగెను. యూరపుఖండమునందు జర్మనుల విజృంభణము ఆసియాఖండమునందు జపానీయుల విజృంభణము బ్రిటీషు ప్రతిభకు భంగమును కలిగించినవి. బ్రిటీషు రాజనీతిజ్ఞుల ప్రతిభ బ్రిటీషు నౌకాదళబలము బ్రిటీషు సామ్రాజ్యము నింతవఱకును కాపాడినవి. వర్తమాన మహాసంగ్రామమువలన పరిస్థితులు సంపూర్ణముగ మారినవి. ప్రబలమైన రుష్యాసామ్రాజ్యము విచ్ఛిన్నమైనది. జర్మనుల విజృంభణము స్థిరపడినది. తురుష్కులు జర్మనుల నాయకత్వము నంగీకరించిరి. తురుష్కుల మిత్రత్వ

ముచలన జర్మనులకు మహమ్మదీయుల సానుభూతి కలిగినది. రుష్యావినాశమువలన జర్మనులు సామదానభేద దండోపాయములను పూని తమ బలమును బర్లినునుండి అఫ్గనుస్థానమువఱకును వ్యాపింపఁజేయ సమకట్టిరి. దుర్బలస్థితియందున్న రుష్యాకు ప్రతిఘటనసామర్థ్యము లేదు. రుమేనియా జర్మనులకు లోఁబడినది. బాల్కను రాష్ట్రములందు బల్గేరియా జర్మనులతో చేరి యుద్ధము చేయుచున్నది. సర్వియా మొంటినీగ్రో రాజ్యములు నాశము పొందినవి. గ్రీసుదేశము మిత్రమండలితోఁ గలిసినది. తురుష్క-సామ్రాజ్యము జర్మనులతో చేరి పోరుచున్నది. పారసీకము దుర్బలదశయందున్నది. జర్మనులను ప్రతిఘటించుటకు తగిన బలవద్రాజ్యము బర్లిను అఫ్గనిస్థానముల నడుమ లేదు. జర్మను సామ్రాజ్యవ్యాపనము నాసియాఖండమునందు ప్రతిఘటించుటకై బ్రిటీషుసైన్యములు మెసపొటేమియా పలస్తీను దేశములందు యుద్ధమాతను జయప్రదముగ జరుపుచున్నవి. రుష్యానిర్గమనమువలన జర్మనుబలములు దక్షిణరుష్యామార్గమున అఫ్గనుస్థానము చేరుటకు వీలు కల్గినది. అఫ్గనుస్థానమున కపాయము సంభవమైన భరతఖండమునకును యుద్ధోపద్రవము కలుగుట సహజము. ఆసియాఖండమునందు సంభవము కాఁగల యుద్ధోపద్రవము నాఁపుటకు వలయు శక్తిసామర్థ్యములు భరతఖండమునకు భారతమాతబలము మాత్రమే ప్రత్యక్షముగఁ గలవు.

బ్రిటీషు రాజనీతిజ్ఞులు దూరదృష్టిని విశ్వాసమును కలిగి ప్రవర్తించియుండిన జర్మనుల విజృంభణమునకు ఆసియాఖండమునందు ప్రతిఘటనము భరతఖండమువలన కలిగియుండును. సామ్రాజ్యవిషమదశయందు భారతయోధులు బ్రిటీషుసామ్రాజ్యమును సంరక్షించిరి. ఫ్లాండర్సు ఆఫ్రికా తుర్కి మెసపొటేమియా పలస్తీను రంగములు భారతయోధరక్తసిక్తంబులై, భారతమాత మహాబలము బ్రిటీషుప్రజలకు సువ్యక్తం బైనది. బ్రిటీషు సామ్రాజ్యాంగము లైన వలసరాజ్యములకు ఆసియాఖండమునందు జర్మనుల విజృంభణము నాఁపుటకు సామర్థ్యావకాశములు లేవు. యూరపురాజ్యముల బలవికాసములకు ఆసియాఖండరాజ్యాధిపత్యము మూలబీజము. బ్రిటీషుసామ్రాజ్యోన్నతస్థితికి భరతఖండరాజ్యాధిపత్యము ముఖ్యసాధనము. పాశ్చాత్యరాజ్యముల పోషణమున కవసరమైన పదార్థములు విశేషముగ ప్రాచ్యరాజ్యలబ్ధములు. అన్నాదిపదార్థంబు లన్నియు పాశ్చాత్యరాజ్యములకు పరదేశములనుండి రావలసియున్నవి. బ్రిటీషుద్వీపముల కీస్థితి ముఖ్యముగ కలదు. బ్రిటీషు రాజ్యాధికారులు భరతఖండమును తమ పోషణమున కవసర మని తలంచిరి గాని రక్షణమున కవసరం బని తలంపలేదు. బహిఃశక్తి పరాధీనం బైనపు డంతఃశక్తియు కాలక్రమమున పరాధీనం బగుట సహజము. వర్తమాన మహాసంగ్రామమువలన బ్రిటీషు రాజనీతిజ్ఞులకు భరతఖండపు రక్షణసామర్థ్యము విస్పష్టం బైనది. భరతఖండమునందు యుద్ధనిర్వహణమున కవసరమైన ప్రజాబలమును సంపద్బలమును గలవు. దేశమునందుఁ గల బలసంపదలు సంవర్ధితం బైన, భరతఖండము ఆత్మసంరక్షణమునకును బ్రిటీషుసామ్రాజ్యసంరక్షణమునకును తగిన స్థితియందుండియుండును. ఆంగ్లరాజనీతిజ్ఞులిపుడు కన్నులు విప్పి భారతమాత బలమును సందర్శింప సమకట్టిరి. సమయము దాఁటినపుడు చేసిన ప్రయత్నములు కార్యసాధనమున కనుకూలములు గావు. వర్తమానకాలమునందు బ్రిటీషు రాజనీతిజ్ఞులు చేయు ప్రయత్నములు గతజలసేతుబంధనమువలె నున్నవి.

బ్రిటీషుసామ్రాజ్యమునకు భారతీయుల సంపూర్ణబలము కలుగుటకు భారతమాతకు సుబలదశ సంప్రాప్తము కావలయును. భారతమాతకు సుబలదశ సంప్రాప్తం బగుటకు భారతీయులకు సుస్థిరమైన దేశభక్తి కలుగుట యవసరము. దేశభక్తులు స్వదేశసంరక్షణార్థము ప్రాణమానధనములను ఫలాపేక్ష లేకయె సమర్పించుట ప్రకృతిధర్మము. భావరహితమైన త్యాగమసంభవము. భారతీయులకు బ్రిటీషుసామ్రాజ్యసంరక్షణమునందు బాధ్యత కలుగుటకు సామ్రాజ్యమునందు ఇతరరాజ్యములకుఁ గల గౌరవప్రతిపత్తులను వారు కలిగియుండుట యవసరము. బ్రిటీషుసామ్రాజ్యాంతర్భాగముల స్థితిగతులను పరిశీలించినపుడు భరతఖండమునకు

సామ్రాజ్యమునందు వలస రాజ్యములకుఁ గల గౌరవ ప్రతిపత్తులు లేవని విశద మగుచున్నది.

యుద్ధ మారంభ మైన తరువాత బ్రిటీషు రాజనీతిజ్ఞుల దృక్కోణమునందు స్వల్ప మైన మార్పు కలిగినది. సామ్రాజ్యసభయందు హైందవప్రతినిధులకు ప్రవేశము కలిగినది. గతసంవత్సరమునందు సామ్రాజ్యసభకు నియుక్తు లైన సర్ జేమ్సు మెస్టను సర్ సత్యేంద్ర ప్రసన్న సింహా బికానీరు మహారాజు గార్లు ప్రజానియుక్తులు గారు; హిందూదేశమంత్రులును గారు. వర్తమానసంవత్సరమునందు నియుక్తు లైన సభ్యులును ప్రజానియుక్తులు గారు. అధికారనియుక్తులు ప్రజలయం దుత్సాహమును కలిగింపనోపరు. ముఖ్యమంత్రి బ్రిటీషు సామ్రాజ్యమునందు వలసరాజ్యములు సమభాగు లనియు భరతఖండము ముఖ్యభాగ మనియు తెలిపియుండెను. భరతఖండమునకు బ్రిటీషు సామ్రాజ్యమునందు వలస రాజ్యములకువలె సమభాగత్వమును కల్పించుట సామ్రాజ్యనిర్వహణమునం దభిమానమును కల్పించుటకు ముఖ్యసాధనము. పరిపాలనమునందు బాధ్యత లేని ప్రజలు రక్షణమునందు బాధ్యత వహించుట దుర్లభము. భరతఖండమునందు బాధ్యత గల పరిపాలనమును స్థాపించుటవలన భారతీయులు బ్రిటీషు సామ్రాజ్యరక్షణమునందు బాధ్యత వహింపఁగలరు. పరిపాలనభారము పరాధీనమునం దుండఁగ, సంరక్షణభారమునందు భారతీయుల కుత్సాహాభిమానములు కలుగుట యసాధ్యము. ఆంగ్లరాజనీతిజ్ఞులు ప్రకృతిధర్మమును పరికించి భరతఖండమునందు సత్వరముగ స్వపరిపాలనమును స్థాపించి సామ్రాజ్యరక్షణమునం దభిమానోత్సాహములను కలుగఁజేయుటకు నిశ్చలచిత్తముతో పాటుపడుట లోకకల్యాణమునకు మూలబీజము. ఆత్మరక్షణమునకును సామ్రాజ్యసంరక్షణమునకును భారతమాతకుఁ గల సదుపాయము లితరరాజ్యములకు లేవు. భరతఖండమునకుఁ గల యపారమైన సదుపాయములను వికసింపఁజేయుట సామ్రాజ్యబలమునకు ముఖ్యసాధనము. బ్రిటీషుసామ్రాజ్య ప్రజలయందు మూఁడు వంతుల ప్రజలకు భరతఖండము నిలయము. ముప్పది మూఁడు కోట్ల ప్రజలు నిరాయుధులై పరతంత్రులై దుర్బలులై విశ్వాసరహితులై సంశయాత్ములై యున్నపుడు సామ్రాజ్యసంరక్షణము దుర్లభ మని విచారజ్ఞులకు విదితము కాకమానదు. ఆంగ్లరాజనీతిజ్ఞుల కీ మహద్విషయము గోచరింపకుండుట సంతాపకరము.

### నూతనరాజ్యాంగసమస్యలు

వర్తమానమహాసంగ్రామ మపార మైన రాజ్యాంగసమస్యలకు హేతుభూతము కాఁగలదు. యుద్ధాంతమునందు ప్రజాస్వామ్యత్వమునకు ప్రముఖత కలుగఁగలదు. ధనస్వామ్యత్వమునకును అధికారస్వామ్యత్వమునకును ప్రముఖత తగ్గఁగలదు. రాజ్యనిర్మాణమునందు స్వయంనియోగసిద్ధాంత మవలంబితము కాఁగలదు. రుష్యావిలయమునందు జర్మనుజాతీయవిజృంభణమును చీనాజాతీయవిజృంభణమును జపానుజాతీయవిజృంభణమును సర్వమహమ్మదీయవిజృంభణమును సంభవములు. జర్మనుజాతీయవిజృంభణము సకలారిష్టములకును మూలము కాఁగలదు. జర్మనువిజృంభణము యుద్ధఫల మైన, యూరపు ఆసియా ఆఫ్రికా ఖండములకు జర్మనుల నిరంకుశాధికారము వ్యాపించుట సహజము. లోకసంగ్రహణమునకు ధర్మము మూలము గాక బలము మూలము కాఁగలదు. బ్రిటీషుసామ్రాజ్యమును అమెరికా సంయుక్తరాష్ట్రములును ఫ్రాన్సును ధర్మబలమును స్థాపించుటకు సమకట్టినవి. మిత్రమండలి సంకల్పములను సఫలము చేయుటకై భారతీయులు పరమోత్సాహముతో సకలవిధములఁ దోడ్పడిరి. వర్తమాన విషమపరిస్థితులందు యుద్ధనిర్వహణమునకు భారతీయుల సహాయ మధికతరముగ నవసరం బని ప్రధానమంత్రి లాయిడు జార్జి గారు రాజప్రతినిధికి సందేశమును పంపిరి. జార్జి చక్రవర్తి "సామ్రాజ్యావసరములు హిందూదేశమునకు యుద్ధనిర్వహణమున కవకాశములను కల్పించినవి.' అని సందేశమును పంపెను. ఢిల్లీనగరమునందు ఏప్రిలు 27-వ తేదిని కూడిన మహాసభయందు చెమ్సుఫర్డు ప్రభువు సామ్రాజ్యావసరములను భరతఖండపు బాధ్యతలను సవిస్తరముగ విశదీకరించెను. రాజప్రతిని

సంభాషణమును చక్రవర్తి సందేశమును సంతృప్తికరములు గావు. యుద్ధనిర్వహణమునందు అయిర్లాండు ప్రజల సహాయమును పడయుటకై తత్క్షణస్వరాజ్యస్థాపన మవసర మనియు భరతఖండమునందు రాజకీయాందోళన మనుచిత మనియు నాంగ్లరాజ్యాభిమానులు ప్రకటించుచున్నారు. ఏకధర్మమునె అయిర్లాండున కొక విధమునను భరతఖండమున కింకొక విధమునను సమన్వయింపఁజేయుట రాజనీతి కాఁజాలదు. రాజ్యాంగాందోళనమును విజయాంతమగుటకును విరమింపఁజేయుట యవసర మని రాజప్రతినిధి తెలిపెను. భరతఖండము యుద్ధనిర్వహణమునకై సైన్యములను ద్రవ్యమును సమకూర్చుట యవసరము. ప్రజల కుత్సాహ ముండినఁగాని ఈ కార్యనిర్వహణము సాధ్యము గాదు. మూలసిద్ధాంతములనో నేఁభవిషయవారితో సంప్రతించుట యసంగత మని రాజప్రతినిధి తెలిపియుండెను. హిందూదేశరాజ్యాంగసమస్యల వట్ల భారతీయులకును ఆంగ్లేయులకును దృక్కోణమునందు సమానదశ కలుగుట యసంభవము. లోకమాన్య తిలకు మహాత్మ గాంధి రవీంద్రనాథఠాకూరుల భారతదేశభక్తి యప్రతిమానము. ఆంగ్లరాజ్యాధికారులకును భారతదేశభక్తులకును సమానదృష్టినము స్వపరిపాలనదశయందు మాత్రమే సాధ్యము. స్వరాజ్యపు రాయబారముల ప్రతిషేధమును ప్రజారంజకుల ప్రతిషేధమును భారతీయుల కసంతృప్తిని కలిగించినవి. ప్రజలకు పరిపాలనమునందు బాధ్యత యున్నపుడె సమగ్రమైన సాహచర్యము సాధ్యము. వర్తమానవిషమదశయందు భరతఖండసంరక్షణమునకు సముచితము ప్రజల సాహచర్య మవసరము. ఆంగ్లయోధులు ఆంగ్లాధికారులు సామ్రాజ్యపాలనమును యథేచ్ఛముగ చేసెడి కాల మంతము నొందినది. ముప్పదిమూఁడుకోట్ల మంది భారతీయులను 1,70,000 మంది యాంగ్లులు పాలించుట సాధ్యమా? నాలుగు కోట్ల మంది బ్రిటీషు ప్రజలు భూగోళమునందలి నాల్గవ వంతు వైశాల్యము గల బ్రిటీషు సామ్రాజ్యమును లోకమును విషమసమస్య లావరించిన సమయమునందు పాలించుటయు రక్షించుటయు దుస్తరము.

ఏ భాగము యొక్క పోషణరక్షణభారములను ఆ భాగము వహింపఁగలుగునపుడె బ్రిటీషుసామ్రాజ్యరక్షణము సుసాధ్యము. బ్రిటీషు రాజనీతిజ్ఞులు ఈ ధర్మమును చిరకాలము క్రిందటనె గ్రహించిరి. కాని, యాచరించుటకు వలయు సాహసధైర్యముల నాంగ్లేయరాజనీతిజ్ఞులు కల్గియుండమిన వర్తమానసమయమునందు సామ్రాజ్యమునకు విషమదశ సంప్రాప్తమైనది.

పదునెనిమిదవ శతాబ్దియందు అమెరికాసంయుక్తరాష్ట్రముల తిరుగఁబాటువలన బ్రిటీషుసామ్రాజ్యమున కపారమైన నష్టము కలిగినది. అమెరికాసంయుక్తరాష్ట్రములు సంపూర్ణస్వాతంత్ర్యమును పడసినపుడు బ్రిటీషు రాజనీతిజ్ఞులు కన్నులు తెఱచిరి. కనడా ఆస్ట్రేలియా రాజ్యములకు స్వపరిపాలనము సులభముగ నొసంగఁబడినది. బానర్మను గారు దక్షిణాఫ్రికాయందు స్వపరిపాలనమును స్థాపించుట యాంగ్లరాజ్యాంగవిజ్ఞానమునకు నిదర్శనము. ఘోరయుద్ధము పరిసమాప్తి నొంది బ్రిటీషు పక్షమునకు విజయము సమకూరిన వెంటనె దక్షిణాఫ్రికాయందు సంయుక్తరాజ్యము స్థాపింపఁబడినది. దక్షిణాఫ్రికాయందు స్వరాజ్యమును స్థాపించుటవలన కలిగిన ప్రయోజనము వర్తమానమహాసంగ్రామమునందు విశదమైనది. పరమశత్రువులైన బోథా స్మట్సు గార్లు పరమమిత్రులై బ్రిటీషు సామ్రాజ్యసంరక్షణమునకై సర్వమును సమర్పించుచున్నారు. జర్మనుల మనోరథములు భరతఖండమునందువలె దక్షిణాఫ్రికాయందును భగ్నములైనవి. బ్రిటీషుసామ్రాజ్యాంగముల స్వాతంత్ర్యస్థితియె సామ్రాజ్యసంరక్షణమునకును బలమునకును పరమసాధనం బని స్థిరపడినది. ఈ గుణపాఠము స్వోత్కర్షపరాయణులును స్వజాత్యభిమానులును నైన వెల్బి సైడెన్హాము వర్గమునకు పట్టుపడకపోవుట విచారకరము. సామ్రాజ్యవిషమదశయందైనను వారి దురభిమానము నిర్గమించుట సామ్రాజ్యక్షేమమున కవసరము. బ్రిటీషుసామ్రాజ్యపు యోగక్షేమములకును సంరక్షణమునకును స్వపరిపాలనబద్ధములైన రాజ్యముల సాంఘికసంయుక్తసామ్రాజ్యనిర్మాణమె సాధనము. ఏతత్సా[illegible] నిర్మాణమునకు బ్రిటీషుసామ్రాజ్యమునకు [illegible]

ముప్పది మూడుకోట్ల ప్రజలకు నిలయమును బహుసంఖ్యాక సంపత్సమృద్ధిశోభితమును నైన భరతఖండమునందు స్వపరిపాలనమును స్థాపించుట యత్యావశ్యకమని బ్రిటీషు రాజనీతిజ్ఞులును హైందవరాజనీతిజ్ఞులును ప్రతిపాదించుచున్నారు.

భరతఖండమునందు రాజ్యాంగసంస్కరణము లనివార్యము లని మాంటేగు గారు తాము మెసపొటేమియా యుద్ధరంగమును గూర్చి సవిమర్శముగ సంభాషించు సందర్భమున ప్రస్ఫుటము చేసిరి:

"నాగరికత గలిగి ప్రవర్ధమానం బగుచున్న దేశముయొక్క నవీనావశ్యకతలకు భరతవర్ష పరిపాలనము అనుకూలముగను దారుతుల్యముగను విస్తరణగుణవిహీనముగను అతిప్రాచీనముగను నున్నది."

మాంటేగు గారి యీ వాక్యములు పరిపాలనజడత్వమును చాటుచున్నవి. మెసపొటేమియారంగచరిత్రను విమర్శించిన వెడ్జివుడు గారు నీ భావమునే ప్రచురించిరి. దేశకాలపరిస్థితులు మారినను ప్రజాశయములు మారినను పరిపాలనమునందు మార్పులు కలుగలేదు. ఒక శతాబ్దికి పూర్వపు పరిపాలనస్థితియే ఇప్పుడును గలదు. భారతీయనాయకులలో సంస్కరణవిధానములందును సంస్కరణమార్గములందును కాలపరిమితియందును కించిద్భేదాభిప్రాయము లున్నను సంస్కరణావశ్యకతావిషయమునందు భేదాభిప్రాయము లేదు. సంగ్రామావశ్యకతలు సంగ్రామవ్యాపనము సంగ్రామోపద్రవము సంగ్రామధర్మము సంస్కరణావశ్యకతను బలపఱచినవి. దేశభక్తులు గోపాలకృష్ణగోకలే మహాసంగ్రామము సంప్రాప్తం బైనపుడు వర్తమానదుర్బలదశయందు మాతృదేశసంరక్షణము దుర్లభమని తెలిపియుండెను. దేశకాలపాత్రావశ్యకతలను గ్రహింపఁజాలని స్వప్రయోజనపరు లైన యధికారాభిమానులును అధికారవర్గాభిమానులును సంశయాత్ములును విశ్వాసరహితులును వర్తమానవిషమదశకు కారకులు. భరతఖండవికాసమునకు బ్రిటిషుసామ్రాజ్యమునందలి సంపూర్ణస్వాతంత్ర్యస్థితి అత్యవశ్యము. భరతఖండమునకు సంపూర్ణస్వాతంత్ర్యస్థితి లభించుటకు జాతీయమహామ్మదీయసభలు నిర్ణయించిన రాజ్యాంగసంస్కరణవిధానము ప్రథమసోపానము. లక్ష్మణపురమునందు కూడిన జాతీయ మహామ్మదీయ మహాసభలయందు ఏకగ్రీవముగ నంగీకృతి మైన స్వరాజ్యవిధానమును భారతీయులం దధిక సంఖ్యాకులు కోరుచున్నారు. హిందూదేశమంత్రికిని రాజప్రతినిధికిని వివిధప్రాంతములందలి రాయబారములు సమర్పించిన విన్నపము లీ విషయమునే విస్పష్టము చేయుచున్నవి.

## రాజ్యాంగ సంస్కరణ ప్రతిపాదనము

అ. భరతవర్షమునందలి మహాసంఘములు ప్రాచీన సభ్యతాలబ్ధము లగుటంజేసియు, ఆ సంఘములవారు పరిపాలనమునందును రాజ్యనీతియందును విశేష సామర్థ్యము కలిగియుండుటచేతను, సార్ధశతాబ్ది బ్రిటీషు పరిపాలనముగలన వారు విద్యయందును ప్రజాపరత్వమునందును వృద్ధిని పొందియుండుటచేతను, మఱియు ప్రస్తుతము గల పరిపాలనావిధానము ప్రజల యభిలాషలను నెఱవేర్పక ప్రస్తుతావసరములకును స్థితిగతులకును తగియుండకపోవుటచేతను, సత్వరముగ భరతవర్షమునకు స్వపరిపాలనము ప్రసాదించుటయే బ్రిటీషు పరిపాలనమునకు ఫలసంకల్పము లని తెలుపుచు, శాసనమును ప్రకటించుటకై మహామహులగు రాజరాజేంద్రులు కరుణించుటకు సమయ మాసన్నమైనదని జాతీయ మహాసభ యభిప్రాయపడుచున్నది.

ఆ. అఖిలభారతీయమహామ్మదీయసంఘమువారు చేర్పఱచిన సంస్కరణప్రణాళికను యావద్భారతజాతీయమహాసభోపసంఘమును చేరి సమ్మతించి నిర్ణయించిన కార్యస్థలంబులు గల సంస్కరణములను ప్రసాదించి స్వపరిపాలనమును స్థాపించుటకై నిర్ణయాత్మకమునకు పూనుకొనవలయునని జాతీయసభ కోరుచున్నది.

ఇ. సామ్రాజ్య పునర్నిర్మాణమునందు భరతవర్షమును పరాధీనస్థితినుండి తొలగించి స్వాధీనాధినివేశములతో పాటు సామ్రాజ్యమునందు సమానస్థానమును కలిగి యుండునట్లు ఉద్ధరింపవలయును.

## సంస్కరణ విధానము

### I రాష్ట్రీయ శాసనసభలు

1 రాష్ట్రీయశాసనసభలందు సభ్యులసంఖ్యలో ఐదింట 4 పాళ్లు ప్రజలచే నెన్నుకొనఁబడిన సభ్యులును 1 పాలు ప్రభుత్వము వారిచే నియమింపఁబడిన సభ్యులు నుండవలెను

2 పెద్ద రాష్ట్రములలో 125 మందియు చిన్న రాష్ట్రములలో 50 నుండి 75 మందియు శాసనసభ్యు లుండవలెను.

3 శాసనసభ్యులను సాధ్యమైనంత విశాలమగు నెన్నికస్వాతంత్ర్యముతో ప్రజలే యెన్నుకొనవలెను.

4 తక్కువ ప్రజాసంఖ్య గల ముఖ్యసంఘములకు ఎన్నికల మూలముగ శాసనసభయందు సరియైన ప్రాతినిధ్య ముండునట్లు ఏర్పాట్లు చేయవలెను. మహమ్మదీయుల విషయమున ఈ క్రింది విధమున ప్రజాప్రాతినిధ్యము ఏర్పాటు చేసి వారికి ప్రత్యేకముగా ఎన్నికలు జరుపవలెను:

పంజాబు:— శాసనసభ్యులలో సగముమంది.

సంయుక్త రాష్ట్రములు:— నూటికి 30 మంది.

బంగాళము:— నూటికి 40 మంది.

బీహారు:— శాసనసభ్యులలో నాల్గవ వంతు.

మధ్యరాష్ట్రములు: — నూటికి 15 మంది.

చెన్నరాష్ట్రము:— నూటికి 15 మంది.

బొంబాయి.— శాసనసభ్యులలో మూడవ వంతు.

ప్రత్యేక సంస్థాపనలవలన ఎన్నుకొనఁబడినవే చెప్పు మహమ్మదీయేతరసంఘముల యొన్నికలలో మహమ్మదీయుఁ డెన్నుకొనఁబడకుండినచో పై విధమున ప్రాతినిధ్య ముండవలెను.

ఒక సంఘము పక్షమున ప్రవేశపెట్టఁబడిన బిల్లునకుఁ గాని దానిలోని క్లాజునకుఁ గాని తీర్మానమునకుఁ గాని ఆ సంఘప్రతినిధులలో మూడింట రెండువంతులు వ్యతిరేకముగ నున్నయెడల శాసనసభల యందు ఆబిల్లును గూర్చి గాని క్లాజును గూర్చి గాని తీర్మానమును గూర్చి గాని ప్రశంసయే అనధికారసభ్యులు వదలుకొనవలెను.

5-రాష్ట్రప్రభుత్వమునకు అధిపతు లైనవారు (గవర్నరు గాని లెఫ్టినెంటు గవర్నరు గాని) శాసనసభ కధ్యక్షులై యుండఁ గూడదు. ఆ సభ కధ్యక్షుని నెన్నుకొను స్వాతంత్ర్యమును శాసనసభ్యుల కొసంగవలెను.

6 ఒక విషయమునకు సంబంధించిన యనుబంధప్రశ్నలను మొదట ప్రశ్న వేసినవారే యడుగవలెనను నిర్బంధమును తీసివేసి యితరు లడుగునట్లును ఏర్పాటు చేయవలెను.

అ. కస్టమ్సు పోస్టు టెలిగ్రాఫు టంకసాల ఉప్పు వల్లయందు రైలువేలు నౌకాదళము సేనాదళము సామంతరాజుల కప్పముల విషయములు తప్ప ఇతరము లైన రాబడు లన్నియు రాష్ట్రీయ పరిపాలకుల యధీనము క్రింద నుండవలెను.

ఆ. రాష్ట్రమున వచ్చెడి యాదాయము లన్నియు అనేక విధముల బాపతుల క్రింద నుంచఁగూడదు. నిర్ణయింపఁబడిన కొంత సొమ్మును రాష్ట్రీయప్రభుత్వములు హిందూదేశప్రభుత్వమునకు కిచ్చుచుండవలెను. ప్రత్యేకస్థితులు సంభవించునప్పుడు ఈ మొత్తమును ఎక్కువ యైనను తక్కువ యైనను చేయవచ్చును.

ఇ. అప్పులను దీసికొనుట క్రొత్త పన్నులను మార్చుట ఆర్థిక పత్రవిషయమున ఆమోదముల నిచ్చుట మున్నగువానితో కూడ రాష్ట్రసంబంధ మైన యన్ని విషయములమీఁదను రాష్ట్రీయ శాసనసభకు సర్వాధికార ముండవలెను.

అన్ని బాపతుల వ్యయములకు కావలసిన యాదాయమును సమకూర్చుట కున్న యన్ని మార్గములను బిల్లుల రీతిగా రాష్ట్రీయ శాసనసభలయందు చర్చించి సభ్యుల సమ్మతులఁ బైకొనవలెను.

ఈ. శాసనసభ్యులచే నిర్ణయింపఁబడిన నియమముల ప్రకారము రాష్ట్రీయప్రభుత్వమునకు సంబంధించిన యన్ని విషయముల తీర్మానములను శాసనసభలో చర్చింపనీయవలెను.

ఉ. రాష్ట్రీయశాసనసభచే ఆమోదింపఁబడిన తీర్మానము కార్యనిర్వాహకసభయందు గవర్నరు గారిచే త్రోసివేయఁబడిననే తప్ప, ప్రభుత్వకార్యనిర్వాహకవర్గమువారికి దానిని ప్రతిఘటించు నధికార ముండఁగూడదు. ఆ తీర్మానమును గవర్నరు గారు త్రోసివేసిన వెనుక ఒక యేటికి పైఁబడని కాలములోఁగా సభ్యులు ఆ తీర్మానమునే యామోదించుచెడల, దానిని అమలు జరుపవలెను.

ఊ. అతిప్రముఖ మైన తీర్మానము విషయమును ఒక నాఁటికి చాటించి వేఱొకనాఁడు పరిపింపఁ గోరుచెడల యెవ్వరు శాసనసభయందు హాజ రైన సభ్యులలో 8 వ వంతు వాయిదాకు సమ్మతించినయెడల, వాయిదా వేయుటకు తీర్మాన ముపపాదింపవచ్చును.

8 శాసనసభ్యులలో 8 వ భాగము ప్రత్యేక సమావేశమును గోరుచెడల ప్రత్యేకశాసనసభను జరుపవచ్చును.

9 ధనవిషయమునకు సంబంధించిన బిల్లును గాని ఇంకే విషయపు బిల్లును గాని శాసనసభ్యులచే నేర్పఱుపఁబడిన నిబంధనల ప్రకారము శాసనసభ కుంచు నుపపాదింపవచ్చును. దానికొఱకు గవర్నరు గారి యనుమతి దీసికొను నవసర ముండఁగూడదు.

10 రాష్ట్రీయశాసనసభలో ఆమోదింపఁబడిన బిల్లు లన్నియు శాసనములు కాక ముందు గవర్నరు గారిచే అంగీకరింపఁబడవలెను. కాని, ఆ బిల్లులను గవర్నరు జనరలు గారు త్రోసివేయవచ్చును.

11 ప్రతిశాసనసభ్యుని సభ్యత్వకాలమును 5 సంవత్సరము లై యుండవలెను.

## II రాష్ట్రీయ ప్రభుత్వవర్గము

1 ప్రతిరాష్ట్రీయప్రభుత్వమునకును ఒక గవర్నరు అధిపతిగ నుండవలెను. అతఁడు ఇండియను సివిలు సర్వీసులోనివాఁడుగఁ గాని ఇతర మైన శాశ్వతపు సర్వీసులలోనివాఁడుగఁ గాని యుండఁగూడదు.

2 ప్రతిరాష్ట్రమునకు ప్రభుత్వకార్యనిర్వాహకసంఘ మొకటి యుండవలెను. గవర్నరును ఈ సంఘమును గలసి ప్రభుత్వవర్గ మగును.

3 సాధారణముగా ఇండియను సివిలు సర్వీసులలో నుండినవారిని ప్రభుత్వకార్యనిర్వాహకసంఘములందు నియమింపఁగూడదు.

4 కార్యనిర్వాహకసంఘములో సగముమంది శాసనసభలలో ప్రజానియమిత సభ్యులచే నెన్నుకొనఁబడిన భారతీయు లై యుండవలెను.

5 కార్యనిర్వాహకసంఘమునందు ప్రతిసభ్యుని సభ్యత్వకాలము 5 సంవత్సరము లై యుండవలెను.

## III సామ్రాజ్యశాసనసభ

1 సామ్రాజ్యశాసనసభలో 150 మంది సభ్యు లుండవలెను.

2 ఈ 150 మందిలో 120 మంది ప్రజలచే నెన్నుకొనఁబడినవారై యుండవలెను.

3 రాష్ట్రీయ శాసనసభలయందు మహమ్మదీయ ప్రాతినిధ్యమున కేర్పఱచిన పద్ధతుల రీతిగనే సామ్రాజ్యశాసన సభ్యుల యెన్నికల విషయమునను సాధ్యమైనంతవఱకు విశాలమగు నెన్నిక స్వాతంత్ర్య ముండవలెను. రాష్ట్రీయశాసనసభలలోని సభ్యులు ప్రతిరాష్ట్రమునకును తమలోనుండి కొందఱి నెన్నుకొని సామ్రాజ్యశాసనసభకు పంపవలెను.

4 సామ్రాజ్యశాసనసభయందు ఎన్నుకొనఁబడిన భారతీయసభ్యుల సంఖ్యలో 3-వ పాలు ప్రతి రాష్ట్రమునుండియు మహమ్మదీయులచే ప్రత్యేకముగ నెన్నుకొనఁబడిన మహమ్మదీయప్రతినిధులై యుండవలెను. రాష్ట్రీయశాసనసభలయందు మహమ్మదీయప్రతినిధుల సంఖ్యకు తగినట్లు ఈ సంఖ్యయు నుండవలెను.

(1-వ సెక్షను 4-వ క్లాజులో చెప్పఁబడిన యుపనిబంధనలే యిందును వర్తించును.)

5 శాసనసభలోనివారే సభ కొక యధ్యక్షు నెన్నుకొనవలెను.

6 ఒక విషయమునకు సంబంధించిన యుపప్రశ్నలను మొదట ప్రశ్న వేసినవారే యడగవలె నను నిర్బంధమును తీసివేసి ఇతరులును అడుగునట్లు చేయవలెను.

7 శాసనసభ్యులలో 8-వ పాలు ప్రత్యేకసభాసమావేశమును జరుపఁగోరినయెడల ప్రత్యేకసభ నొకదానిని సమావేశము చేయవలెను.

8 ధనవిషయికము కాని యింకే బిల్లునైనను శాసనసభ్యు లేర్పఱచుకొనిన నియమముల ప్రకారము ఉపపాదింపవచ్చును. దాని నుపపాదించుటకు ప్రత్యేకము ప్రభుత్వవర్గమువారి యనుమతి యవసరమై యుండఁగూడదు.

9 శాసనసభలలో ఆమోదింపఁబడిన యన్ని బిల్లులును శాసనము లగుటకు ముందు గవర్నరు జనరలు గారిచే నంగీకరింపఁబడవలెను.

10 (రివిన్యూ) రాబడిలో ధనవ్యయము మొదలగు విషయములును బిల్లుల రూపమున వచ్చు విధానమును ఆర్థికపత్రమును ప్రత్యేకముగ శాసనసభ్యులయెదుట పెట్టఁబడి చర్చింపఁబడి అంగీకరింపఁబడవలెను.

11 శాసనసభ్యుల సభ్యత్వకాలము 3 సంవత్సరములై యుండవలెను.

12 ఈ క్రింద చెప్పఁబడిన విషయము లన్నియు సామ్రాజ్య శాసనసభాధీనమున నుండవలెను :

అ. హిందూదేశమం దంతటను సమానముగ ననుసరింపవలసిన శాసనములు.

ఆ. ధనవిషయమునందు ఒకరాష్ట్రమునకును ఇంకొక రాష్ట్రమునకును నిర్ణయింపవలసిన సంబంధములు.

ఇ. సామంతరాజుల కప్పములు గాక సామ్రాజ్యాదాయమునకు సంబంధించిన యాదాయవిషయములు.

ఈ. హిందూ దేశాదాయమునుండి చేయవలసిన వ్యయములు. దేశసంరక్షణమునకుఁగాను సేనావిషయవ్యయములకు సంబంధించిన తీర్మానము గవర్నరు జనరలు గారి యిష్టము ప్రకారము చేయఁబడవచ్చును.

ఉ. ఇండియను టారిఫు పన్నులను ఎగుమతి దిగుమతి పన్నులను మార్చుటకును పన్నులను గాని సెస్సులను గాని క్రొత్తగా విధించుటకును మార్చుటకును తీసివేయుటకును ప్రస్తుత మున్న నాణెముల పెలామణీ పద్ధతులను బ్యాంకుల పద్ధతులను సవరించుటకును దేశదశలో నున్న పరిశ్రమల యభివృద్ధికి విరాళములను ధనసహాయములను చేయుటకును సంబంధించిన విషయములు.

ఊ. మొత్తముమీఁద హిందూదేశ పరిపాలనమునకు సంబంధించిన యన్ని తీర్మానములు.

13 శాసనసభచే నామోదింపఁబడిన ప్రతి తీర్మానమును కార్యనిర్వాహకసభయందు గవర్నరు జనరలు గారిచే త్రోసివేయఁబడిననే తప్ప ప్రభుత్వనిర్వాహక వర్గముచేత తప్పక యామోదింపఁబడవలెను. కాని, గవర్నరు జనరలు గారిచే త్రోసివేయఁబడిన వెనుక ఒక సంవత్సరము దాటిన వెనుక ఆ తీర్మానమునే శాసనసభ వారామోదించినయెడల ఆ తీర్మానము నమలు జరుపవలెను.

14 అతిప్రముఖమైన యొక చర్చకు వాయిదా వేయవలసియున్నయెడల, హాజరైన శాసన సభ్యులలో 8-వ భాగము వాయిదా కంగీకరించినయెడల వాయిదా తీర్మానమును ప్రవేశపెట్టవలెను.

15 రాష్ట్రీయశాసనసభవారు గాని సామ్రాజ్య శాసనసభవారు గాని ఆమోదించిన యొక బిల్లును త్రోసివేయుటకు సార్వభౌముఁడు కోరినయెడల, బిల్లు ఆమోదింపఁబడిననాఁటినుండి సంవత్సరములోఁగా దానిని త్రోసివేయవలెను. త్రోసివేయఁబడినట్లు శాసనసభకు తెలియవచ్చిననాఁటినుండి ఆ బిల్లు అమలు జరుపఁగూడదు.

16 సేనాసంబంధవ్యవహారములలోను దేశవిరాటకీయ సంబంధ వ్యవహారములలోను యుద్ధము ప్రకటించుట సంధి చేసికొనుట మున్నగు విషయములందును సామ్రాజ్యశాసనసభవారు రట్టి జోక్యమును హిందూదేశపాలకులతో కల్పించుకొనఁగూడదు.

## IV హిందూదేశప్రభుత్వవర్గము

1 హిందూదేశ ప్రభుత్వమునకు గవర్నరు జనరలు గారు ముఖ్యాధిపతియై యుండవలెను.

2 గవర్నరు జనరలు గారికి సహాయముగ నొక కార్యనిర్వాహకసంఘ ముండవలెను. ఆ సంఘమున సగముమంది భారతీయులుగ నుండవలెను.

3 కార్యనిర్వాహకసంఘమునందలి భారతీయసభ్యులను సామ్రాజ్యశాసనసభ్యులు తమనుండి కొందఱి నెన్నుకొని నియమింపవలెను.

4 ఇండియను సివిలు సర్వీసులో పనిచేసినవారు సాధారణముగ కార్యనిర్వాహకసభ్యులుగ నియమింపఁబడఁగూడదు.

ఈదిగువ కనుపరచిన ఘనవంతులు వారియొక్క కట్టడములలో "వన్ డర్ లిక్ సీలింగు"ను అమర్చి కట్టియున్నవారిలో కొందఱు.




సేత్తూరు జమీందారు, దివాన్ బహదూర్ గోవిందదాస్, చతుర్భుజదాస్
ప. ల. న. సుబ్రహ్మణ్య శెట్టియార్
టి. ఎస్. రామస్వామి అయ్యర్
అ. ము. ము. మురుగప్ప శెట్టియార్
మే. చు. సోమసుందరం శెట్టియార్
మే. అ. రు. అరుణాచలం శెట్టియార్
స. ము. న. నారాయణ శెట్టియార్
మే. అ ర. న. రామనాథన్ శెట్టియార్
స. త. నాగప్ప శెట్టియార్
స. ప. అ. ముత్తియ్య శెట్టియార్
స స. స. స. సాత్తప్ప శెట్టియార్
స. అ స. శెల్లప్ప శెట్టియార్
స వ. స. త. కరుప్పన్ శెట్టియార్
న. ప. అ. క. ముత్తియ్య శెట్టియార్

మదరాస్ కాస్మాపాలిటన్ క్లబ్బు భోజనశాలకున్ను, యీ సీలింగు అమర్చబడి యున్నది.

"వన్ డర్ లిక్ లోహ సీలింగు" ఆస్ట్రేలియా దేశములో చేయబడుచున్నది. అవి కట్టడముల యొక్క లోవైపునందు మిక్కిలి రమణీయమును కలిగించుచున్నది. అవి చాలారోజులవరకు చెడడము లేదు. మాను, సున్నముకన్న వెల సరసముగాను వున్నది. ఇవి ముఖ్యముగా రాజనగళ్లు, వివాహమంటపములు భోజనశాలలు, శయనగృహములు మొదలగు కట్టడములకు మిక్కిలి వుపయోగకరమైనది. శృంగారించుటవలన ఇండ్లశోభయు ధరయు అధికమగుచున్నది.

అవి అమర్చుటకును వర్ణములు యిచ్చుటకును యీదిగువ చేర్వాలుచేయబడిన దక్షిణ ఇండియా యేజెంట్లవల్ల వెల వివరములు తెలుసుకొనవచ్చును.

విల్సన్ అండు కంపెని,

పోస్టుబాక్సు నెంబరు 2, మద్రాసు.



THE WOMEN'S DEPUTATION        భారతమహిళల రాయబారము



MEMBERS OF THE ANDHRA MAHILA SABHA





MEDAL AND EFFIGY PRESENTED BY KING GEORGE III TO THE FATHER OF THE PRESENT ZAMINDAR OF CHINNAPPA NAYAKA PALAYAM

... పతకములు



MISS GANTY LAKSHMI NARASIMHAM

శ్రీమతి గంటి లక్ష్మీనరసింహమ్మ గారు



MISS O GEEVARATNA-AMMAL

శ్రీమతి జీవరత్నమ్మ కన్యగారు

ఇంపీరియలు సివిలు సర్వీసులలో ఉద్యోగముల నిచ్చుట (పై రెగ్యులేట్ల ప్రకారము నిర్మితమైన) హిందూదేశ ప్రభుత్వమువారి యాధీనముననే యుండవలెను. సామ్రాజ్య శాసనసభలో నిర్మింపఁబడెడి శాసనములకు లోఁబడి ఇప్పుడున్న సంస్థల హక్కులను గమనింపవలెను.

సాధారణముగ ఒక్కొక్క రాష్ట్రమునందు ఆయా రాష్ట్రములకు సంబంధించిన వ్యవహారములందు హిందూదేశ ప్రభుత్వమువారు ఎట్టి జోక్యమును కలుగఁజేసికొనఁదగదు. రాష్ట్రీయ ప్రభుత్వములకు ప్రత్యేకముగా నియమింపఁబడని యధికారము లన్నియు హిందూదేశ ప్రభుత్వమున కున్నట్లు భావింపవలెను. హిందూదేశ ప్రభుత్వమువారి యధికారము సాధారణముగా రాష్ట్రీయ ప్రభుత్వముల కార్యములపై పైవిచారణ అజమాయిషీ చేయుటయై యుండవలెను.

పై పద్ధతుల ప్రకారము ఏర్పఱుపఁబడిన హిందూదేశ ప్రభుత్వము శాసననిర్మాణవిషయమునందును పరిపాలన విషయమునందును హిందూదేశ కార్యదర్శి కే విధమునను సాధ్య మైనంతవఱకు బాధ్యత లేకయే స్వతంత్రముగ నుండవలెను.

హిందూదేశపు టాదాయవ్యయ విషయముల లెక్కలను ప్రత్యేకముగ పరిశీలించి ఆడిటు చేయు పద్ధతులను ఏర్పాటు చేయవలెను.

### V సహాయయుతుఁడైన హిందూదేశమంత్రి

హిందూదేశమంత్రి గారి సభను తీసివేయవలెను.

1 హిందూదేశమంత్రి జీతమును బ్రిటీషు (పార్లమెంటు) వారి వ్యయమునందు చేర్పవలెను.

1 అధినివేశాంగమంత్రి స్వపరిపాలన గల యధినివేశపాలనములతో నెట్టి సంబంధము కలిగియుండునో అట్టి సంబంధమునే సాధ్యమైనంతవఱకు హిందూదేశపరిపాలన పట్ల హిందూదేశమంత్రి కలిగియుండవలెను.

1 హిందూదేశమంత్రి గారికి సహాయులుగ నిద్దఱు సహాయకార్యదర్శు లుండవలెను. వీ రిద్దఱిలో నొక్క రెప్పటికిని భారతీయులు గనే యుండవలెను.

### VI ఆంగ్లసామ్రాజ్యము — హిందూదేశము

1 సామ్రాజ్య వ్యవహారముల పరిష్కారమునకై ఏ సభ యైన నేర్పఱుపఁబడినను ఏ నిర్మాణమైన సమావేశ మేర్పఱుపఁబడినను, దాని యందు అధినివేశముల కెట్టి ప్రాతినిధ్యము గలదో ఎట్టి హక్కులు గలవో అట్టి ప్రాతినిధ్యమును అట్టి హక్కులను హిందూదేశమున కీయవలెను.

2 భారతీయులను సార్వభౌముని యితర ప్రజలతో పాటు సమాన గౌరవముతోను సమాన ప్రజాస్వత్వపు హక్కులతోను సామ్రాజ్యమునందు మన్నింపవలెను.

### VII సేనావిషయములు, ఇతరములు

1 సార్వభౌముని సేవయందు నౌకాదళములలోను భూసైన్యములందును కమిషనులు గల పదవులను కమిషనులు లేని పదవులను హిందూదేశీయుల కిచ్చి సైనికయోగ్యు లగువారి నెన్నుకొని హిందూదేశమున వారికి క్రమశిక్ష నొసంగు నేర్పాట్లను చేయవలెను.

2 హిందూదేశీయులను ఐచ్ఛికసైనికులనుగ చేర్చుకొనుట కంగీకరింపవలెను.

3 ప్రభుత్వకార్యనిర్వాహకోద్యోగములు గలవారికి న్యాయవిచారణ సంబంధమగు నధికార మే మాత్రము నుండఁగూడదు. న్యాయశాఖలకు సంబంధించిన యుద్యోగముల నన్నిటిని ఆయా రాష్ట్రముల ముఖ్య న్యాయస్థానముల యధీనము క్రింద నుంచవలెను.

బ్రిటీషుసామ్రాజ్యమునందు హిందూదేశపరిపాలనము నిరంకుశాధికారవర్గాధీన మని రాజ్యతంత్రజ్ఞుల మతము. నిరంకుశ పరిపాలనము సత్పరిపాలన మైనను స్వపరిపాలనమువలె వీర్యవంతము గాదు. హిందూదేశమునకు బ్రిటీషుసామ్రాజ్యమునందు స్వపరిపాలనస్థితి కలుగుటకు వలస రాజ్యములకుఁ గల స్వపరిపాలనము కలుగుట యవశ్యము. వలస రాజ్యములకు స్వదేశ రాజ్యవ్యవహారములను స్వదేశ వాణిజ్యమును స్వదేశ పరిశ్రమలను స్వదేశ శాసనములను స్వదేశాదాయ వ్యయములను నిర్ణయించుటకు సంపూర్ణస్వాతంత్ర్యము గలదు. వలస రాజ్యములందు ప్రధాన రాజ్యాధికారులను నియమించుటకును విదేశ రాజ్యాంగములను నిర్వహించుటకును నూతన శాసనముల నామోదించుటకును బ్రిటీషు పార్లమెంటున కధికారము గలదు. న్యాయవిమర్శనాధికారము ప్రీవీ కౌన్సిలునకుఁ గలదు. వాడుకయందు బ్రిటీషు సామ్రాజ్యాచ్ఛాదిత మైన సంపూర్ణస్వాతంత్ర్యము వలస రాజ్యములకుఁ గలదు. భరతఖండమునందు ప్రజాప్రతినిధిపరిపాలనము లేదు.

### బ్రిటీషు పార్లమెంటు

హిందూదేశపరిపాలనము సిద్ధాంతమునందు బ్రిటీషు ప్రజాధీనమునను వాడుకయందు ఆంగ్లవర్గాధీనమునను గలదు. సిద్ధాంతమునందు బ్రిటీషు ప్రజలు నియమించిన పార్లమెంటు మహాసభ ఇతరభాగములనువలె భరతఖండమును నియతము పాలించుచున్నది. వాడుకయందు బ్రిటీషు ప్రజలకును ప్రజానియోజితమహాసభకును హిందూదేశ రాజ్యవ్యవహారములలో విశేష మైన ప్రవేశము అభిరుచి లేదు. హిందూదేశాదాయవ్యయములను శాసనములను చర్చించునపుడు పార్లమెంటు సభ

ప్రతినిధిశూన్యముగ నుండును. దేశముపట్ల నభిమానము గల సభ్యులు మాత్రము చర్చలయం దభిరుచిని ప్రకటించుట యాచారము. పార్లమెంటునందు భరతఖండ వ్యవహారముల కుచిత మైన స్థాన మేర్పడుటకు భరతఖండ పరిస్థితుల కనురూప మైన ప్రతినిధులను పార్లమెంటునకు పంపెడి స్వత్వము భరతఖండమున కేర్పడవలయును. రాష్ట్రమునకు నలుగురు వంతున నైనను ప్రతినిధు లుండుట యవశ్యము. పార్లమెంటునందు హైందవ ప్రతినిధు లుండినపుడు భరతఖండమునకు బ్రిటీషు సామ్రాజ్యమునందు ప్రతిపత్తి కలుగఁగలదు. హైందవ ప్రతినిధులు స్థాయిసంఘముగ నేర్పడి భరతఖండ స్వత్వములకు సంరక్షకులుగ నుందురు. ఈ విషయమును మహాసభల సంస్కరణవిధానమునందు సూచింపఁబడ లేదు.

హిందూదేశమంత్రి సభ

బ్రిటీషురాజ్యాంగమునందు వలస రాజ్యముల పరిపాలనమునకు ప్రత్యేక మైన మంత్రి సభ లేదు. వలస రాజ్యముల మంత్రి వేతనమును బ్రిటీషుద్వీపముల రాజ్యాదాయము భరించుచున్నది. హిందూదేశమంత్రి వేతనమును హిందూదేశాదాయము భరించుచున్నది. హిందూదేశమంత్రి వేతనమును బ్రిటీషురాజ్యాదాయమునందు చేర్పవలయు నని సంస్కరణవిధానము ప్రతిపాదించుచున్నది. ఈ సంస్కరణమువలన రాజ్యాదాయ వ్యయ నిర్ణయములందు హిందూదేశవ్యవహారములను చర్చించుట కవకాశము కలుగును. జాతీయమహాసభయం దీ సంస్కరణము చిరకాలమునుండి యామోదింపఁబడుచున్నది. అవసరమును ప్రయోజనకరమును నగు నీ సంస్కరణమును చేయుట సమంజసము.

బ్రిటీషుద్వీపములందు హిందూదేశమంత్రి సభ యుండుటవలన కూడ భరతఖండమునకు విశేష మైన ప్రయోజనము కలుగుట లేదు. సైడెన్హాము ప్రభువు వంటి యాంగ్లాధికారవర్గాభిమానులకు సుఖజీవనము కలుగుచున్నదే కాని, వ్యయమున కనురూప మైన ప్రతిఫలము భరతఖండమునకు కలుగుట లేదు. ఇపుడు మంత్రిసభయందు భారతీయ ప్రతినిధు లున్నను వారి యోచనలు ఫలవంతములు గావు. మంత్రిసభయందు హైందవప్రతినిధుల సంఖ్య హెచ్చినను భరతఖండమునకు ప్రయోజనకరము గాదు. హిందూదేశరాజ్యాధికారము బ్రిటీషుద్వీపములందు కేంద్రీకృత మగుట దేశాభ్యుదయమునకు క్షేమకరము గాదు. రాజ్యాధికారము భరతఖండమునందు కేంద్రీకృత మగుట దేశాభ్యుదయమునకు క్షేమకరము. రాజప్రతినిధి మంత్రికి లోఁబడియుండుట రాజ్యబలమునకు ప్రతికూలము. సందిగ్ధదశయందు ద్వైధీభావాధికారము అనర్థపరంపరలకు కారణం బగును. వర్తమానకాలమునందు మంత్రి సభవలన మన దేశమునకు కొంత ప్రయోజనము గలదని యంగీకరించినను కాలాంతరమున సభను తీసివేయుట నుర్లభ మగును. పార్లమెంటు సభయందుఁ గల భారతీయప్రతినిధులు హిందూదేశక్షేమమును రక్షింపఁగలరు. ఆంగ్లాధికారవర్గాభిమానుల కాశ్రయం బయి వ్యయ ప్రాయకం బయి రాజ్యాధికారబలమునకు ప్రతికూలం బయి స్వదేశరాజ్యాంగవికాసంబునకు ప్రతిబంధకం బై యున్న మంత్రిసభను తీసివేయుట భరతవర్షాభ్యుదయమునకు సాధనభూతము. అధికారవర్గాభిమానులు కిర్టిసు గారు వారి యనుచరులు ఈ సంస్కరణమునకు ప్రతికూలురు.

సామ్రాజ్యశాసనసభ

హిందూదేశపరిపాలనమును సామ్రాజ్యశాసనసభయు సామ్రాజ్యమంత్రిసభయు వహించుచున్నవి. శాసనసభయందును మంత్రిసభయందును అధికారసభ్యుల సంఖ్య యత్యధికముగ నున్నది. సామ్రాజ్యశాసనసభయందు ప్రజాప్రతినిధు లధికముగ నుండినఁ గాని ప్రజాస్వామ్యత్వము గాని బాధ్యతాయుతపరిపాలనము గాని సాధ్యములు గావు. మహాసభలు నిర్ణయించిన సంస్కరణవిధానమునందు (1) శాసననిర్మాణాధికారమును (2) ఆదాయవ్యయనిర్ణయాధికారమును (3) కార్యనిర్వహణాధికారమును కొంతవఱకు ప్రజాధీనమై యుండునట్లు సూచింపఁబడినవి. శాసననిర్మాణసభయందు

మూఁడు వంతుల సభ్యులు ప్రజాప్రతినిధులై కార్యనిర్వాహకసభ్యులందు సగముమంది ప్రజాప్రతినిధినియుక్తులై ఆదాయవ్యయనిర్ణయాధికారమును సభ్యులు కలిగియున్నపుడు ప్రస్తుతము గల నిరంకుశపరిపాలనము ప్రజాస్వామ్యపరిపాలనముగ మారుటకు అవకాశము లేర్పడఁగలవు. ఈ విధానమును బ్రాహ్మణేతరుల రాయబారములును లయొనెలు కర్టిసు గారును ఆంగ్లోహైందవ వర్గమును వారి యనుచరులును ఆమోదించియుండలేదు. సామ్రాజ్యరాజ్యాంగములందు అధికార మంతయు నధికారవర్గమునందు కేంద్రీకృతమై యుండఁగ రాష్ట్రీయ స్వాతంత్ర్యమును విశాలము చేసినను స్వపరిపాలన ప్రదానము కృత్రిమమే గాని యన్వర్థము గానేరదు. కేంద్రాధికార మంతయు నధికారుల యధీనమునందును రాష్ట్రాధికారము ప్రజాధీనమునందును నుండుట యసంగతము. రాష్ట్రీయవ్యవహారములందువలె సామ్రాజ్యవ్యవహారములందును స్వాతంత్ర్యస్థాపనము బాధ్యతాయుతపరిపాలనస్థాపనమునకు ముఖ్యాంకురము. సామ్రాజ్యశాసనసభ వాణిజ్య పారిశ్రామిక వ్యవసాయాది విషయములను నిర్ణయించుటకు వలస రాజ్యములకు గల స్వాతంత్ర్యమును కలిగియుండినఁ గాని స్వపరిపాలనస్థాపనము ప్రయోజనకరము గాదు. సామ్రాజ్యకార్యనిర్వాహకసభకు దేశవ్యవహారములం దనుభవము గల విదేశీయులను స్వదేశీయులను నియమించుట యుచితము. అనుభవము లేని విదేశీయుల భావము లుదారము లైనను ప్రయోజనకరములు గావని వ్యవహారస్థితి విశదము చేయుచున్నది. కార్యనిర్వాహకసభయందు సగముమంది హైందవు లుండుటయు సభ్యులను శాసనసభాప్రతినిధు లెన్నుకొనుటయు మహాసభల విధానమునందుఁ గలదు. ఈ సంస్కరణము నిరంకుశాధికారవిచ్ఛేదమున కవశ్యము.

### శిష్టసభ

మహాసభల విధానమునందు శిష్టసభానిర్మాణము సూచింపఁబడలేదు. బ్రిటీషురాజ్యాంగములందు ప్రభువుల సభకును ప్రజాప్రతినిధుల సభకును గల సంరంభము ప్రజాశయప్రాప్తికి ప్రతికూలంబై రాజ్యాంగవికాసమునకు ప్రతిబంధకముగ నున్నది. ప్రజాస్వామ్యత్వము నాకాంక్షించెడి నాయకులు తమ లక్ష్యమునకు ప్రతికూలమైన సంస్థాపనను నిర్ణయించుట యసంగతము. భరతఖండమునందు పరిపాలన పద్ధతులలో భేదము గల రాష్ట్రములు సంస్థానములు గలవు. వివిధావస్థలందుఁ గల రాజ్యముల స్వత్వసంరక్షణార్థము శిష్టసభను సంయుతము స్థాపించుట యవశ్యమని కొందఱు రాజనీతిజ్ఞులు తెలిపియుండిరి. శిష్టసభయందు స్వదేశసంస్థానములకు ప్రాతినిధ్య మధికముగ కల్పించుట కవకాశములు గలవు. పాలకనియుక్తసభ్యులకు స్థానము లేర్పడఁగలవు. పూర్వస్థితిప్రియులకు సంస్కరణవిధానమునందు విశ్వాసము కలుగఁగలదు. శిష్టసభ ప్రతిబంధకమైనను వర్తమానపరిస్థితులం దవశ్యమని తోఁచుచున్నది.

### రాష్ట్రీయపరిపాలనము

మహాసభలు నిర్ణయించిన విధానమునందు రాష్ట్రపరిపాలనము విశాలముగ నుండుట కేర్పాటులు గలవు. రాష్ట్రీయ పరిపాలనమునందు స్వపరిపాలనస్థితిని కల్పించుటలో సంవిధానమున భేదాభిప్రాయము గలదు గాని సిద్ధాంతమునందు లేదు. మహాసభలు యూరపియను సంఘము బ్రాహ్మణేతరసంఘములు కర్టిసు మండలివారు రాష్ట్రీయస్వపరిపాలనసంస్థాపనము నంగీకరించుచు సంవిధానమునందు భేదాభిప్రాయములను తెలియఁజేసిరి. రాష్ట్రీయ పరిపాలనసంస్థాపనలను నిర్మించుటయందు సకలమతముల వారికిని సంతృప్తిని కలుగఁజేయుట యసాధ్యము. మహాసభలు నిర్వచించిన సంస్కరణవిధానమునకును ఇతరవిధానములకును గల భేదము విమర్శనార్హము.

### ప్రజాపరిపాలనము — మాతృభాష

రాష్ట్రీయ స్వపరిపాలనము ప్రజాపరిపాలనముగ పరిణమించుటకు ప్రతినిధులను నిర్వచించుటకు ప్రజలకు విశాలమైన నిర్వచనాధికారము కలుగవలయును.

ప్రజలకు నిర్వచనాధికారము కలుగుటకు రాజ్యవ్యవహారక్రమము ప్రజలకు సునోగతమగుచుండవలయును. రాజ్యాంగవ్యవహారములు 100 కి 94 మందికి తెలియని విదేశభాషయందు జరుగునంతకాలము ప్రజలకు రాజ్యాంగవ్యవహారములం దభిరుచి గాని యభినివేశము గాని కలుగనేరదు. ప్రాణము లేని కాష్ఠమునందు ప్రాణప్రతిష్ఠను చేయనెంచుట వ్యర్థప్రయత్నము. వికసించిన భాషలు వాఙ్మయములు జాతులు సాంప్రదాయాచారములు గల దేశభాగములను వికసింపజేయుటకు చిరకాలాగతసభ్యత సాధనము గాని నూతనవ్యవస్థ లుత్కృష్టంబు లైనను ప్రయోజనకరములు గావు. ప్రజాపరిపాలనమున కనుకూలములైన వ్యవస్థలు భారతఖండమునందు స్థాపితములై సులభముగ వర్ధిలుటకు దేశమును భాషాప్రయుక్తరాష్ట్రములుగ విభజించుట యవశ్యమని రాజనీతిజ్ఞులు గ్రహించిరి; లోకమాన్య తిలకు లాయనెల్ కర్టిసు ప్రమోదచంద్రమిత్ర సర్ విలియము వ్యూకు హార్లెను రాబర్ట్సు సర్ థామసు హాల్డెన్సు మొదలగు ప్రముఖులు ప్రతిపాదించిరి. ఆంధ్రోద్యమతత్త్వమూ భావమునె ప్రతిష్ఠాపించుచున్నది. కర్టిసు గారు స్వపరిపాలనసంస్థాపనలను స్థాపించుటకు హిందూదేశపటమును మార్చుట యవశ్యమని తమ గ్రంథమునందు వ్రాసిరి. శీఘ్రము ఆంధ్రము అరవము మలయాళము కన్నడము మొదలగు భిన్నభాషలను మాటలాడు జనులు శాసనసభయందు రాజ్యవ్యవహారములను చర్చించి నిర్ణయింపజాలరు. భాషలు వేఱు. భావ్యతలు వేఱు. సాధనములు వేఱు. ఆంగ్లభాషాభిజ్ఞులు ప్రతినిధులుగ నుండిన ప్రజాపరిపాలనము కానేరదు. సంస్థానములందును రాష్ట్రములందును ప్రజానియంత్రితస్వపరిపాలనవ్యవస్థలు సాధ్యమగుటకు దేశమును భాషాధారికరాష్ట్రములుగ విభజించుట యవశ్యము. ఆంధ్రులు ప్రత్యేకాంధ్ర రాష్ట్రనిర్మాణమును కోరుటకు కారణము ప్రజాపరిపాలనస్థాపనవాంఛయే గాని స్వలాభము గాదు. జాతిద్వేషము గాదు. అప్రయోజకత్వము గాదు. ఉద్యోగాభిలాష గాదు. ప్రజావికాసమునకు పరమసాధనంబులైన మాతృదేశవికాసమును మాతృభాషావికాసమును ఆంధ్రోద్యమమునకు మూలబీజములు. ఈ ధర్మము నవలంబింపని రాజ్యముల వికాసము దుర్లభము. హిందూదేశమంత్రి హిందూదేశపరిపాలనమునకు గమ్యస్థానము "సాంఘాతికసంయుక్తరాష్ట్రముల సామ్రాజ్యము" అని తెలిపియున్నాడు. నిర్దిష్టమైన గమ్యస్థానమును చేరుటకు స్వపరిపాలనకళాశోభితంబులైన భాషాప్రయుక్తరాష్ట్రముల నిర్మాణము రాజమార్గము.

### రాష్ట్రీయశాసనసభలు

రాష్ట్రీయశాసనసభలయందు ప్రజానిర్వాచిత ప్రతినిధుల సంఖ్య మూడు వంతులుండవలయును. నిర్వాచనగణము విశాలముగ నుండవలయును. ప్రత్యేకసంఘప్రాతినిధ్యము పరిమితముగ నుండవలయును. శాసనసభాధ్యక్షుడు ప్రతినిధియుక్తుడు వహింపవలయును. గవర్నరుల యాధిపత్యాధికారము మితము నొందించుటకు గల యావశ్యకత చెన్నరాష్ట్రశాసనసభావ్యవహారముల నవలోకించుచున్నవారలకు గోచరము. రాష్ట్రాదాయవ్యయసమస్తాధికారములు రాష్ట్రపరిపాలనమున నుండవలయును. కార్యనిర్వాహకసభ్యులలో సగముమంది హైందవులు ఉండవలయును. ఈ సభ్యులు ప్రజానిర్వాచితసభ్యులు నిర్వచించిన ప్రతినిధులుగ నుండవలయును. సభ్యులకు ప్రశ్నలను ఉపప్రశ్నలను వేయుటకును తీర్మానముల నుపపాదించుటకును శాసనములను ప్రవేశపెట్టుటకును అధికారము కలుగవలయును. మహాసభలు నిర్ణయించిన సంస్కరణ విధానములు ప్రసాదితములైన రాష్ట్రీయస్వపరిపాలనము సాధ్యము కాగలదు. వంగరాష్ట్రనాయకులు మహాసభల సంస్కరణవిధానము నామోదించుచు రాష్ట్రపరిపాలనమునందు సంపూర్ణస్వాతంత్ర్యమును ప్రతిపాదించిరి.

### కర్టిసు గారి విధానము

కర్టిసు గారి సంస్కరణవిధానమును వంగరాష్ట్రమునందలి యూరోపియనులును హైందవప్రముఖులును దక్షిణమునందలి బ్రాహ్మణేతరనాయకులును ఆమోదించిరి. పార్లమెంటునందు హిందూదేశమంత్రి అగస్టు 20-వ

తేదిని ప్రకటించిరి. గీతగా కాలక్రమమున ప్రజలు బాధ్యత వహింపఁగల పాలనమును స్థాపించుట యావశ్యమని యంగీకరించిరి. గన్యస్థానమును చేయుటకు చిరకాలము గావలయు నని నిర్ణయించిరి. ప్రస్తుతస్థితియందు సామ్రాజ్యసభలో సంస్కరణము లసంగతము లని నిర్ణయించిరి. ఇయ్యది మహాసభల నిర్ణయమునకు ప్రతికూలము. సామ్రాజ్యాధికార మంతయు నిరంకుశాధికారాధీనమున నున్నపుడు రాష్ట్రీయపరిపాలనమునందు స్వపరిపాలనభావ మసంభవము. పరిపాలనమునందు నిరంకుశస్వభావము మాఱనేరదు. రాష్ట్రములందు బాధ్యత గల పరిపాలనమును స్థాపించుటకు కర్టిసు గారి నిర్ణయములు విమర్శనార్హములు. ఈ సంస్కరణములు మరీచికలవలె సంస్కరణపిపాసుల నాకర్షించుచున్నవి.

రాష్ట్రాధికారము అధికారాయత్తము ప్రజాయత్తము అని రెండు విధములుగ విభజింపఁబడినది. రాష్ట్రములందు ఉపరాష్ట్రములు కల్పింపఁబడినవి. ఉపరాష్ట్రములు నాలుగైదు మండలముల పరిమితి కలిగి యుండును. నాలుగు మండలముల కొక యుపరాష్ట్ర మేర్పడిన, చెన్నరాష్ట్రమునందు 6 ఉపరాష్ట్రము లేర్పడును. ఈ యుపరాష్ట్రములు బలసంపదల వికసనమున కనువుగాక జాతీయ జీవనవికాసమునకు ప్రతిబంధకములుగ నుండును. ఆంధ్రదేశమును ఉత్తరాంధ్రదేశము దక్షిణాంధ్రదేశము పశ్చిమాంధ్రదేశము అని మూఁడు భాగములుగ విభజించిన, దేశము స్వయంపోషణమున కననుకూలమై వికాసరహితము కాఁగలదు. కర్టిసు గారి విధానమునందు స్వపరిపాలనాకారము దృశ్యమైనను అది భావశూన్యముగను ఫలరహితముగను నున్నది. కర్టిసు గారి విధానమునందు స్వయంపోషణానుకూలము లైన భాషాప్రయుక్తరాష్ట్రములు సంభవములు గానపుడు ఆ విధానము కలహములకును జాతీయదుర్బలత్వమునకును కారణము కాఁగలదు. కర్టిసు గారు జాతిని భాషను సాంప్రదాయాచారములను అనుసరించి రాష్ట్రములను నిర్మింపవలయు నని ప్రతిపాదించిరి. ఆ సిద్ధాంతముల ననుసరించి రాష్ట్రములను నిర్మించుట రాజ్యాంగసౌధనిర్మాణమునకు మూలాధారము. స్వయంపోషణమున కనుపయోగము లైన రాష్ట్రములు నిరుపయోగము. వర్తమానమహాసంగ్రామమున కట్టి రాష్ట్రముల పరిస్థితియే మూలకారణము. ఉపరాష్ట్రములందు బాధ్యతాయుత మైన పరిపాలనము కొన్ని రాజ్యాంగముల కేర్పడును. ముఖ్య మైన రాజ్యాంగాధికారము ముఖ్యరాష్ట్రమునం దధికారాధీనమున నుండును. రాజ్యాంగములం దయిదు శాఖ లుండిన రెండు శాఖలు ప్రజానిర్వచితాధికారులు గల యుపరాష్ట్రము యొక్క యధీనమునందును ఇతరశాఖలు ముఖ్యరాష్ట్రాధీనమునందును నుండును. రాష్ట్రమునకును ఉపరాష్ట్రములకును భేదము లేనియెడల ఒక రాష్ట్రమునందె ప్రజానిర్వచితాధికారులును స్వతంత్రాధికారులు నుందురు. ఈ విధాన మపూర్వము; ఏ దేశపు రాజ్యాంగచరిత్రమునందును నదృశ్యము. ఈ నవవిధానమున అధికారనిర్ణయమునం దుభయశాఖలకును నిరంతరసంరంభము సిద్ధము. ప్రజానిర్వచితాధికారశాఖకు వ్యవసాయాంశమును నిర్ణయించి క్రొత్త పన్నులను వేయఁగల యధికారమొసంగఁబడును. దేశహితకార్యములకును విద్యావ్యాపనమునకును విశేష మైన ద్రవ్య మవశ్యము. నిర్ణీత మైన ద్రవ్యము చాలదు. క్రొత్త పన్నులు ప్రజలకు రుచింపవు. మంత్రులు సర్వాదాయ వ్యయ నిర్ణయాధికారమును కలిగి యున్నపుడు ఆవశ్యకతానావశ్యకతల ననుసరించి ఆదాయవ్యయమార్గములను నిర్ణయింపఁగలరు. ఒక శాఖాభారమును మాత్రము వహించినపుడు సముచితముగ నాదాయవ్యయమార్గములను నిర్వహింపనోపరు. మధ్యకాలమునందు శాఖాధికారు లధికాదాయమును వాంఛింపఁ జనరు. ఇది యసంగతము. వర్తమానలోకపరిస్థితులందు నూతనసమస్యలు సాధారణముగ ప్రత్యక్షమగుచుండును. వ్యయాంశ మావశ్యకతానావశ్యకతల ననుసరించి మాఱుచుండును. ఈ సదుపాయములు లేని పరిపాలనవిధానము మోంటేగు గారి వర్ణనకు తగియుండును. ఉపరాష్ట్రముల వ్యవహారములను విమర్శించుట కధికారు లేర్పడుదురు. వారి యభిప్రాయముల ననుసరించి యుపరాష్ట్రముల యధికారములందు హెచ్చుతగ్గు లేర్పడుచుండును. ఉపరాష్ట్రముల రాజ్యాధికార

మును నియమించుటకును తొలగించుటకును సామ్రాజ్యపరిపాలనమునకును హిందూదేశమంత్రికి పార్లమెంటు సకును అధికారము గలదు. కర్టిసు గారు వృత్తిప్రాతినిధ్యము నంగీకరించుచు కులప్రాతినిధ్యమును నిరసించిరి. కులప్రాతినిధ్యము దేశమునందుఁ గల యనంతము లైన కులములను స్థిరపఱచి యేకజాతీయభావమును దుర్లభము గావించును. కర్టిసు గారి విధానము సదుద్దేశములను సంశయములను కలిగియున్నది. దేశక్షేమమునకు బాధ్యతాయుతపరిపాలనస్థాపన మవశ్య మని యంగీకృతము. ప్రజలయందును ప్రజాసామర్థ్యమునందును విశ్వాసము చూపుట లేదు. అధికారుల విశ్వాసరాహిత్యము భారతీయుల దురవస్థకు కారణము. భరతవర్షాభ్యుదయమునకును బ్రిటీషు సామ్రాజ్యక్షేమమునకును బ్రిటీషు రాజ్యాధికారులకును భారతీయులకును దేశపరిపాలనమునందు సంపూర్ణవిశ్వాస మేర్పడవలయును. ఏతత్ఫలప్రాప్తికి కర్టిసు గారి సంస్కారణవిధానము ప్రయోజనకరము గాదు. స్వపరిపాలనభావరూపములు సర్వాంగములందును వ్యక్తమైనపుడు స్వపరిపాలనము వీర్యవంతమై శోభాయమానమై దేశాభ్యుదయమునకు ప్రయోజనకరము కాఁగలదు.

బ్రాహ్మణేతరసభలు

బ్రాహ్మణేతరసంఘముల రాయబారములు రాష్ట్రీయస్వపరిపాలనవిధానమునందు కర్టిసుగారి విధానమునకు సదృశమైన విధానము నామోదించినవి. బ్రాహ్మణేతరసభలు సామ్రాజ్యపరిపాలనమునను మహాసభలు సూచించిన సంస్కారణములకు ప్రతికూలాభిప్రాయమును దెలిపినవి. బ్రాహ్మణేతరుల సంస్కారణవిధానమునందు కర్టిసు గారి విధానమునందుఁ గల దోషమే గోచరం బగుచున్నది. ఉభయవిధానములందును ప్రస్తుతము గల నిరంకుశాధికారమున కాయుష్య మొసంగఁబడినది. మహాసభల విధానమునందు నిరంకుశాధికారమును కాలక్రమమున నదృశ్యము చేయుటకు మార్గ మేర్పఱుపఁబడినది. బ్రాహ్మణేతరవిధానమునందు ప్రత్యేకసంఘప్రాతినిధ్యము ప్రముఖముగ నున్నది. ప్రత్యేకసంఘప్రాతినిధ్యమును కర్టిసు గారు సంపూర్ణముగ నిరసించుచున్నారు. ప్రత్యేకసంఘప్రాతినిధ్య మేర్పడిన రాజ్యాంగరంగజీవనము నిస్సారమగును. భేదములు సుస్థిరము లగును. బ్రాహ్మణేతరుల యుద్బోధమునకు ప్రత్యేకసంఘప్రాతినిధ్యము తోడ్పడుట సత్య మైనను, ఈ ప్రాతినిధ్యము సంఘముఖమునఁ గాక ప్రదేశనిర్వాచనసాధనమున సఫల మగుట భావిరాజ్యాంగవికాసమునకు ప్రబలసాధనము. బ్రాహ్మణనాయకులు బ్రాహ్మణేతరనాయకులు గలిసి ఈ క్లిష్టసమస్యను సమర్థించుట సమంజసము. ప్రత్యేకసాంఘికప్రాతినిధ్యము సంఘముఖమున దుస్తర మను విషయము బ్రాహ్మణేతరసంఘమును గ్రహింపవలయును. బ్రాహ్మణేతరసంఘమునకు బ్రాహ్మణేతరత్వము సమానధర్మము. ఒక కులస్థులు వేఱొక కులస్థుని ప్రాతినిధ్యము నంగీకరింపరు. శాసనసభయందు కెబ్బది కులములకు ప్రాతినిధ్యము దుర్లభము. ప్రతికులమునకును ప్రత్యేకప్రతినిధి యేర్పడినపుడు శాసనసభలు కులసభలుగ పరిణమించును. సాంఘికప్రాతినిధ్యము ప్రదేశముఖమున సాధ్య మైనపుడే కష్టములు తొలఁగఁగలవు. దేశక్షేమమునకు జాతీయైక్యమునకు రాజ్యాంగబలమునకు సాధనం బైన ప్రాతినిధ్యసమస్యను దేశాభిమానులు స్వప్రయోజనాభావ మైన సమదృష్టితో నవలోకింప దగుగాత! బ్రాహ్మణేతరులు ముఖ్యముగ జమీందారులు కోరెడి ప్రత్యేకస్వామ్యసంరక్షణార్థము రాష్ట్రపరిపాలనములందు నయితము శిష్టసభలను స్థాపించుట యుచితమని కొందఱు తలఁచుచున్నారు. శిష్టసభ పూర్వస్థితిప్రియులకు విశ్వాసమును సంతృప్తిని కలుగఁజేయఁగలదు. శిష్టసభలు సత్వరరాజ్యాంగాభివృద్ధి కాటంకములనుట నిర్వివాదాంశము. వర్తమాన సందిగ్ధదశయందు భిన్నాశయములు పక్షములకు సంతృప్తిని కలుగఁజేయుటకు సాధనము గావచ్చును. మోంటేగు గారి సంస్కరణవిధానమునం దీ విషయమునకు ప్రముఖత కలుగునని వదంతి గలదు.

స్వదేశసంస్థానములు

మహాసభల సంస్కారణవిధానమునందు స్వదే

సంస్థానముల స్థితి నిర్ణయింపఁబడలేదు. భరతఖండము నందు మూఁడవవంతు వైశాల్యము నాక్రమించియున్న స్వదేశసంస్థానముల స్థితి నిర్ణయ మైనఁగాని భారత సామ్రాజ్యస్థితి నిర్ణయము గాదు. హిందూదేశమునందు 675 సంస్థానములు గలవు. సంస్థానములందు స్వల్పవైశాల్యము గల సంస్థానములు మహావైశాల్యము గల సంస్థానములు గలవు. సంస్థానములకును బ్రిటీషు సామ్రాజ్యమునకును సన్నిహిత సంయోగ సాహచర్యములు సుస్థిరముగ స్థాపిత మగుట హిందూ సామ్రాజ్య నిర్మాణమునకు కీలకము. వర్తమాన కాలమునందు స్వదేశసంస్థానముల వ్యవహారములను విమర్శించుటకు రాజప్రతినిధికి స్వాతంత్ర్యము గలదు. సంస్థానములకు సామ్రాజ్యమునకుఁ గల సంబంధములను సంధులు నిర్ణయించినవి. పెద్ద సంస్థానములందు రాజప్రతినిధి నియమించిన రెసిడెంటులు స్వదేశసంస్థానముల వ్యవహారములను పరిశీలించుచుందురు. రాజ్యాంగవ్యవహారములందు సంస్థానముల ప్రజలకును బ్రిటీషు ఇండియా ప్రజలకును సంబంధము లేదు. సంస్థానాధీశులు తమ వ్యవహారములందు బ్రిటీషు ఇండియా ప్రజల ప్రమేయము నంగీకరింపరు. బ్రిటీషు ఇండియా ప్రజలును తమ వ్యవహారములందు సంస్థానాధీశుల ప్రమేయము నంగీకరింపరు. ముఖ్యసంస్థానముల స్వాతంత్ర్యరక్షణము సంస్థానములకును బ్రిటిషు ఇండియాకును సామ్రాజ్యవ్యవహారములందలి సంధానము భారత సామ్రాజ్యమునకును సాధనములు. స్వదేశసంస్థానములకును సామ్రాజ్యాధికారమునకును గల సంబంధములును సంస్థానాధీశులకును సంస్థానప్రజలకును గల సంబంధములును సంపూర్ణముగ మారుట సామ్రాజ్యనిర్మాణమునకును సామ్రాజైక్యమునకును బలమునకును మూలము. ఏతత్ఫలము సమకూర్చుటకై బ్రిటీషు రాజ్యాధికారులు సంస్థానాధిపతులు నాయకులు ప్రజలు పని పూనుట యవశ్యము. మాంటేగు గారి సంస్కరణవిధానమునందీ విషయమునకు ప్రముఖత యుండు నని తోఁపదు. పూర్వస్థితిప్రియు లైన యాంగ్లరాజనీతిజ్ఞులు సంస్థానముల వ్యవహారసంబంధములను మార్చుట కుపక్రమించుట యసంభవము. భరతఖండాభ్యుదయమునకును సంస్థానముల యభ్యుదయమునకును సంస్థానసంబంధముల సంస్కరణనిర్ణయ మవశ్యము. సంస్థానములకును ప్రజానియమిత కేంద్రాధికారమునకును ననుబంధ మేర్పడినఁ గాని సామ్రాజ్యమునందుఁ గల సకలాంతర్భాగములకును సాహచర్యము సంరక్షణము దుర్లభము. సామ్రాజ్యమునందు సకలభాగములు సమానముగ భారము నిర్వహించుటకు సామ్రాజ్యసభయందు సకల భాగముల ప్రతినిధులకును ప్రవేశము కలుగుట యవశ్యము.

రాష్ట్రముల యొక్కయు సంస్థానముల యొక్కయు పునర్నిర్మాణము అవశ్యము.

సంస్థానములందును రాష్ట్రములందును క్రొత్త ప్రదేశములను చేర్చియు ఉన్న ప్రదేశములను తగ్గించియు భాషకును జాతికిని సాంప్రదాయాచారములకును అనురూపముగ రాష్ట్రములను సంస్థానములను పునర్నిర్మాణము చేయవలయును.

ముఖ్యసంస్థానములకు రాష్ట్రముల హోదా నిచ్చుట సమంజసము.

సామ్రాజ్యప్రతినిధి శాసనసభయందు ప్రజానియుక్తు లైన రాష్ట్రముల ప్రతినిధులకును సంస్థానముల ప్రతినిధులకును ప్రవేశము కలుగవలయును.

సామ్రాజ్యశిష్టసభయందు పాలితనియుక్తు లైన రాష్ట్రముల ప్రతినిధులకును సంస్థానముల ప్రతినిధులకును ప్రవేశము కలుగవలయును.

ముఖ్యసంస్థానములందు రాష్ట్రములందుఁ గల స్వపరిపాలనవిధానము స్థాపితము గావలయును.

స్వయంపోషణమున కననుకూలము లైన సంస్థానముల రాజ్యవ్యవహారములు బ్రిటీషుభాగముల వ్యవహారములందు మేళగింపవలయును.

అఖిలసామ్రాజ్యమునకును ధర్మశాసనములు శిక్షాస్మృతులు సమానముగ నుండవలయును.

సంస్థానములందు నియమితపాలనము స్థాపిత మయి ప్రజాస్వామ్యత్వము స్థాపితము గావలయును.

సంస్థానములందు రెసిడెంటులను తీసివేసి సంస్థాన

ముల వ్యవహారనిర్వహణభారమును సామ్రాజ్యపాలకులు వహింపవలయును.

అఖిల భారతీయ న్యాయాభియోగవిమర్శనమునకు ప్రీవి కౌన్సిలు స్థాపితము గావలయును.

ఉన్నతోద్యోగములందు సంస్థానములకును రాష్ట్రములకును వినియమ ముండవలయును.

రాష్ట్రములకు సంస్థానములకు పరిపాలనవిధానమునందును సామ్రాజ్యభారనిర్వహణమునందును స్వామ్యత్వము సమానబాధ్యత యుండవలయును.

మహాసభలు నిర్ణయించిన సంస్కరణవిధానము నందు సంస్థానముల ప్రమేయము కారణాంతరములవలన తలపెట్టకపోయినను భారతసామ్రాజ్యస్థితికి సంస్థానముల రాజ్యాంగ సంస్కరణమును నవశ్య మని విచారజ్ఞులకు విశద మగుచున్నది.

ఆంధ్రోద్యమము

గతసంవత్సరమునం దాంధ్రోద్యమమునకు సంప్రాప్తమైన యనుకూలప్రతికూలపరిస్థితు లుద్యమమున కుత్తేజనావసరములను కలిగించినవి. నెల్లూరునందుఁ గూడిన మైనవ మహాసభలో ప్రతిపక్షులు చతుర్విధోపాయములచేతను సభోద్దేశమునకు భంగము కలిగింప సమకట్టిరి. సభ్యుల యుత్సాహము దైవానుకూల్యమును విజయమును సమకూర్చినవి. ఆంధ్ర రాష్ట్రపు నిర్మాణ మంగీకరింపఁబడినది. విజయవాటికయందుఁ గూడిన యవసరాంధ్రసభకు చింతలపాటి వేంకటనరసింహరాజు గా రగ్రాసనాధిపత్యము వహించిరి. ఆ సభయం దేక గ్రీవముగ నాంధ్రరాష్ట్రపు నిర్మాణ మామోదింపఁబడినది. ఆంధ్ర ప్రముఖులు చెమ్సుఫర్డు ప్రభువునకును మాంటేగు గారికిని వారి సహచరులకును సమర్పించిన విన్నపమునందు భాషాప్రయుక్తరాష్ట్రసిద్ధాంతమును ఆంధ్ర రాష్ట్రనిర్మాణావశ్యకతయు విశదము చేయఁబడినవి. ముప్పది రెండవ జాతీయమహాసభ యధ్యక్షురాలు బెజంటమ్మ గారు ప్రారంభోపన్యాసమునందు భాషాప్రయుక్తరాష్ట్రావశ్యకతను వ్యక్తము చేసిరి. కలకత్తాయందుఁ గూడిన జాతీయమహాసభయం దాంధ్రదేశమునకు ప్రత్యేకరాష్ట్రోపసంఘ మొసఁగఁబడినది. ఆంధ్రదేశమునకు ప్రత్యేక రాష్ట్రోపసంఘ మేర్పడినది. సుప్రసిద్ధులు న్యాపతి సుబ్బారావు పంతులు గా రధ్యక్షులు. ప్రత్యేక రాష్ట్రోపసంఘమునకు ప్రతిపక్షులు గుత్తి చిత్తూరులం దేర్పడి జాతీయమహాసభోద్దేశమును ప్రతిఘటించుట కుపక్రమించిరి. చెన్నరాష్ట్రోపసంఘమునందుఁ గల ద్రావిడ సోదరులు ప్రతిఘటకులకు తోడ్పడిరి. చిత్తూరు బళ్లారి యనంతపురము మండలములు చెన్నరాష్ట్రోపసంఘమున కుపసంఘములుగ నుండు నని కేశవపిళ్లె గారు ప్రకటించిరి. పిళ్లె గారు జాతీయమహాసభా కార్యదర్శులం దొకరు. కార్యదర్శి మహాసభా ప్రతిపాదనమునకు ప్రతిఘటించుట న్యాయవిరుద్ధము. శ్రీరంగనీతులను బోధించెడి నాయకులె స్వవిషయమునందు న్యాయసూత్రముల నతిక్రమించుట యనాచారము. కేశవపిళ్లె గారి ప్రకటనము నిందాభాజనము. కేశవపిళ్లె గారికి గుత్తియందు నన్యాయాభిమాన ముండుట సహజము. గుత్తియు ననంతపురము మండల మని భ్రమపడుట యన్యాయము. అసంబద్ధ భావభరిత మైన పిళ్లె గారి లేఖ యుండుట యప్రస్తుతము. కేశవపిళ్లె గారు ఆంధ్రోద్యమమునందు కూడ స్వయంనియోగధర్మమును నవలంబించుట ధర్మ మని నిర్ణయించిరి. స్వరాజ్యసిద్ధాంతమునకు స్వయంనియోగ సిద్ధాంతము నన్వయింపఁ జేసిన పిళ్లె గారి నిర్ణయసామర్థ్యము విశద మగును. స్వయంనియోగసిద్ధాంతనిర్ణయమునకు స్వాధికసంఖ్యలు ప్రమాణము గాని ప్రత్యేకవ్యక్తి భావోత్కర్షము ప్రధానము గాదు. పిళ్లె గారి సిద్ధాంత మంగీకృత మైన ప్రజాస్వామ్యత్వ మసంభవము. ప్రతిఘటనము పరిపాలనమునకు ధర్మసూత్రము.

ఆంధ్రోద్యమ ప్రయోజన మధిక సంఖ్యాకులైన యాంధ్రులకుఁ గలదా, యాంధ్రోద్యమతత్త్వము అధికసంఖ్యాకులైన యాంధ్రుల యామోదమును పడయుచున్నదా యను సమస్యలు విమర్శనార్హములు. ఆంధ్రోద్యమము ప్రత్యేక ప్రదేశముల సౌకర్యమునకును ప్రత్యేకవ్యక్తుల ప్రయోజనమునకును ప్రతికూల మైనను ఆంధ్రలోకాభ్యుదయమునకు పరమసాధన మని రాజనీతిజ్ఞులు తలఁచుచున్నారు. స్వపరిపాలనసంవిధానము గల రాష్ట్రస్థితికి భాషాప్రయుక్తరాష్ట్రములు సాధనంబు లని

Sir M VISVESWARAYYA C I E



సర్ ఎమ్. విశ్వేశ్వరయ్యా గారు,
సి. ఐ. ఇ.

LOK. B. G TILAK



లోకమాన్య బాలగంగాధరతి



గౌ. పి. కే. రామానుజాచారియారు గారు

The Hon'ble
RAMANUJA CHARIAR



గౌ. సర్ ఎస్. పి. సిన్హా గారు

Hon'ble C.P.RAMASWAMY IYER



సి. పి. రామస్వామయ్యరు గారు

N

BRAHMANANDA TIRTHA SWAMI



బ్రహ్మానందతీర్థస్వామి

B VENKATARAYADU GARU

బరు

MR. A. LAKSHMINARAYANA GARU



ఆర్యసోమయాజుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారు

MR R. GIRI ROW



రాయచోటి గిరిరావు గారు

JAGANNATHAIYA GARU



జగన్నాథయ్యగారు

బంగాళీలు ఓఢ్రులు కన్నడులు మహారాష్ట్రులు ఆంధ్రులు రాజ్యాంగ సంస్కరణ విచారోపసంఘమునకు విన్నవించిరి. అధిక సంఖ్యాకుల మతముతో నల్పసంఖ్యాకు లేకీభవించుటయే ప్రజాస్వామ్య స్వపాలనమునకును స్వయంనియోగమునకును కీలకము. స్వపరిపాలనాసంస్థాపనముల కల్పసంఖ్యాకుల భావపకర్షణము విష ప్రదానము. ఏకధర్మము స్వప్రయోజనమున కొక రీతిని పరప్రయోజనమునకు వేఱొక విధమునను వర్తింపనేరదు. ఆంధ్ర దేశాభిమానులు మహోదాద్యసుప్రయోజనములను స్వప్రయోజనార్థము గాక దేశహితార్థమై వినియోగించి మాతృదేశాశీర్వాదంబులను పడయుదురుగాత!

"బ్రిటీషు ఇండియాయందు స్వపరిపాలన ప్రతిష్ఠాపనలు ఫలప్రదము లగుటకు రాష్ట్ర ప్రదేశములను పునర్విభజనము చేయుచు నవసరమైన చోట రాష్ట్రముల నేర్పఱుపవలెను.

2. ఏ తైన చోట ఏ తైనంతెవఱరును ముఖ్యముగ నొకే భాషను మాటలాడువారి సంఖ్య హెచ్చి యున్నప్పుడును అట్టి మార్పును వారు కోరునప్పుడును భాషాధారముగ చేయవలయును.—

అని ఈ సభవారు గవర్నరు జనరలు గారికి సూచించుచున్నారు."

సామ్రాజ్యశాసనసభయందు బచ్చూ వరసుబ్రహ్మేశ్వర శర్మ గారు భాషాప్రయుక్తిరాష్ట్రనిర్మాణావశ్యకతను తెలుపుచు ప్రతిపాదించిన మైతీర్మానము నిరాకృతమైనను విషాదమున కవకాశము లేదు.

ఉపపాదనప్రయోజనము సమకూడినది. భాషాప్రయుక్తిరాష్ట్రనిర్మాణసమస్య జాతీయసమస్యగ పరిణమించినది. ఆంధ్ర దేశసమస్య అఖిలభారతీయ సమస్యగ పరిణమించినది. భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణ సిద్ధాంతము రాజ్యాంగసంస్కరణపరాయణుల దృష్టి నాకర్షించినది. అధికారుల చిత్తము నాకర్షించినది. మహారాష్ట్రనాయకుల సానుభూతిని పడసినది. ఆంగ్లవిద్యాసంభవుల సంకుచితభావమును వ్యక్తము చేసినది. ఆంధ్రుల కర్తవ్యము పరిస్ఫుటమైనది. గత సంవత్సరమునం దాంధ్రోద్యమమునకు నూతనోత్తేజనము కలిగినను ఆంధ్రోద్యమఫలప్రాప్తి సులభము గాదు. ఆంధ్రదేశమునందు సంశయాత్ములు గలరు. ప్రతిఘటనసమర్థులు గలరు. స్వప్రయోజనపరాయణులు గలరు. పరిపాలనాసౌకర్యమును సంపద్వృద్ధియు విద్యావ్యాపనమును స్వపరిపాలనావికాసమును తన్మూలమున నాంధ్రత్వప్రాప్తియు ఆంధ్రోద్యమమునకు మహాఫలములు. ఇమ్మహాఫలప్రాప్తి కాంధ్రపుత్రులు వ్యక్తిభేదమును ప్రదేశభేదమును కులభేదమును జాతిభేదమును మతభేదమును స్థితిభేదమును గమనింపక పాటుపడి కామితార్థములను పడయుట వివేకము, ధర్మము.

స్థానిక స్వపరిపాలనము

మహాసభల సంస్కరణవిధానము పర్యాప్తంబైన, స్థానికస్వపరిపాలనము సులభముగ లభించును. మండలాధిపతులకును ఇతరాధికారులకును గల కేంద్రీకృత నిరంకుశాధికారము అదృశ్యంబైన అధికారవిభజనమును స్థానికస్వపరిపాలనమును సుసాధ్యములు. మహాసభల విధానమునందు స్థానికస్వపరిపాలనప్రణాళిక వివరింపబడలేదు. భరతఖండమునందు ప్రజాప్రాధాన్యతాయుతమైన పరిపాలనము సార్థకమగుటకు స్వపరిపాలనవిధానము గ్రామసీమలం దారంభము గావలయును. మూడువంతులు ప్రజలకు గ్రామసీమలు నివాసస్థలములు. ప్రజాపోషణమునకు రాజ్యపోషణమునకు గ్రామసీమ లాధారములు. వ్యవసాయము జీవనాధారము. గ్రామసీమల దుస్థితియే దేశపు దుస్థితికి నిదర్శనము. అధికారులును అధికారవర్గాభిమానులును గ్రామస్థులు సంస్కరణముల వాంఛించుట లేదనియు గ్రామస్థుల యోగక్షేమములే పరిపాలనమునకు లక్ష్యమనియు నిరంతరము ఘోషించుచుందురు. నూటేండ్ల బ్రిటీషు పరిపాలనము గ్రామస్థులకు విశేషమైన లాభములను సమకూర్పలేదు. గ్రామసీమలందు ప్రజాక్షేమమున కవశ్యములైన విద్యాలయములు లేవు. వైద్యాలయములు లేవు. మార్గములు లేవు. ధనాగారములు లేవు. న్యాయస్థానములు లేవు. ప్రజల యోగక్షేమాభివృద్ధికి సకలసంస్కరణములు గ్రామసీమలం దారంభము గావలయును. గ్రామసీమలం దధికారశృంఖలబద్ధము గాని గ్రామపంచాయతీసభలను స్థాపించి ప్రజలయం దాత్మగౌరవ

మును ఆత్మవిశ్వాసమును కలుగఁజేయుట స్వపరిపాలన సాధనిర్మాణమునకు మూలాధారము. పునాదులందు బలము లేని నిర్మాణము నిలువనేరదు. పాలకపాలితుల సంస్కరణాభిలాష శాసనసభల వైపు మరలినదే గాని గ్రామపంచాయతీ సభలపై ప్రసరింపలేదు. విశాలమైన ప్రజానిర్వాచితసభ్యత గల గ్రామపంచాయతులు స్వపరిపాలనస్థితికి సాధనములు. పరిశ్రమపోషితము లైన పాశ్చాత్యదేశములందు ప్రజలకు పట్టణములు వాసస్థలములు. వ్యవసాయపోషిత మైన భరతఖండమునందు ప్రజలకు గ్రామములు వాసస్థలములు. దేశస్థితికిని ప్రజాస్థితికిని తగిన రాజ్యాంగవిధానము ప్రజావికాసమునకు సాధనము. పట్టణాధిష్ఠిత మైన పాశ్చాత్యరాజ్యములందు రాజ్యసభ కధికప్రయోజన మేర్పడుటయు గ్రామాధిష్ఠిత మైన భరతఖండమునందు గ్రామసభల కధికప్రయోజన మేర్పడుటయు ప్రకృతిధర్మము. గ్రామసీమలందు స్వపరిపాలనసంస్థాపనలు స్థాపితము లైన స్వపరిపాలనవిధానము ఫలవంతమై దేశాభ్యుదయము సుసాధ్య మగును. లోకమునం దవకాశరహిత మైన కార్యనిర్వహణ మసంభవము. ప్రజల కవకాశములు కలిగినపుడె వారి కార్యనిర్వహణసామర్థ్యము వెల్లడి యగును. చిరకాలసంవర్ధిత మైన ధర్మానురక్తి ప్రజలయందు ప్రచ్ఛన్నముగ కలదు. అవకాశములు కలిగినపుడు ప్రచ్ఛన్నమైన ప్రజాశీలము వ్యక్తము కాఁగలదు. సామ్రాజ్యశాసనసభ రాష్ట్రీయశాసనసభలు సంస్కరింపఁబడి ప్రజాప్రతినిధుల బలము హెచ్చినను గ్రామసంస్థాపనలు ప్రజాధికారబద్ధములు గానపుడు స్వపరిపాలనము వికారాకృతిని గలిగి నిస్సహాయమై ప్రయోజనరహితముగ నుండును.

ఉపసంహారము

శ్లో. హతోవా ప్రాప్స్యసి స్వర్గం జిత్వావా భోక్ష్యసే మహీం
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః.

మాతృభూమికి విషమదశ సంప్రాప్త మాయెనది. లోకము ప్రబోధమయమై ధనుర్ధారియై స్వాతంత్ర్యసంరంభావృతమై నూతనాకృతిని దాల్చుచున్నది. అష్టదిశలందును యుద్ధధ్వని మాఱుమ్రోఁగుచున్నది. సకలరాజ్యములందును యుద్ధసన్నాహములు చెలరేఁగుచున్నవి. యుద్ధ మనంతరూపముల విహరించుచున్నది. లోకానృతం బైన స్వాతంత్ర్యప్రతిష్ఠాపనము మహాసంగ్రామమునకు ఫల మని రాజనీతిజ్ఞులు ఘంటాపథముగ చాటుచున్నారు. జార్జిచక్రవర్తియు లాయిడుజార్జియు మన్నుపర్దు ప్రభువును సామ్రాజ్యసంరక్షణమునకు భారతీయుల సాహాయ్య మవశ్య మని తెలుపుచు సందేశములను ప్రకటించిరి. సామ్రాజ్యావకాశము హిందూదేశమునకు సమయ మని చక్రవర్తి తెలిపెను. లబ్ధావకాశములను భారతీయు లుపయోగించుట వివేకము. భారతయోధులు యుద్ధారంభమునుండియు వివిధ రణరంగములందును సామ్రాజ్యసంరక్షణమునకు ప్రాణములను ధారవోసిరి. పాశ్చాత్యసభ్యతను ఫ్లాండర్సు రణరంగమునందు భారతీయసైన్యనివహములు రక్షించినవి. యుద్ధనిర్వహణమునకై సంస్థానాధిపతులును ప్రజలును అపార మైన సాహాయ్యమును చేసిరి. సామ్రాజ్యావసరముల కవశ్యమైన సైన్యబలమును సిద్ధము చేయుటకు భరతఖండమునకు మాత్ర మవకాశము గలదు. భరతఖండమునకుఁ గల యవకాశంబులను విజృంభణము చేయుట రాజనీతికి ఫలము. ఏప్రిలు మాస మంతమునందు ఢిల్లీనగరమునఁ గూడిన మహాసభలో యుద్ధనిర్వహణార్థము సామ్రాజ్యమునకు సకలవిధముల సహకారముగ నొప్పుట ధర్మ మని సభ్యు లంగీకరించి సాధనంబుల నిర్ణయించిరి. నిర్వహణ సాధనంబులను నిర్ణయించుట సులభ మైనను నిర్వహణము దుర్లభము. నిరాయుధు లైన భారతీయులందు రణోత్సాహము నశించినది. రణోత్సాహమునకు ప్రాణ మైన దేశంతిణాభిలాష యస్పష్ట మైనది. యోధవృత్తియందు పాశ్చాత్యులకుఁ గల గౌరవ ప్రతిపత్తులు భారతీయులకు లేవు. సామాన్యయోధున కొసఁగెడి వేతన మల్పము. పురోవృద్ధికి వలయు నవకాశము లల్పములు. ఇట్టి సందిగ్ధస్థితియందు భారతీయులలో రణోత్సాహమును ప్రజ్వలింపఁజేయుట కుపాయములను పాలకు లవలంబించినఁ గాని మహాసభయందు నిర్ణయించిన యుద్ధనిర్వహణసాధనసంపత్తి దుర్లభము. భారతీయులకు మాతృదేశసంరక్షణమునందును సామ్రా

జ్య సంరక్షణమునందును అభిమాన ముద్భవించునట్లు పాలకు లుదారమార్గము నవలంబింపవలయును. దేశసంరక్షణ మలంఘనీయ మైన ధర్మ మైనను సంరక్షణభార నిర్వహణమునందు ప్రయోజన మేర్పడవలయును. కపర్ది గారు యుద్ధనిర్వహణసభయం దుపపాదింపఁదలఁచిన ప్రతిపాదన మీా ప్రయోజనమును వ్యక్తపఱచినది. కాంచీపురమునందు చెన్నరాష్ట్రీయసభలో ప్రకటిత మైన సంకుల మీా ప్రయోజనమును ప్రకటించినది. దేశపరిపాలనమునందు బాధ్యత గల ప్రజలు దేశసంరక్షణమునందును సహజముగ బాధ్యత వహింతురు. పరిపాలనసంరక్షణభారములందే భారవహనము ముఖ్య మను విషయము ప్రజలలో కలవరమును పుట్టించుచున్నది. యుద్ధనిర్వహణభారము ముఖ్య మైనను పరిపాలనభారము లేనపుడు నిర్వహణభార మసాధ్య మని ప్రపంచచరిత్ర యనంతముఖముల చాటుచున్నది. భారతీయులును సర్వసామాన్య మైన ధర్మావలంబనమును కోరుచున్నారు. ఇందు వైపరీత్యము లేదు. ప్రయోజనమును కోరుట నేర మాపుట యని యధికారివర్గాభిమానులు నాయకుల నాక్షేపించుచున్నారు. ఈ యాక్షేపణలను చేయు నధికారవర్గాభిమానులు స్వప్రయోజనరక్షణపరాయణులు. ప్రయోజనాపేక్ష లేకయే యుద్ధనిర్వహణమునకు సహాయము చేయుట మహాత్మ గాంధి గారు పదేశించినట్లు శ్రేయస్కరం బైనను లోకప్రవృత్తియం దసంభవము. ఐర్లాండు రాజ్యాంగసమస్య దీనికి ప్రబలప్రమాణము. ఐర్లాండునందు స్వరాజ్యమును స్థాపించుటకు ఆంగ్లరాజనీతిజ్ఞులు సకలవిధముల ప్రయత్నించుచున్నారు. అయిర్లాండునం దవలంబించిన మార్గమునె భరతఖండమునందును అవలంబించుట భారతీయులలో రణోత్సాహమును వికసింపఁజేయుటకును యుద్ధనిర్వహణసాధనములను పడయుటకును సాధనము. మహాసభలు నిర్వచించిన సంస్కరణవిధానము స్వరాజ్యప్రాప్తికి సోపానమే గాని స్వరాజ్యప్రదానము గాదు. బ్రిటీషు పరిపాలకులు మహాసంగ్రామ నిర్వహణమున కవలంబించిన ధర్మసూత్రమును భరతఖండమునందును అవలంబించుట ధర్మము. కృష్ణుఁడు అర్జునుని హృదయమునందు రణోత్సాహమును పుట్టించుటకై "గెలిచిన రాజ్యమును చచ్చిన స్వర్గమును పొందఁగలవు." అని చేసిన మహోపదేశము వర్తమానసందిగ్ధదశయందు పాలకులును ప్రజలును శిరసా వహింపఁ దగియున్నది. పాలకులును పాలితులును మహాసంగ్రామమువలన సంప్రాప్తం బైన మహదవకాశంబుల మాతృదేశసంరక్షణమునకై వినియోగించి సుభిక్షయు సుశోభితయు సుప్రతిష్ఠాపితయు సుప్రసన్నయు నైన మాతృస్వరూపమును సందర్శించి యానందించెదరుగాత!

# జాతీయత

## మల్యాల సాంబశివరావు గారు, బి. ఏ.

“మన జాతీయత అసహనపూరితముగా గాని స్వార్థపరత్వపూరితముగా గాని యుండరాదు, అది ప్రప్రథమమున భారతదేశము నందును పిమ్మట ప్రపంచము నందును గల ప్రేమవలన కలిగినదై యుండవలెను. సేవయే జాతీయతయొక్క పరమావధి. రాజకీయాధ్యాత్మిక విషయములందు మనము పాశ్చాత్యనాగరకతను చేతిక్రింద నున్నంత కాలము మనము మానవసేవ చేయుట దుస్సాధ్యము గాన, ఆత్మస్వాతంత్ర్యలబ్ధికై కృషి సల్పుటయే మన విధ్యుక్తధర్మము” ఆనంద శ్రీ కుమారస్వామి

ప్రస్తుతకాలమున ప్రపంచమం దంతటను జాతీయాభిమానమును ప్రత్యేకజాతివ్యక్తిత్వమును స్థిరపఱచు నాశయము వ్యాపించుచుండుట విషయము మెల్లరకును తెలిసియే యున్నది. ఈ జాతీయతాభావములు 19-వ శతాబ్ది యూరోపాఖండమున నుద్భవించి యెల్లెడల వ్యాప్తము గాంచి మానవుల మానసముల గలవరపఱచుచున్నవి. ఇంతకు పూర్వము జాతీయతాభావములు విశ్వమానవసౌభ్రాతృత్వాశయములకు భంగకరము లనియు అందుచే నవి మానవాభ్యుదయమునకు మార్గనిరోధకము లనియు పాశ్చాత్యులు భావించుచుండిరి. కాని, గతశతాబ్దినుండియు అట్టి యభిప్రాయములు మార్పు చెందినవి. మానవసోదరత్వసిద్ధికి ప్రతిజాతియు ప్రత్యేకవ్యక్తిత్వము గలిగి ప్రత్యేకప్రభుత్వము నంది తన న్యాయమున నాత్మోపలబ్ధిని గాంచుట యావశ్యక మని పాశ్చాత్యరాజనీతిధురంధరు లంగీకరించి యున్నారు. మానవాభ్యుదయమునకు ప్రతిజాతియొక్క సహాయమును అత్యావశ్యకము. ప్రపంచములోని వివిధజాతుల నాగరికతలయు నేకరీతిగ నుండజాలదు. ప్రతిజాతియందును గల ప్రతిభయు నాగరకతయు లక్షణములును మానవజాత్యుద్ధరణమునకు తోడ్పడగలవు. కావున, ఏ జాతియైనను తన సహజలక్షణములను పెంపొందించుకొనకపోయిన యెడల అది మానవాశయమునకు భంగము కలిగించిన దగును. ఈ యభిప్రాయము లన్నియు కాలక్రమమున అనేక కారణములచే అందు ముఖ్యముగ నాంగ్లేయపరిపాలనముచే భారతదేశమున వ్యాపించి ప్రజల మానసములయందు వేరులు నాటుకొనుచున్నవి. ప్రాచీనకాలమున మన మాతృభూమి నాగరకమున నేమి విజ్ఞానసంపన్నతయం దేమి వాణిజ్యాభివృద్ధియం దేమి సాంఘికవిషయములయం దేమి మతబోధయం దేమి సాటి దేశములలో నాయకత్వము వహించి మానవాభివృద్ధి కమితసహాయము గావించి పేర్వడసినది. కాని, ఇక్కాలమున కొన్ని కారణములచే హిందూదేశము తన పూర్వపు ఔన్నత్యము గోల్పోయినది. అనేకనాగరకతలును అనేకజాతులును దేశము నాక్రమించుకొని పరిపాలించినవి. అయినను పాశ్చాత్యదేశీయసంసర్గము మూలకమున మన దేశము నిద్రావస్థనుండి మేల్కాంచి మరల తన యున్నతస్థాన మాక్రమించి మానవసేవ చేయవలె నని కుతూహలపడుచున్నది. ఈ యాశయము చేకూరుటకు పూర్వము స్వీయాభివృద్ధికై కృషి సలిపి తన నాగరకతను పునరుజ్జీవితము గావించుకొని తన ప్రతిభను పెంపొందించుకొని తన వ్యక్తిత్వమును స్థిరపఱచుకొని ప్రపంచమందలి దేశములలో గౌరవస్థాన మాక్రమింపవలసియున్నది. ఇదియే భారతజాతీయతాసమస్య.

### పాశ్చాత్యజాతీయత

పాశ్చాత్యజాతీయత యుద్ధశీలికలక్షణసమన్వితము. ఒక సంఘమునందు వ్యక్తు లెల్లరును అన్యోన్యసాహాయ్యము గావించుకొనుచు ప్రేమపూరితమానసములతో పరస్పరభ్రాతృవాత్సల్యముతో మెలంగుచుండుట సహజము. కాని, పాశ్చాత్యదేశపరిస్థితు లిట్టి సహజస్థితికి భంగము కలిగించిన వని చెప్పనగును. అప్పటి ప్రథమమునుండియు నేకజాతి గలవారే ఏకప్రదేశమున నుండుటచే మన దేశమునందు వలె అంతస్సాంఘికసమస్య లెవ్వియు వారి కెదురుకాలేదు. మరియు, వారి చుట్టుప్రక్కల బలసంపన్నులును సంగ్రామాభిలాషులు నగు జాతులు నివసించుచుండుటచే నిరంతర మాత్మసంరక్షణము వారి కత్యావశ్యక మాయెను. కావున, వారు స్వాధికారప్రాబల్యమునకును ఇతరజాతుల దుర్బలత్వమునకును కృషి సలుపవలసివచ్చినది. అందుచే వారలో ద్రవ్యార్జనాకుతూహలము హెచ్చె. అన్యోన్యవైమనస్యము లధికము. ఇట్టి స్థితిగతులలో జీవితసాగరమునందగు ననన్యోన్యప్రేమభావము లెట్లుత్పన్నములు కాగలవు? తత్ఫలితముగ స్త్రీపురుషులకును ధనికదరిద్రులకును తీరని వైరము సంఘటిల్లుచున్నది. స్వార్థపరత్వము ప్రాబల్యము గాంచుచున్నది.

ఇట్టి జాతి మానవపురోవృద్ధి కుపకరించుట సాధ్యమా? ఎదిటివారు బలవంతులైన నిది సహింపజాలరు. ఎల్లప్పుడును ఇతరులు తమకు లోబడియుండవలె ననియే తలంపు. ఇందు మూలమున ప్రపంచమం దంతటను స్వార్థపరత్వము వ్యాపించి సోదరభావములకు బదులు శత్రుభావములు ప్రబలుచున్నవి. నూతనముగ ప్రాముఖ్యము నంది ప్రాగ్దేశతిలకమువలె ప్రకాశించుచున్న జపాను దేశము సైతము పాశ్చాత్యాభిప్రాయానుగుణముగనే వర్తింపక తప్పినది కాదు. మీ రేల యిట్లు స్వీయసాంప్రదాయవిరుద్ధముగ పాశ్చాత్యజాతీయత ననుకరింపజొచ్చెద రని ప్రశ్నించినపు డొక జపానీయుం డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను: “అట్టి జాతులు ప్రపంచమున ప్రబలముగ నున్నంతకాలము మా యాధ్యాత్మికజీవనౌన్నత్యమును పెంపొందించుకొనుట కవకాశము లేదు. దౌష్ట్యనివారణము గావించుటకు మేమే దుష్టుల మగుట యావశ్యము. ఆధునికప్రపంచమున పశుబలముకంటె వేఱొండు

ఘరించుచున్నది. ముప్పది వత్సరములకు పూర్వము మన విద్యాధికుల యందున్న దేశభక్తి విదేశీయస్వభావము గలదిగ నున్నది. ఆ కాలపు వారికి ఆంగ్లసారస్వతమును ఆంగ్లదేశస్వార్థత్యాగులగు పిమ్ హాంప్డెను మున్నగువారి చరిత్రలును భావోద్రేకజనకములుగ నుండెను. పాశ్చాత్యనాగరికతయందుఁ గల సంపూర్ణాభిమానముచే వారు తమ జాతీయపరిస్థితులను జాతీయాశయమును సంపూర్ణముగ విడిచియుండిరి. కావున, వారి దేశభక్తి నిర్మాణసాధనము గాక నిర్మూలకారణముగ పరిణమించినది. విదేశీయపద్ధతుల ననుసరించి, దేశోద్ధరణమునకై చేయు ప్రయత్నములు విఫలము లగుటచే నిప్పుడు భారతజాతి లక్షణములను గుణములను వ్యక్తిత్వమును స్థాపించి ప్రాచీన హిందూయశోప్రదాయముననుసరించి వర్తించుట యవశ్యమని మన వారు గుర్తించిరి. ఆ కారణముననే మన దేశచరిత్రమునందును దేశాచారములయందును దేశలక్షణములయందును దేశకళలయందును దేశప్రతిష్ఠాపనములందును నేఁడు అభిమానము వృద్ధి యగుచున్నది. ఈ దేశభక్తి యింకను దేశజుల మానసములలో దృఢముగ వేరులు పాఱుటకీ భావములను కవులును గ్రంథకర్తలును జాతీయనిర్మాతలును ప్రజలకు బోధింపవలసియున్నది.

## దేశచారిత్రకేకరణము

దేశచరిత్రజ్ఞానాధారము లేని దేశభక్తి మూలగ్రంథవిరహితము గాంచిన టీకయును బోలినదగు ననియు అందుచే నట్టి దేశభక్తివలన నెట్టి లాభములు కలుగఁజాల వనియు కవిసంప్రదాయజ్ఞులు చెప్పుచున్నారు. మరియు, ఏ దేశపు భావిస్థితి యైనను దాని భూతస్థితిగతులపై నాధారపడియుండును. దేశముయొక్క ప్రాచీనపద్ధతులకు విరుద్ధముగ వాని నాధునికపరిస్థితుల కనుకూలముగ మార్పు నొందించి జాతీయలక్షణములను పోషించుట కర్తవ్యము. ఇప్పుడు వీని నుపేక్షించి విదేశీయపద్ధతుల నవలంబించిన యెడల జాత్యభివృద్ధి దుస్సాధ్యమగుటయే గాక జాతీయజీవితమునకు కూడ భంగము కలుగవచ్చును. కావున, జాతీయనిర్మాతలు జాతీయ లక్షణముల నలక్ష్యము చేయరాదు.

## బ్రహ్మచర్యము

జాతీయతానిర్మాణమునకు శరీరబల మత్యావశ్యకము. దేశమందలి వ్యక్తుల శీలమును పెంపొందించుటకును దేశాత్మలమైన జాతీయజీవనమును వృద్ధిపఱచుటకును శరీరబలము ముఖ్యమని రాజనీతిజ్ఞుల యభిప్రాయము. శరీరదౌర్బల్యము గల దేశము విజ్ఞానసంపన్నతయందును నైతికవిశేషమునందును పేరు గడింపఁజాలదు. కావున, ఈ బలమును దేశాభివృద్ధికి అవశ్యకములే! ఈ విషయమును మన ప్రాచీనులు గ్రహించి, ప్రతిమానవుఁడును తన జీవితపు ప్రారంభదశయందు కొంత కాలము బ్రహ్మచర్య మాచరింపవలసిన దని విధించిరి. ఈ యాశ్రమమును విద్యార్థు లందఱును అనుసరింపవలసిన దనియు ఆ సమయమున వారు మాదకములు గాని మత్తునిచ్చునవి గాని యుపయోగింపరా దనియు వారట్టి దురాలోచనలకును తావీయరా దనియు మన పూర్వులు శాసించి దేశజుల శరీరబలమును వృద్ధిపఱచుచుండిరి. ఈ నియమము ననుసరించి వర్తించినయెడల వీరట్టి కష్టములనైన లక్ష్యము చేయక యుండురు. ప్రస్తుతము మన దేశజుల శరీరబలహీనతవలననే మన దేశమన్ని విషయములయందును క్షీణ దశకు వచ్చినది. బ్రహ్మచర్యము వలన మనకు మితజీవనాసక్తి కలుగును. అనావశ్యకమగు పాశ్చాత్యజీవనపద్ధతులు పాశ్చాత్యులనే శరీరబలహీనులఁ గావించుచున్నవి. కావున, భారతజాతీయనిర్మాతలిట్టి పద్ధతుల యవలంబనమును నిరుత్సాహపఱుపవలెను.

## జాతీయనిర్మాణావశ్యకత

ఇది యాశయపూరితోద్యమము. విదేశీయపాలనమునుండి తప్పించుకొని ఆధ్యాత్మిక మానసిక స్వాతంత్ర్యమునకై కృషిసలుపుటయే యీ యుద్యమముయొక్క యుద్దేశము. ఇట్టి నైతిక స్వాతంత్ర్యమును జాతీయధర్మమును ప్రత్యక్షవిరుద్ధము లని ప్రతి జాతియు వానిని గ్రహింపక మానదు. ఈ జాతీయోద్యమమునందలి యాధ్యాత్మిక రాజకీయ భాగములు రెంటను అవిభాజ్యములు. జాతీయాత్మగౌరవమునకును జాతీయపురోభివృద్ధికిని రాజకీయస్వాతంత్ర్యమును సంపూర్ణబాధ్యతయు అత్యావశ్యకములు. విదేశీయ ప్రభుత్వము ప్రజలను బాధ్యతావిరహితులను చేయుటచే ప్రజలయందు కార్యోత్సాహమును స్వాతంత్ర్యాభిలాషయు నశించుచున్నవి. అందుమూలముననే బ్రిటిషు ప్రభుత్వమువలన మన కెట్టి లాభములు చేకూఱినను అది యెల్లప్పుడును మనపై రాజ్యము చేయుచుండుట మన యాశయము కాదనియు బ్రిటిషు పతాకసంరక్షణమున కింద స్వపరిపాలనము నందుటయే మన యాదర్శమనియు వాకొనుచున్నాము. పైని పేర్కొనఁబడిన కారణములను బట్టి విదేశీయ ప్రభుత్వము పాలిత జాతులను స్వపరిపాలనార్హులను గావింపఁజాలదని తెల్లమగుచున్నది. కొన్ని వత్సరములనుండి మనము స్వపరిపాలనాసామర్థ్యమును గడించుచున్నాము. ఇందులకు అధికారవర్గాశ్రితము లగు మ్యునిసిపాలిటీలును విశ్వవిద్యాలయములును కారణములు కావు. ప్రస్తుతపరిస్థితుల యావశ్యకతను బట్టి జాతీయాశయసంరక్షణార్థము ప్రజలయం దుద్భవించిన నైతికశక్తియే యిందులకు కారణము.

ప్రభుత్వకార్యనిర్వాహకస్థానము మనకు నొసంగుట వలన నీ యుద్యమము సంతృప్తి నొందఁజాలదు. ప్రభుత్వము ప్రజాస్వాధీనముగ నుండవలయునని కాని దేశపరిపాలనమున కొంచెము పాలు దొరకినతోడనే జాతీయవాది సంతుష్టిపడువాఁడు కానేరఁడు. ఈ యుద్యమము ఆంగ్లదేశముపైఁగల ద్వేషభావముచే జనింపలేదు. ఆంగ్లదేశగతస్వార్థమే జనితమైనది. స్వాతంత్ర్యవిరహితమగు భారతదేశము ఆంగ్లదేశమునకు తీరని భారముగ నున్నది. ఆ విషయము నాంగ్లేయులు గుర్తింపజేయుచున్నారు. ఆంగ్లేయులు స్వాతంత్ర్యప్రియులు. స్వాతంత్ర్యవిజయమునకై అనాదినుండియు తమ సర్వశక్తిని వినియోగించుచునేయుండిరి. కాని, ఎట్టి యుదారస్వభావులకైనను అధికారము హస్తగతమైనప్పుడు దానిని వదలుట కష్టము. అందుచే పాలితదేశములకు స్వాతంత్ర్య మొసంగుటకు పాలకదేశము వెనుకంజ వేయుచుండును. అందు మూలముననే, ఆంగ్లదేశము భారతదేశమునకు స్వాతంత్ర్యము ప్రసాదింపక తన యాశయములకు విరుద్ధముగ వర్తింపవలసివచ్చుటయు తనమూలమున నా దేశపు నైతికౌన్నత్యము నశింప ప్రారంభించుటయు తటస్థించుచున్నది. నైతికౌన్నత్యమును గోల్పోయిన యేజాతియైన నేమి చేయఁగలదు? కావున, ఆంగ్లదేశము తనభారమును సాధ్యమైనంత త్వరలో వదలుకొనుట శ్రేయోదాయకము.

## ముగింపు

అట్లు గావించినయెడల, స్వాతంత్ర్యశోభిత యగు భారతదేశము శక్తిసంపన్నమై ఆంగ్లసామ్రాజ్యమునకు పట్టుకొమ్మయై తన ప్రాచీనాధ్యాత్మిక నాగరికత నెల్లెడల వెదజల్లి మానవసేవ గావించుచు, ప్రపంచమునకు తిలకప్రాయమై తనరారఁగలదు.

కీర్తిశేషులైన

# రెంటాల వేంకటసుబ్బారావు పంతులు గారి ప్రశంస

కాళ్లకూరి గోపాలరావు గారు

ఆంధ్రలోకము చిన్నపోయెను - ఆంధ్రమాత హిమాశ్రుకణసం
రంధ్ర యుష్ణానిలశ్వాసప - రంపర లెసఁగెన్. 1
సూరిమణి రెంటాల వేంకట - సుబ్బరాయమహామహుండు దివిఁ
జేరినంతనె కవిబుధాళుల - స్థితియె చెవ్వడియెన్. 2
ఆంగలాంధ్ర గ్రంథరచనా - హంక్రియాసామ్రాజ్యభారము
పొంగుచును భరియింపఁజాలిన - పూజ్యుఁ డింకెవఁడు ? 3
ఖండఖండాంతరసుకీర్తి - గణుతి సేయఁగ షేక్స్పియరుకవి
పండితనమును చాటిచెప్పిన - ధన్యుఁ డింకెవఁడు ? 4
ఆంగ్లవిద్యాధికులు నచ్చను - నంతవాఁడు 'బళీ! బళీ!!' యన
ఆంగ్లవక్తగ పేరు గాంచిన - యాంధ్రుఁ డింకెవఁడు ? 5
అతికుతూహలియై కుమారిక సహరభారతిగా నొనర్చిన
ఘనతను స్త్రీవిద్యాభిమానం - బెన్నఁ దర మౌనే? 6
తాను విద్యార్థిగనె యుండియు - ధనము సంపాదించి విద్యా
దానమును ధనదానమును వి - స్తారముగఁ జేసెన్. 7
ఇప్పటి సుస్మృతి గాంచి కీర్తి వ - హించువారలలోన నెందఱో
అప్పుడా కౌమార్యశీలుని - యాశ్రితులె సుమా ! 8
అనుభవమున జగము కృతఘ్నం - బైన నార్థికకష్టసమయం
బునను తనకు వదాన్యగుణమును - పూనికఁ గల్పుకొనెన్. 9
చెలఁగి లక్షల కొలఁది ధన మా - ర్జించి మించియు ధనికి నామము
నిలుపుకొనలేఁడయ్యె దాతృగు - ణిత్వ మేఁపదర ! 10
ఆత్మగౌరవ మెక్కుడై వి - ద్యాధికుం డతండు వర్తక
మాత్మవృత్తిగఁ గొని జగంబున - కచ్చెరువు గొల్పెన్ ! 11
న్యాయవాదిత్వంబు సరిపడ - నట్టి స్వాతంత్ర్యాభిలాషికి
హేయములు గాకున్నె సేవక - వృత్తు లెట్టివియున్ ? 12
సర్వతోముఖ మైన ప్రతిభను - స్వజనరక్తికి దేశభక్తికి
గర్వరాహిత్యమున కెంతయు - ఖ్యాతి వహియించెన్. 13
ఆంధ్రజాతీయాభ్యుదయమున - కఖిలరీతుల దారితీసిన
యాంధ్రు 'నాంధ్రోద్యమ పితామహుఁ' - డనుట పోలదొకో ? 14
స్వబలవిశ్వాసంబు ధైర్యము - సాహసంబు పరోపకారము
ప్రబలదీక్ష స్వగౌరవం బీ - వ్యక్తి లక్షణముల్. 15
ఈ మహాలక్షణానుకృతి ర - హించుతన్ స్మృతిచిహ్నమై ! మఱి,
ఈ మహాత్ముని యంతరాత్మ సు - ఖించుతన్ సతము ! 16



THE LATE Mr R VENKATASUBBA ROW PANTULU, B A , B L



కీర్తిశేషు లైన రెంటాల వేంకటసుబ్బారావు పంతులు గారు, బి. ఎ., బి. ఎల్.



# మీకు గ్రామొఫోను కలదా?

ఉన్నచో క్రొత్త రకపు రికార్డు సేల జాగ్రత పెట్టరాదు? వర్తమానమునకు తగిన

ప్లేటులు అన్నియు కలవు. మీకు గ్రామొఫోను లేనిచో

'హిజ్ మాస్టర్స్ వాయిస్' గ్రామొఫోనును సిఫారసు చేసెదము.

## గ్రామొఫోనుల ధరలు

రూ 125 నుండి 1600 రూప్యముల వరకు నున్నవి.

| హారన్ లెస్ మోడెల్ ఎల్. బి. సి. ఒ | టేబిల్ గ్రాండ్ మోడెల్ టి బి. ఏ. ఒ. | హార్న్ మోడెల్ హెచ్. ఎఫ్. ఎమ్. |
|---|---|---|
|  |  |  |
| 925 | 920 | 919 |

## రికార్డులు

కావలసిన వన్నియు మా రికార్డులలో నున్నవి. ప్రసిద్ధి గాంచిన ఉత్తర హిందుస్థానీ పాటలు, తెనుగు త్యాగరాయ కృతులు, పల్లవి, రాగము, ఆలాపనము, హాస్యకర మగునట్టియు నాటకమునకు సంబంధించిన రికార్డులును గలవు.

ప్రఖ్యాతిగాంచినవారి పేర్లు:—వనజాక్షి, గోదావరి, కోయంబత్తూరు తాయి, బళ్లారి సరసవినోదినీ సభ, సరస్వతీవినోదినీ సభ, వల్లూరు జగన్నాథరావు గారు వీరి పాటలు గల రికార్డులు కలవు.

వివరములు వలయుచో ఒక కార్డును వ్రాయుడు:—

స్పెన్సర్ అండుకో, (లిమిటెడ్)

సోల్ ఏజెంట్లు

(15b) గ్రామొఫోను కంపెనీ, (లిమిటెడ్) కలకత్తా.

భయపడవద్దు! నిరాశచే అంగవిహీనులు కానక్కరలేదు!!

మేహారణములకు, నవీన కుష్టమునకు, గొంతులోపలి పుండ్లకు, మచ్చలకు పోటకు, కొరుకు వ్యాధికి, స్త్రీవ్యాధుల వలన గలుగు యితర మేహములకు

## తామ్రమయినం డిపో వారి దివ్యౌషధములు.

తామ్రమయినం పరిశుద్ధమగు రాగితో మా వలన తయారు చేయబడి మేహవ్యాధుల నివారించుటలో పేరుపొందినది. వివరముగా కేటలాగులో చూడవచ్చును.

| 1 రకం | 2 రకం |
|---|---|
| 50 మాత్రలు 5-0-0 | 2-0-0 |
| 100 మాత్రలు 10-0-0 | 4-0-0 |




మూలరోగనాశని లేహ్యం యిది 15 దినములు సేవించినయెడల, రక్తము కారుట, సలుపుపోటు, యితర బాధలను పోగొట్టి మొలకలు నాశ్చివేయును. ఆసనగండమాల, భగంధరము మొదలగు ఆసన సంబంధమగు రణముల నాశ్చివేయును.

15 దినముల లేహ్యం 5-0-0

పొగ పీల్చుటవలననే కుష్టువ్యాధులు పోవుట.

కంఠమాలపుండ్లు, మేహారణములు, గొంతులోపుండ్లు, దద్దురు, మచ్చలు, పొడలు, నవీనకుష్టము, పుబ్బసము మొదలగు యేవస్తు తీరని మేహబాధలు, లోపలికి మందు పయికి పూత ఆవశ్యకంలేకుండగనే తొమ్మిదిరోజులకు గారంటిగా.

## Ayurvedic Smoking System.

పొగపీల్చు నవీన చికిత్సాపద్ధతిని బాగుచేసెదము, యీ చికిత్సకొరకు మావద్దకు అనేకచోట్ల నిరాశపొందిన రోగులు వచ్చి ఆరోగ్యవంతులగుచున్నారు. పూచీగాను నమ్మకముగాను బాగుచేయగలము. మావలన యీ చికిత్సాపద్ధతిలో తమ వ్యాధులను తీర్చుకొని స్వబంధువులను చూడపోయినవారు, యీ రోగము లేనా అని బంధువులు ఆశ్చర్యము నొందుచున్నారు వేయేల మావద్దకు వచ్చినప్పటికి దుర్గంధభూయిష్టమయి చూచుటకు అసహ్యముగా కనపించు రోగులు, చికిత్స నారంభించిన 13 వ దినమునకు పూర్ణారోగ్యవంతులయి బంధుమిత్రాదులను సంతసింప చేయుచున్నారు. యీమందు వాడు రోగులు వారు మావద్దకు వచ్చు రోజు ముందుగా తెలియపరచి పద్ధతులు మాట్లాడుకొనవలయును.

మోసపోవద్దు.

మేము యీనాడిపోను శ్రీరామదాసువారి కరుణచే స్థాపించి, కొద్దిరోజులకే విశేషప్రఖ్యాతి నందుటచూచియు, తామ్రమయినము చేయు అద్భుత గుణములను చూచియు, మోసగులు కొందరు యింతమేరంలో భేదముగా మా కేటలాగులోని మాటలను వ్రాసి తామెప్పుడు యే వయిద్యగ్రంథము విప్పిచూడనప్పటికిని, ఒకరు మేహవ్యాధుల చికిత్సానుభవము లేనప్పటికి, సర్టిఫికెట్లు పొందితిమనియు, బహుమతుల నందితిమనియు, ప్రకటనలు వ్రాసుకొని, మా స్వస్థానమగు గోదావరిజిల్లాలో ప్రచురించుచున్నట్లు వినుచున్నాము. అట్టి మోసములకులోనై, తిప్పలు పడుటలేని యాతనను పాడుచేసుకొనకుండా కాపాడుకొందురుగాక! మా నిజమయిన తామ్రమయినము రిజిస్టరు ట్రేడుమార్కు గమనించి కొనుకొనవలయును. కాకినాడలో (గోదావరిజిల్లా) మా బ్రాంచి తీసివేసి అందులఏజంటు, (యస్. వై. ఆర్ రాజు) అను నామము ధరించిన, వై. రామభద్రరాజు అనువారిని ఏజంటు పనినుంచి తొలగించితిమి. గనుక, తామ్రమయినము వారివద్ద కొనకూడదు. వారు విక్రయించను కూడదు. వారు విక్రయించుచుండగా చూచి తగుసాక్ష్యముతో మాకువ్రాసిన వారికి 25-0-0 రూపాయలు బహుమతి నిచ్చుటయేగాక, దానిని గురించి జరుపవలసిన సివిలు, క్రిమినలు వ్యాజ్యెలు జరిపెదము.

నన్ను చూచుటకొరకు మా వద్దకువచ్చు రోగులు ముందుగా మాకు వ్రాసినయెడల ఏయే తేదులలో మద్రాసులో వుందునో, నాబస, వీధి మీకు తెలియపరచెదను. మందులు విక్రయింపతగినవి సదా సిద్ధముగానే వుంచబడును.

మా ఆరోగ్యతా పత్రములు.
కేటలాగులో చూడవచ్చును.

### తామ్రమయినం డిపో

యస్. వి. యన్. రాజు అండు సన్సు

బ్రాంచి: లక్ష్మీనరసాపురం.
అనపర్తి పోస్టు, గోదావరిజిల్లా.

పోస్టు బాక్సు నెం 61,
మదరాసు,

# సామ్రాజ్యమునందలి రాజకీయపరివర్తనములు

(హిందూదేశసంబంధము)

డాక్టర్ భోగరాజు పట్టాభిసీతారామయ్య గారు, బి. ఏ., ఎమ్. బి. & సి. ఎమ్.

"చరిత్రయందలి కొన్ని శకములలో ఈ ప్రపంచము శతాబ్దుల కొలఁది తటస్థముగ నున్నంత నెమ్మదిగ తన నిర్ణీతపథమునందు ప్రాఁకులాడుచు, మరికొన్ని కాలములలో నెల దినమ్ములంత వేగముతో పరుగెత్తును, ఒక్క సంవత్సరము కాలములో శతాబ్దుల యభివృద్ధిని పూర్తి చేయును. ఇది యిట్టి కాలము'—లాయిడ్ జార్జి, లండను —14-4-1917

భూలోకము నెల్ల నావరించి లక్షల కొలఁది జననష్టమును కోట్ల కొలఁది ధననష్టమును కల్గించుచున్న యీ మహాసంగ్రామమధ్యమున ప్రజాస్వామికమునకు ప్రధానలక్షణముగ నుండు భావుకము (Idealism) ను బ్రిటిషు ప్రజలు సంపూర్ణముగ మఱచియుండలేదని చెప్పఁగలము. జాతీయలక్షణముల నెన్ను విమర్శకున కిట్టి నిర్ధారణ విస్మయజనకముగ నుండవచ్చును. ఏల యన, సామాన్యపు బ్రిటీషుపౌరుఁడు తత్త్వవిచారణయందు కాలయాపన సేయక పూర్వాచారప్రియుఁడును కార్యాసక్తుఁడును తత్క్షణప్రయోజనాపేక్షకుఁడును నై యున్నాఁడు. కాని, జనబాహుళ్యమును పరిశోధించి మొత్తముమీఁద చూడ, ఆ భావుకత్వము దృశ్యమగును. వారు భౌతికప్రయోజనవిచారణ సేయునపుడిది గాన్పింపకపోవచ్చును. కాని, విశాలమగు న్యాయదృష్టితో సామ్రాజ్యసమస్యలను తేల్పఁబూనినపుడు దీనిని మనము కన్పెట్టఁగలము. ఇట్టి న్యాయకాంక్షయే అచ్చటి లక్షల కొలఁది ప్రజలను బెల్జియమనెడి యల్పదేశపు స్వాతంత్ర్యముయొక్క సంరక్షణముకొఱకు తమ ప్రాణములను కోల్పోవునట్లు చేసినది. భావుకత్వమువలన స్వార్థమను పెనుభూతము దృష్టిపథమునుండి మరలింపఁబడుచున్నను, విశాలవిశ్వమానవకోటి యను నిరాధారభావమును గూడ తొలఁగింపవలసియున్నది. ఇట్లు తొలఁగింపఁగలిగియుండుటవలననే, జాతీయతాభావమును జాతీయతాసమ్మేళనమువలనఁ గలుగు సామ్రాజ్యభావమును దాని మూలమున సర్వసౌభ్రాతృత్వభావమును వర్ధిల్లఁగలవు.

అవిచారితముగ నిర్మింపఁబడిన సామ్రాజ్యభవనము ప్రశాంతికాలములందు స్థిరత్వమును ఐశ్వర్యమును పొందియుండియున్నను, యుద్ధకాలమున దాని యాంతరంగికనిర్మాణమునందు పరివర్తనములు ఆవశ్యకము లయినవి. సామ్రాజ్యశబ్దము సామాన్యప్రజల యామోదమును సామాన్యముగ పడయక, ఫ్రాన్సులోని స్వల్పజీవితము గల సామ్రాజ్యములను రష్యాలోని నిరంకుశప్రభుత్వమును జర్మనీలోని సైనికపరమావధిని వారి కింతవఱకు జ్ఞప్తికి తెచ్చుచుండెను. ఇప్పుడన్నో ప్రజాస్వామికమును సామ్రాజ్యమును సమరసపఱచు నూతనభావములు ప్రజల మనంబుల రంజిల్లఁజేయుచున్నవి.

సామ్రాజ్యమనిన, ఒకదాని ప్రక్క నొకటిగ నుంపఁబడిన రాష్ట్రసముదాయము కాక సమ్మేళనము చేయఁబడిన జాతీయతాసంఘమని యిప్పుడు గ్రహింపఁబడుచున్నది. మాతృదేశముచే నొసంగఁబడు సంరక్షణము భిన్న జాతుల వ్యక్తిత్వమున కాతంకము కానేరదు. గ్రేటు బ్రిటనుచే నవలంబింపఁబడు స్వేచ్ఛావాణిజ్యనీతికిని వలస రాజ్యములచే సమర్థింపఁబడు సంరక్షితవర్తకనీతికిని పొత్తు కలుపఁబడుచున్నది; ఆశ్రితరాజ్యములను బంధించు పాశములు సౌభ్రాతృత్వమును పెంపొందించు సంబంధములుగ మాఱినవి; సముద్రములకు వివిధభాగముల నున్న దేశముల యుపజాతీయాభిమానమ్ము సామ్రాజ్యాభిమానమును పెంపొందించుచునే యున్నది. ఇంతేల నూతనముగ జనించిన యాత్మజ్ఞానము ప్రపంచములోని నాల్గవవంతు జనమును ఒక రాజు క్రింద ఒక పతాకము క్రింద ఒక నవీనైక్యత క్రిందకు తెచ్చి వారియందు పరస్పరశ్రేయోభిలాషను పురికొల్పుచు సామ్రాజ్యసమస్యలను సుసాధ్యములుగ చేసినది.

ఈ నూతనసందర్భముల కనుగుణ్యముగ నొక నూతనరాజ్యాంగమును నిర్మింపవలెననియు అందు నూతనసామ్రాజ్యసంస్థలు నవీనసామ్రాజ్యోద్గ్రాణము అభినవసామ్రాజ్యకరములు స్థాపింపఁబడవలెననియు రాజ్యాంగతత్త్వజ్ఞులు యథేచ్ఛముగ నుడువుచున్నారు. ఈ సమస్యను రెండు తెగలవారు రెండు విధములుగ పరిష్కరింపఁ బ్రయత్నించుచున్నారు. 1911 లో జరగిన సామ్రాజ్యసభయందు న్యూజీలండునకు ప్రధానమంత్రి యగు సర్ జోసేఫ్ వార్డు సామ్రాజ్యములోని శ్వేతవర్ణులకు 300 మంది ప్రతినిధులు గల యొక యెన్నికసభయు సామ్రాజ్యసంరక్షణమునకు 12గురు గల యొకసభయు 15రు సభ్యులు గల యొక కార్యనిర్వాహకసభయు స్థాపింపవలెనని ప్రేరేపించియుండెను. ఇట్లు వలస రాజ్యములలోని జనులు గూడ సామ్రాజ్యకార్యనిర్వాహణమునందు పాల్గొనవలెనని ఆయన తన యభిప్రాయమును వెలిబుచ్చెను. "ప్రజాబాధ్యత గల మన రాజ్యాంగవిధానమునకిది విధ్వంసకముగ నుండు" నని అప్పటి ప్రధానమంత్రి ఆస్క్విత్ గారు ప్రత్యుత్తర మిచ్చిరి. అప్పటినుండి కాలము మాఱినది. దృక్కోణములును మాఱినవి. అట్టి ప్రేరణముననే నోర్సుఫోల్డు గారు ప్రతిపాదించియున్నారు. వీరి యుద్దేశమున బ్రిటిషు యూనియన్ అను పేర సామ్రాజ్యమును స్థాపించి అందు కార్యనిర్వాహకసభను శాసన

స్థలను నిర్మింపవలె ననియే.

శాసనసభలు రెండుండవలెను. మొదటిది సెనెట్, రెండవది ప్రతినిధుల సభ. మొదటిదానియందు రాష్ట్రములనుండి వచ్చిన రాష్ట్ర ప్రతినిధు లుందురు. రెండవదానియందు రాష్ట్రములనుండి వచ్చిన ప్రజాప్రతినిధు లుందురు. మొదటిదానియందుండు 200 సభికులలో 150 మంది శ్వేతముఖులును తదితరులు 50 మందిలో ఇండియాకు 30 మందియు నుండవలె నని వీరి యభిప్రాయము. రెండవదానియం దుండు 400 సభికులలో 300 మంది శ్వేతరాష్ట్రములచే వారి జనాభా సంఖ్యను బట్టియు మిగిలిన 100 మంది తదితరరాజ్యములనుండి వారి జనసంఖ్యను బట్టియే కాక వారి సభ్యతాభివృద్ధులను బట్టియు ఎన్నుకొనఁబడవలెనని వీరి ప్రతిపాదనము. యూనియన్ పార్లమెంటు— అనఁగా ఈ రెండు సభలును—సామ్రాజ్యముయొక్క రక్షణమునకును సామాన్యక్షేమమునకును వర్తించు విషయములను గూర్చి వ్యవహరించుటకు నందునకు వలయు ధనమునకై పన్నులు విధించు నధికారమును పొందియుండును. వీనికి తోడు విదేశీయసంబంధములు సేన నౌకాదళము ఆర్థికపరిస్థితులు విదేశవాణిజ్యము రైల్వేలు పోస్టు టెలిగ్రాఫ్ మున్నగునవి న్యాయస్థానము—ఈ విషయములు గూడ ఈ పార్లమెంటు సభికులచేతనే నిర్ణయింపఁబడవలెను. ఆదాయమూలము లీ విధముగ విభజింపఁబడియున్నవి: (1) దిగుమతి పన్నులు. (2) అనావశ్యకము లగు వస్తువులు, అనఁగా మత్తు పదార్థములు నిషావస్తువులు ఆభరణములు భోజనసౌఖ్యవిశేషములు సువాసనద్రవ్యములు మోటారు బండ్లు—వీనిపై పన్నులు. (3) యూనియన్ డిపార్టుమెంటులోని యుద్యోగులచే గావింపఁబడు శ్రమఫలితములు. (4) రాజుగారి యధికారమునకు లోబడిన భూమిమీఁది రాబడి. (5) రాష్ట్రీయ రాజ్యాంగము లిచ్చు నిర్ణీత మగు మొత్తములు.

ఇందున కనివార్య మగు ఫలితముగ ఇంగ్లాండు స్కాట్లాండు వేల్సు ఐర్లాండులయొక్క యాంతరంగికపరిపాలనము ఇప్పటివలె సామ్రాజ్యపు పార్లమెంటుచేఁగాక ప్రత్యేకపు పార్లమెంట్లచే కావింపఁబడవలసియుండును. స్వపరిపాలనము గల వలస రాజ్యముల కిట్టి సభలిదివఱకే యున్నవి. ఇండియాకు కూడ సత్వరముగ నట్టిది లభింపనై యున్నది. 10-5-1917-వ తేదీని బికనీర్ మహారాజు లండను టైమ్సు పత్రికలో వ్రాసినట్లు "ఇఁకముందు ప్రతి సంవత్సరమును జరగనై యున్న సామ్రాజ్యమహాసభయందును సామ్రాజ్య మంత్రివర్గసభయందును వలసలతో పాటు హిందూదేశమునకు కూడ ప్రాతినిధ్య ముండవలె నను ప్రముఖ మగు తీర్మానము ననుసరించి ఇండియాయొక్క యాంతరంగిక రాజకీయస్థితియందు కూడ గొప్ప మార్పులతో కూడిన పరిణామము వాంఛనీయమే కాక ఆవశ్యక మని కూడ స్పష్ట మగుచున్నది." ఇట్టి భావములనే లాయిడ్ జార్జియు చేంబర్లేనును లండను టైమ్సు పత్రికాధిపతియు వ్యక్తీకరించియున్నారు. మరియు, ఇటీవల 1917-వ సం. ఆగస్టు 20-వ తేదిని మాంటాగ్యుగారు కామన్సుసభలో చేసిన ప్రకటనములందున్న ఇండియాయొక్క పరమావధి ప్రజాబాధ్యతతో కూడిన స్వరాజ్యమే యని తెలుపఁబడినది. ఇట్టి స్వరాజ్యనిర్మాణము సామ్రాజ్యసంరక్షణమునకే యనుట నిర్వివాదాంశము.

సామ్రాజ్యమునం దెచ్చటి కచ్చట ఇట్టి స్వాతంత్ర్యయుత మగు శాసనసభ లుండవలె ననుట సామ్రాజ్యచరిత్రమునం దపూర్వమైనది కాదు. 1846 లో సర్ రాబర్టు పీల్ పార్లమెంటుచే కావింపఁబడవలసిన కార్యభారమును గూర్చి మొత్తుకొనెను. 1879-వ సం.నందు గ్లాడ్‌స్టన్ మంత్రి ఐర్లాండు గాని మరియే ప్రాంతము గాని తన కార్యములను తాను నిర్వహించుకొనినచో పార్లమెంటునందు సామ్రాజ్యసమస్యల చర్చ కెక్కువ యవకాశ ముండు నని తెలిపియుండెను. దీని ననుసరించి 1886 లో ఐర్లాండునకు మొదటి హోంరూలు బిల్లు పార్లమెంటునందు ప్రవేశపెట్టఁబడి 32 సంవత్సరములనుండియు నిమ్నోన్నతదశల పాలగుచున్నది. మరియు, ఇండియాపై రాజకీయమును పూనుకొనుటయు 1858 మొదలు సామ్రాజ్యమునందు జరిగిన మహత్తమ మగు పెంపును విశాలవిశ్వరాజకీయములందు గ్రేటు బ్రిటనున కుండు ప్రముఖపదవియు సాంఘికసమస్యలకు వ్యాపితమైన శాసననిర్మాణములును పార్లమెంటుయొక్క పనిని అమితముగ పెంచుటచే, ఆంతరంగికవ్యవహారనిర్వహణమును సామ్రాజ్యవ్యవహారనిర్వర్తనమును ఈ రెంటిని సమర్థతతోఁ గాని సత్వరముగఁ గాని జరుపఁబడఁజాలకున్నవి.

1895 లో స్కాట్లండునకు ప్రత్యేకపు పార్లమెంటుండవలె నని సర్ హెన్రీ డాల్జియల్ గారు ప్రతిపాదించిన తీర్మానము పార్లమెంటునందు 1896 లో సంగీకరింపఁబడి 1912 లో ప్రవచింపఁబడెను. 1908, 1912, 1913 లలో స్కాట్లాండునకు హోంరూలు ఒసంగవలె నను బిల్లు రెండవసారి కూడ కామన్సుసభయందు చదువఁబడి అంగీకరింపఁబడెను. వేల్సు కూడ ఇటులే స్వరాజ్యమునకు పోరాడుచున్నది. ఈ సందర్భముల నెల్ల సమగ్రముగ టి. పి. ఓకోనూరు అను సభికుఁడు ఈ విధముగ తెలిపియున్నాఁడు: "స్కాట్లండు వ్యవహారములు ఐరిషు ఇంగ్లీషు వెల్షువారి యజ్ఞానము వలన చర్చింపఁబడి పరిష్కరింపఁబడుచున్నవి. ఈ విధముననే ఆంగ్లేయుల వ్యవహారములు స్కాటిషు ఐరిషు వెల్షువారి యజ్ఞానమువలనను ఐరిషువారి వ్యవహారము ఇంగ్లీషు వెల్షు స్కాటిషువారి యజ్ఞానమువలనను వెల్షువారి వ్యవహారములు ఇంగ్లీషు స్కాటిషు ఐరిషువారి యజ్ఞానమువలనను పరిష్కరింపఁబడుచున్నవి. పార్లమెంటునందు మనుష్యులు తొందరపెట్టఁబడుటయు పని పేరుకొనుటయు బిల్లులు విచారణ కాకుండుటయు గొప్ప సారాంశములు చర్చింపఁబడకుండుటయు ఆ సమయముననే ఐర్లాండులోని ఒక దారిగల విషయమై కాని స్కాట్లండులోని యొక ట్రాంవేను గూర్చి కాని లేక లివర్పూలునందలి గ్యాసు దీపముయొక్క వెల్తురు 32 మైనపువత్తుల ప్రమాణము గలదిగా నుండవలెనో లేక 26 వత్తుల ప్రమాణము గలదిగా నుండవలెనో యని గాని విచారణ జరుగుటయు మనము చూచుచున్నాము."

ఈ సందర్భములలో వెంటనే కాకున్నను అచిరకాలములో గ్రేటు

పార్లమెంటుయొక్క యధికార పరిమితి తగ్గింపఁబడవలె ననియు సామ్రాజ్యవ్యవహారములకు ప్రత్యేకముగ వేఱే పార్లమెంటు గాని దాని స్థానమున మరియొక ప్రతిష్ఠాపన గాని స్థాపింపఁబడవలె ననియు స్పష్ట మగుచున్నది. వేఱే ప్రతిష్ఠాపనలను గూర్చి కూడ కొన్ని ప్రేరణలు చేయఁబడియున్నవి. సామ్రాజ్యమహాసభయు సామ్రాజ్య సంరక్షక సంఘమును ఇదివఱ కున్న విధముననే యుండి ఏఁడేఁటను లేక అంతకన్న తఱచుగను సమావేశ మగుచుండవలె నని కొందఱి యభిప్రాయము. మరికొందఱు వలస రాజ్యములచే నెద్దియో యొక సర్వజనాంగీకృత మగు విధానము ననుసరించి యెన్నుకొనఁబడిన వలస రాజ్యపు ప్రతినిధుల సంఘ మను నొక సంఘము స్థాపింపఁబడవలె ననియు వలస రాజ్యములు కొంత కాలము—అనఁగా 10 సంవత్సరము లనుకొనెదము—తమ జనసంఖ్యను బట్టియు తమపై విధింపఁబడు మొత్తమును బట్టియు సామ్రాజ్యపు టుగ్రాణమునకు తమ వంతు నిచ్చుచుండవలె ననియు ఈ మొత్తములు మొట్టమొదట వలస రాజ్యముల ప్రతినిధిసంఘమువారి యామోదమును పొందవలె ననియు ఆ సంఘము ప్రతిసంవత్సరమును లండనులో సమావేశము కావలె ననియు అందు సామ్రాజ్యరాజ్యాంగమంత్రివర్గము హాజరై చర్యలయందు పాల్గొనుటకు హక్కు కలిగియుండవలె ననియు వీరు సమ్మతులను మాత్ర మియ్యరా దనియు నభిప్రాయపడుచున్నారు. వివిధప్రాంతము లిచ్చు సొమ్ము మొత్తము లన్నియు ఏకముగ నొసంగఁబడుటకుఁ గాని ఏకముగ నొసంగఁబడకుండ టకుఁ గాని యేర్పాటుండును. ఒక వలస రాజ్యము మాత్రము తన విరాళము నియ్యననుటకు వీ లుండదు. ఇందు మూలమున వలసరాజ్యముల ప్రతినిధిసంఘము తన వలస పార్లమెంటులకును బ్రిటిషు పార్లమెంటునకును మధ్యస్థముగ నుండి, విదేశీయమంత్రి బ్రిటిషు పార్లమెంటునకును బ్రిటిషు పార్లమెంటు ఈ సంఘమునకును ఈ సంఘము ఆయా వలస రాజ్యముల పార్లమెంట్లకును బాధ్యతాపరంపరలు గలిగియుండు నని వీరి నమ్మకము.

ఈ విధముగ, సర్వసామ్రాజ్యమునకు నొక క్రొత్త పార్లమెంటును స్థాపించుట యను విప్లవరూపక మగు ప్రతివర్తనమును నివారించుటకుఁ గాను ఆంగ్లేయరాజ్యాంగధురీణులు తమ యావచ్ఛక్తియుక్తులను వినియోగించి మధ్యమార్గములను కన్పెట్టఁ బ్రయత్నించుచున్నారు. సర్వసామ్రాజ్యపు పార్లమెంటునకు ప్రత్యేకముగ సర్వసామ్రాజ్యమంత్రివర్గ ముండవలెను. సర్వసామ్రాజ్య మంత్రివర్గమునకు సర్వసామ్రాజ్యపు టుగ్రాణ ముండవలెను. సర్వసామ్రాజ్యపు టుగ్రాణము నిందుటకు సర్వసామ్రాజ్యపు పన్ను లుండవలెను. ఇట్టి పన్నులను వలస రాజ్యము లంగీకరింతు రనుట కలలోని వార్త. సామ్రాజ్యసంరక్షణమునకు తమ విరాళములను వా రియ్యక పోరు. కాని, ఇతరదేశమునుండి తమ ప్రతినిధుల సభచే నైనను విధింపఁబడు పన్నులను వలస రాజ్యము లంగీకరించు ననునది యసంభవము. 1783-వ సంవత్సరపు టనుభవము మఱపునకు రాలేదు. అమెరికావారు ఖండించినది కేవలము ప్రాతినిధ్యము లేకయే పన్నులు విధింపఁబడరా దని మాత్రమే కాదు. సామ్రాజ్యముయొక్క కేంద్రస్థానమునుండి సామ్రాజ్యములోని వివిధభాగములపై నొక్క సభిచే నొక్క రీతిని పన్నులు విధింపరా దనియే వారు పోరాడినది. అట్టిపోరాటమునకు ఆధారభూతము లయిన మనోభావములను ఆవేశములను ఇప్పుడు నిగూఢములుగ నిద్రించుచుండు నని మనము నమ్మరాదు. ఇట్టి సామ్రాజ్యపు పార్లమెంటు మున్నగు పరివర్తనములు ప్రేరణచేయఁబడ కూడ కొంత కాల మయినది. అటుపిమ్మట థేమ్సు గంగానదులలో ప్రవహించిన జలము అపారము. అభిప్రాయములు మాఱినవి. కాలము మాఱినది. 1917 ఫిబ్రవరిలో సామ్రాజ్యమహాసభ గావింపఁబడినది. సామ్రాజ్యముయొక్క బహుభాగములనుండి వచ్చియున్న ప్రతినిధులు సామ్రాజ్యయుద్ధమంత్రివర్గమునందుఁ గూడ చేర్చికొనఁబడిరి. ఇందు ఇండియాయొక్క ప్రతినిధులును సమానసమ్మతి వక్తృత్వ సత్త్వములను పొందియుండిరి. ఈ సభను గూర్చి లాయిడ్ జార్జి ఈ విధముగ వ్రాసియున్నాఁడు: "అది జరుగుచున్నపుడు సముద్రములావలనుండి వచ్చిన సభికుల కెల్లరకును రాజ్యాంగముయొక్క యధీనమునందున్న సంజాయిషీ యంతయు నియ్యఁబడెను. బ్రిటిషు రాజ్యాంగమంత్రులతో సమాన మయిన పదవిని వారు పొందియుండిరి. ......... రాజ్యాంగమునకు సంబంధించినంతవఱకు ఈ ప్రయోగము పరిపూర్ణజయము నొందె నని వారు నమ్మకముతో చెప్పఁగలరు. కావున, సంవత్సరమున కొకసారియో అవసర మైనచో అంతకన్న తఱచుగనో ఈ సభలు సమావేశము కావలె నని యంగీకరింపఁబడినది." మరియు, సామ్రాజ్యరాజ్యాంగ మెవ్విధమున మార్పు చెందవలెనో ఇప్పుడు నిర్ణయింపఁబడలే దనియు అందులకు సామ్రాజ్య ప్రతినిధుల సభ ప్రత్యేకముగ సమావేశము కాఁగల దనియు సూచించుచు "ఇండియాకుఁ గూడ ప్రాతినిధ్య మొసంగు సామ్రాజ్యమంత్రివర్గమును నిర్మించుట ఎంత జయప్రదముగను ఎంత నైక్యతకును పరస్పరావగాహనమునకును అనుకూలముగను నుండు ననియు, ఇట్టి ప్రతిష్ఠ సామ్రాజ్యములోని అన్ని జాతులవారి యామోదమును పడయు నను నమ్మకము గలదు." అని లాయిడ్ జార్జి చెప్పియున్నాఁడు.

ఇంతే కాక, కానడా ప్రతినిధి యగు సర్ రాబర్టు బోర్డన్ ఈ విషయమును గూర్చి మాటాడుచు మాతృదేశమునకును వలస దేశములకును సమానత్వము వృద్ధి కాఁబోవుచున్న దని చెప్పియుండెను. మాసీ గారు కూడ ఇట్టి భావములనే వెలిపుచ్చెను. జనరల్ స్మట్సు సర్వసామ్రాజ్యమునకును ఒక్క పార్లమెంటును గూర్చు సాభ్రాతృత్వము సాగ దని నిరూపించెను. సర్ జోసెఫ్ వార్డు ప్రత్యేకము వలస రాజ్యముల రక్షణసైన్యమును కేంద్రీకృత మగు పార్లమెంటు వశము చేయుట కూడ దని నిరాకరించెను. ప్రొఫెసర్ కీన్ సర్ చార్లసు ల్యూకస్ మున్నగువారు కూడ నిట్టి కేంద్రీకృత మగు పార్లమెంటు రా దని తమ నమ్మకమును తెలిపియున్నారు. ల్యూకస్ గారు చెప్పిన యీ క్రింది వాక్యములు సంస్మరణీయములు:— "ఆంగ్లేయుల బుద్ధి యంతయు ఇదివఱ కున్న యాచారమునే విపు

లము చేసి క్రొత్త యావశ్యకత కనురూపమగు క్రొత్త విధానముగ మార్చుటయందే ప్రసరించును. ఎంతవఱకు పూర్వ మున్నదానిని పునర్నిర్మాణము చేసి విపులము చేసి (సంక్లిష్టమైన వంకరటింకర చేసి అనుకొనుచు) పనికి తగినట్లు చేయ వీలున్నదో అంత కాలమును వారు క్రొత్తదాని నంగీకరింపరు. ఆంగ్లేయజాతియొక్క మరియొక లక్షణ మేమనిన, అది మిక్కిలి కార్యచాతుర్యము గల జాతి............ ఆ క్షణమున కేది యావశ్యకమో దానినే యడిగి దానినే పొందెదరు. ఇపుడు కావలసినదానికంటె నెక్కువ నిచ్చునట్టియు అజ్ఞాతమగు భావికాలమున కంతకును వర్తింపఁజేయునట్లు నటించునట్టియు సహేతుకమగు పథకమును వారడుగరు. అట్టిది మీ రిచ్చినచో వారు సూటు వందనముల నొసంగరు." కావున, ఏ సందర్భమును బట్టి చూచినను విప్లవపూర్వకమగు పరివర్తనములు బ్రిటీషు సామ్రాజ్యరాజ్యాంగమునందు సంభవింపఁజాలవని తేలుచున్నది

అయినచో, సామ్రాజ్యమునందలి నూతనముగ రాఁగల ప్రతిష్ఠలయందు ఇండియా దేశమునకు తగు ప్రాతినిధ్యము ఎన్నికవలన వెంటనే కాకున్నను ఉత్తరోత్తర లభించు ననుటకు సందియము లేదు. కాని, ఈ నూతన ప్రతిష్ఠలు యుద్ధము ప్రశాంతము మున్నగు బహిర్వ్యాపారములను మాత్రమే చర్చించును. ఆగస్టు 20-వ తేదీని కామన్సు సభలో మాంటాగ్యు మంత్రి గారి ప్రకటనమునందు ఇండియాకు ప్రజాబాధ్యతతోఁ గూడిన స్వరాజ్యము నిచ్చుటయే పరమావధి యనియు ఆ యవధి చేరు మార్గమునందు దశలను సోపానములను ఎప్పటికప్పుడు నిర్ణయించునది రాజ్యాంగమువారే యనియు ప్రకటింపఁబడినది. కావున, ఇట్టి సోపాననిర్ణయకర్తవ్యమును నిర్ణయించునది చాల వఱకు ఇండియా గవర్నమెంటును అంతకన్న నెక్కువగ కామన్సు సభయు నై యుండును. మన కోరికల ప్రకారము పరిపూర్ణస్వరాజ్యము లభించు ననుకొనినను, రేపు మాంటాగ్యు గారు ప్రవేశపెట్టఁబోవు నూతనశాసనములందు అట్టి పరిపూర్ణత 10-15 సంవత్సరములలో లభించునట్లు నిర్ణయింపఁబడును నని మనము తలంపవచ్చును. ఈ గడువులో 4-5 సోపానములను దాఁటవలసియుండును ప్రతిసోపానారోహణతరుణమునందును మనకును గల మనోరథములను ప్రతిఘటించు నాంగ్లేయులకును తత్సంబంధులకును మిక్కుటమగు పోరాటము జరుగవలసియుండును. అట్లు జరుగునపు డెల్ల కామన్సు సభయందు మనకు తగు పలుకుబడి యుండుట యావశ్యకము. కావున, మన మిప్పుడు కోరు సంస్కరణములందును స్వరాజ్యప్రథమసోపానమునందును కామన్సు సభలో మనకు ప్రాతినిధ్య ముండునట్లు మనము కోరవలెను. ఇంతవఱకు నీ యంశము కాంగ్రెసు లీగు సంస్కరణప్రణాళికయందు చేర్పఁబడకుండుట శోచనీయము. అట్లు కామన్సు సభలో మనము ప్రాతినిధ్యమును కోరుటయు వలస రాజ్యములు తిరస్కరించుటయు మన దాస్యమును వెలిపుచ్చు నని ఈ లోపమును సమర్థింతురు. కాని, 10-15 సంవత్సరములవఱకు స్వాతంత్ర్యము గల వలస రాజ్యములకన్న మన మెక్కువ యాశ్రితులమే యనియు ఒప్పుకొనక తప్పదు. ఈ 10-15 సంవత్సరముల కాలమును మన స్వార్థమును కాపాడి మన జాతీయసత్త్వములను సమర్థించుటకు కామన్సు సభయందు ఇండియాకు 40 మంది ప్రతినిధులతోఁ గూడిన ప్రాతినిధ్య మత్యావశ్యకము.

# ప్రియుని హృదయము

అధికొర్ల సూర్యనారాయణరావు గారు, బి ఏ., బి. ఎల్.

ఎటుచేసెనో యెఱుఁగ ప్రేయసి!
డెందమున ముద మీవు చెందినఁ
గ్రందుకొను మోదమున నా మది
గంతు లిడుచుండెన్.
ఎందుచేసెనో యెఱుఁగ ప్రేయసి!
డెందమున నగ నీవు చెందిన
తొంపిలము నొందుచును నా మది
పొంగుచునుండెన్.
బాల! మధురసుషుప్తిఁ జెందిన
లీలలను నీ మోము తెలిపిన

మేలుకొను నా మదికి నెమ్మది
యేల కలుగునొకో?
సుదతి! బాధ యొకింత యైనను
గదియకొని నీ కన్ను లలమిన
వ్యథలు పడి నా యెడను జెల్చును
పదును ముండ్లవలెన్.
ప్రేయసీ! ప్రతినిమిషమును నీ
మాయ మలయును, కత మెఱుంగను;
నీవు నేనో నేను నీవో
కావటయు నిజము!

# సంయుక్తరాష్ట్ర సంవిధానము

వల్లూరి సూర్యనారాయణరావు పంతులు గారు, బి. ఏ., బి. ఎల్., ఎల్. టి.

## బ్రిటిషు సంయుక్తరాష్ట్ర సామ్రాజ్యము

బ్రిటిషువారి పరిపాలనలో స్వతంత్ర రాష్ట్రము లన్నియు వారితో కలసి ఒక సంయుక్తసామ్రాజ్యముగా నేర్పడుటకు సిద్ధముగా నున్న వని ఆంగ్లేయవార్తాపత్రికలలో తఱచుగా మనము చదువుచున్నాము. కొన్ని రాష్ట్రములలో కొన్ని భాగములు అట్లు చేరుటకు ఆతురపడుచున్నను మఱికొన్నిటికి ఇష్టము లేకపోవచ్చును. ఆయా రాష్ట్రముల పక్షమున కొందఱు మంత్రులను ఈ యుద్ధసమయములో ఆంగ్లేయమంత్రివర్గముతో చేర్చుకొని ఆంతరంగికవిషయములను చర్చించిరి. ఇండియానుండి కూడ ముగ్గురు ప్రతినిధులను మన గవర్నమెంటువారే నియమించి ఆ సభకు పంపిరి. దీనికి ఉబ్బి తబ్బిబ్బై కొన్ని రాష్ట్రములలోని మంత్రులు ఇంగ్లాండుతో నింకను నెక్కువగ కలసి మెలసి యుండుటకును విదేశరాష్ట్రములకంటె బలముగా నుండుట కొక సంయుక్తరాష్ట్రమును ఆంగ్లేయ రాజ్యాధిపత్యము క్రింద నేర్పఱచుటకును యోచించుచున్నారు. దీనివలన ఈ రాష్ట్రముల గౌరవము ఎంత హెచ్చినను వానిలోని ప్రజలెల్లరు సమ్మతింతు రని నమ్ముటకు వీలు లేదు. ఈ రాష్ట్రముల మంత్రులలో దక్షిణాఫ్రికా మంత్రి స్మట్సు గారు మాత్రము తమ యర్థాంగీకారమును తెలిపియున్నారు. కనడావారు బ్రిటీషు సామ్రాజ్యమునకు అనుకూలు రైనను భావికాలములో తమ సంపూర్ణస్వాతంత్ర్యమునకు భంగము కలుగఁజేయు శాశ్వతమైన యేర్పాటులను చేయనొల్ల రని ఈయన స్పష్టముగ చెప్పియున్నారు. బ్రిటిషు సామ్రాజ్యపరిపాలనము దానిలో చేరిన ప్రత్యేకరాష్ట్రముల స్వాతంత్ర్యమునకు ఎట్టి భంగమును కలుగఁజేయఁగూడదు. వారి భావ్యభ్యుదయము వారి చేతులలోనే యుండవలెను. తమ రాష్ట్రమును గట్టిగ త్రాళ్లతో బంధించివేయుటకు కనడావా రెన్నఁటికిని ఒప్పుకొనరు. అమెరికా సంయుక్తరాష్ట్రములలోవలెనే బ్రిటిషు సామ్రాజ్యములో చేరిన వివిధరాష్ట్రములను ఎన్నఁటికిని విడిపోకుండునట్లు కొన్ని చట్టములచే బంధించివైచుట యెప్పుడును సంభవింపదు. ఈ రాష్ట్రము లన్నియు ఒండొంటికి పెక్కు వేల మైళ్లు దూరములం దున్నవి. దేని కది బలవంతమైన రాజ్యముగ నేర్పడనియెడల పరరాష్ట్రములవారి చేతులలో పడకతప్పదు. ఇండియా తప్ప తక్కిన వలస రాష్ట్రములవా రందఱు ఆంగ్లేయజాతివా రైనను ఇటీవల వీరు ఆయా రాష్ట్రములలోని శీతోష్ణస్థితులవలనను తినెడు పదార్థములవలనను కట్టుకొను బట్టలవలనను వివిధమైన యాచారములవలనను అలవాటులవలనను భేదించిపోవుచున్నారు. వీ రందఱు తమ కెప్పుడు విడిపోవలెనన్న అప్పుడే విడిపోయెడి హక్కులతో బ్రిటిషు సామ్రాజ్యములో నొక భాగముగ చేరవచ్చును గాని మున్ముందు తమకు రాఁగల సంపూర్ణస్వాతంత్ర్యమునకు ఎట్టి భంగమును కలిగించుకొనరు. ఇట్టి స్థితిలో మన యిండియా గతి యేమి? బ్రిటిషు పరిపాలన క్రింద మన మిప్పుడు చేరియున్నాము. ముం దెన్నఁటికిని విడిపోవ మని కూడ గట్టిగ మనము చెప్పితీఱవలెను. చర్చకొఱకైనను ముం దెప్పుడైన విడవచ్చు నేమో యని వాదించినయెడల, అది రాజద్రోహ మని మన కాంగ్రెసువారి నిబంధన కూడ చాటించుచున్నది. కాఁబట్టి ఇంగ్లాండు దేశపు వలస రాజ్యములవారు ముం దెప్పుడైనను తమ కిష్టము వచ్చినపుడు విడిపోఁగల యధికారముతో బ్రిటీషు సంయుక్తరాష్ట్రసామ్రాజ్య పరిపాలనలో చేరినయెడల మన కీ రాష్ట్రములవా రందఱు అధికారు లగుదురు. ప్రస్తుతపు బ్రిటిషు పార్లమెంటువారికి బదులు బ్రిటిషు వలస రాష్ట్రముల ప్రతినిధు లందఱు సంయుక్తరాష్ట్రముల పార్లమెంటుగా చేరి సామ్రాజ్యపరిపాలనము చేయుదురు. ఒకవేళ, ఈ పార్లమెంటులో మన ప్రజాప్రతినిధులు కొందఱు చేర్చఁబడినను మన మాట సాగదు. మన జనాభా ప్రకారము ప్రతినిధులను పంపవచ్చు నన్నయెడల, తక్కిన రాష్ట్రప్రతినిధులను మనము ముంచివేయఁగలము. దానికి వారు ఒప్పుకొనరు. కాఁబట్టి, మన ప్రాతినిధ్యము మిక్కిలి స్వల్పముగా నుండును. ఆస్ట్రేలియా కనడా దక్షిణాఫ్రికాలు మన దేశముకంటె వైశాల్యమందు పెద్దవి. మున్ముందు మనకంటె ధనవంతములు కాఁబోవుచున్నవి. బ్రిటీషు దీవులు న్యూజిలందు మొదలగునవి పై మూడు పెద్ద రాష్ట్రములతో కలసి రాజకీయవ్యవహారములు జరిగించునపుడు మన నల్లవారిని తప్పక త్రోసి రాజాగ చేయఁగలవు. వ్యక్తులవలెనే జాతులు కూడ స్వార్థపరములు గనుక మన దేశమునకు నష్టము కలిగినను తమకు లాభము రాఁగల చట్టములనే ఈ సంయుక్తరాష్ట్రసామ్రాజ్యములో నేర్పఱుపవచ్చును. ప్రస్తుతమునందు ఇంత ఘోరయుద్ధము జరుగుచు ఇంగ్లాండు దేశమునకే ముప్పు వాటిల్లు నేమో యనియు యూరపు ఖండములో ప్రజాపరిపాలనమునకే భంగము కలుగు నేమో యనియు జడియుచున్న సమయమున ఇండియా గవర్నమెంటువారియొక్కయు ఆంగ్లేయమంత్రులయొక్కయు సుపదేశములను లక్ష్యము చేయక కనడావారును ఆస్ట్రేలియావారును దక్షిణాఫ్రికావారును మనలను ఆ దేశములకు రాకుండ కఠినశాసనములను చేయుచున్నారు. దక్షిణాఫ్రికాలో నున్న మన యిండియనుల యాత్మగౌరవమునకు లోప మగు ననేకనిర్బం

ధములను విధించుచున్నారు. వీరేనా మనకు ముందు యజమాను లగుట!

ఇట్టి బ్రిటిషు సంయుక్తరాష్ట్రసామ్రాజ్యమునకంటె ఇప్పటి స్థితియే కొంచెము బాగుగ నున్నది. ఇప్పుడు మనకు బ్రిటిషు పార్లమెంటువారు పేరునకు మాత్రమే యజమానులు. సివిల్ సెర్వీసు శాఖవారే మనకు నిజమైన యజమానులు. మన భవిష్యత్తు మన చేతులలోనే యున్నదని యిప్పుడైనను మన కాంగ్రెసువారును మనమును గ్రహించినయెడల, సరియైన రాజకీయాందోళనము మన దేశములోనే యెక్కువగ జరిగించుటకగు వ్యయప్రయాసములకు మనవారు వెనుదీయరు. సంయుక్తసామ్రాజ్యప్రతిష్ఠాపనకు తమ విముఖత్వమును తప్పక వారు కనబఱచెదరు. అమెరికా సంయుక్తరాష్ట్రములలో వలె ఒండొంటి నంటియున్న రాష్ట్రము లున్నపుడే సంయుక్తసామ్రాజ్యస్థాపన ముండును గాని చెల్లాచెదరుగా నున్న బ్రిటిషు వలసరాజ్యములకు ఎన్నటికిని అట్టిది కుదురదు. ఒకవేళ కుదిరినను, నల్లవారైన యనేకవిజాతీయులతో నిండిన మన దేశమునకును ఈ బ్రిటీషు వలస రాజ్యములకును పొత్తు కలియుట యసంభవము. సంపూర్ణ స్వాతంత్ర్యము ననుభవించుచున్న యమెరికా సంయుక్తరాష్ట్రములలో నల్లవారగు నీగ్రోల యిక్కట్టులు ఇప్పటికిని అంతరింపలేదు. ఇది కన్నులార చూచుచు ఇంకను మనము మోసపోనేల? ఇంగ్లాండు రాజు క్రిందనే యుండి మనము క్రమక్రమముగా వారి వలస రాజ్యములవలె సంపూర్ణస్వాతంత్ర్యమునకు ప్రయత్నము చేయుట మన విధి. మనము దుర్మార్గపు జర్మనీ రష్యా మొదలగు రాష్ట్రముల బారినుండి తప్పించుకొనుటకు మనలను బలవంతులుగ చేయుట మన యాంగ్లేయుల విధి. ఈ విధులను నెఱవేర్చుకొన్నయెడల ఉభయులకును శ్రేయస్కరము. ఇంతియే కాని, మనకు సంయుక్తసామ్రాజ్యస్థాపన మెన్నటికిని వలదు.

మన యిండియా దేశము మట్టునకు భాషలను బట్టి రాష్ట్రముల నేర్పఱచి సంయుక్తరాష్ట్రపరిపాలనమును స్థాపించుకొనవలెను. ఆయా రాష్ట్రపరిపాలనము ఆయా భాషల మూలముననే సంపూర్ణముగ జరుగవలెను. సామ్రాజ్యపరిపాలనకును విదేశీయులతోడి వ్యవహారములకును ఇంగ్లీషు హిందీ భాషలు నేర్చుకొనవలెను. మన సంపూర్ణ రాజకీయస్వాతంత్ర్యమును దేశములో నెవ్వరికిని భంగము లేకుండ రక్తపాతము లేకుండ సంపాదించుకొనుటయే మన పరమావధి. దీని నందుకొనవలె నన్న కొంత కాలము బ్రిటిషువారి క్రిందనే యుండినగాని యిది చేకూఱదు. ఆసియాఖండములో జర్మనీ రష్యా జపాను చీనా దేశములు స్నేహభావముతో మన బ్రిటిషువారిమీద సమ్మెకట్టు కట్టినయెడల మన గతి యేమి? అట్టి కూడిక సంభవింప దని యెవరు చెప్పగలరు? మన లిప్పటి బలహీనదశలో ముందు కూడ బ్రిటను ఉంచినయెడల, ఆఱువేల మైళ్లె దూరమందున్న మన ప్రభువులు మన కేలాగు సహాయము చేయగలుగుదురు? అప్పుడు మన స్వాతంత్ర్యములను మనము పోగొట్టుకొని యితరుల నిరంకుశప్రభుత్వము క్రింద మన మెల్లపుడు బానిసలమై యుండవలసివచ్చును.

కాబట్టి, మన బ్రిటిషు ప్రభువులు, మనకు వలస రాజ్యములతో సరి సమానముగ స్వాతంత్ర్యముల నొసంగుటయే గాక, ఆసియా ఖండములోను సామ్రాజ్య ముండవలె నన్నయెడల మనలను బలవంతులుగ చేసితీరవలెను. ఇది మన చేతులలో కూడ చాల భాగ మున్నది. జపాను దేశమువా రవలంబించిన పాశ్చాత్యపద్ధతు లన్నియు మన కక్కఱలేదు. రాజకీయజ్ఞానమును జనులలో వెదచల్లి న్యాయ విధికి లోబడు లక్షణములను వారికి అలవడజేసినయెడల ప్రజాపరిపాలనమును మన బ్రిటిషువారిచేతనే నెలకొల్పింపగలము. మనము బలవంతులము ధనవంతులము కూడ కాగలము.

## II ఇండియాసంయుక్తరాష్ట్రరాజ్యాంగతంత్రము

బ్రిటిషు పార్లమెంటువారికి బ్రిటిషుమంత్రివర్గమును, బ్రిటిషు మంత్రివర్గమువారికి సెక్రటరీ ఆఫ్ స్టేటు ఇన్ కౌన్సిలువారును, వీరికి ఇండియాగవర్నమెంటువారును, వీరికి మన గవర్నరులును లెఫ్టినెంటు గవర్నరులును జవాబుదారీ వహించునట్లు ప్రస్తుతరాజ్యాంగ విధాన మేర్పడియున్నది. సంప్రదాయపక్షావలంబు లగు ప్రాపవడ్డ సివిలు సెర్వీస్ ఉద్యోగియులతో నిండి మన స్వాతంత్ర్యముల కెల్లపుడును అడ్డు కలుగజేయు సెక్రటరీ ఆఫ్ స్టేటు కౌన్సిలును తీసివేయవలసిన దనియు, సెక్రటరీ ఆఫ్ స్టేటు తక్కిన బ్రిటిషు మంత్రివరులవలెనే పార్లమెంటున కెల్లపుడు లోబడి వారికి సముజాయిషి చెప్పవలసిన దనియు మనము కోరుచున్నాము. పార్లమెంటువారికి మన యిండియా రాజ్యాంగవిషయములను తృప్తికరముగ చర్చించుటకు వకాశము కలుగదు గనుక సామ్రాజ్యసంరక్షణముకొఱకు తప్ప తక్కిన విషయము లన్నిటిలో మన యిండియా గవర్నమెంటువారే స్వతంత్రించి, సెక్రటరీ ఆఫ్ స్టేటువారికి లోబడకుండ పని జరగింపవలెను. అట్లు చేసినయెడల ఇండియా మంత్రి గారికిని ఇండియా గవర్నమెంటువారికిని ఇదివఱ కప్పుడప్పుడు కలుగుచుండిన రగడలు రానేరవు. మన యార్థికస్వాతంత్ర్యము సంపూర్ణముగ నెలకొల్పబడును. మనకు కావలసిన ప్రతిశాసనమునకును ఇండియా మంత్రి గారి యంగీకార మక్కఱ యుండదు. మాంచెస్టరు లంకాషైరుల వర్తకులకు మన దేశము లోబడ నక్కఱలేదు.

పైని చెప్పిన విధానములవలన ఇండియా గవర్నమెంటువారు నిరంకుశు లగుదు రేమో యని కొందఱు భయపడవచ్చును. కాబట్టియే మన శాసనసభలలో ప్రజాప్రతినిధు లెక్కువమంది యుండవలె ననియు ఈ సభకు గవర్నరు జనరల్ గారును వారి కార్యనిర్వాహక సంఘమును లోబడియుండవలె ననియు మనము కోరుచున్నాము. శాసనసభలలో కూడ ప్రజలచే నెన్నుకొనబడు ప్రతినిధులే యుండవలె నను విషయమును గుఱించి భేదాభిప్రాయము లున్నవి. కార్యనిర్వాహకసంఘమువారిని శాసనసభవా రెన్నుకొనుట ఇంగ్లాండులోనే యాచారముగ లేదు! కాని, ఇటీవలి రాజ్యాంగతంత్రసంస్కరణ లీ విధానమును మార్పవలె నని యెంచుచున్నారు. దక్షిణాఫ్రికా శాసనసభవారే తమ కార్యనిర్వాహకసంఘము నెన్నుకొనుచున్నారు.

ఇంగ్లాండులో కూడ ఇట్టి ప్రయత్నము జరుగనై యున్నది.

కార్యనిర్వాహక సభ్యులను శాసనసభలోనుండి మన గవర్నరు జనరల్ గారే యెన్నుకొను సందర్భమందు అట్టి సభ్యులే యిండియా మంత్రివర్గమువా రని చెప్పవచ్చును. వీరికిని శాసనశాఖకును ఐకమత్యము కలుగవచ్చును లేక కలుగక పోవచ్చును. గవర్నరు జనరల్ గా రెన్నుకొన్న మంత్రివర్గమువారియందు శాసనసభవారిలో నెక్కువమందికి నమ్మకము లేక పోవచ్చును. అప్పుడు ఈ మంత్రివర్గము నెట్లు తొలగింపవచ్చు ననునది క్లిష్టసమస్య. ఇంగ్లాండులోని రాజ్యాంగవిధానమును మన మిక్కడ ప్రవేశపెట్టినయెడల, గవర్నరు జనరల్ గారిచేత నేర్పఱుపఁబడు మంత్రివర్గమువారు ఒకానొకప్పుడు శాసనసభనే ఛిద్రము చేసి తిరిగి నూతనప్రతినిధుల నెన్నుకొనుఁడని ప్రజల కుత్తరువు చేయవలసివచ్చుచుండును. అట్టి యధికారము మంత్రివర్గమువారి కీయనియెడల, కార్యనిర్వాహకశాఖ బలహీనమై పరిపాలనము సరిగా జరుగనేరదు. ఇట్టి విధానమును ప్రస్తుతము మన దేశములో నెలకొల్పుటకు కాంగ్రెసువారును ఇష్టపడక రాజప్రతినిధిగారికి శాసననిరాకరణాధికారము నీయవలసియుండు నని చెప్పుచున్నారు. కాని, ఇట్టి యధికారము స్వల్పవిషయములలో కూడ సదా యుపయోగించుట సంభవింపదు. అది యుభయులకును కష్టముగా నుండును. కాఁబట్టి కార్యనిర్వాహకసంఘమునకును శాసనసభకును మధ్యమున కొన్ని ముఖ్యవిషయములను సమ్మతముగా పరిష్కరించుచుండుటకు ఉభయసంఘములలోని సభ్యులును కొందఱు కలసి కమిటీలుగా నేర్పడుచుండవలయును.

ఒకానొకప్పుడు తొందరవలన విసెడి యనాలోచనవలనఁ గాని పట్టుదలవలనఁ గాని! శాసనసభ్యులలో నెక్కువమంది యొక తెలివితక్కువ తీర్మానమును గాని బిల్లును గాని యంగీకరించినపుడు దానిని దిద్దుటకు శాసనసభనే రెండు శాఖలుగా విడఁగొట్టుట యాచారమై యున్నది. ఇంగ్లాండులో వీనిని ప్రభుసంఘ మనియు ప్రజాప్రతినిధిసంఘ మనియు వాడెదరు. ఆస్ట్రేలియాలో కూడ ఇటీవలి యనుభవమువలన ఇట్టి ద్విశాఖాయుతశాసనసభ నేర్పాటు చేసికొనిరి.

ప్రస్తుతము మ. నను గవర్నమెంటువా రేర్పఱచెడి యనుది ప్రతినిధులును కలసియుండుటచే బట్టి రెండవ శాఖ యవశ్యము కాదు. కేవలము ప్రజాప్రతినిధులు గల శాసనసభ యున్నపుడు వీరికంటె రాజ్యపరిపాలనలో నెక్కువ యనుభవము గలవారిని మఱియొక శాఖ నేర్పఱచుట మిక్కిలి యవశ్యము. ఇండియా ప్రభుత్వము సంయుక్తరాష్ట్రపరిపాలనగా మార్పఁబడుచున్నపుడు సంయుక్తరాష్ట్ర శాసనసభలో రెండు శాఖ లుండుటయే యుత్తమ మైన పద్ధతి. ఇదిగాక, వెక్కువర్ణభేదములు మతములు జాతులు విద్యాతారతమ్యములు గల మన దేశములో అందరి లాభములను గమనింపఁగల ప్రతినిధులు ప్రజాప్రతినిధిసంఘముల కెన్నుకొనఁబడక పోవచ్చును గనుక వానినన్నిటిని కాపాడుటకు గవర్నమెంటువారిచేత నియమింపఁబడువారు కొందఱు పైశాఖలో చేర్పఁబడవలసియుండును. జమీందారులు ప్రొప్రయిటర్ల ప్రతినిధులు దానిలో చేరవచ్చును. ఇట్టి ద్విశాఖాయుతశాసనసభ నేర్పఱచినయెడల ప్రస్తుతవిధానములో నున్నట్లు ప్రభుత్వోద్యోగియులు ఈ రెండుశాఖలలో కూడ చేర్చుకొనఁబడఁగూడదు.

సంయుక్తరాష్ట్రప్రభుత్వమును స్థాపించినయెడల, అమెరికా సంయుక్తరాష్ట్రములలోవలె ద్విశాఖాయుతశాసనసభ యుండితీరవలయును. మున్ముందు ఇండియా దేశములో నుండు ప్రతి స్వదేశరాజ్యములోను ప్రజాప్రాతినిధ్యము నెలకొల్పఁబడి, బ్రిటిషు ఇండియా రాష్ట్రములలోవలెనే అక్కడ కూడ ప్రజాప్రతినిధిసంఘములు స్థాపింపఁబడినయెడల, స్వదేశరాజులు పంపు ప్రతినిధులు పైశాఖలోను వారి ప్రజాప్రతినిధులు క్రింది శాఖలోను చేరుట తటస్థపడును. అప్పుడు మన యిండియాదేశశాసనసభ జర్మనుసామ్రాజ్యములోనిదానివలె నుండును. స్వదేశరాజులు తమ రాజ్యములలో ప్రజాపరిపాలనమును నెలకొల్పనంతవఱకు, వారి ప్రతినిధులను సామ్రాజ్యశాసనసభలో చేర్చుకొనుటకు వీలు లేదు. వివిధరాష్ట్రములలోను ద్విశాఖాయుతశాసనసభ లేర్పడుటను గుఱించి ముందు మన యనుభవమువలనఁ గాని ప్రస్తుత మాలోచింపవలసిన పని లేదు.

వీరేశా మనకు ము

# ఆంధ్రులభాష తెలుఁగా?

వేమూరి విశ్వనాథశర్మ, గారు, ఎమ్. ఏ.

ప్రస్తుతము తెలుఁగువారు నివసించు దేశమునకు మొదటి నుండియు ఆంధ్రదేశ మను పేరుండె ననియు వారి భాషకు కూడ అనాదిగా ఆంధ్రభాష యను పేరు పర్యాయపదముగ నుండె ననియు పాశ్చాత్యులలోనే కాక స్వదేశీయులలోఁ గూడ హిందూదేశచరిత్రలు వ్రాసిన పండితుల యభిప్రాయము.[1] ఆంధ్రులు ద్రావిడజాతిలోనివా రనియు చంద్రగుప్తచక్రవర్తి కాలములో (అనఁగా క్రీ. పూ. 300 సం. పైని) ఆంధ్రరాజులు కృష్ణాతీరమున నున్న శ్రీకాకుళము రాజధానిగా కృష్ణాగోదావరుల మధ్యమం దున్న దేశమును పాలించుచుండి రనియు విన్సెంటు స్మిత్తు గారి యభిప్రాయము.[2] ఇచ్చటినుండియె మౌర్యవంశానంతరము ఉత్తరహిందూస్థానమును జయించి ఆంధ్రరాజులు మగధరాజ్యము నేలి రని స్మిత్తు గారి సిద్ధాంతము. ఈ యంశములు ఇప్పటివఱకు మనకుఁ దెలిసిన చారిత్రకనిదర్శనములను బట్టి సరియైనవో కావో విచారింతము.

ఇటీవల కొన్ని సంవత్సరముల క్రిందట పి. టి. శ్రీనివాసయ్యంగారు ఆంధ్రుల విషయమై యొక వ్యాసము ప్రచురించిరి.[3] ఈ వ్యాసము ఆంధ్రచరిత్రాభిమాను లందఱు గమనింపఁదగినది. ఇందు ఆంధ్రులు దాక్షిణాత్యులు గా రనియు వింధ్యపర్వతప్రాంతముల నుండెడి యనాగరికజాతివా రనియు వారి భాష తెలుఁగు కా దనియు మొట్టమొదట మగధరాజ్యము నేలి పిదప పరాజితులై క్రమముగా కృష్ణాగోదావరీతీరములకు వలస వచ్చి స్థావరము లేర్పఱచుకొని రనియు అయ్యంగారు సహేతుకముగఁ జూపియున్నారు. ఈ సిద్ధాంతములనే మరికొన్ని చరిత్రాంశములచేతను యుక్తులచేతను బలపఱచుట యీ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

ఐతరేయ బ్రాహ్మణములోను సాంఖ్యాయనసూత్రములోను ఆంధ్రులు పేర్కొనఁబడియున్నారు. వీరితో కూడ పుళిందులు పుండ్రులు శబరులు మూతిబులు అనార్యజాతులుగ చేర్పఁబడియున్నారు. ఐతరేయబ్రాహ్మణములో "ఉదాంత్యః" (సరిహద్దుల నున్నవారు) అనియు సాంఖ్యాయనసూత్రములో "ఉదంచః" (ఉత్తరదిక్కున నున్నవారు) అనియు నున్నది.[4] దీనిని బట్టి ఋగ్వేదకాలమునాఁటికి ఆంధ్రులు ఆర్యావర్తము (వింధ్యమునకును హిమవత్పర్వతమునకును మధ్యమున నున్న దేశము) నకు ఉత్తరపు దిక్కున నున్నవా రని చెప్పవచ్చును. చంద్రగుప్తుని కాలమున నున్న మెగాస్తనీ సను చరిత్రకారుని ప్రకారము ఆంధ్రు లప్పటికి ఉత్తరమునుండి తూర్పునకో ఆగ్నేయమూలకో వచ్చినట్లు కనఁబడుచున్నది. ఐతరేయబ్రాహ్మణములో నాంధ్రులతోఁబాటు పేర్కొనఁబడిన మూతిబులు మెగాస్తనీసు కాలమునాఁటికిఁ గూడ గంగానది కుత్తరముననే యుండిరి.[5] ఆంధ్రు లుత్తరదిక్కునుండి తూర్పుగా దక్షిణదేశము చేరి యుండుటకు కొన్ని కారణము లున్నవి. మెగాస్తనీసు ఆంధ్రులను "అండారా" అని వ్రాసియున్నాఁడు. ప్రస్తుతము అస్సాము దేశపు సరిహద్దులయం దున్న మణిపురసంస్థానపు కొండలమీఁద "ఆంద్రో" యను నొక కొండ జాతివా రున్నారు. వీరి భాష పేరు "అంద్రో".[6] ఈ భాష టిబెట్టు బర్మా భాషలయొక్క కుటుంబము (Tibeto-Burman family)లో చేరినది. మెగాస్తనీసు తరువాత మరి యిద్దరు పాశ్చాత్యచారిత్రకులు ఆంధ్రులు గంగానది కుత్తరభాగమున నున్నట్లు వ్రాసియున్నారు.[7] వాయుపురాణములో ఆంధ్రులు ఆర్యావర్తదేశ (మధ్యదేశ) మునకు తూర్పు దక్షిణముల నున్నట్లు వ్రాయఁబడియున్నది. తూర్పున ముందు ఆంధ్రులు తరువాత బెంగాలీలు చెప్పఁబడిరి. దక్షిణమున కుంతలులు తరువాత ఆంధ్రులు వారి తరువాత వైదేహులు దాక్షిణాత్యులు పేర్కొనఁబడిరి. దీనిని బట్టి ఆంధ్రులు దాక్షిణాత్యులకంటె విలక్షణమైన జాతివా రని తేలుచున్నది. వరాహమిహిరుని బృహత్సంహితలో (క్రీ. శ. 6-వ శతాబ్ది) కోసల అంగ వంగ కళింగ విదర్భులు ఆంధ్రులు ఆర్యావర్తమున కాగ్నేయమూల నున్నట్టు వ్రాయఁబడియున్నది. కాని, క్రీ. శ. 7-వ శతాబ్దిలో మన దేశమునకు వచ్చిన చీనాయాత్రికుఁ డగు హూనత్సాంగు వ్రాఁతలను బట్టి యాంధ్రు లప్పటికే యీ కృష్ణాగోదావరీతీరముల నాక్రమించుకొని తావరముల నేర్పఱచుకొనినట్లు కనఁబడుచున్నది. ఏల యన, కోసలదేశము (బేరారు) నుండి దక్షిణమార్గమున సుమారు 900 మైళ్ళు ప్రయాణము చేసి యుండియా దేశము చేరినట్లు హూనత్సాంగు వ్రాసినాఁడు.

పైని వ్రాసిన యంశములను బట్టి యాంధ్రులు శ్రీనివాసయ్యంగారు వ్రాసినట్లు వింధ్యప్రాంతముల నున్న జాతులలో నొకరు గా యుత్తరహిందూస్థానమున మొట్టమొదట నుండిన యనార్యజాతివా

(1) Vincent Smith—Early History of India. R. G. Bhandarkar—History of the Dhekhan R. C. Dutt—Ancient Civilisation of India, Vol. I. (2) Early History of India, page 194 (3) Indian Antiquary, November 1913. (4) Macdonald—Vedic Index, Vol. . (5) M'crindle—Megasthenes and Arrian, 137-138. (6) R. N. Cust—Modern Languages of the East Indies (7) Pliny and 'Pentinger Tables"

SIR BERNARD HUNTER



సర్ బర్నార్డు హంటరు గారు

Mr. C B N. PELLY



సి. బి. ఎన్. పెల్లి గారు

HON'BLE Mr T RICHMOND



గౌ. టి. రిచిమండు గారు

HON'BLE SURGEON GENERAL GIFFORD, C S I I M S



గౌ. సర్జను జనరలు గిఫ్ఫర్డు గారు
సి. ఎస్. ఐ., ఐ. ఎమ్. ఎస్.

SUBADAR MAHAMMED AJEEM KHAN BAHADUR, I D F



సుబేదారు మహమ్మదు అజీము
ఖాను బహద్దరు గారు, ఐ. డి. ఎఫ్.

HON'BLE SIR E F. BARBER



గౌ. ఇ. ఎఫ్. బార్బరు గారు

PRINCE YOUSSOUFOFF



ప్రిన్సు యుసొస్ఫొఫ్ గారు

M. GUTCHKOFF



ఎమ్. గుచికాఫ్ గారు

M SAZONOFF



ఎమ్. సెజోనాఫ్ గారు

Mr J W. BHORE, I. C. S.



జె. డబ్ల్యూ. భోరు గారు, ఐ. సి. ఎస్.

J. C ADAM Esq

జె. సి. ఆడమ్ గారు

Mr. W. A. BEARDSELL



డబ్లియు. ఎ. బియర్డ్సెల్లు గారు

PAUL MILINKOFF



పాల్. మిలిన్ కాఫ్ గారు

Mr D B M KRISHNANAIR



డి. బి. ఎమ్. కృష్ణనాయరు గారు

LIEUT. GEN THE HON. J. C SMU



లె. జనరలు గౌ. జె. సి. స్మట్స్

SIR EDWARD. P MORRIS



సర్ ఎడ్వర్డు, పి.మారిస్ గారు

SIR JOESPH WARD



సర్ జోసెఫ్ వార్డు గారు

Mr. WALTER LONG



వాల్టరు లాంగుగారు

రని చెప్పవచ్చును. హిమవత్పర్వత ప్రాంతములయం దుండిన యనార్య జాతు లనేకములు క్రమముగ భారతఖండ మంతయు వ్యాపించె నని పాశ్చాత్యపండితులలో చాలమంది యభిప్రాయము. ఇప్పటికిని నేపాలు రాజ్యప్రాంతములలో "తులుంగులు" "ఖులుంగులు" "క్లింగులు" మున్నగు కొండ జాతులు గలవు. 1

కొలఁది కాలములోనే యాంధ్రులు పరాక్రమవంతులై మగధ రాజ్యమును వశపఱచుకొని పశ్చిమతీరమునఁ బున్న రాజ్యము నేలి కొంత కాలము గడచిన తరువాత శకవంశరాజులచే పరాజితులై యచ్చటనుండి తూర్పు దిశగా వచ్చి దక్షిణదేశము నాక్రమించుకొని కొంత యధికారమును చెలాయించుచుండిరి. తరువాత కొంత కాలమునకు పల్లవులతో పోరాటము గలిగి యాంధ్ర రాజులు పదభ్రష్టులైరి. కాని, ఇతరదేశములనుండి వెడలఁగొట్టఁబడిన యాంధ్రులు మిక్కుటముగ వచ్చి యిచ్చట స్థిరముగా నివసించుటచేత నీ భాగమునకు ఆంధ్రదేశ మను పేరు మాత్రము నిలిచియున్నది. కేవలము రాజులవలననే యీ పేరు వచ్చియుండినయెడల మగధదేశమునకుఁ గూడ ఆంధ్రదేశ మను పేరు వచ్చియుండవలెను.

ఆంధ్రులు రాకమును పీ భాగమున కాంధ్రదేశ మను పేరు లేదను వాదమునకు మరియొక నిదర్శనము చూపవలసియున్నది. ఆంధ్రు లీ దేశమునకు రాక పూర్వమే వారు మగధదేశమున కైనను రాజులు గాక మును పే ఆర్యులు దక్షిణదేశమును ప్రవేశించి తంజావూరు మధురపట్టణములవఱకు వెళ్లినట్లు నిదర్శనము లున్నవి.2 హిందువ్వార్యులు మతకర్మములలో సంకల్పము చెప్పునప్పుడు దేశనిర్దేశము చేయుట యాచారమై యున్నది. మహారాష్ట్రులు సంకల్పములో "మహారాష్ట్రదేశే" అని చెప్పక "దండకారణ్యే" అని చెప్పుదురు.3 అనఁగా తొలుదొల్త ఆర్యు లచ్చట ప్రవేశించినప్పు డా దేశమునకు మహారాష్ట్ర మను పేరు రాలేదని యూహింపఁదగియున్నది. ఇట్లే యాంధ్రులు సంకల్పములో ఆంధ్రదేశముయొక్క పేరు చెప్పుట లేదు. "మేరోర్ దక్షిణదిగ్భాగే" యని చెప్పుదురు. కర్నూలు నెల్లూరు గుంటూరు కృష్ణా గోదావరీ మండలములలో "శ్రీశైలస్య నైరృతి ఆగ్నేయ లేక ఈశాన్య ప్రదేశే" అని కూడ పైదానితోఁ జేర్చి చెప్పుదురు. దీనిని బట్టి మొట్టమొదట ఆర్యు లీ దేశమునకు వచ్చినప్పుడు ఆంధ్రదేశ మను పేరు వాడుకలో లేదని చెప్పవలసియున్నది.

ఇఁక ఆంధ్రుల భాష విషయమై కొంత వ్రాయవలసియున్నది. ఆంధ్రదేశమునకు త్రిలింగదేశ మను పే రున్నట్లు ఆంధ్రభాషకు త్రిలింగభాష యనియు తెలుఁ గనియు నామాంతరము లని కొందఱి యభిప్రాయము. ఆంధ్రుల భాష విషయమై పాణినిలోను పాతంజలి భాష్యములోను ప్రశంసించిన ట్లొక పాశ్చాత్యపండితుఁడు సందర్భము తెలుపకయే వ్రాసియున్నాఁడు.4 దీనిని బట్టి కాఁబోలు మానవల్లి రామకృష్ణకవి గారు వీరేశలింగము పంతులు గారు మున్నగు పండితులు త్రిలింగభాషాప్రశంస వ్యాకరణభాష్యములలో నున్న దని నుడివిరి. ఈ క్రింద వ్రాయఁబోవు రెండు వాక్యములు పాతంజలి భాష్యములోని వని యుదాహరణముగా నియ్యఁబడెను:

1. త్రిలింగభాషాయాః కో ధాతుః, కః ప్రత్యయః కిం ప్రాతిపదిక మితి భగవతా భాష్యకారేణ క్షేపః కృతః.
2. ఏషా త్రిలింగభాషా సంస్కృతభాషా మూర్తేతి ప్రసిద్ధగాః పూర్వ మేవ ఏకశబ్దస్సమ్యగ్జ్ఞాతః ప్రయుక్తః స్వర్గలోకే కామధుగ్భవతి.

ఈ వాక్యములు పాతంజలిభాష్యములోనే యున్నయెడల త్రిలింగశబ్దమునకును భాషకును ప్రాచీనత వచ్చితీరవలెను. కాని, తా మెంత వెదకినను వ్యాకరణభాష్యములో నీ వాక్యములు కానరావని కొమఱ్ఱాజు లక్ష్మణరావు గారు లిదివఱలో నాతో చెప్పియున్నారు. ఇటీవల నే నీ విషయమై ఇంతకును వాస్తవ్యులు జయంతి భగీరథశాస్త్రులవారికి వ్రాయఁగా వారును అదే విధముగ నెలవిచ్చిరి. పై రెండు వాక్యములలో మొదటిది కొంత భాగము సిద్ధాంతకౌముదీ వ్యాఖ్యాన మైన మనోరమ యనెడి గ్రంథమునందుఁ గల దనియు రెండవ దానిలో కొంత భాగము వ్యాకరణభాష్యములో నున్న దనియు ఇందులో నొకటైన త్రిలింగభాషావిషయము మాత్రము లే దనియు జవాబు వ్రాసిరి. దీనిని బట్టి త్రిలింగశబ్దప్రాచీనతకే లోపము వాటిల్లినది. ఋగ్వేదకాలమున ఆంధ్రుల ప్రశంస యుండుటయు వ్యాకరణభాష్యములో త్రిలింగభాషావిషయము లేకపోవుటయు చూచి యున్న దనుకొనుటయు ఆంధ్రుల భాష తెలుఁ గే యను భ్రమకు కారణము లైనవి. పతంజలి "దక్షిణాపథ" మను శబ్దము నుపయోగించెను. ఇది యాంధ్రదేశమునకు వర్తించు నని కొందఱి యభిప్రాయము. ఈ శబ్దార్థము మాఱుచుండెను. దక్షిణాపథము మహారాష్ట్రదేశమునకుఁ గూడ వర్తించును.5

ఆంధ్రుల భాష తెలుఁగు కా దనుటకు పెక్కొన్ని ప్రబల కారణము లున్నవి. అచ్చ తెనుఁగు కేవలము ద్రావిడభాషాసాంప్రదాయముల ననుకరించియున్నది. ఆంధ్రులు వాడుక చేసిన భాషలన్నియు సంస్కృతసాంప్రదాయముల ననుకరించిన ప్రాకృతభాషలే. వారి శాసనము లన్నియు ప్రాకృతభాషలలోనె యున్నవి. ఆంధ్రరాజుల నాణెములు సయితము ఉత్తరహిందూస్థానపు నాణెముల మాదిరిగ చెక్కఁబడినవి. 17 వ యాంధ్రరాజైన హాలుని భార్యకొఱకై వ్రాసిన "బృహత్కథ" యను గ్రంథము పైశాచికభాషలో వ్రాయఁబడెను. ఆంధ్రుల మాతృభాష తెలుఁగే యైనచో వందల కొలఁది సంవత్సరములు ఏకచ్ఛత్రముగ రాజ్యవైభవము ననుభవించిన యాంధ్రరాజులు తమ మాతృభాషలో నొక్కటైనను స్మారకచిహ్నమును నెలకొల్పకుండు టసంభవము, అవిశ్వసనీయము. ఇట్టి సందర్భములలో ఆంధ్రుల మాతృభాష తెలుఁగు కా దని

(1) Hodgson—Essays Relating to Indian Subjects, Vol. I. (2) Bhandarkar—Bombay Gazetteer, Vol. I, Part II, Page 141. (3) Bhandarkar—Bombay Gazetteer, Vol. I. Part II, Page 136. (4) R. W. Frazer—Literary History of India, Page 306 (5) Bhandarkar--Bombay Gazetteer, Vol. I, Part. II, Page. 133.

చెప్పుట నేల విడిచిన సాము కాదని నా యభిప్రాయము.

ఆంధ్రదేశమునకు తెనుఁగు దేశమనియు ఆంధ్రభాషకు తెలుఁగు భాష యనియు నామాంతరము లెట్లు కలిగెనను విషయమై యించుక విచారించెదము. అరవ భాషలో తెలుఁగునకు "వడుగు" అను పద ముపయోగములో నున్నది.[1] వడుగనఁగా ఉత్తరమునుండి వచ్చిన దని యర్థము. కాని, ఇది యెచటినుండియు తెలుఁగున కుపయోగించుట యసంభవము. ఏల యన, ఇప్పుడు "నీలగిరి" కొండలపై నివసించుచున్న "బడుగులవాండ్రు" పూర్వము గుంటూరు జిల్లా నందలి కాఁపుర మునుండి రనుటకు శాసనాధారము లున్నవి.[2] ఇప్పటికిని నెల్లూరుజిల్లా పొదిలె డివిజనులో "బడుగులు" రను గ్రామము గలదు. కొంతకాలము తరువాత బడుగులవాండ్రు కొండలపైకి తఱుమఁబడి అరవ దండలములో నీలగిరులపై వాస మేర్పఱచుకొనిరి. వీ రచ్చట ఉత్తరాదివా రగుటచేత, బడుగుల భాషకు వడుగను పేరు వచ్చియుండును. బడుగుల తరువాత వెళ్లిన తెలుఁగువారు కూడ ఉత్తరాదివారే కనుక తెలుఁగునకు కూడ ఆ పేరే వాడుకలోనికి వచ్చియుండును. అథర్వణాచార్యుఁడు లోనగు నాంధ్రభాషాకోవిదులు తెలుఁగు శబ్దమున కిచ్చిన వ్యుత్పత్తులు (త్రిలింగ; త్రినగ; తెలుఁగు— తేటయైనది, ప్రకాశించునది; తెనుఁగు— తేనెవంటిది) చమత్కారము లైన వైనను పాశ్చాత్యపండితులకు నచ్చలేదు.[3] ఆర్యభాషలయొక్క సంపర్కమువలన తెలుఁగు శబ్దము వాడుకలోనికి వచ్చిన దని తోఁచుచున్నది. ఆర్యులును ఆంధ్రులును రాక మును పీ దేశభాష యేమి పేరుండెనో నిర్ధారణ చేసి చెప్పుటకు వీలు లేదు. తెలుఁగు భాషకు పేరు దేశమునుండి వచ్చిన దని చెప్పవచ్చును. "తెలుఁగునాటివారు" (తెలఘాణ్యులు), "తెలుఁగులు" (తెలగాలు), "తెలికులవాండ్రు" (తైలవ్యాపారము చేసెడివారు) అను శబ్దములలో తెలుఁగు వాసన పూర్తిగ నున్నది. మహమ్మదీయులు తరువాత వరంగలు రాజ్యమును "తెలింగాణా" యని పిలిచెడివారు. ఈ శబ్దమునొక్క సంస్కృతరూపమే "తెలఘాణ్య" లని చెప్పవచ్చును. తెలుఁగునాఁ డను పే రెట్లు వచ్చెనో చెప్పవలసియున్నది. ద్రావిడభాషలలో నాఁ డనఁగా దేశ మని యర్థము. దేశములకు పేళ్లు అనేకవిధముల వచ్చును. దేశముయొక్క రూపమును బట్టి గాని (మలయాలం — కొండభూమి, కొడగు — వంకర భూమి) ప్రజలను బట్టి గాని (ముల్కినాడు — సురకల రాజ్యము) భూమియొక్క గుణమును బట్టి గాని (కర్ణాటకము — కారునాడు — నల్ల రేగడ భూమి) పేళ్లు కలుగవచ్చును. అట్లే ఆంధ్రులును ఆర్యులును క్రొత్తగా నీ దేశమునకు వచ్చునప్పుడు విస్తారముగ నువ్వుల పంటను జూచి గాని ప్రజలలో ననేకులు తైలవ్యాపారము చేయుచుండుటను జూచి గాని కొంత భాగమునకు "తైలికుల నా" డని పేరు పెట్టియుండవచ్చును. ఆంధ్రు లీ దేశమున ప్రబలిన తరువాత దేశమునకు ఆంధ్రదేశ మను పేరు కూడ వచ్చియుండును. కాని, తెలుఁగు భాష మిక్కిలి మధుర మైనదియు సులభ మైనదియు నగుటచేత ఆంధ్రుల భాషను కూడ కబళించి వారి భాషను నామావశిష్టము చేసినది. ఆంధ్ర భాషలోని పదములు చాలవఱకు ప్రాకృతపదములు. అనఁగా ఆంధ్రులనుండి సంగ్రహించినవని చెప్పవచ్చును. తెలుఁగు దేశమునకు వలస వచ్చిన యితర జాతులు తమ మాతృభాషను మఱచి తెలుఁగు నేర్చుకొనెద రనుట యాశ్చర్యము కాదు. తెలుఁగు దేశమునకు వచ్చిన ద్రావిడులు అఱవము మఱచిపోవుటయు ఏ దేశములో నున్నను తెలుఁగువారు తమ మాతృభాష నే యిండ్లలో వాడుకొనుటయు మన కనులారఁ జూచుచున్నాము. కాఁబట్టి, పూర్వపు టాంధ్రులు తమ భాషను వదలి తెలుఁగునే మాతృభాషగా చేసికొని రనుటలో వింతె లేదు. ఆంధ్రులు తెలుఁగు భాషకు లిపి నిచ్చియుందురు. ఏల యన, హుయాంత్సాంగు ఆంధ్రదేశలిపి మధ్యమపరగణాల లిపిని బోలియున్న దని వ్రాసెను. అతని తరువాత వచ్చిన "ఆల్బరూని" యనెడి యాత్రికుఁడు ఆంధ్రదేశమునందలి లిపి "ఆంధ్రి" యనియు అది కర్ణాటభాషయొక్క లిపికంటె విలక్షణ మైనట్లును వ్రాసియున్నాఁడు.[5] కాని, తెలుఁగుదేశమునకు ఆంధ్రదేశ మను పేరు త్వరగా వచ్చినను తెలుఁగు భాషకు ఆంధ్రభాష యను పేరు వచ్చుటకు కొంత కాలము పట్టినట్లు తోఁచుచున్నది. ఆంధ్ర దేశీయులు రెండు శబ్దముల నొకే యర్థమున వాడినను (ఆల్బరూని) నన్నయభట్టు సాక్ష్య మైనంతవఱకు "తెనుఁ" గనియే భాషార్థములో వాడియున్నాఁడు. నన్నయభట్టెక్కడ నయినను భారతములో "ఆంధ్ర" శబ్దము "తెనుఁగు"నకు పర్యాయపదముగ వాడెనేమో పండితులు శోధించుటకు ప్రార్థితులు.

పై చర్చవలన తేలిన సారాంశములు:

(1) ఆంధ్రులు ఉత్తరదేశమునుండి యిచ్చటికి వచ్చి నివాసము లేర్పఱచుకొనిరి.

(2) ఆంధ్రుల మాతృభాష తెలుఁగు కాదు.

(3) ఆంధ్రులు రాక మునుపు ఈ దేశమున కేమి పేరుండెనో నిర్ధారణ చేయుటకు వీలు లేదు.

(4) తెలుఁగు భాషకు దేశమువలన పేరు వచ్చెను.

(5) ఆంధ్రు లిచ్చట ప్రబలిన తరువాత ఆంధ్రదేశ మనియు దానిని బట్టి ఆంధ్రభాష యనియు పేళ్లు వచ్చినవి.

ఈ సిద్ధాంతములు నాయి గ్రుడ్డినట్లు చెప్పఁదగినవి కావు; బొత్తిగా గాలి ప్రోవులును కావు. కావున, ఆంధ్రభాషాభిమానులు చక్కఁగ పరిశీలించి తగిన చర్చ చేయుటకు ప్రార్థితులు.

(1) Caldwell - Comparative Grammar of Dravidian Languages, 29. (2) Nellore Inscriptions - Vol. 1, 2, 3, and Caldwell, Comparative Garmmar, 30. (3) Grierson—Linguistic Survery of India, Vol. 4, Page 575. (4) Caldwell - Comparative Grammer—30. (5) Alberuni's India, Vol. I, Chapter. 16.

# ఆర్యసేవకశిక్షాలయము *

కోసల్లి హనుమంతరావు పంతులు గారు, ఎమ్. ఏ., బి. ఎల్.

రాజకీయపరిస్థితులు కేవలవిషమము లగుటచే అసలే విశీర్ణ మగుచున్న హిందూమహమ్మదీయమతముల సాంఘిక వైజ్ఞానిక సంయోగమును సమూలముగ నాశనము చేయుటకో యన కొన్ని ప్రత్యేకసంఘములు దేశీయరంగమున నావిర్భవించినవి. వీనిలో నైరోపా యమెరికా ఖండములనుండి దిగిన క్రైస్తవప్రచారకసంఘములును రక్షణసైన్యమును ప్రముఖములు. వీరు తెలిసియో తెలియకో మన యార్థిక రాజ్యాంగ దుస్థితిని విద్యావిహీనతను అవకాశముగాఁ గొని, స్వతంత్రాలోచనాపరు లగు పెద్దలనుకాక, విశేషించి పొట్టకూటికై కక్కూఱిపడు జనసమూహములనే మతాంతరులుగ మార్చుచున్నారు. ఇంతకన్న నక్రమము క్రౌర్యము నుండఁబోదు. వారు కావించునది స్వమతభ్రష్టత మాత్రమే కాదు. సంపూర్ణముగ విజాతీయాచారములను విజాతీయజీవనవిధానములను అవలంబింపఁజేసి హృదయమును విజాతీయముగ నొనర్చి జాతిగౌరవాద్యమను లన్నింటి యెడల విరోధభావమును కల్పించి వారిని స్వజాతిదూరులుగ చేయుచున్నారు. అన్యమతప్రచారముచే స్వమతస్థుల సంఖ్య సన్నగిల్లు మాట యటుండ, వివిధమతములకు నుండెడి పరస్పరసహనము నశించుట కూడ సంభవించును. ఇట్టిచో వివిధజాతులకును భిన్నమతములకును ఒక్క సామాన్యవిజ్ఞానమునందు ఒక్క సామాన్యలక్ష్యమునందు సామరస్యమును సౌందర్యమును సాధించుటయే ప్రధానలక్షణముగాఁ గల భారతజాతీయతయొక్క విశృంఖలవికాసమునకీ ప్రచారకసంఘము లెంతయు హానికరము లనుట నిర్వివాదాంశము.

ప్రచారకవృత్తియే సంఘశాంతికి భంగకర మైనప్పుడు పెద్దలను పిన్నలను వారి దైన్యమౌఢ్యముల నవకాశముగాఁ గొని వారికి స్వతంత్రాచరణమున కెడ నీయక స్వమతభ్రష్టులనుగాఁ జేయుట భారతజాతీయత కెట్టి విఘాతమో యూహించుకొందురుగాక! మఱియు, ఈ ప్రచారకసంఘములు పంచములు మున్నగు హిందూ నిమ్నజాతులలోను తమ విద్యాలయవైద్యాలయములందును అవలంబించు పద్ధతులను పరిశీలించినచో వీరు మానవసేవ నెపమున మతప్రచారము కావించుచున్నా రనుట విశదము కాఁగలదు. ఇం దెంతవఱకు వారు సఫలమనోరథు లగుచున్నారో యే ప్రచారకసంఘకార్యములతో నైన పరిచయము గలవారికి తేటతెల్లమే.

ఈ సంఘములవల్ల కలిగెడి దేశానర్థమును గుర్తెఱుంగుటకు వీరి వివిధసంరంభములను గమనించుట యవసరము. ఏ సంఘమునందలి బిడ్డలా సంఘమున పరంపరాగతముగ వచ్చు విజ్ఞానమున పాల్గొనుచు ఆత్మగౌరవమును అన్యమతగౌరవమును అభ్యసింపఁగలుగుట సర్వసంఘములకును గల ప్రధానస్వత్వము. మతమును మార్చుటే తమ ముఖ్యోద్యమ మగుటచే ప్రచారకసంఘము లీ ప్రధానస్వత్వమునకు కేవలభంగకరము లని వేఱుగ చెప్పనక్కఱ లేదు. వీరి విద్యాలయములలో ననుదినము నుదయప్రార్థనావసరమున హిందూ ముసల్మాను బాలురచేఁ గూడ నిర్బంధించి క్రైస్తవప్రార్థనను చేయించుచుండుట యెఱిఁగియు నీ బడులలోనికి మన బాలకులను పంపమాన కుండుటను చూడ భారతీయు లెంత బానిస లైనదియు ప్రకటము కాఁగలదు. జాతీయాభిమానలేశము గలవాఁ డెవ్వఁడైనను ఈ దుస్థితికి సిగ్గుచే తల వంచుకొనక పోఁడు.

ఈ విద్యాలయముల మూలమున నెందఱో మతాంతరు లగుట మాత్రమే కాక మఱియొక గొప్ప ముప్పు కూడ వాటిల్లుచున్నది. అపక్వహృదయు లగు బాలురయెదుట దినదినమును జాతీయజీవనాదర్శములను జాతీయవిజ్ఞానమును నిరసించుటచే వారు పరమతస్వీకారమును గావించినను మానినను జాతీయవికాసధారను నిలుపుట కత్యావశ్యక మగు ప్రాచీనచరిత్రాగౌరవమును జాతీయభావిభాగ్యవిశ్వాసమును వారి హృదయరంగములనుండి నానాఁట తొలఁగిపోఁగలవు.

ఈ ప్రచారకసంఘముల యాజమాన్యము క్రింద బాలికలకొసంగు శిక్షణము జాతీయవిజ్ఞానవిశుద్ధి కెంతయు ననర్థకముగా నున్నది. ఆర్యుల శిక్షావిధానమున బాలురకంటె బాలికల జీవితము జాతీయసాంప్రదాయములతోను ఆదర్శములతోను నెక్కువ సమ్మిశ్రితమై వత్సరమునందలి వివిధఋతువిశేషములతో విస్తారసంబంధము కలిగియుండును. గృహజీవనమే వారి కొక సంపూర్ణశిక్షావిధానము. ప్రతిమాసమును ప్రతిపండుగయు చిరస్మరణీయము లగు నాదర్శములను చిత్తవికాసప్రదము లగు ప్రవృత్తులను మన బాలికల స్మృతిపథమున నెట్టుచుండును. అట్టి బాలిక లీ క్రైస్తవభావప్రపూరితము లగు పాఠశాలలలో నడుగు పెట్టినంతనే యంతయు విరుద్ధముగా నుండును. దైవానుగ్రహముచే మన గృహసాంప్రదాయముల బలిమి మూలమున నీ శిక్షణము ప్రచారకుల కంతగా కార్యకారి కాకున్నది. కాని, ఇట్టి విజాతీయవిద్యాలయములకు నాలుగు తగుకులను నేర్పుటకై బాలికలను పంపి వారియందలి విశుద్ధము లగు నార్యసుగుణములను రూపుమాప సమకట్టుట ఆహా! ఎంతటి యజ్ఞానము! ఏ మన, కాలము గడచిన కొలఁదిని సంఘవికాసము నూతనమార్గములఁ ద్రొక్కు కొలఁదిని ఇంతదనుక హిందూగృహలక్ష్మి యవిచ్ఛిన్నముగ కాపాడుకొనుచువచ్చిన ప్రాచీనవిజ్ఞానమును భక్తియుఁ గూడ నిందు మూలమున క్రమముగా నంతరింపఁగలవు. ఇఁక వైద్యాలయములందలి కార్యక్రమమును చూతుము. అజ్ఞాను లగు స్త్రీలును బాలురును రోగపీడితులై యాశ్రయము కోరు అవసరమున ఈ ప్రచారకులు వారి యందుఁ జేరి నెనరు లేక న్యాయము లేక వారి హృదయములను స్వమతనిందాపరమతప్రశంసలచే నెంతయు కలుషితపఱుపఁ జూచెదరు. ఇయ్యదియే వీ రొసంగు వైద్యసాహాయ్యమునకు మనము పోయవలసిన ధన మగునేని, మనము శక్తియు నారోగ్యమును జ్ఞానమును కోల్పోయినఁ గోల్పోవుదుము కాని, జాతీయవిధ్వంసమునకు మాత్ర మొడిగట్టకున్నఁ జాలును.

హిందూసంఘపటుత్వమును క్షీణింపఁజేయు మూఁడవ ప్రయత్నమే మనఁగా, పంచము లాదిగాఁ గల నిమ్నజాతులను బహ

* ఇది ఆంధ్రజాతీయవిద్యాపరిషద్యాజమాన్యము క్రింద స్థాపింపఁబడును.

సంఖ్యాకులను క్రైస్తవమతమున చేర్చుట. ఈ ప్రచారకసంఘము లన్యసంఘమధ్యమున గలకంతముగాఁ జొచ్చి దేశదారిద్ర్యము నవకాశముగాఁ జైకొని యాక్రమణమునకు సాహసించి హిందూసంఘము స్వయముగాఁ గాపాడుకొను పునర్నిర్మాణప్రయత్నమున కడ్డుపడుచుండుట యెంతయు నన్యాయము కని చెప్పక తప్పదు. హిందూసంఘము మతవిశ్వాసములలో సంపూర్ణ మగు వ్యక్తిస్వాతంత్ర్యము నొసంగి భేదభావమున కెంతయో యెడ మిచ్చియుండుటచే హైందవుఁడు క్రైస్తవుఁడుగా మాఱినంత మాత్రమున నంతగా నైతికనష్టము లేదు. కాని, అన్యసంఘప్రవేశముచే స్వజాతీయద్వేషతిరస్కారములు కలుగుచున్నవి. వానిని నిర్మూలించుట కొక్కటియే ప్రతిక్రియ గలదు. ఇయ్యది భారతజాతీయవికాసమునకు నూతనవిషయము కాదు. నూతనములైన విదేశీయవేషభాషాభావములనుండి దూరము గావించి యందుపై భారతజాతీయముద్ర నుంచుటయే యా యేకసాధనము. హైందవక్రైస్తవులే యీ యుత్తమకార్యమున కిప్పటి పూనుకొనియుండుట యెంతయు సంతోషదాయకము.

మఱియొక ముఖ్య మగు నాతుంతకారణ మేమన, రక్షణసంఘము మున్నగు క్రైస్తవప్రచారకసంఘములు ప్రభుత్వమువారి గౌరవసాహాయ్యములతో ఎరుకలు ఏనాదులు మొదలగు గుంపువాండ్రను ఖయిదీలుగ చేసి పనికట్టుచున్నవి. కేవలసేవాపరత్వముచే నైనను స్వతంత్రక్రైస్తవప్రభుత్వమునకును శ్వేతక్రైస్తవప్రచారకసంఘములకును సంయోగము మేర్పడినప్పుడు ప్రచారకులకు విశేషాధికారమును బలముబడెయు లభించుట సహజము. తోడనే వానిని తమ యుద్యమవ్యాప్తికి ముఖ్యసాధనముగ వాడుట ప్రచారకులకు పరిపాటి యగుచున్నది. యజమానులకు గుంపులపై ననుమానము హెచ్చు. ఆ నియమములను గల సాంఘికభేదము విశేషము. ఇట్టిచో నీ కార్యనిర్వహణమున నెన్నియో చిక్కు లేర్పడుట సహజము. వీనిని పరిష్కరించుట కిట్టియంత్రములను మార్గముగ క్రూరదండనమును మాత్రమే వారు ప్రయోగించుచున్నారు. యజమానులకును గుంపులకును వలయునంత యన్యోన్యపరిచయము లేకుండుటచే వారిని సంస్కరించుట కెంతటి సౌకర్యము లున్నను నిష్ప్రయోజకములై ప్రచారకనివేశములయందలి గుంపువాండ్ర జీవనము జైలులలోని జీవనముకంటెను నికృష్ట మగుచున్నది. రక్షణమునందు దయాదాక్షిణ్యములకును నీతికిని ముఖ్యస్థాన మొసంగఁబడిన పట్టులనే సంస్కరణమున కెక్కుడు సౌకర్య ముండును. అట్టి యుత్కృష్టకార్యమును విజాతీయప్రచారకులకన్న స్వజాతీయులే వారి యంతర్జీవనాభ్యాసములను బాగుగా గుర్తెఱుంగఁగలుగుటచే సులభముగను ప్రశస్తతరముగను నిర్వర్తింపఁజాలుదురు. దొరతనమువారీ సత్యమును గమనించి గుంపువాండ్రను సంస్కరించుటకై ముందంజ వేయు నే స్వదేశీయసంఘమునకైనను సమానావకాశములను సాహాయ్యమును తప్పక యొసంగుట విధాయకధర్మము.

స్వయంరక్షణార్థ మగు నీ మహత్కార్యమును సాధించుటకై యీ పిలుపు హిందూసంఘమునం దెచ్చటనేని యొక్క స్వల్పప్రయత్నమైనను జరిగియుండుట గానము. సర్వబలసంపన్న మగు శత్రువర్గము మన దుర్గద్వారముల నే ముట్టడించి కఠోరాఘాతములు వైచుచుండఁగా మనము శతశతాబ్దులనుండియు చేతఁగానివారివలె చేతులు నలుపుకొనుచు నిలుచున్నారము. నేఁ డొక ప్రక్క క్రైస్తవప్రచారకసంఘములు మన సంఘమధ్యమున ప్రవేశించి లక్షల కొలంది జనసమూహములను నిరాఘాటవృత్తితో మతాంతరులుగ చేయుచుండ, మఱియొక ప్రక్క రక్షణసంఘమువారు మూఢమానవవర్గములను స్వాధీన మొనర్చుకొని వారిని గాకున్న మానె వారి బిడ్డల నైన తప్పక క్రైస్తవులనుగా చేయుటకు వలయు సదుపాయములను పన్నుచున్నారు. హిందూసంఘరక్షణార్థము కల్పించిన యాచారవిధులలో విజాతీయుల బారినుండి సంఘమును రక్షించుటకై తోడ్పడఁగల నియమము లేవియు కానరాకుండుట నిక్కముగా సంతాపకరము. మన మెంతయో స్వధర్మపరాయణుల మయ్యును మన సంఘమి ట్లనుదినమును సంఖ్యాసత్త్వములయందు శుష్కించుచు వినాశోన్ముఖ మగుచుండ నుదాసీనముగా నెంత కాలము సహింపఁగలము?

ఇప్పుడు మనలను చుట్టుముట్టుచున్న యపాయమును గుర్తెఱింగిన మాత్రమున చాలదు. హిందూమతము జీవింపఁదలఁచినచో ముందునకు విజృంభించి వచ్చుచున్న వైరివర్గము నెదుర్కొని స్వశక్తిప్రకటనమును స్వమతవ్యాపనమును గావింపఁగడంగుట యత్యావశ్యకము. అనఁగా హిందూమతముయొక్క పూర్వపు సాత్త్వికభావమును మార్చి నవీనబలోత్సాహములను గూర్చి ప్రపంచమునందలి యితరవిజ్ఞానములకంటె దానికిఁ గల ప్రత్యేకతను మహోత్కృష్టతను చాటవలసియున్నది. హిందూమతముకంటె హీనము లగు నన్యమతములలో ముఖ్యముగా పొడకట్టు స్వమతప్రచారణోత్సాహమును హిందూజాతిలోఁ గూడ వ్యాప్తి హిందూవిజ్ఞానముయొక్క యాధిక్యమును ప్రచురించుట యావశ్యకము.

నేఁటి హిందూప్రచారకుఁడు కేవల మొక మతోపదేశములో మాత్రము కూరుచుండరాదు. అతఁడు మానవజీవితమునకు సంబంధించిన ప్రతి యుద్యమమునందును పారమార్థికభావమును చొప్పించుచు నవీనసంస్థలను ప్రాచీనార్యజ్ఞానమునందలి యాముష్మికచింతచే నూతనప్రాణితముగ నొనర్పవలెను. ఇందుకై యతఁడు స్వసంఘమునందలి వివిధాచారప్రతిష్ఠాపనలయొక్క పరమార్థమును గ్రహించుటే కాక ప్రస్తుతసాంఘికావశ్యకతలఁ గూడ గుర్తెఱింగియుండవలెను. అతఁడు జాతీయశక్తి యేయే రూపములతో నభివ్యక్త మైనదియు నవీనభావములు జాతీయహృదయమున నెట్లు సంలగ్నము లగునదియు గ్రహించియుండవలెను. ప్రస్తుతకల్లోలస్థితియం దతఁడు తన చిత్తమును పరిశుద్ధముగ నుంచుకొనుచు జాతీయజీవనమునకు భంగము కలుగు చోటుల నెల్ల తన వ్యక్తిత్వమును కాపాడుకొనుటకు శక్తుఁడై యుండవలెను.

ఇందుచే నతఁడు వివిధమహావిజ్ఞానములకును గల మతనైతికవిభేదములను గూర్చియే కాక జాతీయజీవనవిధానము సాంఘికాచారములు గృహనిర్మాణము మున్నగు విషయములను గూర్చి కూడ విస్పష్టజ్ఞానమును కలిగియుండవలెను. అతఁడు జాతీయజీవనసమ్మేళనమునకంతరాయముగ నుండు ప్రాచీనదురాచారములను గాని నవీనదురభ్యాసములను గాని ధైర్యముతో నున్మూలించుటకు వెనుదీయరాదు. అతఁడు వ్యవసాయమునకు గ్రామములకు సంబంధించిన యార్థికవిషయముల నెల్ల గ్రహించి పంచాయతీ పరపతి సంఘములను నెలకొల్పుచు తన్మూలమున ప్రజాసామాన్యమునందు మునుపటి పరస్పరసాహాయ్యవిశ్వాసములను పెంపొందింపవలెను. అతఁడు నవీన పరిపాలనప్రకారముచేతను నవీన శాసనపద్ధతిచేతను మలినము లైన గ్రామపురజీవనములను పరిశుభ్రపఱచి హిందూసంఘము తన కట్టడి ప్రకారము పూర్వమువలె స్వపరిపాలనము గావించుకొనుటకై తోడ్పడవలెను. అతఁడు హిందూజీవితమునకు పూర్వశాంతిని—ఐహికవిషయములయెడ నాశను తగ్గించి యాముష్మికకాంక్షను—

ప్రతిష్ఠింపవలెను. అతఁడీ తీరున నూతనశరములతో నిండిన శరాసనంబును ధరించి నూతనారోధనగానమును సలుపుచు వజ్రహృదయముతో నిర్భయముగా శంకాతంకములు లేక సంహారమునకు వెఱవక నిర్మాణమునకు హస్తములు సాచుచు ప్రాచీనకాలపు బౌద్ధభిక్షుకయువకునివలె జాతీయజీవనమున నల్లకల్లోలముగా నున్న నానాభిన్నశక్తులను నైక్యము చేయుటకై దేశరంగమున దుముకఁగల ప్రచారకవీరుఁడై ప్రకాశింపవలెను.

అట్టి ప్రచారకశిక్షణము జాతీయవిద్యయందు ముఖ్యాంగమై యుండవలెను. హిందూసంఘమున కిట్టి కార్యము నూతనము కాదు. హరికథకుఁడే పురాణగాథనో కైకొని నవజీవితమున కనుకూలించు లాగున మార్చి శ్రోతలకు భక్తిజ్ఞానములను ప్రబోధించుట మన మెఱింగినదియే. తంబుర మీటుచు తన వీరచరిత్రగానముచే తద్దయు వేడిమి పుట్టించెడి తంబానపాటగాఁడింకను ప్రజాసామాన్యము నుద్బోధించుచునే యున్నాఁడు. మఱియు, బొమ్మలాటగాండ్రును మాలదాసరులును తమ ప్రదర్శనములచే సంఘముయొక్క మూలమూలలను విజ్ఞానవ్యాప్తికై సహాయపడుచున్నారు. వీరి నందఱిని సుశిక్షితులను గావించి జాతీయపునర్నిర్మాణమునకు సాధనములుగా నుపయోగించినచో నెంతయో ప్రయోజనకరముగ నుండఁగలదు. ఇందఱికిని తోడుగా, దేశకాలపరిస్థితులను బాగుగ గ్రహించి అపాయములను ఆవశ్యకములను లెస్సగా గుర్తెఱిఁగిన విశాలభావులగు జాతీయప్రచారకులను సన్నద్ధము చేయుట యెంతయు నావశ్యకము. ఇందునకు కొంత సంస్కృతపరిచయముండి ఆంగ్లభాషలో సామాన్యజ్ఞానము గలిగి కొంతకాలము ప్రచారకవృత్తియందు శిక్ష వడసిన యువకు లుండుట యావశ్యకము. ఈ కార్యమునకు స్కూలు ఫైనలు ఇంటర్మీడియేటు పరీక్షలలో తప్పి పనిపాటులు లేక కూరుచున్న విద్యార్థు లెందఱో ముందంజె వేయఁగలరు. వీరికి సంస్కృతాంధ్రసాహిత్యములును ఇంచుక తర్కమానసికశాస్త్రములును హిందూవేదాంతము ననుసరించిన వివిధమతపరిజ్ఞానమును వక్తృత్వమును గానమును హరికథాకీర్తనమును గ్రామజీవనమునకు సంబంధించు నార్థికవిశేషములును గఱపవలసియుండును.

ఇట్టి విద్యాలయమును నెలకొల్పుటకు ఆంధ్రజాతీయవిద్యాపరిషత్తునకు సంకల్పము గలదు. ఇయ్యది బహుశః కృష్ణాతీరమునందలి గుంటూరు జిల్లాలోని కృష్ణా కెనాల్ జంక్షనునకు మిక్కిలి దాఁపుననున్న తాడేపల్లివద్ద స్థాపితము కావచ్చును. ఈ విద్యాలయము ఆంధ్రదేశమునందలి పురాతనపుణ్యక్షేత్రములలో నొకటియగు మంగళగిరికి అనతిదూరమునందే యుండును. ప్రాంతమున పుణ్యతరంగిణి యగు కృష్ణవేణియు నెదురుగా విజయవాడ దుర్గముమీఁది కనకదుర్గాలయమును కలిగి యీ ప్రదేశము దర్శనసుందరమై యనేక ప్రాచీనపవిత్రగాథలను స్మరణకు తెచ్చుచుండును. స్థలమునకును విద్యాలయపోషణమునకును వలయు కర్చుల నీ క్రింద నిఁచుమించుగ తెలుపుచున్నారము.

## స్థాపనవ్యయము

| | రూపాయిలు |
|---|---|
| ౧౦౦ ఎకరముల భూమి | ౫౦,౦౦౦ |
| విద్యార్థులకు గురువులకు వసతిగృహములు | ౪౦,౦౦౦ |
| గ్రంథాగారము | ౫,౦౦౦ |
| సామానులు | ౫,౦౦౦ |
| మొత్తము | ౧౦౦,౦౦౦ |

## వత్సరవ్యయము

| | | |
|---|---|---|
| సాహిత్యబోధకు సంస్కృతపండితుఁడు | నెలకు | ౫౦ |
| తర్కవేదాంతవిద్వాంసుఁడు | | ౫౦ |
| ఆంధ్రసాహిత్యపండితుఁడు | | ౪౦ |
| పౌరస్వత్వ (సివిక్సు) ఆర్థికశాస్త్రవేత్త | | ౬౦ |
| తర్కమనశ్శాస్త్రములు వివిధమతములు బోధించు నుపాధ్యాయుఁడు | ,, | ౬౦ |
| సంగీతోపాధ్యాయుఁడు | ,, | ౫౦ |
| గుమాస్తా, మానేజరు | ,, | ౪౦ |
| ముగ్గురు తోఁటమాలీలు | ,, | ౩౦ |
| ఇద్దఱు వంటవాండ్రు | ,, | ౩౦ |
| ఇద్దఱు బంట్రోతులు | ,, | ౧౮ |
| విద్యార్థి వేతనములు, నెలకు రూ ౧౦. చొప్పున ౨౪ రు విద్యార్థులకు | ,, | ౨౪౦ |
| నెలకు మొత్తము | | ౬౬౮ |

| | |
|---|---|
| సంవత్సరమునకు కర్చు | ౮,౦౦౦ |
| ,, రాబడి | ౨,౦౦౦ |
| పోఁగా కావలసినది | ౬,౦౦౦ |
| ఈ యాదాయము వచ్చుటకు నూటికి ౬ చొప్పున వడ్డీ యిచ్చెడి కో-ఆపరేటీవు బ్యాంకిలో నిలువ చేయవలసిన సొమ్ము | ౧౦౦,౦౦౦ |

## మొత్తము వ్యయము

| | |
|---|---|
| అనఁగా, కావలసిన మొత్తము | ౨౦౦,౦౦౦ |

ఈ ద్రవ్య మంతయు జాతీయాభ్యుదయమునకు ముఖ్యావసరముల నెఱింగిన యుదారులగు ప్రజలనుండియే రావలసియున్న దని వేఱుగా వ్రాయ నక్కఱ లేదు. ఆంధ్రదేశ మిదివఱకు జాతీయవిద్యయెడల చూపిన సానుభూతిని సౌహార్దమును తలంచిన, విజయభారతమున గమ్యస్థానము చేరునందాక వలయునప్పు డెల్ల నాంధ్రులు సంపూర్ణహృదయముతో తోడ్పడఁగల రన్న దృఢవిశ్వాసము మాకుఁ గలదు.

# రాగిడబ్బ

తాపీ ధర్మారావు గారు, బి. ఏ.

నా పుట్టువు నా పెంపును
నో పాఠకులార! యెదుట నుంచెద; నిసుమున్
గాపాడుముఁ బగియింపుఁడు
నా పే రొక "రాగిడబ్బ" నమ్ముఁడు; సెలవా? 1

తే. నాదు చరితంబు వ్రాసెద మీ దయ యని
చదువువారల కొక నమస్కార మిడెదఁ;
జదువనట్టివారికో? — నమస్కారమె కద;
వింత యనినఁ బ్రయుక్తార్థభేదమందు. 2

ఆ. ఒక్క వస్తు విచట నొప్పును గొప్పదై
యదియె కాంచు నచట నధికదైన్య;
మీ ప్రయోగభేద మింపుగా నా చరి
తంబునందుఁ గాంచఁదగును వినుఁడు. 3

తే. స్వల్పజీవిత నగుట నర్థాంతరంబు
పద్యములఁ దోఁప నీ రీతి వ్రాసినాఁడఁ
జదువువారల కెంతైన సంతసంబు
గలిగినం జాలు పదివేలు గంటి శ్రమకు. 4

వ. ఇంక నేను బ్రహ్మవరప్రసాది నయి నసుఁ గనిన తల్లిగర్భం బుద్భ
వించిన తెఱం గెట్లంటేని: 5

ఉ. ఉన్నతిఁ గోలుపోయి, యెటనో యొక యూలను లోఁ గృశించి, తా
నెన్నియొ పాట్లు పొంది, మరి యెన్నియొ కాఁకలఁ జెంది, పల్చనై
కన్నది నాదు తల్లి! స్వసుఖమ్ముల నెమ్మయి వమ్మొనర్చి నో
చిన్ని నిసుంగుఁ గాంచె! నెటు సెల్లును తల్లి ఋణంబు దీర్పఁగాన్?

వ. అంత విధివశంబునం దల్లి గతింప నా సుఖనివాసంబునం దుండం
జాలక యాత్మభారంబున, 7

ఉ. తల్లిని నన్నుఁ గాంచ బెడిదం బగు కష్టము లందినట్టి యా
తల్లిని బుగ్గి సేసి, తల దాఁచుకొనం దగు తావు లేక, నా
యుల్లమునం దలంచితి బహుశ్రమలం బ్రదుకంగవచ్చె, నె
నల్ల కుదించి చెంబు గొని యాచన కేఁగుటో, వంట పాత్రలం
దెల్లపు డుండి మాసటయొ, యిండ్లకు నీగుల మోయుటో కొ నా
వల్ల నదేమి కాఁగలదు బాపురె! లేపటినుండి; యూహకే
చిల్లులు వోవు మానస మిసీ! పితృహీనుల దేమి జన్మ మా!

తే. అంచు నొక కొట్టు మూల దుఃఖించుచుండ
నొక్క ధన్యుఁడు నసుఁ గొని, ప్రక్క నున్న
యొక్క యక్షరశాలలో నొప్పఁజెప్పి
తనదు దారిని బోయె నాతని నెఱుంగ.

చ. అలవియె శాల నా జనుల నందఱి వర్ణన సేయ! నొక్క చే
పలికెద, నెంత మొద్దటకు వచ్చిన నింతట నాలు గక్కరాల్
గలుగఁగఁ జేసి తోలుదురు. కాంచిరి యేమొ మహేంద్రవైభవం
బల జను; లట్లుగాక యెటు లబ్బును విద్దెయు ద్రవ్యమొక్కటన్?

తే. అట్టి శాలను నాకు నా ల్గక్కరంబు
లబ్బె ననుటకు సంతోష మగును గాని,
శిక్షఁ దలఁచిన నిపుడును చెమట పుట్టు
నెక్కడని తోఁప ముక్కలు నెక్కవైచి,
యే గతిని లోప నుండిన సాఁగఁదీసి,
పట్టి పటకార్ల నెత్తిని గొట్టి కొట్టి,
పలుకు మనినంత కం గని పలుకునట్లు
చేసి విడిచెద, రది వారి శిక్ష తెఱఁగు;
అఱుల గాకున్న బ్బనే యక్షరములు? 11

శా. అబ్బె న్నాల్గయి దక్కరా లిఁకను నే హాయి న్మనన్వచ్చు నే
యిబ్బంది ల్గనకుండ నంచు మది నూహింపంగ, నొక్కింత లోఁ
దబ్బిబ్బై యొక విప్రు నింటి కరుగన్ నం దోలి రే మందు? నా!
నుబ్బం జెల్లదు కోర్కులన్నరు! లదే యున్నాఁడు తత్కర్త నైన్.

వ. అట్టుల నా యక్కరంబుల మూలంబున స్వాతంత్ర్యంబుం గోలు
పోయి నే నేఁగిన బ్రాహ్మణుం డెట్టిఁ డనిన: 13

క. పారుని వర్ణింపఁగ నే
నేర నతని దొక విచిత్రనీతి గలదు; తా
నేరికి నొక తృణ మీయఁడు;
కోరఁడు తన కొక్క సుఖము; గూర్చు ధనంబున్. 14

ఉ. ఒక పని చేయఁగాఁ బనుపఁ దూరక గుడ్డలఁ గట్టి యూపె రిం
చుక సలుపంగనీయ కొకచో నసుఁ బెట్టి బిగించు వాఁకిలిన్;
పకపక నవ్వు నన్నుఁ గని; పాపము! వచ్చెడి వేళఁ గూడ నా
గక కరమందు నన్నుఁ గొని ప్రాణముఁ బాసెను: లోభి చావిదే.

ఉ. లోభి గతింప నొక్క త్రుటిలోపల నన్ను వెలార్చి తత్సుతుం
డీ భవనంబుఁ బావె నొక హీనకులాంగన సేవ సేయ, నా
హా! భగవంతు సృష్టిఁ గన నచ్చెరు వౌఁ గద! ముద్దు కిఁ
లోభి సమస్తభాగ్యములు లోకుల పాలను టిద్దియే కదా.

తే. తనువు మఱవఁ ద్రాగి దాసి నన్ దోలెను
కల్లు నమ్మువాని కడకు మనఁగ;
నిట్టు లుండఁ గాదె యెప్పుడు స్వాతంత్ర్య
హీననరుని బ్రదుకు మానహాని. 17

నా పాటు లే మని వర్ణింపఁజాలుదును ? 18
[illegible]యి కంపున శ్వాసము బిగియించి
కూర్చుండియుంటి నేఁ గొన్ని నాళ్లు,
చింతపండున మేను చిక్కి రూపం బెల్ల
మన్నుగా నుంటి నేఁ గొన్ని నాళ్లు,
బెల్లంబు మోయుచు నల్ల చీమలు గుట్ట
కొట్టుల నుంటి నేఁ గొన్ని నాళ్లు,
దముసులోఁ బడి శరీరము స్పృశింపఁగ రాక
ఖిన్నత నుంటి నేఁ గొన్ని నాళ్లు,
అదియు నిదియును నన నేల యంటగాని
వస్తువులఁ గూడఁ బడియుంటి వాసి దఱఁగి,
యొందు నుండిన ననుభవం బింత లేదు ;
దర్వి గాంచునే రుచుల చందంబు లిలను ! 19
. ఇన్ని కష్టంబు లందుచున్న, నడుమ
నడుమ నొక కొన్ని సౌఖ్యముల్ వడయుచుంటి.
ధనికపుత్త్రుల ప్రాపున మనుటచేత
సుఖము దుఃఖంబు మాఱిన చోద్య మేమి ?
మెత్త నగు పొత్తికలఁ బండి మెలఁగియుంటి,
మోదకంబుల రుచు లంది మురిసియుంటి,
నత్తరువు లంది పరిమళం బరయుచుంటి,
చిత్రములఁ గాంచి సౌఖ్యంబుఁ జెందుచుంటి,
హృద్యగానంబులను బ్రమోదించియుంటి,
నిన్నియా యంచు మీరు నన్నెంచఁబోకుఁ,
డింద్రియంబుల కోరిక లెప్పుడు దఱఁగు?
ప్రభుల దయ యున్నఁ గొఱఁతలు పాసి చనవె ? 20
. ఇన్నిటఁ గంటి నంచు వచియించుచు నుంటిని సిగ్గు లేక, నే
మన్నను మొక్క పేద నడుమన్ గడు భక్తిని బట్టి పట్టి చే
సన్న మెలంగియుంటి నను జ్ఞాపక మైనను లేకపోయె, నా !
యెన్నఁడు బన్నముల్ దలఁచునే నరుఁ డెంచునుగాక ప్రజ్ఞలన్.
. అది యొక వింతె? యొక్క సమయంబున నే నొక కల్లుముచ్చుతో
మది చెడిపోవ బాట నడుమం బడి పొర్లుచునుండ మార్గగుల్
పదపరితాడనంబులఁ గలంచిన దే మఱవంగఁజాలితిన్
బ్రదుకఁగలండె యెందు నవమానము నెంచెడి గర్వి యుర్వరన్?
ఉ. అతిదుష్టాత్ములఁ గూడి, క్రౌర్యముల నెన్నైనం దగం జేయుచున్
వెత యొక్కింతయుఁ గాంచలేక వ్యసనప్రీతాత్ముల న్మంటి, సం
గతు లిం కేటికి? చెట్ట నాఁ బరఁగు నే కార్యంబును న్మానలే ;
దతిదోషాస్పద మీఁగఁజాలు నెటు భ్రష్టాత్ముండు సంపర్కమున్?
దైన్యవృత్తి నింక దైవంబె దిక్కంచు
నేమి సేయ ననుచు నేడ్చుచుండ
బాలవులకు దైవవశమున వశ మైతి
నంత "చింత పొసె హాయి బ్రదుకు
జీవుఁడా" య టంచు చింతించుచున్న నన్

పట్టి కొట్టె నొకఁడు పండ్లు దేర ;
మరల నొకనిఁ జేర మఱియేదో చెప్పింపఁ
ద్రిప్పి చంపి; రిదియె తెఱఁగు నాకు.
చెప్ప నేల యొకఁడు సిగరెట్లు దెమ్మంచు
పొడుము దెమ్మటంచు విడె మటంచు
చెడ్డ వస్తువులను, జిఱుదిండికొఱకు నం
బట్టి తోలుచుండి ; రెట్టి గతియొ
యొక్కచోట గడియ యుండ నోఁచఁగ లేదు
హాయి గలదె సేవకాళి కెచట ? 24
క. ఇంక, పరతంత్రజీవన
సంకటములు దెలుపనలె నె ? చాలవె ? బలమున్
బింకము నెడు జీవన మా
తంకంబుల నింపుఁ దొలఁగు ధైర్యం బవలన్. 25
శా. అంతం గొన్ని దినంబు లేఁగఁ దొలిఁ బుణ్యం బేమి నేఁ జేసి నా
స్వాంతంబందున నీవు నిల్చితివొ? తన్వంగీలలామం బొక
ర్తెంతే సంతస మొప్ప నన్నుఁ గొని, నా కే కార్య మిం పౌనో యన్
చింతం దాల్చెను. శ్రీలు గారి కరుణాసింధుల్ మనం బున్నచోన్.
వ. ఇంతలో మన దేశం బున్న తెఱం గెఱుంగందలంచి తేని, 27
చ. చదువరి సావధానము! విశాలయశోరమణీయపూర్వసం
పదఁ దులఁ దూఁగుచుండు నన భారతమాత యి దేల యిప్పు డా
పదల మునింగి, దుష్టపరివర్తన నుంటె? తదార్తిఁ బాపి స
మ్ముద మొదవంగఁ జేయ మనమున్ ధనమున్ సుఖమున్ దృణంబుగా
మదిఁ దలపోసి, సేవలను మాతృభువిం దనియించు బుద్ధి పో
లదె? యని యుత్తమోత్తము లలంతి చలంబున స్వీయచింతలన్
మొదలు దెగంగఁగోసి, యశముం గను చుండు నమోఘభాగ్య మా
నద నగుటం గుతూహల మనంతముగాఁ బ్రజలందుఁ బర్వఁ, దాం
మది మొద లాత్మదేశమున కై పలు సేవలు సేయఁగాఁ బరం
గుదు ; రదె పో! మహాత్ముల యకుంఠితవర్తన ప్రోత్సహింప నే?
గీ. అట్టు లుత్సాహసంపూరితాత్ము లైన
కొంద ఱొకనాఁడు నాబోఁటు లెందు నైన
దేశమాతను సేవింపఁ దీరు గలిగి
యున్నచోఁ గూర్చు నూహ మా యూరు చేరి,
యత్నములు సేయ, న న్బట్టినట్టి కాంత
వారి సముఖంబు నల్లన చేరె ; వారు
"భారతీయులార! వే రండు, వే రండు
మాతృసేవ కిదియె మంచి సమయ ;
మిన్ని నాళ్లు మనకు నెన్నియో విధముల
మేలు సేసినట్టి మెలఁత మిన్న
పుట్టి యెఱుఁగనట్టి చెట్టలఁ గాంచుచు
మిగుల దైన్యవృత్తి నగుచు చున్న
దిట్టియెడలఁ గాక యెప్పుడు కొమరులఁ
గనిన ఫలము గాంచుఁ గన్నతల్లి;

అంతియే కాదు మన దేహ మంత యెవరి;
దిన్ని నాళులు మన మారగించుచున్న
వస్తుసముదాయ మెవరిది; బ్రదుకు సర్వ
మెవరి; దట్టి భారతభూమి యొగ్గు లంద
నాదు దేశంబునకు సేవ నా విధి యన
కుండునే యొక్కడును బాలికుండు దక్క;
తినకుఁ గల్గిన సర్వంబుఁ దల్లి దనుచుఁ
దలఁపఁడే యొక్కఁడును వట్టి తులువ తక్క;
లెండు దేహంబులం దున్న కండ బలిమి
వశమునం దున్న ద్రవ్యంబు భరతమాతృ
దివ్యసేవకై యర్పింపఁ దెగువ కలిగి
కంకణము గట్టుఁ డింక నే శంక వల ద
టంచు మాతృసేవైకపరాత్ము లగుచు
శ్రోతలకుఁ గూడ కుతుక ముద్భూత మైన
తెఱఁగునం జెప్ప వేవేగ తెరవమిన్న
నన్ను బా మ్మంచుఁ గోలె ప్రసన్నమతిని;
కాంత యెటు లోర్చునో వియోగంబు నెఱుఁగ;
జననభూమికి స్వర్గంబు సాల దనెడి
తలఁపు గలవారి కిది యద్భుతంబు గాదు
స్వీయచింతల దేశంబు వృద్ధి యగునె! 29

వ. ఈ వియోగంబున కెంతయో చింతించి యాడిగిలంబడి యా యరం
బ్రవేశించినంత నాహా! యే నుని వ్రాయఁజాలుదును! 30

ఉ. ఉండదు నీచసేవ, యిట నుండగు దుర్భరపాలనాభయం,
బుండదు దోషవర్తనము, నుండ దిఁకే వ్యసనంబు, నింతయే
నుండదు సత్ప్రవృత్తి కదు, రుండదు చిత్తమునందు వ్యాకులం,
బుండ దిఁకెట్టి పాపము నోహో!యిఁక జన్మము ధన్యమే కదా!

వ. అని రోదసీకుహరం బెల్ల నిండినట్లు లోపలినుండి యొక్క గంభీర
మనోహరస్వనంబు వీనులం జొచ్చి మానసంబు నానందంబునఁ
దేల్చి వైచుచుండె. 32

క. సాయంవర్షానంతర
గేయమహాప్రకృతిసద్విశేకిల్బిషదూర
స్థాయంబై చిత్తం బిది
హాయిం గను చల్లనగుచు నాడెడుఁ గంటే.

ఉ. కాన, మహాత్ములార! ధనికస్థితులార! గృహస్థులార! యెం
దైనను మాదృశుల్ తమ కటాక్షముల న్మనియున్న, సర్వస
మ్మానితవృత్తి నీ భరతమాతకు సేవ యొనర్పఁ బంచి, దే
శానకు మీకు మాకును యశం బెసఁగంగ, మదీయు లెల్లరున్
పూని స్వదేశవృత్తు లన ముద్దులు గుల్క మెలంగనిండు, సం
ధానము సేయుఁ డాగతము, ధర్మ సుశిక్షయు సేయుఁ డింతియే
కాని, మహార్తితో చెనఁటి కార్యముఁ జేయ వొగ్ల నీకుఁ, దా
హీనపథంబు లెల్ల నశియింపఁగఁ జేయుఁడు, దేశసేవయం
దే నడిపింపుఁడీ సుము, మయిన్ మముబోంట్ల లాసంగు మేలు చే
నూనుఁడు, గొప్ప కాదు; కృప మీరక విస్మరియించి నారకా
నూనవిశేషఘోరగతి నొందఁ గృతఘ్నులమై చెలంగ మా
చే నది గాదు, మీరు నిది చిత్తములందునఁ బాదుకొల్ప మీ
కౌను జయంబు విశ్వమున ఖ్యాతి గడింతురు. నమ్ముఁడయ్య; యిం
కేను సమాప్తి చేసెద మదీయచరిత్రము, దోసి లొగ్గుచున్. 34

# కవిత్వము

గడము కొండారెడ్డి గారు

భావబంధురంబు భవ్యంబు నైన స
త్కవిత రక్త యైన కాంత రీతి
నలరఁజేయు; కడు ప్రయాసతో నయ్యది
లబ్ధ మైన నిష్ఫలంబ చూవె.

ఆ. యతుల ప్రాసములను నతికిన నగునె స
త్కావ్య మది రసప్రధాన మగుట
జీవరహిత మైన కేవలదేహంబు
గాంచ సంతసంబు గల్గునొక్కొ?

క. రస మాత్మ కానఁ గావ్యా
భ్యసనంబునఁ దొలుత నేర్వవలయుఁ గవులకున్
రసపోషణ ముచితక్రియ
రసప్రధానములు కావ్యరాజము లగుటన్.

క. వినువారుఁ జదువువారును
గనిన ట్లానంద మొందఁగల రే కావ్యం
బును పఠియించిన నద్దా
నిని రసమయ మని యటంద్రు నెమ్మి దలిర్పన్.

వివిధవర్ణములను వేర్వేఱ నుచితప్ర
కారమునను జిత్రకారుఁ డెట్లు
చేర్చి భావములను జిత్రించు నట్లు స
త్కవియుఁ దెల్పఁ బదవితానమునను.

# స్వదేశసంస్థానములు — హైందవరాజ్యాంగపరిణామము

వింజమూర్తి గోవిందరాజులు గారు, బి. ఏ.

పందొమ్మిది వందల పదునొకొండవ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారము హిందూదేశముయొక్క వైశాల్యము 17 లక్షల 73 వేల చదరపు మైళ్లు, జనసంఖ్య 31 కోట్ల 5 లక్షలు. ప్రపంచ సంతతియొక్కయు జనసంఖ్యలో నిది యైదవ వంతని మదింపు వేయఁబడినది. కాని, ఇది యంతయు బ్రిటిషు ప్రభుత్వము క్రిందనే లేదు. ఇందులో సుమారు 6 లక్షల 75 వేల చదరపు మైళ్ల విస్తీర్ణమును సుమారు 7 కోట్ల జనసంఖ్యయుఁ గల దేశము "నేటివ్ స్టేట్సు" అనఁబడు స్వదేశసంస్థానముల పరిపాలన క్రింద నున్నది. హిందూదేశ సంతతియొక్కయు వైశాల్యములో మూఁడవ వంతుకంటె నధికముగా నున్నట్టియు మొత్తపు జనసంఖ్యలో సుమారు నాల్గవ వంతు గలిగి నట్టియు ఈ ప్రదేశము హిందూదేశపు ముఖ్యభాగములలో నొకటిగా పరిగణింపఁబడవలె ననుట ప్రత్యక్షమే. కాని, హిందూదేశపు రాజ్యాంగమునందు గొప్ప మార్పులు కలుగవలసిన సమయ మాసన్న మైనను, కొలఁది దినములలో హిందూదేశ కార్యదర్శి గారు మార్పులను ప్రచురింపఁబోవుచున్నను, ఆ పరిణామమునందు స్వదేశసంస్థానము లెట్టి యవస్థ నొందవలసినదియు ననేకు లాలోచించునట్లు గానరాదు. అవి చెందవలసిన మార్పులను నిర్ణయించుటకు ముందు వాని పూర్వచరిత్రను ప్రస్తుతస్థితిని పరిశీలించుట యావశ్యకము గావున, వానిని గూర్చి ఈ క్రింద సూక్ష్మముగా వ్రాయఁబూనితిని.

## పూర్వ చరిత్ర

పదునెనిమిదవ శతాబ్ది యారంభమున మొగలాయి సామ్రాజ్యము నాశన మొందినతోడనే హిందూదేశమునం దంతట ననేక రాజులు బైలుదేఱిరి. అదివఱకు మొగలాయి చక్రవర్తికి కప్పము కట్టుచుండిన సామంతరాజులు అప్పుడు స్వతంత్రరాజు లైరి. మొగలాయి చక్రవర్తిచే నియమితులై అతని నామమున అధికారము చెలాయించుచుండిన యుద్యోగస్థులును గవర్నరులును అప్పటినుండియు తమతమ భాగములయందు సంపూర్ణాధికారముతో రాజ్యము చేయఁబూనిరి. ఇటు లెటు చూచినను చిన్నచిన్న రాజ్యము లనేకము లుండెడివి. దక్షిణమున హైదరాబాదును, పశ్చిమమున మహారాష్ట్ర రాజ్యములును, ఉత్తరమున ఔధును సిక్కు రాజ్యములును, తూర్పు మూర్షదాబాదును, రాజపుత్రస్థానమున జయపూర్ ఝాడ్‌పూర్ మొదలగు సంస్థానములును అప్పుడు తయారైనవానిలోనివే. కాని, ఈ రాజ్యస్థాపనమువలన దేశమునందు మాత్రము శాంతి లేకుండెను. ఈ రాజ్యముల కొండొంటితో నైకమత్యము లేకుండుటయే గాక, ప్రతిస్థానియందును విప్లవములును అల్లరులును తఱచుగా జరుగుచుండెడివి. ఇవి యిట్లుండ, ఇంగ్లీషువారును ఫ్రెంచివారును ఐరోపాఖండమందలి యితరదేశవాసులును అచ్చటచ్చట వర్తకస్థానముల నేర్పఱచుకొని దేశీయులలో వర్తకము చేయుచుండిరి. కొంత కాలమువఱకు వీ రెవరును రాజ్యము నాక్రమించుకొని ప్రభుత్వము చేయవలె ననెడి యుద్దేశము కలిగియుండలేదు. రాజ్యస్థాపన కవకాశము కల దనియు దానికి సాధనము దేశీయరాజ్యములయొక్క విప్లవములలోను అల్లరులలోను జోక్యము కలిగించుకొనుటయే యనియు గ్రహించుటకు ఫ్రెంచి గవర్నరగు డూప్లే మొదటివాఁడు. అతఁడు గవర్నరుగా నీ దేశమునకు వచ్చినప్పటినుండియు ఆ పద్ధతి యవలంబింపఁబడెను. అంతటితో అదివఱకు స్వదేశరాజ్యముల కల్లోలములందు సంబంధము కలిగించుకొనకుండ నెమ్మదిగా వర్తకము చేసికొనుచుండిన యితరదేశములవారును ఆత్మసంరక్షణమునకైనను వానిలో కలుగక తీరినది కాదు. 1748-వ సంవత్సరము దక్కనున కంతటికిని సుబేదారుగా నుండిన అసఫ్ జా మరణించిన పిమ్మట ఆ పదవికై యతని కుమారుఁ డగు నాజరు జంగును మనుమఁ డగు ముజఫర్ జంగును పోరాడుచుండిరి. దక్కనులో నొక భాగముగా నుండిన కర్నాటక రాజ్యమునందును అటులే చందా సాహెబునకును మహమ్మదాలీకిని కలహము సంభవించెను. ఫ్రెంచివారు ముజఫర్ జంగు చందా సాహెబుల పక్షమూనిరి. రెండవ పక్షమువా రింగ్లీషువారి సహాయ మపేక్షించిరి. ఇంగ్లీషువారు వారికి సహాయము చేయుటకే గాక తమ వ్యాపారసంరక్షణమునకై కూడ వారి పక్ష మవలంబింపవలసివచ్చెను. ఏల యనఁగా, ఫ్రెంచివారి సహాయమున ముజఫర్ జంగు చందాసాహెబులు గెలువఁగలుగుదురేని (ఇంగ్లీషువారు రెండవ పక్షమువారికి సహాయము చేయకుండినచో వారు గెలిచియుండెద రనుట నిశ్చయమే), ఫ్రెంచివారు తమ రాజ్యమును హిందూదేశమున స్థాపించుటయే కాక తక్కిన యైరోపియనులను దేశమునుండి వెడలఁగొట్టియుందురు. ఈ దెబ్బలాటలు 1760-వ సంవత్సరముతో కొంతవఱకు అంతము నొందెను. నైజాము ఫ్రెంచివారిని తన రాష్ట్రమున చేరనీయకుండుట కంగీకరించెను. మహమ్మదాలీ కర్నాటక నవాబాయెను కాని, అతఁడు కంపెనీవారి యొద్ద పుచ్చుకొనిన యప్పును తీర్చుకొనలేక కొన్ని జిల్లాలను వారి కిచ్చివేసెను. ఫ్రెంచివారికి సైన్యసాహాయ్యమునకై నైజాము గారి వలన ఇయ్యఁబడిన యుత్తరసర్కారులను బ్రిటిషువా రాక్రమించుకొనిరి. దీనికి కారణము లేకపోలేదు. 1757-వ సంవత్సరమున బెంగాలున కంతటికిని నవాబగు సురాజుద్దౌలా కంపెనివారి వర్తకస్థానమగు కలకత్తాను దోచుకొన్ని, అక్కడ నుండిన యింగ్లీషువారి

వసేకులను చిన్న కొట్టులో ఖైదుచేసి వారి మరణమునకు కారకుఁ డయ్యెను. చెన్నపట్టణమునుండి కలకత్తాకు క్లైవు గారితో నున్న యుత్తరసర్కారులు తమ యధికారము క్రింది నుండినయెడల రెండు పట్టణములను కాపాడుకొనుట సులభముగా నుండు ననియు, సైన్యము లొక చోటినుండి రెండవ చోటికి పంపఁబడుటకు నెట్టి దారుల యాటంకము లేకుండు ననియు కంపెనీ యధికారులు తలఁచుటచే, వారు ఉత్తరసర్కారుల నాక్రమించుకొనవలసివచ్చెను. 1757-వ సంవత్సరమున సురాజుద్దౌలావలన బాధ కలిగినప్పటినుండి బెంగాలు రాజ్యవిషయములం దింగ్లీషువారు సంబంధము కలుగఁజేసికొను చుండిరి. 1757-వ సంవత్సరమున ప్లాసీయుద్ధ సంగరమున సురాజుద్దౌలాను నవాబుగా తీసివేసి, అతని స్థానమున అతని సేనల్లుఁడగు మీర్ జాఫర్‌ను పట్టాభిషిక్తునిఁ జేసిరి. సురాజుద్దౌలా కలిగించిన నష్టమునకై తా నిచ్చెద నని వాగ్దానము చేసిన సొమ్ము నాతఁ డియ్య లేక తుదకు డచ్చివారితో కలసి ఇంగ్లీషువారిని దేశమునుండి వెడలఁ గొట్టుటకు కుట్ర పన్నుటవలన, మీర్ జాఫర్ కూడ పదభ్రష్టుఁ డాయెను. అతని వెనుక వచ్చిన మీర్ ఖాసిమువలన కూడ లాభము లేకపోయెను. బాకీ లెప్పటివలెనే యుండెను. కంపెనీ నౌకరుల కును మీర్ ఖాసిమునకును వైమనస్యములు పెరుఁగుచుండెను. తుదకు మీర్ ఖాసిము పాట్నాయందలి యింగ్లీషువారి సందతిని ఖైదుచేసి చంపించి దేశము వదలి ఔద్ నవాబునొద్దకు పాఱిపోయెను. తిరిగి వచ్చి మీర్ జాఫరు మరి రెండేండ్లపాటు బెంగాలుపై రాజ్యము చేసి చనిపోయెను. తుదకు 1765-వ సంవత్సరమున క్లైవు కంపెనీవారి తరఫున ఢిల్లీ పాదుషావద్ద బెంగాలు బీహారు రాష్ట్రములపై "దివానీ" అధికారమును పుచ్చుకొనెను.

ఇట్లు, ఇంగ్లీషువారీ దేశమున ప్రవేశించినది మొదలు పదు నెనిమిదవ శతాబ్ది మధ్యభాగమువఱకును జరిగిన కాలమును, వారి కిని స్వదేశరాజులకును గలిగిన సంబంధముల నాలోచించునపుడు, మొదటి దశ క్రింద నున్నది పరిగణింపవచ్చును. ఈ యుగ మారంభమున ఇంగ్లీషువారు వర్తకులుగా నున్నను, యుగాంత మగు సరికి ఇతరరాజులతో పాటు రాజులై హిందూదేశమునందలి కొన్ని భాగములను పరిపాలన చేయుచుండిరి. ఈ నడిమి కాలములో ఆత్మ సంరక్షణముకొఱకు దేశీయరాజుల కలహములలో జోక్యము కలుగఁ జేసికొనుచు, ఇఁకముందు తమకును తమ వర్తకమునకును హాని కలుగ కుండుటకై క్రమక్రమముగా అక్కడక్కడ రాజ్యము నాక్రమించుకొనుచుండిరి. అప్పటి దేశస్థితిని బట్టి అది వారికి తప్పినది కాదని పైని నిరూపించియుంటిని. వర్తకులుగా నుండినవారు స్వదేశ రాజులతో సమానులైన రాజులెట్లయినదియు కూడ చూపి యుంటిని. ఇఁకముందు తక్కిన రాజుల నందఱిని తమ కెట్లు లోబడ చేసికొనిరో చూపఁ బ్రయత్నించెద.

స్వదేశరాజులకును ఇంగ్లీషువారికిని ఏయే కాలములం దెట్టి సంబంధము లుండెడివో యాలోచించునపుడు, 1798నుండి 1805 వఱకు నుండిన వెల్లస్లీ గారి ప్రభుత్వకాలమును వదలివేసితిమేని, 1757-వ సంవత్సరమునుండి 1813 వఱకును గల కాలము రెండవ దశగా కాన వచ్చును. ఈ కాలమునం దింగ్లీషువారు తా మిదివఱ కార్జించిన రాజ్యముతో సంతుష్టులై, తమ ప్రక్క నున్న దేశము లెంత యల్లకల్లోలముగ నున్నను, ఇతరరాజులు తమ సాహాయ్యమును కోరినను తామును సామంతరాజులుగా నుండుట కంగీకరించినను కూడ, వారితో నెట్టి సంపర్కమును కలిగించుకొనమని శపథము పట్టిరి. వెల్లస్లీ గారు మాత్ర మీ పద్ధతి ప్రకారము నడచుకొనలేదు. వారు ఇతర రాజులకు సైన్యసాహాయ్యము నొసరించుట కంగీకరించి వారివలన దాని కగు కర్చులను పుచ్చుకొనుట కారంభించిరి. ఇది రెండు విధముల ఇంగ్లీషువారికి లాభకరిగా నుండెను. స్వదేశరాజుల క్రింద సైన్యము లున్నప్పు డెల్లను, వారి సైన్యము నెవరిపైఁ దుపయోగింతురో యను భయ ముండెను. కాని, ఈ పద్ధతివలన వారి రాష్ట్రములను కాపాడుకొనుటకు కావలసిన సైన్యమును వారికొఱకు బ్రిటిషువారే జాగ్రత్తపెట్టుటవలన, అప్పటినుండియు ఈ భయము లేకుండెను. ఇది మొదటి లాభము. రెండవ లాభము బ్రిటిషువారి యధికారము క్రింద నున్న సైన్యము హెచ్చగుట యే. పేరునకు స్వదేశరాజ్యముల సంరక్షణమునకై యుంచఁబడిన సైన్య మైనను, బ్రిటిషువారి యధికారము క్రింద నుండుటచే నీ సైన్యము వారి యుపయోగములకు కూడ పనికివచ్చుచుండెను. కాని, దాని కగు ఖర్చు మాత్రము స్వదేశపు రాజులె భరించుచుండిరి. ఈ పద్ధతి వెల్లస్లీగారి యధికారకాల మగు 7 సంవత్సరములలోనే యవలంబింపఁబడెను. వారి తరువాతను 1813-వ సంవత్సరమువఱకు ముందును వచ్చిన ముగ్గురు గవర్నరు జనరలులును వెల్లస్లీ గారికంటె ముందు వచ్చినవారి పద్ధతినే యవలంబించిరి. ఈ పద్ధతికి లీవార్నరు గారు "ది పాలిసీ ఆఫ్ ది రింగు ఫెన్సు" అని నామకరణ మొనర్చిరి. "ది పాలిసీ ఆఫ్ ది రింగు ఫెన్సు" అనఁగా, తన రాజ్యము చుట్టును దడి కట్టుకొని దానిని దాఁటి వెళ్లక గాని మధ్యముననె కూర్చుండిన నెట్లుండునో, అట్లే బహిఃప్రపంచముతో నెట్టి సంబంధమును లేకుండ నుండుట యని యర్థము. ఈ పద్ధతి ప్రకారము ఇతరరాజులతో నే సంబంధమును లేక తమ రాజ్యము మీఁది కెవరైన దండు వెడలినప్పుడు మాత్రము యుద్ధము చేయుచువచ్చినయెడల, హిందూదేశమునందలి రాజ్యములు వానిలో నవి పోట్లాడి గొప్ప రాజ్యములు చిన్నవానిని దిగమ్రింగు ననియు, తుదకైదారు రాజ్యములు మాత్రము మిగులు ననియు, అవి యప్పుడు పోరాడుట మాని మైత్రి కలిగి నడచుకొను ననియు, ఆ కాలము వచ్చునప్పు డింగ్లీషువా రా రాజ్యములతో స్నేహము చేయవచ్చు ననియు అప్పటి యాంగ్లేయాధికారులు నమ్ముచుండిరి. తమ రాజ్యాభివృద్ధి పొందవలె నని వీరు కోరలేదు. దేశము నందలి రాజ్యము లన్నిటికంటె కూడ ఇంగ్లీషువారు గొప్ప యధికారమును కలిగియుండవలె నని వీరు వాంఛింపలేదు. వీ రవలంబించిన పద్ధతిని "లెట్ అలోన్" పద్ధతి యని కూడ యందురు. 'లెట్ అలోన్' పద్ధతి యనఁగా, "స్వదేశరాజ్యములను వానిలో నవి పోరాడనిమ్ము మన మా జోలికి పోవద్దు. వాని కర్మము వానిది. మన కర్మము మనది.'

యౌనుటయే. ఈ పద్ధతికి చరిత్రమునుండి యనేకనిదర్శనము లియ్యవచ్చును. 1764-వ సంవత్సరము బక్సారు యుద్ధమున ఔద్ నవాబు పూర్తిగా నోడిపోయినను అతని రాజ్యము నింగ్లీషువారు కలుపుకొనక తిరిగి అతని కిచ్చివేసిరి. రోహిలా యుద్ధ మనంతరము కూడ అప్పటి గవర్నరు జనర లగు వారన్ హేస్టింగ్సు గారు రోహిల్ఖండమును ఔద్ వజీరు గారి కిచ్చివేసిరి. మొదటి మరాటా యుద్ధమువలన జేసిన్ ఇంగ్లీషువారి వశమైనను సంధిసమయమున వారు దానిని వదలుకొనిరి. నాల్గవ మైసూరు యుద్ధమున టిప్పు సుల్తాను పూర్తిగా నోడిపోయినను, ఇంగ్లీషువా రా రాజ్యమును కలుపుకొనుటకు బదులుగా కొంత భాగమును తమకు సాహాయ్య మొనరించిన నైజామునకును మహారాష్ట్రులకును ఇచ్చి తక్కిన భాగమును పూర్వము మైసూరు పరిపాలించిన హిందూరాజకుటుంబములోనివాని కొకని కుచితముగా నిచ్చివేసిరి.

కాని, ఈ కాలమున నింగ్లీషువారు రాజ్యమును సంపాదింపక పోయినను ఇతరరాజులతో సంబంధము లేకుండ కాలక్షేపము చేయుట మాత్రము వారికి సాధ్యము కాలేదు. బెంగాలులోని ఇంగ్లీషువారి రాజ్యముపై దండెత్తుట కెవరికిని సాధ్యముగా నుండలేదనుట నిజమే. ఏల యనఁగా, బెంగాలుమీఁదికి దండెత్తువారందఱును ఔద్ మీఁదుగా వెళ్లవలసియుండుటచేత బ్రిటిషు రాజ్యమున ప్రవేశింపక ముందు ఔద్ నవాబుతో యుద్ధము చేసి అతని నోడింపవలసియుండెను. ఆ నవాబే దండెత్తునేమో యను భయ ముండుటకు అతని కధికముగా ధనమును సైన్యమును లేకుండెను. కావున, బెంగాలు స్థితిని బట్టి యాలోచించినచో ఈ పద్ధతి సాధ్యముగా కనఁబడును. కాని, చెన్నరాజధానియొక్క స్థితి యిట్లుండలేదు. ఇతరరాజులవలని భయ మధికముగా నుండెను. దీని కనేకకారణములు కలవు. దక్షిణదేశమును పరిపాలించుచున్న మహారాష్ట్రులును హైదరాబాదు నైజాము గారును మైసూరు సుల్తాను గారును ఔద్ నవాబు గారివలెఁ గాక యధికబలవంతులుగా నుండిరి. బెంగాలునకు ఔద్ రాజ్యమువలె చెన్నరాజధానిపై పరరాజుల దండయాత్రల కాటంకము కల్పించు రాజ్యము లేనియు లేకుండెను. ఇంతియ గాక, ఫ్రెంచివారు కొన్నాళ్లు నైజాము గారితోను మరి కొంత కాలము మైసూరు సుల్తాను గారితోను కుట్రలు పన్నుచు, ఇంగ్లీషువారిపైకి వారిని పురికొల్పుచుండిరి. ఈ కారణములన్నిటివలనను, తమ కంతే యిష్టము లేకపోయినను, ఈ కాలమున నింగ్లీషువారికి యుద్ధములు తప్పినవి కావు. ఇదియును గాక, అప్పటి యాంగ్లేయాధికారులు నమ్మినట్లు శాశ్వతమైనవియు మాటిమాటికి చీలిజగడములు లేనివియు స్వస్థత గల పరిపాలనములు కలవియు నగు రాజ్యములు స్థాపింపఁబడుట కవకాశములు లేకనుటకు పంజాబును హిందూదేశపు మధ్యప్రదేశములను నిదర్శనముగా చూపవచ్చును. పంజాబు రంజితు సింగధికారము క్రింద నెమ్మదిగ నున్నను, అతని తరువాత పెద్దపెద్ద యల్లరులకు లోనై ఇరుగు పొరుగుల నున్న రాజ్యములకు కూడ మిక్కిలి యిబ్బందులు కలుగఁ జేసెను. మధ్యమహిందూదేశమునందు పిండారీ దండులు నివాస మేర్పఱచుకొని ఆ దేశమునే కాక ప్రక్క నున్న బ్రిటిషు రాజ్యమును కూడ కొల్లగొట్టుచు ఆంగ్లేయసైన్యము వచ్చిన వెంటనే తిరిగి తమ స్వస్థానమునకు పోవుచుండెను. మధ్యమహిందూదేశమునందలి యే రాజులును వారిని శిక్షించుటకు ప్రయత్నము చేసియుండలేదు. ఇంగ్లీషువా రా రాజులతో కలిసినఁ గాని వారిని తమకు లోఁబఱచుకొనియుండినఁ గాని ఈ యల్లరులు జరిగియుండెడివి కావు. ఇంతియ గాక, మహారాష్ట్రరాజు లందఱును కూడ పీష్వా గారి నాయకత్వము క్రింద బయలుదేఱి బొంబాయి రాజధానియందలి బ్రిటిషు సైన్యమును నాశన మొనరింపఁ బ్రయత్నించిరి. ఇంకొక ప్రక్క రాజపుత్రస్థానమునందలి సంస్థానాధీశు లందఱును తమ శత్రువుల వలని యనేకబాధల నోర్వలేక బ్రిటిషువారి సాహాయ్యమును కోరిరి గాని, మా కితరులతో నెట్టి సంబంధమును అక్కఱ లే దని భీష్మించిన యాంగ్లేయాధికారులు వారికి సాహాయ్యము చేయక, వారి కృతజ్ఞతను మైత్రిని సంపాదించు నవకాశమును కోల్పోయిరి.

ఇట్టు లనేకవిషయముల ఆ కాలపు ఆంగ్లేయాధికారులు స్వదేశసంస్థానముల పట్ల అవలంబించిన పద్ధతి యసందర్భములతో నిండియుండెను. దీనిని మొట్టమొదట కనిపట్టినయతఁడు వెలస్లీ. అతఁడు గవర్నరు జనరలుగా నుండిన కాలమునందు దేశీయరాజులతో "సబ్సిడియారీ అలయన్సస్" అను సంధులను చేసియుండెను. వానిని గురించి పైని వ్రాసియుంటిని. వాని యుద్దేశము స్పష్టమే. దేశీయ ప్రభుత్వములలో నొక సాధారణమైనదిగా నుండుటకు బదులుగా, ఇంగ్లీషు ప్రభుత్వమును వానిలో నెల్ల ముఖ్యమైనదిగా చేయుటకు వెలస్లీ ప్రయత్నించెను. కాని, అతని మార్గము అతని తరువాత వచ్చిన ముగ్గురు గవర్నరు జనరలులకును యుక్తమైనదిగా తోఁచలేదు. 1813-వ సంవత్సరము తర్వాత మాత్ర మది పూర్ణముగా నంగీకృత మయ్యెను.

1813-వ సంవత్సరమునుండి 1857-వ సంవత్సరమువఱకు ఇంగ్లీషువారికిని స్వదేశరాజ్యములకును కలిగిన సంబంధములను చరిత్రలోని మూఁడవ యధ్యాయముగా మనము భావింపవచ్చును. ఇంతకు ముందటి దశలోని "నన్ను ముట్టకు" పద్ధతి యిప్పుడు పూర్తిగా వదలివేయఁబడెను. అవకాశము దొరకినతోడనే ఆంగ్లేయాధికారులు స్వదేశరాజు లందఱితోను ఒడంబడికలు వ్రాసికొనఁజొచ్చిరి. ఈ యొడంబడికలను మనము పరిశీలించితిమేని ఇంగ్లీషువారికిని స్వదేశరాజులకును ఈ కాలమునం దుండిన సంబంధముయొక్క నిజస్వభావము బయలుపడఁగలదు. ఈ కాలపు గవర్నరు జనరలులకు వెలస్లీ కొంతవఱకు మార్గదర్శకుఁ డనుట నిశ్చయమే కాని, కొన్ని విషయముల ఈ కాలపు టొడంబడికలు వెలస్లీ వ్రాయించినవానికంటె కూడ నింగ్లీషువారి యధికారము నెచ్చుచేసె నని చెప్పవచ్చును. వెలస్లీ గారు ఆల్వారు సంస్థానముతో చేసికొనిన యొడంబడికను హేస్టింగ్సు ప్రభువు ఉదయపూరు సంస్థానముతో చేసికొనిన యొడంబడికతో పోల్చి చూచినయెడల ఈ భేదము స్పష్టము కాఁగలదు. మొదటిదానిలో ఆల్వారు సంస్థానాధీశుఁడు ఇతరులతో తన కేమైన కలహము లున్నచో ఇంగ్లీషువారికి తెలియఁజేసిన పిమ్మట

వారు తగవును యుక్తమగు రీతిని పరిష్కరింపలేనియెడల తాను వారి సాహాయ్యమును కోరవచ్చు ననియు, ఇంగ్లీషువారి స్నేహితులను తన స్నేహితులుగను వారి శత్రువులను తన శత్రువులుగను భావింపవలె ననియు, సంస్థానసంరక్షణమునకు ఇంగ్లీషువారు సైన్యము నుంచినందులకు అందుల కగు కర్చుల క్రింద అతఁడు కొంత ధనము నియ్యవలె ననియు వ్రాయఁబడియుండెను. ఇతరసంస్థానములతోను విదేశములతోను అతఁడు పూర్తిగా సంబంధమును వదలుకొనవలె నని దీనిలో నేమియు వ్రాయఁబడలేదు. తన క్రింద నున్న సైన్యమును సంస్థానాధిపతి హెచ్చుచేయఁగూడ దనియు వ్రాయఁబడలేదు. ఉదయపూరుతో హేస్టింగ్సు చేసిన యొడంబడికలో ఇతరసంస్థానములతోను విదేశములతోను సంస్థానాధిపతి ఎట్టి సంబంధమును కలిగించుకొనఁగూడ దనియు, తప్పక ఇంగ్లీషువారతని దేశమును కాపాడెద రనియు, అతఁ డెవరితోను కయ్యములు తేఁగూడ దనియు, ఇతరులతో నేదైన కలహము లున్నయెడల ఇంగ్లీషువారి ద్వారానే యవి పోఁగొట్టుకొనవలె ననియు, తక్కిన సంస్థానపరిపాలనములో ఇంగ్లీషువారెట్టి ఐక్యమును పుచ్చుకొన రనియు వ్రాయఁబడియుండెను. సైన్యమును సంస్థానాధిపు లుంచుకొనుటను గూర్చి ఇక్కడ నేమియు వ్రాయఁబడకపోయినను, 1857-వ సంవత్సరమునకు ముందే సంస్థానాధిపులు బ్రిటిషువారి యనుజ్ఞ లేకుండ స్వతంత్రముగా సైన్యము లుంచుకొనఁగూడ దని యంగీకరింపఁబడెను. వెలస్లీ గారు ఇంగ్లీషు ప్రభుత్వము తక్కిన ప్రభుత్వములతో సమాన మైన దని చెప్పుకొనుచు, దానిని వాని యన్నిటికంటెను అధికబలవంత మైనదిగను మొదటిదిగను చేయఁ బ్రయత్నించిరి. 1813 నుండి 1857 వఱకు వచ్చిన గవర్నరు జనరలులు తక్కిన రాజ్యములను ముఖ్యవిషయములలో బ్రిటిషువారి యధికారము క్రిందికి తెచ్చుటకు ప్రయత్నించిరి. వానిలో వానికి సంబంధములు లేకుండఁ జేసిరి. వానికి సైన్యముల నుంచుకొనెడు యధికారమును విదేశములకు రాయబారుల నంపు నధికారమును తీసివైచిరి. కాని, ఇతరవిషయములలో వానికి సంపూర్ణస్వాతంత్ర్యమును వదలివేసిరి. ఈ పద్ధతివలన దేశమునకు చాల మేళ్లు కలిగినవి. క్రమక్రమముగా దేశమునందలి రాజు లందఱును ఇంగ్లీషువారికి కప్పము కట్టుటకును సైన్యముల నుంచుకొనకుండుటకును ఇతరరాజులతో సంబంధములను వదలుకొనుటకును ఒప్పుకొనుటవలన, అప్పటినుండియు ఈ రాజులవల్ల దేశశాంతి కెట్టి యపాయమును వాటిల్లలేదు. కాని, ఈ కాలమునందు స్వదేశసంస్థానముల క్రింద నున్న ప్రదేశము కొంత ఇంగ్లీషువారిచే నాక్రమించుకొనఁబడెను. డాల్హౌసీ ప్రభువు పరిపాలనకాలమున సతారాయు నాగపూరును, ఔరసులు లేకపోవుటచే, బ్రిటిషు రాజ్యములో కలుపుకొనఁబడెను. మఱికొన్ని, ఔధ్ సంస్థానమువలె, తమ రాజుల యరాజకకృత్యములకై తీసికొనఁబడెను. స్వదేశరాజులతో ఇంగ్లీషువారీ కాలమున వ్రాసికొనిన యొడంబడికల ప్రకారము, సైన్యవిషయమునను ఇతరరాజులతోడి సంబంధముల విషయమునను ఈ రాజుల కధికారము తీసివేయఁబడినను, స్వసంస్థానపరిపాలనమందు మాత్రము వానికి సంపూర్ణ మైన స్వాతంత్ర్యము వదలివేయఁబడెను. కాని, ఈ రాజులు ప్రజల నమితముగ బాధపెట్టుచుండిరి. ప్రజల స్థితిని ఆలోచించి ఇంగ్లీషువారట్టి రాజులను పదభ్రష్టులఁ జేసి తామా రాజ్యముల పాలనము పూనుకొనుటే భావ్యముగా నుండెను. ఇది తప్ప మఱొక మార్గము లేకుండెను. ఈ పద్ధతికి అనేక నిదర్శనము లియ్యవచ్చును. 1835-వ సంవత్సరమున ఇందూరు మహారాజు హరిరావు గారి మీఁద వారి ప్రజలు తిరుగఁబడి వారి భవనమునందు వారిని ముట్టడించిరి. వారు వెంటనే గవర్నరు జనరలు గారిని సాహాయ్యము పంపుమని ప్రార్థించిరి. కాని, ఆ గవర్నరు జనరలు గారు తామట్టి విషయములలో జోక్యము కలిగించుకొన మని ప్రత్యుత్తర మంపిరి. అటులే 1853-వ సంవత్సరమున బహావల్పూరు సంస్థానాధీశుఁడగు సాదత్ ఖానుపై నసేఱులు కుట్ర పన్ని అతనిని రాజ్యమునుండి తొలఁగించుటకు ప్రయత్నించుచుండఁగా, అతఁడు బ్రిటిషువారి సాహాయ్యమును కోరెను. పంజాబు లెఫ్టినెంటు గవర్నరుగా నుండిన లారెన్సు అట్టి సాహాయ్యమును పంపుట యుక్త మని వ్రాసియుండినను గవర్నరు జనరలగు డాల్హౌసీ ప్రభు వందున కంగీకరింపలేదు.

కాని, 1857-వ సంవత్సర మనంతరము ఈ పద్ధతి పోయెను. స్వదేశసంస్థానాధిపులు కోరినపు డెల్ల సాహాయ్యమును పంపుటకు బ్రిటిషువా రంగీకరించిరి. ఈ నూతనపద్ధతి ప్రకారము, 1890-వ సంవత్సరమున కాంబే నవాబు జఫర్ ఆలీ ఖాన్ సాహెబు గారు తన పట్టణము నుండి ఆయుధపాణు లగు మూకలచే తఱుమఁబడినపుడు వారికి బ్రిటిషు గవర్నమెంటు సాహాయ్య మొనర్చిరి. ఇదియే గాక, ఏ సంస్థానముయొక్కయైనను పరిపాలనము బాగుగా లేనియెడల పూర్వమువలె "ఏ మైనను సరే" యని యూరకుండక మితిమీఱినపుడు సంస్థానమును తమ ప్రభుత్వములో కలుపుకొనుటకు బదులుగా, 1857-వ సంవత్సరమునకు పిమ్మట అట్టి సంస్థానములను కొంతకాలమువఱకు తామే పరిపాలించి పిదప సంస్థానాధిపుల కప్పఁజెప్పు నాచారమును బ్రిటిషువా రవలంబించిరి. బరోడా సంస్థానమిటులే కొంత కాల మింగ్లీషువారి ప్రభుత్వము క్రింద నుండి తిరిగి ఇప్పటి మహారాజు గారి కిచ్చివేయఁబడెను. ఇంకొక విషయమునఁ గూడ ఈ కాలమునందు మార్పు గానవచ్చును. 1857-వ సంవత్సరమునకు ముందువలెఁ గాక, ప్రతి సంస్థానాధిపునకును పుత్రులు లేకపోయినను పెంచుకొనుటకును తన రాజ్యమును దత్తపుత్రుని కిచ్చివేయుటకును అధికార మీయఁబడెను. అన్నిటికంటె కూడ మన మధికముగా గమనింపవలసిన దొకటి యున్నది. బ్రిటిషు గవర్నమెంటునకును స్వదేశరాజులకును ఒండొరులపై పూర్వ ముండిన యవిశ్వాసములు పూర్తిగా నశించిపోయినవి. ఉభయులకును లాభకారిగా నుండునట్లు అన్ని సంగతులను పరిష్కరించుకొనవలె ననెడి యుద్దేశ మెల్లెడలను గానవచ్చుచున్నది. రైల్వేల విషయమునను, నల్లమందు దొంగతనముగా తయారు చేయువారిని శిక్షించుటయందును, ఎగుమతులమీఁదను దిగుమతులమీఁదను పన్నులు విధించుటలోను, దోషస్థులను పట్టుకొనుటయందును ఒకరి కొకరు సాహాయ్యము చేసికొనుచు అందఱి కంగీకార మగునట్లు ఒడంబడికలను వ్రాసికొను

చున్నారు. స్వదేశరాజులు కూడ తమ కృతజ్ఞతను కనఁబఱచుటకై సామ్రాజ్యరక్షణమునకు "ఇంపీరియల్ సర్వీస్ ట్రూప్సు" అనఁబడు సైన్యములను తమ సొంత కర్చుతో భరించుచున్నారు. ఇంతవఱకు కాలపరిస్థితులను బట్టి ఇంగ్లీషువారికిని స్వదేశసంస్థానములకును గల సంబంధము లెట్లు మాఱుచువచ్చెనో కనఁబఱచియుంటిని. వాని ప్రస్తుతస్థితిని గూర్చి యిఁక వ్రాసెదను.

## ప్రస్తుతస్థితి

ప్రస్తుతము హిందూదేశమున సుమారు 675 స్వదేశసంస్థానములు కలవు. ఇవి బ్రిటిషు రాజ్యమునుండి వేటూయింపుగా లేవు. బ్రిటిషురాజ్యమధ్యముననే యున్నవి. వీనిలో నివసించు ప్రజలు బ్రిటిషు ఇండియా ప్రజలవలెనే హిందూమహమ్మదీయమతములకు చెందినవారు. వారివలెనే హిందీ బెంగాలీ తెలుఁగు గుజరాతీ మొదలగు దేశభాషలను మాటలాడువారు. ఆచారవ్యవహారముల యందు కూడ వారికిని మనకును ఎట్టి భేదములును లేవు. ఇంతయేల? ప్రమాదవశమున వేర్వేఱు ప్రభుత్వముల క్రిందికు వచ్చుట తటస్థించినను, ఇతరవిషయము లన్నిటియందును వారును మనమును నొకటే. ప్రభుత్వముల సంగతి విచారించునప్పుడు, ఈ 675 సంస్థానములు నొక్క మాదిరిగానే యున్నవని తలఁచుట పొరపాటు. 83 వేల చదరపు మైళ్ల వైశాల్యమును 131 లక్షల జనసంఖ్యయు 6 కోట్ల యాదాయమును గల హైదరాబాదు సంస్థానము మొదలు కొన్ని, కొన్ని చదరపు ఫర్లాంగులు వైశాల్యము గల సిమ్లా కొండ సంస్థానముల టుండ, 100 మొదలు 150 వఱకు జనసంఖ్యయు సాలుకు 250 రూపాయిల యాదాయమును గల బొంబాయి రాజధానియందలి జారిగర్హాడీ బిల్బారి మొదలగు సంస్థానములవఱకు పెక్కు తరగతుల సంస్థానములు కలవు. కొన్ని మైసూరు బరోడాలవలె మిగుల సస్యవంతము లగు భూములు. కొన్ని రాజపుత్రస్థానమునందలి సంస్థానములవలె వట్టి యెడారులు. కొన్ని పూర్తియైన సివిలు క్రిమినలు అధికారములను కలిగియుండుటయే కాక, పోలీసు డిపార్టుమెంటు నుంచుకొనుటకును తపాలాఫీసుల స్థాపించుటకును నాణెములను వేసికొనుటకును కూడ నధికారములు కలిగియున్నవి. కొన్నిటి కెట్టి యధికారములును లేవు. ఈ 675 సంస్థానములలోను 175 గవర్నరు జనరలు గారి యధికారము క్రిందను, తక్కిన 500 సంస్థానములును రాష్ట్రీయప్రభుత్వముల యధికారము క్రిందను నున్నవి. ఈ సంస్థానములయొక్క హోదాయును అధికారములును ఇట్టివని పరిశీలింతము. ఈ సంస్థానములను గుఱించి "స్టేట్" అను పదము వాడఁబడుచున్నది. బ్రిటిషు ప్రజలు నైజాము గారి ప్రజలు మైసూరు మహారాజు గారి ప్రజలు అని వేఱుచేసి చెప్పుట కూడ వాడుకయైనది. హిందూదేశమును గుఱించి పార్లమెంటులో నంగీకృతమైన శాసనములలో 'చక్రవర్తి గారితో స్నేహపూర్వకమగు సంబంధములను కలిగియున్న రాజులును సంస్థానములును' అని వాడుకలవాటు కలదు. ఇటీవల సెయింటు నిహాలు సింగు గారును ఇతరులును పత్రికలలో వ్రాయుచు ఈ సంస్థానాధీశులను గుఱించి "కింగ్సు అలైస్" అని వ్రాసియుండిరి. దీనిని బట్టి ఈ సంస్థానాధీశులు హోదాయందు చక్రవర్తి గారితో సమాను లని యనుకొనుట కవకాశ ముండెను. కాని, అది నిజస్థితి గాదు. ఫ్రాన్సు జర్మని మొదలగు విదేశములకు తమ రాయబారముల పంపుటకును వారితో నెట్టి సంబంధము నుంచుకొనుటకును ఈ సంస్థానముల కధికారము లేదు. చక్రవర్తి గారే దేశముపైనైన యుద్ధము ప్రకటించినయెడల వీరు కూడ ఆదేశముతో యుద్ధము చేయుచున్నటులే భావింపఁబడుదురు. వర్తకవిషయములను గుఱించియైనను ఇతరదేశముల యేజంట్లతో ముచ్చటించుటకు వారి కధికారము లేదు. ఇతరదేశముల బిరుదులను బ్రిటిషు గవర్నమెంటువారి యనుమతి లేకుండ పుచ్చికొనరాదు. ఐరోపాదేశవాసులకుఁ గాని అమెరికావారికిఁ గాని బ్రిటిషు గవర్నమెంటువారి సలహా పుచ్చుకొనకుండ తమ క్రింద ఉద్యోగము లియ్యఁగూడదు. వారిలో వారికి తగవు లున్నను బ్రిటిషు గవర్నమెంటునకు తెలియఁజేయవలసినదే కాని, ఒండొరులతో నెట్టి యుత్తరప్రత్యుత్తరములను జరుపఁగూడదు. ఎవరి కష్టసుఖములను వారు బ్రిటిషుద్యోగస్థులతో చెప్పుకొనవలసినదే గాని అందఱును కలిసి మహాజను పెట్టుకొనుటకైనను అధికారము లేదు. వీరి ప్రజలకు విదేశములయందును సముద్రములమీఁదను హాని రాకుండ కాపాడుట బ్రిటిషు గవర్నమెంటువారి విధి. వారికి హాని వచ్చినయెడల ఎవరివల్ల హాని వచ్చెనో వారియొక్క గవర్నమెంటునొద్దనుండి నష్టపరిహారము రాబట్టుటకు బ్రిటిషు గవర్నమెంటువారికి సంపూర్ణ హక్కు గలదు. విదేశరాజులతో బ్రిటిషు గవర్నమెంటువారు హిందూదేశమును గుఱించి ఎట్టి యొడంబడికలు వ్రాసినను అవన్నియు బ్రిటిషు ఇండియా ప్రజలతోఁ బాటు ఈ స్వదేశసంస్థానములయందు నివసించుచున్న ప్రజలకును అన్వయించును. 1873-వ సంవత్సరమున మస్కాటు సుల్తానుతో బ్రిటిషు గవర్నమెంటువారు చేసికొనిన సంధివలన బ్రిటిషు ప్రజలు అను మాట స్వదేశసంస్థానముల ప్రజలకు కూడ వర్తించు నని తెలియఁజేయఁబడెను. దీనిని బట్టి అంతర్జాతీయసంబంధములలో ఈ సంస్థానముల కెట్టి స్థానమును లేదనియు, వీరికిని బ్రిటిషు గవర్నమెంటునకును గల సంబంధము ఇంగ్లాండునకును ఫ్రాన్సునకు అమెరికాకును గల సంబంధమువంటిది కాదనియు తెలియవచ్చును. 1895 ఆగస్టు 24-వ తేదని గవర్నమెంటు గెజటునం దిట్లు ప్రకటింపఁబడెను: "అంతర్జాతీయపద్ధతులు రాణి గారికిని స్వదేశసంస్థానాధీశులకును గల సంబంధముల కన్వయింపవు. రాణి గారి యాధిపత్యము క్రింద వీ రున్నా రనుట ప్రత్యక్షము." 1875-వ సంవత్సరమున బరోడా సంస్థానాధీశు లగు మల్హారి రావు గారు తమ యాస్థానమునందలి బ్రిటిషు ప్రతినిధిని విషము పెట్టి చంపించుటకు ప్రయత్నించినపుడా కార్యము వారు రాణిగారియెడల చూపవలసిన రాజభక్తికి విరుద్ధముగా నున్న దని వారియందు దోషస్థాపనము చేయఁబడెను. 1891-వ సంవత్సరమున మానిపూరు సంస్థానాధీశుఁ డగు సూర్చంద్రసింగు తన రాజ్యమునుండి తఱిమివేయఁబడినపుడు అతని

తమ్ముఁడగు సేనాపతి సాహాయ్యమున అతని కుమారుఁడు రాజాయెను. బ్రిటిషు గవర్నమెంటు యువరాజును సంస్థానాధీశునిఁగా నంగీకరించినను, సేనాపతి మానిపూరు వదలివేయవలెనని యాజ్ఞచేసిరి. కాని, అతఁడట్లు చేయలేదు. దానిని గురించి చర్య జరపుటకై అస్సాము ఛీఫ్ కమిషనర్ గారు కొంత పరిజనముతో వెళ్లినపుడు వారందఱును చంపివేయఁబడిరి. పిమ్మట వీరందఱును మహారాజుగారిపై తిరుగుఁబాటు చేసినందునకును హత్యను జరగించినందునకును శిక్షింపఁబడిరి. దీనిని బట్టి ఈ స్వదేశసంస్థానముల కెవరు రాజు కావలసినదియు నిశ్చయించుటకును ఆ దేశపు ప్రజలు వారి రాజుపై తిరుగుఁబాటొనరించునపుడును గొప్ప నేరములు చేసినపుడును వారిని శిక్షించుటకు బ్రిటిషు గవర్నమెంటువారి కధికార మున్నట్లు స్పష్టపడుచున్నది.

పైన వ్రాసినదానిని బట్టి ఈ సంస్థానాధీశులు "కింగ్సు అలైస్" అని పిలువఁబడినపుడును, వారి సంస్థానములందలి జనులను గురించి 'నైజాము గారి ప్రజలు, బరోడా మహారాజు గారి ప్రజలు' మొదలగు వాక్యములను మన ముపయోగించినపుడును, అది మర్యాదను కనఁబఱచుటకే కాని, నిజస్థితిని బట్టి ఈ సంస్థానములు రాజ్యములుగా పరిగణింపఁబడఁగూడదని తెలియుచున్నది. కాని, మన జమీందారులకును ఈ సంస్థానాధీశులకును ఒక భేద మున్నది. అధికారములు మన జమీందారుల కేమియు లేవు. అధికారములను బట్టి చూచిన, వారును మనవంటివారే. చాల భూమి యుండుటవలన గొప్ప యాదాయమును మాత్రము కలిగియున్నారు. స్వదేశసంస్థానాధీశులు మాత్ర మట్లు కాదు. సివిలు క్రిమినలు అధికారములను పోలీసువారి నుంచుకొనుటకును నాణెములను వేయించుకొనుటకును తపాలా డిపార్టుమెంటు నుంచుకొనుటకును వారు స్వాతంత్ర్యము కలిగియున్నారు. పరిపాలనము బాగుగా లేకుండినచో బ్రిటిషు గవర్నమెంటువారు జోక్యము కలుగఁజేసికొనుట కధికారము కలిగియున్నను, మొత్తముమీఁద ఈ విషయములలో చాల స్వాతంత్ర్య మనుభవించుచున్నారనవచ్చును. కాని, ఈ 675 సంస్థానముల కీ యధికారము లన్నియు కల వని మన మనుకొనఁగూడదు. ఈ యధికారముల నొక్కటొక్కటిగాఁ దీసి పరిశీలింతము.

హిందూదేశమునందలి సంస్థానము లన్నిటిలోను స్వతంత్రముగా తపాల డిపార్టుమెంటు కలవి హైదరాబాదు తిరువాన్కూరు కొచ్చి భూపాలు మొదలగునవి సుమారు 20 మాత్రమే కలవు. వీనిలో కొన్నిటియందు బ్రిటిషు పోస్టాఫీసులు గూడఁ గలవు అదియునుగాక, ఇవన్నియు సొంతముగా స్టాంపుల నచ్చువేసి యుపయోగించుట లేదు. తక్కిన సంస్థానము లన్నియు బ్రిటిషు తపాల డిపార్టుమెంటునే యుపయోగించుచున్నవి. వీనిలో మైసూరు బరోడా కాశ్మీరు బహావల్పూరు బికనీరు మొదలగు గొప్ప సంస్థానములు కూడఁ గలవు.

ఇఁక నాణెములను గూర్చి విచారింతము. నాణెములను వేసికొనెడి యధికారము మొట్టమొదట అనేక సంస్థానముల కున్నను, బ్రిటిషు నాణెముల నుపయోగించుటే లాభ మని తలఁచి వానిలో చాల సంస్థానము లా యధికారమును క్రమముగా వదలుకొనినవి. ఇప్పుడు హైదరాబాదు తిరువాన్కూరు బూంది జయసల్మీర్ మొదలగు సుమారు పది సంస్థానములు మాత్రమే తమ సొంత నాణెములను కలిగియున్నవి. వీనిలోఁ గూడ చాల సంస్థానములు ఇఁక ముందు సొంతముగా నాణెములు వేయుటను మానుటకు సంసిద్ధములై యున్నవి. మైసూరు బరోడా కాశ్మీరము మొదలగు గొప్ప సంస్థానములు కూడ ఈ యధికారమును వదలుకొనుట గమనింపఁదగును. పాటియాల జింద నాభా సంస్థానములలో గొప్ప సమయములు అనఁగా రాజు గారి పట్టాభిషేకము మొదలగునవి వచ్చినపుడు తమ సొంత నాణెములను వేయు నలవాటు కలదుగాని, ఈ నాణెములు వాడుకలో లేవు. మనవారు ఏవైన నగలకై కాసులు క్రొత్తగా అచ్చువేయించుట యెట్టిదో ఈ సంస్థానము లీ నాణెములను వేయుటయు నట్టిదె యని మన మనుకొనవచ్చును.

ఎక్కువ యాదాయము గల సంస్థానములలో అనేకములు తమ సొంత సొమ్ముతో రైల్వేలను నిర్మించి వానివలన వచ్చెడి యాదాయమును తామే యనుభవించుచున్నవి. బొత్తిగా కొంచె మాదాయము వచ్చు సంస్థానములు తప్ప తక్కిన వన్నియు పోలీసు డిపార్టుమెంటులను భరించుచున్నవి. సివిలు క్రిమినలు అధికారములను గురించి ఈ సంస్థానములలో అనేక భేదము లున్నవి. సుమారు 100 సంస్థానములు పూర్తియైన సివిలు క్రిమినలు అధికారములను కలిగియున్నవి. మరికొన్ని పూర్తియైన యధికారములను కలిగియున్నను, మరణశిక్షను విధించునప్పుడు మాత్రము బ్రిటిషు గవర్నమెంటువారి తరఫున వారిమీఁద ఆధిపత్యము వహించు పొలిటికలు ఏజంటనఁబడు నుద్యోగస్థుని యనుమతి పుచ్చుకొనవలెను. మఱికొందఱు సంస్థానాధీశులకు హత్య బందిపోటు మొదలగు గొప్ప నేరములను విచారించు నధికారము లేదు. ఇఁక కొందఱికి 7 సంవత్సరములవఱకు శిక్ష విధించుట కవకాశము గలదు. కొందఱికి 5 సంవత్సరములవఱకు శిక్షయు 200 రూపాయలవఱకు జరిమానాయు విధించుట కవకాశ మున్నను, 2 సంవత్సరములవఱకును 50 రూపాయల జరిమానా దాటిన శిక్ష లన్నియు పొలిటికలు ఏజంటుయొక్క యంగీకారమును బడయవలెను. కొందఱికి ఎట్టి సివిలు క్రిమినలు అధికారములును లేవు. కాని, వారి పేరున వారి సంస్థానములయందు వచ్చు కేసులలో చిన్నవాని విచారణ చేయుటకు ఠాణేదారు లనఁబడు బ్రిటిషు గవర్నమెంటుచే నియమితు లగు నుద్యోగస్థులును గొప్ప నేరములను విచారణ చేయుటకు పొలిటికలు ఏజంట్లును నుందురు. ఒక్కొక్కప్పుడు అనేకసంస్థానములకు కలిపి ఒకే ఠాణేదారు డుండును. ఈ ఠాణేదారులకు పరిపాలనాధికారములు కూడ నుండును. ఈ పద్ధతి చిన్న చిన్న సంస్థానములతో నిండియున్న బొంబాయి రాజధానియందు ముఖ్యముగాఁ గానవచ్చును. ఇట్లు సివిలు క్రిమినలు అధికారముల విషయమై ఈ సంస్థానములలో లెక్కకు మీఱినన్ని భేదములు కలవు.

## లాభనష్టములు

ఈ సంస్థానములవలన దేశమునకును ప్రజలకును లాభమా నష్టమా యను ప్రశ్నకు కూడ సంనము జవా బియ్యవలసియున్నది. కొన్ని లాభము లున్నవని యొప్పుకొనకతీరదు. దేశీయశిల్పములును దేశీయ కళలును ఈ స్వదేశసంస్థానములయం దింకను జీవించుచున్న వనియు కొందఱు మహారాజుల యనుగ్రహముకలన అభివృద్ధిలోనికికూడ వచ్చుచున్న వనియు ననుట యతిశయోక్తి కానేరదు. బ్రిటిషు ఇండియాయం దంతటను దొరల పద్ధతి దొరల గానము దొరల చిత్రలేఖనము కొరల కట్టడములే కాని, జాతీయకళ లెచటను గానరావు. వారి దేశపువానిని వారు ప్రేమించుట స్వాభావికమే కావచ్చును గాని, ఈ సందున జాతీయశిల్పములు నాశన మొందుచున్న వని యొప్పకొనక తీరదు. కాని, మైసూరు తిరువాన్కూరు గ్వాలియరు మొదలగు సంస్థానాధీశుల యనుగ్రహముకలన దేశీయశిల్పులకు కూడ పని కల్పింపఁబడి దేశీయకళలకు నిలుచుటకు నీడ యేర్పడు మన్నది. ఇది గాక, హిందూదేశీయులు గొప్ప కార్యప్రవీణు లగుటకు ఈ సంస్థానము లవకాశము లిచ్చుచున్నవి. బ్రిటిషు ఇండియాయందు గొప్ప యుద్యోగము లన్నియు నాంగ్లేయులకే యియ్యఁబడుటచేత మనవారు రాజ్యాంగమునం దనుభవము సంపాదించుటకు వీలు లేదు. ఇట్లు సంస్థానములు మనవారికి రాజ్యాంగానుభవమున కవకాశము కల్పించుటయే గాక, ఆ మూలముననే భారతీయుల బుద్ధివైభవమును ప్రపంచమునకు చాటుటకును భారతీయులు స్వరాజ్యమున కర్హు లని నిరూపించుటకును తోడగుచున్నవి. మఱియొక లాభము కూడ ఈ సంస్థానముల వలన మనకు కలుగుచున్నది. వీనిలో బరోడా మైసూరు మొదలగు కొన్నిటిలో విద్యాభివృద్ధియు ఆర్థికాభివృద్ధియు త్వరగా నగుట చూచి మన దొరతనమువారిని విద్యార్జనమునకును ధనార్జనమునకును శీఘ్రముగా నవకాశములు కల్పింపుఁ డని మనము తొందరపెట్టుట సంభవించుచున్నది కాని, ఈ సంస్థానములవలన, ముఖ్యముగా చిన్న సంస్థానములవలన, పెక్కునష్టములు కూడ కలవు. ఐదాఱు లక్షల యాదాయము గల చిన్న సంస్థానము తీసికొందము. ఆ సంస్థానాధీశుఁడు తన ప్రజలకు విద్య చెప్పింపవలెను. కోర్టులను స్థాపించి న్యాయాధీశులను నియమింపవలెను. పరిపాలనకై యుద్యోగస్థులను జీతము లిచ్చి పోషింపవలెను. తన సంస్థానమునందలి పల్లెలయొక్కయు పట్టణములయొక్కయు పారిశుద్ధ్యమునకై ధనమును వెచ్చింపవలెను. ఇవన్నియు కాక తన హోదాకును గౌరవమునకును తగునట్లు సొంత ... ఖర్చుతయు చేయవలసియుండును. అప్పుడప్పుడు గవర్నరు జనరలు ...లను దర్శింపవలసియుండును. ఈ సందర్భములకు బోలెఁడు డబ్బగును. అట్టి స్థితిలో ఆ సంస్థానముయొక్క పరిపాలనము బాగుండకపోవుట లో ఆశ్చర్యము లేదు. ఈ చిన్న సంస్థానములను పరిశీలించితిమేని, వానిలో తఱుచుగా 100కి ఇద్దఱికంటె చదువు నేర్చినవా రుండుట యరుదు. బ్రిటిషు ఇండియాలో 100కి తొమ్మండుగురు విద్య గఱచినవా రుండు టనిన వ్యత్యాసము బోధపడఁగలదు. చదువు మాట యటుండనిండు. ఈ సంస్థానాధీశులకు పూర్ణమైన సివిలు క్రిమినలు అధికారము లుండును. ఇవి ప్రజలను హింసించుటకును తమ కనిష్టులైనవారిని నిర్దోషులైనను శిక్షించుటకును ఎంతయు నవకాశ మిచ్చును. గొప్పగొప్ప జమీందారీ స్థలములలో ఎన్ని కుట్రలు ఎంత యుత్సాహము ఎంత నైచ్యము ఎన్ని నిర్బంధములు ఉండునో మన మందఱ మెఱుఁగుదుము. అధికారము లేనివారివల్లనే ఇంత బాధ యుండినపుడు, అధికార మున్నవారివలన ప్రజల కెంత బాధ కలుగునో యోచింపుఁడు. పోనీ, యుక్తికై సంస్థానాధీశుఁడే కేసులలోను జోక్యము కలుగఁజేసికొనఁ డనియు, అన్నియు జడ్జీలకే వదలివేయు ననియు అనుకొనినను, ఈ జడ్జీల కతఁ డిచ్చు జీత మెంత? వా రెట్టివారు? ఎంతటి విద్యాధికులు? వారివలన నిష్పక్షపాతమైన తీర్పులు వచ్చుట కవకాశ ముండునా? ఈ విషయముల నాలోచించితిమేని, ఈ సంస్థానములవలన ప్రజల కెంత యన్యాయము జరగుట కవకాశ మున్నదియు తెలియఁగలదు. బ్రిటిషు గవర్నమెంటువారు బొత్తిగా అన్యాయములు జరగునపుడు జోక్యము కలుగఁజేసికొందురే కాని, అహా టీపాటి విషయముల జోలికి పోరు. కొన్ని సంస్థానముల తీర్పులపై పొలిటికలు ఏజంటునకు అప్పీలు చేసికొనుట కవకాశ మున్నను, వీరి తీర్పులకును హైకోర్టు తీర్పులకును ఎంత వ్యత్యాస ముండునో స్పష్టమే గదా? ఇది గాక, ఈ సంస్థానపు ప్రజలు తమ కష్టములను గుఱించి మొఱపెట్టినచో ఆ మొఱ వినువా రెవరు? మనము వారి ప్రక్కనే యున్నను, వారికిని మనకును ఎట్టి సంబంధమునకును వీలు లేదు. బ్రిటిషు ఇండియాలో నేదో యొక మూల అన్యాయము జరిగిన, దేశ మంతయు నాసేతుహిమాచలపర్యంతము మాఱుమ్రోఁగును. కాని, ఈ చిన్న సంస్థానములలో నుండు వేల సంఖ్యలు గల ప్రజలకు ప్రజావాక్యబల మెక్కడిది? అందువలన వారికి కలుగు కష్టములు ఇల్లు గట్టుకొని యుండవలసినవే కాని త్వరలో తొలఁగుట కవకాశము లేదు.

## రావలసిన మార్పులు

ఈ స్వదేశసంస్థానములు హిందూదేశపు భావిరాజ్యాంగతంత్రమునం దెట్టి స్థానము నలంకరించునదియు క్రింద విచారించెదను. దాని మాట యటుండ, వీనిలో నింకే మైన మార్పులు కలుగవలెనా యని ప్రశ్నించిన, చాల కలుగవలె ననియే నా యభిప్రాయము. ఒకటొకటిగా వీనిని వివరించెద. హిందూదేశమునం దంతట నొక తపాల్ సిస్ట ముండుటవలన చాల లాభము లున్నట్లు కనఁబడును. కొన్ని సంస్థానములకు వేఱుగా పోస్టు లుండుటవలన నష్టమే గాని లాభము వచ్చుట లేదు. దేశమునం దంతటను ఒకే తపాల్ సిస్ట ముండినయెడల, స్టాంపుల నచ్చువేయుటయందును ఇతరవిధములను చాల కూడివచ్చును. ఈ లాభములను గ్రహించియే మైసూరు మొదలగు సంస్థానములు తమ ప్రత్యేకపు తపాల్ పద్ధతులను వదలుకొనినవి. మైసూరువారి విషయమై బ్రిటిషు గవర్నమెంటుతో వ్రాసికొనిన యొడంబడిక పరిశీలింపఁదగినది.

మైసూరు దొరతనమువారి యుత్తరములు వంటి సంస్థానమునం దొక నోటీసుండి సరిగానొక చోటికి కుంచితముగా పిలిపించి నిర్ణయింపబడవలె నను వరకు మాత్ర, ముంచిరొన్ని, తక్కిన లాభనష్టములను కర్చులను ఆదాయములను అధికారములను బ్రిటిషువారికే వదలివేసిరి. ఇటులే యన్ని సంస్థానములును చేసిన బాగుండును. దీనిలో గౌరవనష్ట మేమియు లేదు. రెండవ విషయము నాణెములను చేసికొనెడి యధికారమును గురించి. దీని విషయమై కూడ దేశమునం దంతటను ఒకే పద్ధతి యుండుట లాభకరము. స్వతంత్రముగా నాణెములను చేసికొనుట వలన చాల సంస్థానములు 18-వ శతాబ్ది యంతమున చాల నష్టమునకు లోనయ్యెను. ప్రతి యేటను ఈ సంస్థానములు చాల రూపాయీలను అచ్చువేయుచుండుటవలన వాని విలువ తగ్గసాగెను. మొట్టమొదట బ్రిటిషు రూపాయిలతో సరిసమానముగా మారిన యీ సంస్థానపు రూపాయీలు కొన్నాళ్లకు 10 బ్రిటిషు రూపాయీలకు 12, 13 సంస్థానపు రూపాయీల చొప్పున మారఁజొచ్చెను. ఇట్లు సంస్థానములకు చాల నష్టము వచ్చెను. బ్రిటిషు రూపాయీలతో రూపాయికి రూపాయిగా మారుటకై ప్రతి యేటను ఎన్ని రూపాయీలను ప్రతిసంస్థానము నచ్చువేయవలెనో నిర్ణయించుట దుష్కరము. వర్తకము బాగుగా జరుగుటకు కూడ ఇన్ని నాణెము లుండుట ప్రతిబంధకముగా నుండెను. ఒక సంస్థానపు రూపాయీలను బ్రిటిషు రూపాయీలకు సమానముగా మారు నను కొనుడు. అట్టి స్థితిలో ఒక వర్తకుడు బ్రిటిషు ఇండియాలో 100 రూపాయీల సామగ్రి కొని ఆ సంస్థానములో 102 సంస్థానపు రూపాయీల కమ్మవచ్చును. తిరిగి అతఁడు డబ్బు చేరునప్పటికి సంస్థానపు రూపాయీల వెల తగ్గినచో 97, 98 బ్రిటిషు రూపాయీలు అతనికి లభింపవచ్చును. ఇట్టి నష్టములును ప్రమాదములును ఉన్నప్పుడు వర్తకము క్రమముగా జరుగుట యసిద్ధము. ఇవన్నియు నాలోచించియే మైసూరు బరోడా మొదలగు గొప్ప సంస్థానములు కూడ బ్రిటిషు రూపాయీలనే యుపయోగించుచున్నవి. క్రమముగా నన్ని సంస్థానములును ఆ పద్ధతి యవలంబించుచో యుక్తముగా నుండును. ఈ రెండింటికంటె కూడ ముఖ్యమైనదియు అవసరమైనదియు బహుశః కష్టమైనదియు నగు మార్పు పోలీసు సివిలు క్రిమినలు అధికారములకు సంబంధించినది. తక్కువ యాదాయము గల సంస్థానములకు తగిన పోలీసు వర్గము నుంచుటకును అర్హులగు జడ్జీలను నియమించుటకును అవకాశ ముండదు. 20 లక్షలైన ఆదాయ ముండినఁగాని ఇవి సాధ్యము కావు. కావున, అంతకంటె తక్కువ యాదాయము గల సంస్థానముల కన్నిటికిని ఈ యధికారములను క్రమముగా తీసివేయుట యుక్తము. దీనికి రెండు ప్రతిబంధకములు కనఁబడవచ్చును. 1858-వ సంవత్సరము నాఁటి రాణిగారి ప్రకటనయందు ఈ స్వదేశరాజుల యధికారములతో నెట్టి సంబంధమును కలిగించుకొనమని చేసిన వాగ్దానమున కీ మార్పు వ్యతిరేకముగా నుండు ననుట మొదటిది. కాని, పూర్వచరిత్రను బట్టి బ్రిటిషువారు వీరి కుంచిన యధికారము చాల కొంచెమనియు, ఐదారేండ్లవఱకు శిక్ష విధింపఁగలుగుటవలన వచ్చెడి యధికారమును గౌరవమును కొంచెమనియు, ఈ సంస్థానాధీశులలో చాలమంది జిల్లాకలెక్టరుల యధికారమునకు లోఁబడియున్నారనియు గమనించితిమేని, ఈ మార్పంత విపరీతముగా కానరాదు. సంస్థానాధీశులు స్వచ్ఛ ఈ యధికారములను వదలుకొను విషయమై పట్టుదల వహింతురని యూహింప వీలు లేదు. ఏల యన, వీనికొఱకు సొమ్ము కర్చు చేయవలసిన యవసరము లేనియెడల, తమ సొంత కర్చుకొఱకు చాల ధనము మిగులును. సిరోహీ సంస్థానము నుదాహరణముగా తీసికొనినయెడల, ఆదాయము 7 లక్షలు; రాజుగారి క్రింద కర్చగుచున్నది ఒక లక్ష మాత్రమే. మరేమియు కర్చులు లేనియెడలను భూము లన్నియు వారికి వదలివేసినయెడలను తమ సొంత కర్చుకై రాజుగారికి సుమారు 5 లక్ష లుండును. అట్టి సందర్భమున వారీ మార్పున కొప్పుకొనుటకు మిక్కిలి యవకాశ మున్నది గదా? అదియుఁగాక, సైన్యాధికారమును ఇతరాధికారములను తీసివైచి, సివిలు క్రిమినలు అధికారములను చాల సంకుచితము గావింపఁగలిగినవారా మిగిలిన యధికారమును తీసివేయలేరనుట నమ్మఁదగదు. ఇంతకును ప్రజల సౌఖ్యము ముఖ్యము గనుక, ప్రజల సౌఖ్యమున కవకాశము కలిగించునప్పుడు దేనినైనను చేయుట యుక్తముగా నుండును. వైస్రాయి గాని గవర్నరులు గాని ఇది యంతయు బోధపఱచి తమ యధికారప్రాబల్యమును మెత్తదిగా నుపయోగించునెడల సంస్థానాధీశు లీ యధికారములను కూడ వదలుకొనుటకు సమ్మతింతురని నమ్మవచ్చును. వెస్టులేక్ గారు వ్రాసినట్లు, ఏదైన తమకు విరోధముగా నున్నంత కాలము దానితో పోరాడి, దాని వలన అపాయము లేదనినతోడనే దాని సారము పోయినను దాని చిహ్నములను జాగ్రత్తగా కాపాడఁజూచుట ఇంగ్లీషువారి స్వభావమని గ్రహించితిమేని, ఈ చిన్న సంస్థానముల యధికారములను తీసివేయుటకు నిజమైన యాటంకము లేదనియు, ఈ రాటంక మనుకొనునది మానసికము మాత్రమే యనియు ననవచ్చును. రెండవ యాటంకము, వీని సివిలు క్రిమినలు పోలీసు అధికారములను తీసివైచినయెడల అందు విషయమై బ్రిటిషు గవర్నమెంటున కధిక వ్యయ మగు ననియు అందుల కగు ధనము వచ్చుటెట్లనియు సందేహము. ఈ సంస్థానముల భూమ్యాదాయములను సంస్థానాధీశులకు వదలివేసినను ఉప్పు ఆబ్కారీ మొదలగు పన్నులవల్ల వచ్చు నాదాయమును బ్రిటిషు గవర్నమెంటువారు తీసికొనునెడల మొత్తముమీఁద కర్చు తగ్గును గనుక నూతనాదాయమునకును నూతన వ్యయమునకును సరిపోవు నని నమ్మవచ్చును. ఇప్పటి పొలిటికలు ఏజంట్లకు బదులుగా అప్పుడు జిల్లాకలెక్టర్లుండురు గాని యధిక వ్యయ ముండఁబోదు. మరియు 20 లక్షలకంటె తక్కువ వచ్చు సంస్థానము లన్నిటియొక్కయు మొత్తపు వైశాల్యమును జనసంఖ్యయు తక్కువ. వీని నన్నిటిని బట్టి చూడ, 20 లక్షలకంటె నెక్కువ యాదాయము గల 28 సంస్థానములు గాక, తక్కిన సంస్థానములనుండి పైని చెప్పఁబడిన యధికారములు క్రమముగా తీసికొనఁబడుట సాధ్య మనియు యుక్త మనియు తోఁచును. ఎటులైనను ఇది కొంత కష్టముతో

GENERAL ALEXIEFF



జనరలు అలక్సీఫ్ గారు

BOCHE OUT-IN



బోచి-ఔట్-యిన్ గారు

Mr M SHINGARIEFF



ఎమ్. షింగరీఫ్ గారు

GENERAL BRUSILOFF



జనరలు బ్రుసిలాఫ్ గారు

SIR W H IRVINE



సర్ డబ్లియు. హెచ్. ఇర్విను గారు

PRINCE LVOFF



ప్రిన్సు ల్వాఫ్ గారు

M RADZIANCO



ఎమ్. రాడ్జియానోకో గారు

GRISHKA RASPUTIN



గ్రిష్కా రాస్పుటేను గారు

MINE BRESHKOFFSKY



మైన్. బ్రెష్కాప్సికే గారు

## నమ్మకమైన మంచములు. సీమలో తయారు చేయబడినవి.

### ఇంపీరియల్ బెడ్ స్టెడ్.



గృహమందు వాడుకొనుటకు గాని, క్యాంపులో వాడుకొనుటకు గాని ఉపయోగించెడు మంచి మంచము. ఇనుపపట్టాలకు రెండు అల్లికలు గల ఉక్కు వస్త్రముతో అమర్చబడినవి. పైగొట్టములు 1 అంగుళము మలకగ ఒక ఊరినుండి మరొక గ్రామమునకు పోవుటకు వీలుగనుండునట్లు ఏభాగమున కాభాగము కట్టివేయవచ్చును. సైజు 6½″ × ″3 రూ. **47-8**

దోమతెర కర్రలు రూ. **12-8.**

సెట్టు ప్రత్యేకముగ కొనుక్కొనవలయును.

### ప్రైమస్ స్టౌవు



నెం 210 మడచుటకు వీలగునవి.

పైభాగమును ఊడదీయనగును.

కెపాసిటీ 1 పైంటు.

బరువు 1¾ పౌను.

పొడవు 7″.

(టోపు రింగు లేదు.)

రూ. **22-8.**

### గ్లోబు బెడ్ స్టెడ్



ఇత్తడి రాటును కలిగి, ఉక్కుమెత్త కలిగిన మంచి మంచము.

సైజు 6½″ × ″3½.

రూ. **49-8.**

దోమతెర కర్రలు రూ. **12-8**

సెట్టు ఎక్స్ట్రా.

## నమ్మకమైన అమెరికన్ బ్రిటిషు లాంతరులు.



నెం. 2. డయటు బిజర్డు లాంతరు 1బర్నరుతో అమర్చబడి నునుపు చేయబడిన టిన్ను, దీపమును వెలిగించుటకు సదుపాయము యున్నది. రూ. **6.**




నెం. 542. కంచురంగు కల మెస్సెంజర్స్ హరికేను లాంతరు. ⅜″ బర్నరుతో కూడుకొని 3 గొట్టములు కలది. (ఎక్స్ట్రా) గట్టిది సుడిగాలిలో సైన దీపమారిపోజాలదు. లాంతరు 1-కి రూ. **11-8.**

పై గ్లోబులు రూ. **1-4.**



నెం. 546. గోడకు తగిలించుకొను మెస్సెంజరు లాంతరు. గోరు గాలిలోకూడ దీపమారిపోజాలదు. కంచురంగు, ⅝″ దళసరివత్తి బర్నరు కలది. దీపమును వెలిగించుటకు మంచి ఏర్పాటు కలది.

రూ. **12-8.**




ఓ. కే. డయటుజు హరికే లాంతరు. ప్రకాశమానమైన టిన్నుతో చేయబడినది. ⅝″ దళసరి వత్తి, బర్నరు కలవు. గ్లోబు తీయకుండగనే దీపమును వెలిగించవచ్చును.

రూ. **4.**

# AMRUTANJANDEPOT,

**109, Frere Road, Fort, Bombay. 7, Thumbu Chetty Street, Madras.**

## అమృతాంజనము

అమృతాంజనము అమృతశబ్దమాదినిగల మాయమందుగాదు. నకలు మందులవలన మోసము గలుగును. పంచభాష చీటిని చూచికొనిన మోసముగలుగదు. అమృతాంజనము అన్ని బాధలకు పరమామృతము. తలనొప్పుల మాన్పును. వాయువుపోట్ల బాపును. పార్శ్వపునొప్పుల బారదోలును. పోట్ల పోగొట్టును. వనమూలికలచే తయారుచేయబడిన మంచిమందు. అమృతాంజనమునకు సాటియైనమందు అమృతాంజనమే.



అమృతాంజనము జగత్ప్రఖ్యాతివలన దేశమునందంతటను అమృతములుఅంజనములు వెలసినవి. అమృతాంజనము అన్ని నొప్పులకు సిద్ధామృతము. అమృతాంజనము సర్వవిధ నొప్పులకు సంజీవిని వంటిది. అమృతాంజనము పలువిధములైన నొప్పులకు పరమామృతము వంటిది.

గొప్ప గొప్పవారిచే వేనవేలు యోగ్యతాపత్రములు పొందియున్నది.

వేనవేలు విక్రయము.

వెలబుడ్డి ౧-కి 0-8-0 మాత్రమే

ఏమిడికల వెడలగొట్టును. బెణుకుల ఛేదించును. తేలుబాధను తీసివేయును. దురదను తొలగించును. కీళ్ళపోట్లు పోగొట్టును. వాపులు, గాయములు, పుండ్లు, వీని కన్నిటికి అమృతము.

ఈ మందును రుద్దగానే చెమట పట్టుటవలన శరీరమందలి దుష్పదార్థములను తొలగించి దేహమున కారోగ్యము గలిగించును. నొప్పులను తీసివేయును.

అమృతాంజనమును విదేశములలో కూడ వాడుచున్నారు.

కూడుకొనినదియు క్రమముగా జరుగవలసినదియుఁ గనుక దీనిని అవశ్యముగా మాత్రమే ముందుకొనుట యుంచిది. మఱియొక ముఖ్యమైన యంశము కలదు. ఇప్పుడు కొన్ని సంస్థానములు ఇండియాను గవర్న మెంటువారి క్రిందను మరికొన్ని రాష్ట్రీయ ప్రభుత్వముల క్రిందను నుండుటవలన వీని పై యధికారములో నొక్క పద్ధతి యవలంబించుటకు వీలు కలుగకున్నది. కావున, అవన్నియు ఇండియాను గవర్న మెంటువారి క్రిందనే యుండిన అది సాధ్య మగును. ఈ యభిప్రాయమునే "టైమ్సు ఆఫ్ ఇండియా" పత్రికావిలేఖకు లొకరు కనఁబఱచిరి.

## సామ్రాజ్యసభలలో వీని స్థానము

హిందూదేశపు భావిరాజ్యాంగతంత్రములో ఈ సంస్థానముల కెట్టి స్థాన మియ్యవలసినదియు విచారణీయము. ఈ విషయమునం దిదివఱకు జరగిన ప్రయత్నములను గుఱించి ఈ సందర్భమున కొంత చెప్పవలసియుండును. లిట్టను ప్రభువు గవర్నరు జనరలుగా నున్నపుడు తనకు సలహా యిచ్చుటకై ఈ సంస్థానాధీశులలో కొంత మందిని నొక సభగా నియమించెను. పది యేండ్ల క్రిందట మింటో ప్రభువు మార్లే గారికి వ్రాయుచు ఈ సంస్థానాధీశుల కౌన్సిలు నొకదాని నేర్పాటు చేయు నుద్దేశమును తెలియఁబఱచెను గాని, అందుఁ గల కష్టముల నాలోచించి కాఁబోలు దానిని వదలుకొనెను. ఇంక రెం డేండ్లనుండి మాత్రము సంస్థానాధీశుల సభ యొకటి కూడుచున్నది. దీని కధికారములు మాత్ర మేమియు నింకఁ గలేదు. క్రిందటి యేఁటి సభలో బరోడా మహారాజు గారు బ్రిటిషిండియాకే సంబంధించిన విషయముల నాలోచించుటకై సభ కధికారము కలదనియు, అటులే తమ రాష్ట్రములకు మాత్రమే సంబంధించిన విషయములలో బ్రిటిషిండియావారు జోక్యము కలుగఁజేసికొనఁగూడ దనియు, హిందూదేశమున కంతటికిని సంబంధించిన విషయములయందు మాత్రము తమ యభిప్రాయములను గూడ తీసికొనవలె ననియు నుపన్యసించి యుండిరి. ఈ యభిప్రాయములనే ఈనడుమ మైసూరు శాసననిర్మాణసభయెదుట నుపన్యసించుచు దివాన విశ్వేశ్వరయ్య గారును ఈ యేఁటి సంస్థానాధీశుల సభలో బికనీరు మహారాజు గారును వెలిబుచ్చియుండిరి. గవర్నమెంటు కూడ ఈ సంస్థానములకు సామ్రాజ్య విషయములలో కొంత యధికార మియ్య నుద్యుక్తు లనుటకు మొన్న లండనునందలి సామ్రాజ్యయుద్ధసభకు పంపఁబడిన హిందూదేశ ప్రతినిధులు ముగ్గురిలోను సంస్థానముల పక్షమున బికనీరు మహారాజు గారిని కూడ పంపుటయే నిదర్శనము. సామ్రాజ్యమునందు వీరి కై స్థాన మియ్యవచ్చునో యింక విచారింతము.

సైన్యమును ఎగుమతి దిగుమతుల పై పన్నులును వారికిని మనకును సంబంధించిన వనుట నిశ్చయము. ఈ పన్నులవలన స్వదేశసంస్థానముల వర్తకమునందును పరిశ్రమలయందును చాల మార్పులు కలుగవచ్చును. మైసూరు హైదరాబాదు మొదలగు సంస్థానములను తీసి కొంటిమేని వానికిని విదేశములకును జరుగు వర్తక మంతయు బ్రిటిషు ఇండియాలోని రేవుపట్టణముల ద్వారముననే వెళ్లవలసియుండును. వారు విదేశములకు పంపు సరకులమీఁద చాల హెచ్చయిన పన్నును బ్రిటిషువారు విధింతు రని వాని ధరలు హెచ్చి ఇతరదేశములలో సరకు కొనుట మానవచ్చును. అట్లు మైసూరు వర్తకులకును ఆ సామగ్రి నుపయోగించేయువారికిని చాల నష్టము కలుగవచ్చును. తిరువాన్కూరు మొదలగు సముద్రతీరమునం దున్న సంస్థానములకును ఈ బాధ తప్పినది గాదు. ఏల యన, వా రైనను బ్రిటిషువారిచే విధింపఁబడిన యెగుమతి దిగుమతి పన్నుల పట్టికనే యవలంబింపవలెను కాని, ఎట్టి స్వేచ్ఛకును అవకాశము లేదు. ఈ పన్నులను నిర్ణయించుటలో ప్రస్తుతము ఈ సంస్థానముల కెట్టి యధికారమును లేదు. ప్రస్తుతస్థితియందు మరియొక యసందర్భము కూడ కలదు. పూర్వము బ్రిటిషు గవర్నమెంటువారీ సంస్థానములతో వ్రాసికొనిన యొడంబడికల ప్రకారము వానికి శత్రువులనుండి యెట్టి యపాయమును రాకుండ కాపాడుట వారి పూచీ. కాని, రేపు రష్యాతోనో చైనాతోనో యుద్ధము కలుగు ననుకొనుఁడు. అప్పుడు ఆ యుద్ధము పుట్టుటకు అష్ఘనిస్థాను గందఱు యుద్ధము చేయవలసియుండును. అప్పటికిని ఈ సంస్థానములు ఒక్క మనుష్యునిఁ గాని ఒక్క రూపాయినిఁ గాని పంపక యూరకుండవచ్చును. వాని కిష్టముండిన పంపవచ్చును గాని, వారు పంపని యెడల వారి నేమనుటకును మన కధికారము లేదు. కావున, దేశమును కాపాడు భారమంతయు బ్రిటిషిండియా పైనే పడును గాని, అందువలన కలుగు సుఖమును శాంతిని ఈ సంస్థానములవారు కూడ ననుభవింతురు. బ్రిటిషిండియాయును స్వదేశసంస్థానములును ఒకే రాజ్యాంగమునం దిముడవలె నన్న, ఈ యసందర్భము లన్నియు తొలఁగవలెను. బ్రిటిషిండియాయందలి రాష్ట్రము లన్నిటికిని ఆ యా రాష్ట్ర విషయములలో పరిపూర్ణస్వాతంత్ర్య ముండవలెను. స్వదేశసంస్థానములు కూడ బ్రిటిషిండియాయందలి రాష్ట్రములవలెనే తమకు మాత్రమే సంబంధించిన విషయములలో నిప్పటియట్లే స్వాతంత్ర్య మనుభవింపవచ్చును. బ్రిటిషిండియాయందలి రాష్ట్రములవలెనే వీరు కూడ పూర్ణాధికారములు గల ప్రజానిర్వచితసభ్యులనే కలిగియుండు శాసనసభలను స్థాపింపవలెను. ఈ శాసనసభలను గూర్చి వీరిని నిర్బంధము చేయుటకు బ్రిటిషువారి కెట్టి యధికారమును లేదనెద రేమో. బ్రిటిషిండియాయందలి ప్రజలు స్వాతంత్ర్య మనుభవించుచున్నపుడు ఈ సంస్థానములందలి ప్రజలు కూడ అట్టి స్వాతంత్ర్యమునకై పోరాడుదురు దని నమ్మవచ్చును. అదియును గాక, కొన్ని యేండ్లలో నట్టి శాసనసభలను మీరు స్థాపించిన గాని మీకు సామ్రాజ్యశాసనసభలో ప్రాతినిధ్య మిచ్చుటకు బ్రిటిషిండియా ప్రజ లొప్పరని తెలియఁజేసినయెడల, వీరు తప్పక అట్టి శాసనసభలను నిర్మింతు రని నమ్మఁదగును.

ఇంతియ గాక, హిందూదేశమునం దంతటను (ఈ సంస్థాన ప్రదేశములయందు కూడ) పోస్టు టెలిగ్రాఫు రైల్వే కస్టమ్సు

యియ్యఁబడినారు. అటులే విద్యావంతమును ధనవంతమును నగు బరోడా సంస్థానమున కిద్దఱు ప్రతినిధుల నిచ్చినాను. ఈ సభయందలి ప్రతినిధు లందఱును ప్రజలచేతనే మధ్యవర్తిత్వము లేకుండ నెన్నుకొనఁబడువారు. ప్రజలసంఖ్యను బట్టి క్రింది సభకు ప్రాతినిధ్యము నిర్ణయించు నలవాటు ప్రపంచమునందలి నాగరికరాజ్యము లన్నిటియందును అవలంబింపఁబడుచున్నది. మీఁది సభను అనఁగా శిష్టసభను గుఱించి కొంత కష్టమున్నది. ఇంగ్లండునందలి లార్డ్సు అనఁగా జమీందారుల సభవంటి సభను మనము నిర్మింపఁదలఁచుకొనుట యసంభవము. ఇంగ్లీషువారు కూడ లార్డ్సు సభను మార్చుటకు ప్రయత్నములు సలుపుచున్నారు. ప్రస్తుతస్థితిలో ఇంగ్లీషువారి శిష్టసభ కెట్టి యధికారమును లేదు. అది యున్నను లేనట్టుగనే పరిగణింపవచ్చును. మఱియు, రెండవ సభయొక్క యుపయోగము మొదటి సభ తొందరపడినప్పుడు ఆ ప్రమాదమును దిద్దుట గనుక, ఆ సభలోనివారు క్రింది సభలోనివారికంటె నెక్కువ యనుభవమును జ్ఞానమును కలవారుగా నుండవలెను. తండ్రి తరువాత కొడుకు పుట్టుకవల్లనే రెండవ సభలో ప్రాతినిధ్యము సంపాదించు నెడల, అట్టి సభ యుంచిన ప్రయోజనము లేదు. ఇఁక జర్మనీయందు వలె శిష్టసభలోనివారు వేర్వేఱు రాజులచే నిర్వచితు లైనయెడ ననుం లాభము లేదు. మనకు ప్రజారాజ్యము కావలెను గాని, సంస్థానాధీశులయొక్కయు గవర్నరు జనరలుయొక్కయు నధికార మక్కఱలేదు. బికనీరు మహారాజు గారు మొన్న చెప్పినట్లు, ఈ శిష్టసభలో స్వదేశసంస్థానాధీశులు మాత్రమే యుండుటకు బ్రిటిషిండియా ప్రజ లొప్పరు. ఏల యన, ప్రతినిధియమునను హా... బద్ధుపడిన మనము చేయున దేమియు నుండదు. 23 కోట్ల బ్రిటిషిండియా ప్రజలు తమతో నెట్టి సంబంధమును లేనట్టియు రాజ్యనిర్వహణ మన నెఱుఁగనట్టియు రెండు మూఁడు వందల సంస్థానాధీశుల యధికారము క్రిందికి వచ్చుట కప్పటికిని యిచ్ఛగింపరు. ఆ శిష్టసభలో బ్రిటిషిండియాకు కూడ నుచిత మగు ప్రాతినిధ్యముండితీరవలెను. అట్టి సభలో సంస్థానాధీశులు కూడ సభ్యులుగా నుండుట వారికే యవమాన మని తలఁచెదను. ఏల యన, వారు సభా యందు బ్రిటిషిండియాయందలి గవర్నరు లనఁబడు చక్రవర్తి గారి ప్రతినిధులను బోలియుందురు. వాదప్రతివాదములలో దిగుటకు వారికి తగు శ్లాఘ యుండదు. ఉన్నను, వారి మర్యాదకది భంగకరముగా నుండును. ఈ యభిప్రాయమునె "స్వదేశసంస్థానముల సమస్యలు" అను పుస్తకమున మైసూరు సంస్థానవాసి యొకరు తెలియఁజేసినట్టు వింటిని. దీనిని బట్టి సంస్థానములకును బ్రిటిషు ఇండియాకును ఉచిత మగు ప్రాతినిధ్యము శిష్టసభలో నుండవలె ననియు సంస్థానాధీశులు గాని వారిచే నిర్వచింపఁబడినవారు గాని యందులో సభ్యులుగా నుండఁగూడ దనియు నిర్ధారణ మైనది. కాని, ఈ ప్రాతినిధ్య మెట్లుండవలసినదియు, అనఁగా ఏ ప్రదేశమున కెందఱు ప్రతినిధు లుండవలసినదియు నిర్ణయింపవలసియున్నది. అమెరికాయందును కనడా దక్షిణాఫ్రికా ఆస్ట్రేలియా ప్రాన్సులయందును ఉన్నట్లు అన్ని భాగములకును సమానప్రాతినిధ్య మంగీకరించుటకు హిందూదేశమున వీలు లేదు. ఆ దేశములలో ఒక భాగమునకును మఱియొక భాగమునకును జనసంఖ్యయందుఁ గాని ధనమునందుఁ గాని అధికవ్యత్యాసము లేదు. అందువలన అన్ని భాగములకును సమానప్రాతినిధ్య మిచ్చుటకు వారికి వీలుపడినది. కాని, హిందూదేశమునం దా పద్ధతి యవలంబించిన యెడల, 3 లక్షల జనసంఖ్య గల నవనగరు సంస్థానమునకును 4 కోట్ల 50 లక్షల జనసంఖ్య గల బెంగాలునకును సమానప్రాతినిధ్య మియ్యవలసివచ్చును. ఇంతకంటె ననుచిత్య ముండ నేరదు. ఈ విషయమున మనము జర్మను రాజ్యాంగతంత్రమును చూచి నేర్చుకొనవలసియున్నది. జర్మనీలోని శిష్టసభయందు ప్రష్యాకు 17 గురు ప్రతినిధులు కలరు. కొన్ని భాగములకు ఒకే ప్రతినిధి కలఁడు. మనము కూడ నటులే యసమానప్రాతినిధ్యమును వేర్వేఱు భాగముల కియ్యవచ్చును. కాని, అట్లిచ్చుటలో వేర్వేఱు భాగముల ప్రత్యేకవ్యక్తిత్వమును దృష్టియందుంచుకొనుటయే గాక, జనసంఖ్యను బట్టి వచ్చెడి యసమానతను వీలైనంతవఱకు తగ్గించుటకును ప్రయత్నింపవలెను. అనఁగా, నవనగరు సంస్థానమున కొక ప్రతినిధి నిచ్చితిమేని, 4 కోట్ల జనసంఖ్య గల చెన్నరాజధానికి 3 లక్షల కొక ప్రతినిధి చొప్పున లెక్క మాచిన 133 మంది ప్రతినిధుల నియ్యవలసివచ్చినను, అట్లు చేయుటకు బదులుగా ఏ డెనమండ్రు ప్రతినిధులను మాత్రమే యియ్యవచ్చును. ఈ పద్ధతి ప్రకారము శిష్టసభయందు ప్రాతినిధ్య మెట్లుండవలసినదియు నిర్ణయించి క్రింది పట్టికలో కనఁబఱచి యున్నాను:

## సామ్రాజ్యశిష్టసభ

### బ్రిటిషిండియా

| | | | ప్రతినిధుల సంఖ్య |
|---|---|---|---|
| చెన్నరాజధాని | ... | ... | 7 |
| బెంగాలు | ... | ... | 7 |
| బొంబాయి | ... | ... | 7 |
| ఆగ్రా ఔడ్ రాష్ట్రములు | ... | ... | 7 |
| బర్మా | ... | ... | 5 |
| బీహారు ఒరిస్సా | ... | ... | 5 |
| పంజాబు | ... | ... | 5 |
| మధ్యరాష్ట్రములు బీరారు | ... | ... | 4 |
| అస్సాము | ... | ... | 2 |
| బ్రిటిషిండియా మొత్తము | ... | ... | 49 |

### సంస్థానములు

| | | | | |
|---|---|---|---|---|
| హైదరాబాదు | ... | ... | ... | 5 |
| మైసూరు | ... | ... | ... | 3 |
| బరోడా | ... | ... | ... | 3 |
| కాశ్మీరము తిరువాన్కూరు గ్వాలియరు ఇండూరు జయపూర్ జాధ్‌పూరు పాటియాల, ఒక్కొక్క సంస్థానమున కిద్దఱు ప్రతినిధుల చొప్పున | | | ... | 14 |

# సాత్త్వికనిరోధము

వల్లూరి సూర్యనారాయణరావు పంతులు గారు, బి. ఏ., బి. ఎల్., ఎల్. టి.

మన రాజకీయాందోళనమందు సాత్త్వికనిరోధ మను నది నిబంధనానుకూలాయుధములలో ప్రధాన మైన దని గాంధి గారు దక్షిణాఫ్రికాలో జరుపఁగలిగిన చర్యలవలన మనవారు గ్రహింపఁగలిగిరి. కాని, పెక్కు వేల సంవత్సరములనుండి మన దేశీయులు బలవంతుల దౌర్జన్యమును బాపుటకు దీనిని జయప్రదముగ నుపయోగించుచుండిరనట్లు మన పురాణములు మొదలగు పూర్వచరిత్రలవలన స్పష్టపడుచున్నది.

శరీరబలముకంటె ఆత్మబలము పెక్కు మడుంగు లెక్కువ బలీయ మైనది. రాజకీయబాధలను గాని మరి యే యితరబాధలను గాని తొలఁగింపఁగోరెడలఁచి నపుడు జనులు తమ యాత్మబలమునే సదా యుపయోగించుచున్న యెడల, ఇప్పటి యనవసరపు కష్టములకు మనము లోనుగాకుండియుందుము. ఒకానొకప్పుడు బలము నుపయోగించుటవలన జయప్రద మగు ఫలములు త్వరలో కనిపింపకపోయినను బాధ లేదు. పరిపాలకులకుఁ గాని ఇతరప్రజలకుఁ గాని ఏ విధ మైన హానిని కలుగఁజేసినవారము కాము. మనమే యిడుమల నొందుదుము. దీనిలో అపజయ మనునది లేనే లేదు. దీని నుపయోగించిన కొలఁది మనుజుఁడు మరింత ధైర్యవంతుఁడై క్రమక్రమముగ తాను స్వార్థత్యాగమూర్తి యగుచుండును. న్యాయముకొఱకు ఈ శక్తిని ప్రయోగించునపుడు దీనిని శరీరబల మెంత గాఢముగ నెదుర్కొన్నను తుదకు సత్యము జయించితీరును. ఈ యాత్మబలము నుపయోగించువారు అనేకకష్టములకు పాలైనప్పటికిని ఆ కష్టములే వారికి ఆనందజనకము లగుచుండును. కాఁబట్టి, ఈ యాయుధము నుపయోగించువారు ధనదారపుత్రాదులను లక్ష్యము చేయక మిక్కిలి ధైర్యవంతులుగ నుండవలెను. వీరు తమ శరీరబలము నుపయోగించి, ఇతరుల నెన్నటికిని ఎంత మాత్రమును బాధ నొందింపఁగూడదు; 'అహింసా పరమో ధర్మః' యను నీతివాక్యమును మఱువఁగూడదు.

తన శరీరముకంటె తన యాత్మ వేఱుగా నున్న దని గ్రహించినవాఁడే ఈ శక్తి నుపయోగింపఁగలఁడు. తన ప్రభువుల యాజ్ఞలు న్యాయ మైనవి కావని తాను త్రికరణశుద్ధిగ నమ్మినపుడు వాని నుల్లంఘించుటలో తన ప్రాణము నైనను గోల్పోవుటకు సంసిద్ధుఁడుగా నుండవలెను. ఇట్టివాఁడు తన శత్రువులను కూడ ప్రేమింపఁగలఁడు. ఒక రక్తపు బొట్టయిన పడకుండ, ప్రయోక్తలను లక్ష్యభూతులను కూడ తరింపఁజేయఁగల మహాద్భుతశక్తి ఈ యాత్మశక్తియే యని చెప్పక తీరదు. ఇది అనేకధారలు గల వాఁడి యైన కత్తి. దీని ప్రయోగమువలనఁ గలుగు ఫలములు బహుదూరము వ్యాపింపఁగలవు. ఈ కత్తి త్రుప్పు పట్టదు. దీని నెవరును దొంగిలింపలేరు. ఈ కత్తి నుపయోగించువారిలో ఎంత పోటీ యేర్పడినను, వారికి అలసట యనునది యుండనే యుండదు. ఈ కత్తికి ఒఱ లేదు. దీనిని బలవంతముగ ఎవరును లాగుకొని పోలేరు.

రాజకీయసంస్కరణములు కావలె ననువారు స్వార్థత్యాగులై యుండవలెను. వీరు ఏ విధ మైన దౌర్జన్యము నుపయోగింపక తామే కష్టముల ననుభవించుటకు సిద్ధముగ నుండవలెను. అసూయను తమ ప్రేమచేత జయింపవలెను. మోటు బల మైన శరీరబలమును తమ యాత్మశక్తిచేత జయింపవలెను. మనుష్యమాత్రులైన రాజులయందలి భక్తి దైవభక్తికి లోఁబడవలెను. మానవనిర్మాణముకంటె దైవనిర్మాణము వేఱుగా నున్న దని తన మనస్సాక్షి గట్టిగ బోధించుటచేత, మొదటి దానికి తాను లోఁబడనపుడు, ఒకవేళ తన యభిప్రాయము పొరపాటైనను, తానే బాధలను పొందును గాని ఇతరులకు ఎట్టి కష్టములను కలుగఁజేయఁడు. తా నట్టి బాధలను పొందుచున్నను, రాజ్యాంగనిర్మాణము యథాప్రకారము నెమ్మదిగా దానియంతట నది సాగిపోవుచుండును. ఒకవేళ తన యభిప్రాయమే న్యాయ మైన దైనయెడల, పరిపాలకులు ఏర్పఱచిన శిక్షలకు మిక్కిలి సంతోషములో తాను లోఁబడి భవిష్యత్ఫలములను కాలమునకును బహుజనాభిప్రాయమునకును వదలివేయుచుండును.

ఈ యాత్మశక్తి నుపయోగించుటకు ప్రతివాఁడును

తగఁడు. గాంధి తిలకు మహారాజుల వంటివారు అరుదుగ నున్నారు. ఈ యభ్యాసములో శిక్షితులై యున్నఁగాని నిర్భయత్వ మలవడదు. మనము పిఱికిపందల మగుట ఇతరులను హింసించుటకు శక్తి చాలనివార మగుటవలన కాదు, చచ్చుటకు ధైర్యము లేకపోవుటవలననే. పాశ్చాత్యదేశములలోనవలెనే, మన యిండియా దేశములో కొందఱు అరాజకులు బయలుదేఱి తమ దేశమునకు హాని కలిగించుచున్నారని దురభిప్రాయపడి ఇతరులను హత్య కావించుచుండిరి. వీరు సదుద్దేశముతో దేశసేవ చేయుచున్నామనెడి దుర్భ్రమ కలిగి ఇట్టి దుష్టకార్యములను చేయుచున్నారు. కాని, వీనివలన ఎట్టి ప్రయోజనమును లేదు సరి కదా, వీరు తమ దేశమును మరింత కష్టముల పాలు చేయుదురు. ఇట్టివారు నిస్సందేహముగ పిఱికిపందలని చెప్పవచ్చును. తమ కడుపులో నున్నదానిని వెలికిఁ గ్రక్కలేక, జైలునకు పోవుటకు సిద్ధముగా నుండఁజాలక రహస్యముగ నిరపరాధులను నిష్కారణముగ చంపి వీలైనయెడల తప్పించుకొని పాఱిపోవుటకు ప్రయత్నించువారిని ధీరులని యెట్లనఁగలము? ఇట్టి హంతకులు స్వరాజ్యపరిపాలనమును మాత్రము సాఁగనిచ్చెదరా? వీరు తమ దేశమునకుఁ గాని తోడి మానవులకుఁ గాని తుదకు తమ యైహికాముష్మిక సుఖములకుఁ గాని యెట్లు తోడ్పడఁజాలుదురు?

ఈ సాత్త్వికనిరోధమునే సత్యాగ్రహ మని గాంధిగారు గుజరాతీభాషలో వాడుచున్నారు. ఇది మతసంబంధమైన యాయుధము. మతమందు నమ్మకముగలవారే దీనిని తెలివితోను ధైర్యముతోను ఉపయోగింపఁగలరు. ప్రహ్లాదుఁడు అంబరీషుఁడు మీరాబాయి మొదలగువారు సాత్త్వికనిరోధకులే. పాశ్చాత్యులు తమ భుజశక్తిచేత స్వరాజ్యమును సంపాదించుకొనఁగలిగిరి. దానిచేతనే, వారి స్వాతంత్ర్యమునకు భంగము కలుగవచ్చును. మన యిండియా దేశమువారు తమ యాత్మబలముచేతనే దానిని సంపాదించుకొనవలసియున్నది. ఎట్టి కృషియు లేక ఉచితముగా ఈయఁబడిన స్వరాజ్యము స్వరాజ్యమే కాదు. దాని నెప్పుడు నిలుపుకొనఁజాలము. ప్రజలు తమ శక్తిని తాము తెలిసికొనఁజాలనపుడు వారిలో నిజమైన యుద్బోధ కలుగనే కలుగదు.

సాత్త్వికనిరోధి తన పరిపాలకులకు ఎట్టి తొందరను కలిగింపఁడు. అవిధేయుఁడుగ నెప్పుడు కనఁబడఁడు. పాలకులు తప్పులు చేయుచున్నారని తాను నమ్మినపుడు, వారి యకార్యకరణములను బహిరంగముగ నిర్భయముగ విమర్శించును. శిష్టస్మృతులకు వ్యతిరేకముగ నడచినాఁడని పాలకులు విధించు శిక్షలను సంతోషముతో ననుభవించును. రాజులకు భయపడి తన విధాయకకృత్యములను విడువఁడు. సహింపఁదగిన కష్టములకు సర్కారువారికి పెటీషనులు పెట్టుకొనవచ్చును గాని, సహింపఁగూడనివానిని తొలఁగించుటకు సాత్త్వికనిరోధముకంటె మేలైన యాయుధము లేదు. దీనికి రాజాధిరాజులు కూడ తప్పక లొంగిపోవుదురు.

ఈ సాత్త్వికనిరోధయుద్ధము బలహీనుల కేర్పడిన దని తృణీకారముగ కొందఱనెదరు. యుద్ధరంగమునందుండు సైనికునికంటె ఈ సాత్త్వికనిరోధి యెక్కువ ధైర్యవంతుఁడుగా నుండవలెను. మొదటివానిది తాత్కాలికముగ కలుగఁజేసికొన్న శౌర్యము. ఈతనిది యావజ్జీవము పెంచి పోషింప వృద్ధి యగుచుండు శౌర్యము. నిజము మాట్లాడిన రాజద్రోహదోషమైనను, నిజమునే ధైర్యముగ పలికి శిక్ష నొందుటకు సిద్ధపడినవాఁడే నిజమైన సాత్త్వికనిరోధి. ఇట్టివానితో పెక్కువేలమంది కారాగృహమునకు పోవుటకు సిద్ధముగా నుందురు.

ఈ సాత్త్వికనిరోధము ఒకే సమయమునందు ఒకే స్థలమందు పెక్కుమంది కలసి చేయవలసియుండు ననియు, సర్కారుద్యోగములను ఒకేసారి మానివేయుట పన్నుల నందఱు ఒకేసారి నిరాకరించుట జరుగవలె ననియు, ఇట్టి యైకమత్యము మన దేశములో రాఁజాల దనియు, కాబట్టి సాత్త్వికనిరోధాయుధమువలన రాజకీయసంస్కరణములు కలుగుట తటస్థపడ దనియు కొందఱ యభిప్రాయము. వీరు సాత్త్వికనిరోధతత్త్వమును సరిగా గ్రహింపలేరు. సర్కారువారిమీఁద ఒక్కసారిగ కొంతమంది ప్రజలు కుట్రచేసి కత్తి కట్టవలసియుండు ననుట తప్పు. పాలకులమీఁద ఏ విధమైన యసూయ గాని మనకుండఁగూడదు. ఎవరు తనతో చేరినను చేరకపోయినను తన విధ్యుక్తకార్యమును తాను చేయును, సర్కారువారు విధించు శిక్షలను ధైర్యముతో ననుభవించుటకు సిద్ధముగా నున్న వ్యక్తియే సాత్త్వికనిరోధి. తనతో పెక్కుమంది చేరినయెడల తనకు శిక్ష తప్పు నేమో యని యెదురుచూచుచుండెడివాఁడు ఈ సాధనము నుపయోగించుటకు తగఁడు.

# ఆంధ్రకవుల యపరాధములు

శతావధానులు రామకృష్ణకవులు

ఆంధ్రలోకోపకారము నాచరింప
భారతమ్మును నన్నయభట్టు తెలుఁగుఁ
జేయుమన్నాఁడు సరియె; బడాయి గాక
తొలుత సంస్కృతపద్య మెందులకుఁ జెప్పెఁడి! 1

క. నారాయణభట్టారకుఁ
గూరిమి సహాయుఁ జేసికొని కొండాడన్
నేరిచిన నన్నపార్యుఁడు
వీతెఁడి గా కేమి? కొలఁదు విద్యాగురునిన్. 2

ఉ. శీఘ్రము సర్వమున్ దెలుఁగు సేయుఁగ దక్కిన మూఁడొ నాలుగో
మిర్యములట్టి పద్యముల నెల్మిని పోలుపనా నహర్యనా
చార్యుని భారతంబు విని నైఁపక నన్నయ చేసినట్టి దు
ష్కార్యము ధీరగౌరవముఁ గాల్పదె? నిక్కము యేని యొక్కఁడన్.

తే. సరసకవిరాజు మంత్రిభాస్కరునికన్న
నెక్కుడగువాఁడె నరి కదా యెఱ్ఱప్రెగడ
మఱలఁ దెనిఁగింపఁ బూనె రామాయణంబు
గాసిఁ జేయను లేకుండె నాఁటి కెడ. 4

తే. పూనుకొనఁడువో తెలుఁగక్కనసోమయాజి
తెలిచి యాంధ్రీకరింపక విడిచినట్టి
భారతమ్మున త్రెవ్వట్టఁబట్టి కాని
యెఱ్ఱప్రెగ్గడ బందాన మేమి తెలుఁగదు? 5

క. మన యెఱ్ఱన హరివంశముఁ
దెనిఁగించినవాఁడు మంచిదే నాచన సో
మన యుత్తరహరివంశముఁ
గనఁడే! మది నెంత చక్కఁగా నున్నదియో. 6

తే. అచ్చతెనుఁగు పదంబుల నిచ్చకోలఁగఁ
జెచ్చి తలతిక్క యన్వయమ్ములను బెట్టి
గాసిచేసెను నన్నయభట్టు దారి
నుభయకవిమిత్రుఁడవు! తిక్కయజ్వ గారు. 7

తే. తనకు సంస్కృతభాషలోఁ దగిన శక్తి
లేమి మెఱుఁగఁగఁ దిక్కనసోమపీఠి
యచ్చె బిగఁబట్టి యొక శ్లోక మల్లెఁ గాక
యుభయకవిమిత్రబిరుద మే ప్రభు నొసంగె? 8

క. తన మాట తనకె తెలియక
చని యొక సాలీని వాక్యసందర్భంబున్
విని యర్థ మెఱింగిన తి
క్కన పాండిత్యంబు వేఱ యనఁగఁగ నేలా? 9

క. కొమ్మన కొమరుని కయితకుఁ
గుమ్మరి గురవయ్య లేఖకుండఁట! యిది యె
ల్లం బారాశర్యున కొక
కొమ్మ గలుగ వేల్పు వ్రాయఁ గుదిరిన లాగో? 10

తే. గురుకులక్లిష్టుఁ డయి విద్యఁ గఱవఁబోక
సహజపాండిత్యుఁడ నటంచు సంబరపడు
పోతనామాత్యు నే రాజు పూజ సేయు?
దేవరల దయ్యములను గర్తింప కేమి? 11

క. ఏ కాలమందుఁ గానీ
వ్యాకరణాదులఁ బ్రశస్తి వడసిన కవులం
జేకొంద్రు నృపులు; కొంద్రె య
వాకు లని చవాకు లిన్ని వలికెడువారిన్? 12

ఆ. పాడి కవిత్వ మల్లు పోతరాజును నెఁడు
వేఁడు పిలిచి గౌరవింపరాదు
హాలికుఁ డయి లేఁగి యవనీశ్వరులఁ గిట్టె
నక్క ద్రాక్షపండ్ల నానుడి గతి. 13

తే. రావు సర్వజ్ఞసింహభూరమణుతోడ
బావ శ్రీనాథకవిసార్వభౌముఁ డేమొ
చెప్పి తక్కుఁగుణపాత్రుఁ జేయు సదప
భోగినీదండకము నాఁడె పోతరాజు. 14

ఉ. ఊరను బేరు లేక పడియున్న తటిన్ మడి గట్టుకొన్నటుల్
నేరుము లాడుచుండెడి రసేకులు, లభ్యము గాఁగ నెట్టి క
ర్కాటితి కేని సిద్ధపడి కొంచెపుఁ గార్యము లాచరింతు, రీ
తీరు ప్రపంచమందుఁ గలదే; మన పోతన నెన్న నేటికిన్? 15

తే. ఆంధ్రకవిచక్రవర్తుల కంతఱకును
నీ పలుకు చాలు మేలుబంతి యగుఁగాక!
తెలుఁగు నేఁతయె కా? స్వతంత్రించి నీవు
చేసినది యేది? శ్రీనాథ! చెప్పుకొనఁగ. 16

Mr. AUSTIN CHAMBERLAIN



ఆస్టిను ఛేంబరులేను గారు

SIR JOHN FORREST



సర్ జాను ఫారెస్టు గారు

Mr. ROBERT ROGERS



రాబర్టు రోజర్సు గారు

Mr. W F MASSEY



డబ్లియు. ఎఫ్ మాసి గారు

Dr BETHMAN HALLWEG



డాక్టరు బెత్మను హాల్వెగ్గు గారు

HON ROBERT LANSING



గౌ. రాబర్టు లాన్సింగు గారు

HON JOSEPHUN DANIELS



గౌ. జోసిఫను డానియల్సు గారు

HON. NEUTON D BAKER



గౌ. న్యూటన్ డి. బేకరు గారు

HON JAMES W. GERA?D



గౌ. జేమ్సు డబ్లియు జిరార్డు గారు

KING ALEXANDER OF GREECE



గ్రీసుదేశపు రాజు అలగ్జాండరు గారు

THE GREEK ROYAL FAMILY



గ్రీసుదేశపు రాజకుటుంబము

JOAND'ARC AT RHEIMS



రీమ్సువద్ద జోన్డి ఆర్కు గారు

GEORGE WASHINGTON



జార్జి వాషింగుటను గారు

# సంస్కృతభాషలోని కొన్ని విస్మృత నాటకములు

మానవల్లి రామకృష్ణకవి గారు, ఎమ్. ఏ.

అహో! పృథివి నేఁటికిని రత్నగర్భయే. వెదకెడివాఁడును భోగించెడివాఁడు నుండిన రత్నముల కేమి తక్కువ? శాకుంతలోత్తరరామచరితరత్నావళీస్వప్నవాసవదత్తములు చదివి యింక సంస్కృతభాషలో నుత్తమనాటకములు గలవా యని పెక్కండ్రు తలఁచుచున్నారు. విస్మృతిమహార్ణోరాశిలోఁ గాలపురుషుని దండఘాతమునకుఁ దూంట్లువడి మునిఁగిపోయిన కృతినౌకల నిప్పు డిప్పుడు మహాప్రయత్నముల వెలువరింపఁగాఁ గవిలోక మతివిశాల మనియుఁ గావ్యవినోదులకు విహారరమణీయము లగు నారామములు వయోబుద్ధివిద్యాదిగుణవిశిష్టుల కొక్కొకరికిఁ దగినట్లు పెక్కులు కల వనియు నిరుపాధికసుఖాసక్తుల కుద్ఘోషింపఁ జాలినన్ని శిల్పవైచిత్ర్యలు పొడగానవచ్చుచున్నవి. ఈ వ్యాసమునఁ గొన్ని రూపకములఁ గూర్చి ప్రస్తావించి కేవలము నామావశిష్టము లగు మఱికొన్ని రూపకములఁ బేర్కొన్నచో లోకులు వాని సంపాదించి మాసిపోవుచున్న మహాకవికీర్తిచిత్రముల కించుక మెఱుఁగు వెట్టి వానిఁ బునరుజ్జీవింపఁజేసి కృతార్థు లగుదురుగాక యని యీ యల్పప్రయత్నమునకు దిగితిమి.

మేము నిశ్చితాంశసందిగ్ధాంశముల సూచించునట్లు సర్వత్ర ప్రమాణబుద్ధితో వ్రాయఁగలము కాని యొక్కొక మాటకు నాధారములు చూపి తిమకుఁ దామె స్త్రీలో పురుషులో యని సందేహము సైతము కలుగఁజాలినట్టి మహాపురుషుల మేము మెప్పింపఁజాలము. దీనిని సంస్కృతభాషలో రచించి సర్వసామాన్యముగాఁ బ్రచురింపవలసియున్నను మాకు గీర్వాణభాషలో వచనరచనాకౌశల మలవడకుండుటయు నాంధ్రభాషపైఁ గల పక్షపాతమును నాంధ్రుల బహుపథసంచరణశీలమును నీ యుద్యమమునకుఁ గారణము లయ్యె.

ఈనడుమఁ గొన్ని నష్టప్రాయము లగు నలంకారశాస్త్రగ్రంథములు లభింప వాని శోధించితిమి. కొన్ని నాటకములు లభింపఁ జదివి యానందించితిమి. పైవానిలో శారదాతనయుని భావప్రకాశము, భోజదేవుని శృంగారప్రకాశము, అభినవగుప్తపాదుల నాట్యశాస్త్రవ్యాఖ్యానము, అమృతానందుని కావ్యాలంకారసంగ్రహము, ముకుళుని యుద్భటాలంకారవ్యాఖ్యయు ముఖ్యములు. వీనిలోఁ బేర్కొన్న నాటకములు పెక్కు లుత్పన్నము లయ్యె. వానిలోఁ గొన్నిటిఁ బేర్కొని ప్రలబ్ధనాటకముల గుఱించి విస్తరించెదము.

దశమావస్థ రూపకముల వర్ణించుట నిషేధ్య మనియు నాయకమృతి పునరుజ్జీవనమునఁ బర్యవసించునేని దుష్టము కాదని చెప్పుచు శారదాతనయుఁడు, "చంద్రాపీడస్య మరణం ప్రత్యుజ్జీవనకాంక్షయా । కల్పితం భట్టబాణేన యథా శారదచంద్రికా" యనెను. బాణుని శారదచంద్రికలోఁ గాదంబరీకథయే కథాశరీరము కాఁబోలు. క్షేమేంద్రుఁడు, "అంగేఽనంగజ్వరహుతవహ శ్చక్షుషి ధ్యానముద్రా । కంఠే జీవః కరకిసలయే దీర్ఘశయ్యా కపోలః । అంసే వీణా కుచపరిసరే చందనం వాచి ముద్రా । తస్యాః సర్వం కృత మితి పున స్త్వాం వినా క్వాపి చేతః." అని యుదాహరించిన పద్యము కాదంబరీవిరహావస్థను సూచించు నని చెప్పుటచే శారదచంద్రికలోనిదే కావలయు.

హైహయవంశస్థు లగు కలచురిరాజులలోఁ బ్రఖ్యాతుఁ డగు ననంగహర్షుఁడు తాపసవత్సరాజ మను నాటకమును రత్నావళీస్వప్నవాసవదత్తకథాభాగములఁ గైకొని రచించెను. ఇతఁడును క్రీ. శ. 7–8 శతాబ్దులలో నుండినవాఁడు. ఈ నాటకరాజము మనకు లభింపకున్నను యూరోపుదేశమున నొక్క ప్రతి యెచ్చటనో నిలిచియున్నది. దీనిలోని పద్యములు విప్రలంభకరుణరసప్రధానములుగా నానందవర్ధనభోజాదు లుదాహరించిరి. దీనిలోఁ బద్మావతి నుదయనుఁడు పరిణయమాడినను వాసవదత్తపైఁ గల మోహమునే విప్రలంభావస్థచేఁ బ్రకటించుచు హృదయమును నీరుగాఁ గరఁచు భావములు వెలువరించును. తృతీయాంకమున, లావణకాగ్నిలోఁ గాలిన వాసవదత్తను స్మరించుచు, "సర్వత్ర జ్వలితేషు వేశ్మసు భయా దాలీజనే విద్రుతే । శ్వాసోత్కంపవిహస్తయా ప్రతిపదం దేవ్యా పతంత్యా తయా । హా నాథేతి ముహుః ప్రలాపపరయా దగ్ధం వరాక్యా తథా । శాంతేనాపి వయం తు తేన దహనేనాద్యాపి దహ్యామహే." చతుర్థాంకమున, "దేవీ స్వీకృతమానసస్య నియతం స్వప్నాయమానస్య మే । తద్గోత్రగ్రహణాదియం సువదనా యాయాత్కథం నవ్యథాత్ । ఇత్థం యంత్రణయా కథం కథమపి క్షీణా నిశా జాగ్రతో । దాక్షిణ్యోపహతేన సా ప్రియతమా స్వప్నేపి నాసాదితా."

విశాఖదేవుఁ డభిసారికాచంచిక మను వత్సరాజపద్మావతీపరిణయవాసవదత్తావిప్రలంభమునే వర్ణించు నాటకమును రచించె. ఇందుఁ బద్మావతి పుత్రవధకు సమ్మతింపఁగా రాజు క్రింది వాక్యముల నామె హృదయము ఛేదించును: "ప్రమృష్టోగ్రగ్రాహం సరిత మవగాఢః శ్రమవశా । దుపాలీఢః శాఖాం ఫలకుసుమలోభాద్విషతరోః । ఫణావి...... నార్థిచ్యుతిపరచయాం క్రౌర్యనిరతాం । విషజ్వాలాగర్భాం చిర మగగ కన్యా మనుసృతః."

భవభూతిని మెచ్చి సమ్మానించిన కాన్యకుబ్జాధీశుఁడు యశోవర్మ రచించిన రామాభ్యుదయము షడంకనాటక మతిమనోహరముగా నుండు నని యూహింపఁదగియున్నది.

బాణాని ముకుటతాడితకమున గదాయుద్ధభాగముఁ దత్పూర్వ కథయు వర్ణింపఁబడియున్నవి. భీముఁడు దుశ్శాసనవధానంతరము ద్రౌపది క్రొమ్ముడి ముడిచి "ప్రధ్వస్తాః స్యుర్ధార్తరాష్ట్రాః సపంటా త్పీతం రక్తం స్వాదు దుశ్శాసనస్య । పూర్ణా కృష్ణా కేశబంధప్రతిజ్ఞా తిష్ఠత్యేకః కౌరవస్యోరుభంగః ఊరూ నిపీడ్య గదయా యది నాద్య లిస్య పాదేన రత్నముకుటం శకలీకరోమి । దేహం చితేతనిజ ధూమ విజృంభమాణ జ్వాలాజటాలవపుషి జ్వలనే జుహోమి" అని శపథము సేయు భాగము భోజుఁడుదాహరించెను.

చాణక్య-చంద్రగుప్తుల కథ ముద్రారాక్షసమునందె కాక ప్రతిభాచాణక్య దేవీచంద్రగుప్త నాటకముల వర్ణింపఁబడియె. దేవీచంద్రగుప్తమునఁ జంద్రగుప్తుఁడు స్త్రీవేషము ధరించియుఁ గృతకోన్మాదముచు బూనియుఁ జాణక్యునకు సహాయుఁడై రాజ్యలాభముఁ బొందినట్లు తోఁచుచున్నది. అందు నాయిక యగు వసంతసేనతో మాధవుఁ డిట్లు చెప్పెను: "ఆనందాశ్రుసితేతరోత్పలరుచో రాబధ్నతా నేత్రయోః । ప్రత్యంగేషు వరానసే పులకిషు స్వేదం సమాతన్వతా । కుర్వాణేన నితంబయో రుపచయం సంపూర్ణయో రప్యసౌ । తేనాప్యస్పృశతా ప్యధోనివసనగ్రంథి స్తథోద్వాసిత." మఱియుఁ జంద్రగుప్తుఁడు ప్రతివీరజనసంఖ్యఁ గాంచి బెదరుచున్న విదూషకునితో నిట్లనెను: "సద్యశ్శ్యాన్ పృథువర్ష్మవిక్రమబలాన్ దృష్ట్వాద్భుతాన్ దంతినో । హా సైనేవ గుహాముఖా దభిముఖం నిష్క్రామతః పర్వతాన్ । ఏకస్యాపి విధూతకేసరసటాభారస్య భీతా మృగా । గంధాదేవహరే ర్ద్రవంతి బహవో వీరస్య కిం సంఖ్యయా."

త్రిలోచనమహాకవి పార్థవిజయము రచించెను. లోచనద్వయుల మగు మనకుఁ ద్రిలోచనకృతిగాంభీర్య మెఱుఁగరాదను నంత గమ్య మగు నక్కృతియు నింకను లబ్ధమైనది కాదు. దానిలో గంధర్వరాజపరిభూతుఁ డగు దుర్యోధనుని విడిపించి యర్జునుఁడు, "మైవ శ్వేతే కురుపాండవాంతరకృతో యస్మిన్ విశేషో స్తి నః । తస్మిన్ స్తత్క్రమసాధువస్తు కథ మిత్యార్యా విజానంతి తత్ । యత్త్రైలోక్యాభిజనాన్వయే త్వభిభవః క్షత్రస్య తస్మిన్ పునః । భ్రాతౄణాం పురతోభియోగసమయే పంచోత్తరంస్యాచ్ఛతం." అని చెప్పఁగా దుర్యోధనుఁడు సిగ్గువడి మాఱువలుకనోడి యెట్టకేలకు, "భ్రాతర్గ్రహమిత్యసదృశం మమ దుష్కృతైస్తైః శ్చేష్టా భవానితి తదత్ర దశావిరుద్ధం । యద్యద్బ్రవీమి వచసా నతు తత్తు చిత్తకామం భవేచ్ఛరణ మప్రతిపత్తిరేవ." యని యుత్తర మిచ్చెను.

ఇట్లే యుత్సన్నము లగు నాటకములు కృత్యారావణ, రామానంద, పాండవానంద, మాలతికా, చంద్రలేఖా, కుసుమశేఖర, శాభద్రికా, తరంగదత్త, సముద్రదత్త, మూలదేవచరిత, చండాల రామాయణ, పుష్పభూషితక, రామానుజ, గౌరీగృహ, నళవిక్రమ, మారీచవంచిత, సుగ్రీవకేళన, దేవీపరిణయ, చైత్రావళీ, మదలేఖా, స్తంభితరంభిక, మేనకానాహుష, పద్మావతీపరిణయ, సాగరకౌముదీ, గంగాధర ప్రాదులు లెక్కలేనివి గలవు. పై పేర్కొనఁబడిన వన్నియు నతిప్రాచీనరూపకములు, క్రీస్తుశకము 8-వ శతాబ్దికిఁ బూర్వము పుట్టినవి కాని నవీనములు కావు.

మన కిటీవల లభించిన నాటకములలో శరిష్ఠప్రాయాయాలి ప్రతిమావాసవదత్తములు తక్కఁ దక్కిన వన్నియు సమగ్రముగా నున్నవి. వీనిలోఁ బ్రాచీనము లని చెప్పఁదగిన కొన్నిటిఁ గూర్చి యించుక ప్రశంసింపఁదగును. కొన్నిటిలోఁ గృతి పేరులును గొన్నిటఁ గవినామములును గానరావు.

## I కుందమాల

దీని ధీరనాగుఁడో దిఙ్నాగుఁడో రచించెను. దీనిలోని పద్యములు వామన భోజాభినవగుప్త శారదాతనయ విశ్వనాథాదు లుదాహరించినందున ఇది క్రీ. 8-వ శతాబ్దికిఁ బూర్వపుఁగృతి యని తోఁచుచున్నది. ఈ షడంకనాటకమున నుత్తరరామచరితములోని వలెనే కథ కూర్పఁబడియె. విప్రలంభకరుణరసప్రధానము లగు దీని పద్యములు భావగర్భములై మృదువులై హృదయంగమములై యున్నవి ప్రథమాంకమున లక్ష్మణుఁడు సీతను వనాంతరమున విడిచి, "స్వైస్త్వ స్య భ్రాతురాదేశా దాదాయ విజనే వనే । పరిత్యక్తాసి దేవి త్వం దోషమేకం క్షమస్వ మే." "జాహ్నవి మాం కనకల గంధకృతాధివాసైః కాలే త్వమప్యనుగృహాణ తరంగవాతైః । దేవియ.........నాయ నిగాహతే త్వాం భాగీరథి ప్రశమయ క్షణమంబు వేగం । యే కేచిదత్ర మునయో నివసంత్యరణ్యే విజ్ఞాపయామి శిరసా ప్రణిపత్య తేభ్యః । స్త్రీత్యుజ్ఝితేత్యశరణేతి కులాంగనేతి దేవీ సదా భగవతీ త్యనుకంపనీయా." అని చెప్పుచు నగోద్యతు మగలి పోవఁగా, వాల్మీకి సమిత్కుశార్థము వనసంచరణమున సీతఁ గాంచి నిజాశ్రమమునకుఁ గొంపోవుచు, "ఏతస్మిన్ కుశకంటకే లఘుతరం పాదౌ నిధత్స్వాగ్రతః । శాఖేయం వినతా నయస్వ శనకైః స్రగ్రోమహాద్వారతః । హా స్తేనాస్పృశ తేన దక్షిణగతేం స్థాణుం సముత్సా ప్రతం । పుణ్యేస్మిన్ కమలాకరే చరణయోర్నిర్వర్త్యతాం క్షాళనం" అని సుకుమారి యగు సీతకుఁ గుమారికిం బోలెఁ బ్రయాణ రీతి సూచించుచు నాశ్రమపదమునకుఁ దెచ్చి కుశలవులకుఁ గుంసవనాదికృత్యములు నడపెను. ద్వితీయాంకమున రాముఁడు వనాంతములఁ సంచరించుచు గోమతీతీరమున మదకలకలహంసగీతర ప్రాపకంతము లగు ప్రదేశములు చూచి, "ముక్తాహారా వలయరుచిరుతిశ్చందనం చంద్రపాదాః । సీతాత్యాగాత్ప్రభృతి నితరాం తాపమేవావహంతి । అద్యాకస్మాద్రమయతి మనో గోమతీతీరవాయుః ర్నూనం తస్యాం దిశి నివసతి ప్రోషితా సా వరాంగీ." అనెను. వాల్మీకాశ్రమముఁ జూచి, "సురభికుసుమగంధై ర్వాసితాశాముఖానాం । ఫలభరనమితానాం పాదపానాం సహస్రైః । క్వచిదుపరి వేవ శ్యామలోపాంతరేఖో । రమయతి హృదయం తే హంత కచ్చిద్వనాంతః." "అస్మిన్ కపోలమదపానసమాకులానాం విఘ్నం న జాతు జనయంతి మధువ్రతానాం । సామధ్వనిశ్రవణదత్తమనోవధాన నిష్పందమందమదవారణకర్ణతాళాః." "ముక్త్వా వసంత

సమయేపి మునిప్రభావా దున్నిద్రసాంద్రకుసుమాం సహకారశాఖాం । ధావంత్యమీ మధుకరాః క్రతుహోమధూమ సంత్రాసితాః సరసి వారిరుహోదరాణి." అని రామలక్ష్మణులు సల్లాపించుచు నాశ్రమసమీపమునఁ బట్టోత్తరీయముఁ గాంచి కైకొని రాముఁడు, "ద్యూతే పణః ప్రణయకేళిషు కంఠపాశః క్రీడాపరిశ్రమనుదం వ్యజనం రతాంతే । శయ్యా నిశీథకలహే హరిణేక్షణాయాః ప్రాప్తం మయా విధివశా దిదముత్తరీయం." అనుచు సంస్మృతివిషమావస్థ ననుభవించుచు, "ప్రియావిరహితానా మంగులీభిర్గణానా మవధిదివససంఖ్యా వ్యాహృతాభిః సహైవ । వ్రజతి కిరణమాలీ న్యస్తహేమైకకోశోస్మిన్ సరసి కమలపత్త్రశ్రేణయః సంకుచంతి." రాముఁడు పిదప నాశ్రమము ప్రవేశించి వాల్మీకిసీతాకుశలవాదిదర్శనము రామాయణగానమాధుర్యము వినుట మొదలుగా రమణీయముగాఁ గూర్పఁబడినది.

## II ఆశ్చర్యచూడామణి

దీనిని రచించిన కవి దాక్షిణాత్యుఁ డగు శక్తిభద్రుఁడు. ఇతఁడు శ్రీశంకరపాదుల కాలమువాఁ డనియుఁ దన కృతి నాచార్యులకుఁ జూపి వారిచే మెప్పువడసె ననియుఁ గేరళదేశమున నైతిహ్యము తక్క నితని కాలము నిర్ణయించుట కాధారములు గానరావు. ఈ సప్తాంకనాటకమున రామాయణకథ పంచవటీపర్ణశాలావాసము మొదలు రావణవధానంతరము సీతాపరిశుద్ధియు నయోధ్యాగమనమును తుదిగాఁ గల భాగము విస్తరింపఁబడియె. శూర్పణఖ సీతావేషమున రాముని వంచించుటయు రావణుఁడు రామవేషమున సీతను గొనిపోవుటయు విశేషాంశములు. ఇందుఁ బెక్కులు పద్యములు సరసములై భావగర్భములై యున్నవి. శూర్పణఖ మోహింపఁగా లక్ష్మణుఁడు, "వాసోవల్కల మాస్పదం విటపినో వన్యా శరీరస్థితిః । శయ్యా దర్భలతా ప్రసాధన ముపాంశ్వర్ణి జటానాం భరః । బాలే కిం బహునా వనే వనమృగన్యాయస్య న త్వం పదం । సారంగాక్షి తపోభృతః క్వ తపసాం శత్రుః క్వ సంకల్పజః." అనియెను. రాముఁడు మాయాత్ముఁ డగు క్షత్రియునకు "సాధారణీ నయవిదాం ధరణీ కళత్రం సుస్త్రాణి మిత్రమరయః సహజాః సుతాశ్చ । పాపాత్పరస్య పతనం నరకే చ, లాభః ద్వే చామరే చ సిత మాతపవారణం చ." అని చామరచ్ఛత్రమాత్రలాభ మగు రాజ్యవైభవము నధఃకరించి పలికె. రావణునకు మంత్రి, ధర్మోపదేశము చేసి రాజ్యాదిసర్వస్వనాశనము రాఁబోవు నని సూచించి వినక కోపము నొన్న రావణునితో ని ట్లనెను: "యుద్ధమునకు వెఱచి కాదు నీ శత్రు వగు రాముని పక్షము వహించియుఁ గాదు నీకీ పలుకులు పలుకుట; ప్రభువులు సేవకుల కంఠమున ఖడ్గ మెత్తిపట్టినను సజ్జనుఁడు స్వామికి హితమే ప్రశంసించును. (అసి మర్పయతో౽పి కంఠదేశే సుజనః శంసతి పథ్యమేవ భర్తుః.)" హనుమంతుఁడు సీతకు రామవిశ్వాసార్థము రామవాక్యములుగా నీ సందేశము దెలిపెను: "ఆయాంతం మామపరిచితయా వేశయా మందిరం తే । దండ్యశ్చోరస్త్వమితి మధురం వ్యాహరంత్యా భవత్యా । హంత హేపే మధులవముచా మాలయా మల్లికానాం । బద్ధం చేతో మృదుతర ముదం బాహుబంధచ్ఛలేన."

## III కౌముదీమహోత్సవము

దీని రచించినవాఁ డెవ్వఁడో యెఱుఁగరాదు. పాటలీపుత్రాధీశ్వరుఁ డగు సత్యాషేణుఁడు విశ్వాసఘాతుకుఁడును ననుకూలశత్రువు నగు చండసేనునిచే వంచితుఁడై రాజ్యమును బ్రాణమానములును గోల్పోవఁగాఁ గుమారుఁ డగు కళ్యాణవర్మ నాశ్రమవాసులు ప్రచ్ఛన్నముగాఁ దెచ్చి పెంచుటయు మంత్రగుప్తాదిమంత్రులు రాజనీతిప్రయోగకౌశలమునఁ బాటలీపుత్రమును మరల సంపాదించుటయుఁ గళ్యాణవర్మధాత్రి రాజ్యవిప్లవకాలమునఁ బాఱిపోయి పరివ్రాజికయై శూరసేనాధీశు నింట నివసించి దేశాటనము సేయుచు నతని కుమారి యగు కీర్తిమతితోఁ గళ్యాణవర్మ దాఁగియుండిన కిష్కింధమునకు వచ్చుటయుఁ గీర్తిమతీకళ్యాణవర్మల పరస్పరానురాగవర్ధనము వెలయుటయు రాజశ్రీయును దేవియు లభించి కళ్యాణవర్మ రాజ్యమున నెలకొన నప్పుడ కలుగు కౌముదీమహోత్సవమున నీ కథయే నాటకముగాఁ బ్రదర్శింపఁబడియె నని యెఱుఁగ నగును. నిక్కముగా నీ పేరీ నాటకమునకుఁ గలదా యనుటయు సందియమే. కళ్యాణవర్మ రాజ్యము క్రీ. శ. 600 లోఁగా నుండు నని తోఁచుచున్నది. ఈ నాటకమునఁ బరివ్రాజిక తనచే లభించిన చిత్రపటమున, "శౌనకమివ బంధుమతీ కుమారి మవిమారకం కురంగీవ । అన్వేతి కీర్తిమతీయం కాంతం కళ్యాణవర్మాణం" అని లిఖించె. అవిమారక మను నాటకము భాసరచితరూపకములలో ముద్రిత మయ్యెఁ గాని చక్కఁగాఁ జదివి చూచిన భాసునివి యొక్కటి రెం డుండు నేమో కాని యవి యన్నియు వేర్వేఱు కవులచే రచింపఁబడియె నేమో యని సందియము కలుగుచున్నది. అవిమారకకథ బృహత్కథాదుల నైతము కానరాదు. దీనిలోఁ దక్కఁ దత్కథాప్రశంసయు నెందును గనఁబడదు. ఈ నాటకశైలియు నవిమారకశైలియు నొక్కటియె. రెంటిలోను భావవైరశ్యమును మీమాంసాశాస్త్రపరిజ్ఞానమును సమానములుగా నుండుటచే రెండు నేకకవికృతము లేమో! "బంధుమతీశౌనకము" లభించినది కాదు. పంచాంకమిత మగు నీ రూపకమునుండి కొన్ని పద్యము లుదాహరించెదము. ఆకాశమునుండి పడు చిత్రపటమును జూచి పరివ్రాజిక "దృష్ట్వా నఖస్తశ్మఖిబర్హభార । శాతోదరం చిత్రపటం పతంతం । అనభ్రసంసర్గమభూతపూర్వ । మైంద్రం ధనుఃఖండ మనుస్మరామి" అనియె. విరహావస్థను సూచించుచు రాజు "పార్శ్వస్థేవ పురఃస్థితేవ దివసే రాత్రౌ చ సర్వాత్మనా । సంకల్పేన యథా పురః ప్రియతమా సైషేయమాలక్ష్యతే । గమ్యద్వేష నిబంధనో మనసి మే కష్టం వియోగోచిత । స్సంతాపో వ్యపనీయతే భగవతో పాంసుర్వినిత్రాగతిః." అనియు, నాయికారూపము చక్కఁగఁ జూడ్కికిఁ గానరాక "ఉపకృతవతీమపి ద్విశం రూపామృతసం

విభాగేన । వంచయతి స్మరణసుఖే తస్యా హృతహృదయమేతన్మే." అని ప్రలపించును. పాటలిపుత్రమును జొచ్చి నిర్వ్యాజసుఖసంపన్మనోహర మగు తన శైశవావస్థను దలంచుకొనుచు "కాలాపకర్షే సతి భంగురత్వాత్ ప్రక్షీణసంస్కారలఘూనాం స్మృతీనాం । స్ఫురంతి మే శైశవచేష్టితాని జాతిస్మరస్యేవ భవాంతరాణి." అని విలపించుట హృదయంగమమే. కీర్తియతి లేక రాజ్యభారమును వహింపఁజాలక గాదు "గిరిమివ దుర్వహాయాసం వియోగదుఃఖం వహామి కాంతాయాః । మమ కిల తస్యాపి వినా కందుకలఘురాజ్య మతిభారం." అని హృదయతత్త్వమును నివేదించుచుఁ దన ప్రథమసంప్రయోగసంస్మృతిలోఁ దేలి "పాతుం పద్మసుగంధి లోలనయనం రోమాంచితం గండయో । ర్వ్యావర్తద్రదముపాటలాధరపుటం వక్త్రం మయోన్నామితం । వైలక్ష్యప్రతిషేధవిక్లబగిరా తస్యాశ్చ తయా ముగ్ధయా । పశ్చాత్తామ్రరుచా కరేణ మమ తు ప్రచ్ఛాదితే లోచనే." అని స్వప్నములోవలె సుఖ మనుభవించును.

## IV భగవదజ్జుకము

ఈ యేకాంకప్రహసనమును రచించిన మహాకవి బోధాయనుఁడని తద్వ్యాఖ్యాతృవచనమువలనఁ దెలియుచున్నది. బోధాయనకృత మగు మహానాటకము మాకుఁ జూడఁగలిగె. బోధాయనుఁడు మహాకవి యనియు క్రీ. శ. 1400 కంటెఁ బూర్వుఁడనియు రఘువీరచరితనాటకమునఁ బ్రశంసించిన సుకుమారకవి వాక్యములవలనఁ దెలియుచున్నది. సుకుమారుఁ డాత్మస్తుతిఁ బ్రకటించుచు "యైర్బోధాయనవాక్యపుష్పకలికాః కర్ణావతంసీకృతా । యేషాం భిల్లాణసూక్తిమౌక్తికసరాః కణ్ఠానలంకుర్వతే । మాధుర్యైకభువాం మురారివచసా మస్వాది యైః స్వాదిమా । సంతుష్యంతి త ఏవ నూతనసుధావేణీషు వాణీషు నః." అనుటచే బోధాయనుఁడు ప్రఖ్యాతుఁడగు కవియని తోఁచుచున్నది. ఇతఁడు శ్రౌతసూత్రకారుఁడో బ్రహ్మసూత్రభాష్యకారుఁడో తదన్యుఁడో యీ గ్రంథమువలనఁ దెలియరాదు. ఈ చిన్న ప్రహసనము సహృదయులు తప్పక చదివి యానందింతురుగాక యని మాత్రమే చెప్ప సాహసింతుము కాని దాని శిల్పిచాతుర్య మిట్టిదని యెత్తి చూపుటకు మాకు సంవిత్ప్రభావము చాలదు. దీని కతివిపులవ్యాఖ్య యున్నను సామాన్యులకు సైత మిది యథోచితముగా రసవంతముగా నుండును; షడ్దర్శనీవల్లభులకును సుఖసంచరణము నీయని హృదయసంవాదిరసనిష్యందమునను బొందుచుండును. కేవలము సద్దిముద్దకుఁగా నొకఁడు పరివ్రాజకు నాశ్రయించి శ్రమణుఁడై భిక్షాటనముచే జీవించుచు గురువుతో ధర్మసూక్ష్మముల వాదించుచుండ నొకనాఁడు పరివ్రాజకుఁడు నిస్సంగత్వస్వరూపము బోధించుచు "సుఖేషు దుఃఖేషు చ నిత్యతుల్యతాం । భయేషు హర్షేషు చ నాతిరిక్తతాం । సుహృత్సు మిత్రేషు చ భావతుల్యతాం । వదంతి తాం తత్త్వవిదో హ్యసంగతాం." అని రాగద్వేషముల మాధ్యస్థ్య ముపదేశింప శాండిల్యుఁ డట్లుండుట శక్యము కాదనఁ బరివ్రాజకుఁ డేల యన మీకు మాటిమాటికిఁ గోప మేల రావలయు నని శిష్యుఁ డడిగెను. "నీవు విదుష వసి." "నే నధ్యయనము సేయకున్న ముక్తుఁడగు నీ కేమయ్యె?" "ఉపగతుఁ డగు శిష్యుని శిక్షార్థము తాడనము సహితము విధేయము కావున నిన్నుఁ గొట్టెదను." "యుష్మద్గమ కోపము లేక కొట్టెదరా! సంతోషమే. భిక్షావేళ యతిక్రమించె." "మూర్ఖ, ఇదె యుదయమయ్యె, నోఁటఁ గోఁకలియుఁ బ్రొయ్యిలో నిప్పును బెట్టు వేళయె గదా. ఇంచుక విశ్రమార్థ ముద్యానము చొత్తము" "ప్రతిజ్ఞాహాని యగు; వలదు." "ఎట్లు?" "మీరు సమసుఖదుఃఖులు గదా!" "నా యాత్మ సమానసుఖదుఃఖమె; కర్మాత్మ విశ్రాంతి గోరుచున్నది." అని యీ రీతి సంభాషించుచుండ నొక వేశ్య యిరువురు చేటికలతో నుద్యానము చొచ్చి పూవులు కోయ ప్రయత్నించును. పరివ్రాజకుఁడు ఋతుమహిమము వర్ణించుచు, "అభ్యాగతః కిసలయాభరణో వసంతః । ప్రాప్తా శరత్కుముదషండవిభూషణేతి । బాలో నవేష్వృతుషు రజ్యతి నామ లోకే । యజ్జీవితం హరతి తత్కిలకర్మ మస్య." (పల్లవములతో మెఱయుచున్న వసంతకాలము వచ్చె ననియుఁ దెల్లకలువలతో మనోహర మగు శరత్కాలము వచ్చె ననియు ఋతువు ఋతువునకు జనుఁడు బాలునిం బోలె నానందపడున ట్లుండును. ఏది జీవితము హరించుచున్నదో యట్టి కాలమె వీనికి రమ్య మని తోఁచెఁగదా!) ఇత్యాదితత్త్వోపదేశము సేయుచుండ గణిక మదనుని మహాప్రభావముఁ బ్రకటించు గీతములు పాడుచుఁ బువ్వులు కోయుచుండెను "మధుమాసజాతదర్పః కందర్పః కామినీకటాక్షసఖః । అవియోగినామపి మనో విధ్యతి ఫుల్లై రశోకశరైః." "పరభృతమధుకరనాద జ్యాఘోషః కామ ఏష ఉద్యానే । తిష్ఠతి సహకారశరో ముహ్యతి నూనం మనోఽపి మునేః." అంత యమభటుఁడు ప్రవేశించి కాలప్రేరితుఁడై సర్పరూపమున శాఖాశ్రయము నొంది యా సుందరి ప్రాణములు హరించె. అంత నవ్యసంతర్తుశోభయె మూర్తీభవించిన ట్లున్న యత్తనువు నేలపైఁ బడ నొక చెలి దాని తల్లిం దోతేరఁ జనుటయు శాండిల్యుఁడు నిలు పోపక, "స్వకర్మ భోక్తుం జాయంతే ప్రాయేణైవ హి జంతవః । క్షీణే కర్మణి చాన్యత్ర పునర్గచ్ఛంతి దేహినః." ఇత్యాది గురువాక్యములచేఁ దనివి నెందక శవము సమీపించి శుశ్రూషాపరుఁడై నం బరివ్రాజకుఁడు చూచి వీని వ్యామోహముఁ దొలఁగింపఁ దానా దేహముఁ జొచ్చి గాని తల్లియుఁ బ్రియుఁ డగు రామిలకుఁ డనువాఁడును రాఁగా వారి స్పృశింప నొల్లక పెడమొగ మయ్యె. రామిలకుఁడు "ఏకంనివర్తయ స్వగాళి ముఖారవింద । మీనత్తరంగ పరివృత్తిమివారవిందం । ప్రీణాతి సామృతవవక్త్రమసర్వదృష్ట మర్థావశిష్ట మివ పాణిపుటేన తోయం." అని కటాక్షవీక్షణమునకు యాచించుచుండ వైద్యుఁడు ప్రవేశించి గణికతో వాదించుచుండ యమభటుఁడు పొరపడి వేఱొక గణిక ప్రాణములకు మాఱు దీనిఁ దెచ్చితి మని క్రమ్మఱి సజీవ యగు వేశ్యం జూచి యాశ్చర్యము నెంది పరివ్రాజకుని మేన గణికాప్రాణముల నిలుపఁగాఁ బరివ్రాజకుఁడు శాండిల్యరామిలకులఁ గౌఁగిలింపఁ బిలుచుటయు మొదలుగాఁ గొంత

హాస్యమైన పిదప యమభటుం డాతఁడు ప్రాణముల వినిమయము సేసి పోవఁగా కౌండిల్యుఁడు మరలఁ బరివ్రాజకుని నిజతత్త్వమున నున్నవానింగాఁ గని యెల్ల నేమి యని యడుగఁగాఁ బరివ్రాజకుఁడు "అస్తంగతో హి దినకృద్గగనాంతలంబీ మూషాముఖస్థ ఇవ తప్తసువర్ణరాశిః । యస్య ప్రభాభిరనురంజితమేనుబృంద మాలక్ష్యతే దహనగర్భ మివాంతరిక్షం." అనునట్లు సంధ్య యయ్యె; కథ పెద్దది యథావకాశముగాఁ జెప్పెద నని నిష్క్రమింతురు. అక్కటా! ఇట్టి కవుల కావ్యములు భరతఖండాలంకారములు కాలపురుషుని యున్మత్తహస్తములకు విక్రీతకందుకము లయ్యెఁ గదా! ఈ కథాసారమును విశదీకరింపఁగా "అస్మిన్ నాట్యరసే నిసర్గగహనే యోగీంద్రశిష్యావుభౌ । ఆత్మానౌ పరజీవశబ్దకలితావన్యో త్థితౌవా జ్ఞకౌ । మూలాధారసముద్గతా సుసుషిరా నాడీ సుషుమ్నా పరే । చేష్టే చోభయపార్శ్వగే సుసుచిరే నాడ్యావిడాపింగళే." అని జీవాత్మపరమాత్మకుండలినీశక్తిరూపము లగు శిష్యపరివ్రాజకగణికల రంగస్థలముల నాడించి నిసర్గగహన మగు యోగమార్గమును పామరుల కన్నులకుఁ జూపఁగల కవులు కొందఱే జన్మించిరి.

## V మత్తవిలాసము

ఇదియు నేకాంక ప్రహసనమే. మతముల పేళ్లు వెట్టుకొని మతాచార్యుల బోధసార మెఱుంగక కులక్రమాగతసదాచారము విడఁ గలిపి నూతనబోధలలోని దురాచారముల మాత్రమె యనుష్ఠింపఁజాలిన మహానుభావుల కంధప్రాయ మగు జ్ఞానచక్షువును దెలిపింప లేక చర్మచక్షువుల కైన నాఁడి మాఫ్రుట కనియో యీ రూపకమున బౌద్ధకాపాలికోన్మత్తులు భిక్షాశనమున జీవించుచున్నను మద్యపానమత్తులై కుక్క గొని పోయిన భిక్షాపాత్రమునకుఁగా నొకరి నొక రాడికొనుచు నాచార్యపురుషుల సైతము హేళనము సేయుచుఁ బ్రొద్దుపుచ్చినట్లు కథాశరీరము కల్పించి కాంచీపురాధీశ్వరుఁడును బల్లవకులసంజాతుఁడు నగు మహేంద్రవిక్రమవర్మ దీని రచించెను. ఇతఁడు క్రీ. శ. 8-వ శతాబ్దిలో నుండినట్లు తోఁచుచున్నది. ప్రబోధచంద్రోదయములో క్షపణకబుద్ధాగమసోమసిద్ధాంతులఁ గూర్చుట కిది మూలము గాఁబోలు. ఇట్టిదే పూర్ణపురుషార్థచంద్రిక యను నాటకము మఱియొకటి గలదు. దాని జాతవేదోమహాకవి రచియించె. మత్తవిలాసమునఁ గపాలి త్రాగియాడుచున్న దేవసోమ యను భార్యతో "తపస్సుచేఁ గామరూపము ద్ధించు ననుట కాపాలికవ్రతతత్పర వగు నీయెడ నిక్కమయ్యెఁ బ్బోలు!" నీకు "ఉద్భిన్నశ్రమవారిబిందువదనం సభ్రూలతావిభ్రమం । ఖేలం యాతి మకారణాని హసితాన్యవ్యక్తవర్ణా గిరః । రాగాక్రాంతమధీరతారమలసాపాంగం యుగం నేత్రయో । రంసోపాంత విలంబినశ్చ విగళన్మాలాగుణా మూర్ధజాః." అని వేషవిశేషమును వర్ణించెను. ఇట్లే మఱియొక ప్రాచీనకవి కుసుమపురవైశికమున విలాసవిహారము సేయుచు మధుపానమోహసద్యఃప్రత్యాగతస్మృతి యగు నొక విలాసవతిం జూచి విటుఁడు "వాసు, సుభగా భవ, త్వాంహ్యల్పావశేషమగాం సావశేషసంధ్యారాగా మివ ప్రదృష్ట్వా ప్రస్రస్తశరాసనః కుసుమాయుధోఽపి తావద్వ్యాకులతాం గచ్ఛేత్. కిం పునరన్యః. శ్లో. ప్రణష్టా న వ్యక్తిర్భవతి వచసస్సైక మృదుతా । న రాగో నేత్రాబ్జే త్యజతి, న చ లజ్జా వ్యపగతా । స్మృతిః ప్రత్యాయాతా పరిహృషితమద్యాపి చ ముఖం । మదో దోషాన్ స్త్యక్త్వా త్వయి పరిణత స్తిష్ఠతి గుణైః." అని వర్ణించినట్లు తనభాణములోఁ జెప్పెను.

## VI కాదంబరీనాటకము

దీనిని గంగాధరకవి కుమారుఁడును విశ్వనాథకవి సోదరుఁడు నగు నరసింహాకవి రచించెను. ఇతఁ డే కాలమువాఁడో తెలియదు కాని పెద్దకోమటివేమభూపాలుని పేర రచింపఁబడిన సాహిత్యచింతామణిలో దీనిలోని పద్యము లుదాహరింపఁబడియున్నందున నరసింహాకవి క్రీ. శ. 1400 కంటెఁ బూర్వుఁ డనుట నిస్సంశయము. శ్రీనాథుని నూతనయౌవనకాలము వామనభట్టబాణుని కవితాసామ్రాజ్యము వేమభూపాలునియొద్దనె చెల్లియున్నది. మధురావిజయ మను కావ్యమున గ్రంథకర్త్రి యగు గంగాదేవి "చతుస్సప్తతికావ్యోక్తివ్యక్తవైదుష్యసంపదే । అగస్త్యాయ జగత్యస్మిన్ స్పృహయేత్కో న కోవిదః. స్తుమస్తమపరం వ్యాసం గంగాధరమహాకవిం । నాటకచ్ఛద్మనా దృష్టాం యశ్చక్రే భారతీకథాం. చిరం స విజయీభూయా ద్విశ్వనాథ కవీశ్వరః । యస్య ప్రసాదాత్ సార్వజ్ఞం సమింధే మాదృశేష్వపి." అని వర్ణించిన ముగ్గురిలో నగస్త్యుఁడు విశ్వనాథనరసింహులకు మేనమామ, గంగాధరుఁడు తండ్రియు నగుట కవివంశము స్తోత్రభాజన మగుచున్నది. సౌగంధికాహరణ మను ముద్రితనాటకమున విశ్వనాథకవి యగస్త్యకవి మేనల్లుఁ డని వర్ణింపఁబడుటం జేసియు గంగాదేవికి విశ్వనాథకవి గురు వగుటయు నరసింహాకవియు వేమభూపాలుని యాస్థానమున నున్నవాఁడో లేక యించుక పూర్వుఁడో యెఱుఁగరాదు. దీనిలో మొదటి యెనిమి దంకములు మాత్రమే మాకు లభించినందున దాని పరిమితి చెప్పఁజాలము. 9-అంకములు గలదియేమో? నాటకమున 5 మొదలు 10 వఱకు నెన్ని యంకము లైన నుండవచ్చును గదా. "శాకుంతలం తు సప్తాంక మష్టాంకం నళవిక్రమం । దేవీపరిణయం చాత్ర నవాంకం నాటకం స్మృతం." అని భావప్రకాశము. ఈ నాటకమునఁ గాదంబరీకథ యంతయు నంకములుగా విభజింపఁబడి మృదుమధుర మగు సులభశైలితో సంభాషణము నడపింపఁబడియున్నది గాని భావములు బాణభట్టు కాదంబరిలోవలె మత్తెక్కించి క్షణమాత్రము బాహ్యప్రపంచమును మఱపింపఁజేయునవి కావు. అచ్ఛోదసరస్తీరమునఁ జంద్రాపీడుఁడు దిగి శివాయతనమున నున్న మహాశ్వేతను జూచి వీణ వాయించి నిలిపిన దాని తపశ్చర్య కాశ్చర్యపడి దానిచే సత్కారముఁ బొంది హృదయశంకాశంకు వగు దాని చర్యావిశేషమును బ్రశ్నము చేసి యది వృక్షములు సహితము నిలువు నీరుగా నేడ్వఁజాలినట్లు తన మదనభంగమును వర్ణించి చెప్పెడి సందర్భమునఁ జంద్రాపీడుఁడు "బాష్పైర్లోచనకుక్షిగర్భనిభృతై

ర్ముక్తాఫలాభైః క్షణం । స్థూలస్థూలనిబద్ధబిందుపరితః పక్ష్మాగ్రసంపిండితైః । సించంతీ స్వముఖోజయుగ్మ మభితః శ్వాసం సృజంతీ ముహుః । కృష్ణాత్పీడితకంఠగద్గదరవా పర్యాకులం రోదితి." అని తలంచుకొనెను. పంచమాంకమునఁ జంద్రాపీడుని యెదుట నడపిన యంతర్నాటకమున సూత్రధారుఁడు నాట్యము నిట్లు ప్రశంసించును: "చాతుర్విధ్యమముష్య పంకజభువా దేవేభ్య ఉత్థాపితం । కర్తుం భూత భవిష్యతోరలమిదం ప్రత్యక్షతామర్థయోః । అంగత్వం ప్రతిపాద్య చాస్య సకలాః కామం స్వదంతే కలాః । సామ్రాజ్యస్య ఫలం న కస్య హృదయోల్లాసాయ నాట్యామృతమ్."

## VII విజయవిక్రమము

ఇది యార్యసూర్యమహాకవిచే విరచింపఁబడిన యేకాంక వ్యాయోగము. ఆర్యసూర్యుఁడు కౌండిన్యగోత్రజుఁడు. ఆర్యసూర్యుఁడను బౌద్ధకవి యుజ్జయినిలో రాజసభలోఁ గవితాపరీక్షఁ బరిక్షు యిచ్చి బ్రహ్మరథ మెక్కి యూరేఁగినట్లు కావ్యమీమాంసలోఁ జెప్పఁబడియున్నది. అతఁడే యితఁ డైనయెడల విజయవిక్రమము క్రీ. శ. 4-5 శతాబ్దులలో రచియింపఁబడియుండవచ్చును. శైలి వలన నది 8-వ శతాబ్ది గ్రంథ మని కానవచ్చుచున్నది. దీనిలోఁ బదబంధము భావములును గద్యోచితముగా వీరరసప్రకర్షమును బొందిన శ్లోకములుగా నున్నవి. ప్రస్తావనలో వసంతవర్ణనమున, "మానం విమోచయతి శీర్ణమివాశుపర్ణం । రాగం ప్రవాళమివ నూతనమాతనోతి । పీయత్స్వివ ప్రతినవోత్కలికాకులాసు । రామాస్వపి ప్రచరతి స్ఫుటమేష చైత్రః." అనుభావము గమనీయమే. పాలికలనికి సైంధవవధార్థము వోవుచున్న కృష్ణుఁ డర్జునునితోఁ బెక్కు లుత్సాహకరముగాఁ జెప్పుచు, "రణప్రస్థానోద్యత్పటుపటహనాదశ్రుతిభవ । న్ముదాప్రాదుర్భూతప్రచురపులకాంకుర ఇవ తనుః । అయం తే కృష్ణాయాః కుచకలశసంబాధసుభగః । పరీరంభో భూయో ద్విగుణపులకైర్దంతురయతి." భీష్మునిఁ జూచి, "శ్రీత్తైః కటాంక్షు విశిఖై రపి సుందరీణాం । మత్తోభ్యమాణ హృదయస్య దృఢవ్రతస్య । వీరశ్రియోపగతయా విషమాస్త్రయుక్త । కేళీజుషః పరమభూదవకీర్ణతాస్య. పిత్రర్థం త్యజతా సముద్రవలయక్షోణీగతప్రాభవం । భ్రాత్రర్థం న సముజ్జితః ప్రణయినీసంభోగలీలారసం । పాత్రార్థం జహత స్తథా ప్రియతమాన్ ప్రాణాన్ రణప్రాంగణే । లోకోత్తీర్ణ మహో న కిం గుణగణోత్తుంగస్య గాంగాయనేః." ద్రోణునిఁ గూర్చి, "క్షత్రశ్రియం ప్రకటయన్ విషమాస్త్రచిహ్నాం । బ్రాహ్మీం శ్రియం న కలయ న్మఖవేదిలక్ష్మ్యాం । యః క్రూరసౌమ్య హృదయో మథనాత్స్వరస్తా। దంతర్విషామృతయుతో ఽబ్ధిరివావభాతి." ఇత్యాదులు పెక్కు పద్యములు గలవు.

## VIII ఉభయాభిసారికా

ఇది వరరుచికృతభాణ మని తద్గ్రంథస్వామి లిఖించుకొనుట మాత్రమే కాని దీనిలోఁ గృతికవినామములు రెండును గానరావు. పేరులు లేని భాణములును నాటకములును పెక్కులు గలవు. భాణము సాధారణముగా నేకాంకపరిమితిగా నొక విటుఁడో ధూర్తుఁడో ప్రవేశించి వేశవాటమును వర్ణించుచు నాకాశభాషితమునఁ బ్రశ్నోత్తరములు జరపుచు శృంగారభావములు విస్తరింపఁజేయు రూపకవిశేషము. ఇందును వైశికోచితము లగు భావములు పెక్కులు గలవు. దీనిలో నొకనిఁ గూర్చి యిరువురు వేశ్య లభిసరించి ప్రేమించుటయే కథ కాఁబోలు. వేశమునఁ దిరుగుచున్న విటుఁడు తన మాఁచిన గణికలతో సల్లాపించి యాశీర్వాదములు సేయుచుఁ బోవుచున్న ఘట్టములలోఁ గొన్ని పద్యము లుదాహరించెదము: "కృష్ణాద్దత్తోష్ఠబింబం విరళమృదుకథం హాసలీలావియుక్తం । జృంభోష్ణశ్వాసమిశ్రం పరిశిథిలభుజాలింగనం వీతరాగం । దుఃఖాదాశ్రిత్య శయ్యాం కృతకరతివిధా చేష్టితం భావహీనం । వ్యక్తం బాలే కృథా స్త్వం నిశి దివసకరస్యోదయం చింతయంతీ." అని వేశ్యావిరాగము సూచించును. ఇట్టి యొక మహాకవి భాణమున, వేశ్యాసంగము నీరస మను వ్యంగ్యార్థము బోధించుటకుఁగా దత్తకసూత్రి మును బూర్వపక్షము సేయుచు "దుఃఖా శ్లేషయితుం కథాః ప్రతివచో లబ్ధుం చ దుఃఖం తతః । లబ్ధేఽపి ప్రచురే కథాన్వితి కరే విస్రంభణం దుష్కరం । విస్రంభేఽపి తతః స్వభావసదృశీ దుఃఖా విధాతుం రతిః । సమ్యక్ప్రస్తర తేఽపి సేయుః తి రక్ష్యా వా నై చవా." అని గణికాకృతకరాగదౌర్బల్యమును వర్ణించెను. ఒక శాక్యపరివ్రాజక గూఢవైశికవ్యాపారఁ జూచి విటుఁడు సంభాషింప నది పట్టుదార్థబహిష్కృతసంభాషణము గన వైశేషిక మతమున నిషిద్ధ మని యతని నిరోధింప, "ద్రవ్యం తే బహురాయతాక్షి దయితా రూపాదయస్తే గుణాః । సామాన్యం తవ యౌవనం, యువజనః సంస్తౌతి కర్మాణి తే । త్వయ్యార్యే సమవాయమిచ్ఛతి జనో యస్మాద్విశేషోఽస్తి తే । యోగస్తే లయకైర్మనోఽక్షిప్తై ర్గోష్ఠీపశ్యాస్వాజ్ఞ్యానాత్." అని తూలనాడె. మఱియొకచో వేశ్యాజనలోభముచే నిర్ధనుఁడై యేకశాటీమాత్రపరిచ్ఛదుఁడై దివ్యమునఁ శాపహతునివలె నున్న యొకని యవస్థానిర్వేదమున కనుతాపము నొంది వైశికుఁడు "శాంతిం యాతి శనైర్మహావధిబలాదాశీవిషాకారం విషం । శక్యో మోచయితుం మదోత్కటకరాదాత్మా గజేంద్రాద్వనే । గ్రాహస్యాపి ముఖాన్మహార్ణవజలే మోక్షః కదాచిద్భవేత్ ; వేశస్త్రీబడబానలాన్తరగతో నైవోత్థితో దృశ్యతే." అను నిర్వేదకరమగు వాక్యముల విషాదమును సూచించి గణిక లెల్లరు తమ కల్లుల ముందు త్రోచి విత్తార్జన మనురాగకైతవమున సంపాదింతు రను వర్తమును దెల్పుచు, "యథా నరేంద్రాః కుటిలస్వభావాః స్వయంకృతం మంత్రిషు పాతయంతి । తథైవ వేశ్యాః శఠధూర్తభావాః స్వదుష్కృతం మాతృషు పాతయంతి." అని రాజవేశ్యల సామ్యము లక్షించెను. ఇందుఁ బాటలిపుత్రవైశికప్రశంస ప్రశస్తమయ్యె. వరరుచి సర్వజ్ఞుఁ డనియుఁ గంఠాభరణాదికావ్యములును సప్తాధ్యాయి యను నలంకారశాస్త్రమును రచించినట్లు తెలియుచున్నది కాని యవి మాకు లభించినవి కావు. సప్తాధ్యాయిలో

గొన్ని పాదములకు వ్యాఖ్యానము తంజావూరి పుస్తకశాలలోఁ గలదు. ఈ సర్వజ్ఞుఁడు మాతంగకన్యను బరిణయమయినట్లును గేరళ జేశముసఁ బదిరెండు జాతులలో సంతానమును వెలయించినట్లును ఐతిహ్యము గలదు. ఎంత నిశ్చయమో కాని భోజుఁ డొకానొక నాటకము లోని దని "భూమౌ శైర్యచ్చ్వపచీకృతో వరరుచిః సర్వజ్ఞకల్పోఽపి సన్ । జీవన్నేవ పిశాచతాంచ గమితో భర్తృహర్యదభ్యర్చ్య ధీః । ఛందోగోయమితి ప్రభాకరగురుర్దేశాచ్చ నిర్వాసితో । యద్వృత్తాంత విజృంభితేన మహతా తత్సర్వమభ్యీకృతం." అని యుదాహరించుట మాఁడఁగా వరరుచి మాలలలోఁ గలిపి రని తేలుచున్నది. భర్తృవు బాణుని శిష్యుఁ డనియు నవంతిరాజమంత్రి యనియుఁ గొందఱు చెప్పుచున్నారు. (అవంతిః కావ్యమానర్చ భర్తృకాముఖరశేఖరః.)

## IX పాదతాడితకము

ఇది శ్యామిలకమహాకవిచే రచియింపఁబడిన భాణము. దీనిలోని పద్యములు వల్లభదేవుని సుభాషితావళిలోను క్షేమేంద్రుని యౌచిత్య విచారచర్చాసువృత్తతిలకములలో నుదాహరింపఁబడియున్నవి. ఇతని కవిత క్రీ. శ. 6-7 శతాబ్దులకంటెఁ బూర్వపు రీతి గల దని తోఁచు చున్నది. సుమారు క్రీ. శ. 960 లో నుండిన వ్యక్తివివేకకారుఁడు మహిమభట్టు తాను శ్యామలమహాకవి శిష్యుఁడ నని వ్రాసికొనియు న్నాఁడు. ఎట్లయిన నితఁడు క్రీ. శ. 950 కంటెను బూర్వుఁ డనుట సిద్ధము. ఈ భాణము చాలఁ బెద్దది. దీనిలో విష్ణునాగుఁ డను రాజశాసనకరుఁడు విద్వాంసుఁడును బ్రాహ్మణుఁడునై యుండి సౌరాష్ట్ర దేశమున సార్వభౌమనరేంద్రపురమున వేశ్య యింట రాత్రి వెల్లించి వేకువఁ బ్రణయకోపవిశేషముచేఁ గాఁబోలు దానిచేఁ బాద తాడితుఁడై వృషలీపాదఘాతమునకుఁ బ్రాయశ్చిత్తము వెదకుచు బ్రహ్మసభకు రాఁగా వారు సమస్తస్మృతులు తిరుగవైచి చూచి యెందును దానికిఁ బ్రాయశ్చిత్తము విధింపఁబడలే దని చెప్ప నతఁడు శోకించి యగతికుఁడై మొఱ్ఱో యనుచుండ నా సభలో నొకఁ డీ దోషము శృంగారరసానుభవమున నగుటఁ గావున దీని ప్రాయశ్చిత్త విధానము విటసభలోఁ గాని తెల్లము గా దనియె. అంత నతఁ డంగీకరింప విటసభలో నపరాహ్ణమున విటు లొకొక్కరు ప్రాయశ్చిత్త విశేషముల యథోచితముగా వివరించి యతని సంతుష్టుం జేసి పంపుటయే దీనిలోని కథ. విటులఁ బిలువఁ బోవువాఁడే దీనిలోని ముఖ్య పాత్రము. విటసభలో నానాదేశపు విటులు గూడి తమతమ చిత్ర ప్రాయశ్చిత్తవిధానము దెలుపుట సరసముగా నుండకతక్కదు. దీని లోని కొన్ని పద్యము లుదాహరించెదము: "ఇద మిహ పదం మా గాదేవం భవత్విదమన్యథా । కృతమిహ మయం గ్రంథే నార్థో మహాపవాదితః । ఇతి మనసి యః కావ్యారంభే కవేర్భవతి శ్రమః । నయనజలో రోమోద్భేదః సతాం తమపోహతి." "లలాటేవిన్యస్య తజసదృశం చందనరసం । మృణాలైః క్రీడంతీ కువలయపలాశైః సపత్రైః । సలీలం భ్రూక్షేపై రనుగతసుఖప్రాప్తి కకథా । విరక్తా రక్తా శిరసి రుజమాఖ్యాతి గణికా." ఈ మహాకవి పద్యములే లక్షణ గ్రంథములలోనుండి యుదాహరించెదము: "సోత్కంఠైరివ గచ్ఛతితి కనుశైరీమలద్భిర్గాలోకితః । ప్రచ్ఛాద్యైరధిరుహ్య వేశ్మశిఖరాణ్యుత్పార్యమాణాతపః । నైః స్పృష్ట్వా చిరమున్ముఖీషు కిరణైరుద్యానశాఖాస్వసౌ । యాత్యస్తం వలభీకపోతసయనై రాక్షిప్తరాగో రవిః. కామస్తపస్విషు జయత్యధికారకామో । విశ్వస్య విత్తవిభురింద్రియ వాజ్యధీశః । భూతాని బిభ్రతి మహాంత్యపి యస్య శిష్టిం । వ్యాస్పృష్టనాభిమణిరశ్మిభిరుత్తమాంగైః ఉత్క్షిప్తాలకవిమోక్షణాంతగళితం కోపాంచితాంతర్భ్రువాం । దష్టాధరోష్ఠమధీరదంతకిరణం ప్రోత్కంపయంత్యా ముఖం । శింజన్నూపురయా విరుద్ధ విగళద్రక్తాంశుకం పాణినా । మూర్ధన్యస్య సనూపుర స్సమదయా పాదో౽ర్పితః కాంతయా."

## X పద్మప్రాభృతకము

ఇది శూద్రకకవి విరచిత మగు నేకాంక భాణము. ద్వ్యంక త్ర్యంక భాణముల మాతృగుప్తాచార్యకోహళులు వివరించియున్నారు. ఇం దుజ్జయినీపురవేశవాటి వర్ణింపఁబడియె. దీని కవిత్వము రమణీయమై హృదయంగమముగా నున్నది. శూద్రకుఁడు మహాకవి యనుట మృచ్ఛకటికముచేతనే కాక వామనాద్యాలంకారికు లెల్లరు విస్తారముగా వీని పద్యము లుదాహరించుటచేఁ దెల్లము. ఇందు విటుఁడు తన స్నేహితుని విరహావస్థ నిట్లు వర్ణించుచున్నాఁడు: "ఉన్నిద్రాధికతాంతతామ్రనయనః ప్రత్యూషచంద్రాననో । ధ్యానశ్యానతనుర్విజృంభణపరః సంతప్తసర్వేంద్రియః । రమ్యైశ్చంద్రవసంతమాల్యరసనాగాంధర్వగంధాదిభిః । యైరేవ ప్రముఖాగతైః స్మరమతే తైరేవ సంతప్యతే." కందుకక్రీడఁ జేయు నొక గణికం జూచి "ప్రేంఖోలత్కుండలాయా బలవనిభృతం కందుకోన్మార్గితాయా । శ్చంగద్బాహుద్వయాగ్రాః ప్రవికచవిసృతోద్గీర్ణపుష్పాలకాయా । ఆవర్తోద్భ్రాంతవేశప్రణయవిలసితక్షుబ్ధకాంచీగుణాయా । మధ్యస్యావల్గమానస్తనభరనమిత స్యాస్య తే క్షేమమస్తు." అనియు, గ్రంథాంతమునఁ దన మిత్రుని ప్రియం గనుఁగొని దాని విరహావస్థ నవలోకించి తన మిత్రుని దైన్యస్థితికిఁగా నొకానొక యుపహారముం గోరి "ఈషల్లీలాభిదష్టం స్తనపటమృదితం పత్రలేఖానువిద్ధం । భిన్నం నిశ్వాసవాతైర్గ్లమయతిరసక్లిష్టకింజల్కవర్ణం । ప్రాతర్నిర్మాల్యభూతం సురతసముదయప్రాభృతం ప్రేషయాస్మై । పద్మం పద్మావగాఢే కరతలయుగళభ్రామణక్లిష్టనాళం." అని గాని భూగ్వరాత్రవిరహాక్లిష్ట నగు పద్మమును గ్రహించి మిత్రుని కర్పించి ప్రాణముల నిలుపును.

## మఱికొన్ని భాణములు

వీని నామములును గర్తల పేళ్లను గానరానందున నించుమించుగాఁ బూర్ణము లగు పెక్కు భాణములలో నొక్కదానిఁ గూర్చి మాత్ర మించుక తెలిపెదము. ఇందుఁ గుసుమపురవేశమే వర్ణింపఁబడినది. ఒక విటుఁడు వీథులలోఁ దిరిగి వేశము సొచ్చి యొక

ధూర్తునితో ననురాగశాస్త్రసిద్ధాంతమును జర్చించును. దత్తకుఁ డను కేరళదేశరతిశాస్త్రజ్ఞుఁడు పాటలిపుత్రవేశ్యలకుఁగాఁ గామశాస్త్రమున వైశికప్రకరణమును సూత్రరూపముగా నిర్మించియుండె నని వాత్స్యాయనాదులు చెప్పుట గాక తత్సూత్రసారసంగ్రహము మనకు లభించుచున్నది. ఈ దత్తకమతముఁ బూర్వపక్షము సేయుచు సంవాదరూపమున స్వసిద్ధాంతము నెలకొల్పుచు విటుఁడు కుసుమపురమును వర్ణించుట దీనిలోని విశేషము. "కామోఽర్థనాశః పుంసాం." అను దత్తకసూత్ర మిందు వివరింపఁబడియె. దీనిలోని కవిత్వము కాళిదాసబాణభవభూతుల కవితాసారములు చేరి పరిపక్వమయిన పిదప నందుద్భూతమైన రసపాకగుళికయో యనునట్లు మువ్వురి గుణవిశేషము లేకీభవించియున్నవి. ఇతఁడా వారలకంటెఁ బ్రాచీనతరుఁ డేమో! వర్షావర్ణనమున "తే దగ్ధాః ప్రవసంతి యే సుమదనా నాయాంతి వా ప్రోషితాః। ముగ్ధాస్తేఽనునయంతి యే న కుపితాః కుప్యంతి వాత్స్యాయతం। ధన్యాస్తే ఖలు యే ప్రియావశగతా యేషాం ప్రియాయా వశే। కాలః కామయతీవ మేఘపటలైరేవం జగన్మోహనమ్." అనియు, ఒక తండ్రి, క్రింది కుమారుఁడు వేశమున నుండి రాఁగా విటుఁడు వాఁడు తన తండ్రి మూర్ఖత్వమును నిర్బంధముల వర్ణించుచు "పతా నామ ఖలు సయోవనస్య పురుషస్య మూర్తిమాన్ శిరోరోగః." అనియుఁ "బిలఁ గలవానికిఁ బరస్పరామగ్నవికర్షితపణరాగంబును సాధిక్షేపవచనాలంకృతంబును జేజస్విపురుషనికషోపలంబు నగు ద్యూతంబు దర్శింపనైన నలవి గాదు; సముపచిత్రోత్పలఖండకంబును సహకారతైలోద్గతచంద్రికంబును గామినీనిశ్వాసవిక్షోభితలతాంగంబును బ్రవృత్తబర్హి(?)కాకారంబును నగువారుణీచమకంబుల వాసనయేని చూచుటకును ద్విధాభూతగోష్ఠీజనంబును వయస్యాస్థానోపవిష్టగణికాజనంబును గామినీసాన్నిధ్యంబునం జేసి యాలోచింపక పణంబుల నొడ్డువారిం గలదియు నగు విటసభలోఁ బ్రాశ్నికుల(?) నడపించుటకును మొదలుగా నలవి గాదు; ఇప్పుడు నాకు గండ్రగొడ్డలిం గొని జమదగ్ని కుమారుఁ డగు రాముఁడు క్షత్రియవధోద్యమమునకుఁ డొచ్చినట్లె లోక మపైతృకము సేయ మనస్సు పుట్టుచున్నది......ఈ వృద్ధులు సామాన్యముగా నింతయేని యెఱుఁగరు. వికచకమలాంతర్గతసురభియు - నమృతరససదృశాస్వాదము నగు వేశ్యాముఖరసము చచ్చిన పురుషుని నైతము సంజీవింపఁజేయు" నని చెప్పుచు "కాంచీతూర్యముసక్తపీనజఘనం విస్రంభదష్టాధరం। శ్వాసోత్కంపితవర్తితస్తనతటం భ్రూభేదజిహ్మేక్షణం। సీత్కారానువిషక్తరోమపులకం కాలేన కోపాంచితం। వేశ్యానాం కి ఇహాస్తి భో మదవశాద్బాహ్యారసం విస్మరేత్." అని చెప్పుచు నతనికిఁ దండ్రి మూర్ఖుఁడై వివాహము సేసిన కష్టదశ వినుటకంటె వేశ్యామహాపథమున నిలిచి గొంతెత్తి యేడువవచ్చు ననియు, "జాత్యంధాం సురతేషు దీనవదనామంతర్ముఖాభాషిణీం। హ్రష్టస్యాపి జనస్య శోకజననీం లజ్జాపటేనావృతాం। నిర్వ్యాజం స్వయమక్ష్య దృష్టజఘనాం స్త్రీరూపబద్ధాం పశుం। కస్త్వవ్యం ఖలు నైవ భా కులవధూకారాం ప్రవేష్టుం మనః." అని 'కులవధూమార్గమును' దూషించుచు గోత్రగ్రహణపాదతాడితాదివిలాసక్రీడల సముద్దేశమును నిరూపించుచు, వేశ్యాంగణములలోనే జరాభారమును బొంది గొనుఁ గాను "గిసగాకో గతేయుపాగానా న కుటో నాహః పరీష్య స్థితాః। దూరాదేవ సమాత్యకాః పరిహృతాః పద్యాః సపత్నా ఇవ। మన్యుర్నాస్తి విమానితస్య న పునస్సంప్రార్థితస్యాదరో। వేశేచాస్మి జరాంగతో న చ కృతః స్వల్పోఽపి మిథ్యాప్రయః." అని చెప్పుచు స్వర్గసుఖముల నిస్సార మని నిందించుచు "ఈ లేపస్వి లోకము పిపీలికాధర్మ మనుసరించి యన్యోన్యానుచరితమునఁ బ్రాణత్యాగహేతువులచేఁ దామె పరీక్షింపక స్వర్గము స్వర్గ మని మృగతృష్ణికాసదృశ మగు నొకానొక యసద్వాదమున నెలకొల్పఁబడిన దానిఁ గూర్చి హృదయము నర్పించి మరుత్ప్రపాతాగ్నిప్రవేశనాదులచేతను ఘోరజపహోమవ్రతనియమవేషములచేతను స్వర్గ మభికాంక్షింతురు, పరమార్థముఁ బరీక్షింపనొల్లరు; స్వర్గమున మహాప్రమాదములు సన్నిహితములై యుండు. పరస్పరవిరోధు లగు మనుష్యజాతుల కందు సుఖోత్పత్తి కలుగదు. నిత్యసాన్నిధ్యంబునం జేసి విరహావస్థ లేక ప్రీతి యెట్లు జనించును? సౌవర్ణమయము లగు నావాసశయ్యాభోగాలంకారములు స్త్రీలకు నిత్యప్రియములు గావు. ఘన గృహోపవనములఁ బిల్లలవలెఁ బెంచి పూచిన బాలవృక్షముల కుసుమరసముగాయములచే నామోదితము లగు యువతి కేశహస్తము లుపభోగరమ్యము లగును గాని సౌవర్ణాలంకారములు నీరసములు కావా? వసిష్ఠాగస్త్యప్రభృతు లగు మహర్షులకుఁ బరిచర్యలచే నామోదముఁ గల్పింపఁజాలిన యచ్చరల విస్రంభము సంపాదింప మనుష్యుల కెట్లు సాధ్య మగు?" అని మొదలుగఁ జర్చించి నిశాగమమునకు నుత్కంఠతో నిరీక్షించుచున్న సతీలోకమును వర్ణింపఁగోరి సంధ్యాకాలసూచన మిటు చేసి నిష్క్రమించును. "బధ్వా మానిని మేఖలాం ప్రశిథిలాం పీత్వాసకృద్వారుణీం। కృత్వా కాంచికమగ్రహాప్రణయినః పుష్పోత్కటాన్ మూర్ధజాన్। హస్తాలంబితమేఖలాభిగసకృత్ స్త్రీభిః కిలాపాహతః। హైమః కూర్మ ఇవావసీదతి శనైః సంక్షిప్తసాగో రవిః."

భాణములు శృంగారరసప్రధానము లని విద్వాంసులు చెప్పనొల్లరు. వానిలో దేశాంతర కాలాంతర సాంఘికాచారములు వర్ణింపఁబడియున్నందున దేశచరిత్రకారుల కవి ముఖ్యములే కాఁబోలు.

ఇంకను పెక్కు నాటకములు మాకు దృష్టిగోచరము లైనను వానిఁ జదువ నవకాశము లేమిం జేసి తద్గుణదోషముల నెత్తి చూప వీ లైనది కాదు. చంద్రికాజనమేజయము, చంద్రికాకలాపీడము, కలావతీకామరూపము, శర్మిష్ఠాయయాతము, అభిరామచిత్రలేఖయము, రఘువీరచరితము, భీమపరాక్రమము, త్రైవిక్రమము, పార్థపరాక్రమము, యోగానందప్రహసనము, జాంబవతీకళ్యాణము మొదలగునవి నాటి కెక్కుడుగాఁ గలవు. పై చెప్పిన్న భాణములు కాళిదాసాదికవులకంటెఁ బ్రాచీనము లని కొందఱు తలఁచుచున్నారు. "వరరుచిరీశ్వరదత్తః శ్యామిలకః శూద్రకశ్చ చత్వారః। ఏతే భాణాన్ బభణుః కా శక్తిః కాళిదాసస్య." యన్న శ్లోకము శూద్రకనాటకము తుది లేఖకుఁడు వ్రాసికొనియె. వానిలో నట్టిసారస్య మున్న దనుటయు సాహసము కాదు.

దేశాటనము సేయుచు మార్గమధ్యమునఁ బూర్ణసామగ్రి లేక యథాశక్తి నతివేగముగాఁ గూర్చిన నై వ్యాసము నీరసముగా నుండక తప్పదు. సహృదయులు మమ్ము క్షమింతురుగాక యని యింతట విరమించుచున్నాము.

RAJAH OF VENKATAGIRI



వేంకటగిరిరాజా గారు

RAJAH OF TELAPROLL



తెలప్రోలు రాజా గారు

PRINCE DORAI RAJAH OF PUDUKOTTAH



దొరైరాజా గారు, పుదుకోట

DIWAN BAHADUR P RAMARAYANINGAR



దివాన్ బహద్దరు పానుగంటి రామారాయనింగారు

# బ్రాహ్మణేతరోద్యమము — జాతీయత

ఎడవల్లి కనకదుర్గయ్య నాయుడు గారు

## కాలస్థితి

కాలము మారినది. ప్రపంచమునందు గొప్ప మార్పులు కొలఁది కాలములో తలఁపని తలంపుగా కలుగుచున్నవి. యూరపు ఖండమునందలి చిన్న దేశములను నాశనము చేసి పెద్ద దేశములను చీకాకుపఱచుచున్న యూరోపామహాసంగ్రామము ప్రపంచములో ఈనడుమ సంభవించిన సంభవించుచున్న ముందు సంభవింపనున్న మార్పుల కెల్ల మార్గదర్శి యని చెప్పక తప్పదు. పెద్ద రాష్ట్రములవారు చిన్న రాష్ట్రములవారి స్వాతంత్ర్యమును తమ కిష్ట మయినప్పు డెల్ల భంగపఱచుటకు తలపడిరి. ప్రాణములు గోల్పోయినను రాష్ట్రములు నాశన మయినను చిన్న రాష్ట్రములవారు తమ స్వాతంత్ర్యమును గోల్పోవుట కిష్టపడ రయిరి. బెల్జియము మొదలగు చిన్న రాజ్యముల స్వాతంత్ర్యమును గాపాడుటకు కంకణము కట్టుకొని మన యాంగ్లేయ సామ్రాజ్యము ఈ మహాసంగ్రామములో పాల్గొనవలసి వచ్చెను. ప్రపంచమందు ప్రజాభిప్రాయము మారి ప్రజాస్వాతంత్ర్య బీజము ప్రతిమానవుని హృదయమందును అంకురించినది. ఎన్నియో తరములనుండి నిరంకుశముగా పాలింపఁబడుచుండి నాగరిక ప్రపంచమునకు లజ్జాకరముగా నుండిన రషియా దేశము నేఁడు స్వాతంత్ర్యము బడసినది. ప్రష్యా దేశపు సామ్రాజ్యాగ్రేసరులచే పాలింపఁబడు జర్మను ప్రజలు కూడ స్వాతంత్ర్యాభిలాషు లయినట్లు మనము పత్రికాముఖమున చదువుచున్నాము. ఆంగ్లేయసామ్రాజ్యమంత్రిపుంగవుఁడగు లాయడు జార్జి గారు నుడివినట్లు కాలపరిణామ మతిత్వరితముగా కలుగుచున్నది. శతాబ్దిలో రావలసిన మార్పు లిప్పుడే వచ్చుచున్నవి. ఈ మహాసంగ్రామమందు మన చక్రవర్తి గారి జయము గోరుచు, యుద్ధానంతరము బ్రిటిషుసామ్రాజ్యమునకు లోఁబడి హిందూదేశమునకు స్వరాజ్య మిమ్మని ఈ దేశప్రజలు తీవ్రముగా నాందోళనము సల్పుచున్నారు. ఈనడుమ బిసెంటు ప్రభృతులకు నిర్బంధావాసశిక్ష విధించినప్పుడు ఈ దేశములో కలిగిన ప్రబలాందోళనమే స్వరాజ్యము గోరు ప్రజాభిప్రాయమునకు సాక్షి.

ఇట్టి తఱి, వ్యక్తిస్వాతంత్ర్యాభిలాష మానవుల హృదయక్షేత్రగత మయినపుడు, బ్రాహ్మణుల మత సాంఘిక రాజకీయ శాసనములకు లోఁబడి ఎన్నియో తరములనుండి యుక్తి లేక కడు బాధల నొందుచు నిరాశాపరు లయిన బ్రాహ్మణేతరులు గూడ వ్యక్తి స్వాతంత్ర్యమును పడయఁగోరుట వింత గాదు. మన రాజధాని యందలి 420 లక్షల ప్రజలలో 15 లక్షలు బ్రాహ్మణులు, మిగిలిన వారు బ్రాహ్మణేతరులు. ప్రజాబాహుళ్యము గల బ్రాహ్మణేతర సంఘములో ఈ యుద్యమ ముద్భవించి ప్రసరించుటకు ప్రబల మయిన కారణము లుండితీఱవలెను. ఈ మహోద్యమము ఒకరిద్దఱిచే సృజింపఁబడి పోషింపఁబడుచున్న దని తలఁచుట గాని దానిని నిరసించుట గాని కేవలము తప్పు. ప్రపంచములో ఇదివఱకు పుట్టిన యుద్యమము లేవియు కారణములు లేక కలుగలేదు. రషియా ఫ్రాంసు దేశములలోని ప్రజాపరివర్తనములే యిందునకు నిదర్శనములు.

## కులభేదములు

హిందూమహాసంఘములో కులభేదము లెప్పు డే సందర్భములలో ఎవ రేర్పాటు గావించిరో తెలిసికొనుటకు విశ్వాసార్హ మయిన చరిత్ర లేదు. కులభేదములు తరతరములుగా వచ్చుచున్నవి. సంఘము ప్రథమమున నెట్లుండినను, కాలక్రమమున వృత్తులను జాతి శక్తిసామర్థ్యముల ననుసరించి నీతి భాగ్య మతాభిమానముల ననుసరించి తెగ లేర్పడుట సామాన్యవిషయము. యూరపు అమెరికా దేశములందు పైఁ జెప్పఁబడిన కారణములవలన నేర్పడిన తెగలు అనేకములు గలవు. అవి పుట్టుకవలన నేర్పడినవి కావు. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు బ్రహ్మయొక్క యవయవములలోనుండి జనించినా రని చెప్పఁబడు గాథ విశ్వాసార్హము గాదు. బ్రాహ్మణేతరులుగా జనించినవారు గుణకర్మములవలన బ్రాహ్మణు లయినట్లు పురాణనిదర్శనము లనేకములు గలవు. అవి నిజ మయిన యెడల, మొట్టమొదట మన దేశమందలి కులములు కూడ పుట్టుకులములు కా వని వ్యక్తిప్రయత్నమువలన లభించిన వని స్పష్ట మగుచున్నది. అప్పుడు పాశ్చాత్యదేశములలోని తెగలకును మన దేశములోని కులములకును భేద ముండదు. ప్రథమమున గుణకర్మములవల్ల కులము లేర్పడుచు వచ్చి తరువాత పుట్టుకతోనే కులభేదములు కలుగ మొదలిడినట్లు కనఁబడుచున్నది. ఇప్పుడు మన దేశములో కులములు పుట్టుకవలన కలుగుచున్నవి. సంఘములో కులములు వృత్తిభేదములవలన నేర్పడినట్లు కులనామములవలననే స్పష్టపడుచున్నది. మతగురువులు బ్రాహ్మణులు, భుజబలము గలిగి ప్రజలను రక్షించువారు క్షత్రియులు, వ్యవసాయకులు వైశ్యులు, తదితరులు శూద్రులుగా పరిగణింపఁబడినట్లు కన్పించుచున్నది. అన్ని వృత్తులును సంఘమున కత్యావశ్యకములు. ఎవరు లేకపోయినను సంఘమునకు నష్టము వాటిల్లును. కులములలో ఒకటి మరియొకదానికంటె హెచ్చు, ఇంకొకటి మరియొకటికంటె తగ్గు, కొన్ని యన్నిటికంటె హెచ్చు, కొన్ని అన్నిటికంటె తగ్గు మొదలగు భేదములును, పుట్టు

కతో కులభేదములు కలుగుచుండుటయు ఇతరదేశములందలి సంఘములకును మన దేశమందలి కులములకును గల భేదము. విద్యావంతుఁ డయినను మేధాసంపన్నుఁ డయినను నీతివంతుఁ డయినను బ్రాహ్మణేతర సంతతివాఁడు బిచ్చకవాఁడే. శాస్త్రజ్ఞానము సున్న యయినను విద్య నేర్చుకొనకపోయినను నడవడి చెడ్డ దయినను బ్రాహ్మణ సంతతివాఁ డయినంత మాత్రమున అతఁ డందఱికంటె గొప్పవాఁ డును పూజార్హుఁడును అగుచున్నాఁడు. ఎన్ని దుష్కర్మములు చేసినను బ్రాహ్మణత్వము చెడదు. బ్రాహ్మణేతరుల పాలిటికి ప్రతి కొఱగాని బ్రాహ్మణబాలుఁడును దైవము. మనుధర్మశాస్త్రము కులభేదములను క్రోడీకరించి సంఘమునకు బ్రాహ్మణాగ్రతను శాశ్వతముగా నుండునట్లు స్థిరపాటు గావించిన శాసనము. మనుధర్మ శాస్త్రము బ్రాహ్మణప్రోక్త మని వేఱుగ చెప్ప నక్కఱ లేదు.

ప్రథమదశయందు ప్రతిసంఘములోను మానవులకు ప్రపంచము దయ్యములతోను ప్రపంచముతో సంబంధము లేని జీవరాసుల తోను నిండియున్న దనియు, చెట్లకు గుట్టలకు నదులకు ప్రతివస్తువునకు మానవులకు మంచి గాని చెఱుపు గాని చేయఁగల స్వభావసిద్ధ మయిన శక్తికంటె హెచ్చు శక్తి కల దనియు నొక నమ్మిక యుండెను. సంఘములోని గడుసువారు కొందఱు మనుజుల కను పెట్టి ప్రపంచమందలి దయ్యములు మొదలగువాని యాపదలనుండి ప్రజలను కాపాడఁగల శక్తి తమకు కల దని ప్రజలను నమ్మించి యొక్కొక పలుకుబడి సంపాదించి తామే క్రమముగా మతగురువు లయిరి. సంఘాభివృద్ధి పొందిన కొలఁదిని వీరే ప్రముఖు లయి పలుకుబడి హెచ్చఁగాఁగను. ప్రథమమున దయ్యముల బారినుండి మానవకోటిని కాపాడఁగలుగు శక్తి గలిగినట్లు నటించిన మానవులు క్రమక్రమముగా సంఘములో మతగురువు లయి తరువాత హిందూరాజులయొద్ద పురోహితులుగాను మంత్రులుగాను చేరిరి.

రాజులును గురువులు చెప్పినట్లు రాజ్యము చేసినఁ గాని రాజ్యములు నిలువ వని నమ్మి, వారు చెప్పిన ధర్మముల ననుసరించి వారి యిష్టము వచ్చినట్లు రాజ్యము చేలుచుండిరి. నిపుణతాపేక్ష హెచ్చినవా రయి అవివేకులకు మతగురువులుగా నుండినవారు సంఘ మును విభజన చేసి సంఘమున కగ్రత్వము వహించి రాజులవలన కులభేదముల ననుసరించి ప్రజాపరిపాలన గావింపఁజేసిరి. అప్పుడు వ్రాయఁబడి శాసనరూపముగా పరిణమిల్లినదే మనుధర్మశాస్త్రము. వీరు చేసిన చర్యలలో ఆశ్చర్యపడవలసిన యంశము లేదు. నిరంకుశ ముగా పాలింపఁదలఁచుకొన్న రాజు గాని మతగురువు గాని తన పలుకుబడిలోని సంఘముల నెంత విభజన చేసిన నంత స్వాగ్రస్థాన మంత సురక్షితముగా నుండును.

ఏ దేశములోఁ గాని సంఘాభివృద్ధి బుద్ధికుశలత గల కొలఁది మంది సంస్కర్తల ప్రయత్నములమీఁద నాధారపడియుండు, వారి కోరికల ననుసరించి సంఘములో మార్పులు జరగుచుండును. సంఘ ములో విశేషప్రజ్ఞయు బుద్ధిబలమును గల కొందఱివలననే సంఘా శయములు ప్రసరింపఁబడుటయు మిగిలినవారు వాని నామోదించు టయు కూడ సామాన్యవిషయము లే. సంఘముయొక్క పురోవృద్ధి గాని సంఘపురోభివృద్ధికి ప్రత్యేకమార్గములు గాని సంఘములోని బుద్ధిబలము గల ప్రజ్ఞావంతులు సంఘాభివృద్ధికి సూచించిన జీవితాశయ ములమీఁదనే యాధారపడియుండును. వీని ననుసరించియే జాతీ యాభివృద్ధి కలుగుట గాని కలుగకపోవుట గాని సంభవించు చుండును.

గడచిన 2,000 సంవత్సరములలో హిందూదేశములోని యన్ని భాగములయందు బ్రాహ్మణులు ఇతరులకంటె బుద్ధికుశలత గలవారై ప్రసిద్ధగ్రంథములను శాస్త్రములను రచియించిరి. పోరాడఁగల క్షత్రియులు గ్రామముల బయట కాఁపురము చేయు పంచము లును లెక్కకొనక బ్రాహ్మణు లేర్పఱచిన జీవితాశయముల నెదు రాడక యామోదించిరి. ఈ కాలములో బ్రాహ్మణులు కేవ లము సంఘమునకు హానిప్రదముగ నుండి రని కాని సంఘాభి వృద్ధికి పాటుపడ లే దని కాని చెప్పుట సరి కాదు. బ్రాహ్మ ణులు కూడ మనుష్యమాత్రు లగుటచే స్వలాభపరు లగుట సహ జము. వారు దక్షిణహిందూదేశములోని భాషల నభివృద్ధి చేసిరి. ప్రపంచములో ప్రఖ్యాతి గాంచిన శాస్త్రముల నెన్నిటినో రచించి శాస్త్రవిజ్ఞానమును ప్రసరింపఁజేసిరి. కాని, వారి బోధనలయొక్క ఫలితమును వారి బుద్ధిబలముచే వ్రాయఁబడిన వ్రాఁతలయొక్క యుద్దేశమును కులాచారవిభాగమును మన దేశములో ప్రతిష్ఠింపఁజేసి దానిని స్థిరస్థాయిగా చేయుటయే యని చెప్పక తప్పదు.

హిందూదేశములోని యన్ని భాగములయందును బ్రాహ్మ ణుల సాంఘికబలము పలుకుబడి ఒకే విధముగా లేవు. కేవలము బుద్ధిబలము మతాచారము ప్రజల కవసరములు కాని కొన్ని దేశ ములలో, బ్రాహ్మణేతరుల సంఖ్యాబలము హెచ్చయి బ్రాహ్మ ణులు తమ సాంఘికనిరంకుశాధికారము సాగకపోఁగా సంఘ ములో నామమాత్రావశిష్టులుగ నున్నారు. గడచిన 1,000 సంవత్సర ములలో మహమ్మదీయుల దాడులవలన రణరంగ మయిన పంజాబు దేశములో బాహుబలము గలవారి యాధిపత్యమే హెచ్చి బ్రాహ్మ ణాధికారము తగ్గి యిప్పుడు బ్రాహ్మణులు గొప్పవారి గృహము లలో వంట చేయుటకు మాత్రము పనికివచ్చుచున్నారు. వంగాళ దేశములో బ్రాహ్మణులును కాయస్థులును సమాన మైన పలుకు బడి గలవారై సాంఘికజీవనములో విశేష మైన హెచ్చుతక్కు వలు లేక మెలఁగుచున్నారు. మహమ్మదీయుల ప్రభుత్వము క్రింద కొంత కాల ముండినను మహారాష్ట్రసామ్రాజ్యమునకు పుట్టిని ల్లయిన బొంబాయి రాజధానిలో ప్రభువు లనఁబడు బ్రాహ్మణే తరులు క్రమక్రమముగా పైకి వచ్చుచుండినను బ్రాహ్మణు లున్నతదశయం దున్నారు. ఆంధ్రదేశమును బ్రాహ్మణుల పలుకు బడిలోని రాజు లేలుటవలన బ్రాహ్మణనిరంకుశాధికార మొకప్పుడు ప్రబలినను, ఇప్పుడు రావు బహదూరు కందుకూరి వీరేశలింగము పంతులవారి వ్రాఁతలును బ్రాహ్మణయువకుల సంఘసంస్కరణాభి లాషయు విదేశయాత్రోత్సాహమును కులాచారబలమును తగ్గించెను.

దక్షిణహిందూదేశములో, ముఖ్యముగా మహమ్మదీయుల దాడులు లేని ప్రదేశములలో బ్రాహ్మణనిరంకుశాధికారము ఇప్పటికిని ప్రబలుచున్నది. కులాచారముల పేర ముప్పు వాటిల్లునో యని వేయి కండ్లు కను పెట్టియుండి, సంఘసంస్కర్తల కెన్నియో బాధలు పెట్టుదురు. సదుద్దేశములతో సంస్కరణము పూనినవారిని నిరుత్సాహపఱచెదరు. వర్ణాశ్రమధర్మసభ యని పేరు పెట్టుకొని పూర్వాచారములను సంరక్షించి నిలుప బ్రయత్నించుచున్నారు. వారి చేతిలోని యస్త్రము "వెలి". దానిని యథేచ్ఛగా సంఘసంస్కర్తలమీద ప్రయోగించెదరు. నిజ మయిన నీచులను దుర్మార్గులను సంఘములోనుండి బహిష్కరింపరు. బ్రాహ్మణేతరులు మతసాంఘికవిషయములలో బ్రాహ్మణుల చేతిలోని తోలుబొమ్మ లని చెప్పిన నతిశయోక్తి కాదు.

కులభేదములు శ్రేష్ఠపాటి నాటుకొనిపోయి జాతివైషమ్యములు హెచ్చినవి. పరస్పరవిశ్వాసము పరస్పరస్నేహము క్రమముగా నాశన మవుచున్నవి. ఈ కులపిశాచమహిమ వలననే విద్యావంతు లయిన బ్రాహ్మణేతరులు కూడ తమ సంఘములయెడ సానుభూతి చూపక, విద్యాగంధము లేని తమ సంఘములను వదలి బ్రాపంచికవ్యవహారములందు బ్రాహ్మణులలో చేరుచున్నారు. తా మవలంబించు వృత్తులలోని బ్రాహ్మణులతో ఎక్కువ సఖ్యము కలిగి వారితో నైక్యమయి తమ సంఘములవారిని బ్రాహ్మణులవలెనె నిర్లక్ష్యముగా నిరసనభావముతో చూచుచున్నారు. బ్రాహ్మణేతర సంఘములలో కూడ భేదములను పోగొట్టుకొని ఐక్యమయి జాతీయాభ్యుదయమునకు తోడ్పడుటకు బదులుగా భేదములను కల్పించుకొని హెచ్చించుకొని క్రింది సంఘములవారిని పై సంఘములవారు సాంఘికజీవనములో విశేషబాధలు పెట్టుట కూడ ఈ కులాచారపిశాచమహిమవలననే. విద్యావంతు లయిన బ్రాహ్మణేతరులు బ్రాహ్మణులలో చేరుటవలన బ్రాహ్మణేతరసంఘములయొక్క బలము హెచ్చుటకు బదులుగా తగ్గుట సంభవించునేమో యని భయము కలుగుచున్నది.

## విద్య

బ్రాహ్మణేతరులు విద్యయందు బ్రాహ్మణులకంటె విశేషముగా వెనుకబడియున్న విషయము నిర్వివాదము. బ్రిటిషు ప్రభుత్వమునకు పూర్వము హిందూదేశమునందు ఎవరి వృత్తులలో వారు చిక్కుకొని సుఖముగా జీవనము చేయుచున్నందున బ్రాహ్మణేతరులకు ఉద్యోగాపేక్ష లేకపోయెను. వ్యవసాయమునకును చేతిపనులకును విద్యయొక్క యావశ్యకత లేకపోయెను. కడచిన 150 సంవత్సరములలో ప్రపంచమునందలి స్థితిగతులు మారినవి. చేతిపనులు నశించినవి. పరిశ్రమలు పొగయంత్రములు విద్యుచ్ఛక్తి వలన నడుపబడుచున్నవి. పరిశ్రమలలో విద్యావంతులు శాస్త్రవిజ్ఞానము చతురత గల పనివారు కావలసివచ్చినారు. పండిన వస్తువులు మన దేశమునుండి యితరదేశములకు ఎగుమతి చేయబడి మన దేశపు ప్రజలకు కావలసిన వస్త్రములు కాగితములు అద్దములు మొదలగు వస్తువులు ఇతర దేశములలో ఆయా దేశపు యంత్రములతో ఆయా దేశపు పనివాండ్రవల్ల తయారు చేయబడి మన దేశములోనికి దిగుమతి యగుచున్నవి. ఇదివఱకు ఆయా వృత్తులలో పని చేయుచున్న బ్రాహ్మణేతరులు వృత్తులు పోయి కూటికి లేక మలమల మాడుచున్నారు. విద్యావిహీను లయిన మన దేశపు పనివాండ్రు తమ వృత్తులు మానవలసివచ్చినందున ఇంకొక గతి లేక వ్యవసాయవృత్తిలో వ్యవసాయికుల కూలివాండ్రుగాను పనివాండ్రుగాను ప్రవేశించి పొట్టపోసికొనుచున్నారు. ఇందువల్ల దేశయార్థికస్థితి బాగుపడుట గాని బ్రాహ్మణేతరుల బుద్ధిబలము హెచ్చుట గాని బ్రాహ్మణేతరసంఘ మభివృద్ధి పొందుట గాని తటస్థింపదు.

బ్రిటిషు ప్రభుత్వమునాటినుండియు మన దేశములో బ్రాహ్మణబ్రాహ్మణేతరులకు విద్య నేర్చుకొనుటకు సమాన మయిన యవకాశములు కలిగినవి గాని మనకు వారు నేర్పుచున్న విద్య న్యాయవాదవృత్తికిని ప్రభుత్వోద్యోగములకును బడిపంతుల పనికిని తప్ప మఱియొక వృత్తికి పనికిరాదు. ఈ వృత్తులు మన దేశములోని యెన్ని కుటుంబములను పోషింపగలవు? సంఘమున కత్యావశ్యక మయిన వృత్తులలో చిక్కక బుద్ధిబలముచే ప్రజలను జయించియున్న బ్రాహ్మణులు సమయము కనుగొని పాశ్చాత్యవిద్య నభ్యసించి ప్రభుత్వమువారి యుద్యోగములలో చేరిరి. మన రాజధానిలో బ్రాహ్మణేతరులకంటె బ్రాహ్మణులు స్వల్పసంఖ్యాకు లయినను ప్రభుత్వోద్యోగములలో 31 రెట్లెక్కువగా నున్నారు. బ్రాహ్మణేతరు లన్ననో పాశ్చాత్యనాగరికతవలన తమ తమ వృత్తులు పోయి జీవనాధారములు లేక విద్య నభ్యసించుట కశక్తులయిరి. భూస్వాములు తప్ప మిగిలిన బ్రాహ్మణేతరులు పెక్కుమంది కడు బీదలు. నూటికి 8 గురు మాత్రము విద్య నేర్చినవారు. విద్యవలన సంపాదింపగల ప్రభుత్వోద్యోగములలో ఇదివఱకే బ్రాహ్మణులు నిండియున్నారు. ఉద్యోగజీవనములో విశేషముగా పలుకుబడి గలవారు బ్రాహ్మణులు. కులాభిమానము సహజ మవుటవలన బ్రాహ్మణులకు ఉద్యోగములు లభ్య మవుట సులభము, బ్రాహ్మణేతరులకు దుస్తరము.

## విద్యావిహీనతవలని నష్టములు

విద్యావిహీనతవలన బ్రాహ్మణేతర సంఘములకు కలుగుచున్న నష్టములు వ్రాసిన మొదలిడిన పెద్ద గ్రంథ మగును. ప్రభుత్వోద్యోగుల బాధ, బ్రాహ్మణసాంఘికనిరంకుశాధికారము ముఖ్య మయినవి. విద్యావిహీను లయిన రయితులను కరణములు ఇతరోద్యోగస్థులు పెట్టు బాధలు మనము కన్నులార చూచుచున్నారము. ప్రభుత్వమువారికి నిజముగా చెల్లింపవలసిన సిస్తుకంటె గ్రామోద్యోగస్థులు రయితులయొద్ద హెచ్చు వసూలు చేయుట కలదు. విద్య లేని రయితులయొద్ద పెక్కు నెపములు పెట్టి ఏదో విధముగ డబ్బు గడింతురు. రయితులకు ఏ విషయములో ఎవరికి మొఱ

గిడిన న్యాయము కలుగునో తెలియదు. ప్రస్తుతపు ప్రభుత్వపద్ధతి ననుసరించి న్యాయము పొందుట కూడ కడు దుస్తరము. బ్రాహ్మణేతరులు సాంఘికమతజీవనములో బ్రాహ్మణులు చెప్పినది దైవవాక్యముగా నమ్మి ప్రవర్తించుచున్నారు. మంచిచెడ్డలు తెలిసికొనుటకుఁ గాని సరియగు మార్గమున చరించుటకుఁ గాని యవకాశములు లేవు. అనావశ్యకముగా వ్యాజ్యములకు పోయి డబ్బంతయు పోఁగొట్టుకొని అనేక కుటుంబములు నాశన మవుచున్నవి. త్రాగుఁబోతుతనమువల్ల సంఘమునకు విశేషనష్టము వాటిల్లుచున్నది. స్థానికపరిపాలకసభలలో పెక్కుమంది బ్రాహ్మణేతరు లుండియు తమ విధ్యుక్తధర్మముల నెఱుఁగక తగు శ్రద్ధ తీసికొనక కొలఁదిమంది ననుసరించి ప్రవర్తించుచున్నారు. ఈ సభలలో జరుగుచున్న యంశములను గుర్తెఱిఁగిన బ్రాహ్మణేతరసభ్యులు నూటికి అయిదుగురు కూడ లేరని నా నమ్మకము. జాతీయాభ్యుదయమునకు తామేమి చేయవలెనో తెలిసికొనుట కవకాశములు లేనే లేవు.

## రాజకీయస్థితి

ఇదివఱ కున్న దుస్థితి చాలనట్లు, విద్యావంతులగు బ్రాహ్మణ బ్రాహ్మణేతరుల నడుమ వివాదములు ప్రారంభ మయినవి. ప్రభుత్వోద్యోగములు స్థానికపరిపాలనాసభ్యత్వము బ్రాహ్మణులు విశేషముగా సంపాదించి బ్రాహ్మణేతరసంఘములవారికి తగు నవకాశ మియ్యలే దని బ్రాహ్మణుల పలుకుబడి హెచ్చయిన దని భేదాభిప్రాయములు కలిగి బ్రాహ్మణేతరసంఘముల నభివృద్ధి చేయుటకుఁ గాను చెన్నపురిలోని కొందఱు దక్షిణహిందూదేశప్రజాసంఘ మను పేర నొక సంఘము నేర్పాటు చేసిరి. ఈ సంఘమువారును వారి యనుచరులును వారిచే ప్రచురింపఁబడు "జస్టిసు" "ద్రవిడన్" "ఆంధ్రప్రకాశిక" పత్రికలవారును దేశీయమహాజనసభవారు కోరిన రీతిగా హిందూదేశమున కిప్పుడే స్వరాజ్య మియ్యఁగూడ దని యాటంకములు చెప్పుచున్నారు. చాలమంది బ్రాహ్మణేతరులు ఈ సంఘాశయములతో నేకీభవింపక, బ్రాహ్మణేతరసంఘములకు ప్రత్యేకప్రాతినిధ్య మిమ్మని కోరుచు కాంగ్రెసు లీగు ప్రణాళిక నామోదించుచు 'మదరాసు రాజధానీ సంఘము'ను స్థాపించి తమ యాశయములను ప్రజలకు బోధించుచున్నారు.

## బ్రాహ్మణేతరనాయకుల కర్తవ్యము

ఒక యుద్యమమును ప్రారంభించుట సులభము గాని దానిని సర్వజనామోదిత మయిన మార్గమున నడపి జయము గాంచుట దుస్తరము. ప్రతి వ్యక్తికిని స్వాభిమానము సంఘాభిమానము సహజములు. బ్రాహ్మణులు సమయము లభ్య మయినప్పు డెల్ల, విద్య గాంచి యిప్పు డన్ని విషయములలో అగ్రస్థానము వహించి బ్రాహ్మణేతరుల సంఘాభివృద్ధికి మార్గదర్శకు లయిరి. వారియందు బ్రాహ్మణేతరులు అసూయ గాని ద్వేషము గాని వహించుట గొప్ప తప్పు. వారు కూడ మిగిలినవారివలె నుండినయెడల వీ రెవరిని చూచి నేర్చుకొని బాగుపడుదురు? బ్రాహ్మణ బ్రాహ్మణేతరులు ఒక దేశములో పుట్టి పెరిఁగినవారు, ఏకమతావలంబకులు; ప్రపంచములో నెన్నికెక్కిన శాస్త్రవిజ్ఞానమును వెదఁజల్లిన గురువుల సంతతివారు. మానవులకు నేలు కట్టిన, అది యొ సరియగు సమయ లభ్య మవునంతకు నూరకుండక యేర్పాటు కొఱకు యుద్ధము మొదలగు నెన్నియో చేష్టలు చేయును. అందువలన లాభము లేదు. శరీరబాధ కలుగును. విద్యావిహీను లయి అజ్ఞానాంధకారమున మునిఁగి మతసాంఘికరాజకీయ వ్యవహారములలో వ్యక్తిస్వాతంత్ర్యము గోల్పోయి నేఁడు మేల్కాంచిన బ్రాహ్మణేతరసోదరులు రోషపూరితు లవుట సహజమే గాని ప్రతిఫలము లేని క్రియలు చేయుటవలన వ్యక్తికిఁ గాని సంఘమునకుఁ గాని లాభము కలుగఁబోదు.

బ్రాహ్మణేతరసంఘముల ప్రస్తుతస్థితి పరికించి సంఘాభివృద్ధికి సాధనము లాలోచించి మత సాంఘిక రాజకీయ విషయములలో సంఘోద్ధరణము గావించి ఈ మహోద్యమమును జయప్రదము గావించు భారము నాయకులమీఁద నున్నది.

## జాతీయత

లెక్కకు మితి మీఱిన కులభేదములు గలిగి పరస్పరవైమనస్యములలో మునిఁగి భాగ్యవంతులు బీదవారిని విద్యావంతులు విద్యావిహీనులను నిరసనభావముతో చూచుచుండ, బీదవారు భాగ్యవంతులయందును సామాన్యులు పలుకుబడి గలవారియందును అసూయాగ్రస్తు లయియున్నారు. ఇట్టి వివిధభేదాభిప్రాయములును విరోధాశయములును గల మానవకోటియందు జాతీయభావ ముద్భవించి యెప్పటికైన దేశము బాగుపడఁగలదా యని సందేహింపవచ్చును. కాని, కుటుంబములోని యన్నదమ్ములు నానా వివాదము లున్నను ప్రతిదినము విరామము లేక పోరాడుచుండినను, తాము ఇతరగృహములవారితో వ్యవహరింపవలసినప్పుడు తా మందఱొకటే యనుకొందురు. అటులే గ్రామములలోను వారిలో వారి కెన్ని వివాదము లున్నను చోరులవలనను అంటువ్యాధులవలనను గాని మరియే కారణములవలనఁ గాని గ్రామమున జనసామాన్యమునకు కష్టము వాటిల్లినప్పుడును తాము కలిసి చేయు కార్యములవల్ల జనసామాన్యమునకు మేలు కలుగునప్పుడును గ్రామజనులు ఏకీభవించుటను కార్యసాఫల్యము గాంచుటను మనము చూచుచున్నారము. ఇటులె పెద్ద సంఘములలోను పట్టణములలోను దేశములలోను తాము చేయు కార్యముల వలన సర్వజనోపకారము కలుగు నని కాని తా మా కార్యము చేయకుండిన సర్వజనోపద్రవము సంభవించు నని కాని ప్రజలకు తెలిసినయెడల తప్పక వా రందఱు నైక్యమయి యుచితపు ధర్మములను నేర్చెదరు.

జాతీయసమ్మేళనమునకు ప్రయత్నములు జరుగుచునే యున్నవి. రావు బహాదూరు కందుకూరి వీరేశలింగము పంతులు గారు మొదలగువారు సంఘసంస్కరణముకొఱకు పాటుపడుచున్నారు. పరదేశములకు విద్యార్థులుగా వెళ్లుచున్న హిందూసోద

ములు సంఘసంస్కరణమునకు తోడ్పడుచున్నారు. విద్యావంతు లయిన బ్రాహ్మణబ్రాహ్మణేతరులలో కులాచారభేదములు క్రమముగా తగ్గుచున్నవి. సాంఘిక జీవనములోని స్వాతంత్ర్యమునకు బ్రాహ్మణేతరులకు బ్రాహ్మణు లెంత యుత్తరవాదులో క్రింది బ్రాహ్మణేతరసంఘములవారికి పయి బ్రాహ్మణేతరసంఘములవారు కూడ నంతే యుత్తరవాదులే. సంఘదురాచారము వ్రేళ్లతో పాదు కొనియున్నది. దాని నొకసారి నాశనము చేయుటకు బ్రాహ్మణులకుఁ గాని బ్రాహ్మణేతరులకుఁ గాని శక్యము కాదు. క్రమముగా జయింపవలెను. బ్రాహ్మణనిరంకుశాధికారమును వగచుచు బ్రాహ్మణేతరులు తమ క్రింది సంఘములవారిని బాధలు పెట్టుట యెట్టి న్యాయము? కుయ్యపట్టమునందలి వీరపల్లెలోని పంచముల మొఱ యాలకింపుఁడు! వారి బంధువుల శవములను బ్రాహ్మణేతరులు నివసించు వీథులగుండ తీసికొనిపోరాదఁట. బ్రాహ్మణేతరసంఘములవారు తమలోని భేదములను నాశనము చేసికొనవలెను. లేని యెడల ఈ యుద్యమము వ్యర్థ మగును.

ప్రజల రాజకీయాశయములలో భేదము లుండఁజాలవు. నిర్బంధ ప్రారంభోచితవిద్యను దేశములో ప్రవేశపెట్టినఁ గాని బ్రాహ్మణేతరులకు ముక్తి లేదు. ఆయుధశాసనము రద్దు చేసినఁ గాని క్షేమము లేదు. ఆర్థికస్వాతంత్ర్యము హిందువులకు కలవడినఁ గాని రయితుల స్థితి బాగుపడనేరదు. ఈ దేశములో వాణిజ్యమును పరిశ్రమలను పునరుద్ధరించినఁ గాని దేశముయొక్క పురోవృద్ధి సాధ్యము గాదు. స్వరాజ్యము భారతీయులకు కలవడినఁ గాని మన యాశయములు నెఱవేఱవు. బ్రాహ్మణు లయినను తదితరు లయినను దేశక్షేమము మన క్షేమము మన సంతతివారి క్షేమము కోరువా రందఱును స్వరాజ్యమును కోరక మానరు.

ఆంగ్లేయప్రభుత్వమువారు మనకు స్వరాజ్య మిచ్చిన నది బ్రాహ్మణరాజ్య మగు నను బెదరింపు సహేతుక మయినది కాదు. ఆంగ్లేయప్రభుత్వమువారి క్రింద బ్రాహ్మణోద్యోగియులు చేయు మంచిచెడుగులు ప్రభుత్వమువారికి చెందును గాని బ్రాహ్మణజాతికి చెందవు. స్వరాజ్యము సంప్రాప్త మయినయెడల ప్రజ లందఱు సుపరిపాలన కుత్తరవాదు లగుదురు. బ్రాహ్మణకులమువారు చేసెడి యక్రమము లెప్పటి కప్పుడు ప్రజలకు తెలియుచుండును. ఇప్పుడు విద్య గడించి బ్రాహ్మణులవలె బ్రాహ్మణేతరు లెందఱో రాజకీయ ధురంధరు లగుచున్నారు. బ్రాహ్మణేతరులలో విద్య దినదినాభివృద్ధి గాంచుచున్నది. విద్యాభివృద్ధియయిన కొలఁదిని ప్రజాభిప్రాయమును తెలిసికొని బ్రాహ్మణేతరసంఘాభివృద్ధికి కావలసిన మార్గములను యోచించి బ్రాహ్మణులు చేయు కార్యములను లోకమున కెఱిఁగించి రాజకీయవిషయములలో బ్రాహ్మణులతో పాటు వ్యవహరింపఁగల బ్రాహ్మణేతరనాయకు లెందఱో సంఘముల నలంకరింపఁగలరు! బ్రాహ్మణేతరప్రజాభిప్రాయ మనున దొకటి లేని దినములలో వ్రాయఁబడిన మనుధర్మశాస్త్రము ఇప్పుడు పునరుద్ధరింపఁబడుట కల్ల. బ్రాహ్మణేతరులు భుజబలసంపన్నులు. హిందూదేశము నేలిన రాజులు పెక్కుమంది బ్రాహ్మణేతరులు. వారి సంతతివారు స్వరాజ్యము కూడ దనుట సరి కాదు. దేశమును శత్రువుల బారినుండి రక్షించుట అంతఃకలహములు దొంగతనములు లేకుండ దేశమును కాపాడుట మొదలగు భుజబలమును కోరు కార్యములు బ్రాహ్మణేతరులే చేసితీరవలెను. బ్రాహ్మణేతరుల మనఃపూర్వకపరస్పరస్నేహము లేనిది 15 లక్షల జనులు 420 లక్షల జనుల నేలుట అసాధ్యము. ఒకరి బలము మరియొక రెఱిఁగిన బ్రాహ్మణబ్రాహ్మణేతరులు ఒకరి నొక రతిక్రమించి ప్రవర్తింపఁజాలరు. ఇప్పు డన్నో వారును వీరును ప్రభుత్వమువారి చేతిలో నున్నారు. బ్రాహ్మణుల పలుకుబడికిని బ్రాహ్మణేతరుల ప్రస్తుతస్థితికిని ప్రభుత్వమువారు కూడ కొంతవఱకు జవాబుదారులు.

ముగింపు

లాయిడు జార్జి గారు పాలితుల కోరికల ననుసరించి పాలకులు పాలింపవలె నని నొక్కి వక్కాణించియున్నారు. బ్రిటిషు సామ్రాజ్యమునకు లోఁబడి స్వరాజ్యము సంపాదించుట కిది మంచి తరుణము. సమయము పోఁగొట్టుకొనిన, మన సంతతివారికి మన ముత్తరవాదుల మగుదుము. జాతీయాభ్యుదయ మత్యవశ్యము. దేశములోని యన్ని సంఘములవారు విద్యావంతు లయి స్వాతంత్ర్యాభిలాషు లయినఁ గాని జాతీయాభ్యుదయము సాధ్యము కాదు. ఏ సంఘమువారు తమ సంఘము నుద్ధరించుటకు పాటుపడినను, జాతీయాశయములకు భంగము లేకుండ ప్రవర్తింపవలెను. జాతీయాశయములకు విరుద్ధముగా ప్రవర్తించువారు తమ సంఘములను బాగు చేయుట కల్ల. అన్ని సంఘములవారును దేశమాత పుత్రు లగుటం జేసి ఒకరి నొకరు ద్వేషించుట తమ్ము దాము ద్వేషించుట యగును. బ్రాహ్మణేతరులు విరివిగా దేశభాషలలో విద్య నేర్చుకొని స్థానిక పరిపాలనలో శ్రద్ధ పుచ్చుకొని జాతీయాశయములు నెఱవేఱుటకు పాటుపడవలెను.

హిందూదేశముయొక్క ప్రాచీనౌన్నత్యమును గుర్తెఱిఁగి ప్రస్తుతపు హీనదశకు చింతించి బ్రాహ్మణబ్రాహ్మణేతరులు ఏక మయి జాతీయాభ్యుదయమునకు పాటుపడి కృతకృత్యు లగుదు రని నమ్ముచున్నాను.

# విద్యయొక్క పరమార్థము

పాలవర్తి నరసింహము గారు

విద్యావిషయము మహోత్కృష్టమైన విషయము. విద్యయే మానవుని జన్మసాఫల్యహేతువు. విద్య లేకున్న మనుజునికి వాస్తవమైన సౌఖ్యము లేదు; నిజమైన పూజ్యత లేదు; యథార్థమైన యానందము లేదు. విద్యామూలముననే మనుష్యనామము సార్థక మగును. సర్వశుభావహమైన యిట్టి విద్యాసంపద లేనిచో మనుష్యుఁడు వింత పశువు అనిపించుకొనుట యొక యాశ్చర్యము గాదు.

విద్య మానవవ్యక్తికి మంగళకరమై సంఘమునకు మంగళకరము గాకుండునా? సంఘోన్నతికి విద్యయే పునాది. విద్యావంతుల కాకరములై విలసిల్లెడు సంఘములును జాతులును మానవమండలి యందు ఉన్నతస్థానమును ఆక్రమించుకొనియున్నవి. విద్యాగరిమ యందు వెనుకఁబడియున్న సంఘములును జాతులును అధోగతిని చెందియున్నవి. చదువు లేమిచే మృతప్రాయములై పరిహాసపాత్రములైయున్న సంఘములు ఒక్కింత విద్యాగంధము నాఘ్రాణించినంతనే పునర్జీవమును గాంచి తమ్ము వెక్కిరించినవారిని ధిక్కరించు సామర్థ్యమును పడయుచున్నవి. అట్లగుటచే, ఏ ప్రభుత్వమును ప్రజల విద్యావిషయమునందు ఉదాసీనత వహించియుండ లేదు. అక్షరజ్ఞానశూన్యులైన ప్రజలను పాలించుట విద్యావంతు లగు ప్రభువులకు సులభముగా నుండవచ్చును. కాని, అట్టి ప్రజాపాలనమునం దే విధమైన సారస్యము నుండదు. విద్యాహీనమగు ప్రజాసంఘము గోవు మెడకు కట్టిన కుదికఱ్ఱవలె దొరతనమునకు విశేషభారావహముగా నుండును. అందుచే నెట్టి స్వలాభాపేక్షాపరు లగు ప్రభువులైనను తమ పరిపాలనమునందున్న జనులకు ఏదో యొక విధమైన విద్యను చెప్పించుచున్నారు. ఉత్తమమైన విద్యను ప్రజలు పొందిన కొలఁది రాజ్యము సకలైశ్వర్యములతో తులఁదూఁగుచు కిలకిలలాడుచుండును. అందుచే, ఉత్తమప్రభుత్వములు తమ పాలనమునకు లోఁబడియున్న జనుల విద్యావిషయమున నెక్కుడు కృషి సలుపుచున్నవి.

ప్రత్యేకవ్యక్తులయొక్కయు సంఘములయొక్కయు రాజ్యములయొక్కయు శ్రేయోభివృద్ధులకు మూలకందమైన యీ విద్యయొక్క పరమార్థ మేమి? విపులవిజ్ఞానమే విద్యయొక్క పరమార్థమని కొందఱు తలంచుచున్నారు. అధికారప్రాబల్యమే విద్యయొక్క పరమార్థమని మఱికొందఱు భావించుచున్నారు. పాండిత్యసంపాదనమే విద్యయొక్క పరమార్థమని కొందఱు తలపోయుచున్నారు. పలుకుబడిని గడించుటయే విద్యయొక్క పరమార్థమని కొందఱు తలంచుచున్నారు. జనుల మోహముల పడయుటయే విద్యయొక్క పరమార్థమని కొందఱు ఊహించుచున్నారు. ప్రభుత్వమునయొక్క సుస్థితికి తోడ్పడుటయే విద్యయొక్క పరమార్థమని కొందఱు గణించుచున్నారు. విద్యవలన ఈ ధనాదులు లభించుట నిస్సందేహమైనను, ఇవియే విద్యయొక్క పరమార్థమని నుడువుట కెంతమాత్రమును వీలు లేదు. ఈశ్వరానుగ్రహమువలన మనుష్యుఁడు బుద్ధ్యాద్యనేకశక్తులను పడసియున్నాఁడు. పూమొగ్గయందలి రేకులవలె నున్న యీ శక్తులెల్ల తగిన చందమున చక్కఁగా వికసించి విజృంభించుటయే విద్యయొక్క పరమార్థము. మనుష్యశక్తియొక్క సంపూర్ణవికాసమే విద్యయొక్క పరమార్థమని నుడువుటయందు బుద్ధిమంతు లగు పాశ్చాత్యులును ప్రాగ్దేశస్థులును నేకాభిప్రాయు లగుచున్నారు. నడవడిని చక్కపఱచుటయు స్వార్థత్యాగము లలవడునట్లు చేయుటయు సకలశక్తులను సమభావమున పనిచేయునట్లు చేయుటయు మనుష్యుని యావచ్ఛక్తులను శిక్షించుటయు విద్యయొక్క యుద్దేశమని బెయిను అను నొక ధీశాలి చెప్పియున్నాఁడు. ఈ విధముననే లార్డు హాల్డేను అను నొక రాజ్యతంత్రజ్ఞుఁడు ఇటీవల కానున్న మహాసభలో నుపన్యసించెను. ఈ భావములనే మనువు ఎన్నియో వందల సంవత్సరముల క్రిందట వ్యక్తీకరించెను.

విద్య యనునది కేవలము మనస్సునకు సంబంధించినదిగనే కనిపించుచున్నను, మనుష్యుఁడు శరీరధారి యను సంగతిని మనము విస్మరింపఁజాలము. "A Sound Mind in a Sound Body" అను సూక్తిని మనము జ్ఞప్తియందుంచుకొనవలెను. ఎంత చదువు చదివినను, శరీరము దుర్బలమైన ఆ చదువు గణనకు చాలదు. అదియుఁ గాక, అధికజ్ఞానము సంపాదింపఁగోరిన ప్రతి మనుష్యుఁడు తన శరీరమును ఆరోగ్యస్థితియందుంచుకొనవలెను. గంటలు దినముల కొలఁది పరిశోధనాలయమునఁ బడవలసినవారును నిశల యందు నిద్రమాని ఖగోళమండలము పరికింపవలసినవారును మహనీయులచే రచింపఁబడిన వేలకొలఁది గ్రంథములను పఠించి శోధింపవలసినవారును ఎట్టి శరీరదార్ఢ్యము కలవారుగా నుండవలయునో యోచింపుఁడు. శరీరదార్ఢ్యమనుటచే ప్రతిమనుష్యుఁడును గుండెపై బండ నుంచుకొని ప్రిద్దలు కొట్టించుకొను రామమూర్తి కావలయునని నా తలంపు గాదు. యుక్తమైన యారోగ్యమును ప్రతి మానవుఁడును సంపాదింపవలయును. పాశ్చాత్యయువజనులతో పోల్చి చూచిన ప్రాచ్యమన యువజను లెందుకును కొఱగానివారుగా కనఁబడుదురు. అందులోను, ఆంధ్రులందు మిక్కిలి బలహీనులున్నట్లు నాకు తోఁచుచున్నది. వీరిలో బ్రాహ్మణులు ఇతరజాతులకంటె బలమున తీసిపోవువారుగా కనిపించెదరు. కాయకష్టమునకు గౌరవము పోవుటచే నేమి, పాఠశాలలలో బోధింపఁబడు విషయము నిస్సారమై చిత్తాకర్షకము కాకపోవుటచే నేమి, అతిబాల్యవివాహాదిదురాచారములవలన నేమి, మన శరీరపాటవము మిక్కిలి సన్నగిల్లి యున్నది. సౌభాగ్యమైన బ్రహ్మచర్యవ్రతముచేతను సరియైన వ్యాయామపద్ధతి నవలంబించుటచేతను శరీరారోగ్యమును కాపాడుకొనుట యెల్లరకును విధి. ఇది యుత్తమవిద్యావిధానమునందు గమనింపవలసిన మొదటి విషయము.

బుద్ధిసంపద లేని శరీరదార్ఢ్యము నిరర్థకము. సంగతులను కంఠపాఠము చేయుటచేఁ గాని జననమరణముల తేదులను వల్లె వేయుటచేఁ గాని బుద్ధి వికసింపనేరదు. ఫోనోగ్రాఫుయంత్రమువలె విషయములను గ్రహించి వెడలఁగ్రక్కుటకు బుద్ధి యేర్పడలేదు.

స్వయముగా సంగతులను వీక్షించి చర్చించుటవలన బుద్ధి వికాసము నొందవలసియున్నది. సత్యగ్రహణమునందు బుద్ధి సామర్థ్యము గలదై యుండవలయును. ఎన్నియో విషయములను గూర్చి గమనించి పరిశీలించి తర్కించినంగాని యొక సత్యమును నిర్ధారణ చేయుటకు వలనుపడదు. గాఢమైన సత్యప్రీతిని విద్యార్థులలో కలిగింపఁజాలని విద్యావిధానము క్రమమైన దెంత మాత్రమును కాఁజాలదు. చిరకాలాగతమైన యాచారములును అనుచితమైన గ్రంథవిశ్వాసమును ఒక్కొకప్పుడు మనుష్యుల సత్యానురాగమునకు గర్భశత్రువులై నిలుచును. ఇట్టి శత్రుగణముయొక్క హస్తములనుండి యావలఁ బడినంగాని, బుద్ధి నూతనసత్యములను పరిగ్రహింపఁజాలదు. పాంచాల దేశమున నొకప్పుడు 'దాహిరాజు' అను నొక ప్రభు వుండెను. అతనిపైకి కాశీము అను పేరుగల యొక చక్రవర్తి సేనాసమేతుఁడై వచ్చునట్లు వార్త తెలిసెను. యుద్ధసన్నద్ధుఁడై యుండుటకు మాఱు దాహిరాజు జ్యోతిష్కులను పిలువనంపి "ఈ సమయమునందు నేను యుద్ధమునకు పోయిన జయము కలుగునో పరాజయము కలుగునో శాస్త్రమును చూచి సెలవిండు" అని వారిని కోరెనఁట. అప్పుడా పండితులు శాస్త్రములను పాఱఁజూచి "అపజయము కలుగు"నని ప్రభువునకు నివేదించిరఁట. పరాజయము కలుగుట సిద్ధము గనుక నే నిపుడు యుద్ధప్రయత్నము నేల చేయవలయు నని తలంచి దాహిరాజు మిన్నకుండెను. అప్పుడు కాశీము చక్రవర్తి అనాయాసముగా కోటను స్వాధీనము చేసికొని రాజ్యమును తీసికొని దాహిరాజును వెడలనడఁచెను. యుద్ధసన్నాహము చేసి కాశీముచక్రవర్తిని ఎదిరించి యుండిన యుద్ధముయొక్క పర్యవసానము ఎట్లుండియుండునో చెప్పఁజాలము గాని, ఎదిరింపక పోవుచున్న [illegible]ముచే జ్యోతిష్కులు చెప్పిన మాట మక్కికి మక్కి సత్యమే యయ్యెను. జ్యోతిషశాస్త్రవేత్తలగు నా పండితుల వచనములందుఁ గల విశ్వాసముచే దాహిరాజు సులభముగా రాజ్యపదచ్యుతుఁ డయ్యెను. శాస్త్రమునందుకంటె సత్యమునం దనురాగము హెచ్చవలయును. సత్యప్రీతియే కలిగిన పక్షమున మనుష్యుఁ డూరకుండఁజాలఁడు. తన బుద్ధిని సమస్తవిషయములందును ప్రవేశపెట్టి నూతనవిజ్ఞానమును పడయఁగల్గును.

కేవలము సత్యగ్రహణసమర్థమైన బుద్ధి యుండినచే చాలదు. మనుష్యుఁడు ధర్మనిష్ఠను సయితము గడింపవలయును. గ్రహించిన సత్యమును నిర్భయముగా వెల్లడించుటకును ఆచరించుటకును తగిన శక్తిని మానవుఁడు గడింపవలయును. యుక్తమైనదానిని చేయలేక పోతిమేని, యుక్తాయుక్తపరిజ్ఞానమును గలిగియుండుటచే మనకు కలిగిన ప్రయోజన మేమి? తమకు యుక్తమని తోఁచిన కార్యము నెవరు కావించిరో వారు మహాపురుషులై మన చిరకృతజ్ఞతకును పూజ్యతకును పాత్రులై వెలయుచున్నారు. తన తండ్రియొక్క మతమునకు విరుద్ధముగా నుండినను ప్రహ్లాదుఁడు విష్ణుభక్తిని విడిచినవాఁడు గాఁడు. నిండు సభలో ద్రౌపది యవమానింపఁబడుచుండ, దుర్యోధనాదులకు వెఱచి భీష్మాది వృద్ధజనులు నెదవులు కదల్పక యూరకుండ, బాలుఁడగు వికర్ణుఁడు కౌరవుల కార్య మక్రమ మని యకుంఠితధైర్యముతో నుడివెను. చరిత్రప్రసిద్ధులగు లూథరు సావనరోలా మున్నగు విదేశీయులేమి, రామమోహన విద్యాసాగరాది స్వదేశీయులేమి తమకు యుక్తమని తోఁచిన విషయములను నిర్భీతచేతస్కులై లోకమునకు వెల్లడించినవారలే! ధర్మపరిపాలనమునకై మనకు ధైర్యస్థైర్యముల నొసంగఁగలిగిన విద్యయే సద్విద్య!

ధీసంపదయు కర్తవ్యపరాయణత్వబుద్ధియు నున్నను, హృదయమునందు ప్రేమ లేకపోయినచో నిర్గంధకుసుమమువలె మనుష్యుఁడు గౌరవాధికారమును గోల్పోవుచున్నాఁడు. తన తల్లిదండ్రులను బంధువులనే గాక మనుష్యుఁడు స్వదేశస్థులను పరదేశస్థులను గూడ ప్రేమింపఁగల్గియుండవలెను. కేవలము మానవులనే గాక భూతకోటియెడలఁ గూడ దయను చూపవలయును. "అహింసా పరమో ధర్మః" అను సత్యమును గ్రహించి తద్ధర్మమును ప్రపంచమున వ్యాపింపఁజేయుటకై శాక్యసింహుఁడు పడరాని యిడుమల ననుభవించెను. ఎందఱో దారిద్ర్యముచే బాధపడుచున్నారు. ఎందఱో అంగవైకల్యమునకు లోనై యిడుములఁ బడుచున్నారు. ఎందఱో రోగగ్రస్తులై తగిన యౌషధము లేక కానరాని వ్యథల ననుభవించుచున్నారు. ఇట్టివారి కెల్ల సేవ చేయుటకు పురికొల్పునదిగా నుండవలయు నుత్తమమైన విద్య.

ఎంత సూక్ష్మమైన జ్ఞానమును మనము సంపాదించినను, ఎంత నిష్ఠతో మన కర్తవ్యములను మనము నెఱవేర్చినను, ఎంత సేవాపరాయణులమై మనము వర్తించినను, స్వయంభువై చిన్మయుఁడై సౌందర్యస్వరూపుఁడై ప్రకాశించెడి యా పరమపురుషుని మనము గ్రహింపలేకపోయినచో, మన విద్య పరిపక్వదశను పొందినది కాఁజాలదు. ఈశ్వరపూర్ణమైన విజ్ఞానముతో ఆత్మ తృప్తిని చెందియుండఁజాలదు. 'నేను సమస్తశాస్త్రములను గ్రహించినాను, నేను నా విధులను నెఱవేర్చినాను. నేను పరోపకారము చేయుచున్నాను' అనుకొనుచు, అహంభావము వహించి ఆత్మసంతుష్టి చెంద నేరము. సకలవిజ్ఞానము బయలుదేఱుటకు నెవఁడు మూలకారణుఁడో ఎవఁడు జ్ఞానస్వరూపుఁడై యణువులందు అణువై మహద్వస్తువులందు మహద్వస్తువై దాఁగియున్నాఁడో ఎవఁడు ధర్మాధర్మపరిజ్ఞానమును గలిగించి అధర్మమును త్యజింపు మని ధర్మమును భజింపు మని యుపదేశించుచున్నాఁడో ఎవ్వఁడు ప్రేమస్వరూపియై హృదయమున మెలఁగుచు కఠోరమైన సేవావ్రతమునకు మనలను పురికొల్పుచున్నాఁడో అట్టి సత్యశివసుందరస్వరూపునకు సకలపూజాగౌరవముల నొసంగి తన యహంకారమును నా పరబ్రహ్మము ముందర బలి సేయునంతవఱకును ఆత్మకు నిజమైన శాంతి యుండదు. ఆనందము నుండదు. అందుచేతనే "అపరా ఋగ్వేదో యజుర్వేదః । సామవేదో అథర్వవేదః । శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్దో జ్యోతిషమితి । అథ పరా యయా తదక్షరమధిగమ్యతే." అని యుపనిషత్తులు ఘోషించుచున్నవి. ఋగ్యజుస్సామాథర్వము లనెడు నాలుగు వేదములును శిక్షా కల్ప వ్యాకరణ నిరుక్త ఛందో జ్యోతిషము లనెడు షడంగములును శ్రేష్ఠవిద్యలు గావు. దేనిచేత క్షయరహితమైన పరబ్రహ్మము తెలియఁబడుచున్నదో అదియే శ్రేష్ఠమైన విద్య. ఈ షడంగములతోఁ బాటు మనము పదార్థతత్త్వశాస్త్రము రసాయనశాస్త్రము ఆయుర్వేదశాస్త్రము మొదలైన శాస్త్రముల నెల్ల అపరవిద్యల క్రింద చేర్పవచ్చును. శ్రేష్ఠవిద్యలు గావని చెప్పినను, పరవిద్య కివి యనావశ్యకము లని చెప్పలేదు. ఈ వైజ్ఞానిక విద్యలవలన లభించెడు చింతాశక్తియు ఏకాగ్రచిత్తతయు ఇంద్రియదమనమును భోగవిముఖత్వమును పరవిద్యాసాధనమునకు సోపానప్రాయము లనుటకు సంశయ మేమి?

అపరవిద్యల నేమి పరవిద్య నేమి సాధించుటకు విశ్వవిద్యాలయముకంటె నుపయుక్తమైన స్థలము మఱి యెందు మనకు లభింపనేర్చును?

BOY SCOUTS, NARSAPUR



నర్సాపురము బాలభటులు

PRESIDENCY TRAINING SCHOOL FOR MISTRESSES, EGMORE



ఎగ్మూరు ఉపాధ్యాయినీ పాఠశాల

HINDU LADIES LAKSHMI VILASA SABHA, MADRAS



హిందూస్త్రీల లక్ష్మీ విలాస సభ, చెన్నపురి

STATUE OF JOAN OF ARC, PONDICHERRY



జోన్ ఆఫ్ ఆర్కు విగ్రహము, పుదుచ్చేరి

THE LATE
Mrs. V RAJAGOPAUL



వి.' రాజగోపాలు గారి
దివంగతులైన ధర్మపత్ని

PRNICESS MANAN



మేనన్ రాజకన్య

# స్వపరిపాలనార్హ

వల్లూరి సూర్యనారాయణరావు పంతులు గారు, బి. ఏ., బి. ఎల్., ఎల్. టి.

మా దేశములోని ప్రజలు స్వపరిపాలనకు ఇప్పుడే తగరని తెల్లవారును మనలోని కొందఱు పెద్దలును కూడ చెప్పుచున్నారు. వీరి యాక్షేపణలను మన మిచ్చు సమాధానములను సంక్షిప్తముగ ఈ క్రింద పొందుపఱచుచున్నాను:

## మొదటి యాక్షేపణ

తెల్ల దొరల పైతనిఖీ లేనిచో క్రింది యుద్యోగస్థులైన నల్లవారు తిన్నగా పనిచేయరు. రాజ్యపరిపాలనలో నల్లవారు ఆయా శాఖలలో తెల్లవారి క్రింద కొంత కాలమువఱకు పని నేర్చుకొనుచుండవలెను గాని స్వతంత్రించి ప్రజోపయోగ మైన నూతన మార్గములను త్రొక్కఁజాలరు. ఈ కారణములచేత స్వపరిపాలనాధికారము శీఘ్రకాలములో మన దేశీయుల కీయఁగూడదు.

## సమాధానము

బ్రిటీషువారు మన దేశమునకు రాక మునుపు మనవారు రాజ్యపరిపాలన నెట్లు చేసిరి? అప్పటివారికంటె నిప్పుడు మనము తగ్గిపోయి యున్నయెడల, దీనికి మన ప్రభుత్వమువారే జవాబుదారులు కావలయును. పెద్ద యుద్యోగముల నిచ్చి మనలను పరీక్షింపవలెను గాని, నీళ్లలోనికి దిగకుండ ఈఁత నేర్చుకొను మనుట ఏటి న్యాయము? గొప్ప పదవుల నిచ్చిన చోట్ల మన హైకోర్టు జడ్జీలు జిల్లా జడ్జీలు కలెక్టర్లు ఇంజనీర్లు ఉపాధ్యాయులు లాయర్లు తెల్ల దొరలవలెనె బాగుగా పనిచేయుచున్నారు. ఒరిస్సా రాష్ట్రములో కమీషనరుగా నుండిన రోమేశచంద్రదత్తు గారికిని ఇండియా కౌన్సిలు మెంబరుగా నుండిన కృష్ణగోవిందగుప్త గారికిని లెఫ్టినెంటు గవర్నరు పనుల నేల యీయలేదు? మన యోగ్యతలను తాము ఒప్పుకొన్నయెడల తమకు దొరకుచున్న యుద్యోగములు పోవునేమో యని వా రనుమానభావముతో చెప్పు మాటలే గాని వీనిలో సత్య మెంత మాత్రమును లేదు.

స్వపరిపాలనము బ్రహ్మవిద్య కాదు. అనుభవ మున్నయెడల, మనము రాజ్యమును పరిపాలించుకొనఁగలము. నూతనముగా క్రొత్త విషయములను కనిపెట్ట నవసరము లేదు. రాజ్యపరిపాలనలో స్వల్ప విషయములను కూడ గమనించుచు చిక్కు సమయములలో మన ధైర్యమును విడనాడక ఉపాయాన్వేషణము చేయుచుండవలెను. పన్నులను న్యాయముగా విధించి సరిగా వసూలు చేసి ఖర్చుపఱచుచుండు లాగు రాజ్యాంగతంత్రమును ఏర్పాటు చేసినయెడల పరిపాలనము దానియంతట అది నెమ్మదిగా సాగిపోవుచుండును. దీనిని అనుభవమువలననే ప్రజలు గ్రహింపఁగలరు గాని, గ్రంథములలో చదివినంత మాత్రమునఁ గాని ఇతరదేశీయుల స్వపరిపాలనవిధానములను చూచినంత మాత్రమునఁ గాని తెలిసికొనఁజాలరు. కొన్ని విషయములలో అత్యద్భుత మైన తెలివిని చూపిన జాతి పక్కాన విషయములలో కూడ తగిన యవకాశములు కలుగఁజేసినపుడు తన శక్తిని కనఁబఱుపఁగల దని మనము సాధారణముగా నమ్మవచ్చును. పూర్వకాలమ ట్లుండనిచ్చి, మనము ఇతరులకు లోఁబడియున్న యీ కాలములో కూడ బ్రిటిషు పార్లమెంటు సభ్యులుగాను ఇండియా కౌన్సిలు సభ్యులుగాను ఈ దేశపు కార్యనిర్వాహకసభా శాసననిర్మాణసభలలో సభ్యులుగాను యుద్ధమున విక్టోరియా క్రాసు బిరుదములను పొందినవారుగాను గొప్ప కవులుగాను శాస్త్రజ్ఞులుగాను తత్త్వవేత్తలుగాను మనవా రున్నారు. వీ రందరు తొలఁగి పోదురేమో యని యనెదరేమో! గొప్ప వృక్షములు లేనంతంటె మెండుగా చిన్నవి యగు వృక్షములు గల యడవులలో పెరుగును గాని, పట్టి యెడారులలో పెరుగవు కదా! ఏ కాలములో ఏ దేశమును చూచినను గొప్ప కవులు గాయకులు రాజకార్యధురంధరులు శాస్త్రజ్ఞులు సేనానాయకులు మొదలగువారు ఒంటిగ ఒక్కొక్కరే పుట్టలేదు. తమ తోడివారికంటె కొంచె మెక్కువ తెలివి గలవా రగుచుండిరని చెప్పవలసియున్నది.

## రెండవ యాక్షేపణ

మీ రవకాశములను కలుగఁజేసికొనరాదా? ఒకరు మీ కిచ్చున దేమి? వ్యక్తులవలెనే జాతులు కూడ తగిన తరుణములను కనిపెట్టి యేల వృద్ధి పొందుటకు ప్రయత్నింపఁగూడదు? మీ రవకాశములను తెచ్చుకొనవలెను గాని ఇచ్చున దేమి? మీకు ఏ మాత్ర మడ్డు కలిగినను దానిని తొలఁగించుటకు ఏల ప్రయత్నింపఁగూడదు? అట్టి శక్తి మీకు లేదు గనుక, మీరు స్వపరిపాలనకు అనర్హులు.

## సమాధానము

దైవముమీఁద భారము వేసి అలాగుననే ప్రయత్నించెదము. కాని, ఇట్టి యవకాశములను తెచ్చుకొనఁగలిగిన యీ తెల్ల దొరలకు ఒక సంగతి మనవి చేసెదము. మానవచరిత్ర యంతయు పాశ్చాత్య ప్రభావమును చూపుచున్న కడచిన కొలఁది శతాబ్దాలలోనే యిమిడి యుండలేదు. హిందువులు ఈజిప్టువారు చాల్డియనులు చీనావారు పారసీకులు పాశ్చాత్యులకంటె అనేక శతాబ్దుల క్రిందటనే యెక్కువ నాగరకత గలిగి గొప్ప యైశ్వర్యము ననుభవించి అనేకా

కాశములను కలుగఁజేసికొనిరి. ఆ కాలములో మనవారివలెనె యీ పాశ్చాత్యులు తేల యవకాశములను కలుగఁజేసికొనలేక పోయిరో? [illegible] గడచిన వెంబడి సంవత్సరములలోనే యవకాశములను కలుగఁజేసికొనిరి. ప్రపంచములో ప్రతి జాతియు క్రిందు మీఁదు పడుచు లేచుచునే యున్నది. తాము మాత్రమే యవకాశము కలుగఁజేసికొనఁగలవారు మని యే జాతియు గర్వపడ నక్కఱ లేదు. తాము వ్యర్థుల మని యే జాతియు భీతిల్ల నక్కఱ లేదు. బలమును సంపాదించుకొన్న జాతు లన్నియు, బలహీనజాతులకు కావలసిన యవకాశము లన్నియు ఇచ్చుట న్యాయము. అటు లీయక పోయినను అవకాశములను కలుగఁజేసికొనుటకు అవి తప్పక యన్ని విధములను ప్రయత్నము చేయక తప్పవు.

## మూఁడవ యాక్షేపణ

ఏ జాతికైనను దాని పూర్వకాలమందలి రాజ్యాంగవిధానముల ననుసరించియే ముందు కూడ నిర్మాణము చేయవలె ననియు, నిరంకుశప్రభువుల క్రింద చాల కాల మున్న దేశములలో ప్రజాప్రాతినిధ్యము కూడ దనియు, హిందూ రాజులు మొగలాయి చక్రవర్తులు మొదలగువారి పరిపాలన క్రింద నున్న యీ దేశము ఎవరో యొక రాజు క్రిందనే యుండవలె ననియు కొందఱు చెప్పుదురు.

## సమాధానము

ఈ యాక్షేపణ ప్రపంచచరిత్రకు వ్యతిరేకముగ నున్నది. నిబంధనానుకూల రాజ్యపరిపాలనములును ప్రజాప్రతినిధి పరిపాలనములును కలిగిన ప్రస్తుతరాజ్యములు పూర్వము నిరంకుశప్రభువుల క్రిందనే యుండినవి. ఇది గాక, పూర్వము మన దేశములో గ్రీసు ఇటలీల ప్రజాస్వామికప్రభుత్వములకంటె పెద్దవి కలవు. రాజుల చేతనే పరిపాలింపఁబడు దేశములయందు కూడ పరిపాలన విషయములలో ప్రజల యంగీకారమును అపేక్షించుచుండిరి. దశరథ మహారాజు రాముని పట్టాభిషిక్తుని చేయఁదలఁచినపుడును రాముఁడు సీతను అడవులకు పంపునపుడును ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుని రాజుగా చేయఁదలఁచినపుడును ప్రజల యభిప్రాయమును కనుఁగొనిన తరువాతనే కార్యము లుపక్రమింపఁబడినవి. ప్రజాప్రతినిధుల సభ పురోహితుల సభ జ్యోతిష్కుల సభ వైద్యుల సభ ఆచార్యుల సభ అనెడి యైదు సభలు ప్రాచీనరాజుల కాలములో నేర్పడి, వీని సలహాలను బట్టి దేశపరిపాలనము జరుగుచుండెడిది. ఇది గాక, మన గ్రామపరిపాలన మంతయు పంచాయతి సభలవలననే జరుగుచుండె నని అందఱు చరిత్రకారులును ఒప్పుకొనియున్నారు. చాణక్యుని యర్థశాస్త్రము శుక్రనీతి రామాయణము మహాభారతము సంహితలు మొదలగు గ్రంథములు పూర్వము ప్రజాపరిపాలన మున్నట్టు చాటుచున్నవి. చంద్రగుప్తుఁడు అశోకుఁడు సముద్రగుప్తుఁడు ధర్మపాలుఁడు మొదలగువారు ఏర్పఱచిన రాజ్యాంగతంత్రములలో ప్రజాప్రతినిధి పరిపాలనము కూడ నెలకొల్పఁబడినట్లు ఆనాఁటి పాశ్చాత్య చరిత్రలలోనె గాక బౌద్ధగ్రంథములలో కూడ స్పష్టముగ వివరింపఁబడి యున్నవి. ఇటీవల ఢిల్లీ అక్బరు ఔరంగజేబు శివాజి మొదలగు రాజుల కాలములలో రాజ్యపరిపాలనమును స్థానికస్వపరిపాలనమును మంచి కట్టుదిట్టములతో ప్రజలు నిర్వహించినట్లు పక్షపాతరహితులగు చరిత్రకారులు వ్రాసియున్నారు. అక్బరు కాలములో తోడరుమల్లు గారు స్థాపించిన రివిన్యూ పరిపాలనవిధానమునే మన బ్రిటిషు గవర్నమెంటు వారు అవలంబించిరి. మన మహమ్మదీయసోదరుల సాంప్రదాయము లన్నియు ప్రజాస్వామికమునే బలపఱచుచున్నవి. రణజిత్ సింగు గారు నిరంకుశత్వమును నెలకొల్పక ముందు పంజాబు దేశములో నున్న సిక్కులు ప్రజాప్రతినిధి సంఘములవలననే రాజ్యపరిపాలనము చేయుచుండిరి. పూర్వకాలపు కట్టడములు గోడ్లు కాలువలు ఆనకట్టలు మొదలగునవి మన పూర్వుల నాగరికతను వేనోళ్ల చాటుచున్నవి. ఒక వేళ, మన పూర్వులు నిరంకుశప్రభుత్వమునకే యలవాటుపడి రని వాదమునకు ఒప్పుకొన్నను, జపాను చీనా పెర్షియా దేశవాసులవలె, మనము బ్రిటిషుపరిపాలన క్రింద 150 సంవత్సరములనుండి యుండి యి స్వపరిపాలనకు తగమా?

## నాలుగవ యాక్షేపణ

బ్రిటిషువారు మన దేశమును అసాధారణముగ జయించుట వలననే మనము స్వపరిపాలనకు అనర్హుల మనియు వా రిచ్చు ప్రసాదములకు మనము వేచియుండవలసినవారమే యనియు కొందఱనెదరు.

## సమాధానము

మన దేశమును జయించి బ్రిటిషువారి కిచ్చినది మనవారే. మన సేనల సహాయమువలననే ఈ దేశము వారిచే నిప్పుడేలఁబడినది. వాదమునకు బ్రిటిషువారే స్వశక్తివలన ఈ దేశమును సంపాదింపఁగలిగి రని మనము ఒప్పుకొన్నను ఇది మన స్వపరిపాలనానర్హతకు కారణమా? కనడా దేశములో ఫ్రెంచివారు 1763-వ సంవత్సరమున జయింపఁబడినను, 1791-వ సంవత్సరములోనే వారు స్వపరిపాలన కెట్లు అర్హులైరి? 17 సంవత్సరముల క్రిందట ఆరెంజి ఫ్రీ కాలొని బోయర్లు జయింపఁబడిన వెంటనె స్వపరిపాలనకు తగినవారైరి. ఐర్లాండు దేశము 1801-వ సంవత్సరమువఱకు పార్లమెంటును కలిగియుండి సంపూర్ణస్వాతంత్ర్య మనుభవించి పిమ్మట దానిని పోఁగొట్టుకొని అనేకపర్యాయము లాంగ్లేయుల మీఁద తిరుగుబాటు చేసి పోరాడిపోయినప్పటికిని, బ్రిటిషు పార్లమెంటులో ప్రాతినిధ్యము కలిగియుండుటయే గాక హోము రూలు కూడ పడయనున్నది. ఇంగ్లాండు దేశము, రోమనులు ఆంగ్లులు సాక్సనులు డేనులు నార్మనులు మొదలగువారిచేత జయింపఁబడినను, ఇప్పుడు సంపూర్ణస్వాతంత్ర్యము ననుభవించుట లేదా? న్యూజీలండు గిల్బర్టు యెల్లీసు దీవులలోని యడవి జాతులకు మన బ్రిటిషువారు శాసననిర్మాణసభలలో ప్రాతినిధ్య మొసంగలేదా?

ఫిలిప్పైను దీవులలోని యడవి జాతులకు అమెరికావారు ప్రజాప్రాతినిధ్యపరిపాలనము నొసంగిరి. టర్కీచేత జయింపఁబడి దానికి అనేకశతాబ్దులు లోఁబడియుండిన సర్వియా బల్గేరియా రొమేనియా మాంటినీగ్రోలు ఎట్లు స్వతంత్రపరిపాలనకు అర్హము లైనవి? ప్రపంచములో నున్న యన్ని జాతులును దేశములును ఎప్పుడో యొకప్పుడు ఇతరులచేత జయింపఁబడి దాస్యము ననుభవించినవే. ఒకానొకప్పుడు దేశములో జరుగు కల్లోలముల నణఁపఁజాలక విదేశరాజులను రప్పింపవలసియుండును. అంత మాత్రముచేత ఆ విదేశీయులు ఆ దేశపు ప్రజలను ఎప్పటికిని లోఁబఱచుకొనియుండ వచ్చునా?

## ఐదవ యాక్షేపణ

అనేకభాషలు అనేకజాతులు అనేకవర్గములు గల యీ యిండియా ఖండము హోము రూలునకు తగదని కొందఱందురు.

## సమాధానము

ఇట్టి స్థితి రష్యా ఆస్ట్రియాహంగేరి అమెరికా సంయుక్త రాష్ట్రములు స్విట్జర్లెండు మొదలగు దేశములలో నున్నను అక్కడి రాజ్యపరిపాలనము ప్రజాప్రతినిధులవలననే జరుగుచున్నది. మన దేశములో వ్రాయుటకును మాటలాడుటకును తగియుండి సాహిత్యము కలిగియున్న భాషలు పది పండ్రెండింటికంటె నెక్కువ లేవు. ఈ భాషలను బట్టి రాష్ట్రముల నేర్పఱిచినయెడల ప్రత్యేక రాష్ట్ర స్వాతంత్ర్యమునకైనను ఎట్టి కొఱంతయు నుండదు. సామ్రాజ్య ప్రభుత్వమునకు మాత్రము హిందీభాష నుపయోగింపనగును. ఇంక వివిధజాతులు వివిధవర్గముల విషయమై యాలోచించినయెడల, పాశ్చాత్యదేశములలోని వివిధ క్రైస్తవశాఖలవారిలోకంటె ఈ దేశవాసులలో ఒకరి యాచారములయం దొకరికి నెక్కువ సహనము గలదని నానాదేశచరిత్రలు తెలియఁజేయుచున్నవి.

## ఆఱవ యాక్షేపణ

బరోడా మైసూరు తిరువాన్కూరు మొదలగు చిన్న రాష్ట్రములను స్వదేశసంస్థానాధిపతులును వారి మంత్రులును పాలింపఁ గలిగినను ఇండియావంటి పెద్ద దేశమును పరిపాలించుటకు బ్రి వారి సహాయము లేనిది యిక్కడివారికి సామర్థ్యము లేదు.

## సమాధానము

పై యాక్షేపణను ఒప్పుకొన్నను చిన్న రాష్ట్రముల స్వాతంత్ర్యము మన కేల యుండఁగూడదు? బ్రిటిషువారిని విడనాడెద మని మన మెప్పుడును చెప్పలేదు. మన జిల్లా పరిపాలనమును పట్టణ పరిపాలనమును కూడ మనవారికి పూర్ణముగ వదలకపోవుటకు కారణ మేమి? ఇంగ్లాండువారి యధినివేశ రాష్ట్రములవారు ఇదివఱ కెప్పుడైనను పెద్ద దేశములను పాలించిరా? వారు ప్రజాప్రాతినిధ్యముతో స్వపరిపాలన మెట్లు చేసికొనుచున్నారు? వానిలోని యొక చిన్న రాష్ట్రమునకు గవర్నరుగాను లండను మునిసిపాలిటీలో ఒక కమీషనరుగాను ఉన్న చెల్మ్సుఫోర్డు గారు మన దేశమునకు రాజప్రతినిధియై యెట్లు పరిపాలించుచున్నారు? అలాగుననే మన స్వదేశసంస్థానముల మంత్రులు సలారుజంగు శేషాద్రయ్యరు దివకరరావు మాధవరావు విశ్వేశ్వరయ్య రమేశచంద్రదత్తు మొదలగువారు మన యిండియా సామ్రాజ్యము నేల పరిపాలింపలేరు?

మన స్వదేశసంస్థానములకంటె కొన్ని పాశ్చాత్యస్వతంత్ర రాష్ట్రములు చిన్నవిగానే యున్నవి. ఇది గాక, పెద్ద రాష్ట్రముల పాలనములోకంటె చిన్న రాష్ట్రములను పాలించుటలో నెక్కువ చిక్కు లుండవచ్చును. భవనగరు రాజ్యమును పరిపాలించిన గౌరీశంకర్ ఉదయశంకర్ ఓఝా మంత్రి గారి పరిపాలనా నిపుణత్వమును మాక్సుమూలరు గారు అనేకవిధముల నభినందించిరి. జర్మనీదేశమును బిస్మార్కు మంత్రిగారు ఉన్నతదశలోనికి తీసికొనివచ్చుటకు ఎన్ని పాట్లు పడిరో ఎన్ని కష్టము లనుభవించిరో అదే విధముగ భవనగరు రాజ్యమును ప్రస్తుతపు గొప్ప దశకు తెచ్చుటకు గౌరీశంకరు గారును అంత శ్రమపడిరి.

## ఏడవ యాక్షేపణ

ఏ దేశము గాని స్వశక్తితో రాజ్యమును గాపాడుకొనఁగలిగి నప్పుడును పరిపాలనకు కావలసిన ధనమును సమకూర్చుకొనఁజాలి నప్పుడును స్వపరిపాలనకు తగును గాని, బలహీనులతోను పేదలతోను నిండిన యీ దేశము స్వపరిపాలన కెప్పుడును తగదు; ఒకవేళ లభించినను దానిని నిలుపుకొనలేదు.

## సమాధానము

బ్రిటిషువారి యధినివేశరాష్ట్రములలో పెద్దదైనను ఇంగ్లాండువారి సహాయము లేకయె నిలువఁగలదా? జపానువారు ఆస్ట్రేలియాను, అమెరికాసంయుక్తరాష్ట్రములవారు కనడాను, జర్మనీవారు దక్షిణాఫ్రికాను వెంటనే గుటుక్కున మ్రింగఁగలరు. ప్రస్తుతయుద్ధములో ఫ్రాన్సుదేశ మొక్కటియు తనంతట తాను నిలువఁబడి జర్మనీతో పోరాడఁగలదా? ఇంగ్లాండు మాత్రము ఇతరదేశీయుల సహాయము లేకుండ తన్ను తాను కాపాడుకొనఁగలదా? దీనికి మన దేశస్థుల సహాయము కూడ కావలసివచ్చెను. ఇంత మాత్రముచేత ఈ దేశము లన్నియు స్వపరిపాలన కనర్హములు కాఁజాలవు.

బ్రిటిషువారు మన యిండియా దేశములో పరిశ్రమలకై వెచ్చించిన ధనముకంటె నెక్కువమడుఁగుల ధనమును తమ వలసరాజ్యములకు అప్పు లిచ్చియున్నారు; ఈ యుద్ధములో తమ మిత్రమండలి వారికి అనేకకోటులధనము సహాయము చేసియున్నారు. అంతే కాక, ఈ బ్రిటిషువారే అమెరికానుండి కోట్లకొలఁది ధనమును అప్పుతీసికొనుచున్నారు. ఇట్లే స్వతంత్రరాష్ట్రము లన్నియు ఒకానొకప్పుడు ఇతరుల ధనసహాయము నపేక్షింపవలసియుండును. ఇది గాక,

ఇంగ్లాండుయొక్క ధనాఢ్యతకు ముఖ్యకారణము ఈ దేశమే యని మిల్లు ఆడమ్సుల గ్రంథములను చదివినవారికి విశదము కాఁగలదు. ప్లాసీ యుద్ధ మైనప్పటినుండియు అదివఱకు ఈ దేశములోఁ దాఁచియుంచఁబడిన పెక్కు వేల కోట్ల పౌనులును ఎడతెగకుండ ఇంగ్లాండునకు తీసికొనిపోఁబడి అక్కడ వాణిజ్యవ్యాపారముల క్రింద వినియోగింపఁబడి పెక్కు రెట్లు వృద్ధి యగుటచే ఆ దేశము ధనవంత మయ్యెను.

ఎనిమిదవ యాక్షేపణ

ఎంత కాలమో పోరాడి అనేకకష్టములు పడి స్వపరిపాలనము సంపాదించుకొన్న రాజ్యములవలెఁ గాక త్వరలో స్వపరిపాలనము కోరుట న్యాయము కా దనియు, పాశ్చాత్యదేశవాసులవలె కొన్ని శతాబ్దములు వేచియుండినయెడల ఇక్కడివారికిని స్వపరిపాలనాధికారము క్రమక్రమముగా రావచ్చు ననియు, తత్క్షణమే స్వరాజ్యము నిచ్చినయెడల దేశపరిపాలనకు దుర్దశ ప్రాప్తించు ననియు కొందఱు చెప్పుచున్నారు.

సమాధానము

ఇప్పటికి యూరపు యంత్రమును గుఱించి చెప్పుకొనవలె నన్న, రెండు వేల సంవత్సరములనుండి క్రమక్రమముగా అభివృద్ధిలోనికి వచ్చిన పనిముట్లు విషయమై ముందుగా తెలిసికొనవలెనా? ప్రస్తుతి రాజ్యాంగతంత్రములలోని సాధకబాధకములను గ్రహించుటకు ఇప్పటి స్వతంత్రరాష్ట్రముల ప్రాగ్వ్యవస్థల నన్నిటిని మన మనుభవింపవలయునా? జపాను దేశీయులు ఏఁబది సంవత్సరములలో పాశ్చాత్యఖండవాసులు నేర్చిన దంతయు గ్రహించి తాము వారికే నూతనసంగతులను నేర్పుటకు సిద్ధముగా నున్నారు. స్వపరిపాలనాశక్తి యనుభవమువలన పట్టువడునది యని యిదివఱకే తెలియఁజేసి యున్నాము. అబ్రహాము లింకన్ అస్క్విత్తు లాయడు జార్జి ఒకూమా చంద్రగుప్తుఁడు సముద్రగుప్తుఁడు అక్బరు మొదలగు రాజ్యాంగతంత్రధురీణులు తమ స్వీకాల కాలములోనే పరిపాలనాధౌరంధర్యము నలవడఁజేసికొనిరి గాని, తమ పూర్వులు సంపాదించి పెట్టియున్న జ్ఞానము వీరికి వంశపారంపర్యముగ వచ్చలేదు. ఎన్నఁడును స్వరాజ్యమన నేమో యెఱుఁగని ఫిలిప్పైను అడవి జాతులకు స్వపరిపాలనానిపుణత్వ మెట్లబ్బెను? బ్రిటీషు పరిపాలన క్రింద 150 సంవత్సరములనుండి యున్నను, మనము స్వపరిపాలనకు తగ మని చెప్పిన యెడల, ఇది బ్రిటీషువారి తప్పే గాని మన లోప మేమియు కాదు.

ఇది గాక, స్వపరిపాలనము గల దేశము లన్నిటిలో స్వపరిపాలనయందు పొరపాట్లు లేవా? అవి తప్పులు చేసి దిద్దుకొనుట లేదా? రాజ్యాంగతంత్రపరిణామమునకు అట్టి తప్పులు చేయుటే మూలాధారము. మన మట్టి తప్పులు చేయుటకే స్వాతంత్ర్యముల నిమ్మనుచున్నాము. ఇంగ్లాండులో నెల్లప్పుడు న్యాయపరిపాలనమే యుండి పొరపాట్లు లేనిచో, ఆ దేశచరిత్రమందు వివరింపఁబడిన [illegible] తిరుగుబాట్లు దొమ్ములు రక్తపాతములు ఏల జరిగినవి? ప్రస్తుతయుద్ధములో బ్రిటిషువారు ఎన్ని పొరపాటులు చేయలేదు! ఇంత మాత్రముచేత వీరు స్వపరిపాలనకు తగ రని చెప్పవచ్చునా?

బ్రిటిషువారు తమ దేశపరిపాలనములో నెంత సామర్థ్యమును కనఁబఱచినప్పటికిని ఈ దేశమును పరిపాలించుటలో నంత్రము వారు తమ తెలివి నంతగా కనఁబఱుపలేదు. మనలను విదేశాక్రమణల బాధనుండి తప్పించి, అంతఃకలహములు లేకుండ చేసి, పన్నులు క్రమముగా వసూలు చేసి, వ్యక్తివివక్షత లేకుండ న్యాయమును నెలకొల్పిరి కాని, పాశ్చాత్యఖండములలో మిక్కిలి వెనుకఁబడియున్న చిన్న రాష్ట్రములతోఁ గాని జపానుదేశముతోఁ గాని విద్య ఆర్థికసంపద ఆరోగ్యము దేశరక్షణము వ్యక్తిస్వసంరక్షణము మొదలగు విషయములలో మన దేశమును సమానస్థితికి తేఁగాలకపోయిరి. 18 సంవత్సరములలో ఫిలిప్పైనువారు, బ్రిటిషు [illegible] లనమువారు 150 సంవత్సరముల తరువాత మన దేశములో కనఁబఱచిన విద్యాభివృద్ధికంటె నెక్కువ కనఁబఱచుచున్నారు. ఈ దేశములో చలి జ్వరమును పోఁగొట్టుటకు మన పరిపాలకులు చేయు ప్రయత్నములకంటె ఫిలిప్పైనులలో అమెరికావారును [illegible] జపానువారును చేయుచున్నవి గొప్ప [illegible] నున్నవి.

తొమ్మిదవ యాక్షేపణ

సామాన్యజనులలో విద్య యిప్పటికంటె నెక్కువ [illegible] వగ వ్యాపించినఁ గాని మనము స్వపరిపాలనకు [illegible] కొందఱు చెప్పుచున్నారు.

సమాధానము

అటు చేయకపోవుట యెవరి తప్పు? జపాను దేశమునందు నలువది సంవత్సరములలో విద్య నేర్చినవారి సంఖ్య [illegible] 28 నుండి 90 వఱకు వృద్ధియైనది. మన విద్యాశాఖకు [illegible] ధనము రాదు గాని సివిలు సర్వీసు ఉద్యోగుల [illegible] హెచ్చు చేయుటకు మాత్రము దొరకును. గోఖ్లే గారి [illegible] బోధితవిద్యాశాసనమును ఎవరు నిరాకరించిరి? విద్యాశాఖవారు కరిననిబంధనల ననుసరించి బీద జనులు పాఠశాలల కెట్లు [illegible] కొల్పఁగలరు? అది యటుండనిండు. జపానువారికి ప్రజాప్రాతినిధ్యపు హక్కులు కలుగఁజేసినపుడు సమురే జాతివారు తప్ప తక్కినవారు వ్రాయలేరు, చదువలేరు. అప్పటివలెనె మన శాసననిర్మాణ కార్యనిర్వాహక సంఘములకు చాలినంతమంది ప్రతినిధులను మన ప్రజ లిప్పుడు పంపలేరా? ఈ ప్రతినిధులే రాజ్యము చేయఁగూడదు? ఇంగ్లాండులో జాను రాజు గారి కాలమునుండియు స్వపరిపాలనము కలదు. అప్పటి ప్రభుసంఘములోనే అనేకులు అక్షరజ్ఞానము లేనివా రుండెడివారు. పార్లమెంటునకు పంపఁబడిన ప్రతినిధులలో పెక్కుమంది అక్కడి మంత్రివర్గమువారియెదుట నిలిచి మాటలాడుటకు భయపడి పాఱిపోయివచ్చెడివారు. కనుక

స్వపరిపాలన మొసంగినపుడు చదువను వ్రాయను నేర్చినవారు జన సామాన్యములో లేరు సరి కదా అనేక గ్రామములలో పాఠశాలలే లేకుండుటయు ఉన్న పాఠశాలలలో నైనను ఉపాధ్యాయులకే చదువు రాకుండుటయు సంభవించుచుండెను.

రాజ్యపరిపాలనకు విద్య అవశ్యమే లే దని మన ప్రభువుల యభిప్రాయమై యుండవచ్చును. అట్లు కానియెడల ఇంగ్లీషు భాష తెలియని మెంబర్లను శాసననిర్మాణసభల కేల నియమించెదరు? మన బి. యే. బి. యల్. మొదలగు పరీక్షల నిచ్చినవారికి కూడ మునిసిపాలిటీలలో వోటు చేయఁగల యధికార మేల యీయలేదు?

## పదియవ యాక్షేపణ

మనకు స్వపరిపాలన నిచ్చి బ్రిటిషువారు ఈ దేశమును విడిచి వెళ్ళిపోయినయెడల మన గతి యే మైపోవును? అరాజక మేర్పడి ఒకరి నొకరు హింసించి చంపుకొనెదరు. విదేశరాజులు వచ్చి మనల నణఁగద్రొక్కి బాధింతురు. మన స్వాతంత్ర్యములను ఆస్తులను భద్రముగా నుంచుకొనలేము. దేశమంతటను అశాంతి ప్రబలును. విదేశీయుల బలములను నిరోధించుటకు మనకు సామర్థ్య మేమియు లేకపోవుటచే మనము వారి బానిసలము కావలసివచ్చును.

## సమాధానము

బ్రిటీషువారిని వెళ్ళిపొమ్మని మన మెన్నఁడును కోరలేదు. మనము మన బ్రిటిషు సామ్రాజ్యములోనే చేరియుండఁగుచున్నప్పుడు, ఆంగ్లేయులు మన దేశము నేల విడువవలెను? మనకు స్వపరిపాలనము వచ్చినపుడు ఇపుడున్నంతమంది విదేశోద్యోగియులు మన కక్కఱలేదు. ఇప్పటి పెద్ద జీతములను మన మీయఁజాలము. మన యార్థికస్వాతంత్ర్యమును మన చేతులలోనే యుంచుకొని యిక్కడి వాణిజ్యవ్యాపారములను చేతిపనులను వృద్ధి చేసికొనెదము. ఈ దేశపు సంపదలో ఆంగ్లేయులు కూడ పాల్గొనవచ్చును. తక్కిన వలస రాజ్యములలోవలెనె ఆంగ్లేయులు కూడ ఇక్కడ వ్యాపారములను ఉద్యోగములను చేసికొనవచ్చును. బెల్లమున్న చోట చీమలు చేరునట్లు బ్రిటిషువారును తక్కినవారితో పాటు ఇక్కడ నుండవచ్చును. వలస రాజ్యములకువలెనే మనకును బ్రిటిషువారేల సహాయము చేయఁగూడదు? దెబ్బలు మాకును, లాభము మీకునా యని మీ రడుగవచ్చును. కాని, మనల నుద్ధరించుటకే దైవము వీరి నిక్కడకు రప్పించె నని వీరును మనలో కొందఱు పెద్దలును అనుచుండలేదా? తమ దేశమును విడిచి యీ వేండ్రపు దేశము వచ్చి అష్టకష్టములు పడి చెమట లూడ్చి మనకొఱకు ఈ తెల్లవారు తమ జీవితము నంతయు ధారపోయుచున్నా మని యేల చెప్పుకొనుచుండవలెను? కాఁబట్టి మన స్వపరిపాలనమును మనము కాపాడుకొనఁగల శక్తి మనకు కలుగువఱకు బ్రిటీషువారు ఇక్కడ నుండి తరువాత తమ కిష్టము లేనిచో వెళ్ళిపోవచ్చును. ఈ పద్ధతి వలన తమకు అన్యాయము సంభవించు నన్న పక్షమున పరమదయాళుత్వముతో ఈ దేశమును పరిపాలించుచున్నా మని వీరు చెప్పఁగూడదు. వీరివలెనే, మనమును దేశసంరక్షణకు మన ధనబలముల నుపయోగించుచునే యున్నాము.

మన దేశమును మనము సంరక్షించుకొనలేకపోవుట మన తప్పా? మనల నీ స్థితిలో నుంచినది మన ప్రభువులే. ఇండియా దేశములోని ప్రతిరాష్ట్రమునుండియు పూర్వకాలముననే గాక, బ్రిటిషు ప్రభుత్వకాలమున కూడ సైనికులు పటాలములలో చేర్చుకొనఁబడుచుండిరి. ఇప్పుడు కూడ అ విధముగనే చేయవచ్చును. ప్రతి పట్టణములోను పల్లెలోను ఐచ్ఛికసేన నేర్పఱుపవచ్చును. పటాలములలో కమిషన్డు ఉద్యోగములను తగిన యోగ్యత గల నల్లవారి కీయవచ్చును. రణవిద్యను నేర్పు పాఠశాలలను స్థాపింపవచ్చును. ప్రస్తుతయుద్ధములోనే గాక, ముందు జరుగఁబోవు యుద్ధములలో కూడ బ్రిటిషువారికి తోడై మనము నిలువఁగలుగుదుము. అప్పు డెవరును మన యింగ్లాండును తేలిపాటి చూడలేరు. మా దృష్టి పాటి నంతవఱకు ఇంగ్లాండు ఇండియా దేశములకు ఒండొంటి సహాయము అవశ్యమని తోఁచుచున్నది. ఒకవేళ, ఇంగ్లాండు అటు తలంప దేమో కాని, నిజముగా ఒకదాని సహాయము రెండవదానికి అక్కఱ యున్నది. స్నేహభావముతోనే ఈ రెండు దేశములును కలసి యుండవలెను. భవిష్యత్తు దైవాధీనము.

ఒకవేళ బ్రిటిషువారు మన దేశమును విడిచి వెళ్ళెద మని బెదరించినయెడల మన దేశములో ననేకవిప్లవములు కలుగవచ్చును. కాని, ఇవి కొలఁది దినములలోనే సద్దుకొనక తప్పవు. బ్రిటీషువారు మన దేశమునకు రాకమునుపు విప్లవములు లేవా? అవి యణఁగిపోయి దేశపరిపాలనము సెక్కదిగ జరుగుచుండలేదా? ఇట్టి విప్లవములు ప్రపంచమం దంతటను ప్రతిదేశములోను అప్పుడప్పుడు కలుగుచునే యుండును. ఇదివఱ కెల్లప్పుడును మన దేశము విప్లవములతో నిండియుండినయెడల, ఇది భాగ్యవంతముగ నుండకయే పోవును. రెండు వేల సంవత్సరములనుండి విదేశీయులు దీనిమీఁద తమ కన్ను వైవకపోయియే యుందురు. బ్రిటీషువారు ఈ దేశపు దారిద్ర్యమును చూచి వెళ్ళిపోయియే యుందురు. ఆంగ్లేయులు తమంతట తాము దేశమును విడిచి వెళ్ళిపోవుదు రేమో యని భయపడ నక్కఱ లేదు. వారు వెళ్ళరు, వెళ్ళఁదలఁచుకొనలేదు. మనము వెళ్ళుఁ డని యెన్నఁడును కోరము.

## పదునొకండవ యాక్షేపణ

వర్ణభేదము లుండుటను బట్టియు అంటుముట్టరాని జాతు లేర్పడుటను బట్టియు ఈ దేశస్థులు స్వపరిపాలనకు తగరు.

## సమాధానము

అమెరికా దేశములో అనేకలక్షల నీగ్రో జాతివా రున్నారు. వారిని అమెరికావారు మన మాలలవలెనే చూచెదరు. అమెరికా సంయుక్తరాష్ట్రములలో కొన్ని చోట్ల, నీగ్రో జాతివారినే గాక

$\frac{1}{8}$ $\frac{1}{16}$ భాగము నీగ్రో రక్తము గలవారిని కూడ తెల్లవారు పెండ్లి చేసికొనఁగూడ దని చట్టము లేర్పడియున్నవి. తెల్ల స్త్రీని కన్నెత్తి చూచినను ముట్టుకొన్నను నీగ్రోవానిని విచారణ లేకుండ ఎముకలు విఱుగఁ గొడిచెదరు. తెల్లవా రున్న పేటలలో నీగ్రో లుండఁ గూడదు. రైల్వే ట్రెయినులలో నీగ్రోలకు ప్రత్యేకపు డబ్బాల నేర్పఱచెదరు. ఇంగ్లాండులో సైతము తెల్లవారిలోనే పెక్కు తరగతు లేర్పడి యేకపంక్తిని భోజనము చేయుటకు కూడ ఇష్టపడరు.

## పండ్రెండవ యాక్షేపణ

విద్యార్థులు మిక్కిలి కొంచెముగా నుండుటచేత సామాన్య జనుల సుఖదుఃఖములు కష్టనిష్ఠురములు వీరి కంతగా తెలియనేరవు గనుక వీరు ప్రజాప్రతినిధులుగా నుండుటకు పనికిరారు.

## సమాధానము

ఈ యాక్షేపణలో కొంచెము నిజ మున్న దని యొప్పుకొన్నను ఈ విద్యార్థులకంటె తెల్ల దొరల కింకను తక్కువగ నున్నారు. ఈ దొరలకు దేశభాషలు రావు. వీరికిని ప్రజలకును భాష మతము ఆచారము మొదలగువానిలో మిక్కిలి వ్యత్యాస ముండుటచేత వీరికి ప్రజల విషయమై బాగుగా తెలియదు. ఈ దేశపు విద్యార్థులు ప్రజలలోనుండియే బయలుదేఱినవారు. వీరిలో పెక్కుమంది పల్లెలలో పుట్టి పెరిగినవారు. ప్రజల భాషలనే మాటలాడుచు వారి యాచారవ్యవహారములనే యవలంబించువారు కాఁబట్టి, వారి సుఖదుఃఖములలో పాల్గొనఁగలుగువారు. వారి పక్షమున మాటలాడుటకు అధికారము గలవారు. వీరిలో పెక్కుమంది తమ ధన శరీరములను తమ సోదరుల కుచితముగ ధారపోయుచున్నవారు. ఏ తెల్ల యుద్యోగియైనను తన జీవితకాలములో ప్రజల యిండ్లలో ఒక గడియ గడపలేదు. తన భాష నెఱుఁగనివారితో ఎన్ని నిమిషములు ప్రసంగింపఁగలఁడు?

ప్రతి దేశములోను స్వల్పసంఖ్య గల విద్యార్థులే రాజ్యపరిపాలన చేయుచున్నారు. వీ రెక్కడను మితసంఖ్యాకులే. దక్షిణాఫ్రికాలో తెల్లవారు కొలఁదిమంది మాత్రమే యున్నారు. ఇంగ్లాండు దేశమును ఇప్పటి యున్నస్థితికి తెచ్చినది అల్పసంఖ్యాకులగు విద్యార్థులే.

## పదుమూఁడవ యాక్షేపణ

స్వపరిపాలన కొసంగుటవలన లాయర్లే రాజ్యము చేయుదు రనియు వీరి మాట మిలిటరీ యుద్యోగీయులు విన రనియు వీరి యాజ్ఞలను మన్నించువారు ఎవరును ఉండ రనియు కొందఱు వాదించుచున్నారు.

## సమాధానము

సేనలలో చేరువా రందఱు సామాన్యప్రజలే కనుక వారికిని ఇతరులకును వైషమ్యము లుండవు. వకీలు రాజ్యము రాఁబోవు నని భయపడ నక్కఱ లేదు. ప్రజాప్రతినిధులు అన్ని తరగతులనుండియు నెన్నుకొనఁబడుదురు. ఇంతే గాక, పరిపాలనలో చాల భాగము తగిన చట్టములను నిర్మించుట వాని ప్రకారము ప్రజలను నడపించుట. గనుక ప్రతిదేశములోను ఎక్కువమంది న్యాయవాదులు రాజ్యపరిపాలనలో పాల్గొనుట సహజము. ఆంగ్లేయమంత్రివర్గములో కూడ లాయ ర్లున్నారు. సేనలు నౌకాదళము సివిలు అధికారమునకు ఎల్లప్పుడును లోఁబడియుండవలెను. కాఁబట్టి, మంత్రివర్గమువారు ఎల్లప్పుడును మిలిటరీ శాఖలోనుండి గాక సామాన్యప్రజలలోనుండియే యేర్పడుచుందురు.

## పదునాల్గవ యాక్షేపణ

మన దేశములో ప్రజాప్రతినిధుల నియమించుకొనుటకు తగిన యోగ్యత గల పెద్ద సంఘములు లే వని యధిక్షేపించుచున్నారు.

## సమాధానము

మొదట ప్రజాప్రతినిధిసంఘముల నేర్పఱచినప్పు డి ఇంగ్లాండు కనడా జర్మనీ మొదలగు దేశములలో మంచి యోగ్యతా లక్షణములు గల నిరక్షరకు లుండిరి గాని ఫిలిప్పైను దీవులలో మొదట నున్న రెండు లక్షల నియామకులు కొలఁది మాసముల క్రిందటనే యెనిమిది లక్షలుగ వృద్ధియైరి. మనకంటె వీ రెక్కువ నాగరికత కలవారు కారు. ఈ నేటి ప్రకారమే ప్రతినిధుల నెన్నుకొనెడి యధికారమును పెంచవచ్చును. ఫిలిప్పైను దీవులలో 90 లక్షల జను లున్నారు. వీరిలో సగముమంది మగవా రనుకొన్నయెడల, నూటికి పదునేడుగురు వంతున నియామకు లేర్పడిరి. మన దేశములో నూటికి నలుగురైనను తమ ప్రతినిధుల నేలుకొనుటకు తగియుండరా? మన దేశములో 1911-వ సంవత్సరపు జనాభా లెక్క ప్రకారము సగటున నూటికి ఎనమండ్రు మగవారు ఇరువది సంవత్సరముల పైఁబడిన వయస్సు గలవారు వ్రాయను చదువను నేర్చినవారు ఉన్నారు. న్యూజీలండులో మెవోరీలు దక్షిణాఫ్రికాలో కాఫర్లు హాటెంటాటులు మొదలగువారికి ప్రతినిధుల నెన్నుకొనెడి యధికార ముండఁగా, మన యిండియనులు వారికి తీసిపోయిరా! ఆస్తియు విద్యయు ఈ రెండు యోగ్యతలు కూడ నుండవలె నన్నను, మనము పై యడవి జాతులకు తీసిపోము. ఇది గాక, స్వపరిపాలన మొసఁగినఁ గాని, మన ప్రభువులు కావలె ననియెడు సంఘసంస్కరణములు గాని విద్యావ్యాపనము గాని ఆర్థికాభివృద్ధి గాని ప్రజలకు శీఘ్రకాలమున కలుగవు.

MR. S VENKATACHALAM CHETTY



సామి వేంకటాచలము శ్రేష్ఠి గారు

MR. T. NAGAYYA CHETTY



తాతా నాగయ్య శ్రేష్ఠి గారు

MR. K. NAMMALWAR CHETTY



కూనపాటి నమ్మాళ్వారు శ్రేష్ఠి గారు

MR C YELAMANDA CHETTY



చిన్ని యెల్లమంద శ్రేష్ఠి గారు

MR. B VENKATASUBBAYYA CHETTY



బచ్చు వేంకటసుబ్బయ్య శ్రేష్ఠి గారు

MR. V SUBBAYYA CHETTY



పూరా సుబ్బయ్య శ్రేష్ఠి గారు

MR M VENKATASUBBA ROW, B A, B L



ముస్తా వెంకటసుబ్బారావు బి.ఏ., బి.ఎల్.

MR K V RAGHAVA CHETTY



ల్లా వేంకటరాఘవ శ్రేష్ఠి గారు

Dr N VENKANNA DEVAR



డాక్టరు నాదెళ్ల వెంకన్న దేవర గారు

K N LAKSHMIKANTAM



నాళము లక్ష్మీకాంతము గారు

MR N VENKATARATNAM



నాళము వేంకటరత్నము గారు

MR P VISWANATHAM



పేయూరి విశ్వనాథము గారు

# భారతజాతీయోద్యమాభ్యుదయము

చాగంటి శంకరశాస్త్రి గారు

ఆసేతుహిమాలయపర్యంతమును భారతభూమియం దిప్పుడు జాతీయభావప్రవాహము వెల్లువలై పాఱుచున్నది. దానికి యుద్భవము లెల్లెడలను మాఱుమ్రోగుచున్నవి. ఇది క్రొత్త విషయము కాదు. ఇదివఱకే అనేకులు దీనిని గుఱించి వ్రాసియున్నారు. కాని, అనేక కారణములవలన తదీయవృత్తాంతపునరుల్లేఖన మావశ్యకము. నిరంతరమును మన మానసములు జాతీయతాస్మరణమునే యపేక్షించుచుండుట దీనికి మొదటి కారణము. సర్వకాలసర్వావస్థలందును సకలదినచర్యలయందును మన తలంపు లావంకకే మరలుచుండుట మన కనుభవమువలన తెలియును. అంతియ గాక, ప్రియవస్తుమననము ప్రియవస్తుసందర్శనమువలెనే యెల్లప్పుడును హృదయాహ్లాదకరము. అనుభవించిన కొలఁది ప్రేమరసమును చిలుకుచునే యుండును. కమలములు అనుదిన దృష్టిగోచరం బగు భాస్కరబింబమును దర్శించినంతనే వికసింపక మానవు. చిరపరిచితము లైనను, సుధాకరుని శీతలకిరణములు హృదయకల్హారమును సోఁకి హాయి కలిగింపక పోవు. అన్యోన్యమైత్రీబద్ధులగు స్నేహితుల హృదయలతలు పునస్సమాగమము సంధిలినప్పుడెల్ల మఱింత పెనఁగొని మోదావహములై పిలకల్లును. ప్రతిమానవునకును మిత్రసంస్మరణము సదా సంతసమునే సంఘటించును. అట్లే దేశభక్తిపూరితు లైన ప్రజలు జాతీయమహత్త్వసాధన మైన జాతీయోద్యమవృత్తాంత మన్న ప్రముదితహృదయులు కాక మానరు. తత్కథలు వారికి హర్షామృతధారలు. దాని తలంపులు చిత్తనైర్మల్యసంధాయకములు. మఱియు, జాతీయభావము దినదినప్రవర్ధమానము. ఇప్పటి కనేకరూపములను దాల్చినది. ఎన్నియో మార్పులను పడసినది. ఇంకను నూతనమార్గముల ననుసరించుచున్నది. దాని స్వభావమును నిర్ణయించుట సుకరము గాదు. దాని ననేకులు వివిధదృక్పథముల నీక్షించి యనేకవిధముల వర్ణించియున్నారు. కాని, క్రొత్త దృక్పథము లెఱింగి యరయువారి కింకను గణింపరాని క్రొత్త వింత లందు గోచరింపక పోవు. కావుననే లబ్ధవర్ణు లెన్ని మాఱులు లానరించినను పిసుగు జనింపనేరదు. అంతియ కాక, చింతన మొనర్చిన కొలఁది పవిత్రమైన జాతీయభావ మత్యద్భుతముగా మన మనముల నాకర్షించుచుండును. వినుచున్న కొలఁది హృదయక్షేత్రమున తదభిమానబీజము గాటముగ నాటుకొని త్వరలో నభివృద్ధి నొంది పరిపూర్ణతను పడయుటకు తోడ్పడును. ఇదియే నాటి యుద్యమముల విజయమునకు వలె జాతీయోద్యమవిజయమునకును గల పరమరహస్యము. కాని, చంద్రామృతకామధేన్వాదిసద్వస్తుసంతతుల కాకరం బైన పావనతోయములనుండి హాలాహలమును మథించు నిపుణులును గలరు. వారికి జాతీయభావ మొక పెను భూతము. అందంతర్యామిత్రము లైయున్న దివ్యశక్తులు భావోద్రేకోన్మత్తుల చిత్తచాంచల్యకల్పితము లని వారి యభిప్రాయము. కాని, యేటి కెదురీఁద నెంచుట వట్టి యవివేకము. జాతీయభావవిలసనమును నేఁడు కనుఁగొననేరనివాఁడు దృష్టిమాంద్యపరిపీడితుఁడు. దురవగాహ మైన దాని తత్త్వము నెఱింగినవాఁడే కుశాగ్రబుద్ధి. ప్రబల మైన తత్ప్రేరణలను పరిశీలింపఁగలవాఁడే చతురుఁడు. అజేయము లైన దాని శక్తులను పరిరక్షించి పెంపొందించువాఁడే రాజనీతిజ్ఞుఁడు.

ఐరోపాఖండమునందు జాతీయోద్యమము లావిర్భవించి యొనరించిన మహోద్యమ కార్యము తెలియనివారికి హిందూదేశమున నేఁడు ప్రబలియున్న జాతీయభావప్రభావము సుబోధ్యము కాదు. ఐరోపాదేశచరిత్రమునందు 19-వ శతాబ్ది జాతీయభావోద్భవమునకును ప్రజాప్రభుత్వాభిలాషకును ప్రసిద్ధి వడసినది. ప్రతిదేశమునందును ప్రజలలో నాత్మావబోధ మంకురించెను. స్వాతంత్ర్యప్రియత్వము విస్ఫుట మాయెను. నిరంకుశాధికారము ననుభవింపనేరక జనులు ప్రజాప్రభుత్వనిర్మాణమును స్వచ్ఛందవృత్తిని కోరిరి. పరదేశీయుల యేలుబడికి లోనై యున్న జనులు తమ సేవకవృత్తిని వీడి స్వపరిపాలనమును వాంఛించిరి. జాతిసైకమత్యమును గోల్పోయి తమలో కొందఱు కొందఱొక్కొక్క దేశపు పరిపాలనకు లోఁబడియున్న యేకజాతి ప్రజలు తమ యేకీభావమును పడసి యేకప్రభుత్వ సంస్థాపనము నొందుట కువ్విళ్లూరసాగిరి. ఈ విధమున ప్రతిదేశమునందును మహత్తరమైన సంచలన మొకటి యుద్భవించెను. గ్రీసు దేశము టర్కీ సుల్తాను ప్రభుత్వమునుండి విముక్తమై స్వాతంత్ర్యమును పడయఁగోరెను. ఫ్రాంసు దేశమున నిరంకుశత్వముపై క్రోధ ముదయించెను. ఇంగ్లండు దేశమున ప్రజలు విరివి ప్రభుత్వమున తగిన పాలు కావలయు నని యాందోళనము సేయసాగిరి. హంగేరియా నాస్ట్రియా పాశబంధములనుండి విడలంగుట కుద్యమించుచుండెను. ఇందు కొన్ని విఫలము లైనను పెక్కు యత్నములు కొనసాగెను. కాని, వీని యన్నిటికంటెను ముఖ్య మైన దేశము లిటలీ జర్మనీలు. జాతీయభావ మీ దేశములం దత్యుగ్రముగ విజృంభించెను. చిరకాలమునుండి ఇటలీ తన ప్రాభవముతోఁ బాటు స్వాతంత్ర్యమును గూడఁ గోల్పోయి పందొమ్మిదవ శతాబ్ది యారంభమున కొంత భాగ మాస్ట్రియా పరిపాలనము క్రిందను కొంత భాగము క్యాథలిక్కు మతాధిపతి యైన పోపు నధికారము క్రిందను కొంతవఱకు ఫ్రాంసుదేశాధిపత్యము క్రిందను వేఁగుచుండెను. ప్రజల కీ స్థితి మిగుల దుర్భర మై యుం

డెను. నిశ్వప్రయత్నము లొనరించి కష్టసుఖముల కోర్చి ప్రాణధనాదులను ధారపోసి యొట్టకేల కిటాలియనులు సఫలమనోరథులై జాతీయైకమత్యమును స్వాతంత్ర్యమును పడసిరి. జర్మనీ సామ్రాజ్యమునం గూడ నెపోలియను కాలమునుండియు ప్రజలలో సామాన్య మైన జాతీయభావ ముదయించెను. కాని, వారి మనోభీష్ట మీడేరుట కనేకాటంకములు దాపరించెను. గాంభీర్యమును స్థైర్యమును పట్టుదలను బూని జర్మని ప్రజలు తమ సంకల్పమును సాధింపఁ బ్రయత్నములు సలిపిరి. అంతమంది ప్రజల యాప్సితార్థ మీడేరకుండఁ జేయుట కెవ్వరికి సాధ్య మగును? తుదకు జర్మనీ విజయలక్ష్మిం గాంచెను. ఒకరి నొకరు కొడఁబాసి పసుల రీతిని చరించిన యిరువది యైదు రాష్ట్రములలోని ప్రజలు నేకకుటుంబమునఁ గలసి చిరవాంఛిత మైన సంఘీభావమును పడసిరి. అప్పటినుండియే జర్మనుల ప్రతిభ ప్రారంభమయ్యెను. ప్రపంచ మెల్ల వారి వైభవాభివృద్ధులను సంభ్రమాశ్చర్యములతో వీక్షింపసాగెను. ఇప్పుడు జర్మనీ లోకము నంతటికిని అప్రతిమాన మైన తన పరాక్రమముచేతను అపూర్వ మైన తన బుద్ధిమహిమచేతను ఎట్లు బింతగొల్పుచున్నదో మనము ప్రత్యక్షముగ జూచి యనుభవించుచున్నారము. ఇప్పటికిని జాతీయభావమే యూరపుఖండమున ప్రజ్వరిల్లుచున్నది. జాతీయోద్యమమే ప్రజల మనములందు తాండవమాడుచున్నది. జాత్యభిమానోత్సాహమే వారి రక్తనాళములందు ప్రవహించుచున్నది. కాని, అది పారమార్థికము కాదు. కాల పరిస్థితులను బట్టి హిందూదేశమున పావన మైన జాతీయోద్యమ ముత్పన్న మగుట సహజమే కాని యందు విచిత్ర మేమియు లేదు.

కాని, స్వార్థపరులును సమానగుణవిదూరులును సత్యాగ్రహణశక్తివిహీనులును నెక్కుడు హిందూదేశమున జాతీయభావ మంకురించుట యే మని పరిహసించిరి. వట్టి యసంభవ మని పలుక సాహసించిరి. జాతీయతకు ఏకమతమును ఏకభాషయు జాతిబాంధవ్యమును ముఖ్యాధారము లనియు, హిందూదేశము వివిధమతములకును వివిధభాషలకును వివిధజాతులకును వివిధాచారవ్యవహారములకును పుట్టినిల్లగుటంజేసి ప్రజలలో నన్యోన్యానురాగమును సౌభ్రాతృత్వమును జాతీయతయు విలసిల్లు నను తలంపు స్వప్నసదృశమనియు వారు వాదించిరి. ప్రపంచచరిత్ర పఠించినవారికిని ఐరోపాదేశపరిస్థితు లెఱింగినవారికిని ఈ వాదములందలి సారము (నిస్సారత) గ్రాహ్యము కాకపోదు. నేఁ డనేక దేశములలో వేర్వేఱు మతముల నవలంబించియు ఏకజాతీయతను పడసిన ప్రజ లెందఱో యున్నారు. యూరపు ఖండమున సాధారణముగా ప్రతిదేశమునందును రోమను క్యాథలిక్ మతస్థులు కొందఱును ప్రొటెస్టెంటు మతస్థులు కొందఱును గలరు. ఈ మతములలో మరల నెన్నియో యంతర్భాగము లున్నవి. ఈ వివిధమతస్థులును ఒకానొకప్పుడు పరస్పర వైరములు బూని మతాభిమానోన్మాదప్రేరితులై యొండొరులతో సంకులసమరముల నొనరించి రని చరిత్ర చాటుచున్నది. అట్లే ఇంగ్లండునందుఁ గూడ రెండు మూడు వందల యేండ్ల క్రిందట శోణితములు రణరక్తారుణమై బీభత్సస్వరూపమును దాల్చియుండెను. తరువాత ప్రొటెస్టెంటు మతస్థులు విజయులై క్యాథలిక్కు మతస్థుల నుద్యోగములను గూడ నీయక వారిని పలుతెఱంగుల హింసించిరి. మతము పేరిట రాక్షసకృత్యములు గావింపఁబడెను. ఘోరసంగ్రామము లటుండ, క్రూరవధ లనేకములు జరిగెను. చిత్రహింసలు వేనవేలు చేయఁబడెను. క్రోధము పట్టము గట్టుకొని రాజ్య మేలెను. పరమతసహిష్ణుత పరమధర్మముగ పందొమ్మిదవ శతాబ్ది యారంభమునుండియే పరిగణింపఁబడ ప్రారంభించెను. ఇట్టి తీవ్రమతభేదము లున్నను ప్రజ లచ్చట జాతీయభావసంప్రేరితులై యుండ, హిందూదేశమున మాత్రము వివిధమతము లుండుట జాతీయత కెట్లు భంగ మాపాదించునో యూహింప శక్యము గాకున్నది. అంతే గాక, హిందువులు సాత్త్వికులు; హిందూమతము పరమతసహనమున గణుతికెక్కినది. మతభేదములు వారిలో నన్యోన్యానురాగమున కంతరాయములు కానేరవు. వివిధభాషలవలన హిందూదేశమందు జాతీయత యేర్పడుట దుస్సాధ్య మను వాదము నిట్లే హేతురహితము. బ్రిటిషు దీవులలోని ప్రజలు ఇంగ్లీషు గాలికు వెల్షు మొదలగు వివిధభాషలను మాటాడుట లేదా? స్విట్జర్లండులోని ప్రజ లందఱు నొక భాషనే మాటాడుచున్నారా? అమెరికాలో పమునాల్గు భాషలు వాడుకలో లేవా? ఆస్ట్రియాహంగేరిలో నిరువదియైనిమిది భాషలు మాటాడువా రున్నను, అది యొక దేశ మనిపించుకొనుట లేదా? హిందూదేశమున మాత్ర మీ భాషాసమస్య జాతీయతాసందర్భమున నేల రావలయును? మఱియు, ఇందు వివిధభాషలు వాడఁబడుచున్నను హిందువుల ముఖ్యగ్రంథము లన్నియు సంస్కృతభాషయందే రచియింపబడియుండుటవలన దేశమున నెల్లెడలను నొక విధమైన భావము ప్రబలియుండుట ముఖ్యముగా గమనింపవలసిన విషయము. ఇఁక జాతిభేదములను గుఱించి యొకింత విచారింతము. ఇటలీలోని ప్రజ లనేకజాతులవారు. అమెరికా యన్ననో, దేశాంతరములగు ఫ్రాంసు ఇంగ్లండు జర్మనీ మొదలగు సమస్తయూరపుదేశస్థులకును నివాసస్థలము. మఱియు, ఫ్రాంసు గాస్కను పికార్డు బోర్గునిర్దను మొదలగు వివిధవ్యక్తిత్వము లున్న ప్రజలు గలసి యొక దేశ మయ్యెను. ఇంగ్లండులోఁ గూడ క్రిస్తుశకమునకు ముందు లెక్క లేనన్ని జాతులవారు సమ్మిళితులై రని చరిత్ర ఘోషించుచున్నది. అట్లయినను, హిందూదేశమున మాత్ర మే యేకజాతివా రుండుట యెట్లావశ్యక మన్ననో గ్రహింపరాదు. జాతీయత భావమునందును మనస్సులయందును నేఁ డుండి రేపు పోవుడి యల్పసంఘాచారవ్యవహారములమీఁద నాధారపడి లేదు. మనఃపూర్వకమే జాతీయభావమునకు తావు. నానాకష్టము సమసుఖదుఃఖానుభవమును సామాన్యజాతీయచారిత్రమును దాని కాయువుపట్టులు. నిర్దుష్ట మైన సరిహద్దులు గలిగి యథార్థ మైన స్వభూమియై 'ఇది మాది' యని పేర్కొనఁదగిన యేకభూఖండమును గలిగియుండుటయే జనులలో జాతీయత యలవడుట కత్యంతావశ్యకము. ఈ యన్ని విషయములందును హిందూదేశ మే యితరదేశములకును దీసిపోదని విద్యావంతులకు తెల్లమే. ప్రఖ్యాతము లైన హిమవత్పర్వతములు పెట్టని కోటలై యుత్తరమున పరిఘవిల్ల

తక్కిన మూఁడు దిక్కులను మహాజలనిధిపరీతమై విలసిల్లుచున్న భారతభూమిచే సురక్షితులైన ప్రజలయందు దేశీభావ సంకురించుటలో విపరీతమేమున్నది? నాగరకతయందన్ననో, హిందూభూమి ప్రపంచములోని నాగరకదేశనక్షత్రమండలమున గగనమణివంటి దని పేర్గన్నది. యూరపుసందలి సకలదేశములలోను జను లడవి మృగములవలె చరించుచు నాగరకత యన్న నేమో యెఱుంగకయున్న సమయమున హిందూదేశ మత్యుత్కృష్టదశయందు శోభిల్లుచుండెను. ఆ దినములలో ఈ మహాదేశమందు మతములలో నెల్ల శ్రేష్ఠమైన హిందూమత ముద్భవించెను. అనుపమమైన విజ్ఞానతేజము తేజరిల్లెను. అవక్రమైన పరాక్రమము విరాజిల్లెను. అప్రతిమానమైన శాస్త్రప్రాభవము భాసిల్లెను. అద్వితీయమైన కళాభివృద్ధి వర్ధిల్లెను. జ్ఞానాగారము లనఁదగు గ్రంథము లెన్నియో దేవలిపియందు లిఖింపఁబడియున్నవి. శిల్పనైపుణ్యము మూర్తీభవించెనా యను భ్రమను గొలుపు భవనము లెన్నియో నిర్మింపఁబడియున్నవి. విశ్వసంతతికిని లక్షణమైన యాదిమగ్రంథము లనఁదగు వేదములకు హిందూదేశమే జన్మభూమి. ప్రకృతిసౌందర్యమునకు హిందూదేశము తావలము. ప్రకృతిసౌభాగ్యమునకు హిందూదేశ మాలవాలము. ఇట్లత్యంత నాగరకతాప్రభాభాసమానమై మహామహుల సంతతిని పుట్టించిన జనులలో జాతీయభావమున కవకాశము లేదనుట సూర్యునికి కాంతి లేదనుట, అమృతమున మాధుర్యము లేదనుట, పంకజమున మకరందము లేదనుట. హిందువుల హృదయముకుములలో నీ జాతీయభావము ప్రసన్నమై యుండునట్లొనరించు సాధనము లెన్నియో యున్నవి. దేశమునందెల్లెడలను భారతభాగవతాదిమహాపురాణము లొకవిధముగనే వ్యాపించి పూర్వచారిత్రములను పుణ్యకథలను ప్రజలకు బోధించుచున్నవి. రామకృష్ణాదిజగద్వీరుల నారందఱును దేవాంశసంభూతులుగా పూజించుచుందురు. అన్ని మూలలనుండియు జనులు గంగ గోదావరి కావేరి మొదలగు పావననదుల సలిలములలో జలకమాడి పరిశుద్ధమనస్కులై యరుగుచుందురు. కాశిగయాద్వారకాది పుణ్యక్షేత్రములను దర్శించుచుందురు. వారి పురాణములయందీ నదులును పట్టణములును పర్వతములును పవిత్రప్రదేశములుగా వర్ణింపఁబడియున్నవి. ప్రతిసంవత్సరమును జాతీయవిషయస్మరణచిహ్నము లయిన పర్వదినముల నెన్నిటినో వారు గమనించుచుందురు. ప్రతిదినమును ప్రాతస్సాయంసమయములయందు వారు పవిత్రములైన మంత్రములతో భారతజాతీయులను స్మరించుచుందురు. హిందువుల మాట యటుంచి, మహమ్మదీయుల మాటయు ఇతరుల మాటయు చెప్పవలెనని కొందఱు ప్రశ్నింపవచ్చును. మహమ్మదీయులు పెక్కువేలేండ్లనుండి హిందూదేశమున స్థిరనివాస మేర్పఱచుకొని హిందువులతోఁ బాటు సుఖదుఃఖముల ననుభవించుచు పరస్పరభేదములను మఱచి ప్రవర్తిల్లుటచే హిందూజాతియం దైక్యమై యేకజాతీయచారిత్రమును పొందిరి. విద్యాభివృద్ధి కలిగిన కొలఁది వారీ విషయమును బాగుగ గ్రహించి హిందువులతో పూర్ణసమ్మేళనము నొందెద రనుట నిశ్చయము. చరిత్రపాఠకు లీ జాతీయత నిజమైనదే యని యొప్పుకొనక మానరు. ఇఁక పార్సీ లన్ననో, వారు మనోవాక్కాయకర్మములచే నెల్లప్పుడును తమ్ము తాము హిందూదేశస్థులుగనే భావించుకొని హిందువులతో కలసి మెలసి మెలఁగుచున్నారు. హైందవక్రైస్తవులు కూడ నంతకంతకు తాము భరతపుత్రులమే యని గ్రహించి వారితో నేకీభవింపఁ గడంగుటచే జాతీయాంతరాయసమస్య కిప్పు డవకాశమే లేదు. ఇట్లు జాతీయభావాభివృద్ధి కవశ్యమైన సౌకర్యము లన్నియుఁ గలిగి యైకమత్యముతో చరించు భారతీయులలో జాతీయత నెంపొందుట యసంభవ మని పలుకుటకు సత్యవ్రతప్రియుల కెవ్వరికి నాలు కాడును? మొట్టమొదట కొంత కాలము భారతీయులే యజ్ఞానవశులై యీ విషయములను గ్రహింపకపోయినను, ఏ మాత్రము కను విచ్చినను వారికే నిజము ప్రత్యక్షము గాకుండునా?

హిందూదేశమున జాతీయభావము జనించి యభివృద్ధి నొందిన విధము మిగుల చిత్రమైనది. తత్పూర్వము దేశమునఁ గల పరిస్థితుల నవలోకించినచో దాని జననవిధానకారణములు బోధపడఁగలవు. తూర్పు ఇండియా వర్తకసంఘమువారి పరిపాలనము క్రింద నున్నంత కాలమును హిందూదేశ మత్యంతదుస్స్థితియం దుండెను. అన్యాయము పక్షపాతము నీతిబాహ్యత మొదలగు దోషముల కన్నిటికిని ఆ ప్రభుత్వ మాకరమై యుండెను. నందకుమారుని యధర్మశిక్షణమును వారన్ హేస్టింగ్సు నపరాధవిచారణమును ధ్యానించినచో అప్పటి ప్రభుత్వపద్ధతి నూహింపవచ్చును. 1858-వ సంవత్సరములో విక్టోరియా మహారాజ్ఞి వర్తకసంఘమునుండి దేశప్రభుత్వమును స్వీకరించిన వార్త విని ప్రజలు సంతోషాతిరేకమున పొంగిపోయిరి. తమ కష్టములు గట్టెక్కి సుదినములు ప్రాప్తించిన వని వారు హర్షించిరి. కాని, అది యంతయు చిత్తవిభ్రమణ మని త్వరలో స్ఫుటపడెను. హిందూదేశమంత్రి పూర్వపు పరిపాలకులకన్న నెక్కుడు నిరంకుశాధికారి యయ్యెను. పౌరుషప్రతాపములతో భాసిల్లిన భరతవీరుల నాయుధవిహీనులఁ గావించెను. సేవకవృత్తియే ప్రముఖమై, ప్రజలకు గౌరవము శూన్యమయ్యెను. భారతరాజ్యలక్ష్మి తేజోవిహీనయై కుమారుల పాట్లు గాంచి వెలవెలఁబోవుచుండెను. అప్పుడప్పుడే బయలుదేఱుచున్న దేశీయపత్రికల యాక్రందనధ్వను లరణ్యరోదనము లయ్యెను. దేశమున నలుగడల నశాంతి వ్యాప్తమయ్యెను. శాంతిమూర్తులును నిర్మలచిత్తులును నైన భారతీయులు కోపాగ్రహప్రకంపితులు కాఁజొచ్చిరి. తమ దుస్స్థితికి పరిహార మేమని వారు చింతింపసాగిరి. వారి హృదయములు విశాలభావవిస్ఫురితము లయ్యెను. తమలోని యేకజాతీయతను వివిధప్రదేశములవారును గ్రహింపఁ దొడంగిరి. నాయకులు మేలుకొనుచుండిరి. అట్టి తరుణమున ధర్మమూర్తియైన హ్యూము గారు హైందవుల పాలిటి దేవదూతయై పరిణమించెను. భరతపుత్రులు నిద్రనుండి మేల్కాంచి పురుషులై ప్రవర్తించి దేశసంరక్షణమునకు నడుము గట్టి పుత్రధర్మమును నిర్వహింపవలె నని విద్యాధికుల నతఁడు ప్రేరేపించెను. అతని ప్రోత్సాహము వ్యర్థము కాలేదు. జాతీయరాజకీయసంఘ మొకటి స్థాపింప

వహించను నుత్సాహాలను విద్యార్థులందఱి కల్ల నావిర్భవింపచేసెను. ఆ ప్రయత్నములకు ఫలమై 1885-వ సంవత్సరము డిసెంబరు నెల 28-వ తేదీ సోమవారము మధ్యాహ్నము దేశీయమహాజనసభ ప్రారంభ మయ్యెను. ఈ మహాసభకు పూర్వము చెన్నపట్టణము బొంబాయి కలకత్తా మొదలగు ముఖ్యప్రదేశములలో రాజకీయ సంఘములు లేకపోలేదు. దేశీయమహాజనసభాప్రారంభమునకు కించుక పూర్వమే కొన్ని స్థలములందు జరగిన రాజకీయ సమావేశములకు వివిధ భాగములనుండి కొందఱు భారతీయులు వచ్చిన మాటయు వాస్తవమే. కాని, స్థిరముగా వేర్వేఱు ప్రదేశములనుండి భారతీయుల సంతతి నొక్కెడ చేర్చి జాతీయసమ్మేళనమునకు మూలాధార మైన పుణ్యస్థలము దేశీయమహాసభారంగమే యని చెప్పవచ్చును. అసూయాపరు లుపేక్ష వహింపలేదు. శత్రువులు లేక ప్రజ్ఞను చూపక పోలేదు. వారు దేశీయమహాజనసభ జాతీయసభ కాదనిరి. అందలి సభ్యులు ప్రజాప్రతినిధులు కారనిరి. వారి కోర్కెలు ప్రజాక్షేమంకరములు కావనిరి. కాని, వీనివలన ప్రయోజన మేమియు కలుగ దయ్యెను. అధికారులు కూడ కొంత కాలమువఱకును దేశీయమహాసభాదర్శముల నామోదించుచుండిరి. నిజముగా మొట్టమొదట హ్యూము గారితో నతఁడు సంప్రదించిన మహాసభ రాజకీయసభగా నుండవలె నని చెప్పి ప్రోత్సాహపఱచినవాఁ డప్పటి గవర్నరు జనర లైన డప్ఫెరిను ప్రభువే.

దేశీయమహాజనసభతో భారతదేశమున నూతనయుగ మారంభించెను. జాతీయోద్యమమునకు దేశీయమహాజనసభ ముఖ్యస్థానము. తత్సభావేదికపైనుండి భరతఖండమున జన్మించిన ప్రసిద్ధపురుషు లనేకులు నిజగాంభీర్యవచోధారల హిందూప్రజల వాంఛితములను ప్రభుత్వమువారికిని లోకమునకును వెల్లడి చేసిరి. ఆ వాంఛలందు ప్రియతమ మైనది స్వాతంత్ర్యాభిలాష యని వారు స్పష్టపఱచిరి. బ్రిటిషు సామ్రాజ్యములోని యితరభాగములకువలె హిందూదేశమునకును స్వపరిపాలన మొసంగవలె నని వా రుద్ఘోషించిరి. అన్నిటికంటె ముఖ్యముగా జాతీయజీవనబీజమును వారు దృఢముగా దేశమున నాటిరి. 1885-వ సంవత్సరమునుండి 1906-వ సంవత్సరమువఱకు నిరువదిరెం డేండ్లు నిరాఘాటముగా దేశీయమహాజనసభ మహావైభవముతో జరుపఁబడెను. 1907-వ సంవత్సరము దాని సుఖజీవనమున నొక మహావిపత్తు సంభవించుటయు అతికష్టముమీఁద నది యాగండమును గడచుటయు అందఱు నెఱిఁగియే యున్నారు. సూరతునందు సభ జరుగుటకు నిశ్చయ మయ్యెను. కాని, అప్పటికి నాయకులలో బలవత్తరము లైన యభిప్రాయభేదము లంకురించుటచే సభావేదికపై గొప్ప పోరాట మయ్యెను. సభాభవన మంతయు నల్లకల్లోలము పాలయ్యెను. సభ జరుగుటకు వీలు లేకపోయెను. జాతీయవాదులలో కొందఱు అప్పటినుండియు దేశీయమహాజనసభలో పాల్గొనుటను మానివేసిరి. కాని, దేశీయమహాజనసభ మాత్ర మంతము నొందలేదు. త్వరలోనే మరల సమకూర్పఁబడి మునుపటివలెనే జీవయాత్ర సాగించుచు యుద్యమముల నెఱవేర్చుచుండెను.

అయినను, మొన్న మొన్నటి దనుక దేశీయ మహాజనసభ జీవనవికాసమును కొంత గోల్పోయి చాల కాలమువఱకును కొంత ప్రాముఖ్యభంగము నొందిన దను మాట సత్యము. ఇప్పు డది మరల నూతనవికాసము నొంది పూర్ణకళలతో మెఱయుచున్నది. దీని విషయమై ముం దించుక విపులముగా తెలియనగును.

ఏ దేశమం దైనను జాతీయభావ మొకసారి యంకురించెనేని అది యనివార్యముగ నభివృద్ధి నొందును. అతివేగముగ నల్దిక్కుల వ్యాపించును. జాతీయపరివర్తనమున కొక్క హేతువు లేదు. ఒక్క కాలమును నిర్ణయింపరాదు. ఒక్కఁడు కర్త కాఁడు. కాని, సృష్టి విచిత్ర మైనది. భగవంతుఁడు లీలావిలాసవిగ్రహుఁడు. ప్రతిదానికిని కారణ మొండు కల్పించును. కాల మొక్కటి కాన్పింపఁజేయును. కర్తృత్వ మొకనిపై నారోపించుచుండును. దేశీయమహాజనసభాప్రాకారాంతరబంధితములై యున్న జాతీయోద్యమకాంతిపుంజములను దేశమధ్యమున వెదఁజల్లు తన సంకల్పమునకు వంగదేశవిభజనశాసనమును కారణముగా చూపెను. ఆ శాసనకాలమును తన కార్యనిర్వాహణమునకు ముహూర్తముగా నిశ్చయించెను. హిందూజాతియం దకారణద్వేషి యైన కర్జను ప్రభువును దానికి నిమిత్తముగాఁ జేసెను. ఔరా! ఇఁక గదా సర్వజ్ఞు లైన మహాత్ములు సూచించిన కర్మలీలావిలాసము! కర్జను ప్రభుని గుణశీలసామర్థ్యము లన్నియు నావశ్యకములే యైనను వానిని పూర్ణముగ పరిశీలించుటకు మన కవకాశము లేదు. నాగరకతలేని యాంగ్లేయుల కాజ్ఞాపించి యనియు హిందువులకు వారికి బానిసలుగ నిర్దేశించి యీశ్వరుఁడు సృజించె ననియు దృఢవిశ్వాసముతో నతఁడు భారతభూమిని పరిపాలింప వచ్చెను. ఆంగ్లేయాధికారము లేమి చేసినను దాని కెదురాడుటకు భరతసంతతికి వాక్కు లే దని అతని సిద్ధాంతము. వంగదేశమును రెండు భాగములుగా విభజింపవలె నని తన యభిప్రాయము నతఁ డించుక మొదట సూచించెను. వంగదేశీయులు వలదు వల దని యతనిని నివారింపఁ జూచిరి. కర్జను తోఁక ద్రొక్కిన త్రాఁచువలె లేచి వంగదేశవిభజనమున దృఢసంకల్పుం డయ్యెను. వంగదేశీయులు ధిక్కరించి యా సంకల్పము భంగము నొందకపో దనిరి. కర్జను ప్రభువు స్వతంత్రనిరంకుశత్వము ప్రదర్శించి విభజనమును గావింప శాసనమును స్థిరపఱచెను. (1905) ప్రజలు కోపఘూర్ణితమానసులై తమ యధికారుల యుపేక్షతను గ్రహించియు నిజమనోబలాధిక్యమును చూప నిశ్చయించిరి. వారి యనంగీకారధ్వనులు మిన్నుముట్టెను. ఒక్క పెట్టున జాతీయావబోధమువలన నూతనకళ పొడమి హిందూదేశ మంతట ప్రసరిల్లెను. నాయకులు జాతీయశంఖములను పూరించి రాజకీయరణరంగమధ్యమున యుద్ధసన్నద్ధులై నిలిచిరి. యువకులు దేశభక్తి పరవశులై ప్రాణధనాదుల లక్ష్యము సేయక తమ పెద్దలకు బాసటయై నిలిచిరి. జాతీయవాదుల నే దోషారోపణమిష నైన పట్టుకొని శిక్షింపవలె నని కొంద ఱధికారు లాయత్తులైరి. దేశసేవాపరతంత్రు లైన మహామహు లెందఱో క్రూరశిక్షలపాలు గావింపఁబడిరి. వీ రందఱు నత్యంత విద్యావంతులు, అమేయప్రతిభాశాలులు, తమ మేధాశక్తి

విశేషమున జగత్తు నద్భుతరసవాహినిలో ముంచిన వారు, సుగుణగణగరిష్ఠులు, సత్ప్రవర్తనానురక్తులు. ఆహా! ప్రవిమలమైన మాతృదేశభక్తికి నిధులై, తమ దేశజననికొఱకు స్వార్థత్యాగులై బలవద్విరోధుల దురాగ్రహానలమునకు తమ ప్రాపంచికసౌఖ్యముల నెల్ల నాహుతి యొనర్చి యీ మహాత్ము లనుభవించిన మేటి బాధలు తలంచిన, ఏ భారతీయుని రోమములు పులకింపకుండును? వారి పవిత్రతమమైన పరమసేవాధర్మనిర్వహణనిశ్చలత్వమును స్మరించిన నెవ్వరు మాతృభక్తిపరవశులై నిర్మలచిత్తులు గాకయుందురు? పాలకు లెన్ని విధముల ప్రయత్నించినను జాతీయోద్యమవిజృంభణమును వారింపఁజాలక పోయిరి. వంగదేశీయుల మనోనిశ్చయము చిరకాలంబైనను చలింపకుండెను. ఎక్కడ చూచినను జాతీయభావోద్రేకచిహ్నములు కన్నులఁగట్టినట్లు అగపట్టుచుండెను. ఒక్కెడ రామమోహనరాయలు శివాజీ మొదలగు దేశకీరుల చరిత్రల పఠనమును జన్మదినోత్సవములును గీతారహస్యబోధనములును ప్రబలియుండెను. ఇంకొకచోట గంగాస్నానవినోదములు దుర్గాపూజాసంవిధానములు కన్నులపండువు గావించుచుండెను. ఇంకొక స్థలమున జాతీయగీతమధుర రవములును 'వందేమాతర' పవిత్రమంత్రోచ్చరణములును గగనఘోషములును ప్రతిపక్షులకు భయంబు గొలుపుచుండెను. అందఱిచేతను విభజనశాసనదినమైన యక్టోబరు నెల పదునాఱవ తేది జాతీయవిపద్దినముగా పరిగణింపఁబడుచుండెను. ఇంకను ననేకరూపముల జాతీయభావము ప్రత్యక్షమగుచుండెను. ఆంగ్లేయపరిపాలకులకీ జాతీయభావాతిరేకతత్త్వము చాల కాలమువఱకును గ్రాహ్యము కాలేదు. అధికారబలప్రయోగముచే దానిని రూపుమాపుటకు వారు ప్రయత్నించిరి. కాని, తత్ప్రయత్నములు కేవలము వ్యర్థము లయ్యెను. చిన్నచిన్న వరములను ప్రసాదించి ప్రజలను శాంతింపఁజేయవలె నని వారు తలంచిరి. మింటో మార్లే సంస్కరణములు ప్రజలను రంజింపఁజేయలేకపోయెను. చివరకు హార్డింజ ప్రభువు హిందూదేశమును పాలింపవచ్చి నిజదూరదృష్టిసంపత్తిచే జాతీయాదర్శములను ప్రజల యాందోళనమును గ్రహించి వంగదేశవిభజనశాసనమును రద్దు గావించెను. ప్రజలు విజయము వడసిరి. (1911)

కర్జ నొనర్చిన యొక యవివేకకార్యము కారణముగా హిందూదేశమున జాతీయభావము నూతనతేజమును నూతనాదర్శములను నూతనపటుత్వమును గాంచెను. రాజకీయాందోళనము చాలమట్టునకు వంగదేశమునకు సంబంధించినదే యైనను ఇతర రాజధానులవారు కూడ జాతీయాశయపాశసమ్మోహితులు కాఁజొచ్చిరి. జాతీయోద్యమప్రాథమున మూఁడవ సోపానము 1913-వ సంవత్సరమునకును 1917-వ సంవత్సరమునకును మధ్యమున నిర్మితమైనది. తన్నిర్మాణసంబంధమైన జాతీయనాటకమునకు శ్రీమతి యానిబెసెంటు కథానాయకురా లని చెప్పవచ్చును. ఈ నారీశిరోమణి చరిత్ర మత్యద్భుతమైనది. ఈమె హిందూదేశమునకు మహోపకారిణి యని కృతజ్ఞస్వభావు లొప్పుకొనక తప్పదు. కులరూపములకన్న గుణము ప్రధానము. కులరూపములచేత యానిబెసెంటు పాశ్చాత్యవనిత యయ్యును గుణముచేతను త్రికరణములచేతను భారతీయవిదుషీరత్న మని నిస్సంశయముగ నమ్మవచ్చును. భారతభూమి యన్న నామె కపారప్రేమ గల దని యామె ప్రవర్తనమే చెప్పకచెప్పుచున్నది. వంగదేశవిభజనకాలమునందు జాతీయాందోళనమున నామె కొంతవఱకు విముఖురాలై యుండిన మాట నిజమే. కాని, దాని కనేక కారణములు గలవు. కాని, అప్పుడైన నామె మానసమున హిందూస్వాతంత్ర్యమునకుఁ గాని తదితర జాతీయాదర్శములకుఁ గాని ప్రతికూలురాలు గాదు. 1913-వ సంవత్సరమున నింగ్లండు నుండి యామె కడపటిసారి హిందూదేశమునకు మరలి వచ్చి తత్క్షణమే రాజకీయరంగమున ప్రవేశించి జాతీయసేవానాయకురాలయ్యెను. అప్పటినుండియు నేకదీక్షతో హిందువుల పక్షమున పాటుపడఁజొచ్చెను. ఆమె యొనర్చిన ఘనకార్యము లెన్నియో కలవు. దేశీయమహాజనసభయం దతివాదమితవాదులకు మనస్సమ్మేళన మామె పరిశ్రమవలననే సంభవించెను. దేశీయమహాజనసభకు నూతనజీవము ప్రసాదించిన దామె ప్రజ్ఞయే. జాతీయోద్యమమునకు ముఖ్యాధారమైన రాజకీయసంఘము దేశీయమహాజనసభయే యని బోధపఱచి యప్పటికి దానిని చూచి నిరుత్సాహులై యున్న ప్రజలకును గాని యాభిప్రాయాశయములను మెచ్చి యతివాదపక్షావలంబకులకును మగల దానియం దభిమానము కలుగునట్లామె యొనర్చెను. అప్పటినుండి నేటివఱకును దేశీయమహాజనసభ నవ్వల మహోన్నతదశ ననుభవించుచున్నది. 1917-వ సంవత్సరము కలకత్తానగరమున నామె యాధిపత్యము క్రింద జరిగిన జాతీయసమావేశమే దేశీయమహాజనసభాచారిత్రమున నత్యున్నతమైన సమయము. మహమ్మదీయులను కూడ హిందువులతోఁ గలసి దేశీయమహాజనసభతో నేకీభవించి దేశోద్ధరణమునకు కృషి చేయవలసిన దని యామె చాల పురికొల్పెను. స్వరాజ్యసమితిసంస్థాపన మామె కృత్యములలో నగ్రగణ్యమైనది. దాని మూలమున నామె స్వరాజ్యవాంఛను జాతీయోద్యమమును హిందూదేశమున మూలమూలలకును పల్లెపల్లెలకును ప్రాకునట్లొనరించెను. వంగదేశ మిదివఱకే జాతీయోద్యమమున ప్రాముఖ్యతను గాంచినను చెన్నరాజధాని మొదలగు నితరప్రదేశము లింకను వెనుకఁబడియున్న వని గ్రహించి యామె యచిరకాలములో నా భేదమును తొలఁగించెను. ఈ మహోపకారముల కన్నిటికిని ప్రజలు కృతజ్ఞులై యామెను తల్లివలె ప్రేమింపసాగిరి. అధికారవర్గమువారు కోపగ్రస్తులైరి. వారికి భీతి జనించెను. ఆమె తలంచిన యుద్యమములకు వారాటంకములు సంఘటింపఁదొడఁగిరి. ముద్రణశాసనము పేరు పెట్టి యామెను శిక్షింపఁదలంచిరి. చివర కామెకు ప్రవాసశిక్ష విధించిరి. దేశమున నశాంతితరంగములు ప్రవహించెను. క్రోధమారుతము వీచెను. ప్రజ లందఱు నేకమై యపూర్వమైన సక్రమాందోళనము చేసిరి. పేద లనక ధనికు లనక వైరు లనక హితు లనక యందఱు నామెకు విధింపఁబడిన శిక్ష తమకు విధింపఁబడినట్లే యెంచి యామె స్వాతంత్ర్యనాశనమే హిందూదేశస్వాతంత్ర్యనాశన మని తలంచి యామెపై వరింప నలవి

కాని ప్రేమను చూపిరి. ఆమెను విడువనిచో సాత్త్వికనిరోధ వ్రత మవలంబించెద మనిరి. దేశము దంతటను ఆబాలగోపాలము స్వాతంత్ర్యాభిలాషయు స్వరాజ్యాపేక్షయు పొడమెను. ప్రభుత్వమువారు తమ యశక్తిని తమ యవివేకమును తెలిసికొనిరి. తమ కెంత యనిష్టకార్య మైనను ఆమెను విడుచుట తప్పనిసరి యయ్యెను. ప్రజలు మరల విజయము గాంచిరి. అని బెసెంటు తిరిగి చెన్నపురి వచ్చుచో నామె నాహ్వానించు సందర్భమున ప్రజలు చూపిన యుత్సాహ మరసినవారికి హిందువుల హృదయకుండముల యందు జ్వలించుచున్న జ్వలనజ్వాలలు విశదము కాక మానవు. ఈ పర్యాయము జాతీయోత్సాహ మొక రాజధానియందును ఒక తెగ వారియందును మాత్రమే గాక దేశము దంతటను ప్రజ లందఱి యందును విస్ఫుట మయ్యెను. వర్తకులు విద్యార్థులు హిందూయువతులు సామాన్యప్రజలు వీరు వారనక యందఱును జాతీయోద్యమము ననుసరించిరి. అనేకవిధము లైన జాతీయోత్సాహచిహ్నము లన్ని దిశలను చిత్రవిచిత్రరూపముల గోచరించెను. ముందుగా మహాశయుఁడు రాకయున్నచో నేది యెట్లుండెడివో యెవ్వ రెఱుఁగుదురు?

స్వరాజ్యవాదము జాతీయోద్యమమున కాయువు. స్వరాజ్య వాంఛయు స్వాతంత్ర్యేచ్ఛయు ప్రజల ముఖ్యాశయములు. కాని, యీ స్వరాజ్య మే రూపమున నుండవలె ననువిషయమున విద్యాధికులలో నభిప్రాయభేదములు తీవ్రముగ నున్నవి. అధినివేశముల కొసంగఁబడిన స్వపరిపాలనావిధానమే మనకును గావలె నని దేశీయ మహాజనసభ మొదటినుండియు గోరుచుండెను. తరువాత వంగదేశ విభజనకాలమందు జన్మించిన భావోద్రేకము కారణముగా రెండు భేదాభిప్రాయములు పొడమెను. ఒక తెగవారు దేశీయమహాజనసభ ననుసరించిరి. వారికే మితవాదు లని పేరు కలిగెను. 1906-వ సంవత్సరము దాదాభాయి నౌరోజి గారు కోరిన స్వరాజ్యమే మనకు కావలె ననియు సంపూర్ణస్వాతంత్ర్యమే దానికి మార్గ మనియు బ్రిటిషువారితో మన కే సంబంధము నుండఁగూడ దనియు కోరువా రతివాదులు. ఈ యుభయపక్షములవారు నొకరి నొకరు ద్వేషించి దూషించుకొనుచుండిరి. ప్రజలు మాత్ర మందఱిని దేశాభిమానులుగ నెంచి గౌరవించుచుండిరి. ఇంతలో నూతనాభిప్రాయ మొకటి యావిర్భవించెను. బ్రిటిషు సామ్రాజ్యము స్వతంత్రదేశముల సంయుక్తసామ్రాజ్యమై యుండవలె ననియు అందు హిందూదేశ మధినివేశములతోఁ బాటు స్వతంత్రదేశమై యొక యంగముగా నుండవలె ననియు నూతన సిద్ధాంతమును కొందఱు తెచ్చిరి. క్రమక్రమముగా వీ రందఱును తమ యందఱి ముఖ్యవాంఛితము నొక్కటే యనియు ఈ యభిప్రాయభేదము లల్పము లనియు గ్రహించుచుండిరి. ఇంతలో బీసెంటు రాజకీయరంగమున ప్రవేశించి యతివాదమితవాదులకు పునస్సమ్మేళన మొనర్చెను. ఆమె స్థాపించిన స్వరాజ్యసమితిలో నన్ని పక్షములవారును స్వేచ్ఛగా చేరి హిందూదేశస్వాతంత్ర్యపతాకము నెత్తి తత్సమక్షమున నాందోళనసమాగము నారంభించిరి. హిందువులు 8,000 యేండ్ల క్రిందటనే స్వరాజ్యమున కర్తలై రనియు స్వరాజ్యము భారతీయుల పుట్టువుతోడి హక్కనియు స్వరాజ్యప్రాప్తి యాంగ్లేయుల యనుగ్రహముమీఁద నాధారపడి యుండదే దనియు బెసెంటు నొక్కి వక్కాణించెను. కాని, ఇంతవఱకును మనము సక్రమాందోళనావలంబకులను గూర్చియే యోచించి యున్నాము. కాని, స్వరాజ్యమునే వాంఛించు భరతపుత్రులలో మఱియొక తెగవారును గలరు. వీరి సంఖ్య యల్ప మైనను వీరి యుత్సాహ మత్యంతము. వీరి యాశయములు మహోత్కృష్ట మైనవే కాని, వీరి యాశయసాధనము లంగీకరింపఁదగినవి కావు. వీరే యరాజకవాదులు. వీరు రెక్కు కుట్రలఁ బన్నుచున్నారు. తమ కాంగ్లేయులపై విశ్వాసము నశించుటయే వీరి యరాజకవాదమునకు కారణము. ఈ కారణమును పాలకులు గ్రహింపఁజాలక దేశమున నంతకంతకు శిక్షావిధానమును హెచ్చించుచున్నారు. ఇది మిగుల ననర్థదాయకము.

జాతీయోద్యమము స్వరాజ్యాశయమును మాత్రమే యాశ్రయించియుండలేదు. మతోద్ధరణము దాని ముఖ్యాదర్శములలో నగ్రగణ్యము. హిందూదేశమున నే యుద్యమ మైనను స్థిరమై వ్యాపింపవలె నన్న మతసంబంధమై యుండవలెను. చంద్రునకు వెన్నెల యెట్లు సహజ మైనదో భారతీయుల హృదయములకు మతాభిమాన మంత సహజ మైనది. జాతీయోద్యమము రాజకీయ వ్యవహారములచేతనే దేశీయమహాజనసభతోడనే జన్మించిన దని యెంచుట పొరపాటు. 19-వ శతాబ్దిని హిందూదేశమున ముఖ్యముగా గమనింపవలసిన విషయము హిందూమతపునరుజ్జీవనమే. దీనివలననే జాతీయోద్యమము మొదట మొలకలెత్తెను. అప్పటికి హిందూమత మతిదీనస్థితియం దుండెను. భరతపుత్రులు స్వమతాభిమానమును త్యజించి పరమతావలంబనమున కుతూహలము నొందిరి. క్రైస్తవమత బోధకులు వచ్చి హిందూమతము మూఢభక్తికి నిలయ మనియు, సహగమనాది క్రూరాచారముల కాకర మనియు, అనాగరకత కాటపట్టనియు బోధింపఁగడంగిరి. హిందువు లీ పన్నియు నిజ మని నమ్మిరి. అప్పుడే పాశ్చాత్యవిద్య నభ్యసించినవారికి పాశ్చాత్యనాగరకతా విభ్రమము వారకాంతల పైపైవన్నెలవలె నతివిభ్రమణమును కలిగించెను. వెంటనే వారు స్వమతాచారముల నిరసించి పరిత్యజించిరి. విదేశీయుల మతము విదేశీయుల దుస్తులు విదేశీయుల భాష విదేశీయుల యాచారములు వారికి ప్రియము లయ్యెను. వే యేల? ఆత్మగౌరవము వారిలో పూర్తిగ నశించెను. ఇట్టి దుస్స్థితినుండి మొట్టమొదట వారి నుద్ధరించినవి బ్రహ్మసమాజ ఆర్యసమాజ దివ్యజ్ఞానసమాజ రామకృష్ణమతసంఘములు. జాతీయాభిమానమునకు పునాది యేర్పఱచినవాఁడు మహాపురుషుఁ డైన రామమోహనరాయలు. ఇతఁడే బ్రహ్మసమాజమును స్థాపించెను. కాని, కొంత కాలమునకు బ్రహ్మసామాజికులలో కొందఱు కేశవచంద్రసేనుని ప్రేరణమున పాశ్చాత్యుల ననుకరించిరి. ఆర్యసమాజమును మహానీయుఁ డైన దయానందసరస్వతి స్థాపించెను. దివ్యజ్ఞాన సామాజికులలో హిందూదేశమునకు మహోపకార మొనరించినది

యానీ బెసెంటు. రామకృష్ణమతసంఘమున ప్రధానపురుషుఁడు జగద్విఖ్యాతి గన్న వివేకానందస్వామి. వీ రందఱును హిందువుల కాత్మావబోధ మొనరించిరి. హిందూమతౌన్నత్యమును బోధించిరి. హిందువుల నాగరకత యత్యుత్కృష్ట మైన దని ధ్రువపఱచిరి. హిందూదేశమున ననన్యసామాన్య మైన విజ్ఞానము ప్రవర్ధిల్లె నని యుపన్యసించిరి. పాశ్చాత్యానుకరణ మాత్మవధతో సమాన మని బుద్ధులు గఱపిరి. వారి పరిశ్రమలకు ఫలముగ జాతీయోద్యమ ముప్పతిల్లినది. రాజకీయపరిజ్ఞానము హెచ్చిన కొలఁది స్వమతాభిమానము హెచ్చినది. స్వసంఘముమీఁది నిరసనభావము నశించినది. స్వరాజ్యమునకును మతోద్ధరణమునకును సంబంధము గల దని నాయకులు బోధించిరి. ప్రజలు గ్రహించి యానీ బెసెంటు ప్రవాసశిక్షాసమయమున దేవాలయములలో నర్చనలు సలిపియు మఱియు నెన్నియో యితర కార్యములవలనను మతమునకును రాజకీయవిషయములకును గల సన్నిహిత సంబంధమును వ్యక్తపఱచిరి. జాతీయగౌరవ మిప్పుడు మరల ప్రజల రక్తనాళములయందు ప్రవహించుచున్నది.

జాతీయవిద్యాసమస్య కూడ జాతీయోద్యమములలో నొక భాగమై యున్నది. నూటయేఁబది యేండ్లనుండి యాంగ్లేయులు పరిపాలన మొనర్చుచున్నను ప్రజలనేకు లజ్ఞానాంధకారమునుండి విముక్తులు కాలేదు. ప్రజలకు ప్రస్తుతవిద్యాపద్ధతులం దనేకలోపములు గాన్పించుచున్నవి. అన్యదేశభాషాభ్యసన మావశ్యక మై యుండుట దేశభాషాభిమాన మడఁగించుట జాతీయ చారిత్రమును విడిచి భారతీయ యువకులు జీవితకాలమంతయు అన్యదేశచరిత్రపఠనముననే వ్యయపఱచుచుండుట భారత భాగవతాది పుణ్యగ్రంథములకు బదులు గ్రీకు పురాణకథలును ఆంగ్లేయవీరుల జీవితములును గఱపఁబడుచుండుట విద్యార్థులలో దేశాభిమానమును పురికొల్పుటకు మాఱు తత్స్వాభిమానము నణఁగఁద్రొక్కుట పాఠశాలలు విశ్వవిద్యాలయములు ప్రభుత్వము వారి యధికారము క్రిందనే యుండుట — ఇట్టి లోపములు వేనవేలున్నవి. వంగదేశవిభజనాందోళనసమయమున వంగదేశీయులు జాతీయవిద్యావశ్యకతను గ్రహించి జాతీయవిద్యాలయములను స్థాపించిరి. తరువాత బందరు జాతీయకళాశాల మొదలగు విద్యానిలయము లక్కడక్కడ కొన్ని స్థాపింపఁబడెను. ప్రజలలో కూడ జాతీయవిద్యాభిమానము ప్రబల మయ్యెను. ఆర్యసమాజమువారు గురుకులవాసముల నేర్పఱచిరి. కవీంద్రుఁ డైన రవీంద్రుఁడు శాంతినికేతనము నెలకొల్పెను. దేశభక్తు లుద్యమించి కాశీనగరమున హిందూవిశ్వవిద్యాలయమును నిర్మించిరి. అనీ బెసెంటు జాతీయవిద్యాస్థాపనమున కూడ చాల పరిశ్రమ లొనర్చెను. ఆమె మిగుల దీక్షతో కార్యముల నొనరించుటకు దక్షురాలు. కాశిలోని హిందూవిశ్వవిద్యాలయమునకు పూర్వ ముండిన జాతీయకళాశాల యామె స్థాపించినదే. మదనపల్లిలో కూడ నామె యట్టి కళాశాలను నిర్మించెను. కాని, జాతీయ విద్యావ్యాప్తి యింకను సంతుష్టికరముగ లేదు. అరుండేలు మహాశయుఁ డీ విషయమును గ్రహించి జాతీయవిద్యను వ్యాపింపఁజేయుటకు కంకణము కట్టుకొని నిరంతరమును పరిశ్రమ యొనర్చుచున్నాఁడు. అతఁడు మన వందనముల కెంతయు పాత్రుఁడు. త్వరలో జనుల మనమున జ్ఞానభానుఁ డుదయింపవచ్చును.

జాతీయోద్యమము మహాసముద్రమువంటిది. అం దెన్నియో తరంగసంతతులు కలవు. వాని నన్నిటిని వర్ణించుట ప్రస్తుతము సాధ్యము కాదు. వాని లోఁతును గాంచుటయు కష్టతరము. స్వదేశీవ్రతకాంక్ష కూడ జాతీయోద్యమచరిత్రమున ముఖ్యముగ గమనింపవలసిన విషయము. వంగదేశవిభజనసమయముననే స్వదేశీవ్రతము కూడ నుద్భవించెను. భారతీయులు పరదేశవస్తువులను కొనరా దని ప్రతిజ్ఞ గైకొనఁజొచ్చిరి. హిందూదేశము సారవంత మైన భూమి. వివిధము లైన గనులును దాని గర్భమున నణఁగియున్నవి. విదేశీయు లవి యెల్ల స్వలాభార్థము వినియోగించుకొనుచున్నారు. దేశమున పరిశ్రమలు నశించినవి. ప్రభుత్వమువారు వానిని రక్షింప సమకట్టకున్నారు. కావున, మనదేశపరిశ్రమలను కాపాడుకొను భారము మనమీఁదనే యున్న దని భారతీయులు తెలిసికొనిరి. విదేశవస్తువులనే కొనరా దని కొంద ఱనిరి. సాధ్య మైనంతవఱకు స్వార్థత్యాగ మొనర్చ నైనను స్వదేశవస్తువులనే కొనవలె నను నది సరి యైన యాశయ మని మఱికొంద ఱనిరి. విదేశవస్త్రధారణమును భారతీయులు మానవలె నని యత్నించిరి. బెసెంటు ప్రవాసశిక్షాసమయమున జనులలోఁ గల భావోద్రేకమును బట్టి స్వదేశీవ్రతదీక్షయు హెచ్చెను. స్వదేశీవ్రతదీక్ష భారతదేశపరిశ్రమల సంరక్షణ కుత్తమసాధన మని యార్థికశాస్త్రజ్ఞులు కూడ నభిప్రాయపడుచున్నారు. భరతపుత్రులు మనోనిగ్రహ మొనరించి విదేశీయవస్తువులందలి వ్యామోహమును వదలి స్వదేశీవ్రతావలంబనమున దేశాభిమానము వెల్లడిచేయవలెను.

ఐరోపాదేశములందువలెనే హిందూదేశమునను జాతీయోద్యమ మావిర్భవించి యెట్లభివృద్ధి నొందెనో ఏయే రూపములు దాల్చెనో ఏయే యాశయముల నాశించెనో మనము విచారించియున్నాము. కాని, యూరపుదేశములందలి జాతీయాదర్శములకును భారతీయజాతీయాదర్శములకును మిగుల వ్యత్యాస మున్నది. ఐరోపాదేశములందు జాతీయోద్యమము స్వార్థపరత్వమును సామ్రాజ్యాభిలాషను ప్రేరేపించి మానవసౌభ్రాతృత్వమును దానికి బలి యొసఁగుచున్నది. నేఁటి మహాసంగ్రామమువలన నాయా జాతీయోద్యమము లాపాదించు ననర్థములు ప్రకటితము లగుచున్నవి. యూరపునందు కూడ నీ యుద్ధమువలన నూతనభావము లంకురించుచున్నవి. కాని, భారతీయులు జాతీయోద్యమమును ప్రారంభించుట జపాను మొదలగు కొన్ని ప్రాగ్దేశములు పాశ్చాత్యదేశానుకరణ మొనరించుటవంటిది కాదు. అక్కడి రాజకీయాందోళనపద్ధతుల ననుసరించుట మాత్రమే యని యెంచుట పొరపాటు. భారతీయుల జాతీయోద్యమము కేవలము స్వార్థపరత్వసమన్వితము కాదు. వారి స్వాతంత్ర్యాభిలాష కేవల మధికారపాశములను వదలించుకొని యిచ్చవచ్చిన రీతిని చెలరేఁగుటకుఁ గాదు. అది వట్టి స్వచ్ఛందజీవనాభిలాష మాత్రమే కాదు. మఱి, పరమోత్కృష్ట మైన స్వాధీనతాభిలాష. హిందువుల సాంఘికశాస్త్రసూత్రము లీ మహా

ధర్మముచే వారికి బోధించుచున్నవి. కావున, హైందవుల జాతీయసౌభాగ్యమునకు ప్రేమయే పునాది. పరస్పరజాతివైరముల కెట్టి యవకాశమును స్థానము నొసంగదు. హిందూదేశము నాగరికతకు ప్రసిద్ధి కెక్కిన దేశము. దానికి ప్రత్యేకముగా నితరదేశములకు లేని వ్యక్తిత్వ మొకటి యున్నది. దాని శిల్పశాస్త్రమును గాని చిత్రలేఖనమును గాని కళాశాస్త్రములను సంగీతసాహిత్యములను గాని విజ్ఞానమును మతమును సకలమును ఇతరదేశములవానికన్న భిన్నములు. వీని యన్నిటియందును ఒకానొకప్పుడు భారతభూమి వర్ణనాతీతమైన మహావైభవ మనుభవించుచుండెను. అట్టి మహోన్నతమైన విజ్ఞానభాగ్యమును కాపాడి పోషించి నూతనజీవముతోడను నూతనవికాసముతోడను ప్రపంచమున కలవడఁ జేయుటే హిందూజాతీయతయొక్క ముఖ్యాశయము. కాని, ఈ కార్యమును భారతీయులు అఖిలప్రపంచసామ్రాజ్యనిర్మాణమువలన నెఱవేర్పవలె నని తలంచుట లేదు. ప్రపంచమంతయు స్వాతంత్ర్యసంపత్తి గలిగి వెలుఁగు దేశముల కాకరమై ఈ దేశము లన్నియు కలసి యొక సంయుక్తదేశసామ్రాజ్యమై యుండవలె నని వారి సాంఘికరాజకీయాశయము. ఇదియే వారి జాతీయోద్యమతత్త్వము. ఇం దన్నియో మహాధర్మము లంతర్భూతములై యున్నవి. జాతీయోద్యమమే మాతృదేశభక్తి. అదియే స్వాతంత్ర్యాభిలాష. అదియే విజ్ఞానప్రాగల్భ్యవికాసశక్తి. అదియే భూతదయ. అదియే మానవసోదరత్వమును గ్రహించి మెలఁగుటయందలి యాసక్తి. స్వపరిపాలనప్రాప్తియు జాతీయవిద్యావ్యాప్తియు హిందూమతోద్ధరణమును స్వదేశీవ్రతాచరణము దీనికి గమ్యస్థానములు. దీనివలననే ఏడతెగనియాఁకటిచే బాధపడుచున్న యనేకకోట్ల జీవరాసులు క్షేమమును వడయుదురు. దీనివలననే భారతీయులు మానవధర్మములను వ్యాపింపఁగలరు. దీనివలననే భారతీయవిజ్ఞాననాగరికతలు ప్రపంచమున కలవడును. దీనికొఱకు భరతపుత్రులు తమ ప్రాణములను ధారవోయుచున్నారు. వేదదేశమున నుండుచున్నను శక్తికొలంది ధనమును వ్యయము చేయుచున్నారు. దేశాంతరవాస మనుభవించుచున్నారు. స్వాతంత్ర్యమును బాసి కృశించుచున్నారు. ఇంకెన్నెన్నియో బాధల ననుభవించుచున్నారు. ముందును అనుభవింప సంసిద్ధులై యున్నారు. జాతీయోద్యమము వారిని మాతృభక్తిపరవశులఁ జేయుచున్నది; ధైర్యసాహసోపేతులఁ గావించుచున్నది; నిశ్చలచిత్తుల నొనరించుచున్నది. అట్టి మహాసంకల్పమున కెవ్వరు విఘ్న మాపాదింప నేర్తురు? తత్ప్రవాహోద్వేగము నాపఁగల ధీరు లెవ్వరు? తత్ప్రవృద్ధిమార్గమును కట్టిపెట్టు చతురు లెవ్వరు? అధికారులు నిర్బంధముల విధింతురు గాక, ఆంగ్లోహైందవులు ప్రల్లదములఁ బలుకుచుందురు గాక, ఆంగ్లపత్రికలు అసహనమును ప్రదర్శించుఁ గాక, దేశద్రోహులు మాతృభూమిని పరిత్యజింతురు గాక, అవివేకులును స్వార్థపరులును అహితప్రేరితులును తాము స్వరాజ్యమున కనర్హుల మని యగౌరవవాక్యముల వాకొందురు గాక, విధినిర్ణయము నెవ్వరు తప్పింతురు? కాలగతి నెదు రెవ్వ రేఁగుదురు? 30 కోట్ల ప్రజల పుట్టుహక్కును తిరస్కరించి నిగ్రహించువా రెవ్వరు? భారతపుత్రులారా! స్వరాజ్యము మీకై యెదురుచూచుచునే యున్నది, దానిని తెచ్చుకొను భారము మాత్రమే మీదై యున్నది. ఆంగ్లేయభూమి కేఁగు భరతపుత్రుల పరిశ్రమల నీశ్వరుఁడు సఫలీకృత మొనరించుఁ గాత! ఆంగ్లదేశస్థులు తమ సహజస్వాతంత్ర్యప్రియత్వమును న్యాయమార్గప్రవర్తనమును క్రియారూపమున చూపి లోకమునకు [illegible] గాంచి తమ సామ్రాజ్యము సత్యన్యాయములపై నిలఁబెట్టుకొనునట్లు సర్వేశ్వరుఁ డనుగ్రహించుఁ గావుత! మాంటేగు మహాశయుఁడు హిందువుల స్వారాజ్యమును వారి కొసంగుఁ డని స్వదేశస్థులకు హితవు గఱపి తన్నిమిత్తమై శాశ్వతకీర్తి గడించునట్లు భగవంతుఁడు ప్రసాదించుఁ గావుత! "జయము శ్రీ భారతమాతకు జయము జయ"మని యూరూర పుత్రులు జయజయధ్వానములు సల్పు సంతోషతరంగముల నోలలాడు కరుణ మావిర్భవించుఁ గావుత!

DRAMATIC SECTION OF ANDHRA MAHAJANA SABHA, RANGOON



ఆంధ్ర మహాజనసభ-నాటకశాఖ, రంగూను

# జాతీయవిద్య

## కొండిపర్తి వీరభద్రాచార్యులు గారు

"జాతీయవిద్య కాని విద్య విద్యయే కాదు."

"జాతీయవిద్య యన్నను జాతీయంపు దుస్తు లన్నను జాతీయార్హ మగు విద్య యనియు జాతీయార్హ మగు వసనము లనియు నర్థము."

•

విద్య యనఁగా ఎఱుక, నరునం దడఁగియున్న శక్తులకు ప్రబోధము గల్గించు విధము నెఱుంగుట. ప్రకృతిసిద్ధముగ మహాశక్తు లనేకములు పసివారియం దడఁగి నిద్రించుచుండును. ఆ శక్తులకు మెలఁకువ కల్పించి ప్రవృత్తిని గల్గించి వానిని బలపఱచు నెఱుకయే విద్య. ఈ విద్య సక్రమమార్గమునఁ గఱపఁబడనియెడల మన మే శక్తులను పోషించి సత్త్వసమన్వితములుగ చేయఁజూచుచుంటిమో ఆ శక్తులే సంక్షుభితములై కృశించి భగ్నములు కాఁగలవు. మఱియు, వీనికి మాఱుగ ననర్థదాయకము లగు నలవాటులు తలచూపును.

మఱియు, విద్యాభ్యసనమున బాలుర కందఱకు నుపయుక్త మగు విధాన మొకటి లేదు. శరీర మానసిక బుద్ధి బలములందు ఒక బాలునిఁ బోలి మఱొకఁ డుండఁడు. కావున, విద్య గఱపుచో భిన్న దశలం దున్న బాలుర స్థితిని గుర్తెఱింగి వారివారి కనువగు రీతిని బోధల సలుపవలసియుండును. కొందఱు బాలురందు కొన్ని కొన్ని సమర్థత లతిసులభముగ ప్రబోధము గాంచుచు ఫలప్రదము లగును. వీని నుపేక్షించి వేఱు విధ మగు శక్తులను ప్రబోధింపఁ జూచితిమా, మన ప్రయత్నములు నిష్ఫలము లగుటయే కాక ఆ బాలురను గూర్చి చేయఁబడు బోధ లన్నియు ననర్థదాయకము లగును.

తా మవలంబించు బోధనవిధానముల ననుసరించి గురువులను మూఁడు తెగలవారినిగ విభజింపవచ్చును: (1) దారుశిల్పులవంటి వారు (2) శైలశిల్పులవంటివారు (3) తోఁటమాలీలవంటివారు. దారుశిల్పులవంటివారు మొదటి తెగ గురువులు. వీరు బాలుని బుద్ధి రిక్తస్థలమువలె నుండు ననియు అచ్చో తాము నిర్మించు వర్తన మను భవనమునకు వలయు సామగ్రి నంతను వెలుపలినుండి తెచ్చి దాని నెల్ల నుచితరీతిని తా మె యమర్చి రూపకల్పనము గావింపవలె ననియు భావింతురు. ఈ విద్యావిధానము గురువులను బట్టి నిర్ణయింపఁబడును గాని విద్యార్థుల ననుసరించి మాఱదు. మన దేశమునఁ బఱఁగు ప్రస్తుతవిద్యాపద్ధతి ఇట్టిదే. అన్యదేశగురువులు తమ జీవితాదర్శములకై తమ చిత్తము వచ్చినట్లు పునాదులు వేయఁ జూచుచున్నారు. దేశీయబాలునికి స్వకీయ మగు జీవితాదర్శములం దధికారము లేదు. వాని జాతీయసాంప్రదాయమునకుఁ గాని స్వదేశాభిమానమునకుఁ గాని గణన లేదు. సహజమానవస్వాతంత్ర్యములును లేవు. గురువులు తమ యాదర్శములకు పునాది వేయుటకు పూర్వము బాలునియందు స్వాభిమాన మేమైనఁ గలదేమో పరికించి ముందు దానిని తొలఁగించి వానిని శూన్యమనస్కునిఁగ నొనర్చి తమ కర్తవ్యము నారంభించుచున్నారు. బాలుని గమ్యార్థము రాజకీయోద్యోగము; ఇదియే సామ్రాజ్యసేవగ భ్రమింపఁబడుచున్నది. ఇందునకు సాధనము స్వదేశాభిమానశూన్య మగు రాజభక్తి. అధికారుల కడఁగిమడఁగి యుండుటయే రాజభక్తి యని యెంచఁబడుచున్నది. మఱియు, రాజుయొక్క దేశీయు లగు నాంగ్లేయుల వేషభాషల ననుకరించుటే బ్రహ్మచర్యమై వెలయుచున్నది. ఇందువలన బాలుని సహజప్రేమ గాని స్వకల్పనాసామర్థ్యము గాని సత్య మగు భక్తి గాని వర్ధిల్లుట కవకాశములు కలుగకున్నవి. కాని, స్వభావము ననుసరించి యివి తల చూపక మానవు. అప్పు డవి శిక్షణావిధానమునకు విరుద్ధము లగు విధ్యుల్లంఘన ప్రయత్నములుగ భావింపఁబడి యడఁచివేయఁబడుచున్నవి. మానసికకల్లోలమును నీతివర్తనాభావమును అనర్థదాయక శిథిలసరణియు ఫలము లగుచున్నవి.

గురువులలో శైలశిల్పులవంటివారు రెండవ తెగవారు. బాలుని బుద్ధి రూపహీన మగు శిలవంటి దనియు సహజచైతన్యము లేక పఱఁగు ననియు వీరి సిద్ధాంతము. శిల యొకటి నేలపై దొర్లుట వలన కొన్ని మాలిన్యములు దాని నంటుకొను రీతిని బాలుఁడు గురుని శిక్షక్రిందికి వచ్చుటకు పూర్వము దానికి సహవాసదోషములవలనఁ గల్గిన యనర్థము లగు కొన్ని వాసన లలవడియుండు నని యెంచి వాని నెల్ల తొలఁగించి వాని బుద్ధిని తమ యిచ్ఛానుసారముగ తొలిచియు చెక్కియు గురువులు రూపకల్పనము గావింపవలసియుందురు. ఈ సిద్ధాంతము ననుసరించి చూచినయెడల బాలుని మనస్సు సహజముగ వక్రమై యుండును; దాని ననేకరీతుల పీడించి హింసించినఁ గాని వాంఛితరూపనిర్మాణము లభ్యము కాఁజాలదు. గురువులు సర్వస్వాతంత్ర్యకలితులు, బాలురు బానిసలు. గురువు లాజ్ఞాపింతురు; బాలురు శిరముల వంచి చెప్పినట్లు నడుచుకొనియే తీరవలయును. తాము కోరినదానిని గురువులు బోధింతురు; బాలురు దానినె నేర్చుకొనవలయును, తదితరమును దేనిని నేర్చుకొనఁగూడదు. బోధితాంశములందు దేనినేని బాలురు నేర్చుకొనఁజాలనిచో, గురుధిక్కారభావముచే వారి మనస్సు కఠినమై యుండవలయును. ఇట్టియెడ కఠినతరశిక్షయే బోధనసాధనము! బాలుర బుద్ధి గురువు లెట్లు చెక్కిన నట్లు రూపాంతర మందవలసినది. మానవజీవితాదర్శములం

గూర్చి హ్రస్వదృష్టి గల గురువు లీ పద్ధతివారు. వీ రధికారప్రియులుగ నుందురు. వీరు సదా బాధకగురువులే గాని బోధకగురువులుగ నుండరు. సహజచైతన్యకలితు లైన బాలురు శాంతిహీనులును క్రోధసహితులును నై అవిధేయులుగను విప్లవంకరులుగను భావింపఁబడి యన్యాయముగ నడంచివేయఁబడుదురు.

తోఁటమాలివంటివారు మూఁడవ రకపు గురువులు. వీరు బాలుని సజీవబీజముగ నెంతురు. అనంతశాఖాసమన్వితమై సువర్ణపత్రపుష్పఫలసంశోభితమై చెన్నారు మహావృక్షముయొక్క చైతన్యమంతయు బీజమునం దవ్యక్తమై వసించుచుండును. ఆ బీజమున కనుకూలక్షేత్రమును సమకూర్చుటయు అందుండి వెలువడు నంకురమును శీతోష్ణబాధలనుండి కాపాడుటయు మొక్కగా నున్నప్పుడు దాని కలుపగట్టి పశ్వాదులచే హాని రాకుండఁ జేసి తగిన యెరువును నీరును సమకూర్చుటయు తోఁటమాలికి విధి. అం దతనికి మొదటి కార్యభాగమే మిక్కిలి కష్టతర మైనదియు ప్రముఖ మైనదియు నై యున్నది. ఏ విత్తనమున కెట్టి నేల కావలయునో మొదట నిర్ణయించుటతో మాలి సగము విధిని నెఱవేర్చినవాఁ డగును. తదనంతరము గాని మొక్కయొక్క వ్యాప్తికి తగిన ట్లలవ గట్టుటయో కాని తీఁగెకు పందిరి వేయుటయో ఊఁతకఱ్ఱ నమర్చుటయో వానికి ముఖ్య మగు పని. దీనితో నాతని పని తీర్చుకొనినవాఁ డగును. మొక్క పెద్దదై స్వయంపోషకమున స్వాతంత్ర్యమునుగల స్థితికి వచ్చిన పిమ్మట, దాని వ్యాప్తి కాతంకము లేవైన కలిగినచో వానిని తొలఁగించుట అప్పుడప్పుడు క్రొత్త యెరువు వేయుట నలిగి కుళ్లిన గాకులను కొమ్మలను ఛేదించివేయుట మాత్రమే అతఁడు చేయవలసిన పని. [illegible] చెట్టు విజృంభించుచు స్వాతంత్ర్యవికాసమును దాస్య తాను మనుష్యుఁడై గాని సదా తన యాధికారము క్రిందనే యుంచుకొన నెంచక తన శ్రమ ఫలించె ననియు తన కార్యక్రమము సమంజస మైన దనియు గ్రహించును; మఱియు, ఈ మొక్కయొక్క క్రమాభివృద్ధిని కనిపెట్టు నవకాశము గల్గి తన యనుభవమును వక్కచేసికొనఁగల్గినందునకు కృతజ్ఞుఁ డగును.

తోఁటమాలి రెండు సంగతులను బాగుగ గ్రహించియుండును. ఒకటి ప్రతిబీజమును ప్రత్యేకలక్షణములతో నొప్పారుచుండు ననియు దాని లక్షణములకు భిన్నముగ నుండు వృక్షము దానిలో నుండి వెలువడఁజేయఁజాలుట యవివేక మనియు దాని స్వభావమును గనిపెట్టి తాను వర్తించుట విధి యనియు గ్రహించును. రెండవది: మొక్క యెంత చిన్న దైనను, దాని కోమలము లగు నులిపెళ్లు సయితము మహాశక్తిసమన్వితము లనియు రాతిగోడలను సయితము భిన్నము చేయఁజాలియుండు ననియు అది సజీవమై యుండ దాని కడ్డముగ నే శక్తియు నిలువలే దనియు గ్రహించును.

ఇటులే బాలుర బుద్ధియు నుండును. లోకవిఖ్యాతి గన్న రవీంద్రుని కవిత్వశక్తియు జగదీశచంద్రుని ప్రకృతిరహస్యశోధనాచమత్కృతియు శంకరుని యాధ్యాత్మికజ్ఞానమును బాల్యమున వారివారియం దడఁగి యవ్యక్తరూపమున నున్నవి. వీనిని వారివారి కనువగు విషయమునుండి మరల్చి వేఱు విధ మగు కార్యములను వారిచేత చేయించుట యసంభావ్యము. అవకాశములు కలుగ వేని నిరర్థకములై వారి బుద్ధులు నశించును. అవకాశములు కలిగినా, తమ ప్రత్యేకలక్షణసంశోభితము లగు మహాకార్యములను వీ రొనర్చియే తీరుదురు. వీరి గురువులు ప్రయత్నపూర్వకముగఁ గాని అప్రయత్నముగఁ గాని వారి కవకాశములు కల్గించినను, లేక వానియంతట నవి యవకాశములు కల్గినను, ఆ ధీశాలులు ప్రబోధము గాంచక యుండరు. అటుపిమ్మట వారి గురువులు గాని తదితరులు గాని యెంత సమర్థులైనను వారి నాఁపఁజాలరు. కాని, ప్రస్తుతవిద్యాపద్ధతి ప్రాథమికావకాశముల నే యరికట్టునదిగ నున్నది. ఎందఱెందఱో రవీంద్రులు జగదీశచంద్రులు శంకరులు ప్రశస్తికి రాకయే యడఁగిపోవుచుండిరి. నానావిధబీజములను తెచ్చి యొక గుంటలో విడి నీళ్లు పోసినట్లు, వివిధమానసికలక్షణములచే విలసిల్లు బాలు రందఱకు నొకే విద్యాక్రమమును ఒకేపరీక్షాంశజాలమును నిర్ణయించుటచేత అనర్థములు వాటిలుచున్నవి. కావున, ఉత్తమగురువు తనయొద్ద విద్య గఱచు బాలురను పరిశీలించి వారివారి కనువగు విషయములను గుర్తించి వానినే వారివా రభిమానశాఖలుగ నేర్పఱచి విద్య గఱపవలయును. భాషాసాహిత్యము చరిత్ర రాజనీతి భూగోళశాస్త్రము వాణిజ్యపద్ధతి గణితశాస్త్రము శిల్పములు సంగీతము నృత్యము వ్యాయామవిద్య మున్నగునవి సర్వమును వానివాని యర్హస్థానముల నలంకరింపఁగల సర్వకళాశాలలు స్థాపితములు గావలయును. సంఘమున నెక్కుడు బాలుఁ డయినను తన కనువగు పాఠశాల గాని విద్యాశాఖ [illegible] లభింపమిచే కృశింప రాదు. అట్టి విద్యాపద్ధతియే జాతీయ మైన [illegible] గాని స్వవిద్యావిధాన మనవలయును.

వేర్వేఱు బాలురు వేర్వేఱు మానసిక శారీరక నైతిక లక్షణములతో నుందు రనుట సమంజసమే. వానివాని కనుగుణముగ విద్యావిషయములు మాఱుచుండవలె ననుటయు సమంజసమే. కాని, జాతీయవిద్య యన నేమి? జాతిజాతికి ఒక విద్య యుండునా? విద్యకును జాతికిని సంబంధ మేమి?—ఈ ప్రశ్నలకు జవాబు కావలసి యున్నది. వ్యష్టిమానవులవలెనే జాతులును ప్రత్యేకలక్షణములతో వెలయుచుండును; ప్రత్యేకాదర్శముల నంగీకరించి వర్తించుచుండును. ఐరోపావారు రజోగుణప్రధానులు. వ్యష్టిస్వాతంత్ర్యము వ్యష్టిశక్తివృద్ధి వారి యాదర్శములు. సైనికనీతి వ్యాపారధర్మము వారి మార్గములు. సృష్టిని దానియందలి సర్వమును స్వాధీనము చేసికొని తమ యభ్యుదయమునకై వాని నెల్ల నుపకరణములుగ నొనర్చుకొనుటకు వారు సదా ప్రయత్నించుచుందురు. ఇందునకు తోడ్పడువారి జాతి వారలను మాత్రమే తమ సోదరకూటములోనికి రా నంగీకరింతురు. వారి ప్రవృత్తి యంతయు వ్యష్టిభావమునందు కేంద్రీకరించియుండును. వారి సాంఘికాచారములును సామ్రాజ్యనీతియు వారి జాతివారల వ్యష్టిస్వాతంత్ర్యమునకును సౌఖ్యమునకును తోడ్పడునవిగ నుండవలయును. అట్టి స్థితిని చేకూర్చుదానినే వారు జాతీయాదర్శముగ నంగీకరింతురు. కార్మికజనసంఘములు గాని వణిజకూటములు గాని

శ్రీమంతుల సమాజములు గాని స్త్రీల సమావేశములు గాని ఆయా బృందములలోని వ్యష్టిమానవుల స్వాతంత్ర్యమును పెంపొందించుచు జాతీయాధిక్యమును సామ్రాజ్యాధికారమును పోషించు మార్గముల నన్వేషించుచుండును.

ఈ వ్యష్టిభావమునే జాతీయతయందును చూపుదురు. వీరితర జాతివారలకు సహాయము చేయు నెడల కూడ తమ యాధిక్యమును మఱవరు. తమ్మాశ్రయించిన జాతివారల ప్రత్యేకాదర్శముల నంగీకరింపరు. అప్పుడు తమ వ్యష్టిప్రాధాన్యమునకు లోపము వచ్చునని వీరి భయము. ఈ భావము ననుసరించియే జగమంతయు నరుని సౌఖ్యమునకొఱకును విలాసమునకొఱకును సృజింపఁబడెనని వీరి మతము బోధించుచున్నది. ఐరోపియనులు నరులనఁగా తమ జాతివారు మాత్రమే యని యన్వయము చేయుదురు. ఎవరెవరి కెట్టి సాయమును ఐరోపియనులు చేసినను తాము నాభిస్థానమున నుండ ఇతరులు తమ్మనుసరించి తేజరిల్లవచ్చును. కాని, వారును స్వాతంత్ర్యమూని వర్ధిలుట వీరికిఁ గిట్టదు. ప్రస్తుతమహాఘోరయుద్ధమునకీ భావమే మూలము.

అమెరికనులును రజోగుణప్రధానులే యైనను, వారును ఐరోపానుండి వచ్చినవారే యయ్యును, వారు సాంఘికవాదులుగ మాఱిరి. ప్రప్రథమమున సంకుచితజాతీయభావములతో సామ్రాజ్యకాంక్షను వాణిజ్యాభిలాషను పెంచి యచ్చటి యాదిమవాసులను రూపుమాపి దేశము నాక్రమించిరి. అచ్చటికి పోయిన ప్రతి యైరోపా సంఘమును తమ దేశపు టాధిపత్యమునే స్థాపింపఁజూచెను. తుదకు తామందఱు నొకే ఖండవాసులగుటచేతను ఒకే యాదర్శముచే పఱఁగినవారగుటచేతను వాణిజ్యమునకు శాంతి యావశ్యకమగుటచేతను వీరి మాతృదేశవాసులు వీరిపై నధికారము చెల్లింప యత్నించుటచేతను వీరందఱేకమై సోదరభావమును కుదుర్చుకొనిరి. సత్త్వగుణమునకు చోటిచ్చిరి. చిరకాల మిట్లు జీవించుటచేత రాజకీయవిషయములందు కూడ ప్రత్యేకసంఘముల స్వాతంత్ర్యమును అన్నింటి సౌభ్రాతృత్వమును నంగీకరించిరి. తుదకు వీరు అన్యదేశముల నాక్రమించినను అచ్చటివారియెడల సౌభ్రాతృత్వమునే చూపుచు సాంఘికవాదులైరి. ఇటులే పేరెన్నికఁ గాంచిన జాతుల ప్రధానగుణములను సమష్ట్యాదర్శములను వివరింపనగును.

భారతజాతి లక్షణములను జాతీయాదర్శమును విచారింతము. వీరు సత్త్వగుణప్రధానులు. స్వార్థపరతను నిగ్రహించుట పరార్థపారీణతను ప్రోత్సాహపఱచుట జీవితావశ్యకముల స్వీకరించి బుద్ధిబలనైతికబలములతో పాటు ఆధ్యాత్మికజ్ఞానమును సాధన చేయుట వీరి జీవితమార్గములు. పరోపకారముకై యాత్మార్పణము చేయుట వీరి యాదర్శము. విశ్వవ్యాప్తమైన సోదరభావము వీరి మతతత్త్వము. మాత్సర్యరహితమగు సమగ్రాభివృద్ధి వీరి జీవితమార్గము. సర్వసమత్వము వీరి శీలము. భారతసంఘనీతిని విమర్శించినయెడల పై యంశములు తేటతెల్లము కాఁగలవు. సాంఘికు లందఱు బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులుగ విభజింపఁబడిరి. వీరందఱు నొక కుటుంబములోని యన్నదమ్ములవలె నుండిరి. వయసు ననుసరించి జ్ఞానము ననుసరించి శక్తియుక్తుల ననుసరించి యెవరికనువగు పనులను వారు చేయుచు సమష్టికుటుంబక్షేమమునకై పాటుపడుచు పరస్పరస్పర్ధలును ఈర్ష్యలును లేక జీవించు సోదరులవలెనే యుండిరి. ఇప్పటికిని పల్లెలం దుండువారాయా కులములవారు పరస్పరవైరములు లేక శాంతులై జీవించుచున్నారు. పట్టణములం దుండువారు నవ్యజనసంపర్కము చేతను విజాతీయవిద్యాదర్శముల నవలంబించుటచేతను సంఘస్థితిని చెడఁగొట్టిరి. వీరి ననుకరించుటవలన పల్లెలందును కొంత చెడుచున్నది. అయినను, ఆదర్శములు పూర్ణముగ మాఱిపోలేదు.

మూలసూత్రముల ననుసరించి జనులందు శక్తియుక్తులును విద్యాజ్ఞానసంపదలును హెచ్చినకొలఁది ఉత్తమతరవిధుల నవలంబించి సంఘమునం దున్నతగౌరవము నందుటకందఱకును అవకాశములు గలవు. ఐహికవాంఛలను విడిచి, అధికారాభిలాషము నణఁచి ఆముష్మికధర్మములను పూని, పరోపకారదీక్షతో జీవించుట బ్రాహ్మణునికి విధి. అట్టి సమగ్రునకే యత్యున్నతపదవి యొసఁగఁబడినది. వాని స్వార్థమునకవకాశము లేదు. అధికారగర్వమునకు చోటు లేదు. ఆతఁడు సర్వార్పణము చేసిన యాశ్రమసేవకుఁడు. వీని యుపకారము నందుటకందఱకును అధికారము గలదు. తన యోగ్యతను గుర్తించిన ప్రజలు ఐచ్ఛికముగ నొసఁగు గౌరవమును తప్ప మరిదేనిని కోరుటకును అతని కధికారము లేదు. కాని, సదా సంఘసేవ చేయుటకు ఆతఁడు మాత్రము పాటుపడవలసినవాఁడుగ నున్నాఁడు. సంఘసేవకై యితఁడు సమస్తకళలను సర్వవిద్యలను నేర్వవలయును. అన్ని కార్మికవిద్యలను వైద్యవిద్యను శాస్త్రములను నేర్చుకొనవలయును. ఇటీవల నన్యదేశీయపరిపాలనమున సాంప్రదాయములు సంచలించి దేశీయపరిశ్రమలు క్షీణించి దేశీయకర్మవిద్యాధికుల గౌరవమునకు వసతు లదృశ్యమైనయెడ, బ్రాహ్మణులు పరిశ్రమలను నిరసించుచు అట్టివానిని పనిచేసి జీవించువారిని గౌరవహీనులుగ ప్రదర్శించుచు కల్పితసూత్రములను సృజించిరి. కేవలము అక్షరపరిచయమాత్రమున పరఁగు చదువులకు మాత్రమే గౌరవము నాటింపఁబడుచువచ్చినది. మన దేశము నాక్రమించిన వర్తకుల కిది లాభముగఁ గాన్పించినది. శిల్పులును వైశద్యకలితులును దేశాభ్యుదయహేతువులగు పరిశ్రమలును వాని ననుసరించి వాణిజ్యమును దేశధనమును పాలకవర్గపు జాతివారగు విదేశీయవర్తకులచే చిక్కినవి. ఈస్టు ఇండియా కంపెనీవారి చరిత్రలను విమర్శించినచో ఈ యంశములు తేటపడఁగలవు. మఱియు, మహోన్నతమగు క్షేత్రగణితమును సాధించిన బ్రాహ్మణశిల్పులు తమ విద్యలను యజ్ఞవేదికల నిర్మాణసూత్రములందును దేవాలయనిర్మాణకౌశలమునందును వాస్తుశాస్త్రమునందును ప్రదర్శించి యుండిరి. పూర్వాచార్యులగు నానావిధశాస్త్రజ్ఞులు చేయుటకును విగ్రహరచనకును ప్రాచీనయంత్రనిర్మాణములకును అస్త్రశస్త్రనిర్మాణమునకును కలయు శాస్త్రములనెల్ల కార్మికానుభవము లేకయే కేవలము చదువుచే బ్రాహ్మణులు రచించిరని గాని ఏ దేవతయో వ్రాసి యిచ్చెనని గాని విశ్వసించుట చారిత్రకవిమర్శనము గాదు

గదా. ఇటులే పూజ్యులగు మహాబుషులు రచించిన వైద్యశాస్త్రములను శిల్పశాస్త్రములను వాస్తుశాస్త్రములను ఇంక ననేకశాస్త్రములను విమర్శింపుఁడు. అవస్థాంతరములందు దేశీయకళలకును శాస్త్రములకును ప్రముఖత నశించినప్పుడు, వానికిని వానివలన జీవించు వారికిని గౌరవము తగ్గినది. అప్పుడవి బ్రాహ్మణవృత్తులు గావను భ్రమయు కల్పిత మైనది. విరిగి దేశీయులకు స్వజాత్యభ్యుదయమున పాలుగొను నదృష్టము వచ్చినప్పుడు వీనికిని పూజ్యత లభింపఁగలదు. సూచన లప్పుడె కాన్పించుచున్నవి. రాజభాష యగు నింగ్లీషు సంసర్గము గల చోట ఈ వృత్తులకు గౌరవము వచ్చియే యున్నది. బొంబాయి, కలకత్తా మొదలగు చోట్ల నాంగ్లవిద్యాకలితు లగు దేశీయచిత్రకరులకును శిల్పులకును ప్రముఖత యొసంగఁబడుచున్నది.

భారతసంఘమున రెండవ తెగ క్షత్రియసంఘము. వీరికిని యితరులతో వైరము లేదు. సంఘమునం దితరుల కెంత ప్రాముఖ్యము గలదో వీరికి నంత గలదు. వీరు సంఘసంపదను దేశమును కాపాడ వలసినవారు; రజోగుణప్రధానులు; పాశ్చాత్యులతో పోల్ప దగినవారు. కాని, పాశ్చాత్యులు సర్వమును జయించి యద్దానిని స్వార్థమునకై యుపయోగించుచు ఇతరులను గూర్చి తేతె మ్మనుచ ండ, భారతవీరుఁడు సంఘక్షేమమునకై స్వార్పణము గావించి రము నా రక్షణమును గొని వర్ధిలు మనును. పాశ్చాత్యవీరుఁడు న న్నె దఱు సేవింతురో నాఁడుఁడు నావలన నెంత యైశ్వర్యము సమకూరెనో గణింపుఁడన, భారతవీరుఁడు నే నెందఱ కుపకృతి చేయుచుంటినో నావలన నెందఱు రక్షణ గాంచఁగలరో యెంచుఁ డనును. క్షత్రియునకు కూడ స్వార్థత్యాగము పరార్థరక్షణము దేశసేవయు గమ్యార్థములుగ నున్నవి.

మూఁడవ తెగవా రగు వైశ్యులకును సంఘసేవయె ధర్మము. ఆ సంఘసేవను సమర్థతతో తమ నేర్పు కొలఁది నిర్వహించుటే వారి గమ్యార్థము. వీరును ఇతరులను ఈర్ష్యాభావమున చూఁడరు. ప్రజల యైహికవాంఛల కనువగు పదార్థములను ధనమును సేకరించి వానికి ప్రచారము కల్గించుటే విధిగ నెంతురు. దేశమందలి ధర్మము లన్నియు వీరిపై నాధారపడియుండును. వీరు సంపన్ను లైనకొలఁదిని సంఘమువారికి స్థైర్యము హెచ్చుచుండును. ఇఁక చతుర్థులు నిటులే దేశారాధనపరులై వఱలుచుండిరి. వీరికి చదువులు తక్కువయే. అయినను, విదేశీయసంసర్గము తక్కువగుటచేత దేశీయ సాంప్రదాయములను కాపాడుచుండిరి. అజ్ఞాను లను మాటయు వాస్తవమే గాని, అగ్రజులపై భక్తి గలిగి వర్తిలుటవలన సంఘలాభమునకు తోడ్పడుచుండిరి. వీరిబోఁటివా రితరదేశములలో నుండిన యెడల, వారి ధనసంపదలును అజ్ఞానమును వారి లోలతకును సంఘపీడనమునకును నుపయోగపడియుండును. అవి లేక దారిద్ర్య మున్న చోట వారు సంఘమున కెల్ల శత్రువులుగ నుండెడివారు. వారు శాంతులై యుండరు; ఇతరులకు శాంతిని నిలువనీయరు. మన దేశమునను చతుర్థుల యోర్పు మిక్కిలి యద్భుతమును గొలుపును. ఒంటిపూఁట యన్నమును తిని కృశించుచున్నను తృప్తులై యుందురు. కొంచెము కలిమి యరుదుగ నున్నను, వారు ముతుకగుడ్డలనే ధరించుచు జొన్నన్నమే తినుచు మట్టికుండలనే వాడుకొనుచు సామాన్యపు టిండ్లలోనే నివసించుచు మోటు జీవనమునే చేయుచు, తమ యదృష్ట మదియే యని వారు తమ పాటువలన లభించు సౌఖ్యము నితరులకు పంచి యిచ్చుచున్నారు. వార యజ్ఞానమునకు తోడు సహిష్ణుత తృప్తి స్వార్థత్యాగశీలము నుండుట మహాద్భుతము. కాలానుసార మగు విద్యలను వారికి నేర్పి యుత్తమతరజీవితమునకు వారి నర్హులుగ నొనర్చుట దేశమున కెంతయు శ్రేయోదాయకము. వీరి సద్గుణపుంజము ప్రవృత్తిరూపము దాల్చి దేశము నున్నతికి తెచ్చును. ఉత్తమదశయం దున్న సోదరులు వీరికి చేయూఁత నిచ్చుట విధి.

ఇంకను పంచము లనువారు గలరు. వీరు ముఖ్యముగ ననాగరికు లగు ననార్యజాతివారుగ గణింపఁబడుచుండిరి. వీరు మిక్కిలి మూఢదశయం దున్న యాదిమవాసుల సంతతివా రనుటకు సందియము లేదు. కాని, చిరకాలము వీ రార్యులతో నివసించి యార్యుల కష్టసుఖములకు తోడ్పడుచు వారి యభ్యుదయమునకు మూల మగు సేవల నన్నింటిని గావించుచుండె వీరి యున్నతికి తేకుండుట గొప్ప లోపము. వీరు ముఖ్యముగ చతుర్థులు సంఘమున కొనర్చుచు వచ్చిన సేవను తమపైకిఁ దీసికొని వారు కూడ సౌఖ్యాభిలాషు లగుట కవకాశములు కల్గించిరి. ఆర్యాగమనకాలమున కొంతవఱకు నీ నార్యులు ఓడించినను క్రమక్రమముగ వారియం దనురాగమును వహించిరి. వారిని తమ హిందూమతములోనికి తీసికొనిరి. వారికి హిందూమతమును బోధించిరి. మఱియు, వారి సంసర్గమున నా మతాచారములను గూడ కొన్నింటి నార్యులు నేర్చుకొనిరి. గంగానమ్మ పోలేలమ్మ ఆటలమ్మ మొదలగు గ్రామదేవతల నారాధించుట భూతములను దయ్యములను గొల్చుట యనార్యులకలనఁ గలిగిన యాచారములే. ఇందువలన ఆర్యులు విదేశాక్రమణము చేసినను అచ్చటి యాదిమనివాసులను నాశము చేయక వారియెడల సౌభ్రాతృత్వమును చూపినట్లు తెలియును. ఇంకను చిత్రమే మనఁగా, ఈ యనార్యులందు నీశాలులును ఆత్మనిగ్రహసమర్థులును గాన్పించినప్పుడు వారిని మహాబుషులలోఁ జేర్చి గౌరవించిరి. ఉపనిషత్తులలో కొన్నింటిని ఇట్టివారు రచించి రని చెప్పుదురు. ఇట్లు భారతీయుల యాదర్శము సమష్ట్యభ్యుదయ మని గ్రహింపఁగలము. పాశ్చాత్యుల వ్యష్ట్యభ్యుదయవిధాన మీ కాలమున పరిపక్వము గాంచుచుండ, భారతీయుల సమష్ట్యభ్యుదయవిధానము చిరకాలము క్రిందటనే పరిపూర్ణత గాంచి కాలచక్రము ననుసరించి యిప్పటికి క్రిందైనది. మఱియు, ఆ కాలచక్రము ననుసరించియే యున్నతికి రాఁగలదు. కొందఱు భావించునట్లు పునరుద్ధారణమున కలవి గానంతగా శిథిలమై పోలేదు.

మూఁడు శతాబ్దుల క్రిందట వర్తకమునకై మన దేశమునకు వచ్చి క్రమక్రమముగ నిక్కడ స్థిరపరిపాలనము నేర్పఱచుకొనిన బ్రిటిషువారు భారతదేశమునందు సంభవించిన విప్లవముల నడంచి కల్లోలములను మాన్పి శాంతిని నెలకొలిపిరి. ఇంకను భారతభూమి

నౌన్నత్యమునకు తెచ్చి తిరిగి పూర్వపు ఘనతను చేకూర్పవలసిన వారుగ నున్నారు. నీ రీ విధిని చక్కఁగ గుర్తించియే యున్నారు. బ్రిటిషు రాజనీతిజ్ఞులు భారతదేశము పట్ల మహౌదార్యబుద్ధిలో నిప్పుడు వర్తిలుచున్నారు. కాని, మన దేశమునకు ఉద్యోగవశమున వచ్చిన బ్రిటిషువారును వర్తకము నెలకొలిపిన బ్రిటిషువారును మాత్రము తమ జీవితాదర్శమునకును భారతజీవితాదర్శములకును భేద మున్న దని గ్రహింపఁజాలకున్నారు. మఱియు, భారతీయులకు ప్రత్యేకము లగు నాదర్శము లున్న వనియే గ్రహించినట్లు లేదు. కాని, వీరు భారతవీరుల సలహాల నంది భారతీయుల జీవితాదర్శముల కనుగుణ్యముగ వర్తించినయెడల సిద్ధింపఁగల మహాఫలములు భారతదేశమున పాశ్చాత్యాదర్శములను నెలకొలుపఁజూచుచు ప్రజల నెల్ల సహజలక్షణవిరహితులుగ చేయ నెంచుటవలన విపరీతము లైనవి. ఒక జాతియొక్క యాదర్శములును సాంప్రదాయములును ఆ జాతియొక్క మాతృభాషయందును దాని వ్యాకరణమునందును వాఙ్మయమునందును ఇమిడియుండును. వానికి ప్రబోధము కల్గించి యున్నతికి తెచ్చుటకు తగిన సాధనము లా భాషావాఙ్మయములే యగును. కావున, ఏ జాతివారికిని విజాతివారు గురువులుగ నుండఁజాలరు. ఒకవేళ నన్యజాతీయులు విద్యాశాఖయం దుద్యోగములు వహించినను, వారు సలహాదారులుగను ధర్మదర్శులుగను నుండి స్వజాతీయులచేత విద్యాబోధనకార్యమును నడుపవలయును. కేవలము వర్తకమునకై వచ్చి యా వర్తకమున కనుకూలముగ నొనర్చుటకే యీ దేశమును పాలింపఁబూనిన బ్రిటిషువారు దేశాభ్యుదయమును పూర్ణముగ చేకూర్పఁజాలరు. ఈ తత్త్వము నెఱింగియే విక్టోరియా రాణి దేశపాలనమును కంపెనీవారి చేతులలోనుండి తప్పించి రాజనీతిజ్ఞుల హస్తములం దిడినది. మఱియు, భారతీయులను బ్రిటిషు వారితో సమముగ చూచుచు, సమానౌన్నత్యమునకు తెచ్చెద నని వాగ్దానము చేసియున్నది.

కాని, భారతదేశమున విద్యాశాఖాధికారమును తమ హస్తముల నుంచుకొనిన విదేశీయులు సర్వము నాంగ్లభాషామూలమున నేర్పనెంచి దేశభాషలను శుష్కింపఁజేసిరి. ఆ యత్నము విఫలమై దేశీయయువకుల కెంతయు ననర్థదాయకముగ నున్న దని తెలియవచ్చినది. అయినను, దీనిని చక్కఁబఱచుటకు మార్గాంతరము దేశభాషాభివృద్ధి యని యొప్పుకొనకున్నారు. ఆధునికపద్ధతిని స్వదేశభాషలలో వ్రాయఁబడిన ప్రకృతిశాస్త్రములు వాణిజ్యశాస్త్రములు కార్మికకళలు లే వని బెదరించుచున్నారు. వానికి ప్రయోజనమును కల్పింపనిదే యవి నిర్మితములు గావు. ప్రయోజనము కనఁబడెనా యొక్క త్సరములో దేశీయభాషాగ్రంథములతో భాండాగారములు నిండఁగలవు. గ్రహింపవలసిన జ్ఞాన మేదియో వివరింప నలవి గాక యా జ్ఞానమును దానికి కరండికవలె నున్న భాషను నొక్కుమ్మడిగ లోఁగొన నెంచు విద్యార్థులు ఫలములోని గుజ్జుకొఱకై తొల్లికను గూడ భుజించి భంగపడు మూఢజనులై పఱఁగుచున్నారు. మఱియు, కొందఱు మన యాంగ్లేయుల పాలనమువలన విప్లవములనుండి రక్షణము పొందినారము గావున, వారి భాష మూలముననే జ్ఞానకలితులము గావలయు ననుచున్నారు. దైవఘటనమువలన తల్లి పాలు లేక యావుపాలచే బ్రతికిన శిశువు గోవుజాతిలో కలిసియుండఁగలదా? దిక్కు లేని సమయమున శరణ్య మైన గోవుం గూర్చి బాలుఁడు కృతజ్ఞుఁడుగ నుండఁగలఁడు; మఱి యా గోవును పూజింపఁగలఁడు. అటులే భారతీయులు బ్రిటిషువారికి కృతజ్ఞులై యుండఁగలరు గాని బ్రిటిషువారుగ మాఱిపోఁజాలరు. కొందఱు స్వప్రయత్నముచే భారతీయులేమియు నొనర్పరాతనియు ఆంగ్లేయులే సర్వమును సమకూర్చి చల్లఁగ కాపాడఁగల రనియు వాదించుచున్నారు. ఈ విశ్వాసము భారతీయుల మానసక్షేత్రములను చట్రాతివలె నావరించియున్నది. స్వజాత్యుద్ధరణమునకై యెట్టి ప్రయత్నములు చేయవలయు ననినను ఈ రాయి యడ్డముగ నున్నది. జ్ఞానాంకురమునకు వేరు సాఁగు నవకాశము లేకున్నది. దైవఘటనమువలన నైరోపాయుద్ధ మను భూకంపము ఈ చట్రాతిని పగులఁగొట్టినది. యుద్ధావశ్యకతల ననుసరించి యూరపుదేశవాసులు భారతీయులను గూడ ప్రయోజకులుగ నాదరించుటచేత భారతజాత్యుద్ధరణాంకురమునకు అమృతబిందువులు లభించినవి. దాని వేళ్లు నిష్క్రియాత యను చట్రాతి సందులనుండి మానసక్షేత్రముల లోనికి మార్గము గాంచినవి. స్వదేశోద్యమమునకు నూతనోజ్జీవము కల్గినది. ఇఁక దీని యభివృద్ధి నెవరు నాఁపఁజాలరు; ఇంతవఱకును దాని నాఁపిన చట్రాయి శతధా భిన్న మైనది.

హఠాత్తుగ రేఁగిన యుద్ధఝంఝామారుతము సకలజాతిభూజములను అల్లల నాడించినది. ఆ మారుతమే బ్రిటీషుజాతిభూజశాఖలను భారతభూమి పైపునకు వంచినది. భారతజాత్యుద్ధరణోద్యమలత లా శాఖల నలముకొనినవి. ఒండొరుల విడిపించుకొను మార్గము లేదు. రెండును అభివృద్ధి గాంచి అమృత ఫలములను పడయఁగలవు. ఒండొరుల సువర్ణపత్రపుష్పఫలములచే రెండును శోభాయుతములై వెలయఁగలవు. ఆంగ్లేయుల రాజనీతియు వాణిజ్యకౌశలమును సామ్రాజ్యనిర్మాణదక్షతయు భారతదేశమును క్షేమముగ వర్ధిల్లఁజేయును. భారతీయుల స్వార్థత్యాగమును పరోపకారాదర్శమును సర్వసౌభ్రాతృత్వమును ఆంగ్లసామ్రాజ్యమున కూఁత నిచ్చును. అక్కఱ కలుగునప్పుడెల్ల భారతజాతి బ్రిటీషుసామ్రాజ్యమునకు మహాబలసత్త్వకోశాగారమై వెలయఁగలదు. ఇందున నుభయజాతులును ఆత్మీయలక్షణములతో నభ్యుదయము గాంచి పరిపూర్ణతను సాధింపవలెను.

కావున, భారతజాతి విద్యాపద్ధతి భారతీయుల చేతులలో భారతజాతీయసాంప్రదాయములతో భారతజాతీయాదర్శప్రకాశనమునకై పోషణ గాంచవలయును. తోఁటమాలీలవంటి గురువులు గావలయును. ప్రతిబాలుఁడును బాలికయు ఐదవ యేఁట విద్యాభ్యాసమునకై గురువున కప్పగింపఁబడినప్పుడే వారు భారతమాతృసేవకర్పణ మైన ట్లెంచఁబడవలయును. గురువు తా నొక శిష్యుని చేర్చుకొనినప్పు డెల్ల అఖండభారతమాతృసేవాధురంధరునికి సుశిక్షను గఱపు పావనవిధిని తాను తలఁ దాల్చుచున్నట్లు గ్రహింపవలెను. పూర్వపు మహావీరులను శూరులను సూరులను మదిఁ దలఁచి వారి

యాశీర్వాదబలమును వారి యావేశమహిమను విద్యార్థులకు లభింపఁజేయుటకై పూనుకొనవలెను. స్వదేశభూగోళశాస్త్రము స్వదేశ వీరచరిత్రము స్వదేశధర్మమును సకలవిద్యలకును కేంద్రస్థానమై వెలయవలయును. స్వదేశభూగోళ మను క్షేత్రమును స్వదేశచారిత్ర మను నలవయు స్వదేశసాంప్రదాయ మను నీరును స్వదేశాభ్యుదయ మను సూర్యరశ్మియు స్వదేశాభిమాన మను పుష్పములును స్వదేశసేవ యను ఫలములును గలిగి దేశీయవిద్యావల్లికామతల్లి వర్ధిల్లుఁగాక!

విద్యాభ్యాసము ప్రప్రథమము నుండియు దేశచరిత్రములను స్థలపురాణములను అనుసరించి యుండవలయును. ఇది భారతీయుల పూర్వాచారము. శిశువులను గూర్చి గానము చేయు జోలపాటలే మన కా మార్గమును విశదము చేయుచున్నవి. ఎన్నెన్నియో మహావీరచరిత్రము లీ పాటలయం దిమిడియున్నవి. నామకరణముననె పూర్వపూరపూజన మారంభ మగుచున్నది. జీవితమందు మన కేవిషయమున దారి చూపవలసివచ్చినను, రామాయణమహాభారతకథ లాధారముగ నున్నవి. ప్రతిపట్టణమును ప్రతి పల్లెయుఁ ప్రతిపర్వతమును ప్రతి గుట్టయు ప్రతిభూజమును ప్రతినదియు ప్రతి చెఱువును, ఇది యది యన నేల, భారతభూమియందలి ప్రత్యణువును ఏదో పావనకథ కాధారమై యున్నది. ఈ కథల ననుసరించితిమా పసితనము మొదలు సర్వకళాశాలనుండి భారతీయులు వెలువడువఱకును గావలయు ధర్మసూక్ష్మములును వానియున్నతవిద్యల కాధార మగు భూగోళ శాస్త్రిక చారిత్రక విద్యలకే గాక అర్థికశాస్త్రము ప్రకృతిశాస్త్రము మున్నగు సకలవిద్యలకును ప్రసాదిగా నుండవలయు మానసికశిక్షణము కూడ లభింపఁగలుగు. ఈ కథల ననుసరించియే తప్పక విద్యావ్యాపనము చేయవలయును. కొంత కాల మైన పిమ్మట విద్యాదృఙ్మండలము హెచ్చించి క్రమముగ నీ ప్రారంభవిద్య నాధారము చేసికొనియే జగము నంతటిని దృఙ్మండలములోనికి తేవచ్చును. ఈ విధానమునకు మాతృభాషాసాధనము తప్ప వేఱు మార్గము లేదు. ఈ విధానము తప్ప సమంజస మగు పద్ధతి లేదు. మన దేశభాష లగు హిందీ మరాటీ బెంగాలి గుజరాతి మలయాళము తెలుఁగు అఱవము మొదలగు నన్నిభాషలును విశాలవాఙ్మయములతో నొప్పారుచున్నవి. జాతీయసాంప్రదాయములును ఆధ్యాత్మికజ్ఞానమును పౌరాణికగ్రంథజాలమును శాస్త్రములును అన్నియు ఆ భాష లన్నింటను గలవు. "ఏ యంతరిక్షము క్రింద మానవుని బుద్ధి మాన్యతరప్రసాదసిద్ధిని గాంచినదో మహత్తరజీవితసమస్యలను మననము చేయఁగల్గినదో ఆ సమస్యల నన్వయము చేసికొని ప్లేటో క్యాంటు మున్నగు తత్త్వవేత్తల గ్రంథములను పఠించినవారి మన్నన వడసినదో ఆ భూమి యేది యని నన్నడుగుదురేని, నమ్మాటికి హిందూదేశమును చూపవలసియున్నాఁడ" నని మాక్సుముల్లరు మహాశయుఁడు వక్కాణించియున్నాఁడు. కావున, దేశీయభాషల సమగ్రతను గాని దేశీయపద్ధతుల యోగ్యతను గాని దేశీయుల నిపుణతను గాని నిరసించుచు పురోభివృద్ధ్యాశానిస్పృహులైనవారు ఆత్మసంశయమును వీడి ఆత్మవిశ్వాసమును పెంపొందించుకొనుచు, కావలసిన చోట్ల నెల్ల అన్యుల సాయమును పడసియైనను స్వయంకృషిచేత జాతీయ విద్యావిధానము ననుసరింతురుగాక! అచిరకాలముననే భారతము లభ్యుదయమును గాంతురుగాక! ప్రతిభారతీయుఁడును జాతియందు తన స్థానము సర్వాలీల నలంకరించు నవకాశము గలవాఁడగునుగాక! విద్యాలయము లెల్ల ఈరీతిని జాతీయవీరులకు సుశిక్ష నొసంగు భవనములై విలసిల్లుఁగాక! పూర్వపు మహాఋషిసంతతి కాలానుగుణ్య మగు రూపాంతరములతో భారతమాత గర్భమున జనించి యీ పూజ్యురాలిని ప్రపంచమునందలి దేశములలో నగ్రగణ్యగ ప్రదర్శింపఁజాలును గాక! భారతీయోద్ధరణమునకు భారతజాతీయవిద్యయే సుగమమార్గ మని యెల్లరు గ్రహింతురుగాక!

# ఆంధ్రోద్యమము — మన నాయకులు

దుగ్గిరాల రాఘవచంద్రయ్య చౌదరి గారు

జాతియొక్క మతము క్షాత్రము సౌభాగ్యము ధర్మము పరాక్రమము పాండిత్యము శౌర్యము సాహసము నాగరికత మొదలగు సర్వగుణములును తన్నాయకునియందు మూర్తీభవించును. నాయకుల యుదారగుణములు జాత్యాదర్శమునందు ప్రతిఫలించి జాతిని తేజోవంతముగఁ జేసి జాతియందు నశించుచున్న యుత్తమగుణములను బ్రజ్వలింపఁజేయును. నాయకుఁడు క్షాత్రవంతుఁడైనచో జాతి క్షాత్రసంశోభితమై వాసి గాంచును. నాయకుని విజ్ఞానము జాతికి విజ్ఞానమును నాయకుని వితరణము జాతికి వితరణమును. ఇంత యేల, నాయకుని కే గుణము లుండునో ఆ గుణములు జాతికిఁ గూడ ప్రచండగతితో సంక్రమించి జాతిని తదుచితస్థితికిఁ గొనివచ్చును. నెపోలియనుయొక్క యప్రతిహతక్షాత్రము ఫ్రెంచిజాతియందు మూర్తీభవించి సకలలోకభయంకరమై జగద్విఖ్యాతమై బహువ్యాప్తమైన సామ్రాజ్యనిర్మాణమునకు కారణమయినది. రాముని పితృభక్తి పాండవవీరశేఖరుల క్షాత్రము హరిశ్చంద్రుని సత్యనిరతి విక్రమార్కుని యౌదార్యము మొదలగు గుణములు భరతఖండమున తత్తదుచితసమయముల వ్యాపించి వివిధజాతులను వివిధవిశాలగుణసంశోభితములనుగాఁ జేసినవి. హరిశ్చంద్రుఁడు శ్రీరాముఁడు పరశురాముఁడు సీత మొదలగువారు ప్రాచీనార్యుల సత్య పితృవాత్సల్య క్షాత్ర పాతివ్రత్యము లను సత్తమాదర్శముల మూర్తులు. మఱియు, ఆ గుణములను జాతియందు సర్వకాలము విజృంభింపఁజేయు శక్తి గల్గి రాత్రింబవళ్లు క్రొత్త క్రొత్త కాంతులతో ప్రకాశించు దీపములు, అసాధారణతేజోవంతములు నవర్ఘములు నగు మణులు. నాయకుని యున్నతస్థితియందు సంతసమును అనితరసాధారణగౌరవమంగు గర్వమును కష్టస్థితియందు సానుతాపమును జాతికి సహజము. నాయకుఁడు జాతియొక్క యశేషశక్తి దృక్ప్రచారపాత్రమగు కేంద్రీకృతస్థానము—జాతియొక్క యున్నతస్థితిని క్షాత్రమును జ్ఞానమును ఔదార్యమును మేధాశక్తిని సాహసమును, ఇంత యేల, సకలోత్తమగుణములను ప్రతిఫలించు బింబము—కాదు జాతియొక్క శిరస్సు.

అత్యంతదుర్ఘటసమస్యలు తటస్థించి క్షోభ పెట్టి చీకాకు పఱచినప్పుడును శత్రుపరంపరల ధాటికి తాళఁజాలక సుడివడినప్పుడును నిరంకుశప్రభువుల విపరీతదారుణకార్యపరంపరలచే నణఁగద్రొక్కఁబడి స్రుక్కి ధైర్యము గోల్పోయి నిరాధారమైనప్పుడును నీతి మతము ధర్మము విజ్ఞానము మొదలగునవి నశించి తీవ్రసంస్కరణ మవశ్యమైనప్పుడును జాతి బిక్కమొగముతో అసామాన్యగుణవిరాజితుఁడగు నాయకుని రక్షణకై నిరీక్షించుచుండును. అనితరసాధారణప్రజ్ఞతో తేజముతో ధైర్యముతో క్షాత్రముతో శాంతముతో స్థైర్యముతో గంభీరహృదయముతో ఆ దుర్భరకష్టపరంపరలను విషమసమస్యలను నాయకుఁడు మార్కొని జాతి నుద్ధరింప యావచ్ఛక్తిని వినియోగింప సంసిద్ధుఁడై విజయముతోఁ గూడ దేశోద్ధరణమునో లేక పరాజయముతో నాశనమునో పొందవలెను. హిందూదేశమును తురుష్కుల బాఱిఁ బడకుండ చేయనెంచి పరాజితుఁడై పృథ్వీరాజు క్షాత్రధర్మోచితముగ యుద్ధరంగమున శత్రువులతో పోరి చచ్చుట ఇందునకు హిందూదేశచరిత్రమునందు ప్రత్యక్షముగా కన్పట్టు ప్రమాణము.

సుప్రసిద్ధాంధ్రరాష్ట్రమునందు పూర్వకాలమున ధీరులై విఖ్యాతిం జెందిన యుత్తమనాయకులు పెక్కురు గలరు. వారి యుదారగుణములు భావములు వాక్కులు తేజోవంతము లగు చేతలు కాలవశమున చీఁకటియందు నిద్రించుచున్న యాంధ్రప్రపంచమునందు ప్రకాశాభావముచే మినుకుమినుకు మనుచు నస్పష్టమనోహరకాంతిబీజములను వెదఁజల్లుచు వెలయుచున్నవి. ఆయా మనోహరకాంతులను నేత్రోత్సవముగా క్రొత్త ప్రపంచయాత్రయందు నగ్నితేజముతో జవసత్త్వములతో పందెము వైచి పర్యాప్తిలేని యనన్యసామాన్యమగు ప్రాచీనవైభవమును ఉన్నతస్థితిని బొంది ప్రపంచమునకు మిఱుమిట్లు గొల్పుటకు మాఱుగా మట్టుగొని యఱవిచ్చిన కండ్లతో నిప్పుడిప్పు డుదయించిన — ఉదయించుచున్న — యాత్మశక్తి తేజమును చూచుట కాంధ్రజాతి భయపడుచున్నది. మహాయోధాగ్రేసరుని ఆంధ్రజాతీయక్షాత్రమూర్తిని అసాధారణప్రతాపమార్తాండుని వితరణగుణనిధిని అనన్యసామాన్యవివిధగుణవిశిష్టుని ఉదారుని సాహసైకధనుని పుంజీభూతాంధ్రగుణరాశిని కృష్ణదేవరాయసామ్రాట్టు నవలోకింపుఁడు! అతఁడు అంగ వంగ కళింగ పాంచాల మహారాష్ట్రాది హిందూదేశస్థ వివిధరాష్ట్రములును మహమ్మదీయ మతముచేతను మహమ్మదీయ నాగరికతచేతను ఆచారాదులచేతను సమ్మోహితములై యాత్మవ్యక్తిత్వమును గోలుపోవుచున్నప్పుడు చెలియలికట్టయై నిల్చి తన సామ్రాజ్యమున కా వాసన సోఁకకుండఁ జేయుటయే గాక వివిధరాష్ట్రములును కుక్షీభూతశోభచే చెన్నుమాసియుండ విజయనగరసామ్రాజ్యహిమాంశువున కాత్మీయశోభాయమానప్రతిభచే షోడశకళాపరిపూర్ణస్థితి నొసంగి భారతదేశాంతరిక్షమునం దా బింబము నన్యదుర్లభప్రభాపటలముతో ప్రకాశింపఁజేసిన ప్రభారాశి; అనితరసాధారణశక్తితో అవిదితపరాజయముతో శత్రుమండలములను దహించి యాంధ్రక్షాత్రమును పరిపూర్ణస్థితికిఁ దెచ్చిన వీరవరుఁడు, ధీరవరుఁడు, ముక్కు మూసి జపించు విద్యా

రణ్యము లెక్కడ! సుప్రసిద్ధవిజయనగరనిర్మాణ మెక్కడ! చూడఁడా ప్రదేశము భయంకరసాంద్రారణ్యములచే నగమ్యముగా నున్నది. ఎక్కడఁ జూచినను మత్తేభఘీంకృతులు శార్దూలనినదములు నక్కల నెడబొబ్బలు క్రూరమృగసంచయనినాదములు పొదలు భయంకరగుహలు కాంతారములు మహావృక్షములు గుట్టలు చెట్లు దిబ్బలు. కాని, నిరంతరపరిశ్రమకును కేంద్రీకృతప్రయత్నమునకును పట్టుదలకును సాధ్యము గాని దేమి గలదు? ఇప్పు డా భయంకర శార్దూలనినదముల స్థానమును మధురమృదంగనాదము లలంకరించినవి. ఆ యాకాశవిడంబితుంగవృక్షసంతతులు వివిధసౌఖ్యనిలయము లగు సౌధపరంపర లైనవి. క్రూరమృగసంతానభయంకరము లయిన యా కాననములు విలాససంచలన్మృగసంశోభితారామములుగ పరిణమించినవి. కాంతారములు రాజమార్గములుగను ఆ వికృతములగు బయళ్లు మనోహరపుష్పవాటికాసమేతము లయిన కాసారములుగను మారినవి. రాజకీయవిప్లవములు సంభవించినప్పుడును ధర్మవిలోపము మతసాంకర్యము మొదలగు దుష్కరసమస్య లెదుర్కొనినప్పుడును ప్రబల శత్రువిజృంభణము కల్గినప్పుడును నిరంకుశప్రభువుల క్రూరకర్మముల చేతను పాపకృత్యములచేతను అణఁగఁద్రొక్కఁబడి జాతి విషమ స్థితియం దున్నప్పుడును సాహసముతో రంగస్థల మవతరించి యాత్మ లాభములను వర్జించి యవశ్యమైన సర్వస్వమును ప్రాణములను గూడ నర్పింప సంసిద్ధులై నాయకత్వము వహించి జాతి నుద్ధరించినట్టియు అట్టి పవిత్రకార్యప్రయత్నములం దాత్మబలిని చేసినట్టియు మహాధీర వరులు ఆంధ్రదేశచరిత్రమునందు పెక్కురు గలరు. పాపరాయాది బొబ్బిలివీరులు యుగంధరమంత్రి ప్రతాపరుద్రుఁడు మొదలగువా రట్టి మహామహులలో కొందఱు.

ఆంధ్రజాతి కిప్పుడు విషమసమయము సంప్రాప్తమైనది. పూర్వౌన్నత్యము వైభవము నశించినది. విజయనగరసామ్రాజ్యమునాఁటి విక్రమము ఓరుగంటిసామ్రాజ్యకాలమునాఁటి యున్నతస్థితి పల్నాటి వీరుల కాలమునాఁటి క్షాత్రము నేఁ డాంధ్రజాతియందు కన్పట్టవు. విక్రమము శౌర్యము ధైర్యము సాహసము మొదలగు గుణరత్నములు తొలఁగినవి. గాఢాజ్ఞానతిమిరము విస్తరింప, ఆంధ్రజాతి కాలక్రమమునఁ దన తొల్లిటి యున్నతగౌరవమును భారతజాతులందు తనకుఁ గల స్థితిని విధిని సర్వమును మఱచినది. నిస్సహాయ యైన యాంధ్రజాతి యపారధనసంచయములు రక్తములవలె త్రోలివేయఁబడినవి. అవిద్య అవిశ్వాసము పిఱికితనము భయము అసహాయత్వము మొదలగు చరమావస్థాసూచకము లగు గుణములతో ఆంధ్రజాతి యాత్మవ్యక్తిత్వమును గూడ మఱచి బానిసయై బానిసల కుచిత మగు దైన్యముతో జీవచ్ఛవమై చిరకాలసమాగతనిద్రావస్థయందు నామరూపములు పోయి యథార్థమరణము పొందు దశ యాసన్నమగుచుండ, దైవిక మగు నొక యుత్తేజమును ప్రబోధమును కల్గినవి. ఆ కల్మియే యాంధ్రోద్యమము. తత్ఫలితముగ దేశమున దీర్ఘనిద్రోద్బోధమునకు తగిన కలవరము జనించినది. ప్రాచీనసమున్నతవైభవమునందు దృష్టి ప్రసరించినది. ప్రస్తుతస్థితి గోచరించినది. విస్మయము సంతోషము సిగ్గు కల్గి జాతియందు నూత్నసంచలనము కావించినవి. అసంతృప్తి జనించినది. ఆంధ్రజాతికి సహజములై దీర్ఘకాలమునుండి నిద్రించియున్న యాత్మగౌరవాకాంక్ష యౌదార్యము మొదలగు సత్తమగుణములు భావప్రేరితము లగు నాంధ్రులం దైంద్రజాలికశక్తిచే బలె నొక్కపరి విజృంభించినవి. కాని, జాతి నెదుర్కొనిన సమస్య దుష్కరము. జాతియందలి సకలలోపములను పోఁగొట్టుకొనుట కొక్కఁడే సాధన మని తెలిసినది. అది ప్రత్యేకవ్యక్తిత్వము. తదావశ్యకత బోధపడిన కొలఁది జాతియందు సంచలనసంక్షోభములు గాఢములును గాఢతరములును గాఢతమములు నైనవి. అనుచితవివిధజాతిసంయోగము — అర్ధనారీశ్వరత్వము — జాత్యభివృద్ధి కాటంక మని వెల్లడియైనది. ఇట్టి యసహాయస్థితియందు ఆంధ్రజాతి దీనవదనయై ఖిన్నయై సంచలితహృదయయై విశ్వాసముతో వాత్సల్యముతో నాయకుల ముఖకమలములను సముద్ధరణమునకై విలోకించుచున్నది.

ప్రస్తుతాంధ్రనాయకుల జాతీయోద్ధరణపద్ధతులు దురవగాహములు. వీరి జాత్యుద్బోధనపద్ధతి యశాస్త్రీయమై యసామర్థ్యప్రదర్శకమై యున్నది. "తిరిపె మెత్తుఁడు, తిరిపె మెత్తుఁడు!"— ఇదియే యాంధ్రనాయకుల గంభీరనిస్వనము. వీరి ధర్మసూత్రముల ప్రకారము జాత్యభివృద్ధి జాతియొక్క క్రమకార్యనిర్వహణము కేంద్రీకృతప్రయత్నము ఆత్మబలము ఆత్మవిశ్వాసము జాతీయార్హత మొదలగు నాత్మాభివృద్ధికరము లైన కార్యములమీఁద నాధారపడియుండ లేదు. అనఁగా, స్వపరిపాలనము ఆంధ్రరాష్ట్రము ఆంధ్రవిశ్వవిద్యాలయము మొదలగునవి యెల్ల మంత్రములకు రాలఁదగిన చింతకాయలు; మఱి, యాత్మబలప్రదర్శనమువలనను క్రమముగ హెచ్చుచున్న యాత్మవిశ్వాసాత్మసమర్పణములవలనను తమంత తాము లోఁబడి వచ్చి తీరవలసిన ప్రయత్నైకలభ్యము లగు వస్తువులు కావు. నింద్యమై దోషభూయిష్ఠమై పరిహాసపాత్రమై ఆత్మబలమునకును ఆత్మవిశ్వాసమునకును ఆత్మగౌరవమునకును వేరుపురు వయి [illegible] సంహారకమై నీచమై ప్రాజ్ఞలోకగర్హితమై యశాస్త్రీయమై మాంద్యజనకమై హానికర మైన "తిరిపె మెత్తుఁడు"ను మన నాయకులు జాతికి బోధించుచున్నారు. వీరిచే నడుపఁబడు మండలసభలకును తాలూకాసభలకును రాజధానీసభలకును దేశీయసభలకును "తిరిపె మెత్తుఁడు" వేదవాక్యమును ఉపనిషద్వాక్యమును గీతావాక్యమును కాదు, ఈశ్వరసందేశముగ పరిణమించినది. మన సభల యంతరార్థ మేమి? "ప్రార్థింపుఁడు, ప్రార్థింపుఁడు; మీకు లభ్య మగును."— ఈ "మూన్నాళ్ల ముచ్చట్ల" యథార్థ మగు నర్థ మిది. "స్వరాజ్యము"ను "స్థానికస్వపరిపాలనము"ను స్వర్గలోకమునుండి రాఁదగు వరములు. ఉపమా కాఫీ లడ్డు మొదలగు వివిధభక్ష్యములతో నింత మాదిరి "తిండెక్కుడుపవాసముల"ను సభల పేరిట సంవత్సరమున కొకసారి కావించి యీశ్వరారాధనము చేసినచో నవి దైవకృప కల్గినప్పుడు తమంతట తామె యూడిపడును. ఇదియే మన నాయకుల పవిత్రాదర్శము.

"తత్త్వమసి" అని యుపనిషత్తులు, ప్రపంచ మెల్ల మారో

GENERAL GROUP PHOTO WITH THE PRINCE OF VIZIANAGRAM
TAKEN ON THE OCCASSION OF HIS MARRIAGE



విజయనగరము మహారాజుగారి కుమారుని పెండ్లి సమయమున తీయబడిన ఛాయాపటము

GROUP PHOTO OF THE ROYAL FAMILY OF THE MAHARAJAH OF VIZIANAGRAM



విజయనగరము మహారాజుగారి కుటుంబపు ఛాయాపటము

Dr U RAMA ROW



డాక్టరు యు. రామారావు గారు

D B V NAGAMAYYA GARU, B A



డి. బి. వి. నాగమయ్య గారు, బి. ఎ.

Mr B SUNDARA GOPALA ROW



బొల్లాప్రగడ సుందరగోపాలరావు గారు

S A. M. C TURNAMENTS, ELLORE, TENNIS CUPS



ఎస్. ఎ. ఎమ్. సి. వ్యాయామ క్రీడాసంఘము, ఏలూరు, టెన్నిసు పాత్రములు

Mr G. LAKSHMI NARASIMHAM PANTULU



గంటి లక్ష్మీనరసింహముపంతులు గారు

Mr. DANDAPANI PANTULU



దండపాణిపంతులు గారు

Mr SANKARAIAH NAIDU



శంకరయ్యనాయుడు గారు

Mr Y LAKSHMIKANTHA KAVI



యాదగిరి లక్ష్మీకాంతకవి గారు

స ఘోషించుచున్నవి. "తత్త్వ మసి" సంపూర్ణార్థము నిరుపమాన మైనది. అది భారతీయుల తేజమునకు విజ్ఞానమునకు ప్రాచీనోచ్చ స్థితికి మహత్తరరాజ్యనిర్మాణమునకు నాగరికతకు ఆధార మైనది. "తత్త్వ మసి" భారతీయుల యుపనిషత్తులకు దివ్యతేజము నొసంగిన పవిత్రమంత్రము. "తత్త్వ మసి" గంభీరభావములతోఁ గూడిన మహాశ్చక్తిమంత మయిన మంత్రము. మానవుఁ డీశ్వరుని రూప మనియు ఆత్మబలముచే నింద్రియనిగ్రహము గావించి పరిశుద్ధప్రవర్తనముచే నీశ్వరునం దైక్యము పొందవచ్చు ననియు ఆ మంత్రము చాటు చున్నది. ఆత్మ యీశ్వరుని రూపము, ఈశ్వరతుల్యము, ఈశ్వరుఁడే. ఈ పరమార్థప్రయోజనము గ్రహించియే మన మహర్షు లింద్రియనిగ్రహము గావించి ప్రపంచము నెల్ల జయింపఁదగిన మహత్తేజమును శక్తిని సంపాదించిరి, బ్రహ్మత్వ మందిరి. ఈ సిద్ధాంతమును విశ్వసించి యాత్మబలప్రభావముచే రాజత్వమును ఇంద్రత్వమును పొందిన సామాన్యుల యుదాహరణములు మన గ్రంథములందు పెక్కులు గలవు. పరిశుద్ధప్రవర్తనముతో ఇంద్రియనిగ్రహముతో నిష్కామ కర్మముతో ప్రయత్నించిన మనుజునకు ఈశ్వరత్వమే సాధ్య మగు నన, ఇఁక సాధ్యము కాని దేది? దయామయు లగు ప్రాచీనమహర్షిసత్తములు లోకోద్ధరణార్థము లోకమున కెల్ల బోధించి కృతకృత్యులు కండని భారతీయుల కీ మహత్తత్త్వము నొసంగిరి. కాలవశముననో శాపవశముననో తెలియదు, "తత్త్వ మసి" యిప్పుడు భారతీయుల హృదయములనుండి తుడిచివేయఁబడినది, తుడిచివేయఁబడు చున్నది. మన తీర్మానములలోని 'ప్రార్థించుచున్నారు...కోరు చున్నారు...వేఁడుచున్నారు...'ల తాత్పర్య మేమి? "తిరిసె మెత్తుఁడు" మహామంత్రము నుపదేశించుట గాదా? ఆత్మబలమును క్రియాదీక్షను నశింపఁజేయుట గాదా? క్రియాదీక్షాగహితమయిన యీ నూతనతత్త్వోపదేశముయొక్క ఫలము సన్న్యాసులు భిక్షుకులు విశేషముగాఁ గల మన దేశమున తిరిపెరులకు కూడ బిచ్చ మెత్తుఁ డని చెప్పుట గాదా? అగుటచే, జాతి ఆత్మబలమును ఆత్మవిశ్వాసమును నశింప, "ప్రయత్నింపుము" నాదర్శముగాఁ గైకొనుటను మాని "ప్రార్థింపుము" నాదర్శముగా గ్రహింపవలసిన దురవస్థకు పాల్పడినది. ప్రతి స్వల్పకార్యమునకును తిరిపె మెత్తుట యాచార మయినది. జాతి జన్మసిద్ధ మయిన హక్కులను స్వాతంత్ర్యమును పరిపాలనమం దుండవలసిన యుచితస్థానమును పౌరుషమును క్షాత్రమును ఆత్మగౌరవమును నడచి తిరిపె మెత్తుటయే మర్యాద యనియు జీవితమును పరిరక్షఁజేయు సాధన మనియు విశ్వసించి దాని నాశ్రయించి పరిహాసపాత్ర మగుచున్నది.

నాయకుఁడు జాతికి శిరస్సు అగుటచే జాతియొక్క కష్టము లను వాంఛలను ప్రపంచమునకు వెల్లడించి వానిని తీర్పఁ బ్రయత్నింప వలయును. కాని, మన నాయకుల యాదర్శము జాతికి శిరస్సుగా నుండుట కాదు. ప్రభుత్వమువారి మన్నన లందుటయే ప్రభుత్వము వారి మెప్పు నందుటయే యాదర్శముగా నున్నంత కాలము ప్రజారంజకు లగు నాయకు లగుట సంభవింపదు. తా మేవిధముగా చరించి ప్రభువులు తమ్ముఁ గూర్చి "రాజకీయవిషయవేత్తలు" "దీర్ఘదర్శులు" "శాంతివాదులు" అను నుద్దేశమును వహింతురో యని కార్యక్రమమును నిదానసరణముగ నడపుచున్నారు. జాతికి శిరస్సులై యుండుట తమ విధి యని మఱచి "చకోరపక్షిత్వము"ను జీవితమునకు సంప్రాప్త మగు నాదర్శముగా గ్రహించి మన నాయకు లనుచితనాయకత్వమును వహించుచున్నారు.

"తిరిపె మెత్తువారు"ను "చకోరపక్షులు"ను జాతి నుద్ధరింపఁ జాలరు. జాతి నుద్ధరించుటకుఁ గావలసిన యాత్మవిశ్వాసమును జాతీయ విశ్వాసమును వారియందు లేవు. "తోఁకకోరులు"ను "తోఁక పెఁకులు"ను జాతీయనాయకులుగా పరిగణింపఁబడునంత కాలమును అభివృద్ధి దుస్తరము. తోఁకలు కోరువారికి నిష్కాముష మైన యస్వార్థ మైన దేశసేవావ్రతము కలలోనివార్త. అడుగడుగునకును సందియపడువారు కేంద్రీకృతప్రయత్నము సలుపఁ జాలరు. జాతీయసాంప్రదాయవిముఖులు జాతి నుద్ధరింపలేరు. జాతి వారిని విశ్వసించి వారి వెన్వెంట నడువదు. విజాతీయ నాగరికతా వ్యామోహితులు దేశము నుద్ధరింపఁజాలరు. జాతి వారియందను రాగము వహింపదు. ఏకదీక్షతో దృఢసంకల్పముతో వివేకముతో జాతి యేకగ్రీవముగా కోరు న్యాయ మగు కోరికను "మీరు కుఱ్ఱలు, మాకు తెలియదు; తొందరపడరాదు, హానివచ్చు" నని ఖండించు తోఁక పొడుగు పెద్దలు జాతి నుద్ధరింపలేరు. జాతి వారి నాదరింపదు. అభివృద్ధిని సూచించు కార్యాశయములను భయముతోను సందేహముతోను వీక్షించు నాయకమ్మన్యులు జాతి నభివృద్ధి నొందింపఁజాలరు. జాతి హృదయగతి వారి కర్థము కాదు. నిష్కామకర్మముతో జాతీయ సేవ చేసి తన దేశీయుల కష్టములందు కష్టములను సుఖములందు సుఖములను ననుభవించి యాత్మజ్ఞానతేజముచే జాతిని జ్ఞానవంతముగను ప్రకాశవంతముగను తేజోవంతముగను చేసి ఆత్మత్యాగమును ఆత్మసమర్పణమును చేయఁజాలిన మహనీయులు జాతిని దేశమును నుద్ధరింపఁగల మహాయోగులు. జాతి తదాజ్ఞానువర్తియై వలయుచో నట్టివారికొఱ కాత్మసమర్పణము చేయ సంసిద్ధ మగును. వారు ధన్యులు.

లోకమాన్యుని తిలకు సకలలోకంపూజ్యుఁడు! అంధకారబంధుర మై ఆశావ్యామోహితమై యున్న దినములలో భరతఖండముయొక్క యథార్థస్థితిని కష్టసుఖములను అతఁడు కన్గొనెను, పరితపించెను; లోకమునకు వెల్లడించెను. వజ్రాయుధ మెత్తఁబడినది. తిలకాచంద్రు నది! మనస్సాక్షిగా నమ్మిన కార్యమును నిర్వర్తించుట కా మహాయోగుఁడు ప్రపంచ మెత్తివచ్చినను జంకఁడు. అది గడచినది. ఏ దేశీయులకొఱకు తనాత్మసమర్పణము చేసెనో వారతని ననుసరింప లేదు. కాంగ్రెసును విడువవలసివచ్చెను, విడిచెను.........దేశసేవను మాత్రము విడువ లేదు. బ్రహ్మాస్త్ర మెత్తఁబడినది. "ఒక్క క్షమాపణ కోరుము. ఉపసంహరింపఁబడును." "కోరను. దోషము చేయలే దని మనస్సాక్షి చెప్పుచున్నది."........."నీ కాఱు వత్సరములు ప్రవాసశిక్ష విధించితిని." శాంత మై సాత్త్విక మై మహోన్న

# కర్ణునిశీలము

గర్భాము అప్పారావుగారు

వ్యాసమహర్షికృతమై పంచమవేదం బని నుతికెక్కు 'మహాభారతము' ఉత్తమము లగు హిందూగ్రంథములలో నొకటి. ఈ మహాభారతవీరులలో కర్ణార్జునులె నేఁటికిని సామాన్యజనులచే నయితము కొనియాడఁబడుచుందురు. దైవ మే పక్షము వహించెనో యా పక్షమున కనుకూలముగా నందఱును పల్కుట స్వభావ మగుటచేతనో లేక యర్జును నదృష్టముచేతనో లేక కర్ణుని దురదృష్టముచేతనో లోక మెక్కుడుగా నర్జును నే పొగడుచున్నది. కాని, ఆభిజాత్యము సాహసము ధైర్యము సత్యప్రియత్వము ఔదార్యము స్నేహనిశ్చలత స్వామిభక్తి కీర్తియం దాసక్తి శౌర్యము వైరాగ్యము మున్నగు మహాగుణములు కలిగిన కర్ణుండు ధీరోదాత్తుఁ డని నొక్కి చెప్పవచ్చును. "కర్ణుఁడు లేని భారతమా" యను సామెత భారతపాత్రములలో కర్ణుఁడు ప్రధాన పాత్ర మని చాటి చెప్పుచున్నది. కాని, కర్ణుఁడు "అతి సర్వత్ర వర్జయేత్" అను లోకోక్తిని పాటింపక తన గుణములనే హెచ్చుగా పాటించి తన నాశమునకు తానే కారణుఁ డయ్యెను. వే యేల? ఈతఁ డదృష్టహీనుఁడు. ఇట్టి స్థితి యీతనికి సంభవించుట కీతని తల్లియే మూలకందము.

ఉత్తమక్షత్త్రియపుత్త్రికయు పరిశుద్ధాత్మురాలు నగు కుంతి యందు లోకబాంధవుఁడును సర్వసాక్షియు తేజోనిధియు నగు సూర్యభగవానున కుద్భవం బొందె నని చెప్పుటకంటె ఈతని యాభిజాత్యమును గూర్చి వేఱుగ చెప్ప నవసరము లేదు. ఎట్టి వంశంబున జన్మించిన నేమి, హీనకులజుఁ డనియే చెప్పఁబడెను. ఈతని జన్మమును మాటుపఱచుటచేతనే ద్రోణాఁ డీతఁడు సూతకులజుఁ డని సరియైన విద్య నేర్పకుండెను. ఈ కారణముననే ఇతఁడు పరశురామునియొద్ద విద్య నభ్యసించు సమయమున గురుశాపమునకు పాత్రుఁ డయ్యెను. ఆహా! దైవవైపరీత్యము! గురువునకు నిద్రాభంగము కలుగు నని దేవేంద్రప్రేరణమున కీటక మొనరించు బాధను సహించి తాను గురువునకు చేసిన యుపకారము తన కపకారమునకు మూల మయ్యెను. ఇన్ని చిక్కులును ఇతనికి కుంతి మూలముననే కలిగెను. కర్ణుని కడుపారఁ గాంచి చేఁజేత జలంబులందు విడిచిన కుంతి, కర్ణుని జన్మరహస్య మితరులకు వెల్లడించినచో తన తక్కిన పుత్త్రు లగు ధర్మరాజాదు లగ్రజుఁ డగు కర్ణునిఁ గొల్చుచుందు రనియు ఆ మూలమున స్వామిభక్తుఁ డగు కర్ణునితోఁ గూడ ధర్మరాజాదులు దుర్యోధనుఁ గొల్చుట తటస్థించు ననియు రహస్యము వెల్లడింపని కుంతి, యుద్ధం బవశ్యం బగు నని యెఱింగి తన తక్కు సుతులకు కర్ణునివలన నెట్టి యిక్కట్టు రాకుండ కర్ణునియొద్ద వరంబు గొనఁ దలంచి వానిపై నేమో ప్రేమ యున్నదానిపోల్కి వానికి వాని జన్మరహస్యము దెల్పి పాండవులఁ గలియఁ బ్రేరేపించెను. ధీరుఁ డగు కర్ణుఁ డా పల్కులకు వికర్ణుం డయి తన స్వామిభక్తిని మనోనిశ్చలతను వెల్లడించెను. అన్ని విధముల తన యభివృద్ధికి అడ్డువడిన తల్లి వరంబు వేఁడ, అర్జునుఁ దక్క తక్కినవారిని యుద్ధమందు చంపకుండు నట్లు కర్ణుఁడు వరం బొసంగె. కుంతి కర్ణునిపై కలుగు ప్రేమచే పాండవులఁ గలియ కర్ణుని ప్రేరేపింపలే దని యుద్ధానంతర మామె ధర్మజుతో,

చ. "జననముఁ జెప్పి యేఁ దెలుప, సత్యము సు మ్మది కుంతి భాషణం
బని తనుజత్వజాతకృప నంబుజమిత్త్రుఁడు పల్క; నేమిటన్
గొనకొన నేరఁడయ్యె నినుఁ గూడ సుయోధనుఁ బట్టి, యట్టి క
ర్ణునకయి నీవు నేటికి మనోవ్యథఁ బొందఁగ నిట్లు? పుత్త్రకా!"

అను మాటలవలన తెల్ల మగుచున్నది. తన కామె మనోభిప్రాయము విదిత మయ్యు కర్ణుఁడు వరం బిచ్చె. అపకారుల కుపకారము సేయు నిట్టి యుత్తములు లోకంబున నరుదు.

ఇతనికిఁ గల స్వామిభక్తి యితరుల కుండఁబోదు. అస్త్రవిద్యాపరీక్షాసమయమున పలువురిచే నధమకులజాతుం డని యెన్నఁబడు నీతని నంగరాజుఁగఁ జేసి మానము నెవండు కాపాడెనో అట్టి దుర్యోధనునియెడ భక్తివిశ్వాసములతో ప్రవర్తించుట కర్ణునివంటి మహాపురుషుల కొక వింత కాదు. కాని, కొందఱీతనికిఁ గల స్వామిభక్తి సరియైనది కా దని వానియందు కొన్ని దోషము లారోపించుచున్నారు.

అం దొకటి, బ్రాహ్మణునిచేతను పరశురామునిచేతను శపింపఁబడియు సహజకవచకుండలములు గోలుపోయియు కర్ణుఁ డాత్మహితంబు గోరి నా యర్జును గెలువఁజాలుదు నని దుర్యోధనునకు నమ్మిక కలిగించుట.

క. "గురు వలుక నాకు నస్త్ర
స్ఫురణ మెడసె నంద్రు జనులు బొంకెద; పూః
పరతమెయి నము నీశరు
కరుణఁ గొరలి నుగుడఁ బడయఁగాంచితిఁ బ్రీతిన్."

ఇట్లు కర్ణుఁడు దుర్యోధనుతో పలుకుట సత్య మయినచో, వాని కిది గొప్ప లోప మని చెప్పక తప్పదు. కాని, సంస్కృతభారతమున

శ్లో. మిథ్యాప్రతిజ్ఞాయ మయా యదస్త్రం
రామాత్ కృతం బ్రహ్మమయం పురస్తాత్
విజ్ఞాయ తే నాస్మి తదైవ ముక్త
స్తేనాంతకాలే ప్ర

అని కర్ణుఁడు తన కంత్యకాలమున బ్రహ్మాస్త్రము స్ఫురింపక పోవు నని భార్గవుఁడు శాప మొసంగె ననియు అగ్ని స్వల్పశాపమే యనియు దుర్యోధనునితో చెప్పిన ట్లున్నది. దీనిని బట్టి చూడ, కర్ణుఁడు తన కంత్యకాలము ప్రాపించులోపలనే యర్జునుపై బ్రహ్మాస్త్రము ప్రయోగింపవచ్చు నని యూహించినట్లు తేలుచున్నది. ఆంధ్రభారతమందలి సంగతి నిజ మని తలంచి కొందఱు కర్ణునియందు గొప్ప లోప మారోపించుచున్నారు. అర్జునునితో పోరి జయించినయెడల ఘనం బగు యశంబును అపజయం బొందిన వీరస్వర్గప్రాప్తియు తనకుఁ గలుగు నని దుర్యోధనున కిట్టి దృఢ మగు నమ్మకము పుట్టించె నని చెప్పుదురు. కాని, పాండవుల పక్షము చేరు మని కృష్ణుఁడును కుంతియు కర్ణునిఁ గోరినప్పు డాతఁడు వారల కొసంగిన యుత్తరువులు అతని మనోనిశ్చయమును స్వామిభక్తిని విశ్వాసమును వైరాగ్యమును లోకమున కిప్పటికిని వెల్లడించుచున్న వని చెప్ప నేల? కృష్ణునితో,

ఉ. "సూతసుతుండు వీఁ డనక సూనుల తమ్ముల కంటె నాకు సం
ప్రీతి యొనర్చి తేజమును పెంపును నాఁటికి నాఁటి కగ్గలం
బై తనరార నన్నుఁ దనయంతటి మానిసిఁ జేసియుండ నే
నే తగ వూని యా కురుకులేశ్వరుఁ బాయుదు ముట్టవచ్చినన్?

క. "నను నయ్యర్జునునకు నెగు
గని పెద్దయు నమ్మియుండు నక్కట దుర్యో
ధనుఁ డా నమ్మిక నమ్మఁగ
జను నే పాండవులఁ గలయఁ జన నా కనఘా?" — ఉద్యో. 4-39, 40.

అనియు, కుంతితో

క. "కడిఁది పగఱ నేఁ దెప్పగఁ
గడవం గా నీడఁ దలఁచు కౌరవనాథుం
బెడఁగాఁక యంచు నిత్తతి
విడువఁ దగునె యతని వలస వెలసినవాఁడన్." — ఉద్యో. 4-65

అనియు చెప్పి అతఁడు స్వామిభక్తుఁ డగుచున్నాఁడు. అతఁడు తన కీర్తికే కాదు, ఇతరుల కీర్తికిని కళంకము రాకుండఁ జూచు మహానుభావుఁడు, కృష్ణున కుత్తర మొసంగుచు నిట్లు పలికెను:

తే. "అర్జునుండు ద్రోణుఁ గర్ణున కనుమ జంకె
పన్నె నీ వన్నగదె యందుఁ బ్రజలు నిన్ను
నన్ను సూతసుతుండు పాండవుఁడె నందు
రోయ కేఁగె నటంచు దూఱుదురు కృష్ణ!" —సాంబోద్యోగము.

రెండవ దోషము కర్ణుఁడు తన కీర్తికొఱకు స్వామియందు భక్తివిడిచి పెట్టి మూలమున తాను శత్రువుల కసాధ్యుఁ డగునో యట్టి కవచకుండలములను దేవేంద్రుని కొసంగుట. ఈ విషయమున తాను మహాదాత యని పేరు పొందుట కట్లు చేసె నని చెప్ప వీలు లేదు. దేవేంద్రుఁ డా కవచకుండలములు కోరునప్పుడు "వీనిని నూని యింక నితరములు కోరు"మనెను. తన కీర్తికొఱకే చూచువాఁ డిట్లు పలుకఁడు.

సీ. "విప్రులు గడు నర్థి వేఁడినఁ గలిమిలోఁ
బ్రాణంబు సేయకయిచ్చు టొకటి"

అను వ్రతము పూనినవాఁ డయ్యెను, తన కీర్తికి కళంకము కలుగు నని యెంచక దేవేంద్రునియొద్ద నొక శక్తిని పుచ్చుకొనెను. మహాదాత యగు నితఁ డిట్లు పుచ్చుకొనుట దుర్యోధనునియందలి భక్తివిశ్వాసములచేతనే కదా? కానియెడ, అతని కా శక్తి యెందులకు? యుద్ధమం దర్జునుని చంపి స్వామి యగు దుర్యోధనునికి మే లొనరించుటకే. ఇట్లు చేయుటచేతనే యొక కవి కర్ణుని "చండాంశుసుతు పోల్కిఁ గుండమార్పులు కాక" అని చెప్పుటకు వీలుపడినది. దుర్యోధనున కీ విషయము తెలియకపోలేదు. కర్ణుని యౌదార్యమున కతఁడు సంతసించెనే కాని మనంబున కోపదుఃఖములు పూనలేదు. ధృతరాష్ట్రునితో

క. "వినుము నరేశ్వర! కర్ణుని
పెనుపు మహేంద్రుండు వచ్చి ప్రియమున శచికై
తను నర్థింపఁగ నిచ్చెను
గొను మని లోకంబు లెఱుఁగఁ గుండలయుగమున్."

—ఉద్యో. 2-213

వ. "ఈతఁ డా ధర్మపుత్త్రాదులచేతను గా దెవ్వరిచేతనుం జెడమి తెల్లంబు."

అని దుర్యోధనుఁడు కర్ణుని బొగడెను; కవచకుండలములు గోలుపోయినను ఇంద్రదత్తశక్తిచే కర్ణునికి జయము కలుగు నని దృఢనిశ్చయుఁడై యుండెను.

తే. "కర్ణు వడసిన యా శక్తి కలుగఁ బోర
బ్రదుకవచ్చునె నరునకు?......"

అని దుర్యోధనుఁడు తండ్రితో పలికెను. ఈ కారణములచే కర్ణుని నిర్దోషిత తెల్ల మగుచున్నది. ఈ విషయమున కర్ణుఁడు స్వామిభక్తికిని తన యౌదార్యమునకును భంగము కలుగకుండ ప్రవర్తించెను.

మూఁడవ దోషము కర్ణుఁ డర్జునునిఁ దక్క తక్కిన పాండవులను కాపాడెద నని కుంతికి వర మొసఁగుట. ఇట్లు వర మొసఁగుటచే తన స్వామిభక్తి కేమియు కొఱంత లేదు. కౌరవులలో నర్జునుని జయింపఁగలవారును జయింపనిష్టపడువారును కర్ణుఁడు దక్క నింకెవ్వరును లేరు. ధర్మరాజాదులను గెలువఁజూచువారు కౌరవులలో ననేకు లున్నారు. కర్ణుఁ డిది యెఱింగియే యట్లు వర మిచ్చెను. దుర్యోధనునకు నయిత మీ సంగతి తెలియును. అతఁడు తన తండ్రితో

తే. "భీమసేనుని నీ వింత పెద్దచేసి
చెక్కు భంగులఁ జెప్పితి యుక్కు గలఁడు
గదకు నేర్చు నం చంతియు బెదరె దఱఁడు
నన్నుఁ బోలమి యెఱుఁగవే నరవరేణ్య."
"అతఁడు వడిన వెండి యా సేనఁ గోల్తల
సేయ నొకఁడు లేమి సిద్ధ మింత
యెఱిఁగి వెఱచి కావె యేనూఱ్లు లైనను
దనకుఁ జాలు ననియె ధర్మసుతుఁడు."

వ. అర్జునుండు గలం డని తలంచితేని,

తే. కర్ణు వడసిన యా శక్తి గలుగఁ బోర
బ్రదుకవచ్చునె నరునకు?". —ఉద్యో. 2-215, 219.

అని పలికెను కావున, కర్ణుఁడు నిర్దోషి.

ఇఁక నాల్గవ దోషము కర్ణుఁడు దుర్యోధనునికి పాండవులతో సంధి చేసికొమ్మని చెప్పకుండుట. ఈ సందర్భమునను కర్ణుఁడు నిర్దోషియే. మానధనుఁ డగు సుయోధనుఁడు సంధి కింతయు నియ్యకొనలేదు. కర్ణుఁ డీ విషయ మెఱింగియే సంధివిషయమున నేమియు పలుకలేదు. సంధివిషయమున దుర్యోధనుఁడు భీష్ముని సరకుగొనలేదు; నారదాదిమునులు చెప్పిన పల్కులు వినలేదు. రాయబారము సమయంబునఁ గృష్ణునితో

క. "ఉక్కఱి సురపతికైనను
మ్రొక్కము నృపధర్మ మూది మొన తలఁబడినన్
మిక్కిలి పేరును నిట దివి
నక్కజముగఁ బెంపుఁ బడయనగుట నుపేంద్రా!" — ఉద్యో 3-360.

అని దుర్యోధనుఁడు తన మనోనిశ్చయము వెల్లడించెను; తండ్రి నింతయు లక్ష్యపెట్టలేదు.

తే. "కులములోఁ దలవంపగు కూడు గుడువఁ
బంపఁజూచెద వొకగులఁ బఱితురట్టె
వారు పైనెత్తివచ్చినఁ బోరి కోప
మనిన ధృతి చేట కాక పొం డగునె చెపుము."

అని యతఁడు తండ్రితో ననెను. గురుశాపమున భీమునివలన తనకు మరణ మున్న దని తల్లి యగు గాంధారి తెలుప నామెతో నతఁడు

తే. "భరతకులమున కేల లోపంబు? రెండు
తెగలవా రనిఁ జచ్చు టెందేనిఁ గలదె?
సంధిఁ జేసినఁ దప్పునే చావు గురుని
శాపవచనంబు నిజముగా జరుగునేని?"

అని పలికెను. ఇట్లు యుద్ధమునకు దృఢనిశ్చయమునఁ నున్న దుర్యోధనునకు సంధిఁ జేసికొమ్మని చెప్పినను లాభము లేదు. సంధిఁ జేసికొమ్మన నేల? సంధిఁ జేసికొనఁగూడ దని చెప్పుటయే మేలు. ఎచ్చటనైన రాజ్యము విభక్తము కాఁగూడదు. మఱియు, వీలగునంత వఱకు అభివృద్ధి గావింపవలెను. అంతియ కాని, రాజ్య మకారణంబుగ నొకరి కిచ్చివేసి దానిని తక్కువ చేయఁగాడదు. బ్రాహ్మణుఁ డసంతుష్టిచేతను రాజు సంతుష్టిచేతను చెడును. ఈ విషయములు రాజనీతివిశారదుఁ డగు దుర్యోధనుఁ డెఱిఁగియే సంధి కియ్యకొనలేదు. ఇట్టి నిశ్చయముతో నున్న రారాజుతో "సంధిఁ జేసికొ"మ్మనుట పిఱికితనంపుఁ బల్కులు పల్కుట "నీవు చేతఁగానివాఁడ"వని చెప్పుటయే. "సంధిం జేసికొనకుము. మేము నీకొఱకు యుద్ధమొనర్చి శత్రువులను జయించెదము." అని రాజుతో పల్కువారే వీరులును రాజభక్తులును. అట్టివారిలోనివాఁ డీ కర్ణుఁడు. కావున, ఈ విషయమున కర్ణుని కే కొఱంతయు లేదు.

అయిదవ దోషము ద్రౌపదీమానభంగమున దుర్యోధనుని వారింపకుండుట. ఈ దుష్కార్యము రారాజునకు మాయని కళంకము. ఈ కళంకమునకు కర్ణుఁడు మూలకారణము. పాండవు లెంతటి విరోధులైనను గొప్ప వంశమున పుట్టినదియు సతియు అంటయి యున్నదియు నగు ద్రౌపది నవమానపఱచు దుర్యోధనునికి కళంకము వచ్చునట్లు చేయు నీకార్యము స్వామిభక్తుఁ డగు కర్ణునకు కళంకము తెచ్చునదియు ప్రతిభంగ మొనర్చునదియు నై యున్నది.

సీ. "భామినీద్విజవృద్ధబాలాతురుల కైన
నాపదఁ జెప్పరఁ బాపు టొకటి
................................
అనఘ యివి వ్రతంబులై చెల్లు నాకు నిం
దొకటి దప్పనేని వికలకీర్తి
నగుదు................................"

అని పలుకు కర్ణుని కిది తగని కార్యమై యున్నది.

ఇఁక నితని యౌదార్యమును గూర్చి వేఱుగా చెప్ప నవసరము లేదు. ఇందులకు "దానకర్ణుఁ" డను బిరుదమే తార్కాణము. దానగుణమున నెవరిని వర్ణించినను కర్ణుఁ డుపమానముగా తీసికొనిరాఁబడును. ఇట్టి యుదారశీలుఁడు సత్యప్రియుఁ డని వేఱుగ చెప్ప నక్కఱ లేదు. కాని, పరశురామునొద్ద విద్య నభ్యసించుటకేఁగు నపుడు, తాను భార్గవసగోత్రుఁడ నని చెప్పుకొనెను. గురు వొక తండ్రియే కాన, గురుగోత్రము చెప్పుట యొక యసత్యము కా దని యితఁ డనుకొనెను. ధర్మమూర్తి యను బిరు దొందిన ధర్మసూతి విరటునిఁ గొల్వ నేఁగునపుడు పల్కిన పల్కులలో నెంతో యసత్యమున్నదో యితని పల్కులలో నంత యసత్య మున్నది. ద్రోణుని చంపుట కా ధర్మజుఁడు పల్కిన యసత్యములలో నిది సహస్రాంశము. అది బ్రహ్మహత్య చేయుటకు, ఇది విద్య నేర్చుకొనుటకు.

కృష్ణుఁ డీతనిని పాండవులఁ గలియు మనియు అట్లు చేసినేని రాజ్య మిప్పించెద ననియు ద్రౌపది ధర్మరాజాదులను చూచునట్లు నిన్నుఁ గూడ చూచు ననియు చెప్పెను. అందునకు కర్ణుఁడు నిముఖుఁడై లన నైగాగ్యమును వెల్లడించెను.

ఈ పై గుణంబుల కతని పరాక్రమము సాహసము ధైర్యము శౌర్యము మొదలగు గుణములు వన్నె వెట్టుచున్నవి. గంధర్వులచే పరాభవింపఁబడి బ్రదుకుటకంటె మరణము శ్రేయ మని మానధనుఁ డగు దుర్యోధనుఁడు తలఁచుచుండ, ధైర్యశాలియు స్వామిభక్తుఁడు నగు కర్ణుఁడు వాని నూరార్చి దిగ్విజయ మొనర్చుటకు వాని యనుమతి వడసి యనేక దేశములు జయించెను. ఈ దిగ్విజయవృత్తాంత మాంధ్రభారతమున వర్ణింపఁబడలేదు. కాని, యందు "పైదేహాపాంచాలవసుధేశు లెవ్వాని కడిమి సొంపున నరిగాపు లైరి." అని ధృతరాష్ట్రుఁడు కర్ణుని మరణవార్త విని విలపించిన ట్లున్నది. మఱియు, కర్ణుఁడు ద్రోణాచార్యుని సైన్యాధిపత్యకాలమున పాండవయోధుల నులుమాడెను; ఒకప్పుడు భీముని జయించి యతండు చచ్చు నవస్థలో నున్నపుడు కుంతి కొసంగిన వరమును తలంచి,

ఆ. "తిండిపోతు! నీకు భండనం బేటికిఁ?
గడవఁ జేరి మనసు కాంక్ష దీఱ
నోపు కొలఁది మ్రింగి యూరక నీ యింటి
కడన యుండు మింక నడచి పడక."

అని చెప్పి యతనిని విడిచెను. ఇట్లే ధర్మజనకుల సహదేవులను సైతము విడిచెను. ఉదారశీలుర కిది సైజమే కదా!

కర్ణుఁడు ఏ శక్తిచే నర్జునుని నిర్జించెద నని తలంచియుండెనో ఆ శక్తిని మాయాయుద్ధ మొనరించు ఘటోత్కచునిపై దుర్యోధన ప్రార్థితుఁడై ప్రయోగించి వానిని సంహరించి తన స్వామిభక్తిని వెల్లడించెను. తన శక్తిని గోలుపోయియును నర్జును నెదిరింప యత్నించుటచే తన ధైర్యసాహసములు వెల్లడి చేసెను. కర్ణుం డీ శక్తిని గోలుపోవ కృష్ణుఁడు సంతసించి యర్జునుతో

వ. "మీ తండ్రి యిట్లు సేయఁడేని వాని కెదు రెవ్వరు? కవచకుండలవిహీనుండై మానవసామాన్యంబు నొందుటను శక్రదత్తసాధనంబు లేమింజేసియు ఇంక నీవు గెలువవచ్చు."

అనియు, అర్జునుమీఁద నా శక్తి ప్రయోగింపమి? కారణమును సాత్యకితో

తే. "వానివా రెల్ల నీ పని వాని కెపుడు
గలుపుదురు వాఁడుఁ బూన్కిమైఁ గడఁగి వచ్చు
వాఁకుదల నేను వార లందఱును మఱచు
నట్లు సేయుదు నరునకునై కుమార!"

అనియు చెప్పెను. ఇట్లు పలుకుటకంటె కర్ణుని పరాక్రమమును గూర్చి వేఱుగా పొగడవలయునా?

శల్యసారథ్యం బొకటి యితని యోటమికి కారణం బయ్యె. వెలుగే చేను మేసిన దను నందంబున శల్యుఁడు ధర్మరాజాదులకు మేలు సేయఁదలంచి రథికుఁ డగు కర్ణుని పరాక్రమమును తెగడియు కర్ణునికి జయ మాపాదించుచుండెడి స్థలములనుండి రథమును మరలించియు, కర్ణుని పరాజయమునకు కారణభూతుఁ డయ్యెను. శక్తి గోలుపోయియును శల్యునిచే నిరసింపఁబడియును వానిని సగకు గొనక ధీరోదాత్తుఁ డగు కర్ణుఁడు

ఉ. "కనుఁగొను మిప్పు డేను ముఖసన్ముఖుఁ బార్థుని భీమసేనునిన్
దునిమెద నస్త్రసంపదయు దోర్బలగర్వంబును శౌర్యసారమున్
గనులకు నెల్లఁ దెల్లముగ నా దగు పూనిక పోర మెద్ది మే
దినిఁ గురునాథుఁ డొక్కఁడె యతిస్థిరసౌఖ్యత నేలునట్లుగన్."

అని పాండవులపై భార్గవాస్త్రము ప్రయోగించి వారి సైన్యములను మలమల మాడ్చి వారికి భయము కలిగించెను. అర్జునుండు వాని ప్రతాపమునకు భయపడి కృష్ణునితో

తే. "పట్టపగలింటి సూర్యుని పగిదిఁ గర్ణుఁ
డుగ్రమూర్తియై వెలుఁగుచున్నవాఁడు
మన రథం బిపు మాధవా మరలనిమ్ము
బ్రతికియుండిన శుభములు వడయవచ్చు."

అని దీనవాక్యములు పల్కెను గాని కర్ణుఁ డట్లు యుద్ధమునకు వెనుదీయ లేదు. అప్పటికి కృష్ణుఁ డరదమును మరలించి కర్ణుఁ డలసియున్న సమయమున నర్జునుని ననేకమాయోపాయములచే పౌరుషము కల్గించి అతనిని కర్ణుపై నెదుర్కొనఁ జేసెను.

ఈ ద్వంద్వయుద్ధమున కర్ణుఁడు చూపిన పరాక్రమము పొగడ నలవి కాదు. ఇందు కృష్ణుని సాహాయ్యమున నర్జునుఁడు జయ మొందె నని చెప్పుట సాహసము కానేరదు. కర్ణునిచే ప్రయోగింపఁబడిన సర్పముఖశరము అర్జునునకు తగులకుండ కృష్ణుఁడు రథమును క్రిందికి మాపెను; కర్ణుని రథము క్రుంగు సమయమున రథస్థుఁ డగు నర్జునుచే భూమిష్ఠుఁ డగు కర్ణుని నధర్మముగ చంపించెను. ఇట్టి కార్యములవలన కర్ణుని కేమి కొఱంత వచ్చును? కర్ణుని క్రుంగింప శల్యుని ధర్మరాజుఁడు కోరుట శల్యుఁ డట్లొనర్చుట అర్జునునకు కృష్ణుఁ డనేకసందర్భముల సాయపడుట దేవేంద్రుఁడు కుండలములు గొనుట మున్నగునవి ధర్మరాజు నధర్మమును శల్యుని యనౌచిత్యమును కృష్ణుని పక్షపాతగుణంబును దేవేంద్రుని మోసమును వెల్లడించుటయే కాక, కర్ణుని కపజయమువలన కలిగిన యవమానము లేకుండ అతని కీర్తిని ద్విగుణితంబుగ ప్రకాశింపఁజేయుచున్నవి.

యుద్ధరంగం దొక వీరుఁడు ఖడ్గముచే నింకొక వీరుని చంపి జయ మొందునప్పుడా జయము ఖడ్గమునకుఁ గాక వీరునే పొందు నట్లు కృష్ణుఁ డను వీరుఁ డర్జునుఁ డను ఖడ్గముచే కర్ణుని చంపి జయ మొందుటచే ఆ జయము కృష్ణునే పొందును గాని యర్జును నెంతమాత్రము పొందదు. ఇందువలన కర్ణుఁడు దైవోపహతుఁ డయినవాఁడు. కాకపోయిన, ఈ యర్జునుఁడే కృష్ణుని మరణానంతరము గోయలచే జయింపఁబడి యాదవస్త్రీల రక్షింపలేకపోవుట యేమి? ఈ యుద్ధమందు తా మధర్మముగ జయ మొందితి మని ధర్మరాజాదు లెఱుంగుదురు. వా రందులకు వగచుచుండ, కృష్ణుఁడు "కర్ణాదుల జయించు టరిది గావున నేను బహువిధోపాయములు పన్ని యిట్లు తీర్చితిని గాక యత్తీవ్రపరాక్రము లలతులఁ బోదురే?" అని వారి నూఱడించెను.

కర్ణుని పరాక్రమము ననేకపర్యాయములు కురువృద్ధగు భీష్ముండు నిరసించుటయు వాని నర్ధరథునిఁగ పలుకుటయు చూచి కాఁబోలు జనములు కర్ణుని నిరసించెదరు. ప్రాజ్ఞులు పలికిన యుక్తి గుఁడు మహారథుఁ డనియు కర్ణుఁ డర్ధరథుఁ డనియు పలుకుటకు భీష్ముఁ డంత వెఱ్ఱివాఁడు కాఁడు. సంధి కాకుండఁ జేయుటకు కర్ణుఁడే మూల మని తలంచి కర్ణు నట్లు నిరసించెఁ గాని దుర్యోధనుఁగు సంధి కొడంబడఁ డని భీష్ముఁ డట్లు పలికెను. కాకుండిన, యుద్ధ మొనర్చుటకు సెల వొసఁగు మని యంపశయ్యపై నున్న భీష్ముని కర్ణుఁ డడుగ, భీష్ముఁడు

క. నీ వెనఁ గోపింతు నె కుల
భేదముగాఁ బలుకుటయును బిడ్డలఁ జెఱుపన్
గా దని కినియుదు రేదన
గాఁదలఁతును నిన్ను నిష్ఠురంపుఁబలుకులన్."

అది శిక్ష గాని రోషంబు కాదు.

ఉ. "నీ యుదయము దైవికగ
ర్భాయత్తము నీవు మర్త్యులసదృశులు...

అని కర్ణునిఁ గూర్చి పలికెను. మఱియు ఘోషయాత్రలో కర్ణుఁడు గంధర్వుల నోడుటకును పార్థుఁడు వారి నోడించుటకును దేవేంద్రుఁడే కారణమయి యుండవచ్చును. ద్రౌపదీస్వయంవరమున కర్ణుఁడు వి ల్లెక్కిడి కొట్ట నుద్యమింప ద్రౌపది గట్టిగా "నాహం వరయామి సూతం" అని పలుక, కర్ణుఁ డసమర్థుఁడు కాలేదు. ఈ కారణములచే కర్ణుఁడు మహాపరాక్రమశాలి యనియు ధైర్యసాహసములు కలవాఁ డనియు నొక్కి చెప్పవచ్చును. ఇంతకును భారతకవియు పాండవపక్షమే యవలంబింపవలసివచ్చెను. పాండవసంతతివాఁ డగు జనమేజయునకు వైశంపాయనుఁ డీ కథ చెప్పుటచే నిట్లు పాండవపరాక్రమవర్ణనంబును కౌరవపరాక్రమనిరసనంబును కలిగిన దని చెప్పవచ్చును.

VIDYA VINODINI SABHA, PEDDAPUR



విద్యావినోదినీసభ, పెద్దాపురము

SARASVATI NIKETAN, GUNTUR



సరస్వతీనికేతనము, గుంటూరు

THE PANCHAMA CONFERENCE, BEZWADA



బెజవాడ పంచమ మహాసభ

GENERAL VIEW OF THE I D. F BARRACKS



హిందూ దేశ రక్షక సైన్యపు వసతి గృహములు

Mr M V BHAGYA REDDY VARMA



ఎం. వి. భాగ్యరెడ్డివర్మ గారు

# వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, 192, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

(33)[a]

## విక్రయమునకు సిద్ధమైన నవలలు.

దుర్గేశనందిని 1-కి రూ 0 12
రోషినారా „ 0 12
అస్తమయము „ 1 8
వీరబాల „ 0 8
విజ్ఞలజీవి „ 1 2
సాంఘిక దౌర్జన్యము 0 14
దిలారామ „ 1 4
సీతారామము „ 1 2
వంగదేశ కవిసార్వభౌముఁడగు
శ్రీ రవీంద్రనాథ టాకూర్ గారి
రాజర్షి, నవల „ 0 14
ఆంధ్రరాష్ట్రీయము, శ్రీ భోగరాజు.
నారాయణ మూర్తిగారిది 0 14
లాలాబాయి „ 0 8

## శ్రీ తులసీదాసు రామాయణము

### ఆంధ్ర వచనము.

శ్రీపసుమర్తి శ్రీనివాసరావు, బి. ఏ., గారిచే పరివర్తనము.

ఈ గ్రంథము ఉత్తర హిందూస్థానములో మహా విఖ్యాతిఁ గాంచిన శ్రీతులసి దాసనెడి మహాత్మునిచే హిందీభాషలో భక్తి రసభరితముగ రచింపఁబడినది. ఇది సమస్తకావ్యగుణముల కాకరమై విషయమునుబట్టి సర్వోపనిషత్సారమనఁ దగియున్నది. ఈ గ్రంథము నొక్కసారి వినినను ఎట్టి యక్షర శూన్యనకైనను ఎట్టి శుష్కహృదయునకైనను భక్తి రసముపుట్టి పొంగి పొరలి ప్రవహించుననిచెప్పుట యతిశయోక్తిగాదు. ఇట్టి గ్రంథము మన తెనుఁగు భాషలో లేకుండుట యవమానకరమని తలఁచి ప్రకృతము తెలుఁగు భాషలో మృదు మధురశైలిని మూలగ్రంథములోని భావము లేవియు విడనాడక వ్రాయబడినది. అచ్చటచ్చట పాఠక మహాశయుల హృదయమునకై మూలగ్రంథములోని చౌపాయి, సోరఠా, ఛాంద్ అను మనోహర గీతములు గూడఁ జొప్పింపఁ బడియున్నవి. ఈ గ్రంథము సుమారు 1500 పుటలకు దగ్గనిదియు, ప్రతిపద భక్తి రసాలంకృతమును, సర్వమత శ్లాఘాపాత్రమును అయియుండును.

బాలకాండము 1-కి 1 8

## విక్రయమునకు సిద్ధముగానున్న సంస్కృత గ్రంథములు

ఋగ్వేద దేవతార్చన, బ్రహ్మయజ్ఞము 0 2
యజ్ఞోపధారణ విధి 0 1
గీతగోవిందము, (అష్టపదులు) సాంధ్ర టీకా తాత్పర్య వివరణము 1 4
శ్రీకృష్ణ శీలాతరఙ్గిణి ఆంధ్రతాత్పర్యము 1 4
శివగీత, సాంధ్ర తాత్పర్యము 0 10
ధనంజయానిఘంటువు, ఆంధ్ర తాత్పర్యము క్రమణికలతో 0 12
ఋగ్వేద పూర్వప్రయోగాదర్శము, సస్వరము 2 0
(నాగరి) సంస్కృత బాలశిక్ష 0 3
„ శబ్దమంజరి 0 3
ఆంధ్ర ద్రవిడ బాలశిక్ష 0 3
శ్రీమద్రామాయణము, వ్యాఖ్యాన చతుష్టయ విశిష్టము, చిన్నసైజు, 2 సంపుటములు 12 0
శేషజకల్పము, సాంధ్రతాత్పర్యము 0 6
వైద్యశతశ్లోకి „ 0 6
రాజమార్తాండము „ 0 10
సుశ్రుతశారీరము „ 2 0
రావణ కుమారతంత్రము, సాంధ్ర తాత్పర్యము „ 0 6
చక్రదత్త „ 3 12
గదనిగ్రహము „ 2 8
శార్ఙ్గధర సంహిత „ 3 12
శార్ఙ్గధర త్రిశతి „ 0 8
కాలజ్ఞానము „ 0 4
అజీర్ణమంజరి „ 0 4

## ఆంధ్ర గ్రంథములు

గోపీనాథ రామాయణము, సంస్కృతమునకు సరియైన తెనుఁగు, కవనము మిక్కిలి సొంపు, సీరిక అతి విపులము, 2 సంపుటములు 5 8
మార్కండేయ పురాణము 1 12
ఆంధ్రనాయక శతకము 0 3
కాంతాలలామ శతకము 0 4
విదురనీతి, సటిప్పణము 0 4

హరిశ్చంద్ర నలోపాఖ్యానము, సటీక 2 8
కాశీఖండము, శ్రీనాథకృతము 1 12
హరవిలాసము „ 0 12
నిరంకుశోపాఖ్యానము 0 6
కవికర్ణరసాయనము 1 8
జగన్నాయక శతకము 0 2
చిత్తబోధశతకము, తాత్పర్యము 0 3
భద్రాద్రి రామశతకము 0 2
ప్రసన్న రాఘవశతకము 0 3
తెలుఁగు సమస్యలు 0 2
నలచరిత్ర, ద్విపద 0 14
వెంకయ్యవ్యాకరణము 0 3
మర్యాద రామన్న కథలు 0 2
వైశ్యులకథలు 0 4
భోజుని కథలు 0 8
నలుగురు మంత్రుల కథలు 0 4
అయిదుగురు దొంగల కథ 0 4
సత్యసేనవిజయము 0 4
రేచుక్క పగటిచుక్క కథలు 0 2
పరమానంద శిష్యుల కథలు 0 3
తెనాలి రామలింగని కథలు 0 4
అరేబియన్ నైట్సు కథలు 1 4
బేతాళుని కథలు, చక్కనిప్రతి 0 6
మదనకామరాజుకథలు 0 14
విక్రమార్కునికథలు 0 6
షేక్స్పియర్ నాటకకథలు 1 8
ప్రసన్న వినోద కథలు 0 12
తాతాచార్యులకథలు 0 6
వాసుదేవమననము, వచనము 0 14
నీలగిరిపాటలు 0 6
క్షేత్రయపదములు 0 14
మనోహరి, నవల 0 12
శ్రీవేమనయోగిజీవితము 0 2
శ్రీలాలాలాజ్పతిరాయిజీవితము 0 2
శ్రీగైక్వారు గారిజీవితము 0 2
శ్రీకరంచంద్ గంధిజీవితము 0 2
శ్రీగోపాలకృష్ణగోఖ్లేజీవితము 0 2
శ్రీరానడేజీవితము 0 2
ఆంధ్రభారతము, 7 సంపుటములు 14 0

# Bank of Madras.

Capital (fully paid-up) ... Rs. 75,00,000.
Reserved Fund .. ,, 50,00,000.

HEAD OFFICE— MADRAS. BRANCHES·

Alleppey
Bangalore
Bellary
Bimlipatam
*Outstation*—
Vizianagaram
Calicut
Cocoanada
*Outstation*—
Narsapur and
Rajahmundry
Cochin
Coimbatore
*Outstation*—
Erode

Colombo
Guntur
*Outstation*—
Bezwada
Madura
Mangalore
Masulipatam
Negapatam
Ootacamund
Salem
Trichnopoly
Trivandrum
Tellicherry
Tuticorin

CURRENT ACCOUNTS opened on terms which may be ascertained on application.

FIXED DEPOSITS:—The Bank allows interest at the rate of 5 per cent. per annum on Fixed Deposits for 12 months. Interest for shorter terms may be ascertained on application.

SAVING BANK:—Small deposits received and interest allowed. Rules on application,

LETTERS OF CREDIT AND DRAFTS issued on the principal towns in India, Burma, and Ceylon.

STERLING DRAFTS procured for constituents and remitted free of charge to any given address.

GOVERNMENT and other Securities received for safe custody, purchases and sales effected and interest and dividends collected and credited to account,or remitted according to instructions.

LOANS AND CASH CREDITS GRANTED on Government Securities, Municipal and Port Trust Debentures, Shares in Guaranteed Railway, and Goods, and Bullion.

APPROVED MERCANTILE BILLS discounted and Bills of Exchange negotiated.

COPIES OF RULES, POWERS OF ATTORNEY, &C., may be had on application at Head Office and at any of the Branches.

[By Order of the Directors]

W. B. HUNTER,
Secy. and Treasurer.

# మద్రాసు బ్యాంకు

మూలధనము (పూర్తిగా చెల్లింపబడినది) రు. 75,00,000
నిలువధనము ... ... ,, 50,00,00

బ్రాంచీలు! హెడ్డాఫీసు మద్రాసు!! బ్రాంచీలు!!!

అలెప్పి
బెంగుళూరు
బళ్లారి
భీమునిపట్టణము
చిన్న బ్రాంచి.—
విజయనగరం
కళ్లికోట
కాకినాడ
చిన్న బ్రాంచీలు
నరసాపురము
రాజమండ్రి
కొచ్చి
కోయంబత్తూరు
చిన్న బ్రాంచి.—
ఈరోడ్డు

కొలంబు
గుంటూరు
చిన్న బ్రాంచి.—
బెజవాడ
మధుర
మంగుళూరు
మచిలీబందరు
నాగపట్టణము
ఉదకమండలము
సేలం
తిరుచునాపల్లి
తిరువాన్కూరు
తెలచ్చేరి
తూతుకుడి

దరఖాస్తు పెట్టుకొని షరతులు నిర్ధారణ చేసికొనిన తరువాత కరెంటు అక్కౌంట్లు పెట్టబడును.

ఫిక్సెడ్ డిపాజిట్లు:— బాంకువారు 12 మాసములవరకు స్థిరముగనుండెడు మొత్తములపైన సాలుకు నూటికి 5 చొ॥ వడ్డీనిత్తురు, ఇంతకు తక్కువ కాలమునకు నిలువయుండెడిసొమ్ముపైనిచ్చెడి వడ్డీ దరఖాస్తుపెట్టి తెలిసికొనవలెను.

సేవింగ్సుబాంకు:— కొద్దిమొత్తములు తీసికొనబడి వడ్డీ యివ్వబడును. రూల్సు దరఖాస్తుపైని పంపబడును. ఇండియా బర్మా సిలోనులలోని ముఖ్యమయిన పట్టణములకు హుండీలు డ్రాఫ్టులు యివ్వబడును.

ఖాతాదార్లకు, వారిచ్చిన ఏడ్రెసునకైనను సరే, చార్జి లేకుండా సీరుహుండీలు, సమకూర్చబడి పంపబడును.

గవర్నమెంటు సెక్యూరిటీలు ఇతర సెక్యూరిటీలు భద్రపరచబడును, కొనబడును, అమ్మబడును. వడ్డీ డివిడెండ్లు వసూలుచేసి, ఖాతాలో జమకట్టబడును లేక చెప్పిన ప్రకారం పంపివేయబడును.

గవర్నమెంటు సెక్యూరిటీలపైనను, మ్యునిసిపల్, పోర్టు ట్రస్టు డిబెంచర్లపైనను, గారంటీడ్ రైల్వేలలోని షేర్లపైనను, సరకులపైనను, బంగారముపైనను, అప్పులు గాని, క్యాష్ క్రెడిట్లు గాని యివ్వబడును.

పాత ఖాతాదార్ల బిల్లులు డిస్కౌంటు చేయబడును. బిల్సు ఆఫ్ ఎక్స్చేంజి మార్చబడును.

రూల్సుయొక్క కాపీలు పవర్ ఆఫ్ అటర్నీ మున్నగునవి హెడ్ ఆఫీసునకుగాని ఏబ్రాంచి ఆఫీసునకు గాని దరఖాస్తుపైని దొరుకగలవు. (14)

# వ్యవసాయాభివృద్ధి

గా. భూపతిరాజు వేంకటపతిరాజు గారు, బి.ఏ., బి.ఎల్.

కృషితో నాస్తి దుర్భిక్షమ్ - అనెడి యార్యోక్తి ననుసరించి భరతఖండము ప్రాచీనకాలమునుండియు వ్యవసాయమునఁ గూడ మెప్పు వడసియు నానాఁటికి క్షీణదశకు వచ్చుచుండుటచే, దానిని గూర్చిన వర్తమానరాజ్యాంగలోపములు ప్రజల స్వలాభజ్ఞానరాహిత్యము జలాశయముల తెఱంగు ఎరువుల విధానము నూతనకృషిమార్గములు తదుపకరణములు పశుపోషణము అన్యోన్యసహాయనిధులు మున్నగు విషయములు చర్చనీయము లని తలంచి, ఆంధ్రపత్రికాధిపతి గారి ప్రోత్సాహమున నా యభిప్రాయ మిందు పొందుపఱచితిని:

హిందూదేశమునఁ గల సుమారు 32 కోట్ల జనమునకును 10 కోట్ల గోమహిషాశ్వాదిపశుగణమునకును ఆహారపదార్థ మెంత కావలయునో దానికి పంట యెంత సరిపడుచున్నదో తెలిసికొనుట యావశ్యకము.

మన దేశమందు, కడచిన జనాభా ప్రకారము, ఏడాది లోపు వయసు గల శిశువులు కోటి మంది. వారికి పాలు ఆహార మగుటచే, ఇతరాహారపదార్థములతో వారికి పనిలేదు. ఇఁక రెం డేండ్ల లోపు వయసువారు 50 లక్షల మందికి ఒక్కొక్కరికి దినమునకు 2½ తులముల యాహారము చొప్పున 125 లక్షల తులములు, మూ డేండ్ల లోపు వారికి 90 లక్షలకు 5 తు. చొప్పున 450 లక్షల తులములు, నాలు గేండ్ల లోపువారు కోటి జనమునకు 7½ తు. చొప్పున 750 లక్షల తులములు, అయి దేండ్ల లోపువారికి 90 లక్షలకు 10 తు. చొప్పున 900 లక్షల తులములు, అయిదు మొదలు పది యేండ్ల లోపువారు 430 లక్షలకు 15 తు. చొప్పున 6,450 లక్షల తులములు, 10 మొదలు 15 సం.ల వయసువారు 340 లక్షల జనమునకు 20 తు. చొప్పున 6,800 లక్షల తులములు, 15 మొదలు 50 సం.ల వయసువారు 15 కోట్ల 60 లక్షలకు దినమునకు 40 తు. చొప్పున 62,400 లక్షల తులములు, 50 దాఁటిన వృద్ధులకు 360 లక్షలకు 30 తులముల చొప్పున 10,800 లక్షల తులములు, దేహపరిశ్రమ చేయు రయితులు 780 లక్షల మందికి వెనుక చెప్పిన 40 తులములు గాక హెచ్చుగా మరి 20 తులముల చొప్పున 15,600 లక్షల తులములు ఆహారము దినమును కావలయును. అందుచే, సంవత్సరమునకు మణుగు 1-కి 40 సేర్లు సేరు 1-కి 80 తులముల చొప్పున గణనచేయఁగ, ఇంచుమించు 119 కోట్ల మణుగుల యాహారము కావలయును. ఉత్సవాదిదినములలోను పిండివంటలకు కోళ్లకు దుబారాగాను రద్దు క్రిందను మఱి 11 కోట్ల మణుగులకు తక్కువ గాకుండ కర్చగును. కాఁగా, 130 కోట్ల మణుగులు మనుజుల యాహారము నిమిత్తము కావలయును. ఇటులే మన దేశమునఁ గల 4 కోట్ల యావులకు 5 కోట్ల యెడ్లకు 140 లక్షల యెనుములకు 17 లక్షల గుఱ్ఱములకు 83 వేల వేసడములకు గాడిదలకు దాణా క్రింద 40 కోట్ల మణుగుల గింజలు కావలయును. ఇంతియ గాక, మన దేశమున తినుబడి దినుసులు పండించు 21½ కోట్ల యెకరములకు ముందు సంవత్సరమునకు కావలయు విత్తనముల నిమిత్తము 5 కోట్ల మణుగులు కావలయును. మొత్తము 175 కోట్ల మణుగుల యాహారపదార్థమునకు, మన దేశము సుభిక్షముగ పండినపుడు వడ్లు గోధుమలు యవలు చోళ్లు జొన్నలు ఉలవలు మొదలగు తినుబడి దినుసులు 162 కోట్ల మణుగులకంటె హెచ్చు పండ దని నా తలంపు. కాఁగా, పై లెక్కను బట్టి 13 కోట్ల మణుగుల లోటంత కనఁబడుచున్నది. ఇట్టి స్థితిలో 12 కోట్ల మణుగులకు పైఁగా ఆహారపదార్థములు అన్యదేశములకు ఎగుమతి యగుచున్నవి. అతివృష్టి అనావృష్టి మొదలగునవి సంభవించునపుడు పంట చాల తగ్గియుండును. ఈ విషయమును లాహోరు గంగారామ్ గారు తమ వ్యవసాయవిషయము లను పేరిటి గ్రంథమున విపులముగను ప్రశంసనీయముగను చర్చించియున్నారు. వారి యభిప్రాయములతో మన మేకీభవింపకున్నను గవర్నమెంటు లెక్కలను బట్టి వారు వ్రాసిన విషయములు తప్పక చూడఁదగినవి.

దీనికి తోడు, పండిన పంట అంతయు ప్రజల కందఁజిక్కిని సమముగ సమకూరదు గావున, మన దేశమున మూఁడవ వంతు ప్రజలు ఆహారము పూర్తిగ లేకయు అందులో కొందఱు కొన్నాళ్లు ఉపవాసములు చేయుచును గూడ కాలము గడుపవలసివచ్చుచున్న దనుట నిస్సందేహము.

ఇట్టి కొఱఁతను బాపు బాధ్యత ప్రభుత్వమువారిమీఁదను ప్రజలమీఁదను పూర్తిగ కలదు. ఏఁటేఁట పండినది భోజనమునకే చాలనపుడు నిలువచేసికొను టెట్లు? ధనవంతు లగు టెట్లు? దేహారోగ్యము కలిగియుండు టెట్లు? ఇందు విషయమై ప్రభుత్వమువారు జాగుచేయక ప్రజల స్థితిగతులు పరిశీలించుటకు బుద్ధిమంతులను నియోగించుట కర్తవ్యము.

అమెరికా సంయుక్తరాష్ట్రములలో 10 కోట్ల ప్రజలు మాత్రమే యున్నను, 8,000 కోట్ల రూపాయల విలువ గల పంట పండించుచున్నారు. గోధుమలు 200 కోట్ల రూపాయలవి; విలువ గల పైరులు 450 కోట్లవి; గడ్డలు 200 కోట్లవి; ప్రత్తి 300 కోట్లది. బంగాళాదుంపలు 50 కోట్లవి; పొగాకు 25 కోట్లవి; ఫలములు 30 కోట్లవి, ఇంకను కొదవ దినుసు లెన్నియో యున్నవి. అమెరికా దేశములో 211 లక్షల గుఱ్ఱములు 45 లక్షల వేసడములు 514 లక్షల పశువులు 491 లక్షల గొఱ్ఱెలు 680 లక్షల పందులు ఉన్నవి. ఇవి యేఁటేఁ

టను వృద్ధి పొందుచున్నవి గాని మన దేశమునందువలె నానాటికి క్షీణించుచుండుట లేదు. మన దేశమున పశువుల క్షీణదశకు కారణము బీళ్లు లేని లోపము. గ్రామసామీప్యమున నున్న యడవులు అంపు చేయుటయు చాలవఱకు తగ్గించుటయు సర్వసాధారణము. ప్రతి గ్రామమునను పశువులకొఱకు కొంత భూమిని నియామకముగ నుంచుచున్న యెడల జంతువు లభివృద్ధి గాంచఁగలవు.

మన దేశమునందు ప్రభుత్వమువారు 50 లేక 60 లక్షలు మాత్రమే వ్యవసాయాభివృద్ధికి కర్చు పెట్టుచుండఁగ, అమెరికాలో 10 కోట్లకు పైఁగా కర్చు పెట్టుచు 6 వేలమంది శాస్త్రజ్ఞులచే వ్యవసాయ శాఖలో పనిచేయించుచున్నారు. ప్రభుత్వమువారు తక్కిన కర్చులు తగ్గించి ఇందుకొఱకు చాల హెచ్చు సొమ్మును కర్చుపెట్టి నూతన వ్యవసాయజ్ఞానమును రయితులకు బోధపఱచుటకు తగు మార్గము లాలోచించినఁ గాని గేశస్థుల స్థితి బాగుపడదు.

జ్ఞానాభివృద్ధికి విద్యావిషయ మెంత ముఖ్యమో కుటుంబ పోషణార్థము వ్యవసాయాభివృద్ధియు అంత ముఖ్యమే.

ప్రజాభివృద్ధితో పాటు సాగులోనికి వచ్చు భూమి పరిమితి హెచ్చగుచుండుట లేదు. భూమి విచారణ కమిటీవారు చెప్పుటలో నూటికి ఎనమండుగురు జనాభా హెచ్చినప్పుడు సాగు పరిమితి నూటికి ఆఱు ఎకరములు మాత్రమే హెచ్చిన దని వ్రాసియుండిరి. బ్రిటిషు పరిపాలిత రాష్ట్రములలోకంటె స్వదేశసంస్థానములలో సాగు భూమి యొక్క పరిమితి ఎక్కువగ వృద్ధి పొందుచున్నది. నీటి వసతులు ఎక్కువగ ఏర్పాటు చేయవలెను. 1907-వ సంవత్సరమునందు బావుల యాధారముపైని పండించుకొను భూమి 1 కోటి 40లక్షల యెకరము లయియుండ, 1911-వ సంవత్సరములో 1 కోటి 1 లక్షల యెకరములు మాత్రమే తేలినది. చాల ప్రదేశములలో, ముఖ్యముగ ఆంధ్ర దేశములో, బావులను అభివృద్ధి చేయుట కవకాశ మున్నది. కాలువ యాధారమును బట్టి 1912-వ సంవత్సరము సాగుచేసినది 1 కోటి 70 లక్షల యకరములు మాత్రమే. కాని, అది 1913-వ సంవత్సరములో 2 కోట్లవఱకు హెచ్చినది. చెరువుల యాధారము క్రింద పండించుకొను భూముల పరిమితి 63 లక్షల యెకరములు మాత్రమే. మొత్తము మీఁద గవర్నమెంటువా రేర్పఱచిన నీటి వసతులవలన పండింపఁబడుచున్న భూమి $2\frac{1}{2}$ కోట్ల యెకరములు. ఇందువలన ప్రభుత్వమువారికి పెట్టుబడి పయిని నూటికి $8\frac{1}{4}$ వడ్డి కిట్టుచున్నది. ఎక్కువ ధన మేల కర్చుపెట్టరాదో తెలియదు.

ఇరిగేషను కమీషను రిపోర్టు ప్రకారము వర్షమువలన లభించు $37\frac{1}{2}$ అంగుళముల యుదకములో చెట్లకును భూమి పదునునకును ఆవిరి క్రిందను పోవుచున్న 22 అంగుళములు గాక $2\frac{1}{4}$ అంగుళములు మాత్రమే కాలువల ద్వారమున సాగున కుపయోగపడుచున్నవి. తక్కిన $13\frac{1}{4}$ అంగుళముల యుదకమును నదుల ముఖమున వ్యర్థముగ సముద్రమునకు పోవుచున్నది. అనఁగా వాడుకచేసికొనఁదగిన 41వంతులలోను 6 వంతులు మాత్రమే ముపయోగమునకు వచ్చి 35 వంతులు నిష్ప్రయోజనముగ పోవుచున్నవి. రైతేల నిమిత్తము వందల కొలది కోట్లు వెచ్చించుచు ఇరిగేషను నిమిత్తము దానిలో నాల్గవ వంతైన కర్చుపెట్టినచో సేద్యమునకు తగిన యావత్తు భూమియు ఫలవంతమగుటయే గాక నీటి లోపము లేకపోవుటచే ఫల మధికముగ కూడ నుండును. గంగారాము గారు చెప్పినట్లు కాలువ నీటి పాతముల వలన విద్యుచ్ఛక్తిని సమకూర్చుకొని ఈజిప్టు దేశములోవలె ఎంత యెత్తయిన మెఱక భూమి కైనను లిఫ్ట్ ఇరిగేషనువలన 15 అడుగు లయినను సరియే సులభముగ నీరు కట్టి భూమిని ఫలవంతము చేయవచ్చును. అట్టి పనులు చేయు సమర్థులను ధనమునకు వెనుదీయక ప్రభుత్వమువారు సిద్ధపఱుపవలెను. నీటి ముంపు కలుగుచున్న దన్న 'మే మేమి చేయఁగలము?' నీటి లోపము కల దన్న 'మే మేమి చేయఁగలము?!' మెఱకలకు నీరు ప్రవహింపకున్న దన్న 'మే మేమి చేయఁగలము?' అనెడి యింజనీయర్లు ఉన్నను సరియే, లేకున్నను సరియే. దేశమునకు వారివల్ల లాభము లేదు.

ప్రభుత్వమువారు దయచేసి వ్యవసాయాభివృద్ధికి నూతనమార్గములు బోధించుచున్నను, అవి యమలులోనికి తేకుండుట మన లోపమే. 'వ్యర్థముగ విత్తనములు హెచ్చుగా నుపయోగింపవద్దు. ఎకరమునకు $8\frac{1}{4}$ సేర్ల చొప్పున $7\frac{1}{2}$ సెంట్ల భూమిలో ఆకు పోసిన చాలును, మంచి పంట పండు' నని చెప్పినను మఱి నాల్గింతలు భూమి మీఁద పొఱఁబోయువారు మనలో లేకపోలేదు. మంచి యెరవులు వేయక నెరసపు భూమి బాగుగ పండ దనినను ఎరవులు వేయువారు మిక్కిలి తక్కువ. దివ్యముగ పండఁదగిన గోదావరి కృష్ణ జిల్లాలలో తక్కిన స్థలములలోకంటె పంట తక్కువగుటకు కారణ మేమి? ధాన్యము పంట మధురలో ఎకరమునకు 1552 పౌనులు సగటున పండును. తిరునల్వేలిలో 1256, సేలములో 1511, తిరుచునాపల్లిలో 1452, కోయంబుత్తూరులో 1438, కడపలో 1437, ఉత్తరార్కాటులో 1368, గుంటూరులో 1339, అనంతపురములో 1286, విశాఖపట్టణమున 1269, కర్నూలులో 1228, బళ్లారిలో 1187, కృష్ణాజిల్లాలో 1090, గంజాములో 1087, నెల్లూరులో 1067 పౌనులు తేలుచుండఁగా, గోదావరిలో 1022 పౌనులు సగటున పండుటకు కారణ మేమి? కావలసిన యెరవులు వేయక పోవుటయు మంచి విత్తనములు జతపఱచుకొనకపోవుటయు అదునునకు పనులు జరపకపోవుటయు యుక్తమగు మందమపాగత్తులు చేయకుండుటయుఁ గాక మఱేమి కారణము కలుగఁగలదు? బరోడా దేశములోను బొంబాయి రాజధానిలోను పెక్కు పంటలు ఆంధ్రదేశమునకంటె మిక్కుటముగ పండును. వోట్లు రామనాథము జిల్లాలో ఎకరమునకు 2835 పౌనులు పండుచుండఁగా, విశాఖపట్టములో 1262 పౌనులును గోదావరి జిల్లాలో 740 పౌనులును పండుట యేల? నువ్వులు ఉత్తరార్కాటులో ఎకరమునకు 494 పౌనులు పండుచున్నపుడు, నెల్లూరిలో 274 పౌనులు పండుట యేమి? చెఱకువల్ల కోయంబుత్తూరులో ఎకరమునకు 8638 పౌనులు బెల్లము అగుచుండ, కృష్ణా జిల్లాలో 4896 పౌనులు మాత్రమే యగుచున్న దన్న ఏ మనుకొనవలెను? పూసాలో గవర్నమెంటు సేరీలో ఎకరమునకు 16000 పౌనుల బెల్లము అయినదట.

ంన మేల వృద్ధి చేసికొనరాదు? గోదుమల పంట భరతఖండమునందే ంధుదేశమున ఎకరమునకు 1340 పౌనులు పండుచుండ, హైదరాబాదులో 137 పౌనులు మాత్రమే పండుచున్నది. తక్కిన స్థలములలోని పంట ఈ నడిమి యంతరములలో నుండును. యూరోపుదేశములలో సుమారు రెండు వేల పౌనులు పండును. కొన్ని చోట్ల మూడు నాల్గు వేల పౌనులు సయితము పండించుచున్నారు. మనము కూడ ంచెము శ్రద్ధతో పనిచేసిన నెక్కువ పంట పండింపవచ్చును.

ఎరువులు వేయు మార్గమును ముఖ్యముగ గమనింపవలయును. ంచేటను ఏ భూమిపైనైనను ఒకపంటనే పండించుచువచ్చిన పంట క్షీణించుట అనుభవసిద్ధమే. క్రొత్త యెరువులు వేసి తిరిగి భూమిని సారవంతము చేయవలెను. దయించా వెంటనే దున్ని భూమిలో కలపక కోసి నెల రోజులు మట్టిలో పూడ్చి ఎరువుగా వేసిన భూమికి ఎక్కువ సత్తువ కలుగునంట. అటు చేసినవా రెందఱు? వ్యవసాయాధికారులు బోధించు మార్గములు తెలిసికొనిన రయితులు మిక్కిలి తక్కువ గదా. ఆ లాభము మనము పొందనియెడల విశేషవ్యయము పెట్టి వ్యవసాయశాఖ యేర్పఱుప నేల? వరి వ్యవసాయముననే ఎ. 1-కి నూరు లేక నూటయేఁబది రూపాయలు కర్చులు పోను లాభము రాఁగలదంట. స్వల్పలాభముతో మనము సంతుష్టి పొంద నేల? వరికి ఉపయోగించెడి యెరువులు ఎన్నియో యున్నవి. అవి తెలియు టెట్లు? తెలిసిన, వాడు టెట్లు? గవర్నమెంటువారిమీఁద భారము పెట్టి విద్యావంతులు ఉపేక్షింపక వ్యవసాయమునకు ఉపకరించు మార్గములు ప్రతి గ్రామమునను బోధించుచుండిన, ఎక్కువ లాభము ప్రజలకు సుముఖముగ కల్గును గదా!

ఏ విత్తనము వేసినను చాలు నని తలంపక భూస్థితిని బట్టి ఎక్కువగా పండెడి విత్తనములు గ్రామమునకు సరిపడునట్లు గ్రామస్థులు సంఘములుగా నేర్పడి జాగ్రత్తి పెట్టుకొనుట చాల మేలు. మంచి విత్తనములవలన పంటలో నూటికి ఏఁబది భాగములు హెచ్చు కనిపించును. మన దేశమునఁ గల పంటలలో చెఱకు లాభకారి. ఎకరమునకు 400 లేక 500 రూపాయలవఱకు లాభము రాఁదగినది. ఇందునకు విలువైన యెరవులు వేయవలెను. ధనవ్యయమును ప్రయాసమును కూడ కావలయును. 'కష్టే ఫలీ' అని నట్లు శ్రమ కోర్చిన ఎక్కువ లాభము కలుగును. ప్రతివారును ప్రత్యేకముగా నీరు తోడు యంత్రమును చెరకుగానుగ యంత్రమును బెల్లమూడు యంత్రమును పెట్టుకొనుట దుర్లభము. పలువురు కూడి ఒకచోట పనిచేయునెడల కర్చులో సగము తగ్గును. ఒక్కొకరును సాధ్యము కా దని మానవలసిన క్కఱ లేదు. ఇట్టి వన్యోన్యసాహాయ్యమువలన కావలసిన పనులు.

ంకులు పెట్టినయెడల తగ్గు ధరలకు విక్రయించి ధనము నష్టము పెట్టుకొనుటకు బదులుగా బ్యాంకులలోనుండి ధనము తెచ్చి కిస్తీలు కట్టుకొనుచు యుక్త మగు ధరలు వచ్చునపుడు అమ్ముచుండుట లాభకర మని యెఱుఁగనివారు లేరు. కాని, అది అమలులోనికి వచ్చుట లేదు. ఈ లోపము తీరు టెట్లు? ఈజిప్టు దేశములోవలె గవర్న ... 'ఎగ్రికల్చరల్ బ్యాంకులు' వ్యవసాయకుల లాభముకొఱకు స్థాపింపవలెను. బదులిచ్చిన ధనమును ద్విగుణముగ 25 సంవత్సరములలో తీర్చుకొనుటకును సరి వాయిదాలను చెల్లనపుడు ల్యాండురివిన్యూ తీరున వసూలు చేయుటకును పద్ధతులు నవగణ కావలెను. అట్టి సదుపాయము కలిగినయెడల ప్రస్తుతపు రయితుల బీద స్థితి చాల తగ్గును. ప్రభుత్వమువారు ఏఁటేఁట కోట్ల చొప్పున కర్చు పెట్టుచువచ్చిన వడ్డీ చేరుమందును. కొంత కాలమునాఁటికి రయితులకు ఋణాక్రాంతమగు దుర్దశ తీఱును.

అనేకవిధము లయిన విలువ గల దినుసులు పండించు ప్రయత్నము చేయవలెను. బట్టలకు ధర విశేషముగ నున్నది. ప్రస్తుతము ప్రత్తికి కూడ ధర హెచ్చుగనే యున్నది. అట్టి స్థితిలో మంచి ప్రత్తి విత్తనములు విపులముగ చల్లి ఎక్కువ పంట పండించుకొని లాభము పొందరాదా? కాని, ప్రతి పంటయు ప్రతిభూమిపైని పండు ననుకొనరాదు. ఏ భూమి ఏ పంట పండించుటకు తగియుండునో వ్యవసాయోద్యోగస్థులవలన తెలిసికొని ఆ ప్రకారము క్రొత్త యెరువులతో విలువ గల పంటలు పండించుట దేశమునకు లాభకారి. పాలేరులను గవర్నమెంటు శేరీలకు పంపినయెడల వాండ్లకు భోజనమునకు సొమ్మిచ్చుచు మూడు నాల్గు మాసములలో నేర్పవలసిన విషయములు నేర్పుదురు కావున, పెద్ద శేరీలు గలవారు తమ పాలేర్లను పంపి క్రొత్త విషయములు నేర్పించుట చాల లాభకరము. మామూలు నాగళ్లకంటె కొన్ని ప్రదేశములలో ఇనుపనాగళ్లు మిక్కిలి యుపయోగకర మని అనుభవజ్ఞులు చెప్పుచున్నారు. ఎ.1-కి 20 కుంచముల విత్తనములకు బదులు 3 కుంచములు పోసిన సరిపోవును. అందువలన ఎ. 1-కి 5 రూపాయలు కలసివచ్చును. దీనివల్లనే మన దేశమునకు కొన్ని లక్షలు కలసివచ్చును. దయించా మొదలగు పసరెరువులవలన పంట హెచ్చి ఎ. 1-కి పది రూపాయలు విలువ గల హెచ్చు పంట కర్చులు పోను పండును. చెఱకు పండుటవలన సగటున ఎ. 1-కి రెండు మూడు వందలు కర్చులు పోను మరి రెండు మూడు వందలు లాభించును. ఈ సందర్భమున బీద రయితులకు బ్యాంకులు గాని గవర్నమెంటువారు గాని పెట్టుబడి బదులిచ్చినయెడల బీదలు ధనికు లగుటకు సాధన మేర్పడును. మనుసూర్ నాగలి (16 రూ. విలువ) కొన్ని ప్రదేశములలో ఉపయోగింపవచ్చును. మామూలు నాగలితో ఆఱు దుక్కులు చాలునో చాలదో గాని, దీనితో రెండు దుక్కులు చాలును. అందువలననే ఎ. 1-కి మూడు రూపాయలు కలసివచ్చును. మామూలు ఏతముకంటె మోటవల్ల ఆ కర్చునకే ద్విగుణముగ నీటి సప్లయి అగును. పెద్ద ప్రదేశములకు జలయంత్రము మేలు. ప్రభుత్వమువారు మ్యాజిక్ లాంతరులవలన రయితులకు క్రొత్త విషయములకు సంబంధించిన జ్ఞానము కలిగించుటకై ప్రతిగ్రామమునకును తమ యుద్యోగస్థులను పంపుట చాల మెఱుఁగు. ప్రస్తుతము పలువురు రయితులు బీద స్థితిలో నుండుటవలన వారు సమయమునకు సొమ్ము దొరకక హెచ్చు వడ్డికి బదుళ్లు తెచ్చి తీర్చుకొనలేక అసలు భూములే కోలుపోవుచున్నారు. వీరిని కడతేర్చుటకు బ్యాంకులు తోడ పడవలెను. ప్రభుత్వమువారు నీటి పన్నులు తగ్గించి ఎక్కువ ప్రదేశము

నదు ఉపయోగపడు నేర్పాట్లు ఆలోచించి ప్రజలను మంచి స్థితి లోనికి తేవలయును. 'ఎక్కువ ధనము వ్యయ మగుచున్నది. ఉద్యోగస్థులకు ఎక్కువ జీతము లిచ్చుచున్నారు. నానాటికని పన్నుల యెగుమతి యెక్కువచున్న' దనినంత మాత్రముచేత దేశపరిపాలనము బాగున్న దనుటకు వీలు లేదు. ప్రజలలో నెవరైనను నిరాహారులై కట్టబట్ట లేక వాసయోగ్య మైన గృహము లేక బాధ నొందుచుందురేని, అది పరిపాలనాలోపమే. అట్టి లోపము లెఱుగవలయును ప్రతిదేశాభిమానియు నిర్నిద్ర మగు ఘనికతో బహువిధముల పాటుపడుచుండవలయును. ఆంధ్రోద్యమమునకై పాటుపడెడి యాంధ్రనాయకులు ఆంధ్రదేశమును అనతికాలములో ఉన్నతస్థితికి తెచ్చెదరు గాక యనియు, మన జార్జి సార్వభౌముని ప్రభుత్వమున మన హిందూదేశము

సీ. "వానలు సరవితో వర్షించె సస్యముల్
వెళ్లిగొల్చుగ విఱ్ఱవీగి పండె
ఆరోగ్యపుత్రపౌత్రైశ్వర్యవంతులై
బ్రదికిరి నూఱేండ్లు పంచజనులు
పూవుఁబోఁడులు పతిదేవతలై రగ్ని
భయతస్కరవ్యాధిభయము లడఁగె
ఫలపయఃకుసుమాదిబహుపదార్థంబులు
రసగంధసామగ్రి యొసక మెసఁగె
ఈత్యుపద్రవమృత్యురాహిత్యయుక్తి
ధరఁ బ్రజావృద్ధి తామరతంప రయ్యె
న్యాయపథమున స్వారోచిషాఖ్యమనువు
శ్రీలఁ జెంపొంది పాలించు కాలమునను."

అనినట్లు వెలయవలె ననియు, సరి కాలనీలతో స్వరా- స్వాతంత్ర్య మబ్బి దేశ మున్నతస్థితిలోనికి రావలె ననియు పరిపాలనా సౌకర్యముకొఱకు ఆంధ్రరాష్ట్రము వేఱయి అ[illegible]ది గాంచవలె ననియు సదా దేవుని ప్రార్థించెద.

# ప్రేమకొఱకు ప్రేమ

జేవులపల్లి అప్పలనరసింహము గారు, ఎమ్. ఏ, ఎల్. టి.

ఆండడమును చూచి ప్రేమింతు నందు వేమొ?
వలదు ప్రేమింప; దిక్కుల వెలుఁగఁజేసి
ఆది యంతును లేని దివ్యప్రదీపు
ఆదికాంతిని ప్రేమింపనగును నీకు. 1

గీ. యువతి నంచును ప్రేమింపనుంటి వేమొ?
వలదు ప్రేమింప; నేఁ జేఁట మలయునపుడు
క్రొత్త క్రొత్త వికాసముల్ కూర్చునట్టి
యల వసంతుని ప్రేమింపనగును నీకు. 2

తే. అర్థమును చూచి ప్రేమింతు నందు వేమొ?
వలదు ప్రేమింప; లెక్కింప నలవికాని
రత్నసంతతితోడ విరాజిలెడు మ
హాంబుదధియె నీకు ప్రేమింపనొప్పు నెపుడు. 3

ఆ. ప్రేమకొఱకె నన్ను ప్రేమింతు నందువా?
ప్రేమ గొలుపుమయ్య ప్రియవయస్య!
ఇనుఁడు మధువు నుదధి ఇన్నిటికన్న వి
శ్వాసపాత్ర మైన స్వాంత మిదెద. 4

ఈ నాలుగు పద్యరత్నములును గలిగిన కాగితము నెవ్వరో రాజమహేంద్రవరము ఆర్ట్సు కాలేజీ పుస్తకాగారమునఁ గల వామన భట్టబాణుని 'కావ్యాలంకార సూత్రవృత్తి' యను గ్రంథమం గుంచిరి. పుణ్యవశంబున నా కది లభించినది. ఈ పద్యరత్నములు రచియించిన కవికి నేను కృతజ్ఞుఁడ నని విన్నవించుచున్నాఁడను. ఇందుమూలమున కవినామధేయాదులు తెలియఁబడఁగలుగునెడల మిక్కిలి సంతసించెదను. ఇందలి నాలుగవ పద్యమున ప్రథమచరణమం దున్న భావము ముఖ్య మగుటచే, అదియే యీ పద్యమాలికకు తగిన పేరని తోఁచి అగ్రభాగమున వ్రాయ సాహసించితిని. ఈ మాలికయందలి పదసౌలభ్యము లాలిత్యము కొనియాడఁదగియున్నవి. భాషాంతరీకరణములయం దివి తఱుచుగా కనఁబడవు. పాశ్చాత్యదేశములయందలి గ్రంథరాజములలో కొన్ని శతాబ్దులనుండి ఇట్టి యవ్యాజప్రేమ యదే ప్రేమ యనియు, తక్కిన ప్రేమ జంతుసామాన్యమును అస్థిరమును అగు కోరిక గాని నిజ మైన ప్రేమ గా దనియు భావపూరితచేతస్కులును తత్త్వస్ఫురణదీపితాంతరంగులును అగు కవివరేణ్యులచేత నుగ్గడింపఁబడుచున్నది. సంస్కృతాంధ్రగ్రంథములలో ఈశ్వరోపాసనయందు తప్ప యువయువతీజనుల కిట్టి యవ్యాజప్రేమను వెల్లడించు కవికల్పనలను గాని బోధించు కవిసూక్తులను గాని నేను చూచియుండ లేదు. మహాకవి భవభూతియొక్క యీ క్రింది వాక్యము మాత్రము మానుషావ్యాజప్రేమను సూచించుచున్నది.

"న ఖలు బహిరుపాధీన్ ప్రీతయస్సంశ్రయంతే."

అనఁగా, "స్నేహములు పైకి కనఁబడు గుణములనే ఆశ్రయించుకొ యుండవు."

ఈ పద్యమాలిక యాంధ్రలోకంబున కంతకును ఆదరణపాత్ర మని తలఁచెదను.

మేరీ కోరయిల్లి యను ఆంగ్లకవయిత్రియొక్క "థెల్మా" నుండి 2-2-15 తెనిఁగింపఁబడినది.

# దేశభాషామూలకవిద్యాభ్యాసము

ఏ. యల్. నారాయణరావు గారు, బి. ఏ.

దేశభాషల మూలమున విద్య నేర్పవలె నను వాదము సామాన్యముగా నంగీకరింపఁబడియున్నది. ఆంగ్లేయభాష మూలమున విద్య నేర్పుటచే కలుగు నష్టములు రెండు: మొదటిది అట్టి విద్య నభ్యసించుటయందుఁ గల కష్టము, రెండవది అట్టి యత్యంతప్రయాసమునకు లాభము లేకపోవుట. వ్యయప్రయాసముల కోర్చి అనేకసంవత్సరములు చదివి చదివి తుదకు బి. ఏ. పట్టము పొందినను సాటివారలలో, అనఁగా అన్యదేశీయు లగు బి. ఏ. లలో, తల యెత్తి తిరుగుటకు మనవారు సంకోచపడుట తఱచు చూచుచుందుము. దీనికిని రెండు కారణములు గలవు: నూతనవిషయమును నూతనభాషయందు ఏకకాలమునందే నేర్చుకొనుటవలన నవ్విషయ మనర్గళముగ రాకుండుట; మఱి, అన్యదేశమునుండి రావేగమే అనన్యసామాన్యప్రతిభా ...గు స్వదేశీయులకన్న నెక్కుడుగ గమనింపఁబడుట. ...ప్రపారంగతుండగు యదునాథసర్కారును ముస్కా- స్పెఫర్డు బి. ఏ. యను నొక యుద్యోగమునకు దర కొరతనమువారి రెండవవానినే స్వీకరించుటయు ...కారు గారిచే రచియింపఁబడిన చరిత్ర నాధారము ...టయు నెఱుఁగనివారు లేరు. ఇట్టి తార్కాణ ...మనస్సులను వేధించియు అసంతుష్టిని కలిగించియు స్వాభిమానభయంబులను పుట్టించియు విద్యయం దాసక్తికి మాఱుగ తను కల్గించును. ఇందునకు తోడుగ పరీక్షకు పోయిన వారిలో నెనుబది మంది కృతార్థులు గాక యసమర్థులుగ పరిగణింపఁబడుచుఁ గలరు. ఇంకొకటి, చిన్ననాఁటినుండియు అన్యజాతీయభ్యాసమునందే మునింగియుండుటచే, తరువాత అన్యసంఘాచారపరాయణత్వము సంభవించును. అటు సంభవింప, హిందూదేశపూర్వాచారము లడుగంటును. నూతనలభ్యము లగు నాచారముల నిర్వృత్తికి ధన మవశ్యము గాఁగా, తత్సంపాదనార్థము శక్తి యెట్లు వినియోగింపఁబడును, జ్ఞానాభివృద్ధి నానాఁటికి క్షీణించును. ఒకవేళ కొ తీరిక లభించినను, ఇంగ్లీషువిద్యాభ్యాస మొనర్చిన వారి కితరవగు కార్యములు ప్రీతి కల్గించునట్లు లింగ్లీషువిద్య కల్గింపాలదు. ...ర్థికు లగు నింగ్లీషువారలకు తీరిక హెచ్చు. భాష స్వభాషయగు నింగ్లీషువిద్య వారలకు సులభమును ప్రీతిదాయకంబును గ, కళాశాల విడిచిన తరువాత వారు చదువును మానకుండుటవలన వారి జ్ఞానమునకు దినాభివృద్ధి గాంచుచుండ, హిందువుల జ్ఞానము అభివృద్ధి గాంచుటకు మాఱుగ క్షీణించుట కూడ సంభవించును. దీనికంతటికిని మూలకారణము అన్యభాషా మూలమున విద్య గఱపుటయే యని తెలియనగును.

ప్రపంచకమునం దంతటను దేశభాషలలో విద్య నేర్పఁబడుచుండ, హిందూదేశస్థులకు మాత్ర మట్టిసూత్ర మనర్థకారణం బనుట చిత్రము. విదేశీయులే కాక విద్యాధికు లగు హైందవులు కూడ ఈ సూత్రము నామోదింపకపోవుటకు తోడు తీవ్రముగ నాక్షేపింపఁ దొడఁగిరి. ఆ యాక్షేపణ యెంతవఱకు సత్యమో పరీక్షించుటకు ముందీ కాలపు విద్యార్థుల స్థితి నాలోచింపఁదగును.

హైందవవిద్యార్థులకు చిన్ననాఁటినుండియు ప్రతివిషయమును అన్యభాషలో నేర్పఁబడుచుండుటవలన తద్విషయజ్ఞానము కొంచెమగును. ఇవ్విషయమున యదునాథ సర్కారు గారు చూపిన తార్కాణము నుదహరించెద. సాధారణముగ పదునాలు పదునేడు సంవత్సరముల వయస్సునకు మన బాలురు మెట్రిక్యులేషను తరగతిలో చేరుదురు. హిందూదేశచరిత్ర యాంగ్లేయభాషయందు రచియింపఁబడియున్నందున, వారి కతికష్టముగా కనిపింపకుండఁ జేయుటకు దానినంతటిని నూటయేఁబది పుటలకు తగ్గించి సంగ్రహపఱచెదరు. దానం జేసి యా తరగతి బాలురకు హిందూదేశచరిత్రజ్ఞానము స్వల్పమగును. కాని, ఇంగ్లాండుదేశమునం దా వయసు గలవారికి వారి మాతృభాషయగు నింగ్లీషునందు వ్రాయఁబడిన చరిత్రనే పఠింప నియమింతురు. కష్టమగు విదేశీయభాషయందుఁ గాక సులభమగు మాతృభాషయందు చరిత్రాద్యంశములను గ్రహించుట గావున అట్టి విద్యార్థులు మన విద్యార్థులు చదివెడిదానికన్న పెద్దవి యగు గ్రంథములను చదువుదురు. అందువలన వారి చరిత్రజ్ఞానము స్వల్పము గాక పుష్కలమై విజ్ఞానప్రదాయకంబై యుండును. ఈ తార్కాణమే యితరశాస్త్రములకును తగియున్నది. ఈ యవస్థవలన నష్టము లనేకములు. బహుళమైన యాలోచనాశక్తి యుండదు. భాషాంతరీకరణకష్టము మనమునం దగపడుచుండుటచే పరీక్షార్థము వలయు పుస్తకములు దక్క తక్కిన వానిని చదువుటకు వీ లుండదు. మనస్సునం దాలోచన లుద్భవించుచున్నను, అన్యభాషాజ్ఞానము కొంచెమగుటచేతను మొదటినుండియు మాతృభాషయందు కృషి లేనందునను ఆ యాలోచనలను వ్యక్తీకరించుట యత్యంతకష్టతర మగును. శాస్త్రజ్ఞానము గాని కళాజ్ఞానము గాని విస్తారముగ లేకుండును. ఇందువలననే మన బి. ఏ.లను అన్యదేశీయులు చులకగ చూతురు.

మానవుల యాలోచనాశక్తి నభివృద్ధి గావించుటయే విద్యయొక్క ముఖ్యాభిప్రాయము. అట్టి శక్తిని పడయుట కన్యభాష యుపయుక్తము కానేరదు. విద్యార్థి సాధారణముగ నే భాషయందు మాటలాడునో ఆలోచించునో ఆ భాషయందే విద్య నేర్చుకొనవలెను. అటు గావించినయెడల శాస్త్రపరిజ్ఞానము హెచ్చగును. ...

14, 16 శతాబ్దులందు ఇంగ్లాండులో లాటిన్ భాష మూలకముగా విద్య నేర్పఁబడుచుండెను. అందువలన విద్య అదృష్టవంతు లగు కొందఱి యధీనములోనే యుండి జనబాహుళ్యమున కరుదుగా నుండెను. అది పోయి మాతృభాషయందే విద్యాభ్యాసము గావింప మొదల్వెట్టిన తరువాత ఎందరు విద్యాధికు లా దేశమున ప్రసిద్ధికి వచ్చిరో యెల్లరకును తెలియును. ఈ యంశమే దేశభాషామూలకవిద్యాభ్యాసమునకు మనల నందఱను హెచ్చరింపవలెను.

ఇఁక నిట్టి విద్యాపద్ధతిని నెలకొల్పు విధానమును గూర్చి యాలోచింపవలయును. ఎలిమెంటరీ పాఠశాలలం దన్యభాష నేర్పవలసిన యక్కఱ గాన్పింపదు. నేర్పినను కొంచెము చాలును. తరువాత, స్కూళ్ళు ఫయినలు తరగతివఱకును భాషావిషయములు గాక మిగిలిన భాగముల నన్నిటిని దేశభాషలందే చెప్పవలెను. ఇందువలన బాలుర జ్ఞానము వృద్ధి యగును. సర్ రవీంద్రనాథ ఠాకూరు గారు చెప్పినట్లు ఈ పద్ధతి నవలంబించినయెడల శాస్త్రముల నభ్యసించుట సులభమగును. కనుక, అన్యభాష యగు నింగ్లీషును నేర్చుకొనుటకు విద్యార్థికిఁ గావలసినంత తీరిక యుండును. మఱియు రెండు లాభములు కలుగును. శాస్త్రపరిజ్ఞానమును అన్యభాషాజ్ఞానమును వృద్ధి యగును. ఈ కాలమందు బి. ఏ.లకు సయితము మాతృభాషయం దభిరుచి తక్కువ. ఇంగ్లీషు భాషయందైనను మాటాడఁగలరు గాని మాతృభాషయందు మాట్లాడుట కష్ట మని యందురు. ఈ నూతనపద్ధతియం దిట్టి యసందర్భము లుండవు. అనేకవిద్యాధికు లీ సూత్రము నంగీకరించియే యున్నారు గావున సమగ్రచర్చ యనావశ్యకము.

కళాశాలలయం దీ సూత్ర మంగీకరింపవలయునా లేదా యను నంశ మింకను నిర్వివాదాంశము కాలేదు. కొందఱు దీని నంగీకరింపవలయు ననిరి. కొందఱు వల దనిరి. మఱికొందఱు ఇంటర్మీడియేటు తరగతి కీ విధాన మవలంబించి బి. ఏ. తరగతిలో మాత్రము ప్రస్తుతపద్ధతియే యుంచవలయు ననిరి. వల దనుటకు కారణ మొక్కటి గల దని చెప్పుచున్నారు. అది యేమన, వివిధశాస్త్రములను గూర్చి బి. ఏ. తరగతికి తగు గ్రంథములు ఇంగ్లీషున నున్న వనియు హిందూ దేశభాషలందు లే వనియు. వలయు పుస్తకములను కొన్నిటిని వ్రాయింపవచ్చు ననియు అట్లు వ్రాయ శక్తి గలవా రనేకులు గల రనియు అందునకు సమాధానము. సరే కాని, కొన్ని పుస్తకములవలన శాస్త్రజ్ఞానాభివృద్ధి కానేరదు. కాఁబట్టి యట్టి బి. ఏ. లిప్పటివారల కన్న మిన్నలు గాకుందు రని ప్రత్యుత్తరము. ఇచ్చట తెలుపవలయు విషయ మొక్కటి గలదు. ఈ విధాన మంగీకరింపఁబడఁగనే యూనివర్సిటీ యధికారులు కొంత ద్రవ్యము వెచ్చించి తగువారలను ప్రోత్సాహపఱచి గొప్ప పుస్తకములను కొన్నింటిని వ్రాయింపవలయును. ఇందువలన విశేషధనవ్యయము గాకున్నను దేశభాషల కమూల్యమగు శాస్త్రములును విద్యార్థులకు విశేషలాభమును కలుగును. ఇట్టి గ్రంథములను వ్రాయించి ప్రచురించుటకు కొంత కాలము పట్టు ననియు అంతవఱ కీ యేర్పాటు గావింపక యూరకుండరా దనియు ఏర్పాటు గావించినయెడల గ్రంథములు చాల వనియు చెప్పువారును కలరు. వారికి సమాధాన మే మనఁగా, ఇప్పుడు కావలసిన గ్రంథము లన్నియు లేనియెడల విద్యార్థు లన్యభాషాపుస్తకములను కూడ పఠించుచుందురు. పరీక్షలందు మాత్రము ప్రశ్నోత్తరములు మాతృభాషయందే వ్రాయఁబడును. ఈ పద్ధతి యన్యదేశీయులందును గలదు. జపాను దేశమునందు స్వభాష గాక జర్మనీ భాషయో ఇంగ్లీషు భాషయో విద్యార్థి విధిగా నేర్చుకొనవలెను. కాని, ప్రశ్నలలో కొన్నిటికి మాతృభాషయందు ప్రత్యుత్తరము వ్రాయవచ్చును. కనుక గొప్ప పుస్తకములు దేశభాషలలో లేనందున వానియందు పరీక్షలు జరుపఁగూడ దనుట సమంజసము గాదు. ఇఁక తత్క్షణము కళాశాలలందును మాతృభాషలోనే విద్య గఱపవచ్చును. ప్రకృతిశాస్త్రము (ఫిజిక్సు) రసాయనశాస్త్రము (కెమిస్ట్రీ) మొదలగు శాస్త్రములు తెనుఁగున విజ్ఞానచంద్రికామండలివా రిదివఱకే ప్రచురించియున్నారు. సులభముగను అత్యద్భుతముగను అర్థశాస్త్రము కట్టమంచి రామలింగారెడ్డి గారు వ్రాసియున్నారు. విజ్ఞానసర్వస్వమును విశేషముగా ధనవ్యయము చేసి కే. వి. లక్ష్మణరావు గారు ప్రచురించుచున్నారు. ఆంగ్లేయవిమర్శనపద్ధతుల ననుసరించి మద్దాల గున్నయ్య శాస్త్రి గారు మొదలగువార లెందఱో నాటకములను నవలలను [illegible]చున్నారు. ప్రపంచచరిత్రమును గాడిచెర్ల హరిసర్వో[illegible] గారు ప్రచురించుచున్నారు. ఇట్లు శాస్త్రచరిత్రసం[illegible] పుస్తకము లిదివఱకే ప్రచురింపఁబడియున్నందు[illegible] మున్నాఁడను వ్రాసియు వ్రాయించియు పారకమండలి కర్త్యం[illegible] గలుగునేఁడు వింపవచ్చును. నూతనవిద్యాపద్ధతిని నెలకొల్పవచ్చు[illegible]

ఇందునకు మఱికొన్ని యాటంకములు [illegible] ప్రథమచర[illegible] పద్యమాలికకి కొందఱు వచించియున్నారు. వానిని కొంచెము [illegible] ఏ మాత్రము నభివృద్ధి కాని భాషలు (పంజాబీ సింధి) వెరి[illegible] కొన్ని గల వనియు అందువలన ఆ భాషలలో కళాశాలా[illegible] యిప్పు డసాధ్య మనియు నొక వాదము. దీనికి ప్రత్యుత్తరము[illegible]కే కొంత చెప్పఁబడినది. ఆ భాషలు మాటలాడువారు కొ[illegible] గలరు. కనుక, ఇతరభాషలు మాటలాడువా రనేకులు గూడ నపద్ధతులవలని లాభమును పొందఁగూడ దనుట కేవల మన్యాయం. ఇంకొక యాతంకము గలదు. భాషలను బట్టి సర్వకళాశాలల(యూనివర్సిటీలను) స్థాపించినయెడల, ఒక యూనివర్సిటీ విద్యార్థు లిప్పటి యట్లు వేఱొక యూనివర్సిటీకి పోఁజాలరు. ఇప్పుడు మదరాసు విద్యాలయమున కడతేఱలేనివారు కలకత్తా అలహాబాద్ మొదలగు విద్యాలయములకు పోయి, అచ్చట గొప్ప పరీక్షలం దారి వచ్చుచున్నారు. అది యిటుపైని అసాధ్య మని కొందఱు చెప్పెదరు. ఇది కొంతవఱ కసాధ్యమే. కాని, మదరాసు యూనివర్సిటీ విద్యార్థు లే లెరచోటులకు పోవుచున్నారు? ఇచ్చట ఇంగ్లీషుభాషా[illegible] కృతార్థు లగుటలోఁ గల కష్టమువలన వా రచటికి పోవుచున్నారు. ఈ యింగ్లీషు భాష లేక శాస్త్రపఠన మంతయు మాతృభాషయందే కావించునప్పుడు వీ రేల మఱొకచోటికి పోదురు? ఇచ్చట సులభముగ విద్య నేర్చుకొను మార్గ మున్నప్పుడు వీరి కచ్చటికి పో నవసర

# G. Cunniah Chetty & Son.,

(ESTABLISHED 1881.)

## Millinery, Silk, Woollen, Linen and Fancy Cotton Piece-Goods.

**STOCK**

Tweeds
Flannels
Silk Lustre
Alpacas
Cashmeres
Mohairs
Venetians
Serges
Hollands
Drills
Twills
Long Cloths
Mulls
Towels
& etc.



Mr G. CUNNIAH CHETTY.

**STOCK**

Collars
Ties & Bows
Woollen
and
Cotton
Socks &
Stockings
Flannel
Long Cloth
Twill &
Khaki Shirts
Felt Caps
Banians
Silk Sashes
& etc.

**All goods are imported fortnightly direct from English-Manufacturers**

Our Motto
Small Profits and
Quick Returns.

Terms Cash
Prices Moderate

Compare Prices
before you
buy elsewhere.

We have every requirement of clothing for Ladies, Gents and children

**SPECIALITY**

**Swadeshi Piece-Goods**

## A trial order is solicited



## 2, Rattan Bazaar Street, Madras.

# WHERE TO GET SELLING-POWER?

¶ I do not believe that there's a BUSINESS on the earth, which can't be told more in ADVERTISING—in various ways, no matter whatever its technical sense may be.

¶ I believe that each and every business has a story — worth the telling in its inspiring capacity to create successful sales at all times.

¶ I do not believe in cheap Advertising ; because I believe the best is always the cheapest. Here, I do not mean that he who does business should spend more for Advertising than a certain sum.

¶ What I mean is...it may be a big or small sum, as per limited capacity of business but that should be spent for efficiency...to grasp the attention of the reader...embracing the particular Advertising Service by means of illustrations, powerful copying service, etc., etc., to make the business both to "Speak and Sell".

¶ Dumb, blind or deaf Advertising is good to nobody, neither to him who pays nor to him who receives payment and it's mere waste of finance, in the long run spoiling the reputation too.

¶ I am a great believer in Advertising...still to double or triple the present business by systematic propositions.

¶ If you, for any reason, doubt, let me explain to you.

## At Kalappan's Advertising House

**123, Audiappa Naick Street, Madras.**



TELEPHONE, No. 160.

# లోకప్రసిద్ధమైన సాలామిసిరి మురబ్బా

1,000 రూపాయలు బహుమానము ఇయ్యబడును.

మీరు బలహీనులుగా నున్నారా? అంటే డి. పన్నాలాల్ గారిచే తయారుచేయబడిన లోకప్రసిద్ధమైన సాలామిసిరిమురబ్బాను సేవించండి. దీనిని సేవించిన యెడల ధాతుపుష్టి, రక్తపుష్టి, విశేషబలము, ఆకలి ఎక్కువ మొదలయినవి కలుగును. స్వప్న స్ఖలితము, ధాతువు మూత్రముతో కలిసిపోవుట, నీరు మురుకు, బహుమూత్రవ్యాధి మొదలగునవి పోవును. దీనికొరకు పంపించుచుండెడి ఆసేతు రంగూన్, పినాంగ్, సిలోన్, ఆఫ్రికా, కలకత్తా, బొంబాయి, మదరాస్, ఈ ప్రాంతములనుండి బహుమాన పత్రికలు విశేషముగా పంపియున్నారు. కావలసినవారు అర్ధణా స్టాంపును పంపినచో బహుమాన పత్రికల కాపి పంపుదుము. ఇది అబద్ధమని రుజువుపరచు వారికి పైన కనుపరచియుండు బహుమానము ఇయ్యబడును. అట్లు నిరాకరించినచో కోర్టు మూలముగా పొందవచ్చును. పార్సెలును కొనునప్పుడు "డి. పన్నాలాల్" అని యుండుట చూచి తీసికొనవలయును. అనుపాన పత్రిక పార్సెలుతో పంపబడును.




ఏజెంటులు కావలసియున్నది.

15 తులాలు డబ్బీ వెల రూ. 2-0-0

తపాలుఖర్చు 1 3 డబ్బాలకు 6 అణాలు.

**డి. పన్నాలాల్, ఢిల్లీవైద్యులు,**

(26) సాలామిసిరి మురబ్బా డిపో,

బెంగుళూరు సిటి.

# మరువవద్దు







## కె. ఎస్. శివ్‌జీ గారికి వ్రాస్తే

వంటకు కాచుకొనుటకు తగిన స్టౌలు, క్యాబేజి దీపములు, గంటలు, హార్మోనియములు, (గోల్డుమెడల్ పొందినది), పంచములు, (ఇప్పటి మోస్తరువి) అన్ని రకముల కిరసనాయిలు, పెట్రోలు, గ్యాసుదీపములు, ప్రసిద్ధికెక్కిన "వండర్" గ్యాసుదీపములు, వాటి సామానులు, ప్రశస్తమయినవి దొరకును. వర్తకులకు ప్రత్యేకధరలు యివ్వబడును. క్యాటలాగును కోరినచో పంపుదుము.

(6)

**K. S. SHIVJEE.**
**Broadway, MADRAS.**

నెఱిఁగినవారితో చాల కాలము ముచ్చటించి కొన్ని యంశములను గ్రహింపవచ్చును. ఆ మనుజునిఁ గూర్చి వ్రాసిన వ్రాఁతలను చదువవచ్చును. అయినను, మనము నిజముగా మనుజుని శీలమును పూర్తిగా గ్రహింపకపోయుండవచ్చును. మాఱు బేగపు వర్ణన యెంత దైనను సాంగత్యమువలన కలుగునట్టి యభిప్రాయము నీయఁజాలదు. ఆ మనుజునితో నఱుగంట పరిచయము మనము కలుగఁజేసికొనినఁ గాని అతని వర్తనము నొక వారము పరిశీలించినఁగాని యింతకంటె సరియగు నభిప్రాయమును పొందఁజాలము. కావున, పాత్రపోషణము చేయుటకు గ్రంథకారుఁడు తన పాత్రలను మాటలాడించుచుండవలెను. వారి ప్రవర్తనను చూపుచుండవలెను. నాటకమునకును నవలకును భేదము నవలయందు కథ చెప్పఁబడుటయు నాటకమునం దది చూపఁబడుటయు నై యుండినను, ఈ విషయమున నవల నాటకము నెంత యనుసరించునో యంత ప్రాశస్త్యమును గాంచును. కథాభాగమును చెప్పుటవలన పాత్రపోషణమునకు వీ లుండదు.

కథయందలి యంశము లొకదానితో నింకొకటి యతిసన్నిహిత మైన సంబంధమును పొందియుండవలయును. కథ యంత్రమువలె నుండవలెను. యంత్రమునందలి భాగములలో చిన్నదాని నైనను తొలఁగించినయెడల యంత్ర మంతయు వ్యర్థమై నడువనియట్లే, కథాంశములలో నొకదాని నైనను తొలఁగించినయెడల కథ యంతయు [illegible] యుండునో, అట్లే కథాంశములు నుండవలయును. అతుకులు గలబట్ట గుడ్డపేటి యని యెట్లు చెప్పుటకు వీలు లేదో అట్లే కథాంశములు బాగుగా అతుకుకొనియుండనియెడల కథయం దైక్యము లేదని చెప్పవలసివచ్చును.

వర్ణనము రెండు విధములు : పాత్రవర్ణనము, స్థలాదివర్ణనము. పాత్రవర్ణనము మంచిది గా దని చెప్పియుంటిమి. కాని, స్థలాదివర్ణనము నవలయం దతిముఖ్యము. 'ఆది' యనుటచే ఆచారములను దేశకాలస్థితులను గ్రహించునది. ప్రకృతివర్ణనములు నవల కొక యందము నీయఁగలిగినను, కథాసందర్భమును బట్టి యుండవలయునే కాని గ్రంథకారుని వర్ణనాశక్తిని చూపుటకై మాత్ర ముండరాదు. నాటకప్రదర్శనమునకు తెగ లెంత యావశ్యకమో, స్థలాది వర్ణనము నవల కంత యావశ్యక మని యెంచవలయును.

నవలయందు ముఖ్యవిశేషము లయిదు కలవు. సాంఘికనవల, కల్పితచిత్రకథ (The Romantic Novel), చరిత్రాత్మక మైన నవల, ప్రయోజికనవల (The Novel of Purpose), సమస్యానవల (The Novel of Problem).

ఈ యైదు విశేషములను గూర్చి ముచ్చటించుట యావశ్యకమైనను, వ్యాసము విపులముగా నుండరా దని పత్రికాధిపతుల యాజ్ఞ యగుటచే చరిత్రాత్మకనవలను గూర్చి మాత్రము కొంత చెప్పుచున్నాము. మనవారలు చాలమంది చరిత్రాత్మకనవలను వ్రాయుట బహుసులభ మని యెంచుచున్నారు. కాని, ఇది దురభిప్రాయము. నవల రీతు లన్నిటిలో చరిత్రాత్మకనవలయే బహుకష్ట మైనది. ఆంగ్లభాషయం దింతవఱకును కొన్ని లక్షల నవలలు వెలువడియుండినను, నిజ మగు చరిత్రాత్మకనవల లే డెనిమిదికంటె నెక్కువ లేవు. కాని, మన యాంధ్రభాషయందు ఇప్పటికి కొన్ని వందల నవలలు మాత్రమే వెలువడియుండినను, సుమారు డెబ్బది యెనుబది చరిత్రాత్మకనవలలు కలవు. మన మెంత పుణ్యాత్ములము. ఆంగ్లగ్రంథకర్తల తరము గాని పని మన యాంధ్రగ్రంథకర్త లవలీలగ చేసిరి, చేయుచున్నారు!

చరిత్రయందలి యంశములను నవలయందు చేర్చినంత మాత్రమున నవల చరిత్రాత్మకనవల యగు నని మన గ్రంథకారులు తలఁచుచున్నట్టు తోఁచెడిని. ఆర్యులారా, గ్రంథకర్తలారా, నన్ను మన్నింపుఁడు. ఇది దురభిప్రాయము. నిజ మగు చరిత్రాత్మకనవలయందు చరిత్రాంశము లతిస్వల్పములుగా నుండును. అట్టి యంశము లేనియెడలనే చరిత్రాత్మకనవల యగును. పరాసు గ్రంథకారుఁ డైన అలెగ్జాండరు డుమా గారి చరిత్రాత్మకనవలలయందు చరిత్రమే లేదు. స్కాట్టుగారి నవలలయందు చరిత్రము లే దనియే చెప్పవచ్చును. ఇట్టియన నవల చరిత్రాత్మకనవలలెట్లగు నని మీ రడుగవచ్చును. చరిత్రాంశములనే గాని, అప్పటి యాచారవ్యవహారములను తెలిసికొనుటకు చరిత్ర లంతగా నుపయోగింపవు. అనుగుణము లగు దేశకాలపాత్రవర్ణనములే యుపయోగించును. ఈ సంగతులను ప్రోఁగుచేసి నవలయం దిమిడ్చిన అది చరిత్రాత్మకనవల యగుచున్నది. అందుచే ఆ కాలమును మనము సూక్ష్మదృష్టితో చూడఁగలుగుదుము. ఇం తేల, చరిత్రాత్మకనవల యనునది యాత్మవిరుద్ధ మైన మాట. చరిత్ర నిజమును కోరును. నవల కల్పితము. ఈ రెండింటికిని సంబంధ మెట్టిది? ఇట్టి సంబంధమును కలుగఁజేయుట కష్ట మని గ్రహించినవా రగుటచేతనే ఆంగ్లగ్రంథకర్తలు నవలలను వ్రాయుచుండినను చాల కాలము చరిత్రాత్మకనవలలను వ్రాయఁబూనుకొనలేదు. ఆంగ్లభాషయందు మొట్టమొదట నవల వెలువడిన 68 సంవత్సరములవఱకును చరిత్రాత్మకనవలయే లేదు. మన యాంధ్రభాషయందు చరిత్రాత్మకనవలను వ్రాయుట యింతకంటెను కష్టము. కారణము : మన దేశస్థితులను ఆచారములను సూక్ష్మముగా వర్ణించు గ్రంథము లతిస్వల్పములు. లే వనినను తప్పు గాదు.

# ద్రవిడ భాషలు.

కట్టా వేంకటరావు గారు, ఎమ్. ఏ., ఎల్. టి.

ద్రావిడులు ఆర్యులకు పూర్వము హిందూస్థానమం దుండెడి వారు. వీరు ఈ దేశమున కనాదివాసులో లేక యార్యుల వలెనే యితరదేశములనుండి వచ్చిరో నిర్ధారణ చేయుట కాధారములు సరిగా లేవు. భాషాసంబంధములను బట్టి చూడఁగా ద్రావిడులు ఉత్తరహిందూస్థానమందు కొంత కాలము, అనఁగా ఆర్యులు రాక పూర్వము, నివసించి తరువాత ఏ కారణములచేతనో దక్షిణమునకు వచ్చినట్లు కనఁబడుచున్నది. ప్రస్తుతము ద్రావిడులు ముఖ్యముగా దక్షిణహిందూస్థానమునందు నివసించియున్నారు. వీరు వాడుక చేయు భాషలే ద్రవిడభాషలు. ఉత్తరమున కొంత దేశములో ఒరియా, పశ్చిమమున కొన్ని దేశములలో గుజరాతి మహారాష్ట్ర భాషలు తప్ప, మిగిలిన దక్షిణహిందూస్థానమం దంతటను వింధ్యము మొదలు కన్యాకుమారివఱకుఁ గల దేశములో ఒకే భాషా భేదములు వాడుకలో నున్నవి. ఈ భాషల కన్నిటికిని మాతృక యొక్కటే. ఈ భాషాభేదములయొక్క కొసకొసలు బంగాళమునం దున్న రాజమహాలు కనుమలలోను బెలూచిస్థానములోను కూడ కన్పట్టుచున్నను దక్షిణహిందూస్థానమే వీనికి ముఖ్యమైన యునికి పట్టు. ఉత్తరసింహళమునందు కూడ ఈ భాషయే వాడుకలో నున్నది.

ఈ భాషల సమూహమును ద్రవిడభాష లని వ్యవహరించు చుందురు. చిరకాలము క్రిందట దీనినే కుమారిలభట్టు 'ఆంధ్రద్రవిడ భాష' యని వాడెను. ఇందు సమూహములో నున్న రెండుభాషలకు మాత్రమే ప్రాముఖ్య మీయఁబడెను. పాశ్చాత్యులు దీనినే 'తమూలి యను' భాష యని వాడిరి. కాని, ఇది భాషాసమూహములో ఒక్క భాష పేరగుటచే దీనిని ఆ భాషకు నామముగా నియమించి సమూహమునకు అనుకూలమైన యింకొక పేరును వాడుకిలోనికి తెచ్చిరి. సంస్కృతవైయాకరణులు ఈ భాషలను ద్రవిడభాష లనియే వ్యవహరించిరి. దీనిని సంకేతనామముగా గ్రహించినను నష్టము లేదు. 'తామిళ్' 'దమిళ' 'ద్రమిళ' మొదలైన రూపములనుండి యుత్పన్నమై ఆర్యులచేత 'ద్రవిడ' మని వాడుక చేయఁబడినట్లు కనఁబడుచున్నది. ఇట్టి యుత్పత్తికి రెండు భాషలందును తగిన సాంప్రదాయము కలదు. సార్థకముగాఁ గాని సాంకేతికముగాఁ గాని యిదియే యీ భాషాసమూహమున కనుకూలనామ మని శాస్త్రజ్ఞులచే స్థిరపఱుపఁబడినది.

ద్రవిడభాషాసమూహమునకు చేరిన ముఖ్యమైన భాషలు పండ్రెండు. ఇవి యన్నియు ఒక్క మాతృభాషనుండియే దేశకాల భేదముల ననుసరించి మాఱిమాఱి వివిధభాషలుగా పరిణమించి ఆయా దేశభాగములందు వాడుకలో నున్నవి. ఈ పండ్రెండు భాషలలో ఆఱు నాగరికభాషలు ఆఱు అనాగరికభాషలు గలవు.

## నాగరికభాషలు

(1) తామిళ్ (2) మళయాళము (3) తెలుఁగు (4) కన్నడము (5) తుళు (6) కొడగు.

## అనాగరికభాషలు

(1) తుడ (2) కోట (3) గాండు (4) ఖాండు (5) ఓరాన్ (6) రాజమహల్.

అనాగరికభాషలకు సాహిత్యసంపద లేదు. అవి ఆయా స్థానములలో వాడుక చేయఁబడుచున్నవి. తుళు కొడగు కూడ నిట్టివే. మిగిలిన నాలుగును, అనఁగా తామిళ్ మళయాళము కన్నడము తెలుఁగు ద్రవిడభాషలలో ముఖ్యమైనవి. వీనికి గ్రంథసంపత్తి మెండు. విపులముగా పెంచఁబడి వాడుక చేయఁబడుచున్నవి. ఈ భాషలను వాడుకచేయు జనసంఖ్యను బట్టియు దేశవిస్తీర్ణతను బట్టియు ఇవియే ముఖ్యమైనవి. ఇందులో ఆదిద్రవిడభాషా లక్షణములను సరిగా నిలిపియుంచినది తామికభాష. అయినను, తమ్మిళమే ఆదిద్రవిడ భాష దానినుండియే మిగిలిన భాష లుత్పన్నమైన వనుట సరి కాదు. ఏల యన, తమ్మిళములో కనఁబడని కొన్ని లక్షణములు ఇతరభాషలలో కానవచ్చుచున్నవి. అందుచేత తమ్మిళము కూడ ఆదిద్రవిడభాషనుండి యుత్పన్నమైన యుపభాషలలో నొకటి. కాని, మాతృభాష కాదు. అన్నిటికన్న నిదియే ముఖ్యమైనది. ఇదియే ఆ తల్లికి పెద్ద పిల్ల. మళయాళము దీనికి దగ్గఱ సోదరిమణి. ఇరుగు పొరుగున నుండుటచేతను వ్యవహారములో కలసి మెలసి యుండుటచేతను లక్షణసాదృశ్యము వీనికి మిక్కిలి యెక్కువ. వేఱువేఱు భాష లవునా కాదా యని భ్రమింపఁ జేయుచుండును. ప్రత్యేకముగా వృద్ధి పొందింపఁబడిన గ్రంథసంపద లేనిచో ఇవి వేఱువేఱు భాషలా యనునది సంశయాస్పదమే. మళయాళముకన్న నెక్కువ భేద మున్న దయినను కన్నడము కూడ తమ్మిళమునకు దగ్గఱ భాషయే. లక్షణసాదృశ్యము స్పష్టముగా కనఁబడును. కాని, యెక్కువ విషయములలో భేదము కూడ కనఁబడు చుండును. అట్టి విషయములలో నాలవ భాషయు కనిష్ఠ సోదరియు నగు తెలుఁగుతో పోలికను సూచించుచున్నది. తెలుఁగు కూడ అది

ద్రవిడభాషయం దుత్పన్నమై యీ భాషాసమూహమున చేరినదే. కాని, యీసంబంధమును మాపటికు బాగుగ పరిశీలించినం గాని తెలియదు. తెలుఁగు మాతృభాషనుండియు మిగిలిన సోదరీభాషల నుండియు కూడ బాగుగా వేఱుపడినది. సాటిలేని వ్యాకరణాది జాతీయములలోనే కాక వాడుకలో నున్న పదములలో కూడ చాల భేదము కలిగినది. అందుచేతనే చూడఁగనే పోడగట్టు సాదృశ్య మేమియు లేనట్టు కనఁబడును. భాషాభిమానులు అనేకసాంఘిక రాజకీయదురభిమానములచేత ఈ సంపర్కమునే యంగీకరింపరు. ఈ చిక్కు పూర్వులకు కూడ నున్నట్టున్నది. ఏల యిన, కుమారలభట్టు (9-వ శతాబ్ది) ఈ భాషాసమూహమును ఆంధ్రద్రవిడ భాష యని వర్ణించినాఁడు. అనఁగా ఆంధ్రులు వాడుక చేయు భాషను ద్రవిడ భాష నుండి వేఱుగా సూచించినాఁడు. స్పష్టమైన పోలిక కనఁబడని మాట నిశ్చయమే. అయినను, సంబంధ ముండుట కూడ నిశ్చయము. భాషాసంబంధపరిశీలనవిషయమున బాగుగా నెఱిఁగిన శాస్త్రజ్ఞులచే తెలుఁగు కూడ ద్రవిడభాషలలో నొకటియే యనియు తక్కిన భాషలతో సంబంధ మున్నదనియు నిర్ణయింపఁబడినది. ఈ భాషలకు వంశవృక్ష మీ తీరున వ్రాయవచ్చును.

ఆదిద్రవిడము

తమిళము
మలయాళము
తుళు
కొడగు
తోడ
కోట
కన్నడము
కురుఖు
మాలోటో
గోండి
కుయి
కోలము
తెలుఁగు
బ్రాహుయి

ఈ భాషల కున్న పరస్పరసంబంధము పైని సూచించిన రీతిగా నుండును. ఇందు ముఖ్యమైన నాలుగు నాగరికభాషలకును గల సంబంధము పైని వ్రాసినది చూచిన గోచర మగును. ఒకే భాష నుండి యుత్పన్నమైన యుపభాషలే యైనను దేశకాలానుసారము వాడుకలో మార్పులు కలిగి వేఱువేఱు భాషల క్రింద పరిణమించినవి. ప్రస్తుత మొక భాషను వాడుక చేయువారి కింకొక భాష తెలియదు. ప్రతిభాషకును ప్రత్యేకముగా గ్రంథసంపదయు లిపియు కలవు.

పండితులచేతను వారి ననుసరించిన పాఠకులచేతను చాల కాలమువఱకు ఈ త్రిగహింగుస్థానభాషలకాలె దక్షిణమున వాడుకలో నుండు ద్రవిడభాషలును సంస్కృతమునుండి యుత్పన్నమైన వని నమ్మఁబడియుండెను. ఆయా భాషలలో వాడుక చేయఁబడుచున్న సంస్కృతపదములను తద్భవములను తత్సమములను బట్టి ఆ భాషలను సంస్కృతభాషావికారములుగా ఆలోచించిరి. భాషలలో సంస్కృతేతరపదరూపములు విశేషముగా నున్నను, దానిని భాషకు ముఖ్యాంగముగా భావింపక యేదో యన్యభాషాసంపర్కముచే కలిగిన సాంకర్యముగా భావించిరి. కాని, ఇది కేవలము తప్పభిప్రాయము. ఇటీవల భాషాసంబంధపరిశీలనతత్త్వమును బాగుగా నెఱిఁగిన శాస్త్రజ్ఞులు. రెండు భాషలయొక్కయు పదరూపజాతీయసాంప్రదాయములను బాగుగా పరిశీలించి యిది కేవలము తప్పభిప్రాయ మని నిరూపించిరి. ఈ ద్రవిడభాషలలో సంస్కృతముకన్న సంస్కృతేతరమే మిక్కిలి యెక్కువ. భాషకు జీవమువలె నుండు ముఖ్యమైన సర్వనామములు సంఖ్యాపదములు క్రియానామవాచకప్రత్యయములు వాక్యరచనలోని పదసరణి మొదలయినవానిని బట్టి చూడ, ద్రవిడభాషలకును సంస్కృతమునకును సంబంధ మేమియు లేదు. కొన్ని పదములు మాత్రము రెండు భాషలలోను వాడుకయం దున్నను, ద్రవిడభాషలలో నవి సంస్కృత పదములుగను తద్భవములుగను తత్సమములుగను వాడుక చేయఁబడుచున్నవి. ఇంతే కాక, అనుదినవ్యవహారములలో వాడుక చేయఁబడెడి తండ్రి తల్లి కొడుకు కూఁతురు తల కన్ను చెవి నోరు మొదలయిన మూలపదములలో నెన్ని పరీక్షించినను సంబంధము కానరాదు. అట్టి సంబంధ మున్నచో తెలుపుట కివియే ముఖ్యసాధనములు. మరియు, ద్రవిడభాషాసమూహములో చేరిన

The Queen of Remedies for all kinds of Gastric Complaints
**OMUM-CARPOOR**




The King of Fever Remedies
**JVARA-HARI**

# OMUM-CARPOOR

## IS AN EFFECTUAL REMEDY FOR CHOLERA, DIARRHOEA, FLATULENT COLIC, SPASMS, INDIGESTION, Etc.

**No School or House should be without this splendid Remedy.**

**Henry Saltau,**

Medical Missionary, Burma, writes :—" I value ' OMUM-CARPOOR ' very highly, and would advise every Missionary to take a supply with him for all bowel troubles. One case comes to my mind of a person who had been brought very low with DIARRHŒA of Dysenteric character and was in a state of collapse. Two doses almost cured the DIARRHŒA and restored the warmth to the body."

**E. Trutwein,**

Medical Practitioner, writes :—" I have much pleasure in testifying to the wonderful efficacy of ' OMUM-CARPOOR.' It has been tried by me repeatedly in cases of DIARRHŒA, COLIC accompanied with FLATULENCE and other SPASMODIC AFFECTIONS, and I have always found it infallible. No family should be without a bottle or two of this specific."

**C. B. Ingham,**

Moira College (for Ladies), Bournemouth, writes :—" The ' OMUM-CARPOOR ' we find very excellent for INDIGESTION."

**Rev. T. F. Nicholson,**

Wesleyan Missionary Society, writes :—' I have much pleasure in bearing testimony to the efficacy of your 'OMUM-CARPOOR' in case of CHOLERA. In 1884, CHOLERA was raging in my station, Mannargudi, South India, and in the outlying villages. One day, two men, one of whom was a policeman, came up to my house in great distress asking for medicine. I gave them a fair sized bottle of your ' OMUM CARPOOR ' with instructions how to use it. Within a fortnight, they returned to thank me and tell me that SEVEN CHILDREN AND THREE WOMEN had been SAVED thereby, and I had every reason to believe their testimony."

**C. S. Srinivasa,**

Chairman, Municipal Council, Cuddalore, writes :— I have much pleasure in stating that your ' OMUM CARPOOR ' was found very useful for CHOLERA if taken in the early stage."

TRADE MARK

*See that this* Omum-Carpoor TRADE MARK *is on every package*

**To be obtained of all Chemists and Dealers**

**Price: Annas 8, Re. 1, 1-8 & Rs. 2-12 per bottle according to size;**
**Also in large size (20 oz.) for Planters and Employers of Labour at Rs. 11 per bottle.**

# HENRY'S GREAT INDIAN REMEDIES CO.

15 ARMENIAN STREET
**MADRAS**

*Telegrams:—*
"WAREHOUSE, MADRAS"

Methodist Publishing House Madras—1918

The King of Fever Remedies JVARA-HARI



# Henry's Great Indian Remedies Company

15 Armenian Street Madras



The Queen of Remedies for all kinds of Gastric Complaints OMUM-CARPOOR

# JVARA-HARI

OR

# FEVER DESTROYER

Is easily administered and possesses the all-important advantage over other febrifuges, that **it may be administered when fever is on,** and does not produce deafness or other unpleasant symptoms which frequently follow the use of Quinine In small doses **"Jvara-Hari"** has no equal as an appetiser and tonic when one is run down, while for dissipating colds, etc., its action is marvellous

---

A Customer in England writes:—

"I was very pleased to receive the bottle of 'JVARA-HARI' and shall be glad if you will send me another. I shall be glad to know if any arrangement has been made for a supply at the Army and Navy Stores."

The Secretary of one of the Foremost European Clubs in India writes:—

"It may interest you to know that I am never without 'JVARA-HARI' myself, and the number of people I have recommended it to must be enormous I have given away many bottles to people who have never heard of it and have been much benefited by taking a dose"

From a Medical Officer:—

"I have ordered 'JVARA-HARI' several bottles at different times for myself and for my friends who use them It proved very efficacious and was never found to be injurious I hope you will kindly send two bottles more to the above address."

A Planter in Yercaud writes:—

"Please send me three large size bottles (20 oz each) of JVARA-HARI.' I am glad to state that the coolies on my Estates take to 'JVARA-HARI' very kindly, because it is so effectual and speedy in its cure of malarious fevers."

**To be obtained of all Chemists and Dealers**

**Price: Annas 8, Re 1, 1-8, & Rs. 2-12 per bottle according to size**

Also in large size (20 oz.) for Planters and Employers of Labour at Rs. 11 per bottle.

---

# HENRY'S GREAT INDIAN REMEDIES CO.

15 ARMENIAN STREET

MADRAS

*Telegrams:*

"WAREHOUSE, MADRAS"

యనాగరికభాషలలో సంస్కృతసంపర్క మేమియు కానరాదు. ద్రవిడభాషలే సంస్కృతమునుండి పుట్టినయెడల ఇట్టిది యసంభవము. నాగరికభాషలలో కూడ సంస్కృతపదములను కేవలము నిరాకరించి వాడుక చేయఁబడు భాషలు కూడఁ గలవు. సంస్కృతము లేకుండిన తెనుఁగునకు ఇప్పుడు కొంత కష్టము గానుండును. కన్నడము మళయాళములకు అంతకన్న కష్టముగా నుండవచ్చును. కాని, ఈ సమూహములో ముఖ్య మైనది యైన తమ్మిళము సంస్కృతభాషను పూర్తిగా నిరాకరించి వృద్ధి పొందఁగలదు. తమ్మిళమునందు గ్రంథరచనలో సంస్కృతము వాడుట చాల తక్కువ. వారిలో గ్రంథరచనయందు సంస్కృత మెంత తక్కువగా వాడిన అంత యెక్కువ ప్రశస్తము. అదియే పాండిత్యముగా నెన్నఁబడును. సాధారణవ్యవహారములో కూడ సంస్కృతము నుపయోగింపకుండుటయే శ్రేష్ఠముగా గణింతురు. మనుష్యుల పేరులలో కూడ సంస్కృతనామములను భాషాంతరీకరించి వాడుదురు. షణ్ముఖుఁడు అనునది ఆఱుమొగ మని వ్రాయుదురు. దీనిని బట్టి చూడ ద్రవిడభాషలకు సంస్కృతము ప్రధానము కాదు. తక్కిన ద్రవిడభాషలందు సంస్కృతము కొంతకొంత యధికముగానే వాడుకలో నున్నది. కొన్నిటిలో సంస్కృతము ఆవశ్యకముగా కూడ తోఁచుచున్నది. దీనికి కారణము ఈ భాషలకు సంస్కృతముతో సహజమైన సంబంధ ముండుట గాదు; సంస్కృతమునం దాఱితేఱిన బ్రాహ్మణపండితులు గ్రంథరచనలోను భాషాభివృద్ధిలోను నెక్కువ శ్రద్ధ తీసికొనుటచే వచ్చిన యనర్థము. తమ్మిళములో నటు గాక సంస్కృతము రాని బ్రాహ్మణేతరులే గ్రంథరచనాసక్తు లగుటచే ఆ భాషయం దంతగా ఈ సాంకర్యము కానరాదు. ఇంకొక సంగతి. వ్యాకరణసాదృశ్య ముండినఁ గదా భాషల యన్యోన్యసంబంధము తేటపడును. ఈ రెండు భాషలకును అట్టి సాదృశ్య మేమియు లేదు. లింగభేదమును చూడుఁడు. ద్రవిడభాషలలో లింగభేదము సహజము, సార్థకము. సంస్కృతములో నట్లు కాదు. వృక్షము పుల్లింగము, కళత్రము నపుంసకలింగము. నామవాచకప్రత్యయములలో భేదము కలదు. ద్రవిడభాషలో ప్రత్యయములు అర్థ మున్న చిన్న మాటలు, రెండు వచనములకు నొక్కటే ప్రత్యయములు. సంస్కృతములో నట్లు కాదు. ఇంకను అనేకవ్యాకరణవిషయములలో భేదము కలదు. ఇవి యన్నియు బాగుగా నాలోచించి చూచి ద్రవిడభాషాసమూహమునకును సంస్కృతమునకును ఏమియు సహజమైన సంబంధము లేదని, సంస్కృతమునుండి యుత్పన్నము కాలేదని వేఱే చెప్ప నక్కఱ లేదు. ప్రత్యక్షముగా నున్న సంబంధము అన్యోన్యసంపర్కము నొందయిన వేఱు కారణములచేత కలిగినదే గాని సహజము కాదు. ఇతర సమూహములతో నున్న సంబంధమును గూర్చి చర్చించుటను గ్రంథవిస్తరభీతిచే మానెదను. కాని, సర్వసాధారణముగ పండితపామరులచే నమ్మఁబడుచున్న యంశము, అనఁగా ద్రవిడభాషలు అందు ముఖ్యముగా తెలుఁగు, సంస్కృతమునుండి పుట్టె ననునది కేవలము తప్పని గ్రహింపఁదగియున్నది.

ఇఁక ద్రవిడభాషలను గూర్చి కొంచెము ముచ్చటింతము. ద్రవిడభాష చాల పురాతన మయినది. సుమారు 3000 యేండ్ల క్రిందటినుండి వాడుకలో నున్నట్టు ప్రమాణములు కలవు. ఈ దేశముతో వర్తకము సాగించిన యన్యదేశముల భాషలలో ద్రవిడపదములు చిరకాలము క్రిందటనే వాడుకలో నున్నట్టు కానవచ్చుచున్నది. గ్రీకు భూగోళశాస్త్రజ్ఞులచే వాడుక చేయఁబడిన ద్రవిడనామము లనేకము లున్నవి. వీనిని బట్టి చూడ ద్రవిడభాషలు చాల కాలమునుండి వాడుకలో నున్న వనియు, ఆదిభాష సుమారు 2000 యేండ్ల క్రిందటనే యిప్పటి యుపభాషల క్రింద పరిణమించి యిప్పుడవి వాడుక చేయఁబడుచున్న యాయా దేశములందు వాడుకలో నుండిన దనియు కనఁబడుచున్నది. కొన్ని ముఖ్యభాషలలో వ్రాఁతకు లిపి భాషకు వ్యాకరణము గ్రంథరచనాచతురతయు అప్పటికే కలిగియున్నట్టు కనఁబడును. ఈ భాషలలో తమ్మిళము మిగుల ప్రాచీననాగరికత కలిగియున్నది. పురాతనగ్రంథములు సుమారు 2000 యేండ్ల క్రిందట రచింపఁబడినవి. భాషయొక్క పురాతనదశ దీనినుండియే విశద మగును. పదములు రూపములు గ్రంథరచన ప్రారంభించుటకు పూర్వము చాల కాలము వాడుకలో నుండియుండవలెను. మొదటి తమ్మిళగ్రంథములలో సంస్కృతము లేదనియే చెప్పవచ్చును. అనఁగా, భాష అన్యభాషాసహాయము నపేక్షింపక భావములను తెలుపుటకు పదసంపదయు సమర్థతయు కలిగియున్నది. ఇంకను అనేకవిధముల పరిశీలించి చూడ, తమ్మిళము బహుపురాతన భాష యని గోచర మగును. అట్టి విషయములో దాని మాతృభాష యగు నాదిద్రవిడభాష విషయమై వేఱే చెప్ప నక్కఱ లేదు. ఈ సమూహములోని మిగిలిన భాషలు కూడ అప్పటి కాలముననే తమ్మిళమునుండి వేఱుపడి అంత వృద్ధిలోనికి రాకపోయినను ఆయా దేశములలో వాడఁబడుచుండెడివి యని యూహింపవచ్చును.

ద్రవిడభాషలలో అందఱకును కనఁబడు విశేష మొకటి కలదు. గ్రంథములలో వాడుక చేయు భాషకును మాటలాడుటలో వాడుక చేయు భాషకును మిగుల వ్యత్యాసము కలదు. ఈ రెండింటికిని ఇంచుక వ్యత్యాస ముండుట అన్ని భాషలలోను సహజమే. గ్రంథస్థమైన భాష వాడుక భాషయంత మార్పును చెందక ఒక దశ వెనుకగా నుండును. అన్యోన్యసంబంధము స్పష్టముగా కనఁబడుచుండును. వాడుక భాషతో పాటు గ్రంథములలోని భాష కూడ అనుగుణముగా మాఱుచు దాని ననుసరించియే యుండును. అట్లుండుటచే గ్రంథములలో వ్రాసినది సర్వసాధారణముగా అవగాహన మగుచుండును. కాని, ద్రవిడభాషలలో నట్లు కాదు. వీనిలో గ్రంథరచన కుపయోగించు భాష వ్యవహారభాషనుండి మిగుల భిన్నమై రెండును వేఱు భాషలా యని భ్రమింపఁజేయుచుండును. బాగుగా చదువు లేక పాండిత్యము తక్కువైనవారికి గ్రంథము లవగాహములు కావు. మాటలాడు భాష మాఱరాని సహజకారణములకు లోనై సతతము మాఱుచుండును. గ్రంథములలో వాడుక చేయఁబడు భాషను తదనుగుణముగ మాఱనీయక ప్రాచీనమైన కట్టుఁ

# భీముని ప్రతిజ్ఞ

పోరసండి రామశాస్త్రి గారు

**ఆం**ధ్రమహాభారతము సభాపర్వము ద్వితీయాశ్వాసము నందు

ఉ. అమ్మదితవ్ విభీతహరిణాక్షిఁ గలాపవిలాసకేశభా
రమ్మున నొప్పుదానిఁ దన రమ్యపృథూరుతలంబు నెక్కఁగా
రమ్మని సన్న సేసి ధృతరాష్ట్రసుతాగ్రజుఁ డప్పు డాని దూ
రమ్మునఁ జూచి కౌరవపురంగమృగేంద్రుఁడు భీముఁ డల్కతోన్. [247

క. అమరసమయదండధరని
ర్గమమున్ దగ ధరణీశు లెల్లఁ దన పలుకులు వి
స్మయసంభ్రమసంభృతు లయి
భయమున విను చుండ నిట్లు పలికెను సభలోన్. 248

ఉ. ధారుణిరాజ్యసంపద మదంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరునిజోరుదేశమున నుండఁగఁ బిల్చిన యిద్దురాత్ము దు
ర్వారమదీయబాహుపరివర్తిత చండగదాభిఘాతభ
గ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్. 249

వ. అని సర్వజనభయానకక్రోధవివశుండై గదాయుధంబు లున్న వల
నికి దృష్టులు సలుపుచు నగ్రజు మొగంబు సూచుచున్న భీము
సేను నతిరౌద్రాకారంబు సూచి భీష్మవిదురద్రోణాదు లిది
కోపంబునకవసరంబు గా దని యాతనిం బ్రశాంతచిత్తుం జేయు
చున్నంత. 250

అని యున్నది. ఇందు భీముఁడు తన భార్యను దుర్యోధనుఁడు దన యూరువు నెక్కఁ రమ్మని సంజ్ఞ సేయఁ జూచి సహింపఁజాల కట్టి మహాపతివ్రతను దుష్టుఁడే యూరుదేశమున నెక్కఁగోరెనో యా యూరుభంగమే వానికిఁ దగిన ప్రాయశ్చిత్తమని తలంచి దుర్యోధనుని యుద్ధమందుఁ దన గదాహతిచే నట్లు సేసెద నని ప్రతిజ్ఞ సేసెను. ఉత్తమక్షత్రియుఁడును మహావీరుఁడు నగు తనకు శత్రువును నిష్కృతిచేఁ గాక యుద్ధమునఁ జంపుటయే యుచిత మని యెంచి యప్పుడే యుద్ధము సేయ తలంపుతో నాయుధముల వంకఁ జూచి యున్న యగు ధర్మరాజు ననుజ్ఞకొఱకు అతని ముఖంబును జూచెను. ఇట్లుండ నప్పుడు భీష్మ విదుర ద్రోణాదులు "ఇది కోపమునకు సమయము గా" దని పలికిరి కదా. లోకమంద దొక పురుషుఁడు సహింపరాని పరాభవము సభలోఁ దన భార్యకుఁ గలిగినప్పు డట్టి మానధనుఁడు నతివీరుఁడు నగు భీముఁ డెట్లు సహించియుండును? అది కోపమునకు సమయము గాదా? భీష్మాదుల యభిప్రాయ మేమి? ద్రౌపది ధర్మనిర్ణయమును గోరి తమ్మడిగి నప్పు డేమియుఁ జెప్పక యూరకుండినవా రిప్పు డీ భీమునితో నిట్లు చెప్పుటకుఁ గారణ మేమి? దుర్యోధనునందు పక్షపాతమా? పాండవులందు వంచనమా? అ దేమియును గాదు. దూరదృష్టి గల భీష్మాదు లప్పు డాతని నివారింపకున్నచో నప్పుడే వారికి యుద్ధము సిద్ధమగు నట్లు గలంచి యట్లు కాకుండఁగ వారించియుందురు. భీముఁ డాయుధముల వంకఁ జూడ నాతని తలం పట్టిదిగాఁ గానఁబడినందున యుద్ధ మైనప్పుడు వారిలో నెవ్వరికైనను హాని తప్పదు కావున, మహాయాంతర మున్నప్పుడు యుద్ధము దూష్య మగుటను నీతినిపుణులును సమపక్షపాతులును నగు భీష్మవిదురద్రోణాదు లలగి నివారించుట తప్పిదము గాదు. మొదటనే వారు "జూద మనర్థము వల"దని చెప్పినప్పుడు ధృతరాష్ట్రుఁడు "సుహృద్ద్యూత" మని చెప్పియుండుటచే సుహృద్ద్యూత మనర్థావహము గాదు కావున నిప్పు డా ధృతరాష్ట్రుఁడు దాను చెప్పినట్లె పాండవుల కనర్థము రాకుండఁ దన మాటను వ్యర్థము గాకుండఁ జేసినచో యుద్ధ మక్కఱ లేకయే పాండవుల రాజ్యాదిసంపదలు వారికి మరలఁ జెందును కౌరవులకును హాని వాటిల్లకుండును గావున ధృతరాష్ట్రుని యభిప్రాయము దెలియువఱకు నిది కోపమునకు సమయము గా దని వారించియుందురు. అట్లు కాని నాఁడు యుద్ధము వచ్చు నని వారి యభిప్రాయము నిగూఢముగా నుండును.

ఇట్లుండ నంతట ధృతరాష్ట్రుఁడును దన యింటఁ గలిగిన యుత్పాతములను గాంధారివలన విని యదరిపడి ద్రౌపదిని బిలిచి సాంత్వవచనముల నామెను గొంత యుపశాంతిపఱచి వరము లిచ్చి ధర్మరాజాదిసోదరుల నందఱిని దాస్యమువలనఁ బాపి వారి రాజ్యసంపదలను వారికి మరల నిచ్చి తాను మొదటఁ జెప్పిన సుహృద్ద్యూత మను మాటను యథార్థ మగునట్లు సమర్థించి వారిని యింద్రప్రస్థమునకుఁ బంపెను. అప్పుడు భీముఁడు గాని నెఱిఁగి తమకు దాస్యవిముక్తియు రాజ్యప్రాప్తియు స్త్రీమూలముగ నయిన దగుటకు విషణ్ణుఁడయి కన్నులెఱ్ఱసేసి సంగరమున శత్రువులను పరాక్రమముచేఁ జంపి రాజ్యమును గొందు మని పలికెను. కాని, యట్టి భీముని ధర్మరాజు సాంత్వవచనములచే నివారించి ధృతరాష్ట్రుని శాసనమును మన్నింపవలయు నని తమ్ములును ద్రౌపదియుఁ దానును రథము లెక్కి యింద్రప్రస్థమునకుఁ బోయిరి. భీముని ప్రతిజ్ఞయు యుద్ధ మయినప్పుడే తా నట్లు చేయుటకుఁ గా నయినది కావున, యుద్ధమే లేనప్పు డాతఁ డట్లు సేయామి యతనికిఁ బ్రతిజ్ఞాభంగము గాదు. పాండవు లింద్రప్రస్థమున రాజ్యము సేయుచుండఁ గొన్నాళ్లకు మరల జూద మాడించుటకు ధర్మరాజును ధృతరాష్ట్రుఁడు పిలిపించెను. ధృతరాష్ట్రు నాజ్ఞఁ

దప్పరా దని యాతఁడు వచ్చి శకునితో మరలఁ జూదమాడి యోడెను. ఈ రెండవ జూదమందలి సమయనిర్ణయప్రకారము పాండవు లరణ్యమునకుఁ బోనున్నప్పుడు భీముఁడు సభాపర్వము 2-వ ఆశ్వాసము. 274-వ పద్యము :

క. సాహసమున మద్బాహుగ
దాహతి దుర్యోధనాది యగు శతము రణ
ద్రోహముఁ జంపుదు నత్యు
గ్రాహవమున హరిహరాదు లడ్డం బైనన్.

అని దుర్యోధను నొక్కనినే కాక వానితోడ వాని సోదరుల నూర్వురను గూడఁ దన గదచే యుద్ధమందు హరిహరాదు లడ్డము వచ్చినను జంపుదు నని మరలఁ బ్రతిజ్ఞఁ జేసెను. ఇందు "సాహసమున" అని యున్నది. దాని కర్థ మేమి? అది యెవరి మాట? సాహస మనఁగా ధైర్యముగాని పరాక్రమము గాని యర్థ మన్నచో నది చెప్ప నేల? భీముని మాటయే యది యైన పక్షమున "నేను ధైర్యము నీత లేక పరాక్రమముచేత నూర్వురఁ జంపుదు" ననియే కదా చెప్పవలయును. అట్లు భీముఁడు దన్నుఁ గూర్చి తాను జెప్పుకొనునా? అందు విశేష మేమి యున్నది? ధైర్యము పరాక్రమము లేక నూర్వురను జంపుట యెట్లగును? కావున నది "సాహసమున" అనునంతవఱకును భీమవచనము గాదు. కథకుని వచనముగాఁ జెప్పుట యుచితముగా నున్నది. మద్బాహు — అనునది మొదలు భీముని మాట. సాహస మనఁగా నవాలోచితము. అది యెట్లన భీముఁడు క్రోధావేశమున గదచే నధఃకాయమందుఁ గొట్టరా దను నియమము మఱచి యట్లు ప్రతిజ్ఞ సేసినవాఁడు. అది సాహసవచన మన్నందునకు "హరిహరాదు లడ్డం బైనన్" అనునదియే జ్ఞాపకము. యుద్ధ మైనప్పుడు దుర్యోధనుని యూరుభంగవిషయములోనే హరిహరాదు లడ్డువచ్చినను వాని నట్లే చంపుదు నని యాతని యభిప్రాయ మగును. వానితో యుద్ధమే తప్పినప్పుడు ప్రతిజ్ఞాభంగము లేదని మన మెఱుంగవలయు. అపిమ్మట

ఆ. దుష్టచిత్తుఁ డైన కష్టు దుర్యోధను
శిరముఁ దన్నువాఁడొ ధరణిఁ గూల్చి
హీనుఁ డైన దుస్ససేనుని వధియించి
వేఁడి రక్త మానువాఁడఁ గడఁగి.

అను దానిలో దుర్యోధను బడవైచి వాని శిరము దన్నుటకును దుశ్శాసనుని రక్త మాస్వాదించుటకును మరల నొక ప్రతిజ్ఞను జేసెను. ఇట్లు వచనములలో వేఱువేఱుగఁ జెప్పుటచే నివి నానాగాఁ గాన్పించును. కాని, దుర్యోధనుని విషయమైనవి గదచే యుద్ధమం దూరుభంగముచేసి పడియున్నవాని శిరముఁ దన్నుట. ఇవి యేక కాల కృత్యములే యగుటచే నివి కలిసి యొక్కటియే ప్రతిజ్ఞ. దుశ్శాసనుని వధియించి వాని రక్త మాస్వాదించుట యిది యొక ప్రతిజ్ఞ. ఈ రెండును భీముని యభిప్రాయములో ముఖ్యములు. "నూర్వురను జంపుదు" నను దానిలో వారి నందఱిని దాము చంపుటకే కాని తానే చంపవలయు నను నభిప్రాయము గాదు. "సాహసమున" అను పద్యమందలి "శత" పదము బహువచనము గాని శతసంఖ్యావచనము గాదు. ఇట్లు సభాపర్వమందలి ప్రతిజ్ఞావచనముల యభిప్రాయము. ఈ యభిప్రాయము కర్ణపర్వమందు స్పష్ట మగును. అది యెట్లనఁగా: ధర్మరాజు కర్ణుచే నొచ్చి పరిభవింపఁబడి శిబిరమునకుఁ బోయియుండ నర్జునుఁడు దూరమున సంసప్తకులతో యుద్ధముఁ జేయుచు నన్న గారియెడలఁ గర్ణుఁడు సేసిన ప్రతిజ్ఞ స్మరించి తల యెత్తి చూచి కర్ణుని యాటోపమును గని త్వరపడి తన రథమును భీము నొద్దకుఁ గొనిపోవ శ్రీకృష్ణునితోఁ జెప్పెను. అతఁ డట్లు చేయ భీమునిఁ జేరి యన్న గారి నడిగి యతఁడు శిబిరమునకుఁ బోయినట్లు విని యతని క్షేమము దెలియుటకు భీముని వెళ్లు మని కోరఁగా నతఁడు దాను సేయుచున్న యుద్ధమును విడిచి వెళ్ల నని చెప్ప నర్జునుఁడే శిబిరమునకు వెళ్లి యతనిని గలిసి విషణ్ణుఁడై యున్న యాతని విషాదమును కృష్ణార్జును లిరువురును దీర్చి "కర్ణునిఁ జంపి వత్తు" మని ప్రతిజ్ఞ సేసి మరల యుద్ధరంగమునకు వచ్చి యొకదెసఁ దాను కురుసేనతో యుద్ధము సేయుచు మరలఁ గర్ణుని యాటోపము సూచి తాను భీమునియొద్దకు వచ్చి యున్న క్షేమమును దెలిపి భీమునిఁ దప్పు దీర్చికొ మ్మని చెప్పి కర్ణుని యుత్సాహముచే విజృంభించుచున్న కురుసేనలపైఁ గవిసెను.

గ. తోడరి భవ త్తనూజులు పదుండ్రు సముద్భటసింహనాదులై
వడిఁ దనుఁ జుట్టుముట్టుటయు వారల సూతహయధ్వజంబులం
బొడిపొడి సేసి యాతఁడు రిపుల్ వెగడంద వెడంద తూపులన్
మొదలు దెగంగ నేసి రణమేదినికిన్ బలిసేసె నత్తలల్. క. 3. 180

ఇం దర్జునుఁడు పదుగురు ధృతరాష్ట్రపుత్త్రులఁ జంపినట్లున్నది.

ఇంకను

వ. నీ కొడుకులు కవచియు నిషంగియుఁ బాశియు దండధారుండును ధనుర్గ్రహుండును నలోలుపుండును సహుండును షండుండును వాతవేగుండును సువర్చసుండును గూడి కలిసి వివిధవిశిఖంబుల నతనిం బొదివిన నంతకు మున్న దుశ్శాసనరక్తపానకాతుర కాధీన మానసుం డైన యా భీమసేనుపై నెవ్వరు గడంగుదురో యని కన్నిడియుండి యతం డప్రతిహతంబుగాఁ బ్రతిన దీర్చుటకుఁ బ్రీతచిత్తుం డగు ఫల్గునుండు భల్లదశకంబున నక్కుమారదశకంబు శిరంబులు దునుమాడె. ఆ భీమార్జునుల యాటోపంబున కోటమి నీ సైన్యంబు సమరవిముఖం బయ్యె. 228

ఇచ్చటఁ గూడ నర్జునుఁడు పదుగురు ధృతరాష్ట్రపుత్త్రులను జంపినట్లున్నది. కావున, "భీముఁడు నూర్వురఁ జంపుదు" నను ప్రతిజ్ఞ యెట్లు నిర్వహింపఁబడెను? దీనిని శంకించుకొనియే కాఁబోలుఁ గొన్ని క్రొత్త ముద్రితపుస్తకములలో పూర్వముఁ జెప్పిన 228-వ వచనమందు 1 "ఫల్గునుండు ప్రీతచిత్తుం డై యుండె నంత భీముండు భల్లదశకంబున—" 2 "నట్టి భీముని యాటోపంబున కోటమి" అనియుఁ బాఠములను దిద్దినట్లు కానిపించుచున్నది. కాని, వారీ వచనమందు మాత్ర మిట్లు దిద్దినను, అంతకు ముందే "ఉ. తోడరిభవత్తనూజులు" అను 180-వ పద్యములో మఱియొక పదుగురు దుర్యోధనుని సోదరు లర్జునుచేఁ జచ్చినట్లు స్పష్ట మగుచుండ దీనిని దిద్దిన

# జలసూర్యకిరణ ప్రకృతిచికిత్స

బొల్లాప్రెగడ సుందరగోపాలరావు గారు

నీటిలో స్నానము చేయుటవలన దేహమాలిన్యము నశించి పరిశుభ్రత కల్గుననెడి సంగతి మనుజులకు అనాదిసిద్ధముగా తెలిసియే యున్నది. కాని, సమస్తజాడ్యములు నీటివల్లనే నివారణ చేయవచ్చునను జ్ఞానము చాలవఱకు మనుజులకు కలుగలేదు. మొదట జలచికిత్స యెట్లు ప్రారంభించి యెట్లు వృద్ధిలోనికి వచ్చి ప్రముఖత చెందినదియు క్లుప్తముగా వ్రాయుచున్నాను.

ఆదిని విన్‌సెంట్ ప్రిసినిట్జి గారు ఈ జలచికిత్సను కనుపెట్టెను. ఈయన ఆస్ట్రియన్ సైలీషియాలో గ్రాఫెన్‌బర్గు గ్రామమందు 1799-వ సంవత్సరము అక్టోబరు నాల్గవ తేదిని జన్మించెను. ఇతఁడు పేద పొలముకాపువాని కుమారుఁడు. తండ్రి గ్రుడ్డివాఁడగుటచే అతనిని పోషించుటకు చిన్నతనమునుండియు ఇతఁడు సంసారభారమును వహింపవలసినవాఁడాయెను. కనుక, భగవదనుగ్రహమువలన తన తెలివితేటల నుపయోగపఱచి నీటివైద్యమును కనిపెట్టెను. 1826-వ సం. న ఇతని జన్మస్థానమునందు మొదటి జలచికిత్సాశాలను నిర్మించి అనేక రోగములు కుదిర్చి కీర్తి గాంచినవాఁడై 28-వ నవంబరు 1851-వ సం. లో చనిపోయెను.

అనంతరము ప్రిసినిట్జి గారి సమకాలికుఁడు జోహాన్ స్క్రోర్త్ గారు కూడ జలచికిత్సావిషయమై చాల గురుతరము పరిశ్రమ చేసి వృద్ధిలోనికి తెచ్చిరి. స్క్రోర్తు గారు తమ యనుభవమును ప్రకృతిలోని మార్పులను సృష్టిలోని జంతువులను గమనించుటవలననే గ్రహించి కీర్తి గాంచఁగలిగిరి. వీరు జబ్బుగా నున్న కాలములో ఏ విధమైన యాహారము లోపలికి పుచ్చుకొనఁగూడదని చెప్పుటలో ప్రిసినిట్జి గారితో భేదించిరి. నీటి వైద్యముతో పాటు పరిశుభ్ర వాయువు వ్యాయామము కఠినమైన పథ్యము కూడ వ్యాధులను కుదుర్చుటలో చాల సామర్థ్యము కలవని బోధ చేసిరి.

వీరి యుభయుల తరువాతను రిక్లీ గారు నీటి యావిరి స్నానములవలని లాభము కనిపెట్టినవారిలో మొదటివారు. దీనిని బట్టి ఆతపస్నానమనఁగా సూర్యరశ్మిచే చెమట తెప్పించుటవలన రుగ్మతలు పోవునని కనిపెట్టఁగలిగెను. 1865-1868 నాలుగు సంవత్సరములలో తాను స్వయముగా ప్రతి యుదయమున తన దేహమును ఎండలోను గాలిలోను ఉంచుటవలనఁ గలిగిన లాభమును ప్రపంచమునకు చెప్పఁగలిగెను.

నీప్ గారు కూడ కొంత కాలమునకు జలచికిత్స యను ప్రకృతివైద్యములో అత్యద్భుతసామర్థ్యమును కనఁబఱచిరి. ఈయన యొక కాథలిక్ ఫాదరీగా నుండి మొదటి నీటి వైద్యుఁడని పేరు గాంచిన జర్మన్ డాక్టరు హాన్ గారి గ్రంథావలోకనమువలన తనకు జలచికిత్సాజ్ఞానోదయము కలిగెనని వ్రాసియున్నాఁడు. తన బుద్ధిబలముచేత తనకుఁ గలిగిన జ్ఞానమును వృద్ధిపఱచుకొని తడిగుడ్డలతో కట్లు కట్టుట నీటి ధారలవలన వ్యాధులను నివారింపఁజేయుట నీటివలన విరేచనసాధనములు చేయించుట మొదలైన యుపాయములు కనిపెట్టఁగలిగెను.

పైనుదాహరించిన యంతటి తరువాత చాల కాలమునకు ప్రస్తుతము రోగాద్వైతసిద్ధాంతమును అనఁగా అన్ని వ్యాధులకు నొకటే కారణము అన్ని వ్యాధులను నివారణ చేయుటకు నొకటే సాధనము నను నవీనశాస్త్రమును కనుపెట్టిన లూయీ కూనే గారు ఉదయించిరి. వీరి జన్మస్థానము జర్మనీదేశములోని లీప్‌జిగ్. వీరి కుటుంబములో నెందఱో మూలికాదులు తిని రుగ్మతలు పోఁగొట్టుకొనలేక దేహములు చాలింపవలసినవారైరి. వీరికి కూడ నడివయస్సు వచ్చెడివఱకు ఎన్ని సాధనములు చేసినను శ్వాసకోశములోని గాఢ్యమును శిరఃకోశములోని వ్యాధియు పోనందున అదివఱకు ఆచరణములో నున్న జలచికిత్సాసాధనములవలన తాత్కాలిక నివారణము కలిగినను పూర్ణారోగ్యము గానందున వీరు తమ బుద్ధిని అనుభవమును వినియోగించి క్రొత్త శాస్త్రమును కనుపెట్టఁగలిగిరి. సమస్తజాడ్యములును శరీరములో అన్యపదార్థము చేరుటవలన కలుగుననియు దానిని తొలఁగించిన శరీరము తిరిగి యారోగ్యమును పొందుననియు చెప్పుదురు. అన్యపదార్థమనఁగా శరీరమునకు కావలసిన పోషణపదార్థములు గాక వ్యతిరేకమైనవి. ఇది మనము తినెడి యాహారముతోను త్రాగెడి నీటితోను పీల్చు వాయువుతోను శరీరములో ప్రవేశించి ముందుగా పొత్తికడుపునందు చేరి కొంత కాలము నిలువయుండి పిమ్మట నిలువయుండుటచేత పులిసి బుఱబుఱలాడి పొంగి శరీరములోని యూర్ధ్వభాగములకును చివరలకును వ్యాపించును. ఇట్లు పొంగునప్పుడును పైకి వ్యాపించునప్పుడును శరీరములో అధికమైన వేడి కలుగును. అందువల్ల శరీరమునకు శ్రమ కలుగును. అన్యపదార్థమును తొలఁగించుటకు గాను కూనే గారు నాలుగు విధములగు స్నానములు కనుపెట్టినారు. అవి కటిస్నానము లింగస్నానము బాష్పస్నానము ఆతపస్నానము అని వాడఁబడుచున్నవి. వీనివలన శరీరములోని వేడి యుపశమించి మాపునొంది పొత్తికడుపునుండియే అన్యపదార్థము బయటికి వెడలిపోవునని కూనే గారు చెప్పినారు. వీరి వైద్యసాధనమువలన శరీరములోని యన్యపదార్థము బహిష్కరణావయవములను చురుకుగా పని చేయించి బయటికి త్రోసివేయఁబడును. తిరిగి శరీరము సదా యారోగ్యముగా నుండుటకు మనుజులు మితాహారమును భుజించుచు పొగాకు కాఫీ టీ సారాయి మొదలగు పదార్థములు వదలి శాకాహారులుగా నుండి తగిన వ్యాయామము చేయుచుండవలెను. కూనే గారు తమ చికిత్సాచరణకాలమునందు స్వాభావికముగా దొరకెడి యవిదాహకపదార్థములు భుజించుచుండవలెనని వ్రాసియున్నారు. వీ రేర్పాటు చేసిన పథ్యమునకును భగవద్గీత 19-వ యధ్యాయము 8, 9, 10 శ్లోకములలో నున్న యాహారనియమమునకును ఏమియు భేదము లేదు.

శ్లో. ఆయుస్సత్త్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః
రసాస్స్నిగ్ధాస్థిరా హృద్యా ఆహారా స్సాత్త్వికప్రియాః. 8

జీవితమును చిత్తస్థైర్యమును శరీరబలమును ప్రీతిని వృద్ధి పొందించునవియు రసము గలవియు చమురు గలవియు దేహమునందు చాల కాలముండునవియు మనోహరములైనవియు నగు భక్ష్యభోజ్యాద్యాహారములు సత్త్వగుణము గలవారి కిష్టములైనవి.

శ్లో. కట్వమ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః. 9

చేదుగాను పుల్లగాను ఉప్పగాను మిక్కిలి వేడిగాను కారముగాను చమురు లేనివిగాను దాహమును కలుగఁజేయునవిగాను ఉండునవియు కష్టమును మనోవ్యాకులత్వమును రోగమును కలుగఁజేయునవియు నగు నాహారములు రజోగుణము గలవారి కిష్టములైనవి.

శ్లో. యాతయామం గతరసం పూతిర్యుషితంచయత్
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్. 10

లెస్సగా నుడుకనిదియు సారము లేనిదియు దుర్గంధము గలదియు వండిన తరువాత నొక్కరాత్రి గడచినదియు ఇతరులు తినఁగా మిగిలినదియు భగవంతునికి నివేదితప్రసాదము కానిదియు నగునే యాహారము గలదో అది తమోగుణము గలవారి కిష్టమైనది.

ఇది గాక, కూనే గారి స్నానపద్ధతులు వేదమునందలి శౌచవిధానములోనివే యని వేదాధ్యయనపరులు చెప్పుదురు కావున, ఈ పథ్యమును వైద్యమును మన హిందూదేశమునకు మిక్కిలి యనుకూలమైనవి శాస్త్రసమ్మతమైనవి.

ప్రస్తుతము అమెరికా ఖండమునందు ఎమ్. డి. పరీక్షలో నే తీసిన కెల్లాగు గారను నతఁడు ద్రవ్యము నిచ్చియు దేశములోని ద్రవ్యమును ప్రోగు చేసియు ప్రకృతివైద్యమును వృద్ధి చేయుటకును ప్రజలను సౌఖ్యపెట్టుటకును గొప్ప శాలను నిర్మాణము చేసి కని విని యెఱుంగని యేవియో వ్యాధులను పంచభూతములతోను ఎలక్ట్రిసిటీ రేడియం మొదలగు నవీనసాధనములతోను నివారణ చేయుచున్నారు. వీరి శాలయందు 3, 4 వేల మంది రోగులు సదా నిలువయుందురు. వీరి కుపచారములు చేయుటకు నేర్పరు లగు నౌకరులు ఎమ్. డీ. పరీక్షల నిచ్చిన వైద్యు లుందురు. అనేకనవీనయంత్రపరికరములు కూడ ఈ శాలయందు మెండుగా నున్నట్లు ఆ శాలయొక్క ప్రతి సంవత్సరపు రిపోర్టును బట్టి తెలియును. ఇట్టి శాలలు జర్మనీదేశములో విస్తారముగా నున్నట్లును యూరోపు ఖండపు ఇతరభాగములలో అచ్చటచ్చట నున్నట్లును అమెరికాలో కూడ ప్రబలుచున్నట్లును కనఁబడును. మన భరతఖండమందు లేవు సరే కదా యిట్టివి ప్రపంచమునం దున్న వని మనలో తెలిసినవారు కూడ చాల తక్కువగా నున్నారు.

కావున, ఇట్టి శాల నేర్పాటు చేయవలె నని గంధము వేంకట కృష్ణారావు, బి. ఏ., గారును నేనును 1911-వ సంవత్సరమునుండి ప్రయత్నము చేయుచున్నాము. ప్రయత్నములను భగవంతుఁ డెప్పుడు కొనసాగించునో తెలియదు. గుంటూరులో 1913-వ సం. జలసూర్యకిరణ చికిత్సాశాల యనెడి పేరుతో చిరుమామిళ్ల భాను ప్రసాదనాయఁడు గారి ద్రవ్యసహాయమువలన నొకశాల యేర్పాటు చేయఁబడెను. కుదురవని చేరఁబెట్టఁబడ్డ యనేకరోగములు కుదుర్పఁబడినవి. ఇంకను మన మాతృదేశమంతటను పూర్ణముగా వ్యాపకము చేయు తలంపుతో ఇతరవ్యాపారములను మానుకొని ప్రకృతిసౌకర్యము లెక్కువ గలిగినట్టి రాజమహేంద్రవరమునందు జలసూర్యకిరణప్రకృతిచికిత్సారోగ్యజ్ఞానాశ్రమ మనెడి పేరున వ్యాధులు నివారణ చేయు సాధనములను బోధించు చోటు నేర్పాటు చేసియున్నాను. కృష్ణారావు గారు రెండు సంవత్సరములు చెన్నపురియందు కూనే గారి జలచికిత్సా వ్యాపకమునందు పాటుపడి ద్రవ్యసహాయము లేమిచే బొంబాయి గ్రామము చేరిరి. ఇప్పుడు జరుగుచున్న సంగ్రామము ముగిసినంతరము గొప్ప చికిత్సాశాల నేర్పాటు చేయుటకు బొంబాయినగరమునందలి కొందఱు ధనికులు వాగ్దానము చేసియున్నారు.

ఇప్పటివఱకును జలచికిత్సాభివృద్ధిని గుఱించియు వ్యాయామ సూర్యకిరణస్నానములను గుఱించియు నెట్లు చెప్పఁబడియున్నదో క్లుప్తముగా తెలిపియున్నాను. కేవలము సూర్యకిరణచికిత్సవలననే సమస్తజాడ్యములు పోఁగొట్టవచ్చునని అమెరికా వైద్యులగు డాక్టరు ఈ. డీ. బ్యాబిట్టు, ఎమ్. డీ., గారు అనేక గ్రంథములు వ్రాసియున్నారు. ఇంద్రధనుస్సులో కనఁబడు సప్తవర్ణములవలననే ప్రపంచమునం దుండు మూలికలు లోహములు మొదలగునవి యెల్ల వర్ధిల్లుచున్న వనియు ఒక్కొక్క రంగు నొక్కొక్క మూలిక సూర్యుని ప్రకాశమువలన తనలోనికి తీసికొనుచున్న దనియు ఈ మూలికాభక్షణమువలన రుగ్మతలు పోవుచున్న వనియు బ్యాబిట్టు గారు చెప్పుదురు. ముందు రోగ మిదె యని వైద్యులు నిదానముగా నిర్ధారణ చేసిన పిమ్మట దానికి తగిన మూలికలు వాడిన రోగము మరలును గాని యిందులో యేది లోటువచ్చినను వ్యాధి కుదురదు. సూర్యకాంతిలోని యొక రంగు మూలికలో నిమిడియుండుటవలన ఈ జాడ్యము పోయినను మూలికలో నుండు నితరపదార్థములు అనఁగా బొగ్గు మొదలగు వస్తువులు శరీరములో ప్రవేశపెట్టఁబడినప్పుడు అవి యన్యపదార్థముగా ప్రవేశించి శరీరము పటుత్వము తప్పినప్పుడు గాని ఋతుభేదములవలన కలిగిన వాతావరణస్థితికిఁ గాని మందు మేర్పడి అనఁగా కుళ్లి బుడబుడలాడి పొంగి మరియొక వ్యాధిగా నేర్పడు నని డాక్టరు బ్యాబిట్టు గారి యభిప్రాయము గనుక మూలికలు తిన నవసరము లేకుండ కేవలము సూర్యరశ్మిని దేహములోనికి ప్రసరింపఁజేయుటకు కొన్ని రంగుల లెన్సులు మొదలగు పనిముట్లు బ్యాబిట్టుగా రేర్పాటు చేసి మూలికాసేవయు శస్త్రచికిత్సయు అనవసర మగునట్లు, కూనే గారు జలచికిత్సవలన ఔషధశస్త్రప్రయోగములు నిరుపయోగ మగునట్లు చేసిన రీతిని, గావించి కీర్తి గాంచియున్నారు.

హిందూదేశములోని జనులు ఋషిసంతతివారగుటచేతను ఏ కష్టమునకైన నోర్చువారగుటచేతను ఇఁకనైన వృథా ద్రవ్యము వెచ్చింపక ప్రకృతిచికిత్స నవలంబించి ఆరోగ్యభాగ్యము గాంచెదరు గాక!

THE VICTORIA FREE READING ROOM AND LIBRARY



విక్టోరియా ధర్మపఠనమందిరము గ్రంథాలయము, చెన్నపురి

SUJANA RANJANI SAMAJAM, POTLAPUDI



సుజనరంజనీ సమాజము, పొట్లపూడి

ANDHRA STUDENTS, GOVERNMENT SCHOOL OF COMMERCE
CALICUT (JUNIOR BATCH)



కళ్లికోట వాణిజ్యపాఠశాలయందలి జూనియరు ఆంధ్రవిద్యార్థులు

ANDHRA STUDENTS, GOVERNMENT SCHOOL OF COMMERCE,
CALICUT (SENIOR BATCH)



కళ్లికోట వాణిజ్యపాఠశాలయందలి సీనియరు ఆంధ్రవిద్యార్థులు

ADIVELAMA MEDICAL STUDENTS, VIZAGAPATAM



ఆదివెలమ వైద్యవిద్యార్థులు, విశాఖపట్టణము

# వర్ణాశ్రమ ధర్మములు

రాజా మంత్రిప్రెగడ భుజంగరావు పంతులు గారు

వర్ణాశ్రమ ధర్మము లనునవి మన హిందూదేశమునఁ జిరకాలమునుండి వ్యాప్తమై యున్నవి. మన హిందూదేశమునకుఁ గలిగిన రాజకీయవిషయిక మయిన మార్పులు పెక్కు లగుటచే నాదియం దీ వర్ణాశ్రమధర్మము లెట్టి ప్రవృత్తి గలవి యైనను క్రమశః పరిపాలనావిధానములోని మార్పుల ననుసరించి యివియు మార్పులను జెందుచువచ్చినవి. ఈ కాలమం దీ ధర్మములు క్షీణదశను జెందుచున్న వని పెద్దలు కొందఱు తలంచి వానిని బునరుద్ధాపనము సేయవలయు నని సమకట్టిరి. అట్టివారిలోఁ గాశీనగరంబున విరాజిల్లెడి "భారతధర్మమహామండలి" సభ్యు లొకరు. దర్భంగ మహారాజా గారు గూడ నీ విషయమున శ్రమఁ బూని హిందూదేశమునందలి ముఖ్యస్థానముల నన్నిట నుపన్యాసముల నిచ్చి యుపసభల నెలకొల్పి వాని వార్షికోత్సవములు మున్నగునవి జయప్రదముగ నెఱవేర్చుచున్నారు. ఈ పరిశ్రమకార్యములు బ్రాహ్మణుల యౌన్నత్యమునకే యగు లనియు సంఘాభివృద్ధి కనర్థదాయకము లనియు బ్రాహ్మణేతరసంఘములవారు ప్రవచించుచున్నారు. కావున నీ వర్ణాశ్రమధర్మము లెప్పు డే రీతి నేర్పడినదియు నేయే కాలముల నేయే విధము లగు మార్పులం జెంది యిప్పటి కీ స్థితికి వచ్చి నిలిచినదియు నిప్పుడు జరుగుచుండిన యీ యుద్ధాపనవలన నాదిదశను జెందఁగలదా యను విషయము నొక్కించుక చర్చించుట కర్తవ్యమై యున్నది.

నరుల మానసిక నైతిక జ్ఞాన భేదంబులచేఁ దత్తద్భేదముల ననుసరించి కర్మములవలనను గుణభేదములవలనను నీ వర్ణాశ్రమధర్మంబు లేర్పడినవి. ఒక విధ మగు సంఘంబునందుఁ బ్రవర్తించుచుండు స్త్రీపురుషులకు సంభవించుటవలన వర్ణాశ్రమధర్మ మేర్పడు నని వేదకాలమునందలివారెవ్వరును దలంచియుండలేదు. వేదకాలమునందుఁ బ్రతిమానవుఁడును జననకాలమందు శూద్రుఁడుగా జన్మించు ననియే తలంపఁబడినది. అనఁగా జీవుఁడు బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులలో నే జాతివారికి జన్మించినను బాల్యమునందు శూద్రుఁడుగనే జన్మించును. వేదాధ్యయనసంపన్ను లగు బ్రాహ్మణులకు జన్మించినవారు గూడ నుపనయనాత్పూర్వము శూద్రులుగనే యుందురు. ఇప్పటికిని బ్రాహ్మణపుత్రులకుఁ గూడ నుపనయనమువలననే గాని వేదాధ్యయనాధికారసిద్ధియు బ్రహ్మోపాసనాద్యధికారసిద్ధియుఁ గలుగుట లేదు. మన వర్ణాశ్రమధర్మము లెట్టి దుర్దశను జెందినను సత్యమును లోకమునకు విశదీకరింపఁజేయుటకో యనునటు లీ యుపనయనసంస్కార మిప్పటికిని నిలిచియున్నది. ఇతరాంశములవలెనే యీ యుపనయనకర్మము కూడ మార్పును జెందియుండినచో నీ వర్ణాశ్రమధర్మముల యుత్పత్తిని గ్రహించి సత్యమును దెలిసికొన్న సాధనము నశించియే యుండును. ఈ యుపనయనమువలననే నరునకు ద్విజత్వము సిద్ధించును. ద్విజత్వ మనఁగా రెండవ జన్మ మెత్తుట యని యర్థము. మాతాపితృసంసర్గమునఁ గలుగు జన్మము శూద్రజన్మ మనియు నుపనయనమువలనఁ గలుగు జన్మము బ్రాహ్మణజన్మ మనియు నెఱుంగఁదగును. ఈ యుపనయనకాలమున గురువు గాయత్రీమంత్రోపదేశము సేయుటయుఁ దత్కాలమున వేదాధ్యయనాధికారసిద్ధియుఁ దత్కాలమున బ్రాహ్మణత్వమును గలుగుచున్నవి. మనుకాలమునఁ గూడ నీ సిద్ధాంతమునే పెద్ద లందఱు నంగీకరించియుండుటచే మనుస్మృతియం దీ క్రింది విధమున వ్రాయుట తటస్థించి యున్నది:

శ్లో. "శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతాం
క్షత్రియాజ్జాతమేవంతు విద్యాద్వైశ్యా త్తథైవ చ." (మనుస్మృతి)

అనఁగా శూద్రుఁడు బ్రాహ్మణధర్మముల నవలంబించి తన జీవితమునందు వానిని నెలకొల్పుకొనినచో నాతఁడు బ్రాహ్మణుఁడే యగును. గాఢమగు దీక్షయును నగు పాండిత్యము సంపాదించుట సర్వభూతములఁ దనవలెఁ బ్రేమించుట జ్ఞానవంతుఁడై సంచరించుట సద్గుణగరిష్ఠుఁడై స్వచ్ఛందప్రవర్తనము గలిగియుండుట మున్నగు రీతుల నవలంబించిన నాతఁడు శూద్రుఁడైనను బ్రాహ్మణుఁడుగా మాఱును. బ్రాహ్మణుఁడైనను దుర్వ్యాపారములయందు మెలంగి బ్రహ్మజ్ఞానసంపత్తిఁ బోఁగొట్టుకొనినచోఁ దన యున్నతస్థానము నుండి పతితుఁడై శూద్రుఁ డగును. క్షత్రియులును వైశ్యులు నట్లే యగుదురు. ఇది శ్లోకార్థము. పూర్వోదాహృతశ్లోకమువలన వర్ణధర్మములు నరులయొక్క గుణాతిశయమువలనను ప్రవర్తనమువలనను నిర్ధారణ సేయఁబడును గాని వర్తమానకాలమునందువలె జన్మమువలన నేర్పడుట లేదని సుబోధము. ——

ఆపస్తంబసూత్రములయందుఁ గల యీ క్రింది సూత్రములను బరిశీలించినచో నీ విషయం బింకను పాఠకులకుఁ దృష్టి నొసంగఁ గలదు.

1. సూ—ధర్మచర్యయా జఘన్యో వర్ణః, పూర్వం పూర్వం వర్ణమాపద్యతే జాతి పరివృత్తౌ.

(ప్రపాఠ. 2, పటల, 5, సూ 99)

2. సూ—అధర్మచర్యయా పూర్వో వర్ణో జఘన్యం జఘన్యం వర్ణమాపద్యతే, జాతిపరివృత్తౌ.

(ప్రపాఠ. 2, పటల, 5, సూ 99)

వేదములయం దుదాహరింపఁబడిన బ్రహ్మక్షత్రియవైశ్యధర్మ

ములలో నెద్దానినైన నొకఁ డవలంబించుటచేఁ దా నవలంబించిన కర్మానుసరణముగ బ్రాహ్మణుఁడు గాని క్షత్రియుఁడు గాని వైశ్యుఁడు గాని యగును. అతని వర్ణ మిందు మూలమున మార్పును జెందిన దగును. ఏ వర్ణుఁడైన నుత్తమవర్ణ ధర్మముల నవలంబించుటచే నా యుత్తమవర్ణమును బొందఁగలఁడు. దుష్కృత్యముల నాచరించుటవలనను పాపకర్మములయందుఁ బ్రవర్తించుటవలనను ఉత్తమవర్ణమం దుండినవాఁడు గూడ నటులే యధోవర్ణముం బొందును. పూర్వోదాహృత మనుధర్మశాస్త్రాపస్తంబసూత్రగ్రంథములవలన వర్ణములు జన్మతః సంక్రమించి యాజన్మాంతమును స్థిరమై యుండు నవి కావనియు మానవుఁ డాచరించు కార్యములవలనను వాని నడవడికవలనను మార్పులను బొందుచుండు ననియుఁ దేలుచున్నది. కావునఁ బ్రతిమానవునియొక్క వర్ణమును వాని మానసిక నైతిక జ్ఞానములవలన నేర్పడును. మన పూర్వు లగు మహర్షు లెవ్వరును బుట్టుకవలన వర్ణము స్థిరపడుట గాని నిర్ధారణ చేయఁబడుట గాని జరుగు నని తలంచియుండలేదు. ఏ నరునియొక్క వర్ణమైనను దా నేర్పఱచుకొని నదియే యగును గాని తన జన్మమువలనఁ బొందఁబడిన దెన్నఁటికిని గా నేరదు. బ్రాహ్మణులకుఁ బుట్టినవా రందఱును బ్రాహ్మణుల మనుకొనుటకంటె వెఱ్ఱితనము లేదు. ఒకఁడు జన్మమువలన జండాలుండైనను సత్ప్రవర్తనవలనను బ్రాహ్మణకర్మాచరణమువలనను బ్రహ్మజ్ఞానసంపత్తిని బొందినచో బ్రాహ్మణుఁడే యగును. పూర్వ మాదిశంకరులవా రిట్లు మనీషాపంచకమునందు చెప్పియుండలేదా?

శ్లో. "చండాలోస్తు స తు ద్విజోస్తు గురు రిత్యేషా మనీషా మమ."

బ్రహ్మతేజసోత్పన్నుల మని డంబములను జెప్పుకొనుటకు మాత్రమే జాతి నుపయోగించును గాని వా రిప్పుడే వర్ణమునఁ జేరుదురో స్థిరపఱచుట కా కాలము నిష్ప్రయోజనకారియే యగును. ప్రతిమానవుఁడును శూద్రుఁడుగానే జన్మించుచున్నాఁ డని మున్నె చెప్పియుంటిమి. అతఁడు తన స్వశక్తివలనఁ గ్రమక్రమముగ జ్ఞానమును సంపాదించి తన శక్తియుక్తుల కనువగు వర్ణమును బొందవలయును.

శ్లో. "జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః."

ఈ యార్యోక్తి మన గృహములయందలి యువతీజనము గూడ నెఱింగినదియే కదా! అట్టిదానియందు విస్మృతిని వహించి విద్యాగంధము లేనివారు సయితము బ్రహ్మబీజోద్భవు లయినంత మాత్రమున బ్రాహ్మణుల మని విఱ్ఱవీఁగుచు విద్యాసంపత్తియు జ్ఞానసంపత్తియుఁ గలిగినవారిని గూడ శూద్రజన్ము లగుటచే న్యూనభావమున నిందించుచు వెంగలు లగుచుండిరి గదా! పురుషుఁడు స్వశక్తివలన బ్రాహ్మణవర్ణమును బొందియుఁ దదుపరి దుష్కర్మముల నాచరింప సాహసించునెడల వాఁడు బ్రహ్మత్వమును బాయుటయే తటస్థించును.

వర్ణశబ్దార్థము నించుక విమర్శించి వేదములయం దేయే వర్ణముల కేయే విధు లేర్పాటు చేయఁబడినవో తెలిసికొనఁ బ్రయత్నింతము. "వర్ణ" మను శబ్దము "వృణీతి" అను ధాతువునుండి పుట్టినది. పరిగ్రహించుట యని దాని యర్థము. ఈ వ్యుత్పత్తి నిరుక్తమునందు ద్వితీయాధ్యాయమున మూఁడవ కాండమునందు వ్రాయఁబడియున్నది. కావున వర్ణ మనఁగా మానవుఁడు తాను తన శక్తియుక్తుల కనుగుణమగు రీతిని బొంది నిశ్చయించి పరిగ్రహించు స్థానమై యున్నది. లేక, ఆ స్థానముయొక్క గౌరవము ననుసరించి మానవుఁడు పొంద నిచ్ఛగించునది వర్ణ మని చెప్పినను చెప్పవచ్చును.

శతపథబ్రాహ్మణమందు వ్రాయఁబడిన యీ క్రింది మంత్రములను జదివి వాని యర్థమును గ్రహించినయెడల నేయే వర్ణములవా రెట్టి ప్రశస్తి గలవారై యుండవలయునో సుబోధముగ విశదము కాఁగలదు.

1. బ్రహ్మహి బ్రాహ్మణః క్షత్రంహీంద్రః క్షత్రరాజన్యః.

(శతపథబ్రాహ్మణము 5 కాం. 1 అధ్యా. 1 బ్రాహ్మణము.)

2. బాహూవై మిత్రావరుణౌ పురుషోగర్తః

వీర్యంవా ఏతద్రాజన్యస్య యద్బాహువీర్యంవా ఏతదపాంరసః.

(శతపథ 5 కాం 4 అధ్యా 3 బ్రాహ్మణము)

3. ఇషవో వైదిద్యవః.

(శతపథ 5 కాం. 4 అధ్యా. 4 బ్రాహ్మణము.)

ఇందు మొదటిదాని యర్థ మెట్లనఁగా: పరబ్రహ్మము నారాధించుచు జ్ఞానసంపత్తి గలవాఁడై సద్గుణగరిష్ఠుఁ డైనవాఁడే బ్రాహ్మణుఁ డనిపించుకొనును. ధనసమృద్ధి గలిగి బాహుబలము గలవాఁడై వీర్యవంతుఁడై శత్రువినాశమును జేసి ప్రజలను సంరక్షింప దక్షుఁ డగువాఁడే క్షత్రియుఁ డనిపించుకొనును.

ఇందు రెండవదాని యర్థ మే మనఁగా: ప్రతివానిని సౌఖ్యమెట్టఁగలుగుటయు సద్గుణసంపత్తి గలుగుటయు నను నీ రెంటను క్షత్రియునకు బాహువులగును. బలమును ధైర్యము ననునవియే క్షత్రియునకుఁ గరములగును.

శ్లో. "వైశ్యస్తు కృతసంస్కారః కృత్వా దారపరిగ్రహం
వార్తాయాం నిత్యయుక్తస్స్యా త్పశూనాంచైవ రక్షణే."

(మనుస్మృతి దశమాధ్యాయము)

వైశ్యుఁ డుపనయనము మొదలయిన సంస్కారములను జేసికొని వేదముఁ జదివిన పిదప వివాహము చేసికొని గోవులను గాపాడుటయందును సేద్యము మొదలగు జీవనవృత్తులయందును శ్రద్ధ గలవాఁడుగా నుండవలయును.

శ్లో. "శుచి రుత్కృష్టశుశ్రూషు ర్మృదువా గనహంకృతః
బ్రాహ్మణాద్యాశ్రయో నిత్య ముత్కృష్టాం జాతి మశ్నుతే."

(మనుస్మృతి దశమాధ్యాయము)

మనస్సునను వెలుపలను బరిశుద్ధుఁడై తనకు మీఁదిజాతివారి క్రౌర్యముగా మాటలాడక బ్రాహ్మణునకును వాఁడు లేనియెడ క్షత్రియునకును వాఁడు లేకున్నయెడ వైశ్యునకును మేలయిన శుశ్రూష చేసికొని అహంకారము లేక ప్రతిదినము వారి నాశ్రయించి యుండెడు శూద్రుఁడు మేలయిన జాతివాఁ డగును.

వేదవిదులును బ్రహ్మజ్ఞానవంతులును పరమపురుషాన్వేష

కులై సత్త్వగుణప్రధానులై సంచరించువారు బ్రాహ్మణులు. ధనధాన్యసమృద్ధియు బలమును గలిగి యరినాశులై శరణాగతత్రాణులై ప్రజలను గాపాడువారు క్షత్రియులు. కర్షణాదివృత్తుల నాచరించుచు గోసంరక్షణ సేయుచు వర్తకవ్యాపారములవలన ధనము నార్జించి దానిని లోకసంరక్షణార్థమై వినియోగించువారు వైశ్యులు. ద్విజులగు పయి మూఁడు వర్ణములవారికిని వలయు సహాయ్యముల నన్నిటిని భక్తియుక్తులతో నాచరించువారే శూద్రులు.

వర్ణముల వ్యుత్పత్తియు వాని ధర్మములును సంక్షేపముగ నుదాహరించియుంటిమి. ఇఁక నాశ్రమధర్మములను గూడఁ గొంచెము విచారింతము.

## ఆశ్రమధర్మములు

వర్ణధర్మములు క్రమక్రమముగ నుత్తమవర్ణమునకుఁ జేరి ముక్తిని బడయుట కేర్పడినవి గావున నట్టి వర్ణధర్మముల నవలంబించుటలో నరులకు సహాయకారి యగుట కీ యాశ్రమధర్మము లేర్పడిన వని మున్నుగనే విన్నవించుచున్నాఁడను.

వర్ణములు జ్ఞానమును సంపాదించుట కేర్పడిన సోపానములన వచ్చును. ప్రతిమానవుఁడును ఏవర్ణమును బొందఁదలఁచిన గాని నే పొందఁగలఁడు. అట్టి యాప్తిశాస్త్రసిద్ధి యైనతోడనే యైహికకార్యములఁ బడసినవాఁ డగును. స్వలాభముకొఱకు బుద్ధిని శరీరమును గూడ స్వాధీనపఱచుకొనుటకుఁ జేయు ప్రయత్నములే యాశ్రమము లనఁబడును. ఇట్టి యాశ్రమధర్మములను యథావిధిగ నిర్వర్తించిరేని మన పూర్వు లుత్కృష్టదశను బొందియుండిరి. అట్టి యుత్కృష్టదశ యొక్క ఛాయల నిప్పటికిని మనము గాంచుచునే యుంటిమి. ఇట్టి యాశ్రమధర్మముల నవలంబించి తన్మూలముగా జన్మమును సరింపఁ జేసికొనుటకు మార్గమును బూర్వులు గ్రహించియుండిరి. ప్రవర్తనయందు స్వదేశీయులమై యుండఁదలఁచినయెడల నీ వర్ణాశ్రమధర్మముల నవలంబించుట కర్తవ్య మని మనవా రిప్పుడు చెప్పుచున్నారు.

ఆశ్రమములు చతుర్విధములు:— (1) బ్రహ్మచర్యము, (2) గార్హస్థ్యము, (3) వానప్రస్థము, (4) సన్న్యాసము. బ్రహ్మచర్యాశ్రమమునందు గురుశుశ్రూషను చేసి సమస్తవిద్యల నభ్యసించి జ్ఞానసంపన్నుఁడు కావలయును. విద్యల యభ్యాస మనఁగా నొక గ్రంథపఠనమే కాదు. శరీరపారిశ్రామికవిషయములు గూడ నందిమిడియున్నవి. గృహస్థాశ్రమమునందు వివాహాదిసకలసౌఖ్యముల ననుభవించుచు ధనార్జనమును గావించి సద్వర్తనులై సకల నర్మములను బరోపకారార్థము చేయవలయును. గృహస్థాశ్రమమునందు సమస్తసుఖములఁ దనివి దీర ననుభవించి పరితృప్తిం జెంది వైరాగ్యమును బూని సాంసారికవిషయముల సంతానమున కొప్పగించి భార్యాసమేతముగా నుద్యానవనములందు నివసించుచుఁ గాలమును బుచ్చవలయును. ఇదియే వానప్రస్థాశ్రమ మనఁబడును. వానప్రస్థాశ్రమమున వైరాగ్యమును బూర్తిగ నలవఱచుకొని అరిషడ్వర్గములఁ దనకు వశ్యము గావించుకొని పిదప సర్వసంగపరిత్యాగమును గావింపవలయును. ఇదియే యత్యాశ్రమ మనఁబడును.

ఈ వర్ణాశ్రమధర్మములకు నితరమతస్థులు గాని యితరదేశస్థులు గాని యవలంబింప వర్ణాశ్రమధర్మములకును ఇసుమంతయు భేదము లే దని చెప్పుటకు సాహసించుచున్నాఁడను. వేదోక్తము లగు నీ యార్యవర్ణాశ్రమధర్మములు నీచాతినీచుఁ డైనను వలయు ననిన నవలంబించి పొందుట కభ్యంతరము లేనంతటి విశాలములుగా నున్నవి. ఆర్యసమాజమును స్థాపించి దిగంతవిశ్రాంతఖ్యాతిం బడసిన దయానందసరస్వతీస్వాములవారు నీ వర్ణాశ్రమధర్మతత్త్వమును బూర్తిగ విమర్శించి తమ సమయం గల పాండిత్యప్రభావముచే నీ యార్యధర్మము లన్నియుఁ బ్రపంచమునందలి సర్వమానవుల యభివృద్ధికై యేర్పడిన వనియు నార్యుల మగు మనకొఱకు మాత్రమే యేర్పడినవి కావనియు సహస్రముఖముల నుద్ఘోషించి బోధించియుండిరి. మన దేశమునం దెల్లెడలను వ్యాప్త మగుచుండిన సంఘసంస్కర్తల కేరికిని నిట్టి సకలజనోపయోగ మగు వర్ణాశ్రమధర్మములతో వైరము లేదు. వేదకాలమునకు భిన్నముగా నిప్పుడు మనలోఁ జేరియుండిన దురాచారముల నన్నిటిని దొలఁగించి వేదోక్త మగు వర్ణాశ్రమధర్మముల నామోదించుటయే కర్తవ్యము. ఇప్పుడు మనలోఁ బ్రబలియుండిన వర్ణభేదములు మున్నగు దురాచారము లెవ్వియు వేదకాలమున నేర్పడినవి కావు. పురాణకాలమునందును తత్పూర్వమునందును నేర్పడినవి యయి యున్నవి. బహుశః పురాణకాలమందే యిప్పుడు మన మవలంబించుచుండిన వర్ణభేదముల రీతులు బీజప్రాయములుగా నంకురించియుండును. ఆ కాలమునం దయిన నిప్పుడు మనలను బాధించుచున్నంతటి దురాచారములు ప్రబలియుండవు.

మన వేదములయం దేర్పఱుపఁబడిన వర్ణధర్మములను ఆశ్రమధర్మములను గూడఁ జక్కఁగా ననువర్తించినయెడల వ్యాసవసిష్ఠవిశ్వామిత్రాదిమహర్షుల కాలమునందు మన హిందూదేశమునఁ గలిగియుండిన చక్కని శాంతిసమాధానములు మన కిప్పుడును గూడ నలవడును ననుటకు సందేహ మించుకంతయును లేదు. వృషభస్కంధులును నిశ్చలమనస్కులును అనుక్షణము నెవ్విధి నైన దేశసేవ సేయఁగల సమర్థులును నెక్కుడుగ వెలువడఁగలరు. ఈ వర్ణధర్మములు గాని ఆశ్రమధర్మములు గాని ఈ కాలమున మనకు విధికృతము లైన పర్వులకు దేనికి నడ్డు రావు. ఈ వర్ణాశ్రమధర్మముల నవలంబింపఁదలంచినవారు తమకును దమ దేశమునకును దమ దేశమును బరిపాలించు ప్రభువునకును గూడ వేయివిధముల నెక్కుడు ఫలంబు నొసంగఁదగిన రీతి నభివృద్ధి నొందవచ్చును. ఈ వర్ణాశ్రమధర్మము లిప్పుడు మన దేశము నధోగతి పాలొనరించుచుండిన కులసంబంధ మగు వైషమ్యములకుఁ గాని బ్రాహ్మణబ్రాహ్మణేతరద్వేషములకుఁ గాని యిసుమంతయుఁ దావొసంగవు. ఈ వర్ణాశ్రమధర్మములు యథావిధిగ నాశ్రయింపఁబడినచో నిప్పుడు మనలను నాశనము చేయుచున్న కులభేదములు నశించును.

"బ్రహ్మచర్యేణ కన్యా యువానాం విందతే పతిం
అనడ్వాన్ బ్రహ్మచర్యేణాశ్వో ఘాసం జిగీషతి"

(అథర్వ. కాం. 20. అను. 3. మంత్రం. 18)

ఈ యథర్వణవేదమునందలి వాక్యమును బరిశీలించినయెడలఁ బురుషులకే గాక స్త్రీలకుఁ గూడ బ్రహ్మచర్యాశ్రమము కల దని గ్రహింపనగును. ఈ మంత్రార్థము నించుక విమర్శింపుఁడు. బ్రహ్మచర్యవ్రతాచరణమువలన బాలిక యవయవపటుత్వము గల నారి యైన పిదపఁ దనకు సమస్తవిషయముల ననురూపుఁడైన భర్తను దానే పరిగ్రహింపవలయును. చూచితిరా బ్రహ్మచర్యాశ్రమమును బూర్తిగ నవలంబించి యుక్తవయస్కురా లయినం గాని వివాహ మాడదు. ఇంతియే గాక, తాను తనకు నచ్చిన పురుషునే గాని పరిణయము కాదు.

దీనిం బట్టి చూడ మనలోఁ బ్రస్తుతము వ్యాప్తనగుచుండిన యతిబాల్యవివాహములు శిశువివాహములు తొట్టెలఁ బుస్తెలు గట్టుటలు వేదకాలమునందుఁ గాన్పింపవు. ప్రతికన్యకయుఁ దన యిష్టవచ్చిన పురుషునే కోరి వరించునది గాని యిప్పటివలెఁ దలిదండ్రుల యిష్టవచ్చినవారితో సంసారము సేయవలసిన దుస్థితి యప్పటి స్త్రీలకుఁ బట్టలేదు. కారణాంతరములచే మనవా రధోగతి పాలై చెప్పరాని యిక్కట్టులకు లోనయిరి. ఎట్టి యున్నతదశనుండి మనము జాఱిపోతిమో వేదములను సాంగముగాఁ బరిశీలించినచోఁ దేటపడఁ గలదు. బాల్యవివాహములు కులపురోగన్నులు దుర్బలశరీరములు వ్యాస వాల్మీకి వాలఖిల్యాది మహాత్ములను బుట్టింపఁజాలవు. కావున మన పూర్వస్థితి నైనను దెలిసికొనుటకుఁ గృషి సేయవలయును. అధఃపాతము నొందిన మన ప్రస్తుతస్థితితో సాంఘికార్థిక రాజకీయస్వాతంత్ర్యముల నొందఁజాలము. కావున నా ర్యావశ్యక మని యెల్లరకును విన్నవించెదను.

మన వేదమునం దొక్కచో బ్రహ్మయొక్క ముఖమునుండి బ్రాహ్మణులును బాహువులనుండి క్షత్రియులును నూరువులనుండి వైశ్యులును పాదములనుండి శూద్రులును జన్మించినట్లు వ్రాయఁబడి యున్నది. అలంకారయుక్తముగాఁ బరతమవిభేదమును దెల్లడింప నుపయోగింపఁబడిన యీ వాక్యములకుఁ బ్రతిపదార్థమును జేసి దానినే సత్యముగ భావించుటచే నిట్టి దురవస్థ మనకు సంప్రాప్తమయినది. మన పూర్వుల యున్నతదశ యధోగతి పాలైనది. ఇప్పటికి స్వార్థపరాయణులును సోమరిపోతులును మిక్కుటముగఁ బ్రజ్వరిల్లి బ్రాహ్మణులు బ్రహ్మముఖమునుండి వెలువడినవారు గావున వారి సంతతివా రందఱును నిరక్షరకుక్షు లైనను స్వోదరపరాయణు లైనను సకలదుష్కర్మకారకు లైనను బ్రాహ్మణులగనే యుందు రనియుఁ దక్కు జాతివారలలో బ్రహ్మజ్ఞానసంపన్ను లుండినను వారి జన్మము ననుసరించి నీచులుగనే పరిగణింపఁబడుదు రనియు వాదించుచున్నారు. ఈ విధమున నీచాతినీచమును పరమాసహ్యమును, ఆత్మవినాశకరమును నగు వర్ణభేదములు నేఁటికి మనల నావరించినవి.

ఈ కాలమునఁ బురాణములు పరస్పరవిరుద్ధగాథలు కలవి యగుటచే విశ్వసింపఁదగినవి కావని విద్యావంతు లనేకులు వానిని గర్హించిరి. కాని, అట్టి పురాణములే యీ వ్యాసమున కమృతధారాప్రవాహములుగాఁ బరిగణింపఁబడఁగల వని నా నమ్మకము. ప్రజలు విద్యావంతులు గాకుండుటచే వేదార్థమును గ్రహించుట యసంభవము. మీఁదుమిక్కిలి స్వార్థపరాయణు లగు మహానుభావు లెవ్వరో యీ వేదములను ద్విజేతరులు పఠింపఁగూడ దని కొందఱును బ్రాహ్మణేతరులు పఠింపఁజూడ దని మఱికొందఱును బ్రాహ్మణేతరులే గాక బ్రాహ్మణస్త్రీలకుఁ గూడఁ బఠనార్హము కా దని మఱికొందఱును శాసించి వేదములను మఱుఁగుపఱచుటచే నట్టి బహిష్కరింపఁబడిన వారి కందఱికిని పురాణములే దిక్కయినవి. కావునఁ బురాణముల నుండియే కొన్ని గాథల నిందుఁ బొందుపఱచెదను.

(1) సర్వజనులచేఁ గొనియాడఁబడు రామాయణమహాపురాణమును విరచించిన వాల్మీకి మహాముని చండాలుఁడై దారిదోఁపుడుకాఁడై యుండెను. స్వశక్తి నాత్మజ్ఞానమును సంపాదించి చిరకాల మష్టకష్టముల కోర్చి తపశ్చరణ గావించి భగవత్కృపచే బ్రహ్మర్షియై యుత్కృష్టదశ ననుభవించెను.

(2) బ్రహ్మర్షులలో నగ్రగణ్యుఁడుగా నెంచఁబడిన వసిష్ఠమహాముని యరుంధతి యను చండాలవనిత నుద్వాహ మాడెను. అట్టి చండాల స్త్రీకిఁ బూజార్హ మయిన స్థానమును నభోమార్గమునఁ గల్పించిరి.

(3) చక్రవర్తి యగు విశ్వామిత్రుఁడు తన తపోబలమున బ్రహ్మర్షి యయ్యె.

(4) మొన్న మొన్న నొక చండాలుఁడు పన్నిద్దఱాళ్వారులలో నొకఁడయి వెలసి వైష్ణవభక్తాగ్రగణ్యు లందఱిచేఁ బూజింపఁబడుచుండెను.

మన పురాణములను ధర్మశాస్త్రములను విమర్శించినచోఁ దక్కువ కులమువారు స్వశక్తిని పెద్ద కులములయందుఁ జేరి రనియు దౌర్బల్యముచే నున్నతస్థానములనుండి పతితు లగువారును దెక్కురు గల రనియు స్పష్టమగును. ఇట్టి సమంజస మగు మన వర్ణాశ్రమధర్మములు మాఱిమాఱి తుద కిప్పటికి మనలను దురాచారములకు బానిసలనుగాఁ జేయునంతటి విపరీతస్థితిని బొందినవి. ఇప్పటి కులాచారధర్మములయందుఁ బ్రబలియుండిన దురాచారము లందఱికిని అనుక్షణ మనుభవమునకు వచ్చుచుండునవియే కావున నిచట విపులముగా వివరింపవలసిన పని లేదు. ఈ దురాచారములు మన సంఘమునఁ జేరి చెదపురుగులవలెఁ దొలుచుచుండుటయే గాక పాశ్చాత్యప్రభువు లందఱును మనల నారణ్యకులుగాఁ గూడ భావించునట్లు చేయుచున్నవి. దానికిని నైరింటి మన్నను ప్రస్తుతకాలమున నొక పెద్ద గండము గూడ నాసన్న మైనది. నూటయేఁబది సంవత్సరములనుండి యాంగ్లేయుల పరిపాలనము క్రింద దినదినాభివృద్ధి నందుటచే నిప్పటికి మన దేశమునఁ గూడ స్వరాజ్యము నపేక్షింపఁదగిన సమర్థుల మైతిమి. కావున స్వరాజ్యమును దయచేయుఁడని యాంగ్లసామ్రాజ్యమువారిని వేఁడుకొనుచుంటిమి. ఏ కారణముననైన నేమి మనలో బ్రాహ్మణు లెక్కుడు విద్యావంతులై యున్న మాట సత్యమే. ఈ సంగతిని బ్రాహ్మణేతరులు గ్రహియించి మన దేశమునకు స్వరాజ్యము లభించినయెడల బ్రాహ్మణపరిపాలనమే యగును కావున బ్రాహ్మణపరిపాలనముకంటె స్వరాజ్యము లేకుండుటయే యుచిత మనియుఁ జెప్పుచున్నారు.

మఱికొందఱు బ్రాహ్మణేతరులు స్వరాజ్యమే వలదనుట కంటె బ్రాహ్మణప్రాబల్యము నరికట్టి బ్రాహ్మణేతరులకుఁ గూడఁ బ్రత్యేకప్రాతినిధ్యము నేర్పఱచుకొని స్వరాజ్యముఁ బొందుట యుచితమని చెప్పుచున్నారు. స్వరాజ్యాపేక్షకు లందఱును నట్టి బ్రాహ్మణేతర ప్రత్యేకప్రాతినిధ్యమునకు సమ్మతించుచున్నారు. ఈ బ్రాహ్మణేతర ప్రాతినిధ్యముయొక్క స్వరూపస్వభావముల నిదమిత్థమని నిర్ధారణసేయుట కెవరికిని సాధ్యము కాకున్నయది. బుద్ధికుశలురు గల పెద్దలనేకవిధము లగు పద్ధతులను బత్రికలయందు సూచించియుండిరి. అందు బ్రాహ్మణేతరు లనునదే మనఁగా నూఱుమంది సభ్యులు గల సభలో జనసంఖ్యలఁ బట్టి విభజింపఁదలఁచినచో నైదుగురు బ్రాహ్మణసభ్యు లేర్పడుదురనియు పంచము లిట్టి సభలయం దాటితేటి పని సేయుట కింకను సమర్థులు కారు కావున వారి కొక యైదు స్థానములను మాత్రము వదలవలయు ననియు కాంగ్రెసువారిదివఱకే మహమ్మదీయులకు సుమారు పదునేను స్థానముల నేర్పఱచిరి గావున నవియుఁ బోఁగా మిగిలిన డెబ్బదియైదు స్థానములును బ్రాహ్మణేతరులే యాక్రమింపవలయు ననియుఁ జెప్పెదరు. ఆ బ్రాహ్మణేతరు లా స్థానములను వారియం దిమిడియున్న కులభేదముల కనుగుణముగఁ బంచుకొనరట. అట్లు పంచుకొనఁదలంచినను కేవల మసంభవము. మదరాసు రాజధానిలో మూఁడు వందల డెబ్బది కులములు గలవు కావునఁ గులమునకు నాల్గవ వంతు స్థానముగా నాక్రమించుకొనుట యసంభవము. కొన్నికొన్ని కులములవార నొక్కొక గుంపుగఁ జేర్చి యట్టి గుంపున కొక్కొక ప్రాతినిధ్యము నీయఁదలంచుటయు నన్యాయమే. ఏ రెండు కులములు నేకీభవింప నేరవు. కావున వారు చెప్పునదే యనఁగా, నీ డెబ్బదియైదు స్థానములను వ్యవసాయము వర్తకము విద్యాశాఖ మున్నగు విధముల బ్రాహ్మణేతరులయందే పంచుకొనెద మందురు. అట్లు జరుపఁదలంచినచో నొక్క బ్రాహ్మణులే నాశము చేసికొనినది. బ్రాహ్మణులతో సంబంధము వచ్చినప్పుడు కులభేదములఁ గల్పించుట, బ్రాహ్మణులతో సంబంధము వదలిన తోడనె మిగిలినవారికిఁ గులభేదము లేకుండఁజేయుట యింతకంటె వైపరీత్యము గలదా! ఒక్క బ్రాహ్మణులకుఁ దప్ప మిగిలిన వారందఱికిని కులభేదములవలనఁ గలిగెడి వైషమ్యము లేక యైకమత్యమును సంఘీభావమును గలుగునెడల బ్రాహ్మణులు మాత్రము వైషమ్యములను బోఁగొట్టుకొనఁజాలరా! వారు చెప్పెడి పద్ధతిని జేసెడిచో బ్రాహ్మణేతరసంఘములలో విద్యాభివృద్ధిని గాంచిన నాయఁడులు మొదలియారులు చెట్టియారులు మున్నగు నే స్వల్పజాతులవారో మిగిలిన ముప్పదిస్థానముల సభ్యస్థానముల నాక్రమించుట తేటపడుచున్నది. కావున నట్టి యేర్పాటు మిగిలిన జాతులవారి కసంతృప్తిని గలిగింపక మానదు. అట్టి యసంతృప్తి యెన్నఁటికైన ననర్థదాయకము కాక మానదు. స్వరాజ్యమునందుఁ జేయునది రాజకీయవ్యాపారము గాని మతవిషయికము గాదు. మతవిషయములం దాధిక్యులయినవా రందఱట్టి రాజకీయపరిషత్స్థానము నాక్రమించినచోఁ గోతుల భాగవతము వలె నుండుటయు నరాజక మగుటయు సంభవించును. దేశాభివృద్ధికై పాటుపడువారికి మతవిషయికము లంతగాఁ బాటికి రావు. కావున నట్టి రాజకీయవ్యవహారదక్షు లగు దేశభక్తులను బరిషత్స్థానములకుఁ జేర్పఁదగిన విధము లభించిననే స్వరాజ్యమున కపేక్షింపవలయును. లేనియెడల మౌనభావము నవలంబించి యుపరి వృత్తిని వారు నెఱవేర్చుకొనుటయే యుక్తము. అట్టి యైకమత్యము కావలయు ననినచో నిప్పుడు మన దేశమునఁ బ్రచారమునందుఁ గల దురాచారభూయిష్ఠము లగు వర్ణాశ్రమధర్మము లడుగంటి యుపనిషత్సూక్తములు ప్రపంచమునం దెల్లెడల ఖ్యాతిని గాంచిన మన పూర్వు లవలంబించిననియు నీ వ్యాసమునం దిదివఱకుఁ జర్చింపఁబడినట్టియు వర్ణదేశభేదములతో నిమిత్తము లేక సమస్తమానవులచే నాదరింపఁబడఁదగినట్టియు వర్ణాశ్రమధర్మములు తిరిగి మన దేశమునందుఁ బ్రవర్తిల్లవలయును. అప్పుడే మనకు స్వరాజ్యము లభించును; అప్పుడే వ్యాసవాల్మీకిపరాశరాది మహాత్ముల నాఁటి యౌన్నత్యము లభించును; అప్పుడే షట్చక్రవర్తుల పరిపాలనమును మించిన ప్రజాపరిపాలనము కలిగి హిందూరాజ్యము రామరాజ్య మనిపించుకొని సమస్తదేశములయందును బ్రఖ్యాతిని గాంచును. కావున నీ విషయముల నందఱుఁ జక్కఁగ విమర్శించి భగవద్దత్తము లగు వర్ణాశ్రమధర్మముల నవలంబింప నుద్యుక్తులు కావలయు నని ప్రార్థించుచున్నాఁడను.

# సంతోష మెందుఁ గలదు?

తొటికొండ తిమ్మారెడ్డి దేశాయి గారు

ప్రపంచములో జనులు 'సంతోషము సంతోషము' అని యంగురే గాని యెందుఁ జూచిన నది జగానఁ గానరాదు. షడ్రసోపేత మగు భక్ష్యభోజ్యముల నేమి అమూల్య మణిమయాభరణములం దేమి దివ్యసుందరమందిరముల నేమి అగణితధనాగారములం దేమి సార్వభౌమపదవియం దేమి మహోన్నతపట్టణాదుల వలన నేమి సుందరారామములం దేమి గంగాదిమహాపుణ్యనదీజలమున నేమి విహారార్హసుందరతరసరోవరాదులం దేమి చిత్రవిచిత్రరూపపటములం దేమి మాతాపితరుల కనికరమున నేమి భార్యాభర్తల యపూర్వానురాగమున నేమి చెలుల నెయ్యమున నేమి బహువిధసుందరవాహనాదులం దేమి దివ్యలలామాల్యాంబరాదులం దేమి విద్యావినయాదిసుగుణములవలన నేమి ధైర్యశౌర్యబలపరాక్రమాదులం దేమి దానధర్మాద్యనేకసత్కార్యములలో నేమి ఇంచుకయు సంతోష మగపడదు. ఇఁక సంతోష మనున దెచ్చోట నున్నది? ప్రపంచములో సంతోష మను వస్తువు లే దనియే యర్థమా? కాదు, కాదు. ఒకచో నైన నట్లనఁ జనదు. బాగుగ పరసి చూచినచో సంతోషము మనుష్యుని నలుదిక్కుల నావరించియే యున్నది. సంతసము మనుష్యున కత్యంతసామీప్యమున నున్న దని తలంపవలయును. అనఁగా నది మనుష్యునియందే యున్నది. శాశ్వతసంతోషము తనలో నుండుట యెఱుఁగనివాఁడు కలలో నైన సంతస మొందఁజాలఁడు. ప్రపంచములోని ప్రతిబాహ్యవస్తువు నెట్టు లున్నను మనుష్యుఁడు దానిని తన యంతరాభిప్రాయము చొప్పున నే తలంచును. అనఁగా ఖేదమోదములకు ముఖ్యకారణము మనుష్యుని యాంతరంగికాభిప్రాయమే! బాహ్యవస్తుసముదాయ మంతయు మనుష్యుని భావాదులను మనుష్యుని తలంపులయొక్క ఛాయాపటము లని యెంచవలయును. మన యంతరాభిప్రాయ మొక దర్పణము. ఆ దర్పణములోఁ గన్పట్టు ఛాయయే ప్రపంచపు బాహ్యవస్తుజాతము.

ప్రపంచ మనఁగా నేమి? అది మనుష్యునియొక్క తలంపే! మన తలంపుల ప్రకారము మనకుఁ బ్రపంచ మగపడును. మన భావముల కనుగుణముగ నే ప్రాపంచిక ఖేదమోదములును క్షేమసౌఖ్యాదులును గన్పట్టుచుండును. మన మనస్సులో బహువిధాభిప్రాయము లిమిడి దాఁగియుండును. వానిని బయలుపఱచుటకు ఇంద్రియవర్గసహిత మగు మన దేహ మొక యంత్ర మనఁదగును. సంతోషముతో నున్న మనుష్యుని మనము కనిన నతని యంతర్భావము సైతము సంతోషపూరితమై యున్న దని మన మెఱుంగఁదగును. అనఁగా నొకని బాహ్యస్థితి మన కెట్లు గగపడునో వాని యంతస్స్థితియు నట్లుగ నే యున్న దని యెఱుంగనగును. మనుష్యుని బాహ్యస్థితి యెట్టి దైన్యదుఃఖభాజనముగ నున్నను వాని యంతర్భావాదులు పవిత్రోత్సాహపూరితములై యున్నచో వాని దుస్స్థితు లెల్ల వానికి సంతోషకరములుగ నే యగపడును. తన కగపడెడి బాహ్యక్లేశాదులకు ఆ మనుష్యుఁడు కొంచెమైన దుఃఖింపఁజాలఁడు. మన మనస్సు సంతోషములో లీనమై యున్నపుడు మన దుఃఖాదు లన్నియు మనకు సంతోషములుగ మాఱి యగపడును. కనుక, ఖేదమోదాదులు మనలోనే యున్నవి. అంతే గాక యవి నిజముగాఁ బ్రత్యేకముగ నుండవు. దైవిక మగు నతివృష్టిచే నొక కర్షకుని చేను చెడినచో నక్కర్షకుఁడు గడచిన కార్యమునకుఁ జింతింపక మునుపటికన్న నెక్కుడు శ్రద్ధతో మునుపటికన్న రెట్టింపు ధాన్యముం బండించెద నని దృఢమానసుఁడై యుండు నేని అతని నష్ట మతనికి దుఃఖమువలెఁ గాన్పింపనేరదు. అట్లు గాక వాని మనసునఁ జింత వొడమునేని యా నష్టము వానిని గడు చింతలోఁ ద్రోయును. లోకమునఁ గొన్ని సంగతులు లోకుల మరణమునకు సైతము కారణము లైనట్లు పెక్కు నిదర్శనములు గలవు. అట్టి సంగతులే కొందఱి సంతోషమునకుఁ గారణము లైనట్లు సైతము దృష్టాంతములు గలవు. అనఁగా, అనేకులు కాలవశమునఁ దమ భార్యాపుత్రాదులు గతించుటం గని నిర్భర వియోగసంతప్తమానసులై యాత్మహత్య నొనర్చుకొనినట్లు కని విని యున్నాము. కొందఱట్టి వియోగముచేఁ దమ బంధము లుడిగె నని యెంచి పరమహర్షభరితహృదయులై నిత్యసంతోషముచే భగవద్ధ్యానసంధాను లైనట్లు నిదర్శనములు పెక్కులు గలవు. కాని, సంతోషమును గోరిన మానవునకు ఆశను వదలుట యత్యవశ్యము. అట్లు కానిచోఁ గోటీశ్వరుఁ డైనను దనకన్న మించిన సంపన్నునిం గని తన్ను దరిద్రునిఁగ నెంచుకొని సదా చింతిలును. ఆశను గోసినవారికి సంతృప్తిజనక మగు నిర్మలనిత్యసంతోష మబ్బుటయే గాక వానికిఁ గలిమిలేములు సమము లగును. ఆశ లుడిగినవాఁడు దేవసముఁ డని వచించుట యనుచితము కాదు. ఆశ లేనివాఁడు నిత్యానందుఁడు. ఆనందరూపమే పరమాత్మ.

భక్తివిరక్త్యాదిసుగుణసంపన్నుఁ డగు నొక విరాగికడ కొక రాజు వచ్చెను. ఆ సాధుసత్తముఁడు ఆశారహితుఁ డగుటచే నా రాజన్యునకు వందనము లాచరింపక కేవలభక్తిభావమున మగ్నుఁడై యుండెను. రాజందునకుఁ గుపితుఁడై నా కందఱు నమస్కారము లొనర్చుచుండ నీవు కన్నెత్తి యైనఁ జూడక యింత నిర్లక్ష్యభావము నూనుటకుఁ గత మెయ్యది యని బిగ్గరఁ బల్కెను. 'నీవు నాకుఁ బ్రభువవు కావు. నీవు నా సేవకుల సేవకుఁడ వగుటచే నాకు నీవే నమస్కరించుట కర్హుఁడవు. ఆశ కోరిక యను నిరువురు సేవకులు నాకుఁ

గలరు. నీ వా రెంటికిని దాసుఁడవు.' అని సాధుపుంగవుఁడు పలికెను. కొన్నాళ్లకు మరల నా రాజా విరాగికడ కేఁగి 'నీ కోర్కె నెఱవేర్పఁ దలఁచి యే తెంచినాఁడను. వలసినదానిం గోరుము.' అని నుడివెను. 'నిజముగ నీ వట్లు తలంచినచో నీవు మరింకఁక నీలాటి శ్రమ నా కొసఁగకుము' అని వైరాగి పలికెను.

ఏమి కాలమో గాని ప్రతిమనుష్యునకుఁ బ్రతివిషయములో సంతోషోత్సాహాదులు గన్పట్టనే కన్పట్ట వని పలువురు పల్కెదరు. కాని, ఈ యభిప్రాయము కల్ల. ప్రపంచములోఁ బ్రతివస్తువును బ్రతి విషయమును సంతోషాస్పద మైనదియే. సృష్టికర్త యగు నీశ్వరుని సదుద్దేశము సకలజీవకోటికిని సంతస మొనఁగూర్చుటయే గాని శ్రమ నొసఁగుట కాదు. సాక్షాత్పరమాత్మవలెనే సంతోషమునకు రూపము లేదు. ఆ పరబ్రహ్మమువలెనే సంతోషము సర్వము వ్యాపించి యుండును; మనుష్యుఁడు నిర్మలమానసముతో నెచటఁ జూచిన నచట నుండును. అట్టి సంతోషమును బడయకపోవుట మన యపరాధమే గాని వేఱొండు గాదు. సంతోషభవనమునకుఁ బవిత్రేచ్ఛ పవిత్ర కర్మము అని రెండు సోపానములు గలవు. ఈ రెంటివలన మనుజుఁడు ఆ భవనముఁ జేరును. ఈ రెండు నధిగమింపఁగలవానికి ఆశ కోపము అసూయ స్వార్థపరాయణత మున్నగునవి నశ్యగును. ఆశను దెగ నాడినవానికిఁ గోపతాపాదు లలవడవు. అట్టి నిత్యసంతోషికి అసూయ యెక్కడిది? ద్రవ్య మెందునకు? అట్టివానికి ఏ కోరికయు నుండదు. -వానికి దొంగయం దైనను గినుక వుట్టదు. కోరికచే నెక్కు చెడుగులు చేకూఁగును. కోరికవల్లనే కోపము వృద్ధమును. అనఁగా సంభోగేచ్ఛ లేనివానికి జారిణిపైఁ గాని జారునియెడఁ గాని యించుకయుఁ గ్రోధ ముండనేరదు. తాఁ గోరిన వస్తువు నన్యుఁడు గైకొనియె నేని ఆగ్రహ ము పుట్టును. కోరికయు ఆశయు లేనివాఁడు ప్రపంచము నెల్లఁ దన వలె నెంచును. మనుష్యుని సంతోషమునకు ముఖ్య మైన కారణము మనసే! అట్లు లేనిచోఁ బూరిండ్లలో నఱకడుపునకుఁ దిని నివసించెడి నిఱుపేదలు యదృచ్ఛాలాభ సంతుష్టిచే సంతతసంతోషభరితులై యుండకపోరు. అకాంబద్ధులు దివ్యమందిరములలో మృష్టాన్నముల భుజి యించుచు కూడ సంతత ఖేదమానసులై యుందురు. సముద్రపుటడుగునఁ గొన్ని గూఢ మైన చోటు లుండును. ఆ చోట్లకు బల మైన యలలు గాని క్రూరజంతువులు గాని ఘోర మైన వెల్లువలు గాని ప్రవేశించుట కెట్లు వీ లుండదో ఆ చొప్పుననె మనుష్యుని మనసు లోఁ గల పవిత్ర మైన యేకాంతస్థలమున ఖేదపాపాదులు ప్రవేశింపఁజాలవు. మనుష్యుఁ డట్టి గూఢస్థలమునఁ జేరి నివసించుటచే నతనికి శాశ్వతసంతోష మబ్బును.

కనుక, మనము బాహ్యవస్తువులను ఇంద్రియసుఖాదులను ప్రాపంచికవిషయాదులను అంటక వైను దాహరించిన మనసులోపలి యరలోఁ బ్రవేశింపవలయును. ఆ స్థలము నిశ్శబ్దముగను నిర్మలముగను నిరుపద్రవముగను నిశ్చింతముగను నుండును. ఆ చోటున మన కెచటఁ జూచిన నచట సంతోషమయముగఁ గన్పట్టును. మన మట్టి గూఢపు టేకాంత స్థలములో నేకచిత్తతతోఁ బరికించినచో మన జ్ఞానచక్షువునకు మన లో నున్న సచ్చిదానందస్వరూప మగు పరమాత్మ గన్పట్టును. అపుడే మనము బంధవిముక్తుల మయ్యెదము.

# నాట్యసుందరి

బసవరాజు అప్పారావు గారు, బి. ఏ.

ఆడవె ఆడవె
        అన్నులమిన్నా,
ఆడవె లేనడు
వల్లలనాడక
ఆ డెడు నీ నడుమందము గాంచిన
అల్లాడవె ప్రేమను లోకంబుల్?
        ఆడవె ఆడవె
        అన్నులమిన్నా.
1
పాడవె పాడవె
భామామణిరో,
పాటలాధరము
భాగులు గుల్కఁగ

వలపుఁ జిల్కు నీ పాటల విన్నఁక
పగవళే గాదే ప్రకృతి యెల్లఁక?
        పాడవె పాడవె
        భామామణిరో!
చూడవె చూడవె
సుందరవదనా,
సోగకన్నులను
సోలఁగ ప్రేమను
సొంపు లొల్కు నిన్ జూచినంతనే
మొక్కలు సైతము సోలవె ప్రేమన్?
        చూడవె చూడవె
        సుందరవదనా.

# ఆంధ్రమాతృహితోపదేశము

గొల్లపల్లి సామల్ నాయకర్ గారు

ఉ. ఆనందించితి నెంతయో మనములో నాంధ్రోద్యమం బెన్నుచుం
డానం జేసిరొ కొంత ధైర్యపడ నా దౌర్భాగ్యమో నాపుగన్
నానాటన్ మరి నాదు పుత్రకులలో నైక్యంబు లేమిం గనన్
దీనావస్థను బొందనైతి నిఁక నా గిక్కెవ్వరై యుందురో ? 1

తే. గడ్డిపరకలు నైతంబు బిడ్డలార !
పెంటిగా నైన పిదపఁ గావించు పనులు
మీ రెఱుంగరుస్నారె ? గంభీర మైన
ద్విరదమును నైత మదియు బంధించుఁ గాదె ? 2

సీ. మార్జాలములు కయ్యమాడుటఁ గనుఁగొని
జున్ను గద్దను గోఁతి చూఱగొనదె ?
ఒక్క వృద్ధుని పుత్రు లొండొరుల్ తగవాడి
పగుల హోరనలకుఁ బాలుపడరె ?
స్నేహభావము చెడి చెదరి గోవుల మంద
వైరి యౌ సింహంబు వాతఁ బడదె ?
భారతరాజ్యంబు పోరాటములచే వి
దేశియు లేలెదు దేశ మయ్యె ;
నీతు లన్నియు నెఱిఁగి యీ రీతి మీరు
సంఘబలమును జెఱచు ప్రసక్తిఁ గలిగి
బ్రాహ్మణాబ్రాహ్మణేతరుల్ పట్లు పట్ట
న్యాయమా యిట్టి తతిని ? నో యాంధ్రులార ! 3

తే. ఐక్యబలమునఁ గాని కార్యంబు గలదె ?
ఐక్యమున కసాధ్య మిల నేదైనఁ గలదె ?
ఏకమత్యంబె లేనిచో నమెరికా స్వ
తంత్రతను గొందునే ? రాజ్యతంత్రులార ! 4

సీ. బ్రాహ్మసామాజికుల్ పంచమాదులతోడ
సహపంక్తిఁ గూర్చుండు సమయమందు
బ్రాహ్మణేతరులకు బ్రాహ్మణస్త్రీలు
వేడ్క విందులు చేయు వేళలందు
ఆర్యసామాజికు లల క్రీస్తువుల నెల్లఁ
దగ గౌరవించెడు తరుణమందు
హైందవోత్తములు మహమ్మదీయులతోడ
ఫలహారములు చేయు పట్టులందు
జాతిమతవిపక్షుల నెల్ల జాఱవిడిచి
భేదభావంబులను నొక్క పెడకుఁ ద్రోసి
మెలఁగుటను మాని నా సుతుల్ వేఱఁగు లగుచు
నైకమత్యంబు విడనాడి రక్కటకట ! 5

సీ. ఆంధ్ర రాష్ట్రం బని ఘూర్భటించినఁ గాదు
ఆంధ్ర దేశీయు లైక్యంబుతోడ
ఆంధ్రోద్యమం బని యఱచినంతనె కాదు
తెలుఁగువారు తదేకదీక్షతోడ
ఆంధ్రుల విశ్వవిద్యాలయం బనఁ గాదు
తెనుఁగు జనము లేకదృష్టితోడ
స్వారాజ్య మని సదా కోరుటే కాదు త్రి
లింగదేశజులు నిరీక్షతోడ
ఆంధ్రు లాబాలగోపాల మనవరతము
కష్టపడవలెఁ గన్నులఁ గాంచువఱకు
పనికి మాలిన భిన్నభావములు మాని
కార్యశూరు లౌచు వివేకధుర్యులగుచు.

సీ. సంఘస్థితిని మీరు చక్కఁ జేయుటె గాక
స్వార్థపరత్వంబు చంపవలయు
సర్వభ్రాతృత్వంబు చాటించుటే గాక
ప్రజలయెడలఁ గనంబఱుపవలయు
సర్వజనంబుల సమకూర్చుటే గాక
భాగకాదర్శంబు మప్పవలయు
వ్యాసంబులును నుపన్యాసంబులే గాక
కార్యంబులను జేయఁగడఁగవలయు
నిందలను సదా యోర్చి సహింపవలయు
పరమతంబులయెడ నీర్ష్యపడఁగఁబోక
ప్రజల కెల్ల జాతీయభావంబు గఱపి
పుడమి వర్ధిల్లఁ బూనుఁడీ పుత్రులార !

సీ. కాకతీయప్రభు చాకచక్యముఁ గాంచి
యానంద మందని యార్యు లుంద్రె ?
చాళుక్యరాజుల సామ్రాజ్యముఁ దలంచి
మగవతుల్ గానట్టివార లుంద్రె ?
విజయనగరరాజ్యవిభవంబుఁ దలపోసి
కన్నీరు గార్చని కఠిను లుంద్రె ?
బొబ్బిలి వెలమల భుజపరాక్రమ మెంచి
ఘనము లుప్పొంగని పురుషు లుంద్రె ?
రెడ్డి పౌరుషము గనియు దిక్కు లగుచు
ఖడ్గములఁ జేతఁ బూనని కలుషు లుంద్రె !
కృష్ణరాయశివాజీల కీర్తిఁ గాంచి
యబ్బురముపడ నొల్లని యధము లుంద్రె ?

సీ. వితరణమూర్తియై విత్తము వెదఁజల్లు
పిఠాపురనేత వెలయుచుండ
దేశోద్ధరణకునై తిపురు కొండా వేంక
టప్పయ్య పంతులే యుండ నుండ
నాయకశ్రేష్ఠుండు న్యాపతి సుబ్రావు
పంతులు నాంధ్రుఁడై చెంత నుండ
ఉత్సాహమే గాక యుద్రేకమును రేప
నాంధ్రపత్రిక యదే యలరుచుండ
తక్కు విషయములకు తక్కిన నాయకుల్
పెక్కు రుండ మీరు బెగడనేల ?
ఎల్ల జాతిశాఖ లేకమై పనిఁ జేయఁ
బొందలేర యాంధ్రభూమి నేఁడె ?

# ఆరోగ్యధనము—దాని నార్జించు విధము

నందగిరి త్ర్యంబకరావు గారు

మన దేహ మొక యంత్రమును బోలియున్నది. యంత్రమును నడపుటకు వివిధము లగు చక్రములు విండ్లు మొదలగునవి ఎట్లు నిర్మింపఁబడియున్నవో అట్లే దేహయంత్రమును నడుపుటకు శ్వాసకోశము హృదయకోశము మొదలగు అంతరవయవములు నిర్మింపఁబడియున్నవి. యంత్రసాధనము లగు చక్రములు మొదలగునవి చెడక వాని పని నవి నెఱవేర్ప సమర్థములై యున్నప్పుడు యంత్ర మెంత చక్కఁగా నడచునో అట్లే దేహయంత్రసాధనము లగు శ్వాసకోశము మొదలగునవి ఏ విధమైన యపాయమును జెందక వానికి నిర్ణయింపఁబడిన పనిని నెఱవేర్ప సమర్థములై యున్నప్పుడు దేహయంత్రమున కేవిధ మగు హానియు కలుగక అది చక్కని స్థితిలో నుండును. ఈ విషయము క్రింద విచారింపఁబడును.

మన శరీరములో హృదయవిభాగము గర్భవిభాగము అను రెండు గొప్ప భాగములు కలవు. హృదయవిభాగమందు హృదయము (గుండె) శ్వాసకోశము అను రెండంగములును గర్భవిభాగమందు అన్నకోశము పైత్యకోశము ప్రేగులు మూత్రపిండములు మూత్రాశయము మొదలగు నంగములును గలవు. మఱియు ననేక విధము లగు నెముకలు నాడులు కండరములు మొదలగునవి దేహమందమర్పఁబడియున్నవి. పై యంగములలో కొన్ని రక్తమును శుభ్రపఱచుటకు వాయువును ఆఘ్రాణించెడు శ్వాససాధనములు. కొన్ని భోజనపదార్థములను జీర్ణింపఁజేయు జీర్ణసాధనములు. కొన్ని భోజనమువలన రక్తమును కలుగఁజేసి దానిని శరీరమందంతటను ప్రసరింపఁజేయు రక్తసాధనములు. మఱికొన్ని శరీరమందలి మాలిన్యములను తొలఁగించెడు బహిష్కారసాధనములు.

1. శ్వాసకోశము.—లోపలికి పీల్పఁబడిన పరిశుద్ధవాయువుచేత రక్తమును శోధించి అందలి మాలిన్యములను నిశ్వాసరూపమున బహిష్కరించును. ఇది రక్తమును శుభ్రపఱచు ముఖ్యాంగము.
2. హృదయము.—శరీరభాగములనుండి తన కుడి ప్రక్కకుఁ జేరిన చెడు రక్తమును శ్వాసకోశములలోనికి పంపును. అక్కడ బాగుపడి తిరిగి తన యెడమ ప్రక్కకుఁ జేరిన మంచి రక్తమును శరీరభాగములకు పంపును. ఇది రక్తప్రసరణమునకు సాధన మైన ముఖ్యాంశము.
3. అన్నకోశము.—
4. పైత్యకోశము.—
5. ప్రేగులు.—

(3–5) ఆహారమును జీర్ణము చేసి శరీరపోషణమున కుపయోగపడునట్లు చేయును. ఇవి జీర్ణసాధనములు

6. మూత్రపిండములు.—కలుషరక్తమును వడియఁగట్టి యందలి కాలుష్యమును మూత్రరూపమున మూత్రాశయములోనికి పంపును. బహిష్కారసాధనములు.
7. మూత్రాశయము.—మూత్రరూపమున తనలోనికి వచ్చిన కాలుష్యమును బయటికి వెడలఁజేయును. బహిష్కారసాధనము.

ఇట్లు ఒక్కొక్క యంగ మొక్కొక్క విధ మగు పనిని చేయును. ఈ యంగము లన్నియు తమతమ పనులను సమగ్రముగాను శ్రమ లేకుండను స్వాభావికముగను చేయుటకు శక్తివంతము లై యుండవలెను. ఈ ధర్మములు చక్కఁగా నెఱవేఱుచున్నంతకాలము దేహయంత్రమున కే విధ మగు హానియుఁ గలుగనేరదు. అప్పు డాహారము క్రమముగా జీర్ణ మగుచు శరీరపోషకద్రవ్యము లుత్పత్తి యగుచుండును. ఉచ్ఛ్వాసనిశ్వాసములు చక్కఁగా జరుగుచు మలినరక్తము శుద్ధరక్త మగుచుండును. శుద్ధరక్తము శరీరమందంతటను చక్కఁగా ప్రసరించుచు పుష్టి కాంతి కలుగుచుండును. శరీరమునుండి బహిష్కరింపఁబడవలసిన మాలిన్యము లన్నియు స్వాభావికమార్గముల గుండ క్రమముగ బహిష్కరింపఁబడును. ఏ విధ మగు బాధయు కలుగక సుఖముగా నుండును. అట్టి లోపమున రోగములు కలుగఁజాలవు. ఇట్టి స్థితినే యారోగ్యస్థితి యని చెప్పవచ్చును. ఈ సుఖమునకే యారోగ్యధన మని పేరు.

పైని వివరించిన దేహయంత్రసాధనములు (అంతరవయవములు) చెడిపోయి వానియందలి శక్తి నశించినప్పుడు శ్వాసకర్మము రక్తప్రసరణము జీర్ణకర్మము మొదలగు వ్యాపారములు చక్కఁగా జరుగనేరవు. అప్పుడు శరీరమున కుపద్రవము కలుగును. దీనినే రోగ మని పేరు.

ఈ వ్యాపారములు చక్కఁగా జరుగుచున్నవాని కపారమైన సుఖము కలుగును. వాఁడే యారోగ్యవంతుఁడు. వాఁడే పుణ్యపురుషుఁడు. వాఁడే కృతార్థుఁడు. ఏ మనఁగ ఆరోగ్యవంతుఁడు సమస్తభోగభాగ్యముల ననుభవించును. తనకుఁ గల ధనధాన్యములయొక్కయు గృహారామక్షేత్రవాహనాదులయొక్కయు ప్రతిఫల మనుభవించును. స్వచ్ఛందవనితాదిభోగంబు లందును; దేహమనోబలమును ధైర్యసాహసములను సంతోషాతిశయములను కలిగి సుఖముగా నుండును. వేయేల? ఆరోగ్యవంతుఁడు స్వర్గోపమాన మగు భూలోకసౌఖ్యమంతయు ననుభవించును. ఆరోగ్యవంతుఁడే విద్యావంతుఁ డగుట కర్హుఁడు. ఆరోగ్యవంతుఁడే సంఘాభివృద్ధికిని దేశోన్నతికిని పాటుపడ శక్తి గలవాఁడు.

మఱియు నారోగ్యవంతుఁడు కేవల మైహికలాభమునే గాక పరమార్థలాభమును గూడ పొందఁగలఁడు. ఆరోగ్యవంతునకుఁ గాని శారీరకాత్మికధీబలంబులు కలుగఁజాలవు. ఆత్మికధీబలముల సాధించుటకు దేహబల మావశ్యకము. దేహబలము గలవాఁడు విజ్ఞానాభివృద్ధి చేసికొనఁగలఁడు. విజ్ఞానమువలన పారమార్థికవిషయచింతన మధిక మగును. దానివలన వాఁడు సత్కర్మమును చక్కఁగా ననుష్ఠించును. సత్కార్యాచరణమువలన నాముష్మికసుఖంబులు కలుగును.

ఆరోగ్యహీనుఁ డిహలోకసౌఖ్యమును గాని పరలోకసౌఖ్యమును గాని యనుభవింపఁజాలఁడు. ఏ మనఁగ శరీరము రోగగ్రస్తమై యున్నప్పుడు పక్వాన్నఘృతక్షీరాదిభోజనపదార్థములు రుచింపవు. పట్టుపాన్పులయందు శయనించినను కంటికి నిదుర రాదు. అట్టి

మోహజాలములోఁ జిక్కక తన మనస్సును స్వాధీనమునం దుంచుకొనఁగలిగెను. అశోకవృక్షచ్ఛాయను ఘోరరాక్షసస్త్రీల నడుమనుండి దుఃఖించుచున్న జానకిని కనుఁగొని యామెతో మధురముగా మాటలాడి యామె నోదార్చెను. పిదప లంకావనమును ధ్వంస మొనర్చి యక్షకుమారాదియోధవరుల నోటుపఱచి సర్పాస్త్రబంధమున నగపడిన శత్రుగృహమును జొచ్చి మహోత్సాహుఁడగు రావణునితో హితుండై యుక్తియుక్తముగా సంభాషణ సలిపెను. అప్పటి కలిగిన చిక్కులను త్రెంచుకొని యనుపమానసాహసముతో లంకను గాల్చెను. అసహాయుండై బలిష్ఠు లగు క్రూరరాక్షసుల నడుమ ధైర్యముతో నిలిచి యుద్ధ మొనర్చి శత్రుసామర్థ్యపరిమితిని దెలిసికొనెను. తిరిగి గోష్పదప్రాయముగ సముద్రోల్లంఘన మొనర్చి సురక్షితముగా రాముని యొద్దఁ జేరి జనకజాత క్షేమవార్త నెఱింగించెను. ఘోరసంగ్రామరంగమున లక్ష్మణుఁడు మూర్ఛ చెందఁగా నతనికి బహుదూరమున నుండు సంజీవిపర్వతము ననాయాసముగ నొక్క రాత్రి కాలమున తేఁగలిగెను. అప్పుడు మార్గమధ్యమున కపటవేషధారు లగు ఘోరరాక్షసులతోడను ప్రతాపధురంధరు లగు గంధర్వాదులతోడను ప్రబలయుద్ధం బొనర్చి వారి నోడించి తాను పూనిన కార్యమును నిర్విఘ్నముగా నెఱవేర్చి లక్ష్మణుని పునర్జీవితునిఁ గావించెను. ఈ మహానుభావుఁడు సీత నరసి రమ్మనఁగా నామెను జూచి వచ్చుటయే గాక లంకను గాల్చి వచ్చెను. సంజీవని యను మూలికను దెమ్మనఁగా నా మూలికతో నున్న పర్వతమునే పెఱికి తెచ్చెను.

ఆహా! ఏమి? చూచితిరా! ఈ హనుమంతుని కిట్టి యద్భుతపరాక్రమసమర్థత్వము లోనగు శక్తి యెట్లు కలిగెను? ఎద్దాని మహిమవలన చేకూఱెను? ఇవి యన్నియు నీ బుద్ధిశాలుఁ డొనర్చిన నైష్ఠికబ్రహ్మచర్య ప్రభావములనఁ గాదె?

ప్రస్తుతకాలమున నరులు సర్వసమర్థ మగు నిట్టి వ్రతనిష్ఠను పూర్తిగా వదలి మోహజాలములోఁ జిక్కి స్వేచ్ఛావర్తన మొనర్చి దుర్గుణములకు పాల్పడి సుగుణసంపత్తిని గోల్పోవుచున్నారు. ఈ కారణముచేతనే మన దేశమున నెక్కడఁ జూచినను రోగపీడితులు హీనవీర్యులు నిస్తేజులును గాన్పించుచున్నారు. ఇట్లనినప్పు డాంజనేయాదులవలె స్త్రీపురుషు లందఱును తమ జీవితకాలము నంతట నస్ఖలితబ్రహ్మచర్యవ్రతముతో గడుపవలయు నని చెప్పుచున్నట్లు భావింపవలదు. అట్లాచరించిన సంతానవృద్ధి యెట్లగును? ప్రపంచోత్పత్తి యాగుట యెట్లు? అట్లాచరించుటయు నసాధ్యమే. కావున సామాన్యముగ పురుషులకు 25 సంవత్సరములవఱకును స్త్రీలు 16 సంవత్సరముల వయస్సు వచ్చువఱకును బ్రహ్మచర్యవ్రత మాచరించి వీర్యసంరక్షణము చేయవలయును. అటుపిమ్మట భార్యాభర్తలు మితసంభోగాదులను జరుపుచు సద్వర్తన గలిగియుండవలయును. సంభోగేచ్ఛ సంతానవృద్ధికై కావలెను గాని కేవల కామోపభోగమునకు కాఁగూడదు. కామాతురులై యమితసంభోగాదులను జరిపినయెడల నారోగ్యహీనులై నానారోగములచే పీడింపఁబడి మృత్యువు నోటఁ బడుదురు. కావున స్త్రీపురుషు లందఱును సంగమేచ్ఛను రీతిమర్యాదలోనికి తగ్గించి శరీరమును క్రమ మగు స్థితిలో నుంచుకొని ప్రవర్తింపవలయును. ఇంద్రియనిగ్రహమువలన చిత్తస్థైర్యము ధైర్యము మేధాప్రజ్ఞ ధర్మచింత సత్యప్రవర్తనము పరశ్రేయస్సహనము కలుగును.

ఇట్లు పైని వివరించిన శరీరరక్షణసాధనములను గమనించి స్వాభావిక మార్గమున ప్రవర్తించినయెడల నారోగ్యధనము చేకూఱును.

ఈ దేశమున ముఖ్యముగా నారోగ్యభంగకర మగు కార్యము నొకదానిని బుద్ధిపూర్వకముగా చేసి దేశస్వాస్థ్యమును చెడఁగొట్టుచున్నారు. అది దంపతులకు బాల్యదశయందే గర్భాధానకార్యమును చేయుట. ఇందువలన దేశస్థులకును దేశసంతతికిని లెక్కలేని యిక్కట్టులు కలుగుచున్నవి. ఎక్కడఁ జూచినను అపత్కరము లగు ప్రసవములు గర్భస్రావములు అకాలప్రసవములు కలుగుచున్నవి. దినములు కొలఁది ప్రసవవేదన ననుభవించుటయు పిమ్మట కృత్రిమప్రకారముచేతఁ గాని ప్రసవము జరుగకపోవుటయు సంభవించుచున్నది. కొన్ని స్థలములయందు బలవంతముగా శిశువును వెలికి తీయుటవలన తల్లియు పిల్లయు గతించుటయు నుఱికొన్ని స్థలములయందు ప్రసవ మెట్లో కష్టముమీఁద జరిగినను తల్లులు సూతికజ్వరము అధికరసోద్గమనము రసోద్గమనాభావము లోనగు నెక్కువ్యాధులకు పాల్పడుటయు శక్తి యుడిగి సౌందర్య మడుగంటి రూపవిహీన లగుటయు తటస్థ మగుచున్నది. ఇట్టి దురవస్థ యంతయు బాల్యదశయందు గర్భాధానము చేసి అప్పుడు గర్భధారణమున కెడమిచ్చుటచేతను గర్భిణులుగా నుండునప్పు డారోగ్యవిధుల నతిక్రమించి ప్రవర్తించుటచేతను కలుగుచున్నది. యుక్తకాలమున గర్భాధానకార్య మొనర్చుకొని యారోగ్యవిధుల ననుసరించి ప్రవర్తించుచు స్వేచ్ఛావిహారులై పాటుపడుచు నుండెడు స్త్రీ లిట్టి దురవస్థకు పాల్పడుట లేదు. వారి పిల్లలు కూడ నారోగ్యమును కలిగియుందురు.

బిడ్డల యారోగ్యమునకు తల్లిదండ్రుల శరీరమే ముఖ్యకారణము. గర్భధారణకాలమునను ప్రసవకాలమునను తల్లిదండ్రులు చిన్నవారుగాను పూర్ణవికాసము లేని వారుగను నున్నప్పుడు వారి పిల్లలు మాత్ర మారోగ్యవంతులై పూర్ణవికాసమును కలిగియుందురా? వారియందు పుట్టుకతోనే బలహీనత యేర్పడుచున్నది.

దేశ మిట్టి దుస్థితిలో నున్నప్పుడు దేశ మెట్లు బాగుపడును? దేశాభ్యుదయము దేశపుత్రులయం దాధారపడియుండును. ఏ దేశపుత్రులు బలిష్ఠులుగను బుద్ధిమంతులుగను శౌర్యధైర్యాదిగుణవంతులుగను నుందురో ఆ దేశమున దేశాభివృద్ధికరము లగు పనులు జరుగుచుండును. అక్కడనే జనసామాన్యమునకు విద్యాభివృద్ధి కలుగును. పారిశ్రామికవృత్తులు పెంపొందును. ప్రకృతిశాస్త్రపరిశోధన మభివృద్ధి గాంచును. ఉత్కృష్టమేధావంతులు జనింతురు. అప్పుడా దేశము దినదినప్రవర్ధమానమై వన్నె గాంచుచుండును. శారీరకారోగ్యబలములు లేని భారతసంతతికి విద్య యెట్లు చేకూఱును? వస్తుశోధన చేయుటకును గూఢవిషయములు కనిపెట్టుటకును శక్తి గలుగుట కవకాశ మెక్కడిది? ఇట్టి శక్తులు లేనివారు దేశాభ్యుదయమున కెట్లు పాటుపడఁగలరు? కనుక, ఈ దేశము మంచి దశకు వచ్చి లోకములోని ప్రఖ్యాతదేశములలో నొకటి యగుటకు ముఖ్యముగా సత్సంతానము కావలెను. సత్సంతానము కలుగుటకు దంపతుల శరీరము గర్భాధానకాలమున పూర్ణవికాసమును జెంది వీర్యవంతమై యుండవలయును.

ప్రస్తుతకాలమున భారతీయు లారోగ్యవిషయమున శ్రద్ధ తీసికొనకపోవుటచేతనే వీరు ముప్పది యేండ్లకే ముసలివారై కృశించిన శరీరమును దృష్టిలోపము గల నేత్రములను వికాసహీనమైన బుద్ధిని గలిగి పశ్చిమఖండవాసులతో తులతూఁగఁజాలక వెనుకబడియున్నారు. పాశ్చాత్యులు దేహబలారోగ్యముల విషయమును ముఖ్యముగా చూచుకొనుచు తన్మూలమున బుద్ధిబలమును సాధించి ప్రకృతిశాస్త్రపారంగతులై యనిర్వచనీయమహిమ గల విద్యుచ్ఛక్త్యాదిమహాశక్తు

# భగవద్గీతార్థసంగ్రహము

నావిలాల వేంకటశివావధాని గారు, బి. ఏ.

శ్రీకృష్ణపాదారవిన్దద్వన్ద్వం ప్రణిపత్యాతిసంగ్రహాత్ - గూఢార్థదీపికావ్యాఖ్యానం కుర్వే వేఙ్కటశాస్త్ర్యహమ్

శ్రీరామచరణద్వన్ద్వస్మృతిః స్వేకరూపిణం - మాం కృత్వా కురుతే వ్యాఖ్యాం నాహం మన్త్రప్రసర్జనః.

భగవంతు లగు శ్రీకృష్ణు లర్జునునకు భారతయుద్ధారంభంబునందుఁ గర్మభక్తిజ్ఞానయోగాత్మక మగు నధ్యాత్మతత్త్వము నుపదేశించి యర్జును శోకమోహముల నపనయించినట్లు శ్రీకృష్ణద్వైపాయనులు మహాభారతభీష్మపర్వములోని ౧౮ యధ్యాయములలో ౭౦౦ శ్లోకములు వ్రాసిరి. ఆ యుపదేశమునకు భగవద్గీత యని పేరు. దీనిలో నుండు విషయము లసామాన్యములు గాన దీనికి వైదికమతాచార్యు లగు శ్రీ శంకర రామానుజ మధ్వ వల్లభాచార్యులు వివరణములు వ్రాసిరి. వానిని భాష్యము లనెదరు. ఆ భాష్యములకు వ్యాఖ్యానము లితరాచార్యులు చేసిరి. మఱియు నితరులు ప్రత్యేకముగఁ టీకల నొనర్చిరి. ఇవి యన్నియు సంస్కృతభాషలో నున్నవి. అద్వైతటీకలే ౪౨ గల వని గణించిన శ్రీ శృంగగిరిస్వాములవారు నాతో సెలవిచ్చిరి. వానిలోను ద్వైతవిశిష్టాద్వైతాదివ్యాఖ్యానములలోఁ గొన్నియే ప్రచురింపఁబడినవి. భగవద్గీతకు సర్వదేశవ్యాప్తి యుండుటంజేసి యాయా దేశభాషలలో గాని తర్జుమాలు టీకలు విమర్శములు మెండు గలవు. మతాంతరులు గూడ దానిని గడు గౌరవముతోఁ జూచుచున్నారు. శంకరభగవత్పాదు లొనరించిన భాష్యప్రకారము భగవద్గీత కర్మజ్ఞానయోగముల నుపదేశించు ననియు అష్టాంగయోగము భక్తియోగము నా కర్మయోగములో నంతర్భాగము లనియు కర్మయోగముయొక్క పరమరహస్య మీశ్వరశరణాగతి యనియు జ్ఞానయోగమున కంగము కర్మయోగ మనియు జ్ఞానముచేతనే మోక్ష మలవడు ననియు నిశ్చయింపనగు. ప్రథమాధ్యాయము మొదలు ౨ వదానిలోని ౧౦-వ శ్లోకమునఱకు నధ్యాత్మోపదేశమునకు హేతు వగు నజ్ఞానజన్యశోకమోహరూప మగు విషాదయోగము వివరింపఁబడె నని శంకరాభిప్రాయము. ౨-వ యధ్యాయము ౧౧-వ శ్లోకము మొదలు ౬-వ యధ్యాయాంతము దనుక కర్మయోగము త్వం (జీవ) పదార్థశోధనమును ౭ మొదలు ౧౨-వ యధ్యాయాంతమువఱకు భక్తియోగము తత్ (ఈశ్వరుఁడు) పదార్థశోధనమును ౧౩ మొదలు ౧౭-వ దాని యంతము దనుక జ్ఞానయోగము 'తత్త్వమసి' యను వాక్యార్థశోధనము ననియు ౧౮-వదానిలోఁ బూర్వగ్రంథసంగ్రహ మనియు నా భాష్యటీకాకారు లగు శ్రీ ఆనందగిరు లభిప్రాయపడిరి.

శ్రీ మధుసూదనసరస్వతులు భగవద్గీతపై గూఢార్థదీపిక యను ప్రౌఢవ్యాఖ్యను రచియించి దానిలోఁ దఱచుగ బ్రతిపదమున కర్థము వ్రాసి యక్కడక్కడ వేదాంతము లగు నుపనిషత్తులను బ్రహ్మసూత్రములను నుదాహరించి వానిపై నున్న శంకరభాష్య సురేశ్వరవార్తికాదులను జర్చ చేయుటయే గాక పాతంజలయోగశాస్త్ర వాసిష్ఠరామాయణాదులలో నున్న రహస్యములను సోపపత్తికముగ వివరించి లోకోపకారముఁ జేసిరి. గీతలపై నింత విపుల మగు టీక యింకొక్కటి లేదు. వీరు దీనిని 'అద్వైతసిద్ధి' రచనానంతరము వ్రాసిరి. అద్వైతసిద్ధిలో నద్వైతమును శ్రుతితర్కానుభవములతో స్థాపించిరి. దానిపై ననేకవ్యాఖ్యలు విమర్శనములు ఖండనములు మండనములు పుట్టినను అద్వైతాచార్యుల [illegible]. భగవద్గీతపై నున్న శంకరభాష్యటీకలలోని విషయములను విశదీకరించుటయే గాక యితరశాస్త్రీయసంగతులను గూడ నీ గూఢార్థదీపికలో శ్రీ మధుసూదనసరస్వతులు చేర్చిరి. వారికి నమశ్శతంబులను జేసి యీ దీపిక ననుసరించి ప్రత్యధ్యాయార్థముల నీవ్యాసములో సంగ్రహించెదను. సంసారమునకు గాని కారణమును నిర్మూలింపఁజేయు మోక్షమే గీతాశాస్త్రములోఁ జెప్పఁబడిన విషయమునకు ఫలము. సచ్చిదానందరూపము పూర్ణము. "విష్ణోః పరమం పదం" అను బ్రహ్మయొక్క ప్రాప్తికొఱకు మూఁడు భాగములు గల వేదము లారంభింపఁబడినవి. కర్మకాండ ఉపాస్తి యను భక్తికాండ జ్ఞానకాండ యనునవి యా భాగములు. ఆ మూఁటి యర్థమును ౧౮ యధ్యాయములుగ భగవద్గీత ప్రకటించుచున్నది. ఒక్కొక్క షట్కములో నొక్కొక్క కాండార్థము ముఖ్యముగ వివరింపఁబడెను. షట్క మనఁగ నాఱధ్యాయముల భాగము. మొదటి షట్కములోఁ (౧ - ౬ అ.) గర్మనిష్ఠయుఁ గొన షట్కములో (౧౩ - ౧౮ అ.) జ్ఞాననిష్ఠయు వర్ణింపఁబడెను. జ్ఞానోత్పత్తికి శ్రౌతస్మార్తకర్మనిష్ఠ యావశ్యక మయినను జ్ఞానఫల మగు మోక్షోత్పత్తియందుఁ గర్మనిష్ఠవలనఁ బ్రయోజన మేమియు లేదని సూచించుటకు రెండు నిష్ఠలు నొంటరులకు వేఱుగఁ బ్రదర్శింపఁబడెను. ఈ రెంటికి మధ్యమున భగవద్భక్తి మధ్యషట్కములో (౭ - ౧౨ అ.) వివరింపఁబడెను. ఇది కర్మజ్ఞాననిష్ఠల రెంటిలోఁ గలసియుండి సర్వవిఘ్నములను బోఁగొట్టును గాన నిది వాని మధ్యమున నున్నది. కర్మమిశ్రము శుద్ధము జ్ఞానమిశ్రము నని భక్తి మూఁడు తెఱంగులు. మొదటి యాఱింటిలోఁ గర్మఫలత్యాగము కర్మస్వరూపత్యాగము నను మార్గద్వయముచే దేహేంద్రియాదివివిక్తజీవస్వరూపము హేతువులతో నిరూపింపఁబడినది. మనకు నియమింపఁబడిన

సాత్త్వికశ్రద్ధ "నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థః" (౨-౪౫) లోనగువానిచే సూచింపఁబడినది. అట్టి సాత్త్వికశ్రద్ధ గ్రహింపవలయు ననియు దానికి విరోధము లగు రాజసతామసశ్రద్ధలు పరిహరింపవలయు ననియు ౧౭-వ యధ్యాయములో వివరింపఁబడెను. ఇట్లు ౧౩ మొదలు ౧౭ అధ్యాయములలో ఫలసహిత మగు జ్ఞాననిష్ఠ ప్రతిపాదింపఁబడె. ౧౮-వ దానిలోఁ బూర్వోక్తవిషయము లన్నియు నుపసంహారరూపముగ సర్వగీతార్థసార ముపపాదింపఁబడె.

ఈ భగవద్గీతాశాస్త్రము ముక్తిసాధనము లగు ప్రస్థానత్రయములో నొక్కటి యని ప్రాచ్యాచార్యులందఱు నేకగ్రీవముతో నంగీకరించిరి. కనుకనే దీనిని ఉపనిషత్తనియు బ్రహ్మవిద్య యనియు యోగశాస్త్ర మనియు వాడుదురు. వాని సారమంతయు దీనిలో నున్నది. దీని సారార్థ మే మన కామ్యనిషిద్ధకర్మములను వదలి నిత్యనైమిత్తికకర్మముల నాచరించి వాని ఫలము కోరకుండినచో నది నిష్కామకర్మ మనఁబడు. అట్టి నిష్కామకర్మములో హరిజపస్తోత్రాదికము పరమధర్మము. ("యజ్ఞానాం జపయజ్ఞోస్మి" ౧౦-౨౫) అట్టి నిష్కామకర్మాచరణముచే నెప్పుడు చిత్తములోని పాపము క్షీణించునో యప్పుడే నిత్యానిత్యవివేక ముదయించి సుదృఢముగ మనస్సునఁ బాదుకొనును. దానిచే వశీకార మను పేరు గల యిహాముత్రార్థవైరాగ్యమును దానిచే శమాదిషట్కసంపత్తితోఁ గూడిన సన్న్యాసపమును లభించు. ఇట్టి సన్న్యాసికిఁ దీవ్రమోక్షేచ్ఛ యుదయించు. ఇట్టి పుష్కలాధికారి యగు వివిదిషాసన్న్యాసి గురువునొద్ద కేఁగి యుపదేశముఁ బొంది యధ్యాత్మవిషయసందేహనివారణముకొఱకు వేదాంతశ్రవణమననముఁ జేయు నని యుత్తరమీమాంసాశాస్త్ర మగు బ్రహ్మసూత్రప్రస్థాన ముపపాదించుచున్నది. గాని శ్రవణమననపరిపాకముచే నిదిధ్యాసనరూప మగు ధ్యాననిష్ఠ కుదురు. అందుచే యోగశాస్త్ర మంతకు నావశ్యకత గలుగు. యోగాభ్యాసముచేఁ జిత్తగతదోషము పోఁగా మహావాక్యముయొక్క తత్త్వావబోధ కుదురు. అంత శబ్దప్రమాణముచేతనే నిర్వికల్పబ్రహ్మసాక్షాత్కారము గలుగు. అపరోక్షజ్ఞానముచే నవిద్య నశించు. ఆవరణాజ్ఞాననాశానంతరము దానివలనఁ బుట్టిన భ్రమసంశయములు పోవు. తత్త్వజ్ఞానప్రభావముచే గాని విరోధము లగు సంచితకర్మము లన్నియు ఫలాభిముఖ్యములు కాకుండనే నశించు, ఆగామికర్మములును బుట్టనే పుట్టవు. కాని, ప్రారబ్ధకర్మవిక్షేపబలముచేఁ బూర్వకర్మవాసనమాత్రము నశింపదు. దానిని జంపు నుపాయము ఘోరాభ్యాససమాధిరూప మగు సంయమముకంటె వేఱు లేదు. 'ప్రైవంజహ్యాత్స్వమా'

భాగవతసప్తమస్కంధములోని (౭-౧౫-౨౪) నారదవాక్యము రకృతవివేకచూడామణి మాధవాచార్యపరాశరస్మృతివ్యాఖ్య నగునవి ప్రమాణములు. ఆ సంయమము దానికిఁ బూర్వాంగముగ యమనియమాసనప్రాణాయామప్రత్యాహారపంచకము గూడ గీతలలో నిరూపింపఁబడినది. ఈశ్వరప్రణిధానముచేఁ ద్వరగ సమాధి సిద్ధించు, దానిచే మనోనాశము వాసనాక్షయము తప్పక కలుగు. తత్త్వజ్ఞానము మనోనాశము వాసనాక్షయము నేకకాల మభ్యసింపఁగ జీవన్ముక్తి దృఢ మగు. ఇట్టి జీవన్ముక్తిరూపార్థమే విద్వత్సన్న్యాస మను శ్రుతిలోఁ జెప్పఁబడినది. సవికల్పసమాధిచేఁ జిత్తమును నిరోధింప నిర్వికల్పసమాధిలో నుండు మూఁడు భూమికలు సిద్ధించు. బ్రహ్మవిద్వరుఁ డగు జీవన్ముక్తుఁడు సమాధిలోనుండి స్వయముగనే వ్యుత్థానుఁ డగు. బ్రహ్మవిద్వరీయుఁ డితరేచ్ఛచేతనే గాని సమాధినుండి లేవఁడు. బ్రహ్మవిద్వరిష్ఠుఁ డీ రెండువిధములనైనను సమాధినుండి లేవక యెప్పటికి నాత్మనిష్ఠుఁడై యుండును. ఇందుకుఁ బ్రమాణములు మహోపనిషత్తు లోనగు శ్రుతులు సాండిలి యోగశాస్త్రము వాసిష్ఠరామాయణశంకరాచార్యప్రకరణజీవన్ముక్తివివేకాదులును. బ్రహ్మవేత్తల యనుభవములు. ఇట్టి బ్రహ్మవిద్వరిష్ఠుని స్థితప్రజ్ఞుఁ డనియు విష్ణుభక్తుఁ డనియు గుణాతీతుఁ డనియు బ్రాహ్మణుఁ డనియు జీవన్ముక్తుఁ డనియు నతివర్ణాశ్రమి యనియు నాత్మరతి యనియు గీతావ్యాఖ్యానస్మృతులు వాసిష్ఠరామాయణసూతసంహితభాగవతాదులును వాడును. అట్టి మహాత్ముఁడు కృతకృత్యుఁడు గాన వాని కేమియు నధ్యాత్మశాస్త్ర ముపదేశింపకున్నను వాని లక్షణములు జిజ్ఞాసు లధికయత్నముతో నభ్యసింపవలయు నని యవి యుద్ఘోషించుచున్నవి. దేవునియం దుత్కృష్ట మైన భక్తియు దేవునియందువలె గురువునందుఁ గూడ నట్టి ముఖ్యమయిన భక్తియు నట్టి మహాత్మున కుండినం గాని దుర్విజ్ఞేయము లయిన యాధ్యాత్మవిషయము లన్నియు నతనికిఁ బ్రకాశించు నని శ్వేతాశ్వతరశ్రుతి నుడువుచున్నది. కాన, నన్ని యవస్థలయందును మనోవాక్కాయములచే నొనర్చు భగవద్భక్తి సాధకాధికారికి నత్యవశ్యము, ఫలము నుపకారకము. మొదటి మెట్టులోఁ జేసిన భక్తి పై మెట్టునందుఁ జేయ నుపయోగించును. అట్టి భక్తిని విడనిచో నధికారి కనేకవిఘ్నము లుండుటంబట్టి ఫలసిద్ధి దుర్లభము. కాననే,

"పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోపి సః।
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్" (౬-౪౪-౪౫)

లోనగు వాక్యములచే నర్జునునకు భగవంతుఁడు భక్త్యావశ్యకత నుపదేశించిరి. పూర్వజన్మకర్మము నూహించుటకు మనకు వీలు లేదు గాన, నాకసమునుండి పడిన పండురీతిని బూర్వజన్మమందే కృతార్థుఁడైనవానికి నధ్యాత్మశాస్త్రార్థముతోఁ బ్రయోజన మేమియు లేదు. ఈ ప్రకారము మొదటి భూమిక నెక్కిన జిజ్ఞాసువు భగవద్భక్తి లేనిచో పై మెట్టెక్కలేఁడు. కాన, జీవన్ముక్తిదశయందుఁ జేసిన భక్తికిఁ దదూర్ధ్వభూమికాసోపానారోహణము తప్ప ఫలాంతరకల్పనావసరము లేదు. జీవన్ముక్తునకు నద్వేష్టృత్వాది (౧౨-౧౩ ౯) గుణము లెట్లు స్వభావసిద్ధగుణములో యట్లే హరిభజనము గూడ సహజధర్మము గావలయును. కాననే,

"ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే।
కుర్వంత్యహైతుకీం భక్తి మిత్థంభూతగుణో హరిః." (భా౧-౭-౧౦)

శ్రీహరిగుణప్రభావ మెట్టిది యనఁగ ఆత్మారాములును సర్వగ్రంథరూపము లగు నవిద్యాకామకర్మములచే నిర్ముక్తులును నగు మునులు కూడ నిష్కారణముగ భగవద్భక్తిఁ జేయుదు రని సూతులు

సాధకాదులకు సెలవిచ్చిరి. "తేషాంజ్ఞానీనిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే" (7-17) అని భగవంతులు గూడ నర్జునునకుఁ బ్రేమభక్తి ముఖ్య మని గీతాశాస్త్రములో నుపదేశించిరి. కనుక, మోక్షార్థి మొదట నిష్కామకర్మము నాచరింపవలయును. ఆ ముక్తికి లోకమోహాదిక మగు నాసుర సంపద యను పాపము ప్రతిబంధకము. ఆ పాపమువలన స్వధర్మచ్యుతియు నిషిద్ధకర్మసేవయు ఫలాభిసంధితోఁ గాని లేక యహంకారముతోఁ గాని కర్మము చేయుటయు సిద్ధించు. కాఁబట్టి నిత్యము ననుగపాపముతోఁ గూడిన పురుషుఁడు పరమపురుషార్థ మగు మోక్షమును బొందక దుఃఖము నెప్పుడు ననుభవించును. సర్వప్రాణులకు దుఃఖము స్వభావసిద్ధముగ ద్వేషింపఁదగినది గాన దానికి సాధన మగు లోకమోహాదికము నెల్లప్పుడు విడువవలయును. అనాది జన్మములనుండి చిరకాలాభ్యస్త మగుటంజేసి దుస్త్యజము గుణ కారణ మగు లోకమోహాదిక మే యుపాయముచే నిర్మూల మగుఁ జెప్పు మనియు ముక్తి యేసాధనముతోఁ గావలయు ననియు నడిగిన నడిగిన శిష్యుఁ డయిన గీతాశాస్త్రమును భగవంతు లుపదేశించిరి. "గీతాగాయాస్తులనా మన్వైతి కరదచ్ఛాస్త్రం పవిత్రం పరం?"

"తామసోహస్మ్యగ్నం" "అయమహమనుస్మి" "అహంబ్రహ్మాస్మి" యను బ్రహ్మైక్యత్వజ్ఞానముచే ముక్తి గలుగు ననియు అట్టి యద్వైతజ్ఞాన మెన్ని యుపాయములచే నిష్కామకర్మయోగము లావశ్యకము లనియు గీతాశాస్త్రము నొక్కి చెప్పుచున్న దని శ్రీశంకరాచార్యులు శ్రుతిముక్తిసమన్వయములతో భాష్యము వ్రాసిరి. బ్రహ్మశ్రీ లోకమాన్య బాలగంగాధరతిలకము గారు గీతలు కర్మయోగమునే ముఖ్యముగఁ బ్రతిపాదించుచున్న వని యనేక ప్రమాణములతో విపుల మగు టీకను మహారాష్ట్రములో వ్రాసి దానికి గీతారహస్య మను కర్మయోగశాస్త్ర మని నామమిడిరి. దానికి హిందీకర్ణాటకాదిదేశభాషలలోఁ దర్జుమాలు చేయఁబడినవి. తెలుఁగునఁ గూడ నయి యచ్చుపడుచున్నది. అవకాశము చూచి దాని విషయములను ముందు వ్రాయఁదలంతు. మధుసూదనసరస్వతులు తమ దీపికలోఁ జాల చోట్ల శాంకరభాష్యము ననుసరించినను దుదకు గీతాశాస్త్రములోఁ గర్మజ్ఞానయోగములు భక్తియోగమున కంగ మనియు నా భక్తియొక్క పరమకాష్ఠ యీశ్వరశరణాగతి యనియు సర్వశాస్త్రములకు నక్కడనే సమాప్తి యనియు 'సర్వధర్మాన్' (18-66) అను చరమశ్లోకవ్యాఖ్యలో వ్రాసిరి. కర్మభక్తిజ్ఞానవిశేషములు బ్రహ్మసూత్రసారములోను శ్రీమద్భాగవతసారములోను వ్రాసితిని గాన వాని నిందుఁ జేర్పలేదు. గీతాశ్లోకములు సూత్రప్రాయము లగుటంజేసి యనేకాచార్యుల కనేకవిధములుగ నర్థ మిచ్చుట వాని కలంకారమే గాని దోషము గాదు. 'భగవదభిప్రాయవర్ణనే కేవయం వరాకాః!' అని శ్రీమధుసూదనసరస్వతులంతవారే సెలవిచ్చిరి.

శ్లో. కాండత్రయాత్మకం శాస్త్రం పదవాక్యార్థగోచరం
ఆదిమధ్యాంతభేదేషు వ్యాఖ్యయా గోచరీకృతమ్.
శ్లో. శ్రీకృష్ణచరణద్వంద్వే స్మర్తౄణాం మంగళప్రదే,
యోగిన్యయో కృతి రియ మలంకారార్థ మర్పితా.

ANDHRA STUDENTS, COLLEGE OF ENGINEERING, MADRAS



చెన్నపురి ఇంజినీరింగు కళాశాలయందలి యాంధ్రవిద్యార్థులు

TELUGU DISTRICTS TRAINING COLLEGE, RAJAHMUNDRY



ఆంధ్రమండలములందలి ట్రెయినింగు కళాశాల విద్యార్థులు, రాజమహేంద్రవరము

TYPICAL ANDHRA SOLDIERS, EAST AFRICA



దక్షిణాఫ్రికాయందలి యాంధ్ర సిపాయిలు

ANDHRA STUDENTS, NATIONAL COLLEGE, MADANAPALLE



మదనపల్లి జాతీయ కళాశాలయందలి యాంధ్ర విద్యార్థులు

MR D. CHENCHAIAH CHETTY



దశిశి చెంచయ్య శ్రేష్ఠి గారు

SRGT M R GRANDHI, IMS



సార్జంటు ఎం.ఆర్. గ్రాంధి గారు, ఐ.ఎం.ఎస్

SRGT S V REDDI NAIDU, SOUTH AFRICA



సార్జంటు ఎస్. వి రెడ్డినాయుడు గారు, దక్షిణాఫ్రికా

# హిందూదేశపు విద్యుచ్ఛక్తి పరిశ్రమ

మో. విశ్వనాథము గారు

ప్రస్తుతకాలమున విద్యుత్తన నేమి యను సంశయము గల వారు చాల తక్కువగా నున్నను దానిని గురించి కొంచెము విమర్శించుట యీ సందర్భమున మంచిది.

విద్యుత్తు ఘర్షణవిద్యుత్తనియు ప్రవాహవిద్యుత్తనియు రెండు విధములు. మొదటి విధము ప్రస్తుతకార్యమున కనుకూలముగ నుండదు గనుక దాని నిచ్చట విమర్శించుట లేదు. రెండవ విధమగు ప్రావాహికవిద్యుత్తు రెండు విధములు. రాసాయనికసంస్కారముల వలన విద్యుద్ఘటమునందు జనించునది రాసాయనిక ప్రవాహవిద్యుత్తనియు ఇంజనువలన త్రిప్పఁబడు డైనమోలో జనించునది లోహచుంబకవిద్యుత్తనియు పిలువఁబడుచున్నవి. పై రెంటియందును యంత్రములు బండ్లు దీపములు పంకాలు మొదలగు కార్యముల కెల్ల నుపయోగింపఁబడునది లోహచుంబకవిద్యుత్తు.

రాసాయనికవిద్యుత్తును పుట్టించుటకు ఒక కాచపాత్రములో గంధకద్రావకమును పోసి దానియందు పాదరసము పూసిన తుత్తునాగపురేకును రాగిరేకును ఒకదాని నొకటి తాఁకకుండునటు లుంచి రెంటిని రాగితీఁగెతో కలిపినచో విద్యుత్తు తుత్తునాగమునుండి తామ్రమునకు ప్రవహించును. (దానిని గురించి విశేషముగ తెలిసికొనఁ గోరువారు విజ్ఞానచంద్రికా ప్రచురములలోని "రసాయనశాస్త్రము"ను చూడ ప్రార్థితులు.) ఇట్లు జనించిన విద్యుత్తు పరిశోధనాలయములందును తంత్రీవార్తాస్థానములందును వాయువార్తాస్థానములందును కొన్ని చమురు వాయువుల యింజనులయొద్దను తదితరస్థానములయందును మాత్రమే యుపయోగపడుచున్నది.

## లోహచుంబకవిద్యుత్తు

రాగితీఁగె నొకదానిని మిక్కిలి బలముగ గుఱ్ఱపునాడ యాకారమున నున్న యయస్కాంతముయొక్క యుత్తరదక్షిణధ్రువముల మధ్యమున త్రిప్పినచో ఆ రాగితీఁగయందు విద్యుత్తు ప్రవహించును. భిన్నధ్రువములనుండి వెలువడు స్కాంతపంక్తులను ఎంత త్వరితగతిని రాగితీఁగె దాటుచుండునో అంత యెక్కువ విద్యుత్తు జనించుచుండును. సాధారణముగ జరుగు విధమేమన, ఒక యినుప యిరుసుపై అవిద్యుద్వాహకపదార్థములను గప్పి దాని చుట్టును ఒకదాని నొకటి తాఁకకుండునట్లు కొన్ని రాగితీఁగెలను చుట్టుదురు. విద్యుత్తు ఆ తీఁగెలనుండి వెలువడును గనుక పైని చెప్పినట్లు చుట్టిన చుట్టకొక పైపున అవిద్యుద్వాహకములచే కప్పఁబడిన యీ యిరుసు పైనే తామ్రపు రేకులను ఒకదాని నొకటి తాఁకకుండునటు లుంచి పై నుడివిన తీఁగెల చివరలను ఒక్కొక్కదానిని ఒక్కొక్క తామ్రపు రేకునకు కలుపుదురు. తీఁగెలలో జనించిన విద్యుత్తు రేకులకు ప్రవహించి అచ్చటినుండి కుంచెల మూలమున వెలువడుచున్నది. ఈ చుట్టంతయు 'ఆర్మెచ్యూరు' అని వాడఁబడుచున్నది. ఆర్మెచ్యూరు తిరుగు స్థానమంతయు స్కాంతపంక్తులచే నాక్రమింపఁబడవలయును గనుక దాని చుట్టును అయస్కాంతము లుంపఁబడి అవి తాత్కాలికము లగుటచే ఆర్మెచ్యూరునందు జనించు విద్యుత్తులో కొంత భాగమువలన లోహచుంబకశక్తిని పొందుచున్నవి. ఆర్మెచ్యూరును అయస్కాంతములును కలసియున్న యంత్రమునకు డైనమో యని పేరు. ఇంతవఱకును ఆర్మెచ్యూరు చేయు విధమును మాత్రము వర్ణించియుంటిని. కాని, విద్యుత్తును జనింపఁజేయుటకు పైదానిని అయస్కాంతముల మధ్యమున త్రిప్పవలసియున్నది. అందుకొఱకు ఆర్మెచ్యూరు ఇరుసుపై నొక చిన్న చక్రమును బిగించి దానిని ఇంజను చక్రముతో త్రాళ్లవలనఁ గాని పట్కాలవలనఁ గాని కలుపుదురు. ఇంజను ఆర్మెచ్యూరును త్రిప్పుచున్నంత కాలము విద్యుత్తు జనించుచుండును.




'ఈ విద్యుత్తు యంత్రములు బండ్లు మొదలగువానిని ఎట్లు కదలించుచున్నవి?' అని సందేహము తోఁపవచ్చును. ఇంజను బలమును శుద్ధబల మందురు. ఈ శుద్ధబలమును డైనమో విద్యుద్బలముగ మార్చుచున్నది. ఈ విద్యుద్బలమును తిరిగి శుద్ధబలముగ మార్చినఁ గాని యంత్రములు మొదలగువానిని నడపించుటకు వీలు లేదు. ప్రతికర్మాగారమునొద్దను బండ్లకు క్రింది భాగమునను మోటారుల నమర్చెదరు. మోటారునకును డైనమోకును విశేషము వ్యత్యాసము లేదు. మోటారునందుఁ గూడ ఆర్మెచ్యూరు అయస్కాంతములు మొదలగునవి కలవు. మోటారు చక్రమును యంత్రపు చక్రమునకుఁ గాని బండి యిరుసునకుఁ గాని పట్కాతో జత గూర్చెదరు. ఈ విధమున విద్యుత్తు పరిశ్రమలకు తోడ్పడుచున్నది.

'ఇంత వృథాప్రయాస మేల? యంత్రములను ఇంజనులవల్లనే నడపించుకొనఁగూడదా?' యని ప్రశ్నింపవచ్చును. విద్యుత్తు గొరకు ప్రదేశమున ఇంజను కొని యంత్రములను నడపుటకన్న మోటారును

మాత్రమే కొని నడపుటచే విశేషలాభము కలదు. ఇంజను వెల మోటారు వెలకన్న నెక్కువ. మోటారునకు ఎక్కువమంది పనివాండ్రక్కఱ లేదు. బొగ్గును నీరును అనావశ్యకము. తక్కువ స్థలము నాక్రమించును. నడపుటకు ప్రారంభించిన పిదప తిరిగి దానిని ఆపునంతవఱకును దాని పై పునకు చూడవలసిన పని యుండదు. కొన్ని పరిశ్రమాలయములు సమీపమున నున్నచో వేర్వేఱుగ ఇంజనులను కొనుటకన్న అందఱు నేకీభవించి ఒక యింజనును ఒక డైనమోను కొని వేర్వేఱు మోటారులను మాత్రము తమతమ మఱలను త్రిప్పుట కుపయోగించినయెడల ప్రథమములో కావలసియుండు వ్యయమును దినవ్యయమును చాలవఱకు తగ్గు ననుట అతిశయోక్తి కానేరదు.

విద్యుత్తు కొన్ని ప్రధానపరిశ్రమలకు చేయు సహాయమును విమర్శింపవలసియున్నది.

## నేత యంత్రశాలలు

హిందూదేశమున కంతటికిని ప్రసిద్ధి కెక్కిన జనప యంత్రశాలలు కలకత్తాయందును ప్రత్తి యంత్రశాలలు బొంబాయియందును గలవు.

కలకత్తాయందలి జనపనార యంత్రశాలల యధికారులు 1,527 లక్షల రూప్యముల మూలద్రవ్యమును వాడియున్నారు. ఇంతవఱకును ప్రతియంత్రశాలయు అవిరి యింజనుచేతనె నడపబడుచున్నది. ఆవిరిని జనింపజేసి దానివలన 800 మొదలు 1000 గుఱ్ఱముల బలము గల తృతీయ (లేక) చతుర్థ వ్యాకోచయంత్రములను నడపుటకు 8 లేక 10 బోయిలర్లు కావలసియున్నవి. బోయిలు గనంగా బలము గల యావిరిని జనింపజేయు లోహపాత్రము. అది సుమారు 19 అడుగులు పొడవును 8 అడుగులు వెడల్పును కలిగియుండును. ఇంజను సమభారచక్రము 45 లేక 50 అడుగుల యెత్తున నుండును. దీనిపై సాధారణముగ 45 లేక 50 త్రాళ్లుండి వానిచే శాలలోని యంత్రము లెల్ల నడపబడుచుండును. విద్యుత్తు దొరకునెడల ఇంజనులు బోయిలర్లు మొదలగువాని నెల్ల మూల వైచి ఒక్క మోటారును కొని యంత్రశాలను నడపుటవలన లాభము విశేషము. ప్రస్తుతము జరుగుచున్న ఘోరయుద్ధమువలన గవర్నమెంటువారు తమకు కావలసిన గోనె సంచుల నెల్ల కలకత్తా యంత్రశాలలో కొనుటచే ఆ యంత్రశాలాధికారులు అమితలాభమును పొందియున్నారు. అందువలన వారు విద్యుద్యంత్రములను కొనుటకు సిద్ధముగ నున్నారు. కొన్ని యంత్రశాలలు విద్యుద్యంత్రముల నుపయోగించి అమితలాభమును పడసినవి. మిగిలిన వారు కూడ విద్యుత్తుచే నడపబడు యంత్రములను కొని తమ పరిశ్రమలను విరివి చేయబోవుచున్నారు.

బొంబాయియందలి ప్రత్తి యంత్రశాలలు 2,176 లక్షల రూప్యములను మూలధనముగ పెట్టియున్నవి. రతన్ టాటా గారి జలవిద్యుచ్ఛక్త్యాలయము నెలకొల్పబడునంతవఱకును పైని వర్ణించిన యింజను బోయిలర్లను ప్రతియంత్రశాలయు నుపయోగించుచుండెను. కాని, విద్యుత్తు చవుకగాను విరివిగాను దొరకుచుండుటచే ప్రాంతయింజను బోయిలరుల నుపయోగింపక మోటారును కొని యంత్రశాలలను నడపుచున్నారు. అందువలన విశేషలాభము వచ్చుచున్నది. కొలది కాలములో బొంబాయియందలి పరిశ్రమాలయము లెల్ల తమ యంత్రములను విద్యుత్తుచే నడపగలవు.

## గనులు

మన దేశమునందలి ముఖ్యముగా బెంగాలునందలి గనులలో ఆవిరి యింజనులకు బదులుగా విద్యుత్తు నుపయోగించుచున్నారు. పెక్కు గనులను సమీపములో గలవారు ప్రధానశక్త్యాలయమును స్థాపించి మోటారులచే గనులయందలి మఱలను నడిపి మిగుల ధనవంతు లైరి. రాతిబొగ్గును త్రవ్వుటకు వాయుభారముచే నడపబడు పనిముట్లు నుపయోగించుచుండుటవలన వాయుభారమును కలిగించు యంత్రములను త్రిప్పుటకు శరవేగమును మించు మోటారులు కావలసియున్నవి. అట్టి మోటారును నడపుటకు విద్యుత్సాహాయ్యము ముఖ్యము. గనులనుండి బొగ్గును భూమిపైకి కొనివచ్చుట కుపయోగపడుచున్న యంత్రములకు సహకారి విద్యుత్తు. గనులలోని నీటిని తోడుట కింతవఱకు ఆవిరి యింజనుల నుపయోగించుచున్నారు. కాని, బొగ్గు 200, 300 అడుగుల లోతున దొరకని చోట్ల నీటి పంపులను నడపుటకు తిరిగి విద్యుత్తు కావలసియున్నది. కనుక గనులయందును విద్యుత్తునకు చేయవలసిన పని మెండుగ గలదు.

## గమనము

విద్యుత్తుచే నడపబడు రైలు బండ్లు హిందూదేశము నింతవఱకును కానరావు. కొన్ని పెద్ద రైల్వే కంపెనీలు విద్యుత్తు రైల్వేల నుపయోగములోనికి కొనివచ్చుటకు ప్రయత్నించిరి కాని, యుద్ధము వలన ఆ ప్రయత్న మాగిపోయినది. పడమటి కనుమలలో జలపాతములు విశేషముగ నుండుటచే కనుమల ద్వారమున నడచు రైళ్లకు విద్యుత్తు నుపయోగించుటకు తగు నేర్పాటులను చేయుచున్నారు. అవి కొలది కాలములో రానున్నవి. బొంబాయి కలకత్తా చెన్నపట్టణములందలి విద్యుత్తుచే నడపబడు బండ్లు అందఱును వీక్షించియున్నవే. ప్రతి బండికిని ముందుభాగమున ట్రాముల వాడు నిలువబడి బండిని నడపించుచుండును. విద్యుత్తు బండిపైని తీగె నంటియుండు లోహపు కఱ్ఱ ద్వారమున విద్యుత్తు బండి క్రిందకు గొని అచ్చట నుండు మోటారును త్రిప్పుచుండును. మోటారునకును బండి యిరుసునకును జత కూర్చుటచే మోటారు తిరుగునపుడు బండి కూడ కదలుచుండును.

## వ్యవసాయము

వ్యవసాయశాఖలోనివి యగు బియ్యము పిండి మొదలగునవి తయారు చేయు మఱలు సాధారణముగ ఆవిరి చమురు ఇంజనులచే నడపబడుచున్నవి. అట్లు తయారు చేయు మఱల వెల...

కొంచెమైనను వానిని నడపెడి యింజనుల వెల 4, 5 రెట్లెక్కువగా నున్నది. 4, 5 మఱలు సమీపస్థానమున నెలకొని యున్నచో ప్రధానశక్త్యాలయమును కట్టి అందు జనించు విద్యుత్తుచే ఆయా యంత్రశాలలను మోటారులవల్ల నడపుకొనుచున్నయెడల ప్రథమములో వ్యయపఱుపవలయు ధనము తగ్గుటయే గాక దినవ్యయము కూడ విశేషముగ తగ్గును. విద్యుత్తు క్రయమునకు దొరకుచున్న యెడల పరిశ్రమలను నెలకొల్పుట అతిసులభము. బొంబాయి నగరమున విద్యుత్తు చవుకగా దొరకుచుండుటచే చిన్న చిన్న షాపుకారులు సహితము చిన్న చిన్న పరిశ్రమలను నెలకొల్పుట కనువుగ నున్నది.

పొలములకు నీరు తోడు విషయములో విద్యుత్తునకు మంచి దారి గలదు. నదులు కాలువలు చెఱువులు మొదలగువానినుండి పంటలకు సమృద్ధిగ దొరకు స్థానములు గాక బావులనుండి నీటిని చేది పంటలను పండించుకొను ప్రదేశములు మన దేశమున విశేషముగఁ గలవు. ఆయా చోట్ల సాధారణముగ నేతములు మోటలు కాఁవెములు మొదలగువాని నుపయోగించుచున్నారు. ఇంజను పంపులను కొని నీటిని పంటలకు తోడుటకు రైతులు ధనమును వెచ్చింపఁజాలరు. కాని, ఐకమత్యమున్న చోట్ల నలుగు రైదుగురు రైతులు చేరి ఒక స్థానమునుండి వేఱొక స్థానమునకు కొనిపోఁబడఁగల యింజనును కొని వరుస ప్రకారము తమ తమ నీటి యంత్రములను నడుపుకొనవచ్చును. అందువలన పంటలకు నీటికొఱఁత యుండదు. అందఱు రైతులును ఏకకాలమున నీరు తోడవలయు నన్నచో ప్రధానశక్త్యాలయములను నెలకొల్పి మోటారులవలన నీటి యంత్రములను నడపించుకొనవలసియున్నది.

విద్యుత్తు పైరులకు చేయు వేఱొక ఘనకార్య మున్నది. అది యేది యన, విద్యుత్తు పైరులకు మంచి యెరువగుచున్నది. భూమి లోపలికిఁ గాని భూమిపై మొక్కలకు తగులకుండునట్లు లినుప వల నుంచి దానిలోనికిఁ గాని విద్యుత్తును ప్రవేశపెట్టినచో మామూలు పంటకన్న రెట్టింపు పైఁగా పండును. విద్యుత్తు మొక్కలకు చేయు నుపకారమును జోసు మహాశయుఁడు తన యంత్రముల సహాయమున మానవుల దృష్టిపథంబునఁ బడునట్లు చేయుచుండుట యెల్లరకును విశదంబే కదా!

## గృహములు

హిందూదేశమునందలి గృహములు సాధారణముగ విద్యుత్తును చూచియెఱుఁగవు. కొన్నికొన్ని గృహములందు మాత్రము విద్యుత్తు పంకాలు దీపములు కానవచ్చుచున్నవి. విద్యుత్తు దొరకు స్థానమునందు చవుకగాను ఇతరులను బాధపెట్టనిదిగాను నుండుటచే విద్యుత్తు పంకాలను పెట్టుకొనుటయే లాభకారి. కలకత్తాయందలి విద్యుత్తు కంపెనీ వారు 60,000 విద్యుత్తు పంకాలను నడపుచున్నారు. పెద్ద పట్టణములలోని మేడలు పెక్కంతస్తులు కలిగి యెత్తుగా నుండుటచే అంత యెత్తునకు నీరు పడఁజాలదు కనుక మోటారులవలన నీటిని మేడల పైభాగమున నున్న చెఱువులలోనికి పంపుచున్నారు. కలకత్తా బొంబాయి నగరములలో నట్లు జరుగుచున్నది. విద్యుత్తు పంకా యున్న చోట విద్యుత్తు దీప ముండుట సహజము. కాని, యీ దీపములును పంకాలును భాగ్యవంతుల గృహములందు మాత్రమే గలవు. నడిమిగతివారి గృహములలో విశేషముగ లేవు. బీదవారి సంగతి చెప్పే చెప్పనక్కఱ లేదు.

ఈ సందర్భమున ప్యారిసు నగరమందలి యొక శాస్త్రకారునిచే కనిపెట్టఁబడిన గృహవిద్యుద్యంత్రమును వర్ణించుట మంచిది.

ఈ యంత్రమును సైకిలును త్రొక్కునట్లు త్రొక్కవలసియున్నది. అట్లు త్రొక్కుటచే తిరుగు చక్రమును త్రొక్కువాని కెదురుగ తగిలించి ఆ చక్రపు పైభాగమునుండి క్రింది భాగమున నమర్చియుంచిన చిన్న డైనమోయొక్క చక్రమునకు త్రాటిచే కలిపెను. కనుక త్రొక్కుచున్నంతవఱకును చక్రమును అందువలన డైనమోలోని యార్మేచరును తిరుగుచుండి విద్యుత్తును జనింపఁజేయుచుండును. అట్లు జనించు విద్యుత్తు నంతను విద్యుద్ఘటములలో నింపి రాత్రులందు దీపములను వెలిగించుకొనుట కుపయోగపఱచుకొనవచ్చును. ప్రతిదినము కసరతు చేయు సమయములో ఈ యంత్రమును ఒకటి ఒకటిన్నఱ గంటల కాలము త్రొక్కిన రెండు విధముల లాభకారి యగుచున్నది. ఈ యంత్రములలో రెండు రకముల యంత్రములు కలవు. ఒకటి చిన్న పిల్లలకును రెండవది కొంచెము పెద్దవారికిని. మొదటిది 12 ఏంపియర్లును 12 వోల్టులును గల విద్యుద్ఘటమాలను నింపుటకును రెండవది 25 ఏంపియర్లును 12 వోల్టులును గల విద్యుద్ఘటమాలను నింపుటకును ఏర్పఱుపఁబడినవి.

# సంచలన ప్రతిమలు

న్యాపతి నారాయణరావు గారు, బి. ఏ., బి. ఎల్.

వర్పు సెంపెడి రంగస్థలములచేతను మనోహరాకర్షణముల చేతను ప్రబోధముచేతను నిజత్వమును ఘనీభవించుట చేతను అనంతవిషయశ్రేణులచేతను సంచలనప్రతిమలు 17-వ శతాబ్దియంతిమునందు మనుష్యునకు ప్రబోధమును కలిగించు గొప్ప యంత్రముగా మారినవి. శైశవస్థితియందున్నను దాని యభివృద్ధి మిక్కిలి యాశ్చర్యమును కలిగించుచున్నది. నాగరికతాభివృద్ధి కది మిగుల సహకారి. మనుష్యుడు మాటాడుటకు చదువుటకు పూర్వము నేత్రముల ద్వారమున విషయములను గ్రహించును. అది స్వభావసిద్ధము.

ఇటాలియా తత్త్వవేత్త యగు పోర్టా గారు 16-వ శతాబ్దిలో ఈ విద్యను గనిపెట్టెను. 1802 లో వెడ్జివుడ్ అనెడి యాంగ్లేయ ప్రముఖుడు అసలైన చిత్తరువులను తీయగలిగెను. నెపోలియన్ యుద్ధములవలన ఈ పరిశ్రమకు కొంత యంతరాయము కలిగినను 1833లో హార్నిరు గారు ఒక బోలు గొట్టముతో నొక యంత్రమును తయారు చేసి యిరుసుమీద తిరుగునట్లు చేసెను. దాని పైభాగ మంతయు నిలువైన రంధ్రములచేత కప్పబడి లోపలిభాగము చుట్టును పరుగెత్తెడి గుఱ్ఱము మొదలగువాని క్రమానుసారమైన యవస్థలను తెలుపు ప్రతిమల పంక్తి కూర్పబడెను. గొట్టము తిరుగునప్పుడు గాని పై భాగమునందుండు రంధ్రములలోనుండి చూచువానికి ప్రతిమ కదలుచున్నట్టు కనబడును. ప్రప్రథమమున ఈ ప్రతిమలు చేతితో వ్రాయబడినవి. రానురాను, మెబ్రిడ్జి గారు కామెరాల వరుస నుపయోగించి దానిముందర గుఱ్ఱము నడుచునప్పుడు విద్యుచ్ఛక్తివలన మూతను తెఱచుచు మూయుచు పోయిరి. క్రమముగా 1889 లో సెల్యులాయిడ్ ఫోటో ఫిలిము ఎక్కువ లాభకారిగా చేయబడినది. ఇది జీవితముయొక్క యథార్థఫలితము లెటులు కలుగునా యని సంచలనప్రతిమల పోషకులు సయితమాశ్చర్యనిమగ్ను లగుచుండిరి. నిజమునకు పదార్థము ప్రత్యక్షముగా చలింపదు. అది దృష్టివిన్యాసముయొక్క భ్రమ లేక దృష్టియొక్క పట్టు అనెడి మనోవ్యాపారభేదము (Psychological Phenomenon) పదార్థము తొలగించిన తరువాత గాని రూపచిహ్నము 1/10 సెకండువఱకు నేత్రాంతఃపటలమునందుండును. అందువలన ఆ రూపమును పది సార్లు కన్నులయెదుట నుంచినయెడల విచ్ఛేదోద్రేకము పోయి రూప మవిచ్ఛిన్నముగా నున్నట్లు కనబడును.

సెల్యులాయిడ్‌నుండి చేయబడిన సన్నని పొర సాధారణముగా వెయ్యి యడుగులు పొడవు ఒక యంగుళము వెడల్పు గలిగి అంగుళము పొడుగును ముప్పాతిక వెడల్పును గల 16 వేల బొమ్మలు కలిగియుండును. ఈ బొమ్మల వరుస చలించు పదార్థముయొక్క గాని కథయొక్క గాని క్రమానుసరణరూపములను పోలియుండును. ఈ బొమ్మలు సెకండునకు 16 చొప్పున సున్నపు వెలుతురునం గాని విద్యుచ్ఛక్తికాంతియందుం గాని ఒక తెర మీద చక్రము త్రిప్పుట చేత అతిత్వరితముగా ఒకదాని వెంబడి నింకొకటి ప్రదర్శింపబడును. పై చెప్పిన దృష్టియొక్క పట్టును బట్టి అవిచ్ఛిన్నమైన సంచలనము గలిగినట్లు చూచువారికి కనబడును.

1889 లో కామెరా మూలకముగా విలియమ్ గ్రీన్ గారు లండను పట్టణమునందు ప్రదర్శించిరి. కాని, క్రమముగా చాల వృద్ధి పొందెను. ప్రప్రథమమున ఈ పరిశ్రమ ఏదో నొక వింతను చూపుట కొఱకు అనుసరింపబడినది. అందు చిన్న చిన్న ప్రహసనములు ప్రదర్శింపబడినవి. వింతవలన ప్రదర్శనముల గుణాగుణములు పాటింపబడియుండలేదు. రానురాను, సముద్రము సృష్టిచమత్కృతి మున్నగు విషయములను తెలియజేయు ప్రతిమలు ఈ చిత్రలేఖనరంగమునందు ప్రదర్శింపబడుచువచ్చెను. 1896 లో జనులకు ఈ యంత్రము ప్రబోధకముగను ఆనందకరముగను నుండుటకు తగినట్లు చేయబడెను. క్రమముగా వృద్ధి పొంది గొప్ప గొప్ప కంపెనీలు ఈ పరిశ్రమను విరివి చేయుట కారంభించెను. ప్రవీణులైన నాటకరంగాధికారుల నిర్వాహకత్వము క్రింద గొప్ప గొప్ప నాటకములే ప్రదర్శింపబడుచువచ్చెను. తర్వాత వర్తమానవృత్తాంతములు వార్తాపత్రికావిషయములు మున్నగునవి వానియందు ప్రదర్శింపబడుచు వచ్చెను. అవి యనన్యసామాన్యమైన సంసుశక్తిని పురికొల్పి ప్రజాభిరుచులకును ప్రజాభావములకును ప్రజానీతులకును కారకము లయ్యెను. కినిమిటోఫోనున గ్రామోఫోను ధ్వనులను ప్రతిమల సంచలనముతో సమ్మేళనపఱచి స్వభావసిద్ధమైన మనుష్యవాక్కును పొందుటకు చాల ప్రయత్నములు జరిగెను గాని యది కొనసాగలేదు. నాటకములు సాధారణముగా జనసామాన్యమునకు ఆహ్లాదమును కలిగించును. వానిని చూచి యానందించుటకు ప్రతిపోషకునకును ఒక విధమైన తెలివి యుండుట యవసరము. దానిని ప్రతి మనుజుడు పొందుట కష్టము. అందువలన ప్రజలు సరియైన యానందమును పొందియుండలేదు. కాని, 20 వత్సరముల క్రిందట సంచలనప్రతిమలు నూతనముగ కనుగొనబడినప్పుడు జ్ఞానావశ్యకతయు ధనవ్యయమును తగ్గి జనసామాన్యము దానిని పోషించుటకు వీలు కలిగెను. అందువలన గొప్ప నాటకప్రదర్శనములు జనసామాన్యాభిరుచికి ఆలవాలము లయ్యెను. ఈ నూతనపద్ధతి వినోదప్రపంచ మంత

టను విప్లవము కలిగించి నాటకరంగస్థానమును ఆక్రమించుచున్నది. అమెరికా దేశమునందు నాటకశాలలు సంచలనప్రతిమాభవనములుగ మారినవి. అందలి వేషధారులు ఈ భవనములను పాలించుచున్నారు. సంచలనప్రతిమల ద్వారమున సముద్రము ఎడారి మొదలగు రంగములు కూడ ప్రదర్శింపఁబడుటచేత అవి నిజమైన ప్రదర్శనములుగను చౌకగను నుండును.

ప్రేక్షకునకు సరియైన యానందము కలుగును. కర్ణేంద్రియ జ్ఞానేంద్రియముల రెండిటి నుపయోగింప పని లేదు. కఠినపదములవల్లఁ గాని క్లిష్టాన్వయములవల్లఁ గాని యలని మనస్సు చీకాకుపడదు. అట్టి ప్రదర్శనములయెడలఁ గల జనసమ్మతి లోకవిదితము. కల్పిత రూపమునందు మనుజునకుఁ గల యభిలాష మనోహరమైనను మోహకమైనను నాగరికతాభ్యుదయమునకు ముఖ్యమైన యంగము. అట్టి యభిలాషకు నడకయొక్క యందము కూడఁ జేర్పఁబడినది. గొప్ప గ్రంథరాజములు సంచలనప్రతిమల ద్వారమున స్వభావసిద్ధముగను ఫలవంతముగను వర్తమానకాలమునందు ప్రదర్శింపఁబడుచున్నవి. వానిని చూచి యానందించి యుత్సాహపూరితు లగుటకు స్త్రీపురుషులకు వీలగుచున్నది. రానురాను, జనసామాన్యమనోవికాసమునకు ఈ పరిశ్రమ సహకారిగా నున్నది.

మానవసంఘమునందు దృష్టితోఁ గూడిన విద్య యగ్రస్థానము నధిష్ఠించుచున్నది. అవిద్యాపూరితమై ఏకభాషారహితమైన మన దేశమువంటి దేశముల కవశ్యము. పిండపతన మైనది మొదలు మనము నేత్రముల ద్వారమున విషయములను గ్రహించుచున్నారము. నేత్రముల ద్వారమున కలుగు చిహ్నము లెప్పటికిని మాటలు విని చదివిన దానికన్న మనఃఫలకముమీఁద స్థిరముగ నుండును. తర్వాత వేగముగ మనుష్యు నాకర్షించునది సంగీతము. ఇది మనోభావముల నాకర్షించును. వస్తుప్రదర్శనము బుద్ధి నాకర్షించును. అట్టిది మానవశాస్త్రములయందు స్పష్టపడుచున్నది. ఆధునిక శాస్త్రపరంపరలచేత బొమ్మలు చలించుచుండఁగా, వాని యాకర్షణలును ఫలితములును అభేద్యములనెడి విషయములో ఏమి యాశ్చర్యమున్నది! అట్టి విద్య చదువ రానివారికి సరియైన విద్యను సముపార్జించుటకు వీలును కలుగఁజేయును. ప్రదర్శనముల యెదుట భాషారూపగుణభేదములచేత తాఱుమాఱగు జనులు సయితము కలసి మెలసి కూర్చుండి సమబుద్ధితో ఆనందింపవచ్చును. ఇదియే మానవబుద్ధికుశలతవల్ల కనుపెట్టఁబడిన సర్వతోముఖమైన యేకభావ. విద్యాహీనులై భాషాభేదము గలవా రందఱికి తెలియునది సంచలనప్రతిమల భాషయే. సముద్రములచే విడిపోయిన ఖండములయొక్క కృత్రిమపు హద్దులకు అందరానిది. ఎడిసన్ గారు చెప్పినట్లు, ఇతరదేశస్థులయొక్క స్థితిగతులు ఆచారములు సాంప్రదాయములు మొదలగు విషయములను గోచరింపఁజేసి జ్ఞానము నుద్భవింపఁజేయును.

ఎక్కువ ధనవ్యయముతో ప్రదర్శింపఁబడు హీనప్రదర్శనములకంటె ఇందు జాతీయాంతర్జాతీయానుసరణి సరసముగా ప్రదర్శింపఁబడును. జ్ఞానాభివృద్ధికిని మానవనీత్యౌన్నత్యమునకును సంచలనప్రతిమలు ఎక్కువ తోడ్పాటు. అవిద్యాజనితమైన దురభిమానమును పోఁగొట్టి సమభావమును జనుల మనస్సునందు జనింపఁజేసి క్రిందికి అణఁగఁద్రొక్కఁబడిన జనుల నున్నతికి పురికొల్పును. అనుష్ఠించుటకు నూతనాదర్శములను కలుగఁజేయును. బహుళమైన జనసామాన్యముయొక్క సన్మార్గాభివృద్ధిని పెంపొందఁజేసి మనోహ్లాదమును కలిగించుటకు విశాలహృదయు లగు పండితుల చేతులలో సంచలనప్రతిమలు పై కారణములచేత నిజమైన పరికరములుగ పరిగణింపఁబడుచున్నవి. ప్రారంభోచితవిద్య మొదలు విశ్వవిద్యాలయములయందు పెంపొందిన విద్యావిషయముల పర్యంతము ఈ యంత్రము లుపయోగింపఁబడును. అన్ని శాస్త్రముల బోధించుటకును తగిన పొరలు గలవు. అమెరికా దేశమునందు ఇంద్రియగోచర మగు దృష్టి ద్వారమున జ్ఞానోద్బోధనకు సంచలనప్రతిమలు ఎక్కువగా నుపయోగింపఁబడుచున్నవి. శాస్త్రసమ్మతమైన జ్ఞానసంపాదనమున కనువగునట్లు గొప్ప పాఠశాలలు స్థాపింపఁబడినవి. విశ్వవిద్యాలయానుక్రమణికలో చిత్రపటైకవిషయము కూడ చేర్పఁబడినది. రోచెస్టర్ విశ్వవిద్యాలయమునందు చలనప్రతిమాశాస్త్రైకవిద్యయం దాఱితేరుటకు నాలుగు సంవత్సరముల విధి నిర్ణయింపఁబడియున్నది. వ్యవసాయము పరిశుభ్రత మొదలగు విషయములను జనులకు బోధించుటకుఁగాను అమెరికా ప్రభుత్వమువారు సంచలనప్రతిమల నుపయోగించుచున్నారు. నిజమైన యాకర్షణ మీ పరిశ్రమయం దుండుటచే ఎన్నికలయందును కృషిజీవనమునకు మనుష్యులను పురికొల్పుటకును దోషులను దొంగవస్తువులను కొనువారిని కనుఁగొనుటకును క్రొత్త సిపాయిలను కూర్చుటకును వస్తుప్రకటనమునకును ఈ ప్రదర్శనముల నుపయోగించుచున్నారు. ఆధునిక మతధర్మములు సయితము ఈ బొమ్మల ద్వారమున బోధింపఁబడుచున్నవి. కొలఁది రోజుల క్రిందట అమెరికా సంయుక్తరాష్ట్రములలో న్యూమెక్సికో పట్టణమున 30 లక్షల రూపాయిల మూలధనముతో "బైబిల్ ఫిలిమ్ కంపెనీ"ని స్థాపించి అందు మతవిషయికము లగు బొమ్మలను తయారు చేయుచున్నారు. విద్యావిషయములయందు విద్యయొక్క ప్రయోగము లమితములు. అమెరికా దేశమునందు స్వజాతీయ ప్రతిమల పొరలను తయారు చేయుటకు గొప్ప యంత్రశాలలను కట్టించి 150 కోట్ల రూపాయిల మూలధనమును ప్రోగు చేసిరి. అందు 275 వేల జనులు పని చేయుచున్నారు. ఒక్క యమెరికా దేశమునందు 1916లో సాధారణాసాధారణము లగు పొరలును వాని నకళ్లును తయారు కాఁగా వానికి వెచ్చింపఁబడిన సొమ్ము పోను 88 కోట్ల 62 లక్షల 50 వేల రూపాయిలు లాభము వచ్చినది. ఘనత చెందిన స్త్రీపురుషవేషధారులు ఎక్కువ జీతములమీఁద ఆ కంపెనీలలో పని చేయుదురు. అమెరికా దేశములో 200 కంపెనీలు గలవు. మన యాసియా ఖండములో చీనా దేశము దీర్ఘనిద్రనుండి యతిత్వరితముగా మేల్కాంచుచున్నది. జీవితముయొక్క సందిగ్ధవిధానములను అతి తీవ్రతతో సవరించుకొనుచున్నది. వర్తమానగమనముతో అభివృద్ధి చెందినయెడల కొలఁది కాలములోనే ఆదర్శకరాజ్యములలో నొకటిగా గణన గాంచఁగలదు. దాని సంకేతము "నిరంతరకృషి". ముందు

నడకకు కావలసిన ప్రారంభోచితవిద్య నేర్చుకొనుచున్నది. ఎక్కువగా ప్రయోగింపఁబడు ముఖ్యసాధనములలో సంచలనప్రతిమాపరిశ్రమ ఎక్కువ స్ఫుటమైన 20-వ శతాబ్దపు పరికరము. జపానుదేశమునందు సయితము ప్రప్రథమమున విదేశీయప్రతిమలు ప్రబలినవి. అట్టి పోరలవల్ల తమ జాతీయజీవనమునకు హాని కలుగు నని తలఁచి స్వజాతీయరుచులకు తగినట్లు ప్రతిమలను వారు తమ దేశమునందే తయారు చేయుచువచ్చిరి. వారి సంప్రదాయముల కనువగు బొమ్మలను కథలను రంగస్థలములను తయారు చేయించి నిజమైన యాంత్రిక విద్యను వెదఁజల్లఁగలిగిరి. వినుము, మన యిండియాయొక్క దుర్గతి చెప్ప నలవి గాదు. అది పరిశ్రమలయందును జాతీయాభివృద్ధికి కావలసిన ప్రతిభయందును ఇతరదేశములకన్న ఎట్లు వెనుకఁబడియున్నదో అటులే సంచలనప్రతిమాపరిశ్రమయందును మూకీభావము వహించి రానురాను జాతీయవ్యక్తిత్వమును పెంపొందించుకొనఁజాలక ప్రపంచనాగరికతాజలావర్తమునఁ బడి కొట్టుకొనుచున్నది. ఆధునికస్వాతంత్ర్యరాజ్యములు శైశవస్థితియందున్న కాలమున ఎక్కువ యౌన్నత్యమును గాంచిన మన యిండియాదేశము ఇప్పు డిట్టి దురవస్థపాలగుట యెంత విచారకరము! భారతేతిహాసములు పురాణాదికథలు జాతీయనాటకములు మున్నగునవి మన జాతియొక్కయు మన దేశముయొక్కయు గొప్పతనమును స్ఫురింపఁజేసి జనుల మనముల నుత్సాహభరితములుగ చేయును. దానికి తగునట్లు మన దేశస్థులు కృషి సేయకపోవుటచేత మన మన్నివిధముల కష్టములకు లోఁబడవలసివచ్చినది. వాషింగ్టన్ పట్టణములో నున్న చలనప్రతిమాభవనములు మన యిండియా మొత్తముమీఁద లేవు. దానికి కారణము ఇది యని చెప్పుట కష్టతరము. కాని, నిజమైన జ్ఞానమును స్వసామర్థ్యమునందు నమ్మకమును పనియందు చొరవయు లేకుండ మనల నావరించికొనియున్న యజ్ఞానము కొంతవఱకు ముఖ్యకారణము. నిజజ్ఞానమును పొందుటకు సరియైన జ్ఞానవిజృంభణ మవశ్యము. మన విద్యావంతులకట్టి జ్ఞానము లేదు. సామాన్యజను లట్టి పరిశ్రమల యావశ్యకతను గుర్తింపలేదు. గొప్ప ధనవంతులు మాత్రము కొన్ని భవనములను నిర్మింపఁగలిగిరి. కాని, ఆధునికవాణిజ్యస్పర్ధకు తాళఁజాలరు. ఈశతాబ్దమునందు గొప్ప నిర్మాణములు సంఘములచే స్థాపింపఁబడి అసంఖ్యాకు లగు మనుష్యులయొక్క సంపాదనసాహాయ్యములకు సుసాధనము లగుచున్నవి. టాటా యినుప కంపెనీ బొంబాయి నూలియంత్రములు ప్రత్యేకపు ధనికులచేత స్థాపింపఁబడుట సాధ్యము కాదు గదా! అటులే సంచలనప్రతిమాభవనములు కూడ సంఘముయొక్క ధనముతో నిర్మాణము చేయవలయును గాని ధనవంతు లగు కొంతమంది వ్యక్తులచేత కానేరదు. అదియును గాక, ఆ పరిశ్రమకు కావలసిన విద్యాశక్తి నొనగూర్చుట యిప్పటి స్థితిగతులను బట్టి చాల కష్టతరము. అది గొప్ప పట్టణములయందు మాత్రమే యొనగూడును. అందువలన ఆ వెలుఁగును సంచలనప్రతిమలకు వాణిజ్యపద్ధతిమీఁద తయారుచేయుట సుసాధ్యము కాదు.

ఇప్పుడు మన దేశములో వాడఁబడు పోరలు పరదేశములలో తయారు కాఁబడి వారిచేత విసర్జింపఁబడిన పిమ్మట మన బజారులయందు ఎక్కువ విలువకు అమ్మఁబడుచున్నవి. మన యభిరుచులకును సాంప్రదాయములకును సరిపోక భిన్నజాతీయనీతులు సాంప్రదాయములు గల పాశ్చాత్యదేశములయొక్క స్థితిగతులకు తగినవై యుండుటచేత మన జాత్యభివృద్ధికి ఎంత మాత్రము మన సహకారులు కానేరవు. అదియును గాక, ఆ పోరలు గీతలతోను తుడుపులతోను నిండియుండి చూచువారి కండ్లకు అపాయకరములై యుండును. మన దేశస్థులు నిర్ధనులుగను అజ్ఞానులుగను నుండుటచేత చిత్రలేఖన ప్రదర్శనములందు సరియైన యభిరుచి లేదు. రామాయణ భారతాది కథలును హరిశ్చంద్రాదినాటకములును సంచలనప్రతిమల ద్వారమున ప్రదర్శింపఁబడినయెడల జనసామాన్యమున కుద్రేకము కలిగి మన సంప్రదాయములయందు నిజమైన యభిరుచియు దేశాభిమానమును గలుగును. జనసామాన్యమునకు హిందూదేశపూర్వచారిత్రములు ప్రతిష్ఠాపనవిధానములు రాజకీయాందోళనవ్యవస్థలు మొదలగు వానియందు జ్ఞానము లేకపోవుటచేత వర్తమానపరిస్థితులయం దభిరుచిని పొందుట నిష్ఫలమై నిరర్థకమైన జీవనమునకు లోనగుటకు మూలమగుచున్నది. మన నాయకు లీ విషయమును గమనించినట్లు కనఁబడదు. ఆధునికరాజకీయపరిస్థితుల వైపు జనసామాన్యముయొక్క మనములను త్రిప్పినఁ గాని దేశాభ్యుదయము కలుగ నేరదు. నిర్బంధప్రారంభోచితవిద్యను విరివిగా కొనసాగించుట కిప్పటి స్థితిగతులలో వీలగునట్లు తోఁపదు. వీలైనను శాస్త్రపరిశోధనలయం దభిరుచిని సముపార్జించుట కది చాలదు. కావున, జనులకు దేశాభిమానమును పురికొల్పుటకును దేశాభివృద్ధికి ముఖ్యము లగు పరిశ్రమలయం దభిరుచిని పెంపొందఁజేయుటకును సంచలనప్రతిమాభవనములను విరివిగా వ్యాపింపఁజేసి జ్ఞానాభివృద్ధి గావింపవలయును. లేనియెడల, ఆధునికప్రాపంచిక రాజ్యాంగవిప్లవములలో మన దేశము అధోగతి పాలు కావలసివచ్చును. కావున, అవిద్యాపూరితమై భాషాభేదములచేత చీకాకు పడియున్న మన దేశముయొక్క యభ్యుదయమునకై మన పురాణశాస్త్రములు నాటకములు ప్రహసనములు చరిత్రములు జీవితచరిత్రములు ఆధునికవృత్తాంతములు గల పోరలను తయారు చేయుటకు యంత్రములను స్థాపించి మన స్త్రీపురుష వేషధారులు మన జాతీయాచారవ్యవహారానుసరణిని మన సహజశక్తిని బొమ్మల ద్వారమున వెలియఁజేయవలయును. ఈ నూతనవిద్య జాతి మత భాషా విచక్షణ లేక మన దేశస్థు లందఱికి నిజమైన జ్ఞానము నుద్భవింపఁజేసి ఆనందమును కలుగఁజేయును. అప్పుడు ఈ యద్భుతమైన యంత్రము శరీరసౌఖ్యమును మానసపోషణమును సమకూర్చుటయే గాక వర్తనమును సవరించుకొనుటకును నీతిమార్గముల నిరూపించుటకును కార్యములం దుత్సాహము వహించుటకును జీవనముయొక్క ప్రాణాధారమైన సమస్యల నాలోచించుటకును జనసామాన్యమునకు శక్తిని కలుగఁజేయును. ఇంగ్లాండు దేశమునందు అవినీతిపటములు ప్రదర్శింపఁబడుటచేత బాలుర మనములు చెడుదారులం బడ నష్టము కలుగఁజొచ్చెను ఆదేశపు దొరతనమువా రది గమనించి నీతికి విరుద్ధమైన పటములను ప్రదర్శింపఁగూడ దని శాసించియున్నారు. అటులె మన దేశమునందును అట్టి యుత్తరువులను ఇండియా దొరతనమువారు జారీ చేయించి ఆబాలగోపాలము జ్ఞానాభివృద్ధి కనువగునట్లు సంచలనప్రతిమాపరిశ్రమను వృద్ధిపఱచెదరు గాత! దేశనాయకులును ధనవంతులును జనసామాన్యాభివృద్ధికి ముఖ్యసోపాన మగు ఈ సంచలనప్రతిమల పరిశ్రమ యభివృద్ధికి తగిన మార్గము లేర్పఱచి దేశజనుల కృతజ్ఞతకు పాత్రు లగుదురు గాత! ఈ విద్యయొక్క యనంతలాభములను జనసామాన్యమునకు బోధించి వారికి నిజమైన యాసక్తి నుద్భవింపఁజేసి హిందూసంఘాభివృద్ధికి తోడ్పడుట యావశ్యకము.

# ఆత్మానుభవము

## క్రొత్తపల్లి సూర్యారావు గారు

ఆత్మానుభవ మనునది ప్రపంచానుభవముకంటె గొప్పది. పెద్ద పెద్ద విషయములను గొన్ని స్వల్పవిషయములను గూడ నొక్కొక్కప్పుడు తనకుఁ దెలిసియుండియు నెదుటివానికిఁ జెప్పుటకు బోధించుటకుఁ దగిన యుపాయము మాటలు దొరకక తడఁబడును. "అంతర్గడగుడాయతే బహిర్వక్తుం నశక్యతే" యను మాట దీనిమీఁదనే పుట్టియుండవచ్చును. వాడుకలోఁ గొందఱు "నోటిలో నాడుచున్నది పైకిఁ జెప్పలేకున్నా" నందురు. ఇదియుఁ బైదానిలో నొక భావమే కావచ్చును. ఆత్మకుఁ దెలిసి బైటికి స్పష్టపఱుపఁ జాలకున్నను, స్పష్టపఱచుటకుఁ దగిన సాధనములు లేకపోయినను జక్కఁగా నెఱవేఱు కార్యములు పెక్కులు గలవు. యజమానునిఁ బెంచువానిం గాంచి కుక్క తోఁక యాడించును, గుఱ్ఱము సకిలించును, గేదె తల యాడించును. విశేషమేమనఁగా, యజమానునిఁ దన కన్నము పెట్టు యజమానసేవకుని భేదము కనఁబఱచుచు యథోచిత ప్రేమాదులు చూపు నోరు లేని జంతువుల యాత్మానుభవ మెక్కటిది. ఆ కుక్క యాఁకలిగొన్న దని మనము గ్రహింతుము. గుఱ్ఱము గుగ్గిళ్లు తెమ్మనుచున్న దని తెలిసికొందుము. గేదె గడ్డి యడుగుచున్నటులు గుర్తింతుము. కుక్క యే భాషతోఁ దెల్పినది? గుఱ్ఱ మే మాటలతో నడిగినది? గేదె యే వాక్యములతో యాచించినది? కుక్క వాలము ద్రిప్పును, నేలఁ బడి వక్త్రముఁ గుక్షియుఁ జూపును, 'ఉమ్మ ఉమ్మ' యని యజమానునియొద్ద ముద్దులు గుడుచును. అప్పుడు దాని మనస్సులో నే భాషాభావము లుండునో మన కెఱుఁగఁ దరము గాదు. "ఆఁకలిగా నున్న" దని తెలుఁగున ననుకొనుచున్నదా, "పసియా యిరుక్కరదు" అని యఱవమునన్నా, "భూక్ లగ్ తాహై" "ఐ ఆమ్ హంగ్రి" ఇత్యాదులగు మనకు రాని తక్కు భాషలలోనా? ఇదియే యాత్మానుభవముగా నెంచుకొనవలయును. అహా! ఆత్మల భాషలు దేశములఁ గాలముల వాక్కుల నతిక్రమించినట్లు తోఁచుచున్నది. 'బోబో' యనినఁ గోడి తనకుఁ దవుడు వేసెద రని పరుగెత్తుకొని వచ్చును. 'దూదూ' యనిన శునకము వచ్చును. 'ఆఆ' యనినఁ బావురము గుబాళించుచు నేతెంచును. 'బోబో' యనినఁ బావురము రాదు, కుక్క రాదు, కోడియే 'కోకో' యనుచు వచ్చును. ఈ భేద మెవ్వరు నిర్ణయించిరో! ఇది నా కట్టుగట్టు యని సాయంకాలము పొలమునుండి వచ్చిన యావు తన రాటయొద్ద నిలుచును. స్తంభమున నున్న యరిత్రాడు విప్పుచున్నఁ గని పెట్టి దూడ పాలకై యఱచుచు లేచును. 'హూఁ' యని హొక్కలు గూఁడి కెగుర నాపఱు ఎను. కొన్ని యే పనిమీఁదనైన గృహస్థుఁ డాలస్యముగఁ దన కాహారము లేకయుండెనని వేగము రమ్మని సంజ్ఞలు చేయును. ఇవి యన్నియు నాయా ప్రాణుల హృదయభావములు. ఇట్టివాని నెట్లు తెలిసికొందుము? మన కేదైన వస్తువు కనఁబడినపుడు, "ఆహా! యిది యెంత బాగుగా నున్నది!" యనుకొందుము. పిల్లి మన మన్నము తిను నప్పుడు వచ్చి విస్తరియొద్దఁ బంగకొని గుఱుగుఱు మనుచు ముద్దిగ పోసికొనుకఱకు శాంతించి యప్పటికిని మన మింతదైన దానికిఁ బెట్టుట లేని సంగతి గొలిసికొని చేయెత్తి మన చేతిలోని కబళ మందుకొనఁబోవును. అప్పు డది "మీఁరు నాకు ముద్ద పెట్టకుండఁ దామే తినుచున్నా" రని యక్షరరూపమైన దే భావలోనైన ననుకొనునా? ఇదియో యాత్మానుభవము. కిట్టిఁ గాంచి యిది నన్నుఁ దాడించునని యని పశువు గ్రసించును. అన్నముం గాంచి యిది మన కాహార మగు నని కుక్క యక్కడఁ గూర్చుండును. గడ్డి మోపుం గని యిది యజమానుఁడు మనకే పెట్టు నని యావు గ్రహించును. మనుష్యుల సహవాసమున నీ గ్రామసీమజంతువులు తా మిట్టి యూహాలు కలిగియుండు నని యనుకొందము. అడవిలో నున్న పులి మనుష్యులు పెన్నుఁ జంపఁజూచెద రని కొంకలలో దాఁగుచుండును. ఇట్టివి సహజములు దైవప్రేరితములు నగు నాత్మానుభవములు.

భాషలోఁ గూడ నిట్టివగు యాత్మానుభవములు పెక్కులు గలవు: చకోరాక్షి, పద్మహస్త మొదలగునవి అందుగి యన్నఁ దెలిసికొనఁదగిన వస్తువునే చకోరాక్షి యన్న గ్రహింతుము. అందాగానికిం జకోరాక్షికిం గల సంబంధముం గనఁదగును. ఇదియే యాత్మానుభవము. "వాఁడు సంతోషించెను" అనుదానినే "అఖండానంద కందళితహృదయారవిందుం డయ్యె" నని యందురు. ఈ సమాస మేమి మహాత్మ్యమున నే పండితునిచేఁ గూర్పఁబడినదో జగద్విదితమైనది. ఎఱుఁగనివాఁడు లేఁడు. సింహమునకు నడుము సన్న మని హంసము పాలు నీరు విడఁదీయు నని కవిసమయము. దీని జగమంతయుఁ బట్టి ప్రేలాడుచు నిజ మని నమ్మియున్నారు. సర్కసులోని సింహముం గాంచి "ఇది సింహము గాదు. ఇక్కాలమున సింహములు లేవు. ఉన్నచో, నిదియే సింహమైనచో నడుము సన్నముగా లేదేమి?" యని వాదింతురు. సిపిల్సు పార్కులోని హంసను లేదా ఫాంటెన్ హెడ్ మీఁది హంసను గాంచి "ఇప్పుడు హంసలు లేవు. మానససరోవరములో నుండును గాని యిక్కడ నుండవు. ఉన్నచో, నిదియే హంసయైనచో పాలు నీరు విడఁదీయునా!" యంచు వాదించి మనస్సమాధానముం గావించుకొందురు. నిజసింహ మెట్లుండునో వీరు చెప్పలేరు. మానససరోవర మెక్కడ నున్నదో వీరు చూడలేదు.

హంసలు విడఁదీయుటకుఁ బా లెవ్వరు తెచ్చి పెట్టి నేర్పిరో యెఱుఁగఁజాలరు. హంస యెట్లుండునో తెల్ప నసమర్థులు. చెప్పినను వినక పోవుట నమ్మకము లేకపోవుట వీరి యాత్మానుభవము. పద్మములో సాయంకాలము తుమ్మెద యుండఁగానే యది ముకుళించుకొని పోవును. మన్మథుఁడు పుష్పబాణములతో దంపతులం గొట్టుచున్నాఁడు. చందనవృక్షములకుఁ బాములు చుట్టుకొనుచున్నవి. నెమలి కూఁత వినిన సర్పము తల వాంచును. కోకములు చక్రవాకములు చంద్రకిరణములను సూర్యకిరణములను భక్షించును. ఇట్టి కవిసమయము లన్నియు నాత్మానుభవముననె యెఱుంగ నగును.

"శ్లోక ప్రీతిచకోరపారణపటుర్జ్యోతిష్మతీలోచనే
యాభ్యాసర్థవిబోధముగ్ధమధుర శ్రీరగ్ధముద్రాయితో
నాభీపల్వలపుండరీకముకుళః కంబోస్సపత్నీకృతః"

ఇందలి చమత్కార మాత్మానుభవానుభావముననే తెలిసికొనవలయును. కవితావ్యుత్పత్తి కవిసమయములు నెఱింగిన నెంతయో హాయిగా ననుభవమునకుఁ దెచ్చుకొనవచ్చును. సత్యములవలెఁ గనఁబడు నసత్యముల నాత్మానుభవముననే తెలిసికొనవలయును.

"ఉరుదగీరుహారసుప్తోత్థశార్దూలమున్
మురవారిణో జితశంకఁ గ్రాప"

ఇం దెంత నిజమున్నదో యెంత యసత్యమున్నదో యాత్మానుభవము లేకున్నఁ దెలియదు. సోమరులై మధ్యాహ్నమునఁ బండుకొని లేచి మొగము కడిగికొనఁ బడక వెదకువారిం జూచువారికిఁ బయి పద్యకారణములోఁ గొంత నమ్మకము పుట్టును.

లేడిపిల్లలకుఁ బులులు పాలిచ్చుట నెమలి పురి విప్పి యాడుచున్న నీడను బాము నిద్రించుట మునిబాలకుల పాఠములలోని తప్పులను చెట్లమీఁది చిలుకలు దిద్దుచుండుట యిట్టివి యాత్మానుభవము లేక తేటపడవు.

"పద్మినీపద్మాతపత్రంబు శిథిలప
త్రాగ్రమై రాయంచ యాశ్రయించ"

"...కప్పురపు విప్పుటనంటి పొరయట్ల నొక్కొక్క మాధ్వీకపో
షణఛిం బుప్పొడిదీవికి న్మృగకరవ్యాపార లేతేరఁ ద
ద్ఘనకర్పూరపటంబు లందుకొని..."

"ఆః కిద్పృగత్రిమునిలోచన దూషికాయాం
పీయూషదీధితిరితి ప్రథితో మరాగః"

తనుండు దీని కెంతటి సూక్ష్మాత్మానుభవ ముండవలయునో. ఇప్పటి స్వభావాత్మానుభవములు కొన్ని ఇఁక సూచించెద:

గుమ్మములమీఁద గుమ్మములం జెక్కి సంక్రాంతికి బంతిపూవు దండలు కట్టుటకై వాని నోళ్లు తెఱచికొనినట్లు నరదలు కోయఁబడియున్నవి. గవాక్షమున కెదురుగ బల్లమీఁద నల్లచాఱల బళ్లారి కంబళి పఱవఁబడినది. కాళ్లు తుడుచుకొనుటకు కొబ్బరి పీఁచు గోదిడీ గుమ్మము దగ్గఱ వేయఁబడియున్నది. ప్రక్కనే తోరణములవలె వచ్చువారందఱు చెప్పుల జోళ్లను విడిచియున్నారు. వాఁడు దేవాలయమునకుఁ దలుపు లేనందున గాడిద లందుఁ జొచ్చినవి. ఆఁడుగాడిద మగగాడిదను వెనుక కాళ్లతోఁ దన్నినది. ఇత్యాదులు.

వీనియం దెక్కుడు రుచి యిప్పు డుద్భవిల్లుచున్నది. వీనియం దున్న రుచి పై పద్యపాదముల గ్రహించుటలో నున్నచో నప్పు డాత్మానుభవము కావలయును. ఇప్పటి వాక్యము లాత్మానుభవశూన్యములు కావు గాని యంతరము లేదా! మంచి పెద్దలు నిశ్చయించునది యాత్మానుభవము.

ఆత్మానుభవములను గ్రహించుటకు భాషాపరిశ్రమ ముండవలయును. భాష నేర్చినవారికిఁ బ్రపంచానుభవము గూడఁ గుదురువడును. సాధారణవ్యావహారికప్రపంచమును గ్రాంథికప్రపంచము నను నిరుదెఱఁగుల ప్రపంచజ్ఞానము వారికిఁ గరతలామలకము. గ్రాంథికభాష నెఱుంగక వ్యావహారికభాషాభిమానజనకు లగు జనకులచేఁ దీర్పఁబడిన వెఱ్ఱి బిడ్డలు జాత్యంధులట్లు యాత్మానుభవశూన్యులై తండ్రి యందిచ్చిన బోలుకోల యాధారముననె ప్రపంచమునఁ దడవుకొనుచు దిరుగాడవలయును. స్వతంత్రశక్తి లేకయుందురు. పాపము! అట్టి పుత్రుల జనకులకు సరస్వతి యాత్మానుభవము కొంత గలిగించి లోకోపకార మొనర్చి కాలవైపరీత్యమును బట్టి చెప్పు చేయించుకొనుంగాక!

# ఎన్నడైన అంతయు ఉక్కుతో చేయబడి నట్టియు సుప్రసిద్ధిగాంచినట్టి మా ర్యాలీ సైకిలును ఉపయోగించితిరా?

## లేనిచో నేడొక దానిని కొనుడు.

నానాటికి 'ర్యాలీ' సైకిలు సర్వజన సమ్మతమై అందరిచేతను కొనబడుటచే విశేషముగ మేము వానిని తెప్పించు చుంటిమి. వాయిదాల ప్రకారము క్రమముగ సొమ్మును కట్టి సైకిలును తీయవచ్చును.

పూర్తిగ వివరములు కోరువారు మాకు వ్రాసిన ప్రత్యుత్తర మొసంగెదము.

**స్టాండర్డు 'త్రీస్పీడు ర్యాలీ'**

చట్రము 24 లేక 26 అంగుళము. ర్యాలీ క్రీవములతో అమర్చ బడినది ½ అంగుళము రోలరు చైన్. బ్రూకుస్సాడిలు, స్టర్మీ ఆర్చరు, త్రీస్పీడు గియరు, డన్‌లాప్, గోడ్రిచ్, టైరులు స్ప్రింగులు సెక్షన్ స్టీలు మడ్గార్డు. ల్యాంపు బెల్లు, పంపు పనిముట్లు.

రూ. 225.


No. 28.

**స్పెషలు ర్యాలీ.**

చట్రము 24 లేక 26 అంగుళములు.

ర్యాలీ ఫ్రేములతో అమర్చబడి ప్రత్యేకముగ ½ అంగుళము రోలరు చైన్‌లు. స్టర్మీ ఆర్చరు, త్రీస్పీడు గియరు, ర్యాలీ పేటెంటు ఊడతీయ తగిన ఆయిల్ బ్యాత్ గియరు కేసు, బ్రూక్సు త్రికోణపు స్ప్రింగు స్సాడిలు, డన్‌లపు గోడ్రిచ్ టైర్సు, ల్యాంపు, బెల్లు ఇన్‌ఫ్లేటరు, పనిముట్లు, వగైరా. రూ. 275.

## 'పాప్యులర్' ర్యాలీ సైకిలు వివరము.

చక్రములు:— 28 అంగుళములు. తుప్పుపట్టదు. క్రీవీలు నిగనిగళముగ తిరుగును.

టైరులు:— మంచి ఉక్కు అంచులు, పెడల్సు ర్యాలీ 3¼" రబ్బరు డన్‌లాపు గోడ్రిచ్ పట్టుకొనెడు భారము పైకెత్తబడినది.

ఫ్రేములు:— 22", 24", లేక 26" (స్సాడిలు) మూడు గట్టులు కల్గి స్ప్రింగు గల్గియుండును.

బ్రేకులు:— ముందు వెనుక అంచుకలది. మంచి పనితనము కలది. ప్రకాశమానమగు నల్ల ఇనాములతో చేయబడినది. వివిధరంగులతో అందమైన చారలుకలది.

మడ్గార్డులు:— లైటుస్టీలు రెంటిని ఊడదీయునగు.

ఫిట్టింగ్సు:— 7" పిట్టింగ్సు, పంపు, క్లిప్సు, స్పానేలు, స్పానర్సు, ఆయిలరు. (15 C)

గొలుసు:— (చెయిను) ½" గోలరు.

గియరు:— 70"

సోల్ యేజంట్లు చెన్నరాజధాని:— స్పెన్సర్ అండుకో., లిమిటెడ్, మద్రాసు.

# ఎంబ్రాయిడరీ హాల్

[తంతివిలాసము 'Corandum']

టెలిఫోన్ నెం. 743

1888 సంగున స్థాపితము

## మాధవదాస్ గోవిందజీ అండు కో

24, చైనాబజారు రోడ్డు మదరాసు.

## నమ్మకమైనట్టియు చవుకైనట్టి పట్టుగుడ్డల దుకాణము.

ఇచ్చట వెండిసరిగె, జిగినా పనులతో చేసిన ఉడుపులున్ను, గోష్పీలు, చీరలు, రవికెలు, ఫేట్లు వగైరాలున్ను, బెల్ట్ పట్టు, తలగుడ్డలు, క్రిస్టస్సు ఫెట్లు కాఫ్సు, చీరలకున్ను, రవికెలకున్ను ఉపయోగిమైనటువంటి చైనా సిల్కు, జపాన్ సిల్కు, ఇంకా అనేకవిధముల పట్టు దినుసులున్ను అమ్మబడును.

## వెండి జిగినా సరిగె విడిగాను అమ్మబడును.

ఆర్డరులు వచ్చిన వెంటనే అనులు చేయబడును.

**Madhavadas Govindajee & Co.,**

(22) **24, China Bazaar Road, MADRAS.**

---

బంగారు వెండి పతకమును ఇండియా ప్రసిద్ధప్రదేశములలో పొందిన

అత్యభిమత్వాద విద్వాన్ కే. శేషశాస్త్రి ఆయుర్వేద కలావిభూషణ శ్రీ శృంగగిరి ధర్మ చికిత్సక, వీరి

## శాస్త్రోక్త ప్రసిద్ధాయుర్వేదౌషధములు

1. చంద్రచూడపాకము- (మంచి టానిక్) ఈ పాకము, కాలామి పాండు, బలక్షయము, ధాతుక్షయము, మూత్రమేహరోగము, మూలవ్యాధి, అగ్ని మాంద్యము, దేహశ్రమము వీనిని పోగొట్టి అత్యద్భుతమైన దేహశక్తిని, ధాతుబలమును, అగ్నిబలమును కలిగించును. 24 రూకల ఎత్తు 2-8-0
2. చంద్ర చూడాల సింధూరము:—మస్తు మేహాయునకు రామబాణము. ½ తులం 2-0-0
3. వసంతమాలినీ సింధూరము:-అన్ని స్త్రీరోగములకు „ 2-0-0
4. నవానందభైరవరసము-అన్ని జ్వరసన్నిపాతములకు 50మా 1-0-0
5. అజీర్ణ బలకాలానలరసం-అగ్నిమాంద్యాజీర్ణ కలరావ్యాధికి 1-0-0

అన్నిరోగములకు ఔషధములు విక్రయింపబడుచున్నది. నిర్గతికులు తమ స్థితిని మహనీయుల సర్టిఫికేటు పంపినచో ధర్మముగా ఔషధములు పంపబడును. పోస్టేజి ప్రత్యేకము.

అడ్రస్. అధికారీ ఆఫ్ ఆయుర్వేదిక్ ఇన్‌స్టిట్యూషన్,
మైసూరు అండ్ కర్ణాట బ్రాంచ్,
(49) పోస్టు, శృంగేరి, మైసూరు సంస్థానమ్

---

సిరిట్టాన్

అమృత శక్తి గలది.

నోటియందలి దురువాసనను పోగొట్టి ఆజీర్తిని తొలగించి యందమును బారదోలి వాంతులను ఆడంచి దృఢము గలిగించుటలో నిది అత్యద్భుతమగుటచే నెల్లరును దీనిని వదలక నుపయోగించు చున్నారు. వేయి చెప్పనేల యిప్పుడు వ్రాసి తెప్పించి చూడుడు.

ధరలు.

| | |
|---|---|
| 25 మాత్రలు | 0-1-0 |
| 110 మాత్రలు చిన్నడబ్బితో | 0-4-0 |
| 455 మాత్రలు మంచి అందమయిన డబ్బి | 1-0-0 |

ఎస్. వైద్య అండు కంపెని
పార్కుటవున్, మదరాసు.

సోలుఏజంట్లు:—
టెలిగ్రాఫు అడ్రసు
'వైద్యకో' మదరాసు (32 a)

అరణా-చీటి పంపినచో క్యేటలాగు చితముగ పంపబడును.

# ఉర్దూ భాష

ఎచ్. మహబూబ్ ఖుస్రూఖాన్ గారు

ఉర్దూభాష యీ జాతిలోఁ బుట్టినది వీరు దీని నిర్మాతలు అని నిర్ధారణ చేయుట యసాధ్యము. అది యొక భాషావికృతి యుఁ గాదు. అది సమస్త ప్రాగ్దేశభాషాసమ్మేళనజనిత మగు నమృతము వంటి మధురభాష. పశ్చిమదేశభాష యగు నాంగ్లము గూడ నీ భాషతో సంబంధము గలిగి యున్నది. మన మెఱిఁగినంతవఱకీ భాష పుట్టి దాదాపు 800 సంవత్సరములే. దీని జన్మస్థానము హిందూదేశచరిత్రలో సుప్రసిద్ధ మయిన ఢిల్లీనగరములోని "షాహజహానాబజార్". బ్రిజభాష దీనికి మాతృక యని చెప్పవచ్చును.

ఉర్దూభాషాచరిత్రమును దెలుపుటకు ముందు దానికి మాతృక యగు బ్రిజభాషాచరిత్రమును దెలుపుట యవసరము. అట్లు తెలుపవలసినచోఁ బ్రాచీనహైందవభాషను గూర్చి కొంత చెప్పవలసి యున్నది. హిందూదేశభాష లన్నిటిలో నాదిభాష హైందవాదిమ నివాసుల భాష. ఉత్తరమునుండి భరతఖండములోని కార్యుల ప్రవేశము కలుగుటంబట్టి యంతకు మున్నే యీ దేశవాసులై యుండిన యాదిమనివాసులకును వారి భాషకును క్రమముగా నంతము గలిగెను. ఆ భాష వినాశము నొందినను దానియందలి పదములు కొన్ని యిప్పటి యాంధ్ర ద్రావిడ ఓఢ్ర భాషలలోఁ గనఁబడు చున్నవి. ప్రప్రథమమున మధ్యాసియానుండి వచ్చిన యార్యులు నాగరికులు ఎయిలు వెడలినపుడు వారిలోఁ గొందఱు పర్షియా యనఁబడెడి యీరాన్ దేశమునకుఁ బోయి యచట స్థావర మొందిరి; మఱికొందఱు హిమాలయముల నుండి బంగారు భూమి యన నొప్పి మిగుల సారవంతమై యుండిన భారతదేశముఁ బ్రవేశించిరి. ఈ యిరుతెగలవారును నేకవంశసంజాతు లగుటచే నొకే సామాన్యభాషను మాటాడువారుగా నుండినను పరస్పరవియోగకాలము దూరమైన కొలఁది రెండు తెగల భాషలును వేర్వేఱు రూపములు దాల్చెను. హిందూదేశపు టార్యుల భాష యనివార్యము లగు కొన్ని మార్పుల నొంది సంస్కృత మయ్యెను. స్వభాష యగు సంస్కృతము పరదేశభాషాసంపర్కముచేతఁ జెడిపోవునేమో యను భయముచే వారు దాని కే మార్పులు కలుగకుండునట్లు జాగ్రత్తపడి దానిని "దేవవాణి" యని పిలుచుచుండిరి. "దేవవాణి" యన దేవతల భాష యని యర్థము. ఆ దేవవాణిని విదేశీయులు మాటాడుట గాని వినుట గాని మహాపాతకమని వారు శాసించిరి.

అయినను, భారతదేశాదిమనివాసులతో హైందవార్యులకు నిరంతరసంబంధము సంభాషణము ఉత్తరప్రత్యుత్తరములు ఉండుటంబట్టి వారి కా పనికై యొక ప్రత్యేకభాష యవశ్య మయ్యెను. అందుకై యొక భాషకు బదులుగా వివిధప్రదేశములందు సంస్కృతభాషాజనితము లగు వివిధప్రాకృతభాషలు పుట్టినవి మన్నవి. వ్యవహార మీ వివిధప్రాకృతభాషల మూలమున జరుగుచుండెను. సంస్కృతము మత రాజకీయవిషయములకై ప్రత్యేకింపఁబడిన పవిత్ర భాష యయ్యెను.

సంస్కృతము నంత జాగ్రత్తగా కాపాడినను కాలవశమున దానికిఁ గీడు మూఁడకపోలేదు. క్రీ. పూ. 54-వ సంవత్సరమున బౌద్ధమతము ప్రాకృతభాషామూలమున నప్రతిహతముగా దేశ మంతయు వ్యాపించెను. మగధరాజులు సంస్కృతమును మూలకుఁ ద్రోసి మత రాజకీయవిషయములకై ప్రాకృతమునే భాషగా వాడఁజొచ్చిరి. పిదప బౌద్ధమతమును వినాశ మొందించిన శంకరాచార్యుఁడు మూలఁబడియుండిన సంస్కృతమును పునరుద్ధరించెను. పండితులు కవులు తమ రచనలచే నా భాష నలంకరించి దాని ప్రాధాన్యమును నిలిపిరి. జగన్నాథుం డను కాశీవాసపండితుఁ డొక గ్రంథము లిందునకు నిదర్శనము లని వేఱుగఁ జెప్పవలయునా? అట్లు సంస్కృతము రాజభాషయు మాగధీయప్రాకృతము సామాన్య జనవ్యవహారభాషయు నయ్యెను. బ్రిజభాష యను నామాంతరము గలిగిన యీ మాగధీయప్రాకృతమే నేఁటి యుర్దూభాషకు మాతృక.

ఇఁక పారసీకదేశపుఁ బ్రాచీనభాషను గూర్చి కొంత నుడువవలసియున్నది. ఫార్సీ సంస్కృత భాష లధికసంబంధము గల సోదరభాషలు. ఈ రెండు భాషలలో నించుమించుగా నొకే రూపమును అర్థమును గల సామాన్యపదము లిప్పటికి ఫార్సీభాషలోను గనఁబడు చున్నవి. ఉదాహరణముగా నీ క్రిందఁ గొన్ని వ్రాయఁబడియున్నవి:

| సంస్కృతము. | ఫార్సీ. |
|---|---|
| భ్రాతృ | బిరాదర్ |
| అంగుష్ఠం | అంగుష్ట్ |
| ఖరం | ఖర్ |
| మాతృ | మాదర్ |
| జానుః | జాను |
| భూమిః | బూం |

ప్రాచీనఫార్సీభాషకును సంస్కృతభాషకు నిట్లు సహోదరసంబంధ ముండినను పరస్పరదీర్ఘవియోగముచే నీ రెండు భాషల సామాన్యత్వము కాలక్రమమున నశించెను. పారసీకదేశపు శీతోష్ణస్థితి మతము ప్రజాజీవనవైఖరి యివి యన్నియు ఫార్సీభాషారూపమునందును పదములందును ఎన్నియో మార్పులు కలిగించెను. వీని యన్నిటికంటె నా భాషను పూర్తిగా మార్పు నొందించినది గ్రీసుదేశపు రాజగు అలెగ్జాండరు దండయాత్ర. రూపాంతర మందిన యీ భాష

ములో సకలజనసమ్మత మైన భాషయై యొప్పుచున్నది. దాదాపుగాఁ బ్రపంచములోని ప్రసిద్ధము లగు నన్ని భాషల పదములు నీ యుర్దూభాషలోఁ గానఁబడుచున్నవి. ఉదాహరణము:—అరవములోని 'ఉరద్'; గుజరాతిలోని 'సన్నా'; తుర్కీలోని 'ఖాన్'; ఇటాలియను భాషలోని 'కమరా'; అమెరికాభాషలోని 'టంబాకు'; పోర్చుగీసు భాషలోని 'నీలాం'; ఇంగ్లీషులోని 'స్టేషన్'. ఉర్దూభాష యిట్లే క్రొత్త భావతో సంబంధించినను దానినుండి యెవరు వలయు పదముల నప్పుడే తీసికొనుచు వివిధనవీనాలంకారశోభిత యగుచు వృద్ధి యగుచున్నదే గాని క్షీణించుట లేదు. కాని లోకహితత్వము శీఘ్రవృద్ధి యీ భాషాసాహిత్యమునకుఁ గారణము లయ్యెను. పాఠకులఁ బరవశత్వము నొందించు కావ్యములను రచించి యశ మార్జింపఁ గోరిన కవుల కది యత్యనుకూలభాష యయ్యెను. నవరసములఁ జిప్పిలు మనోహరము లగు పద్యకావ్యములు వేనవే లీ భాషలో వ్రాయఁబడినవి. అయినను, మొన్నటివఱకు నే కారణము చేతనో గాని పద్యకావ్యములు రచింపఁబడినంత విరివిగా వచనకావ్యములు రచింపఁబడలేదు. లక్నోపురమున మాత్ర మిటీవల వచనకావ్యములు విశేషముగానె రచింపఁబడుచున్నవి. ఆదినుండియు విఖ్యాతు లగు సుప్రసిద్ధవచనకావ్యకర్త లందఱును లక్నోపురవాసులే యని చెప్పవచ్చును. 1798-వ సంవత్సరమున 'మీర్ మహమ్మద్ అతా హుసేన్' అను నాయన వ్రాసిన 'చార్ దర్వేష్' అను వచనకథ లోకప్రసిద్ధమై యనేక భాషలలోనికి పరివర్తనము చేయఁబడినది.

19-వ శతాబ్ది యారంభమున ఆంగ్లేయులు దేశీయులతోఁ బూర్తిగాఁ గలిసిపోయి దేశీయముఖ్యభాష యగు నుర్దూభాషను బాగుగ నేర్చి దాని వ్యాప్తికై చాల కష్టపడిరి. వారి ప్రోత్సాహమున 'బాగ్ ఉర్దూ' 'ఆరాయిషె మహఫిల్' 'బాగోబహార్' మొదలగు పద్యగద్యకావ్యము లనేకములు ప్రచురింపఁబడినవి. 1802-వ సంవత్సరమున 'జాన్ గిల్‌క్రిస్ట్' అను నాంగ్లేయుఁడు స్వయముగా నొక వ్యాకరణమును వ్రాసెను. హిందూమహమ్మదీయులు కొందఱు పవిత్రము లగు నిజమతగ్రంథముల నీ భాషలోనికిఁ దర్జుమా చేసిరి. మౌల్వీ అబ్దుల్ ఖాదర్ సాహెబు ఖురానును నీ భాషలోనికి పరివర్తించెను.

18౩౫-వ సంవత్సరములో ఉర్దూ వ్యావహారికభాషగా నంగీకరింపఁబడి మఱుసంవత్సరమే మొట్టమొదటి వార్తాపత్రిక ఢిల్లీలో స్థాపింపఁబడెను. నాఁటినుండియు నుర్దూభాష పాశ్చాత్యవిజ్ఞానమును బోధించుటకు ననుకూలమై శీఘ్రకాలములోనే యఖిలాధునిక శాస్త్రగర్భితమై సర్వసామాన్యభాషయై యలరారుచున్నది.

# శ్రీ రామవర్మ, స్వాతితిరునాళ్ — (1813-29-1847)

భావరాజు వేంకటకృష్ణరావు గారు, బి. ఏ.

శ్రీ గర్భ శ్రీమంతుఁడైన యీ మహారాజు అబలాసచ్చరిత్ర రత్నమాలా పాఠకమహాశయులకు తెలిసిన మహారాజ్ఞి గౌరీలక్ష్మీ బాయి జ్యేష్ఠతనయుఁడు. గర్భములో నుండిననాఁటి నుండియు నితఁడు మహారాజని ప్రజ లెల్ల చెప్పుకొనుచుండిరి. స్వాతి నక్షత్రమున జన్మించుటచే నీయనకు స్వాతితిరునాళ్ అని నామకరణము చేసిరి. స్వాతితిరునాళ్ మహారాజు మహావిద్వాంసుఁడు కవి గాయకుఁడు భరతశాస్త్రజ్ఞుఁడు. ఈయన ఆంగ్ల సంస్కృత ఆంధ్ర కర్ణాటక ద్రావిడ పారసీక హిందూస్థానీ మహారాష్ట్ర భాషలు మాటలాడఁగలిగియుండుటయే గాక యించుమించుగ నన్ని భాషలయందును కవనము చెప్ప సమర్థుఁడై యుండెను. ఇతఁడు సంస్కృతమున భక్తమంజరి పద్మనాభశతకము స్యానందూరపురవర్ణనప్రబంధము అజామిళోపాఖ్యానము కుచేలోపాఖ్యానము మున్నగు గ్రంథములు రచించెను. మాతృభాషయైన మలయాళమునందు కూడ అనేక ప్రబంధములను రచించెను. సంస్కృత ఆంధ్ర మలయాళములం దనేక కీర్తనలు రచించి పాడెను. ఆంధ్రమునందలి యీయన వర్ణములు కీర్తనలు తెలుఁగు దేశమునందు మూలమూలల గ్రామములం దిప్పటికి సంతతము పాడఁబడుచున్నవి. ఈయన నాంధ్రమందు ప్రబంధములు గూడ రచించెనఁట. అవి లభ్యపడలేదు. సంగీతమునందు నూతనవర్ణములు కల్పించి పాడి త్యాగయ్య గోవిందమారారు మొదలగు మహనీయులచే పొగడఁబడెను. ఈయన భరతశాస్త్రమునందు కడు నిపుణుఁడై నాట్యము చేయఁగలిగియుండెను. ఆంధ్రమునం దీయన రచించిన కొన్ని కీర్తనలు నాకు దొరకినవి. ఈ మహారాజు తన కృతు లన్నియు తన యిలువేల్పయిన యనంతపద్మనాభస్వామికే అంకిత మిచ్చెను.

ఈయన యీ కీర్తనలందు తాను సఖి యనియు పద్మనాభుఁడు ప్రాణేశుఁ డనియు సంబోధించియున్నాఁడు. ఇతని పదలాలిత్యము చాల హృదయరంజకముగా నున్నది. కవిత్వపటిమ యెట్టు లుండెనో చవి చూడ గ్రంథము లేవియు దొరకలేదు. పరమభాగవతోత్తముఁడైన యీ రాజశేఖరుఁడు త్యాగరాజు సమకాలికుఁడు.

# హిందూదేశము—పారిశ్రామికములు

బండి బుచ్చయ్య చౌదరి గారు

మన దేశమునం దాంగ్లేయులు ప్రవేశించినది మొదలు మన యైశ్వర్యకారణ మైన సంపదాధారములు చాలవఱకు శోషిల్ల మొదలిడినవి. ఈ విషయము హిందూదేశములోని ప్రతి రాజనీతిజ్ఞునకును తెలిసియును. పదునెనిమిదవ శతాబ్దిని మన దేశము చేతిపనుల తోడను వ్యవసాయముతోడను తులఁదూఁగుచుండెను. ఏ పాశ్చాత్య దేశస్త్రీలు చూచినను, హిందూదేశమున తయారు కాఁబడిన సరకులే కాన్పించుచుండెడివట. మన చేతిపను లభివృద్ధియందున్నప్పుడు ఆంగ్లపార్లమెంటువారును ఈస్టిండియా కంపెనీవారును స్వలాభాపేక్షిత మగు వాణిజ్యనీతి ననుసరించి మన పారిశ్రామిక వాణిజ్యముల నణఁగఁద్రొక్క స్వార్థపరులై తమవారిని ప్రోత్సాహపఱచుచుండిరి. ఇఁక హిందూదేశము పాశ్చాత్యదేశములందుఁగల యంత్రాలయము లన్నిటికిని దాస్యము చేయుచు వానికి వలయు పదార్థముల నుత్పత్తి చేసి పంపవలసివచ్చెను. మన దేశపు కర్మకారులమీఁదను వారి గ్రామముల మీఁదను విదేశవాణిజ్యాధికారులు నిరంకుశులై అకాలమునం బెట్టి దుండగము లొనర్చినను, వాని కన్నిటికిని సహింపవలసివచ్చెను. పిదప కాలముగా చట్టములు నిర్మింపఁబడినవి. మన దేశమునుండి విదేశముల కెగుమతియగు ప్రతివస్తువుమీఁదను అపార మైన సుంకమును విధించి విదేశములనుండి దిగుమతియగు వస్తువులకు నామమాత్రము కొంచెము సుంకములను గట్టి విదేశవస్తువులతో మన దేశమును నింపి మనకు ప్రతివిషయమునను వారే యొసఁగ నిలిచిరి. పాశ్చాత్యదేశముల పనివాండ్రు మన దేశపు వస్తకములను మీఱఁజాలక అధికారాస్త్రమును పూని మన పారిశ్రామికాభివృద్ధులపై భార మైన పన్నులు విధించి వానిని నశింపఁజేసిరి. తమన్న పాశ్చాత్యులు మన వర్తకస్పర్ధకు మీఱియుండఁజాలరు. అని యొక ఆంగ్లేయ చరిత్రకారుఁడే నుడివియున్నాఁడు. మన వర్తకనాశనమే మన దరిద్రస్థితికి కారణము. అందుచేతనే స్వదేశ పరిశ్రమలు విదేశీయంత్రాలయములతో పోటీకి నిలువఁజాలకున్నవి. మన దేశమున నున్న యంత్రములు గూడ నభివృద్ధి నొందలేకున్నవి. ఇఁక మనకు మిగిలియున్న యైశ్వర్యము ఒక్క వ్యవసాయమే. అది మూలాధారము. నూటికి ఎనుబదిమంది దానివల్లనే జీవించుచున్నారు. ఆంగ్లేయపాలకులు మన భూమి పన్ను లమితముగ విధించి తమ యిచ్చవచ్చినట్లెల్ల అనేకరాష్ట్రములలో హెచ్చుచేయుచుండిరి. దీనివిషయమై కర్జను బిగ్సు గారిట్లు నుడివియున్నారు. "ఇంగ్లాండుఖండమునందుఁ గాని ఏ యితరఖండమునందుఁ గాని మనము విధించినంత భూమిపన్నును మన మెన్నఁడును ఏ పరిపాలకుఁడును విధించి యుండలేదు." దీనిని బట్టి చూడఁగా, మన దేశమున భూమిపన్ను మిక్కిలి హెచ్చుగా నున్నట్లు తేలుచున్నది. న్యాయముగల పరిపాలనమందు ఇతర దేశముల పన్నులకును ఈ దేశమందు కట్టఁబడి పన్నులకును ఇసుమంతయు సంబంధమే లేదనుట వాస్తవము. ఇతర దేశ ప్రభువులు తమ దేశీయుల ద్రవ్యార్జనమునకు తోడ్పడెదరు. వారికి తగు నిర్వహులఁ జూపి సహాయము చేయుదురు. వా రైశ్వర్యవంతులై యుండఁజూచి సంతసింతురు. దేశపాలనకు వారియొద్దనుండి స్వల్పమూల్యమును మాత్రమె గ్రహింతురు. ఇంగ్లండు జర్మని ఫ్రాన్సు మొదలగు దేశములయందు దొరతనమువారు ప్రజలయొక్క రాబడిని వృద్ధిచేయుదురు. వారి సరకుల నమ్ముటకును వారి యైశ్వర్యమును వృద్ధిచేయుటకును తగిన మార్గమును వెదకుదురు. జనులతో నేకీభవించి మెలఁగుదురు. వేయేల? ప్రజల భాగ్యవంతుల నొనర్చి తా మైశ్వర్యవంతు లయ్యెదరు. మన దేశమం దట్లు గాదు. దొరతనమువారు ప్రజల నిమిత్తము క్రొత్త కర్మాలయము లేమియు నిర్మించుట లేదు. అడుగంటిన పురాతనపరిశ్రమల నుద్ధరించుటయు లేదు. పైపెచ్చు క్రొత్త సెటిల్ మెంటు వచ్చినప్పుడెల్ల సరియైన నిర్ణయము లేకయె తమ యిచ్ఛానుసారముగా పన్నులను హెచ్చుగ నిర్ణయింతురు. అట్టి సమయములయందెల్ల ఎంత సిస్తు హెచ్చుచేయుదురో యని ప్రజలు కలవర మొందుచుందురు. మన యధికారవర్గమువారి యభిప్రాయమె కడపటి యభిప్రాయము. ఒక కోర్టు గాని న్యాయవాది గాని ఒక తీర్పు గాని ఏదియు లేదు. మన దేశపు వైశ్వర్య మంతయు నితరదేశముల పాలగుచున్నది. తన దేశమున విధింపఁబడు పన్నంతయు నా దేశమునకే వినియోగపడవలయు నని ప్రతిదేశియుఁ గోరుకొనుచుండును. పూర్వము హిందూదేశపాలన మెంత యవ్యక్తముగ నుండినను, ఈ విషయమున మాత్రము కొనియాడఁదగియున్నది. ఆఫ్గన్ మొగలాయి చక్రవర్తులు సైన్యముల కెంతో సొమ్ము వెచ్చించినను అనేక రాజకుటుంబములును లక్షల కొలఁది సిపాయి కుటుంబములును బ్రతుకుచుండెడివి. వారెన్ని దివ్యభవనములు దేవాలయములు మసీదులు మొదలయినవి కట్టించినను ఆ ద్రవ్య మంతయు మన దేశపు పనివాండ్ర పోషణమునకై వినియోగపడుటయే గాక మన దేశముననే ఖర్చుపడి మన వాణిజ్యపారిశ్రామికములు వృద్ధి నందుచుండెడివి. ఇప్పుడో హిందూదేశము ఇంగ్లాండుఖండవాసులకు పాడియావువంటిది. మన దేశమునఁ గల ధనము ఏదియో యొక రూపమున వారు తమ దేశమునకే గుంజుకొని పోవుచుందురు. హిందూదేశపాలనమందలి యున్నతోద్యోగము లన్నియు తమవారికే యొప్పజెప్పుకొని ఏ యితరదేశములు నియ్యని యధికవేతనముల నిచ్చుచుందురు. మన యభివృద్ధికి కవసర మైన పనులను చేయుచుండ లేదు సరిగదా మీఁదుమిక్కిలి మన వృద్ధి కవసర మైన ఖర్చులను తగ్గించుచుందురు. ఎట్లయిన నేమి మన సొమ్మంతయు నితరదేశముల పాలౌటను చూచుచున్నాము.

భారతీయసోదరులారా! చూచితిరా! మన దేశస్థితి? ఇట్టి యప్పుడు భారతీయుఁడ నని చెప్పుకొను నెవని హృదయము చలింపకుండును? మన యార్థికస్థితి యిట్లుండ, ఎట్లు సంపన్నులమై విదేశీయులతో తులఁదూఁగఁగలము? ఇప్పు డొక్కటే మన యైశ్వర్య సంపాదనమునకు మార్గము! అది స్వరాజ్యసంపాదనమే. ఇదియే మన స్వాతంత్ర్యసంపాదక మగు నైశ్వర్యప్రదాయిని. ఈ సంపాదనమునకు సక్రమాందోళనమే యస్త్రము. కావున, ప్రతిభారతీయుఁడును

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ"

అను నార్యోక్తి ననుసరించి స్వరాజ్యసంపాదనకై పాటుపడి భారతీయులు కార్యసాధకు లను యశస్సును పొంద ప్రార్థించుచున్నాను.

బాధించుచుండెను. గానిపట్లను కూడ జర్మనుల సంశయము నిరాధారమై పోయెను. రుమేనియా ప్రజలు తమపక్షము చేరి మిత్త్రమండలితో యుద్ధముచేయుదురని తలచిన జర్మనుల విశ్వాసము అసత్యమైపోయెను. జర్మనులతో రక్తసంబంధము కలిగి తద్దేశమునందు నివసించుచున్న అమెరికా ప్రజలయందు జర్మను పాలకులు పెట్టినన్నమ్మకమును పెట్టుకొని తామెన్ని దుర్న్యయములు చేయుచు వచ్చినను అమెరికా యుద్ధమునకు దిగదని వారు పరిపూర్ణముగ విశ్వసించియుండిరి. సందేశమునకు ప్రతిసందేశములను పంపుటవలన విల్సనుమహాశయుడు శాంతించి కేవలము విషయచర్చతో సరిపెట్టుకొని యూరకుండుననియును, ఐరోపా పాశ్చాత్యాంగ క్షేత్రముపై వారిదృష్టి ప్రసరింపదనియును జర్మనులు నమ్మిరి. “సత్రో” తత్త్వమును జర్మనుల మూఢవిశ్వాసమునకు ప్రోద్బలకారి యయ్యెను. ఒకవేళ అమెరికావారు ప్రాణము విసిగి, తమకుగూడను యుద్ధము ప్రకటించినను, వేలకొలది మైళ్లు నీటిమీద ప్రయాణము చేసి, ప్రస్తుతరణోపయుక్తమైన యుద్ధద్రవ్యములను సేనలను ఐరోపా రణరంగములకు పంపి యెమ్మె ప్రతిఘటింప వచ్చెదిగా యని జర్మనులు సంశయించిరి. అమెరికావారు సర్వసన్నాహములు చేయులోపల శత్రువులను గడతేర్పలేమా యను ధైర్యము జర్మనుల కుండెను. ఆ మదకాపట్లను జర్మనుల కుదయించియుండిన ధైర్యము భ్రమమాత్రమని లోకమునకు వ్యక్తమైనది.

## ఆధునిక యుద్ధ స్వరూపము

పూర్వపు యుద్ధములకును ప్రస్తుతపు యుద్ధములకును వ్యత్యాసము చాలకలదు. పూర్వము బహిరంగప్రదేశములందు చతురంగబల సమేతములగు సేనలకు యుద్ధములు జరిగి జయమో పరాజయమో శీఘ్రకాలమునందు తేలిపోవుట సావకాశముండియుండెను. రణతంత్రమప్పుడును ప్రకృతమును ఒకటియేయైనను ప్రస్తుతము పూర్వకాలమువలె గాక రణస్వరూపమునందు పూర్తిగ పరివర్తనము కలిగినది. వందలకొలది మైళ్ల ముఖము గల ప్రస్తుతరణరంగమునందు ఒకటి రెండు యుద్ధములతో జయాపజయములు పరిష్కృతములు కావు. పూర్వముకంటెను ఆధునిక సేనయందలి వివిధదళముల కవసరములగు ఉపకరణములు వృద్ధియైనవి. ప్రస్తుతము సైనికుడు లోకయంత్రము; వారి కుపయోగపడు ఉపకరణము లోకయంత్రము. ఆధునికయుద్ధస్వరూపముతోబాటు సైనికుల యవసరములును పెరిగిపోయినవి. సైన్యావసరములలో మందుసామగ్రి, భోజనసామగ్రి, సులభమైన గమనాగమనములును ముఖ్యములు. ఆరువేలమంది గలయొక అక్షౌహిణీ సేనను ఒక ప్రదేశమునుండి మరియొక ప్రదేశమునకు కదల్చుటకై 200 రైళ్లవసరమగుచున్నప్పుడు ఆ సేన కుండవలసిన పరికరముల బాహుళ్యమును పాఠకులు సులభముగ గ్రహించుకొనవచ్చును. సేనాముఖమును చేరిన సేనలకు నిరంతరాయముగ రణసామగ్రిని సమయానుకూలముగ నందజేయుటయును సుకరము కాదు. దుర్భేద్యమైన కందకసంరక్షితమును, ఆధునికయుద్ధోపకరణసహితమునగు విశాలసేనాముఖమునందు పోరాడుటకు లక్షలకొలది సేన అవసరము. ప్రస్తుతయుద్ధమునందు సేనలు తమ శిబిరములకు సమీపమునందు గల సేనాముఖమునుండి బహిర్గతమై ముందునకు వెళ్లినకొలదిని వానికి కావలసిన పదార్థముల గమనాగమనములకు నిరోధము కలుగుచుండును. శత్రుసేనలు వెనుకకు మరలునప్పుడు తాము త్యజింపవలసిన ప్రదేశమునందలి మార్గములను తత్స్థానములను ధ్వంసముచేసి శ్మశానతుల్యముగ నొనరించి వేయును. అట్టి స్థితియందా ప్రాంతము నాక్రమించుకొని ముందునకు మార్గమును చేసికొనవలసిన సేనలకు కలిగెడి యవాంతరములకు మితిమేర లుండవు. శత్రువులు శతఘ్నులనుండి యెడతెఱపి లేక అగ్నివర్షము కురిపించుచుండ రక్షణరహితమైన బహిః ప్రదేశమునందు సైనికులు ముందునకు పోవుట చాల కష్టము. పలాయితులగు సేనల కెప్పుడును తమ పదార్థశిబిరములు సమీపముననే యుండును. తన సేనాముఖము చీలిపోకుండ శత్రువు పురోగమనమును నిరసించి, రణతంత్రోపయుక్తముగ వెనుకకు మరలుచున్నప్పుడే లన సమీపమునందలి శిబిరముల ప్రయోజనమును సేనలు పొందగలుగును గాని పరాజయముగలన చిందరవందరగ పరుగెత్తుకొని పోవు సేనలుగాని తన శిబిరప్రదేశముల కందుబాటులో నుండక చాల దూరము ముందునకు సాగిపోవు సేనలుగాని వాని ప్రయోజనమును పొందజాలవు. శత్రువును సూచీముఖమునందు ప్రబలసేనతో గాక వాని సేనను భేదించి తమ కనుకూలమైనట్లు భేదించిన ప్రదేశమునందు సేనలను మొగ్గరించి పార్శ్వములందలి సేనాదళములను మరలించుకొని విశాలముఖమునందు ముందునకు సాగుటకంటె వేఱు తంత్రమింతవఱకును ప్రస్తుతయుద్ధమునందు ఫలప్రదమగుటలేదు. ఇన్నిమిత్తము చేయవలసిన సన్నాహములకు ఆ ప్రాంతమునందలి తన సేనాముఖమునకు వెనుకభాగమునందు విశేషముగ రైలుమార్గములను నిర్మింపవలసియుండును. సహస్రముఖముల సేనలు వచ్చి పడుట కనుకూలములగు కాలిదారులను, మందుసామగ్రియు శతఘ్నులను సకలీలగ నొకమూలనుండి మరియొకమూలకు చేర్చుట కనుకూలమైన మార్గములను వేయవలసియుండును. యుద్ధమునందలి వ్యూహోపాయములను బట్టి క్షణకాలమునందు తలచిన ప్రదేశమునందు సేనలకును, రణోపకరణములకును సంయోగము కలుగుట కత్యవసరమైన సాధనసంపత్తి నంతటికిని కల్పింపవలసి యుండును. సూచీముఖతంత్రమునందు సమయాసమయములు జయమును పరాజయముగను, పరాజయమును జయముగను మార్పగలిగినంత వీలు కలదు. 1915, 1916వ వత్సరములందు జరిగియుండిన రెండు వైప్రెసుయుద్ధములందును జర్మనులు తాత్కాలికముగ ఆంగ్లసేనాముఖమును భేదింపగలిగినను దానివలనను వారు పూర్తియైనఫలమును పొందలేకపోయి యుండుటవలన ఆంగ్లసేనాముఖము తిరిగి కమ్ముకొని చివరకు శత్రువులకు పరాజయముగ పరిణమించియుండెను. జర్మనులు గత వసంతకాలమునందు స్వదేశోన్ముఖులై సోమ్ప్రాంతమునందలి కొంత రణరంగమును త్యజించి హిండెనుబర్గ సేనాముఖమును చేరియుండినప్పుడు ఆంగ్లసేనలు శత్రువును తఱుముకొని బాపొమ్మకోరు పెల్లికోరుపట్టణములను ప్రథమవేగమునందు వశపఱచుకొని యుండినను మిత్త్రమండలి మూలబలము సాహాయ్యము

కు వచ్చువరకుల జర్మను లక్కడకు వడ్డుగ సేనలను తెచ్చి ప్రతిక్రియగ నెదిరించి యుండకుండుటవలన ఆంగ్ల సేన లా ప్రదేశములను త్యజించి వేయవలసివచ్చెను. అందువలనను పలాయితులగుచున్న జర్మను సేనలకు కొన్ని వేళలందు విశేషము ఒత్తిడికలిగించి విన్యాసములయిన వారి సేనాముఖమును భేదించి పూర్ణవిజయమును పొందుటకవాంతరములు కలిగియుండెను. గతసంవత్సరపు సంగతు లెంగులవి? వర్తమాన ప్రస్థానమునందు జర్మనులు కేంబ్రెయి పశ్చిమమునందు ఆంగ్లముఖమును భేదింప గలిగి కొంత ప్రదేశమునందు ముందుకు వచ్చి ఆంగ్ల ఫరాసు సేనలను వేఱుపఱుప దలచినను, కొంతదూరము మాత్రము మిత్రమండలి వెనుకకు వెళ్లినవెనుక తమసేనలను వారు తిరుగ కూడదీసికొని జర్మనుల మొత్తును సాగనిచ్చియుండ లేదు. ఫ్లాండర్సునందు జర్మనులు ఆర్మెంటీర్సు ప్రాంతమునందు పోర్చుగీసు సేనను భేదించి మెర్విలువఱకును కొంతబడి గలిగియున్నను ఆంగ్లసేనలు తిరిగి కమ్ముకొనియుండుటచే జర్మనుల ప్రస్థానము కంతటితోనే వగమదశ సంప్రాప్తించియుండెను. గతవర్షాంతమునందు ఆంగ్లసేనలకు కాంబ్రెయి యొద్ద నిట్టి స్థితియే తటస్థించియుండెను. ఒకవేళ సేనాముఖమునందు రణరంగమును భేదింపగలిగినను భేద్యమైన సేన వెనుకనుండి వెనుకకుపోని నిలువ గలిగినప్పుడును, అవక్కడన కవలంబించి ముందునకు భేదించుకొని పోయిన సేనలకు తగిన పద్ధతి సహాయమునకు లేకపోయినప్పుడును యుద్ధమునందు పూర్ణమైన ఫలము కలుగదని పాఠకులు గ్రహించి యొకచోట ముఖమునందు సేనలు వెడమొగము పెట్టునట్లు చేయుటకు ఒక సేనను భేదించినప్పుడు ఆ ప్రాంతమును దాటి చాలదూరము పెరిగి కొంత సేనతో ముందునకు సాగి శత్రువు తన సేనలు కూడదీసికొనుటకు ప్రతిబంధకము కలిగింపవలసియుండు ననియు నిర్ధారణముచేసికొనవచ్చును.

## మిత్రమండలి రణప్రస్థాన తంత్రము

మేము గత సంచికయందు సందర్భమునందు సూచించియుండిన యొక కాల తీవ్రావస్థ యుండినలెంక మే పింగళ సంవత్సరమునందలి మిత్రమండలి రణతంత్రమని చెప్పవచ్చును. వివిధప్రాంతములందలి సేనాముఖములందు శీతోష్ణస్థితి సరిసమానముగ నుండనందున ఆయా ప్రాంతముల స్థితిగతుల కనుకూలమైన కాలమునందు శత్రువును ముట్టడించి, ఒక రణరంగమునుండి మరియొక ముఖమునకు సేనలను పంపి, పరాజయము కలుగకుండ తప్పించుకొనుటకు వీలులేకుండ యుద్ధము చేయుచున్నట్లు మిత్రమండలి ప్రస్థానతంత్ర మని పాఠకులు గ్రహింపవలసియుందురు. కాని నియమము పని పట్టినప్పుడు మిత్రమండలి సంయోగ ప్రస్థానతంత్రమునకు వికల్పము కలిగియుండెను. రష్యారాజ్యమునందు విప్లవోద్యమము బయలుదేఱి రాను రాను అంతఃకలహములు వృద్ధియై సైనికులయందలి రణశిక్షణము సన్నగిలి యోధలక్షణములు మఱుగుపడి పోయియుండుటవలన మిత్రమండలి సంయోగప్రస్థానభారమంతయు ఆంగ్ల ఫరాసు ఇటలీ సేనలు భరింపవలసివచ్చి రష్యారంగమునుండి శత్రువు తన సేనలను మరల్చి ముట్టడి జరుగుచు వచ్చిన రంగములందలి తన సైనికులకు పద్ధతుగ క్రొత్త సైనికులను పంపుటకు వీలు కలిగియుండెను. జర్మనులు ఆంగ్ల ఫరాసు ముఖమునందును ఆస్ట్రియావారు ఇటలీ ముఖమునందును సేనలను కేంద్రీకరణము చేయుటకు సులు వేర్పడియుండెను. అందలి ఫలితము ఆ సంవత్సరమునందలి ప్రస్థానపరంపరలందు వ్యక్తమయియే యుండెను. శత్రువునకు పరాజయము కలుగునట్లే రణరంగమునందును మిత్రమండలి వాని సేనాముఖమును భేదింప లేకపోయి యుండెను. అందువలనను పింగళసంవత్సరమునందు మిత్రమండలి జరపియుండిన యుద్ధప్రస్థానము ఫలవిశేషాత మని చెప్పుటకు వీలు లేదు. ప్రస్తుతపు మహాసంగ్రామమునందు శత్రుబలము తఱిగినగాని యెవరికిని విజయము కలుగుట దుర్లభము. శత్రుబల మునుగుటకు 1917 వ సంవత్సరమునందలి మిత్రమండలి ప్రస్థానములు సంపూర్ణముగ తోడ్పడుచు వచ్చియుండెను. సోము ఫ్లాండర్సు యుద్ధములను పశ్చిమరంగమునందలి యుద్ధప్రస్థానమును తెలియజేసినప్పుడు వివరించితిమి. అందలి ఫలితాఫలితముల నక్కడ పేర్కొనుట సముచితముగ నుండదు గావున వాని నిచట నుదాహరింపక వానివలన శత్రుబలము క్షీణించినదని మాత్రము టూకీగ తెలిపితిని. నిచట వసంతకాలమునందు రష్యాసేనలందు నిరుత్సాహము ఉదయించి క్రమక్రమముగ గణవిముఖతాభావము క్రిందను అది ప్రత్యేకసంధిగను పరిణమించినది. శీతకాలమునందు ఇటలీకి కలిగిన పరాజయము తోడ్పడుటవలన శత్రువునకు 1917-వ సంవత్సరారంభమునందుండిన శక్తిక్షీణ దుర్బలత్వమును, సైన్య దుర్బలత్వమును క్రమక్రమముగ తగ్గి వర్తమానమునందు నిలద్రొక్కుకొని విజృంభించుటకు వీ లేర్పడినది.

## పడమటి రంగము

పశ్చిమమునందలి సేనాముఖము ఉత్తర సముద్రము మొదలు స్విజర్లండు వఱకును సుమారు 450 మైళ్లు వ్యాపించియున్నది. సముద్రతీరము నందలి న్యూపోర్టు, ఆస్టెండు రేవుపట్టణముల మధ్యనొక ప్రదేశము నుండి, సేనాముఖము ప్రారంభమై డిక్సుమూడ్, ఆర్మెంటీర్సు, బెతూను, లెన్సు, ఆర్రాసు, ఆల్బర్టు మాంట్డిడియరు మీదుగ కొంచెము మిందుమిందు సరళముగ వచ్చి అక్కడ నుండి, పశ్చిమముఖముగ నాయనువకు వ్యాప్తమై రీమ్సు వర్డను వఱకును వంపు తిరిగి పిమ్మట దక్షిణముఖముగ సెయింటుమిహేలును సమీపించి, అక్కడనుండి ధరురా కారముగ నడచి స్విజర్లాండు సరిహద్దును చేరుచున్నది. యుద్ధప్రస్థానమును సులభముగ గ్రహించు నిమిత్తము న్యూపోర్టు మొదలు లోను వఱకును గల ముఖమును ఉత్తరఖండమని వ్యవహరించెదము. న్యూపోర్టు నుండి లెన్సువఱకును గల ప్రదేశమునకు వైప్రెసురంగ మనియు, ఆర్రాసు మొదలు లోనువఱకు గల ప్రదేశమును సోముముఖ మనియు నందు రెండు భాగములు. వైప్రెసు ముఖము లంబర్టు జీ; సెయింటు జార్జిసు, డిక్సుమూడు, ఆడ్కాపిలు, న్యూకాపిలు, పోలుకాపెలు, పాషెండేలు, జోన్బెకు, జెల్బెకు, హాల్బెకు, కెమ్మెలు, బైలూలు, మెటెరెను, మెర్విలు, గ్విన్షి, లాబాసి, లెన్సువఱకును; లెన్సు, ఆర్రాసు, బీమంటు, ఆల్బర్టు, రాయి, మాంటడిడియరు, నోయను, లోన వఱకును సోమురంగము వ్యాప్తము. దిగువను ముద్రించియుండిన పటమునందు ఉత్తరఖండమును దృగ్గోచరము.



ఉత్తరఖండము

లోను మొదలుకొని సెయింటు మిహేలువఱకును వ్యాప్తమై యుండిన సేనారంగమునకు మనము మధ్యమఖండమనియును, అక్కడినుండి స్విజర్లాండుసరిహద్దువఱకును గల సేనాముఖమునకు పూర్వఖండ మని పేరును వ్యవహరించుకొనవచ్చును. ఉత్తర మధ్యమఖండములకంటె పూర్వఖండము కగ్గ్వలమగుచు, దుర్గపరివేష్టితము. పూర్వఖండమునందలి సేనాముఖము గాదాప్రాగ వరాను, జర్మను దేశముల సరిహద్దు ప్రదేశము నాశ్రయించుకొనియున్నది. బెల్జియము స్విజర్లాండు దేశముల మధ్యను ఫ్రాన్సు జర్మను దేశములకుండిన సరిహద్దు ప్రదేశ మంతయు శత్రువులకు దుర్భేద్యమై దుర్గ పరంపరలచే నలరారుచున్నది. తత్కారణముచే నాప్రాంతము యుద్ధమునందు వ్యూహనిర్మాణమునకు యోగ్యము కాదు; విశాలముఖమునందు సేనలు మొగ్గరించుకొని ముందునకు వెళ్లుటకును వీలులేదు. 1917-18 వ ప్రస్థానమునందు యుద్ధ ముత్తరఖండమునకే నిశేషము వ్యాప్తమైయుండుటవలన మనకిక్కడ పూర్వమధ్యమ ఖండములతో నంత నిమిత్తము లేదు. మధ్యమోత్తరఖండములకుండిన సంబంధమే మిత్రమండలిదృష్టిని, శత్రుకోటిదృష్టిని యుద్ధమునం దుత్తరఖండము వైపునకు విశేషముగ ప్రసరింపజేయుచు ఆప్రాంతము ప్రబలసంగ్రామమున కాకరమై యున్నది. మో త్తరఖండముల సంబంధమును గ్రహించుటవలన పాఠకుల కాప్రాంతములందు జరుగుచువచ్చుచున్న ప్రస్థానప్రాముఖ్యము వ్యక్తమగును. మధ్యమోత్తరఖండము సర్పాకృతిని బోలియున్నది. అం దుత్తరఖండము సర్పపు శిరోభాగమువలెను, మధ్యమఖండ మధోభాగమువలె నున్నది. సర్పపుపడగవలె నున్న యుత్తరభాగమును శత్రువులు భేదించి ముందునకు పోవుటవలనను మధ్యమఖండమునందలి సేనాముఖము రక్షణయోగ్యము గాక సేనలు చిందఱవందఱయై వెనుకకు మరలిపోవలసియుండును. పామును తలమీద కొట్టినప్పుడు దానితోక చుట్టుకొనిపోవును. అట్లే ఉత్తరప్రాంతమునందలి సేనల నోడించినయెడల మధ్యమఖండమునందలి సేనలను చాపచుట్టవలె చుట్టి పాఱవేయుటకు సులు వేర్పడును. రణరంగమునందలి యుత్తర మధ్యమ ఖండముల సంయోగస్థానమునందలి ముఖము మాంటిడిడెయి మొదలు లోనువఱకును వ్యాప్తమైయున్నది. ఆసంయోగస్థానమునం దందువలననే గతవత్సరమును, ప్రకృతమును భీకరయుద్ధము జరుగుచు రణరంగమంతయు రక్తప్లావితమగుచున్నది. మధ్యమోత్తరఖండముల సంయోగస్థానమునందు మరియొక ప్రాముఖ్యము కలదు. ఆప్రాంతమునందే ఆంగ్లఫ్రాన్సు సేనల సంయోగస్థానమును కలదు. అక్కడ సేనాముఖమును శత్రువులు భేదించుటవలన ఉభయసేనల కలియికను చెడగొట్టి వానిని వేఱుపఱచి ప్రత్యేకప్రాంతములందు వానిని సంహరించుటకు వీలు కలుగును. జర్మను లీ తంత్రమును పురస్సరించుకొనియే వసంతకాలమునందు సెయింటు క్వెంటనుముఖమునం దవష్కందనమును ప్రారంభించి రని 1918 వ సంవత్సరపు జర్మను ప్రస్థానమును తిలకించినప్పుడు సులభముగ గోచరింపగలదు. ఆప్రస్థానతంత్రమును స్థలాంతరమునందు వివరింపబడును. యుద్ధపటమును దిలకించువారలకు మధ్యమోత్తరఖండముల సంయోగముఖము సూచీముఖమువలె నుండి వ్యూహతంత్రమున కనుకూలయోగ్యంబై యున్న దని వ్యక్తమగును.

A FIGHT FOR GERMAN GUNS NEAR ST QUENTIN



సెంటు క్వెంటిను వద్ద జర్మను తుపాకులకొఱకు పోరాడుట

[illegible]న్నాను. ఏప్రిలునందలి వసంత ప్రస్థాన సన్నాహములన్నీ చేసికొనుచుండిన కాలమునందు అర్రాసు, సిసాన్సు ముఖములందు శత్రువు తనయొక్క నానా ముఖములు పెట్టి నానాస్థానముల నాక్రమించుకొనెను. ఆంగ్ల సేనాని ముట్టడించుటకు నిర్ణయించుకొని యుండిన స్థానము శత్రువు త్యజించిన ప్రదేశమున కవతల నుండుటవలన శత్రువు వెనుకకు పోవుటచే కలిగిన స్థితిగతుల ననుసరించి యుద్ధము వెంటనే జరిగిన సైనిక బలమునందు సులభముగ మార్పులు గావించుకొనెను.

అర్రాసు ముఖము

పడమటి రంగమునందు తాము అవస్కందనమును ప్రారంభించుటకు యేర్పరచుకొనిన దినమునకు ముందుగనే ఏప్రిల్ 9 వ తేదిని ఆంగ్లులు అవస్కందనమును ప్రారంభించిరి. కాని ఆంగ్లులకు వీరి యవస్కందనము ప్రారంభమైనప్పటినుండియు వర్ష ప్రతిబంధము కలిగియుండెను. ఏప్రిల్ 9 వ తేది వరకును యెండ కాయుచు వచ్చి ఆనాటి ప్రాతఃకాలమునందు వర్షము ప్రారంభమై సాయంకాలమునకు కాలమానము పూర్తిగ మారిపోయినది. పిమ్మట కొంత కాలమువరకును మంచు పడుచుండెను, వర్షము కురియుచుండెను, హోరుమని గాలి వీచుచుండెను. తత్కారణమువలన యుద్ధ ప్రస్థానమునకు ప్రతిబంధకము కలిగినదని హేగు సేనాని తెలియజేసి యుండెను. అవస్కందనము ప్రారంభమైన తరువాతను వారము దినములకు ఆంగ్లులకు కలిగిన పురోగమనమువలన సైనికుల గమనాగమనములు దీర్ఘమై వారికి కావలసిన సామగ్రి యందుటయందు కష్టము కలుగుటయు, పదాతిసేన ముందునకు బోవుటయందు తోడ్పడవలసిన శతఘ్నిదళములు వచ్చుటకు అవాంతరములు కలుగుటయు జరిగి, శత్రువు తన మూలబలమును తీసికొనివచ్చుటకు వీలేర్పడి, వారు ప్రతిక్రియ చేయుటకు మార్గము కలిగియుండెను. ఆంగ్ల సేన 20 మైళ్ల ముఖమునందు 6 మైళ్లు ముందునకు పోగలిగినది; ఫ్లాండర్సు ముఖమునం దవస్కందనమును ప్రారంభించుటకు ముందు సోము తటమునందు ఆంగ్లులు వశపరచుకొనదలచిన ప్రదేశ పంక్తియు విజేతల స్వాధీనమయ్యెను. ఏప్రిల్ 9 వ తేదిని ప్రారంభమై యుండిన అర్రాసు యుద్ధము మే 5 వ తేదితో సమాప్తమయ్యెను. పరాసులకు సాహాయ్యకారిగ నుండునిమిత్తము ఆంగ్లు లా ముఖమునందు మే నెలయందు చాల రోజులవరకును ప్రచలనము చూపుచునే వచ్చిరి. అర్రాసు యుద్ధఫలితముగ ఆంగ్లులకు 60 చదరపు మైలుల ప్రదేశము స్వాధీనమైనది; 20 వేల మంది జర్మను సైనికులు బందీలుగ దొరికిరి; చిల్లర యుద్ధద్రవ్యములమాట యటుండ 257 శతఘ్నులు వశమైనవి. వానియందు 98 పెద్ద శతఘ్నులు కలవు. విమీగుట్ట ఆంగ్లులకు స్వాధీన మగుట వలనను వారి సేనాపంక్తి సురక్షితమైనది.

## పరాసుల అవస్కందనము

అర్రాసుయుద్ధము ప్రారంభమైన వారముదినములకు పరాసులు ఎయిను తటమునందును షాంపేనునందును అవస్కందనము నుపక్రమించి యుండిరి. కొంచెమించుమించుగ నేకకాలమునందు ఆంగ్ల పరాసు లిద్దరు నవస్కందనము ప్రారంభించుట వలన జర్మనులు ఆంగ్ల ముఖమునుండి సైనికులను పరాసురంగమునకు తీసికొనివచ్చుటకు వీలు లేకుండెను. కాని పరాసుల కక్కడ జర్మనులు ప్రబలమైన నిరోధమును కలిగించుచు వచ్చిరి. నెలల తరబడి ప్రబలయుద్ధము జరిగినగాని శత్రుసేనలబలము తరిగి ఆంగ్ల పరాసుల పురోగమనము త్వరితముగ సాగిరాదని వ్యక్తమైనది. మే 5 వ తేదిని పరాసులు షెమిన-డె-డెమె యందు శత్రువులను తలపడియుండిరి. పడమటిరంగమునందంతటిలో వసంతకాలపు యుద్ధప్రస్థానము ముగిసియుండెను. పరాసుల యవస్కందనముతో యుద్ధప్రస్థానమునందు నిర్ణీతదశ యేర్పడునని తలచినవ్యవస్థ ఫలప్రదమై యుండలేదు. కాని ఆ ప్రస్థాన పరంపరలవలన కలిగిన ప్రయోజనములనుబట్టి చివర కట్టిస్థితి యేర్పడునన్న ధైర్యమును, బలము నుదయించుటకు నవకాశము కలిగినది.

## ఫ్లాండర్సు యుద్ధము

ఉత్తరఖండమునందలి దక్షిణభాగమునందు ఆంగ్ల పరాసుల అవస్కందనము జరుగుచుండిన కాలమునందే ఫ్లాండర్సు యుద్ధమున

కలుగు చుప్పటిమాటజరుగు చుండెను. ఫ్లాండర్సునం దవస్కందనమును జరుగుటకుముందు మెసీన్సు వెస్టుషీటు గుట్టయు లిత్రాప్యంత ప్రదేశమును ఆంగ్లుల వశమైనగాని యుద్ధప్రణాళి కనుకూలము కాదు. మెస్సీను వెస్టు షీటుగుట్టలు ఆర్మింటీ్రసు, వైప్రెసుపట్టణములకు మధ్యనుకలవు. వెస్టుషీటు, మెసీన్సు ప్రాంతములు శత్రువులవశమునం దుండుటవలన వారు యెత్తైనప్రదేశమునందుండి వైప్రెసుపట్టణమును వైప్రెసు ప్రస్థమునందలి ఆంగ్లసైనికపంక్తులను శతఘ్నులతో బాదుటకు వీలు కలిగి అక్కడి రక్షణదుర్భరమై యుండెను. శత్రువు ఆ ప్రాంతపుగుట్టలను దుర్గములవలె బలపరచుకొని రెండుసంవత్సరములనుండియు తన శక్తి నంతను అక్కడే వినియోగించి తన సేనాముఖము నందు వానిని బురుజులుగ నుపయోగించుకొనుచుండెను. ఆ గుట్టలకు రెండున్నరమైళ్ళ దూరమునందు గల ఉష్ట్రావెరను ప్రాంతమును పట్టుకొనుటకు ఆంగ్లులు జూను 7 వ తేదీని 9 మైళ్లుముఖమునందు శత్రువును ముట్టడించిరి. ఒకదినము లోపలనే ఆంగ్లసైనికు లాప్రాంతమును వశపరచుకొని 7200 మంది జర్మనుసైనికులను బందీలుగ పట్టుకొనిరి; 70 ఫిరంగులును విజేతలకు స్వాధీనమైనవి. వైప్రెసుపట్టణమునకు తూర్పుభాగమునందును, ఉత్తరభాగమునందును ఆంగ్లులు ప్రారంభింపదలచిన యవస్కందనమునకు వెస్టుషీటు మెసీన్సుయుద్ధము ప్రాతిపదిక మైనది. డ్యూలిమాంటునకు యెదురుగనుండిన లీసునది మొదలు స్టీనుస్ట్రీటు దిగువవరకును గల 15 మైళ్ల ముఖమునందు ఆంగ్లులు ముట్టడించి, అందు ముఖ్యముగ జిల్బెకు - జాండవూరుమార్గము మొదలు బోసంగ వరకును గల 7½ మైళ్ళ ప్రాంతమునందు శత్రువును బాపవలయునని సంకల్పించియుండిరి. ఫ్లాండర్సు యుద్ధము జూలై 31 వ తేదిని ప్రారంభమై నవంబరు మాసాంతము వరకును జరిగినది. మొదటిదినమునందు ఆంగ్లసైనికులు జర్మనుల ప్రథమకందకశ్రేణిని వశపరచుకొనిరి. ఫ్లాండర్సు యుద్ధమునందు జర్మనులకు విషమదశ యేర్పడినప్పుడు అర్రాసు యుద్ధమునందువలెనే వారికి వర్షణదేవుడు తోడ్పడెను. అంతవరకును జర్మనుల స్వాధీనమునందుండిన యెత్తైనప్రదేశమును ఆంగ్లసైనికులు వశపరచుకొని ముందునకు వచ్చుటచే వర్షము కురియుటవలన జలమయమైన నిమ్నప్రాంతమునందు దుర్గము లేర్పరచుకొనవలసి వచ్చియుండెను. ఆ నున్నపునేలయందు ఫిరంగిగుండ్లుపడి, పెద్దపెద్ద గోతులుపడి, యవి జలముతో నిండిపోయి యుండెను. గోయ్యి, నేలకూడ జలమయమై పోయియుండుటచే నేది గుండమో యేది మార్గమో నిర్ణయించుటకు వీలు లేకుండెను. అట్టి యంతరాయములచే ఆగస్టుమాసమునందు యుద్ధమునందు విలంబన మేర్పడి, శత్రుమిత్రమండలి అవస్కందనమునందలి క్షిప్ర వేగమువలన కలిగిన భంగపాటునుండి తప్పించుకొని, సైనికులు బలపరచుకొనుటకు సులు వేర్పడియుండెను. ఆగస్టుమాస మధ్యమునందు యుద్ధమునందు ప్రథమపర్యాయము, శత్రువు నూతన రక్షణతంత్రము నవలంబించి యుండెనని వ్యక్తమైనది. మామూలుగ ప్రథమ సైనికశ్రేణియందు చాలమంది సైనికులనుంచి, శత్రువును యెదిరించుట జర్మనుల వాడుకయై యుండెను. సోము యుద్ధారంభమునుండియు నాథునికి యుద్ధములందు, అవస్కందనతంత్రమునందు కంటె రక్షణతంత్రమునందే సైనికుల కెక్కువనష్టము కలుగునను సిద్ధాంత మేర్పడినది. జర్మనుసైనికు లెంతటి బలిష్ఠమైన స్థానముల నాశ్రయించుకొనియున్నను మిత్రమండలి ఫిరంగికి వారు [illegible] సోము యుద్ధమువలన తేలినది. అట్టిది ప్రథమ సైనిక శ్రేణియందెక్కువ సైనికులనుంచి నష్టపోవుటకు జర్మనులెందు కొప్పుకొందురు? కావున వారు ప్రథమ శ్రేణియందల్పసైనికులను మాత్రము శత్రువు ముట్టడిని నిరోధింపగలుగునట్లుంచి, వెనుకటి సైనిక పంక్తులందు బాగ నంత సైనికులను నిలువబెట్టి యదను వచ్చినప్పుడు శత్రువుపైనను ప్రయోగించి తమ సేనాముఖమును రక్షించుకొను నూతన తంత్రము నవలంబించిరి. వైప్రెసునకు తూర్పుభాగమునందు ఆంగ్లు లవలంబించిన యవస్కందనమునందు జర్మను లీ రక్షణతంత్రమువలనను మిత్రమండలి ప్రయోగమునను కొంతవరకు నాపగలిగినను వారు ఆరంభమునందు త్యజించిన స్థానములను పట్టుకొనలేక పోవుట సంభవించె. జర్మనుల నూతన రక్షణతంత్రము కాలక్రమమున ఫలప్రదమై యుండక పోవుటవలన వారు 1917 వ సంవత్సరాంతమునందు దానిని విసర్జించిరని చెప్పుదురు. సెప్టెంబరు మాసాంతమునందు యుద్ధము తిరిగి ప్రారంభమై నవంబరు 10-వ తేదివరకును జరిగి, పాశ్చెండేలు, గ్రావెన్స్టాలు ఆంగ్లులకు స్వాధీనమైనవి. ఫ్లాండర్సు అవస్కందనము నాలుగున్నర మాసములు జరిగి 24065 మంది సైనికులు బందీలుగ విజేతల వశమైరి. 74 శతఘ్నులును, 941 మరఫిరంగులును, 138 [illegible]లును కూడ ఆంగ్లుల వశమై యుండెను. 1917 - వ సంవత్సరమునందు ఏప్రిల్ 9 మొదలు ఫ్లాండర్సు యుద్ధానంతరము వరకును మొత్తము మీదను 57,976 మంది సైనికులు విజేతలకు బందీలుగ దొరికిరి. వారియందు 1290 మంది సైన్యోద్యోగులు గలరు. 1916 వ సంవత్సరము నవంబరు మాసమునందు మిత్రమండలి [illegible] సమావేశమై నిర్ణయించుకొనియుండిన ప్రస్థాన ప్రణాళిక 1917 వ సంవత్సరమునందు నిజముగ యుద్ధమునందు సంభవమైన వ్యవస్థకును చాల వ్యత్యాసము కలిగియుండెను. వారక్కడ నిర్ణయించియుండిన యేకకాల సంయుక్తావస్కందనము పని పట్టినప్పుడు సిద్ధించి యుండలేదు. రుష్యాసేనలు వసంతోదయముతో విజృంభించి శత్రువును భంజింప గలిగినను చివరకు తలవని తలంపుగ సేనలు నిరుత్సాహము చెంది అవి మిత్రమండలికి చేయవలసిన సాహాయ్యము చేయలేక పోయినను, శత్రువు లేనిసేనల నక్కడనుండి మరలించుటకైనను ప్రతిబంధకము కలిగింపలేకపోయినవి. ఇటలీ గెలుపు అవస్కందనమునకు సిద్ధముగాకపూర్వమే ఆంగ్ల ఫ్రెంచి సేనలు [illegible] నం దవస్కందనము ప్రారంభింపవలసి వచ్చెను. [illegible] శత్రువును భంజింపగలిగినను, దురదృష్టముచే ఇటలీవారికి నష్టములు కలిగిన శీతకాలమునందు విశేషమైన యొత్తిడికలిగి, తాము పదపడి రంగమునందు ప్రారంభించిన యవస్కందనము పూర్తిగా విరమించి వారు తమ రంగమునుండి, కొంతసేనను మరల్చి ఇటలీవారికి సహాయముగ పంపవలసి వచ్చినది. అట్టి యనివార్యమైన యసందర్భములవలన ఆంగ్ల పరాసులు తలచినదానికంటె విశేషభారమును వారు మోయవలసి

వచ్చెను. శత్రువు ఈ కారణములవలన మిత్రమండలి ప్రస్థానములకు తాత్కాలికముగ నైనను ప్రతిక్రియ చేయగలిగి, పరాజయము నుండి తప్పించుకొని యుండెను.

## కాంబ్రయి యుద్ధము

ఆంగ్లపరాసులు ఫ్లాండర్సు, ఆర్త్రాసు, షాంపేను ప్రాంతములందును, ఎయిను తటమునందును శత్రువును ముట్టడించుటచే సేనారంగమునందలి యితరముఖములను బలహీన పరచి, శత్రువు ఆంగ్ల పరాసులను ప్రతిఘటించుటకై యా ప్రాంతములయందు తన సేనలను కేంద్రీకరణము చేసియుండెను. తత్కారణముగ ఆంగ్లేయులు స్వల్పమైన శత్రుముఖమును ముట్టడించుటకు సంకల్పించి కేంబ్రయి ముఖమును తమ ప్రస్థానరంగముగ నిర్ణయించి నవంబరు మాసాంతమునందు యుద్ధమారంభించిరి. ముట్టడి జరుగునని శత్రువునకు తెలియకుండ రహస్యముగ యుద్ధమును ప్రారంభింపవలయు నని ఆంగ్ల సేనాని ముఖోద్దేశమై యుండెను. ముట్టడికి ముందుగ శతఘ్నులనుండి యింగ్లీషువారు అగ్నివర్షమును కురిపించియుండలేదు. ఆంగ్లేయులు నూతనముగ నిర్మించియుండిన "టాంకు" లని వ్యవహరించుచున్న యుద్ధోపకరణములవలన శత్రుకంటకములను సంరక్షించుచుండిన ఇనుపతీగెలను నరికివేసినపిమ్మట శతఘ్నులనుండి యగ్నివర్షమును కురిపించి పదాతిసేనలు ముందునకు పోయిన యనంతరము ఆశ్వికులు వారికి మద్దతుగ వెన్నంటునట్లు వారేర్పరచిరి. ఆంగ్ల సేనాని సంకల్పించిన ప్రస్థాన తంత్రమంతయు సరిగనే జరిగియుండెను. గోనెలు తూర్పుభాగము మొదలు నార్తు కాలువవరకును గల 6 మైళ్ల ముఖమునందు నవంబరు 20 తేదిని ఆంగ్లేయులు జర్మనులను ముట్టడించి ఆనాటి సాయంకాలమునకు జర్మను లొకటివెనుక నొకటి మూడువరుసలుగ కట్టియుండిన కందకావళులను విశాలమైన ముఖమునందు ఛేదించి 4½ మైళ్లు ముందునకు వెళ్ళిరి. 21వ తేదిని ఆంగ్ల సేనలు నైసుక్వేరు, లీ-కి-డీ-విగ్నీ, అన్నా గ్రామములను పట్టుకొని ముట్టడి ప్రారంభించియుండిన ముఖమునందంతటను ముందునకు వెళ్లినవి. కాని అప్పటికే జర్మను సేనల నిరోధము బలపడుచుండెను. ఆంగ్లేయులు పట్టుకొనిన ప్రదేశముల ప్రయోజనము బోర్లను వనమును, పట్టణమును వశపరచుకొనుటవలన వృద్ధి కాగలదు. అవి శత్రువశమునందే కలవు. వానిని స్వాధీనము చేసికొనుటకే చివరకు ఆంగ్ల సేనాని నిశ్చయించియుండెను. ఇటలీరంగమునందలి విపన్నదశయు శత్రువు వెనుకకు మరలుటకు సంకల్పించిన ట్లగపడుటయు ఆంగ్ల సేనాని నిశ్చయమును మరింత బలపరచియుండెను. అప్పు డాంగ్ల సేనలు మహోపరాక్రమముతో బోర్లను వనమును పట్టణమును ముట్టడించి యెడతెగకుండ నైదుదినములు యుద్ధముచేసి బోర్లనుపర్వతముమీది యొక్క ఎత్తైనస్థానము నాక్రమించుకొన గలిగినను ఆ ప్రాంతపు సంరక్షణమునకు యోగ్యమైన ప్రదేశమును వశపరచుకొన లేకపోయి యుండెను. అప్పటికి ఆంగ్లేయులు 10500 మంది ఖయిదీలను పట్టుకొనిరి; వారికి 142 శతఘ్నులు దొరకినవి. నిరంతర యుద్ధమువలన కలిగిన శ్రమచే ఆంగ్లసైనికు లప్పటికి అలసిపోయి యుండిరి. నవంబరు 31వ తేదిని జర్మనులు వెండుహాలు మొదలు మాస్నీరువరకును వ్యాప్తమైన 10 మైళ్ల ముఖమునందు ఆంగ్లేయులను ముట్టడించి బోనావిస్టు ఉత్తర ప్రాంతమునందును, గోనెలు ప్రాంతమునందును వారి పదాతిసేనలు శరవేగముతో వచ్చి పడుటవలన ముట్టడి ప్రారంభమైన దని గ్రహించుటకు పూర్వమే ఆంగ్ల సేనను భేదించుటకు వీలుకలిగిన ట్లగపడు చున్నదని హేగుసేనాని తాను ప్రకటించియుండిన యుద్ధకథనమునందు నుడివి యున్నాడు. జర్మనుల పురోగమన మతిత్వరితముగ జరిగియుండెను. విల్లర్సు, గ్వాజిన్నేరు, గోనెలు, బోనావి, గౌజోకోర్టు గ్రామములు వారి కారంభమునందు స్వాధీనమైయుండెను. అప్పు డాంగ్ల సేనలక్కడ శత్రువును ప్రతిఘటించి వాని పురోగమనము నాపినవి. సేనాముఖమునందలి యుత్తరభాగమునందు ఫాంటెయిను మొదలు బూర్లోను కాప్పువరకునుగల రంగమునందు కొన్నిగంటల యనంతరము జర్మనులు ముట్టడించుట కారంభించిరి. అక్కడను ముట్టడించవలయుననియే జర్మనుల ప్రధానోద్దేశము. వారు తమయుద్దేశము నెరవేరుటకు పట్టుదలతో ప్రబలసేనతో ఆంగ్లేయుల నెదిరించిరి. వైప్రసు మొదటియుద్ధమునందువలెనే కేవలము సైన్యబాహుళ్యముచే శత్రువులను లొంగదీయవలయునను యుద్దేశముతో నక్కడ వారా ప్రాంతమునం దొక దినమున అయిదుసారులు ముట్టడించిరి. పదాతిసైనికులు బారులుకట్టి లెక్కలేని ముఖములవలె వచ్చిపడిరి; ఒక సమయమునందు జర్మను పదాతిసైనికులు నొకరి తరువాత నొకరు 11 వరుసలుగవచ్చి సేనాముఖమునందు ముట్టడించిరి. జర్మను సైనిక శ్రేణులు ఆంగ్ల శతఘ్నులయెదుట మంచువలె కరగిపోవుచుండెను. డిసెంబరు 3వ తేది వరకును ఉభయపక్షములకును తీవ్రయుద్ధము జరిగెను. ఆంగ్లేయులు చివరకు బోర్లను ప్రాంతమును త్యజించి వెనుకకు వచ్చిరి. ఆ మూడువారముల యుద్ధమువలనను ఆంగ్లేయులకు 11 వేలమంది ఖయిదీలు లభించుటయేగాక హిండెన్‌బర్గు సేనాముఖమునందలి కొంత ప్రాంతమును పట్టుకొనగలిగిరి. కేంబ్రయి యొద్ద నాంగ్లేయులకు ప్రథమమందు కలిగినవిజయ మెందుకు కార్యకారి కాలేదో స్థలాంతరమున సూచీముఖ ప్రస్థానమునందలి వంచి చెడ్డలను విమర్శించిన సందర్భమున నుదహరించి యుంటిమి. ఇటలీ రంగమునకు పంపవలసిన సేనలను జర్మనులు కేంబ్రయి యుద్ధమునందు వినియోగింపవలసి వచ్చుటచే ఇటలీవారు ప్యావీ నదీప్రాంతమునందు నిలద్రొక్కుకొనుటకు యత్నించిన సమయమునందు వారికి కేంబ్రయి యుద్ధము పరోక్షముగ తోడ్పడియుండెనని చెప్పుటకు సందేహింపనిలేదు. యుద్ధారంభమునందు నాలుగైదు మాసములకు జర్మనుల పురోగమనము మందగించి యుద్ధ వ్యవస్థ నానురాను వ్యూహయోగ్యమైన బహిరంగ యుద్ధముగాకను రక్షణ లక్షితమైన దుర్గయుద్ధము మారిపోయి యుండెను. కాంబ్రయి యుద్ధమునందు జర్మనులు ఎహీః ప్రదేశమునందు ప్రబలసేనతో ప్రతిఘటించిరని చెప్పుదురు.

## ఇటలీరంగము

1917వ సంవత్సరము అక్టోబరు మాసమునందు జర్మనులు ఇటలీ సేనాముఖమునందలి దుర్బల ప్రదేశమునందు ప్రబలసేనలతో ముట్ట

రును ముఖమును కాపొరెటో పట్టణముయొద్దను భేదించి, క్రాయిల్సా వెనీషియా మైదానములందు దండెత్తుటకలనను తెలుపని లంపుగ ఇటలీరంగమునందలి ప్రధాన స్థానము సంక్లిష్టమై కొంతకాలము మిత్రమండలికి ఆగుర్దాను కలిగించియుండెను. ఇటలీ ఆస్ట్రియా సరిహద్దు ప్రాంతము స్విట్జర్లండు మొదలు జూలియను అల్ప్సువరకును వ్యాప్తమైన ప్రదేశమందంతయు 7 వేలు మొదలు 10 వేలడుగుల యెత్తైన పర్వతములచే నిబిడీకృతమైయున్నది. ఎటిషు నదీప్రాంతము నందలి సరిహద్దు ప్రదేశమందుతప్ప మిగిలిన ముఖము సైనిక వ్యూహముల కనుకూలముగ నుండలేదు. జూలియను అల్ప్సు ప్రాంతమున నను, ఎడ్రియాటికు సముద్రమునకు మధ్యను వ్యాప్తమైన సరిహద్దు ప్రదేశమునందు కొండలంతయున్నతముగ లేకుండుటవలన నక్కడనే చాల ముఖమునందు ప్రాధాన్యమైన యుద్ధములకు వీలుకలదు. సరిహద్దునందలి నడిభాగమునందు టైరలు (ట్రెంటినో) ప్రస్థము ఇటలీయందలి వెనీషియాలంబార్డీ మైదానమునందు చొచ్చి వచ్చియున్నది. టైరలునందు సరిహద్దును దాటి రాజమార్గములు పశ్చిమభాగమునందు స్వల్పముగనున్నవి; తూర్పుభాగము గమనాగమనయోగ్యముగ నున్నది. సరిహద్దు మధ్యభాగమునందు కార్నికుకొండలు కలవు. ఆ ప్రాంతము యుద్ధమున కనుకూలము కాదు. జూలియను అల్ప్సు ప్రాంతమునందలి కొండలు ట్రెంటినోయందలి కొండలకంటెను, కార్నికు కొండలకంటెను చాల చిన్నవి. అక్కడి కనుమలనుండి సేనల రాకపోకలకు వీలుపుకలదు. ఇటలీవారు యుద్ధారంభమునందే జూలియను ముఖమునందలి కనుమలను స్వాధీనము చేసికొని, నానా శ్రమలు పడి ఐసాంజో రంగమునందు ముందునకుపోయి గొరిజియాను స్వాధీనము చేసికొనిరి. కార్సో ప్రస్థమునందు ఇటలీవారికి పురోగమనము కలిగియుండెను. ట్రిస్టీనగరమును వశపరచుకొనుటకు దారి యేర్పడినదని ఇటలీవారు నమ్మియుండిరి. సెప్టెంబరు మాసమునందు ఇటలీవారు ఐసాంజోముఖమునందు గొప్పదాడికి ప్రారంభించి అపక్రమించినను సమాప్తిచేసి కోర్టినాసునసమునందలి ప్రధాన స్థానములను బలపరచుకొని బైన్సిజ్జా ప్రస్థమును వశపరచుకొనిరి. ఇటలీవారు ఆ ప్రస్థానమునందు ఆస్ట్రియను సైనికులను ధ్వంసించి, చాలనష్టమును కలిగించిరి. ఆస్ట్రియావారు ఆ యుద్ధములందు లక్ష నుంచి సైనికులకు పైగ నష్టపోయియుండిరి. వారి నెన్నిరో శతఘ్నులుకూడ నష్టపోయినవి. ఇటలీ సేనలు విజృంభించి విజయమును గాంచుచుండినప్పుడు గాలీషియారంగమునుండి విసిరుక్తులైన సైనికులువచ్చి ఆస్ట్రియాకు పరాజయము కలుగకుండ తప్పించిరి. ప్రస్తుతమునందు ఆస్ట్రియా ఇటలీదేశములకు జరిగిన యుద్ధములందింతవరకును ఇటలీసైనికులు శౌర్యాధిక్యమునే ప్రకటించిరి. సెప్టెంబరు మాసమునందు ఇటలీవారివిజయయాత్ర ముగిసినది. అక్టోబరునందు వర్షములు సంభవపడి రణరంగము బురదతోనిండి జరుగుచున్న యుద్ధము ఒరువుటకు వీలుండదని ప్రతివారును నమ్మియుండిరి. అట్టి స్థితియందు ఆస్ట్రియావారును జర్మనులును కొండలచాటున రంగులను సైనికులను నిలుపజేసిరి. శత్రువులు ముట్టడించెదరని ఇటలీవారికి తెలిసి జూలియనుముఖమునందు నడి, మధ్యభాగములందు చాల సేనలను కేంద్రీకరణము జేసిరి. జూలియను రంగమునందు కడపటి ఉత్తరముఖములు, బైనసిజ్జా మొదలు సముద్రమువరకును, ఎడమభాగము కానాలేమొదలు ప్లెజ్జోవరకును వ్యాప్తమైయున్నది. ఆ ముఖమునందలి ఇటలీ సేనల ఎడమభాగము బలహీనముగ నుండెను. ఆ దుర్బలస్థానమునందు శత్రువులు ఇటలీవారిని ముట్టడించి వారి రెండవసైన్యమును లోంగదీసి 20 మైళ్ళముఖమునందు వర్షము కురియుచున్నప్పుడు ఐసాంజో నదీ పశ్చిమభాగమునందలి కాపొరెటో పట్టణమును వశముచేసి పట్టుకొని, స్వాగా కెల్లూరు కనుమలోనుండి, ఇటలీ సైనికపంక్తిని భేదించి వెనిషియా మైదానమునందు ప్రవేశించిరి. అక్కడనే విదేశీల సైనికులు రెండుభాగములై ఒకభాగము ట్రాన్సిల్వా పర్వతము వైపునకును, మరియొక భాగము గోరిజు వైపునకును దారిచేసికొని ముందునకు వెళ్లిరి. ఇటలీకొండల దిగువభాగమునందు గలస్థానము సమప్రదేశమగుటచే శత్రు పురోగమనము నాపుటకు సులువైన రక్షణస్థానములు లేకుండెను. ఆ ప్రాంతమునందు ఎటిషు, ప్యావీ, లివెంజా, టాగ్లిమెంటో నదులు సమరేఖలుగ నొకటి తరువాత నొకటి ప్రవహించుచున్నవి. కొండలయందు చెదిరిపోయిన ఇటలీసైనికులు మొదట టాగ్లిమెంటో నదీ ప్రాంతమునందు శత్రువును నిరోధించి, శత్రువుల యొత్తిడి వృద్ధియైన కొలదిని మెల్లమెల్లగ లివెంజా నదీప్రాంతమునకును, అక్కడినుండి, ప్యావీనదీ ప్రాంతమునకును చేరి, యచట శత్రువుల పురోగమనమును నరికట్టి ట్రివిసో, వెనిసు పట్టణములను రక్షించిరి. అంతటితో శత్రువు లలసిపోయి ముందునకు రాజాలకపోయిరి. తమ గమనాగమనములు దీర్ఘమై పురోగమనము దుర్ఘటమగుటచే శత్రువు లక్కడనే కందకములను నిర్మించుకొనిరి. ఇటలీవారు ప్యావీనదియందు శత్రువులను నిరోధించుటకు మిత్రమండలి సైనికు లక్కడకు నిమిత్తముగ తోడ్పడిరి. ఇటలీవారికి $1\frac{1}{2}$ లక్షలమంది సైనికులు నష్టపోయి యుండిరి. వారికి వెయ్యి రంగులుకూడ నష్టమైయుండెను. ఇటలీవారి రెండవ సైన్యము లొంగిపోయి, బలముగ నిరోధించక పోవుటవలన ఇటలీపై దండెత్తుటకు శత్రువులకు వీలు కలిగినదనియు జర్మనులు కేవలము మాయోపాయముచే ఇటలీ సైనికులకొందరి మతిమరలించి, రెండవసేనను లొంగదీసిరనియు కొన్ని వార్తలు తెలిపియుండెను. కారణము లెవ్వియైనను రెండవసేన శత్రువులకు దారియిచ్చిన మాట వాస్తవము. శత్రుసేనలు ఇటలీ మైదానమునందు ప్రవేశించుటవలన ఇటలీవారి బలము జ్వలితమై వారి యందలి కలతలు పోయినవి. ఇటలీకి కలిగిన భంగపాటువలన యుద్ధము దీర్ఘమైనది కాని శత్రువునకు విజయము కలుగలేదు.

## రుష్యారంగము

"రుష్యా పరివర్తనము సంగ్రామమునందు విజయార్జనమున కిట్టి సాహాయ్యభూతి మగునదియు ముందు వ్యక్తము కావలసియున్న"దని పింగళసంవత్సరపు సంచికయందు మేము నుడివియుంటిమి. రుష్యా పరివర్తనము సంగ్రామమునందు విజయార్జనమునకు తోడ్పడుటకు బదులు దేశమునందంతకలహములను వృద్ధిచేసియుండెను. ఆ

పరివర్తనము చిరకాలమునుండి, దేశమును పాలించుచు వచ్చిన యధికారమును నిర్మూలమును చేయగలిగినది గాని స్థిరమైన ప్రభుత్వము నేర్పాటు చేయలేక దేశమునందు ద్రోహానలమును విజృంభింప జేసెను. దేశమునందు ప్రభుత్వవిధానము పోయి కల్లకల్లోలము ప్రారంభమైన వెనుకను సేనలయందుండవలసిన శిక్షణము విలుప్తమై చివరకు వారు రణరంగమును త్యజించుటకు కారణభూతు లయ్యెను. పరివర్తనారంభమునందు రుష్యా సైనికులు రణరంగమునందు విజృంభించిరి. జూలై మాసాదియందు వారు గెలీషియా తూర్పుభాగమునందు 20 మైలుల ముఖమునందు అవస్కందనమును ప్రారంభించి 28 వేల శత్రుసైనికులను ఖయిదీలుగ పట్టుకొనిరి. వారు శత్రుముఖమును ఛేదించివేసిరి అప్పటికి కింకను దేశమునందుదయించియుండిన కల్లోలము సైన్యవ్యూహమును పరివేష్టించి యుండలేదు. తరువాతను స్థితిగతులు తారుమారై పోయెను. శత్రువులను నిర్జించుటకు వినియోగపడవలసిన బలమునంతయు విద్రోహులు దేశమునందలి ప్రజలను నిర్జించుటకును, సైన్యమును నిర్మూలము చేయుటకును వినియోగించిరి. రుష్యను సైనికులు స్వల్పకాలము మాత్రము శత్రువులను ప్రతిఘటింపగలిగిరి. తరువాతను వారు తండోపతండములుగ రణరంగమునుండి, నిష్క్రమించుటచే శత్రువు అనాయాసముగను నిర్భయముగను ముందునకువచ్చి దేశము నాక్రమించుకొని యుండెను.

## ప్రత్యేక సంధి

రుష్యాసామ్రాజ్యము స్వార్థపరాయణులగు విద్రోహులవశమై దేశమునందు భిన్నోద్దేశములు ప్రబలి విపరీతాత్మముల కుండవలసిన సంఘీభావము నశించిపోయెను. ఫిన్లండు పరగిణా ప్రత్యేకస్వాతంత్ర్యమును ప్రకటించియుండెను. ఉక్రెయిను తిరుగబాటుచేసియుండెను. ప్రజలయందు నానాకారములు బయలుదేరెను. ప్రజలతిప్పలు వృద్ధిగామైన కొలదిని వారు ప్రత్యేకసంధిని కోరుటకంటె గత్యంతరము లేకపోయెను. శత్రువును ప్రతిఘటించుటకు సైన్యములు లేవు. జర్మనులు దేశమునందనేకలహములను వృద్ధిచేసి లాభమును పొందదలచిరి. రుష్యాయందలి ప్రజాభావమును తిరస్కరించి తమయుద్దేశముల నెఱవేర్చుకొనుటకు కనిపెట్టుకొనియుండిన జర్మనులకు సమయము దొరకెను. తమ కన్యరాజ్యాక్రమణముతో నిమిత్తము లేదని నమ్మించి సంధిప్రయత్నములకు రుష్యనులనుదింపి పనిపట్టినప్పుడు వారిని వంచించిరి. రుష్యనులలో కొందరి కెట్టియుత్కృష్టభావము లున్నను అసహాయస్థితికి వచ్చినప్పుడు వారు జర్మనుల కుతంత్రమునుండి తప్పించుకొన లేకపోయిరి. చివరకు జర్మనులు తెలిపిన షరతుల కన్నిటికిని వారంగీకరింపవలసివచ్చెను. పోలండు, లిథూనియా, ఇస్తోనియాలను, బాల్టిక సముద్రము నంటియుండిన పరగణాలను జర్మనులకు వారిచ్చివేసిరి. రుష్యనుల ప్రత్యేకసంధివలన తూర్పు రణరంగమునందలి జర్మను, ఆస్ట్రియా సేనలు ఇటలీ, పశ్చిమరంగములకు వచ్చుటకు వీలు కలిగినది. రుష్యాయందలి ఆస్ట్రియా జర్మను ఖయిదీలును విడుదలజేయు సేనలలో చేరుటకును వీలైనది. అందువలనను మిత్రమండలి పోరాడుచున్న ఫ్రాన్సు బెల్జియము ఇటలీరంగములందలి శత్రుసేనలు బలపడినవి. శత్రువున కీలాభము తెలుపనితలంపుగ కేవల మదృష్టవశమువలన కలిగినను అమెరికా తన ప్రబలసేనతోను, నావికాదళముతోను, అతులమైన సంపత్తితోను మిత్రమండలిపక్షమునందు చేరుటవలన అందలి ప్రయోజనము వ్యర్థమైనదని చెప్పవలెనప్పుడు అమెరికావారు తమ సేనలను తయారుచేసి రణరంగమునకు పంపుటయందు విలంబ మేర్పడు కాలమునందు శత్రువునకు తాత్కాలికముగ ఆధిక్యము కలిగినను అది చిరకాలము నిలుచునది కాకపోవుటచే యుద్ధపర్యవసానమునకు నది కార్యకారి కానేరదు.

## పాలస్టీను రంగము

పాలస్టీనునందలి దక్షిణప్రాంతమునందు 1917-వ సంవత్సరము అక్టోబరు 31 వ తేది మొదలుకొని డిసెంబరు 11-వ తేది వఱకును జరిగిన యుద్ధప్రస్థానమునందు ఆంగ్లులు తురుష్కుల నోడించి ఈజిప్టుదేశపు సరిహద్దుప్రాంతమునుండి రమారమి నూఱుమైళ్లు వెనుకకు తఱిమి సుప్రసిద్ధరేవు స్థలమగు జాఫాపట్టణమును, ప్రాచీన చారిత్రాత్మకమును పవిత్రము నగు జరూసలేముపట్టణమును పట్టుకొనుటవలనను ఈజిప్టు విషయమై తురుష్కుల కుదయించిన సంకల్పము స్వప్నతుల్యమైనది. ఆ ప్రాంతమునందు శత్రువు దూరము నందుండుటచే సూయజుప్రదేశము నిరపాయస్థితియం దుండెను. పాలస్టీను దక్షిణభాగము సముద్రప్రాంతమగుటచే ఇసుకమయము, దేశాంతర్భాగమునందు నీటియిబ్బంది విశేషముగ కలదు. అక్కడ సైనికుల గమనాగమనములకు యోగ్యమైన మార్గములు తక్కువ. ఆంగ్లసేనాముఖమునకు వెనుక భాగమునందు తురుష్క ఈజిప్టు సరిహద్దునందున్న రాఫాపట్టణమునుండి వెడలుచున్న కాంటారా రైలుమార్గమును ఎల్‌కౌబానుండి వాడీహాబౌవు పోవుమార్గమును తప్ప మఱి వేఱుమార్గములు లేవు. సేనాముఖమునందు యుద్ధముచేయు సేనలకు వెనుకనుండి 20, 30, మైళ్లదూరమునుండి నీటిని పంపవలసియుండును. సేనాముఖమునందు కావలసియుండిన సామగ్రిని ఒంటెలమీదనే తీసికొని పోవలసియుండెను. అప్పటి యవసరములను పట్టి క్రొత్తసొటి లోహమార్గములను కూడ నిర్మించుకొనవలసి యుండెను. ఆంగ్లసేనాముఖమునందలి తూర్పుభాగమునకు ఖలాసా, అస్‌లూజు, ఇసాని పట్టణములనుండి నీటియేర్పాటులను చేయవలసియుండెను ఆంగ్లసేనాముఖము పశ్చిమమునందు తూర్పునకు గాజాపట్టణమున కెదురుగ నామిలీపట్టణమువఱకును వ్యాప్తమై యుండెను. తురుష్కముఖము గాజాపట్టణమునుండి బీర్షాబా పట్టణమువఱకును బీర్షాబా మార్గము నాశ్రయించియుండెను. గాజాపట్టణము చుట్టును తురుష్కులు దుర్భేద్యమైన దుర్గములను నిర్మించి చాలకాలము ముట్టడిని నిరోధించుటకు యోగ్యముగ నేర్పాటులను చేసియుండిరి. శత్రుముఖము 30 మైళ్లవఱకును, ఆంగ్లముఖము 22 మైళ్లవఱకును వ్యాపించియుండెను. శత్రువు సేనాముఖమునకు వెనుకను యోగ్యమైన గమనాగమనములుండి ఏ ప్రాంతమునందు సేనలను కేంద్రీకరణము చేయవలసివచ్చినను అట్లు చేయుటకు వీలు కలదు. ఆరంభమునందు బీర్షాబా పట్టణమును వశపఱచుకొని అబుహీరారా, షేరియాలను ముట్టడించి వెనుకనుండి గాజాముఖమును మరల్చుట ఆంగ్లసేనాని ప్రస్థానతంత్రమై యుండెను. ప్రారంభమునందు బీర్షాబాపట్టణమును పట్టుకొనుటవలన ఆంగ్లసైనికులకు నీటి యిబ్బంది చాలవఱకు పోవునని ఆ సేనాని తలంచియుండెను. బీర్షాబాను వశపఱచుకొనుటవలన తురుష్కుల సైనికపార్శ్వము దుర్బలమై ఆంగ్లసైనికులు విశాలముఖమునందు యుద్ధముచేయుటకు వీలు కలుగును. ఆంగ్లు లేస్థానమును ముట్టడింపదలచినదియు నిర్ధారణముగ శత్రువునకు తెలియకుండుటకై గాజాపట్టణపు ప్రాంతమునందును తూర్పుముఖమునందును ఏకకాలమునందు ముట్టడించుటకు ఏర్పాటుచేసికొనిరి. ఆంగ్లులు జూలైమాసమునుండి అక్టోబరునెలవఱకును యుద్ధమునకు తగిన సన్నాహములను చేయుచువచ్చిరి. ఆ కాలమునందు శత్రువును అలసభావము వహించియుండక తన సేనాముఖమునందలి సైనికబలమును [illegible]

యుండెను. ఎల్ అరిష్ నుండి బీరుషెబా వఱకును, టెలుషారియను వరకు రైలు మార్గములను శత్రువు నిర్మించియుండెను. అపారమైన యుద్ధసామగ్రిని శత్రువు తెచ్చికొని వచ్చియుండెను. వీనిని బట్టి శత్రువు గాజా మొదలుకొని, బీర్షాబా వఱకును గల తన సేనాముఖమును గట్టిపఱచుకొనెనని వ్యక్తమగుచున్నది. అట్టిసందర్భమున నాంగ్లులు అక్టోబరు 31 వ తేదిని ముట్టడిని ప్రారంభించి ఈశాన్యమునుండియు దక్షిణము నుండియు బీర్షాబాను వశపఱచుకొని పశ్చిమప్రాంతమునందలి షేరియా, హీరారా వైపునకు సైనికులు వెళ్లిన కొలఁదిని గాజాముఖము రక్షణయోగ్యము గాక దానిని శత్రువులు త్యజింపవలసివచ్చెను. గాజా ముఖము ఆంగ్లులకు వశమైన వెనుకను శత్రుసేనలు చెల్లాచెదరుగ ఒక పార్శ్వము సముద్రప్రాంతమునుండియు మఱియొక పార్శ్వము తూర్పు ముఖముగను పలాయనమైనవి. యుద్ధ మారంభమైన 15 దినములకు ఆంగ్లులు తమ తూర్పుభాగమునందు 50 మైళ్లదూరమును, ఎడమ భాగమునందు 40 మైళ్ల దూరమును ముందునకు వెళ్లగలిగిరి. శత్రుసేనలు చెల్లాచెదరై పోయిన పిమ్మట జాఫా, లుద్దు, రామ్లే పట్టణములను ఆంగ్లులు సులభముగ పట్టుకొనిరి. తూర్పుప్రాంతమునకు పలాయనమైన శత్రుసేనలు జరూసలేము వైపునందు గల కొండలను శరణ్యము చేసికొనియుండెను. ఈశాన్యముఖమున పారిపోయిన సేనలకును జరూసలేము వైపునకు పోయిన సేనలకును సంయోగము కలిగి శత్రువు నిలద్రొక్కుకొనుటకు జరూసలేమును త్యజించి టుల్-కెరాము-నాబులసుముఖమును చేరినప్పుడు వీలు కలుగును. సముద్రప్రాంతము నుండి ఆంగ్లులు యుద్ధసామగ్రిని ముఖ్యముగా దానిని సేనాముఖమునకు చేర్చవలసియుండెను. రైలుమార్గములను త్వరితముగ వేయవలసి యుండెను. క్రొత్తప్రస్థానమునకు తగినసన్నాహములు జరుగువఱకును యుద్ధమునందు కొంతవిలంబ మేర్పడుట యవసరమైయుండెను. జాఫా జరూసలేములకు రామ్లే మీదుగ నొక రేమార్గము కలదు. రామ్లేనుండి బయలుదేఱిన సేనలకు అన్నాబే జాటీన వెనుక రెండ్లు నడచుటకు అవాంతరములు కలిగెను. అట్లే ముందునకు జారిచేసికొని ఒక దళము కర్యటు వైపునకును రెండవదళము ఉత్తరమునుండి బీరా వైపునకును వచ్చినవి. అప్పటికి నబ్లసు జరూసలేముమార్గమును ఆంగ్లులు సమీపించి సైనికులు వచ్చి పడియుండిరి. జరుసలేము చుట్టును శత్రువులు నిర్మించిన రక్షణసాధనము లొకటి తరువాత నొకటి విజేతలకు స్వాధీనమగుచుండెను. అక్కడి శత్రుసేనలు తమస్థానములను కాపాడుకొనుటకు వీలులేక జరూసలేమును త్యజించి మరలిపోయినవి. డిసెంబరు 11 వ తేదిని ఆంగ్లులాపట్టణమునందు ప్రవేశించిరి అక్టోబరునుండియు జరిగిన యుద్ధమునందు 12 వేల మంది తురుష్కసైనికులు విజేతలకు వశమైరి; బోలెడు మందుసామగ్రియు వశమై యుండెను. జార్డనునదీప్రాంతమును దాటిపోయిన ఆంగ్లసైనికులకు కొంతనిరోధము కలిగి ఇస్-సాల్టుపట్టణమును త్యజించిరి. అందువలనను జార్డను నదీప్రాంతమునందలి సేనలలో చాలభాగమును ఆంగ్లులు వెనుకకు మరలించియున్నను నదీ తూర్పుభాగము వారి స్వాధీనమునందే కలదు. జార్డను తూర్పుభాగమునందు తీవ్రయుద్ధము జరుగుచుండెను. ఆంగ్లులు జార్డనునది తూర్పుభాగమునకు రెండుపర్యాయములు వెళ్లిరి. రెండుసారులును వెనుకకు మరలవలసివచ్చినది. అంతకంటెను ఆ ప్రాంతమునందలి యుద్ధసమాచారము తెలియుటలేదు.

## మెసపొటేమియా రంగము

మెసపొటేమియా రంగమునందు బాగ్దాదుపట్టణము ఆంగ్లులకు వశమైన వెనుకను ఇథ్రటీసు నదీప్రాంతమునందు వారికి విజయము కలిగినది. ఇథ్రటీసునదీ ఎగువభాగమునుండి తురుష్కులు పలాయితులైరి. బాగ్దాదుపట్టణమున ఉత్తరభాగమునందలి ఫెలూజాపట్టణము నుండి ఆంగ్లసేనలు ముందునకు పోయి మహాయుద్ధము పట్టణమును ముట్టడించి రామాదైని పట్టుకొనినవి. అక్కడ అహామదుబే నాయకత్వము క్రిందను యుద్ధము చేయుచుండిన తురుష్కసేన యంతయు ఆంగ్లులకు వశమైనది. రామదై ఫెలూజాపట్టణమునకు పశ్చిమముగ 30, 40 మైళ్ల దూరమునందు కలదు. తరువాతను డెల్టీవా, కఫిలు, గోబతు ప్రాంతములందు కూడ యుద్ధము జరిగి డెల్హావాపట్టణమును ఆంగ్లులు వశపఱచుకొనిరి. నబారిన్, డెల్హావానదుల మధ్యను గల ప్రదేశమునందు ఆంగ్లుల పురోగమనము నాపుటకు తురుష్కులు చేసిన ప్రయత్నములు కార్యకారి గాలేదు. హాందరాను పర్వతప్రాంతమునుండి తురుష్కసేనలను ఆంగ్లులు తఱిమివేసియుండిరి అక్కడనుండి ఆంగ్లులకు పురోగమనము కలిగి కిఫ్రి, ఎయినుసారిను, దాసముఖప్రి పట్టణములు వారికి స్వాధీనమైనవి.

## తదితరరంగములు

తదితరరంగములందు బాల్కనునందు ప్రబలనము కలిగియుండలేదు. రుమేనియా రుష్యారంగములకు సన్నిహితసంబంధ ముండుటయు, రుష్యనులు ప్రత్యేకసంధి చేసికొనుటవలన రుమేనియారంగము దుర్బలమగుటయు నందువలన రుమేనియనులు ప్రత్యేకసంధికి ఒప్పుకొని యుద్ధమును విరమింపవలసి వచ్చినది.

## 1918 వ ప్రస్థానము

### జర్మనుల యువస్కంధనము

1918-వ సంవత్సరమునందు జర్మనులు విజయమును గాంచుటకు భగీరథప్రయత్నములను చేసితీరుదు రనియు ఆ కాలమునందు మిత్రమండలి కాలవిలంబనము చేసి రక్షణతంత్రము నవలంబించి శత్రుబల ముడిగిన వెనుక వారి నోడింతు రనియు యుద్ధచారిత్రమునకు ప్రారంభమునందు వ్రాసియుంటిమి. శత్రు విప్పుడు రణాంగమునందు తన సర్వస్వము నొడ్డుచున్నాడు. మార్చి 21-వ తేది గురువారము నాడు జర్మనులు పశ్చిమరంగమునందలి ఆంగ్లపరాసుల నడిమిస్థానమునందు దారుణసంగ్రామము నారంభించిరి. ఆయుద్ధమువలన జర్మనులు ఆంగ్ల పరాసు సేనలను వేఱుపఱచి తమ కనుకూలమైన ట్లొకరివెనుక నొకరిని విడివిడిగ సంహరింపవలెనని సంకల్పించిరి. యుద్ధారంభమునుండియు జర్మనుల కాంగ్లసేనలే గర్భశత్రువుగనుండి వారికి విజయమును దూరము చేయుచున్నవి. పరాసు సేనలనుండి ఆంగ్లసేనను వేఱుపఱచి, దానిని సంహరించుటయే జర్మనుసేనానుల యుద్దేశమని కొందఱు చెప్పుదురు. ఎమియాన్సు పట్టణమును వశపఱచుకొని అయిను నదీప్రాంతమునుండి పారిసుపట్టణమును జర్మనులు వశపఱచుకొన దలచియుందురని కొందఱు చెప్పుదురు. జర్మనుల ప్రథమసంకల్ప మీ రెంటిలో నేదియైనను తరువాత జర్మనులు ఆర్మెంటీసుయొద్ద కూడ ముట్టడించుటచే వారికి రెండు సంకల్పములు కూడ కలిగె ననియును, ఆరంభమునందు పరాసు సేనలు ఆంగ్లులకు సాహాయ్యము చేయుటకు వీలులేకుండ వేఱుపఱచి, తరువాత ఆంగ్లముఖమును భేదించి వైప్రెసు ముఖమునందలి సేనలను సముద్రము వైపునకు తఱిమివేసి సోముముఖమునందలి సేనలను సంహరించి జర్మనులు పారిసుపట్టణముమీదకు విజయయాత్ర కుపక్రమింప దలచియుందురని యూహించుటకు వీలు కలుగుచున్నది. ఎమియాన్సు ప్రస్థానమునకును, ఆర్మెంటీసు ప్రస్థానమునకును ఏకకాలమునందే

జర్మనులు సన్నాహములు చేసియుండవచ్చును. వారి సైనికపంక్తి వెనుకను దివ్యమైన గమనాగమనసాధనము లుండుటచే వారట్లు చేయుటకు వీలు కలదా లేదా యను సందియమునకు కాధారము లేదు. జర్మనుల ప్రకృతపు ప్రస్థానతంత్రము నాలోచించినకొలదిని వారు పడమటిరంగమునందు విజయము గాంచుటకై కొన్ని యెత్తులనైన నెత్తి మిత్రమండలి సేనలను కందకములనుండి కదలించి బహిఃప్రదేశమునందు వ్యూహపరంపరలను పన్ని తమ సైన్యపు టాధిక్యమును గనబఱచి యేలాగునైనను యుద్ధమునందు జయాపజయములను నిర్ణయించుటకు కృతనిశ్చయులై యున్నారని తోపకమానదు. తత్ఫలప్రాప్తికై వారు ఆరంభమునందు ఆంగ్లఫరాసు సేనల సంయోగమును భేదించి తరువాతను ఆంగ్లముఖమును రెండు భాగములుగ చేసి ఒకటి తరువాతనొకదాని నోడించి చివరను ఫరాసుల పని పట్టినయెడల సులభముగ సంధిచేసికొనుట వీలు కలుగునని తలచియుందురు. కాని జర్మనుల ప్రయత్నము లింతవఱకును కార్యకారి కాలేదు; ముందట్లు జరుగునని యూహించుటకు వీలులేదు. జర్మనుల రణతంత్రములవలన కలుగు విషమస్థితిని మిత్రమండలి సేనాధ్యక్షులు గ్రహించి దానికి ప్రతిక్రియ చేయక పోలేదు. ఇంతవఱకును యుద్ధస్వరూపమునందు నూతనదశ యేర్పడియుండలేదు; దీర్ఘకాలసుఖమునందు శత్రుసేనలను కందకములనుండి కదలించి వానిని భేదించి వ్యూహాకారముగ వానిని చిక్కించి యోడించినగాని జర్మనులకు యుద్ధమునందు విజయము కలుగనేరదు; యుద్ధమింకను పూర్వముఖ ప్రస్థానదశయందే కలదు, జర్మను లింకను ఆ స్థానమున కీ స్థానమునకును పెనగులాడుచునే యున్నారు. కాని జర్మనులు తమ సంకల్పమును మానుకొనిరని తలచుటకు వీలు లేదు. వారి ప్రస్థానమునకు ప్రస్తుత మవాంతరము కలిగినదని మన మనుకొనవలయును. జర్మనులకు సేన లుండినంతవఱకును వారు తమ సంకల్పమును మానరు. జర్మనులసంకల్పమున కవాంతరమెట్లు కలిగినదియును యుద్ధప్రస్థానమును దిలకించినప్పుడు స్పష్టము కాగలదు. వారు మార్చి 21 వ తేదిని 50 మైళ్ల ముఖమునందు స్కార్పు సొమ్మె నదులమధ్యను కెంబ్రెయి పశ్చిమమునందు అవస్కందనమును ప్రారంభించి మిత్రమండలి సేనాముఖమును భేదించి మాంటిడిడరు పట్టణమువఱకును వచ్చిరి. అంతటితో వారి పురోగమన మాగిపోయినది. మాంటిడిడరునకును ఫరాసుల రాజధానీనగరమునకును 60 మైళ్లదూరము కలదు. ఆయిసు లోయనుండి ఫరాసుల రాజధానీనగరమునకు సులభమైనమార్గము కలదని జర్మనుల విశ్వాసము. లాఫెరెపట్టణము మొదలు క్రోయిసెలు పట్టణమువఱకును జర్మనులు అగ్నివర్షమును రెండుగంటలు కురిపించి పదాతిసేనను ముందునకు పంపిరి. జర్మనుపదాతిసేన శుక్రవారము సెయింటుక్వెంటినునకు పడమటను ఆంగ్లసైనికుల రక్షణస్థానములను భేదించుటవలన ఆంగ్లులు వెనుకకు మరలవలసివచ్చినది. శనివారము శత్రువులు పెరోనుపట్టణమునకు తూర్పుభాగమునందు టోర్టెలునదిని దాటి ముందునకు వచ్చి తరువాతను సోమునదిని కూడ దాటియుండిరి. సోమవారమునాడు వారు ఆల్బర్టుబాపూము మార్గమున కిరుపార్శ్వములందును గల మార్టినపుచ్, కౌర్సెలెటు గ్రామములను వశపఱచుకొనుటవలన మిత్రమండలి సేనలు ఆల్బర్టును త్యజించి దానివెనుకను గల ప్రదేశముల నాక్రమించుకొనవలసివచ్చెను. ఫరాసుముఖమునందు శత్రువు రోయి-బ్రెటూలు మార్గమునం దవస్కందనము ప్రారంభించి ఫరాసులను 8 మైళ్లదూరము వెనుకకు తఱిమి యుండెను. అందువలనను జర్మనులు మాంటిడిడరు పట్టణమును పట్టుకొనగలిగిరి. జర్మనుల కా యుద్ధమునందు ఆంగ్లముఖమునందు పేజీర్సు మొదలు మోరులువఱకును వ్యాప్తమైన ప్రాంతమును మాంటిడిడరువఱకును ఫరాసు ముఖమునందలి ప్రాంతమును స్వాధీనమైనది. కాని అర్రాసునొద్దను, దానికి దక్షిణమునందును శత్రువున కింతమాత్రమును పురోగమనము కలిగియుండలేదు. అర్రాసు ముఖమునందు జర్మనులకు పురోగమనము కలిగియుండక పోవుటచే ఉత్తరమునందలి (వైప్రెసుముఖము) ఆంగ్లసేనను మరలించుటకు వీలు కలుగలేదు. అర్రాసును బొమ్మచేసి పట్టుకొనుటకు జర్మనులకు సాధ్యమై యుండలేదు. కావున అర్రాసునకు ఉత్తరమునందు ముట్టడించి ముందునకు రాగలిగినయెడల యుద్ధము చేయ నక్కఱలేకుండ స్వల్పనష్టముతో నక్కడి ఆంగ్లసేనాపంక్తిని మరలించుటకు వీలు కలుగునను నుద్దేశముతో జర్మనులు లెన్సుపట్టణమున కుత్తరమునందు లాబాసీ కాలువ మొదలు వైప్రెసుపట్టణమునకు దక్షిణమునందు గల హొల్లెబెకుపట్టణమువఱకును ఏప్రిలునం దవస్కందనము ప్రారంభించి అర్మెంటీర్సు ప్రాంతమును సంరక్షించుచుండిన పోర్చుగీసు సేనను ప్రబలసైన్యముతో లాగివేసి దాని కిరుపార్శ్వములందును గల ఆంగ్లసైనికపంక్తి వెనుకకు మరలునట్లు చేసిరి. అక్కడ శత్రువులు [illegible]లువఱకును ముందునకు వెళ్లిరి. మెర్విలుపట్టణమునుండి జర్మను సేనాభుజము ఉత్తరమునందు మెస్సీన్సువఱకును, దక్షిణభాగమునందు గివెంషి వఱకును వ్యాప్తమైయున్నది. తరువాత జర్మనులకు బైలూలు, కెమ్మెలు పట్టణములు స్వాధీనమైనవి. గివెంషికి ఉత్తరమునందు బెతూనుపట్టణము కలదు. యుద్ధమాపట్టణమునకు వ్యాపించి శత్రువునకు దక్షిణమునందు పురోగమనము కలిగినయెడల లెన్సు అర్రాసుముఖమునందలి సేనాపంక్తి వెనుకకు మరలవలసివచ్చునని యుద్ధపటమును దిలకించువారలకు గోచరము కాగలదు. కావున బెతూనుపట్టణపు రక్షణము మిత్రమండలి సేనల కత్యావశ్యకము. కాని ప్రస్తుతమున నాప్రాంతమునందు యుద్ధము జరుగుటలేదు. అంతటితో పడమటిరంగమునందలి మార్చి ఏప్రిలు యుద్ధప్రస్థానమునకు విలంబము కలిగినది. ముందు జర్మను లుపక్రమించు ప్రస్థానస్వరూపము నిట్టిదియని నిర్ణయించుటకు వీలులేకున్నను మార్చి ఏప్రిలులందు జరిగిన యుద్ధస్వభావమును బట్టి ముందు జరుగు యుద్ధస్వరూపమును కొంతవఱకును గ్రహింపవచ్చును. వారు మాంటిడిడరు ప్రాంతమునందును, మెర్విలు ప్రాంతమునందును ముందొకకాలమునందు అవస్కందనమును ప్రారంభించి తమ కప్పుడు కలుగు లాభాలాభములనుబట్టి యేదో యొకవైపునందు విజృంభించుట కాలోచింపవచ్చును. ఇంతకంటె ప్రస్తుతదశయందు జర్మను ప్రస్థానతంత్రమును గ్రహించుటకు వీలు లేదు.

## మిత్రమండలి రణతంత్రము

శత్రుభంగమునకు 20, 30 లక్షల నూతనసేన కావలసియున్నది. ఆ భారమును అమెరికావారు వహించుచున్నారు. అమెరికా సేనలు శత్రువును పాఱదరిమి జర్మనులకు విజయము కలుగకుండ మిత్రమండలివారు ప్రతిఘటించెదరు. అమెరికాసేన లిదివఱకే కొంతవఱకును రణరంగమును ప్రవేశించినవి; తక్కినసేనలు త్వరితముగ ప్రవేశింపగలవు. కాలవిలంబనముకొఱకు పోరాడుచున్న మిత్రమండలి యుద్ధావసరమును బట్టి కొంత ప్రదేశమును త్యజింపవలసి వచ్చినను సేనాముఖము చెక్కుచెదరకుండ నుంచువఱకును భయపడ నవసరముండదు. మాంటిడిడరు ప్రాంతమునందు ఆంగ్లఫరాసు సేనలకు క్షణకాలము వియోగము కలిగినప్పుడు ఆంగ్లఫరాసు సేనాధ్యక్షు లవలంబించియుండిన యుత్తమమార్గమువలన తిరిగి వారి సేనాముఖము కమ్ముకొని శత్రువు ఎత్తు భంగమై పోయినట్లే ముందును అట్టి యుక్తమార్గమే ప్రబలి మిత్రమండలికి విజయదశ యేర్పడగలదు.

ంయుద్ధములో జర్మనుల నోడించి సుప్రముడైను. ఇప్పుడీయన లండనులో యుద్ధమంత్రికూటములో నొక్కడుగా నుండి పనిచేయుచు గొప్పగొప్పయుపన్యాసము లప్పుడప్పుడొసంగుచుండును.

సర్ ఎడ్వర్డు మారిస్ న్యూఫౌండ్లాండు ముఖ్యమంత్రి, సర్ జోసెఫ్ వార్డు న్యూజిలాండు ముఖ్యమంత్రి, వాల్టరు లాంగు అధినివేశములన్నింటిపయిన లండనులో నుండు జార్జి చక్రవర్తిగారి మంత్రి.

ఆస్టిన్ ఛేంబర్లేను గారు ఇండియా స్టేటు సెక్రటరీగా నుండిరి. డబ్లు మాసీగారు న్యూజిలాండు మంత్రులలో నొక్కరు. బెత్మన్ హాల్వెగ్గు గారు జర్మనీకి ప్రధాన మంత్రిత్వమును జేసెను. రాబర్టు లాన్సింగు గారు అమెరికా సంయుక్తరాష్ట్రములకు విదేశ కార్యదర్శి. జోసిఫ్ డానియల్సు, న్యూటను బేకరు గార్లు అమెరికా మంత్రులు. జరార్డుగారు జర్మనీలో యుద్ధకాలమందున్న అమెరికా ఘమంత్రి.

రష్యా విప్లవనాయకులు:—జారుగారిని నిర్బంధితుని చేసిన సేనాధిపతి. బోదియాటిన్, షింగరేఫ్, ఫ్రాసినోఫ్, స్సు ఇవానోఫ్—వీరందఱును రష్యా చక్రవర్తిని పదభ్రష్టుని చేసిన ముఖ్యులలో కొందఱు.

ఎం. రాడ్జియాంకో:—ఈయన రష్యాపార్లమెంటుకు న్యాయాధ్యక్షుడుగా నుండి రష్యా చక్రవర్తిని పదభ్రష్టునిగా జేసిన దినములలో ఆయనతో రాయబారములు జరిపిన ప్రజాప్రతినిధి; అతి దేశాభిమాని; ప్రజాహితవాది.

రాస్పుటైన్:—ఇతడు ఇంద్రజాలికుడు. రుష్యా చక్రవర్తిని చక్రవర్తినిని తనచేతిలో నుండని కీలుబొమ్మలనగా వారి నాడించెను. జర్మనుల పక్షమున నుండి సంధికయి బహువిధముల యత్నించెను. వీనిదుర్మార్గములను సహింపజాలక రష్యా రాజసంతతిలోని వారగు నొకరు నొకయింటికి పిలిచి కాల్చి చంపించి నదిలో పడవేయించిరి. వీడు పోయిన కొన్ని మాసములకు రష్యా రాజు సింహాసనమును గోల్పోయెను.

మేడం బ్రెష్కోవ్స్కీ:—సైబేరియాకు జారుగారి ప్రభుత్వముక్రింద బహిష్కరింపబడిన యువతులలో నొక్కతె. అతి దేశాభిమానురాలు. ఇట్టి యువతీమణులు దేశభక్తితో పడిన కష్టములవలననే రష్యాకు విముక్తి కలిగినది.

మాన్సియర్ మార్టినో:—ఈయన పుదుచ్చేరిలో ఫ్రెంచి గవర్నరు జనరలు. గొప్పపండితుడు. దేశచరిత్రములందు పాండిత్య మెక్కువ. 1917-వ సం.లో మదరాసు విశ్వవిద్యాలయపు విద్యార్థులు పట్టములను పుచ్చుకొను సమయమున వారికి హితబోధ చేసెను.

ప్రొఫెసరు ఎమ్. ఏ. కాన్నైత్తు గారు, బి.ఏ., ఎల్. ఎల్. బి.:—వీరు గౌ. వీ. కే. రామస్వామయ్యరు గారి పుత్రులు. సర్ శంకరన్నాయరు గారి యల్లుండ్రు. 1889 వ సం. జననము. 1909-వ సం. కేంబ్రిడ్జిలో బి. ఏ. పరీక్షయందు కృతార్థులైరి. 1914-వ సం. చెన్నరాజధానీకళాశాలయందు చారిత్రకపండితులుగా నియమింపబడిరి. వీరు హిందూదేశచరిత్రకావ్యమున పేర ప్రఖ్యాతి గాంచిరి.

జే. సి. మెలోని, ఐ. సి. ఎస్.:—మదరాసు పురపాలక సంఘమున కధ్యక్షుడు.

విక్టోరియా ధర్మపఠనమందిరము, గ్రంథాలయము; చెన్నపురి:—ఈ కార్యనిర్వాహక సంఘసభ్యుల పటములో నడుమ పుష్పమాలికాలంకృతులై కూర్చున్న కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు సంఘాధ్యక్షులు. వారి కుడిప్రక్క కూర్చున్న కాళ్లకూరి గోపాలరావు పంతులు గారు గ్రంథాలయాధిపతులు; ఎడమ ప్రక్క కూర్చున్న గద్దె రంగయ్యనాయుడు గారు విచారణకర్తలు. కుడిమొదటకొనలందు కూర్చున్న రుద్రవరము వేంకటరావు, బి. ఏ., బొడ్డుపాటి గోపాలకృష్ణరావు గార్లు సహాకార్యదర్శులు. నిలుచున్న వారిలో కుడినుండి (1) గజ్జా రాధాకృష్ణశ్రేష్ఠి (2) పొలూరు కాశీపతి శ్రేష్ఠి (3) కాకరపర్తి జగన్నాయకులు (4) గుడి సూరిను ఆదిరంగము (5) సామి రాధాకృష్ణయ్య గార్లు సంఘసభ్యులు. ఈ గ్రంథాలయపఠనమందిరములు జార్జిటవునులో నాదాముత్తి స్ట్రీటు వీధి 'విద్యాలయ' భవనమందు 1917-వ సంవత్సరము ఏప్రిలు మాసమున స్థాపింపబడినవి. మునగాల రాజా గారు రావు సాహెబు కలువల కన్నన్ శ్రేష్ఠి గారు మున్నగువారు ఈ సంస్థాపనమునకు పోషకులు. ఈ ధర్మపఠనమందిరమునకు మొత్తముమీద ప్రతిదినము ఇంచుమించు 25 గురుండి వచ్చి చదువుకొనుచుందురు.

లోకమాన్యతిలకుగారి సందేశము:—(కూర్చున్న వారు, ఎడమప్రక్కనుండి కుడిప్రక్కకు)—(1) కస్తూరి రంగయ్యంగారు, హిందూ పత్రికాధిపతి, (2) లోకమాత అనిబిసెంటు, (3) లోకమాన్య తిలకు, (4) కరండికరుగారు, (5) కేల్కరుగారు, కేసరీపత్రికా సంపాదకుడు.

సామి వేంకటాచలము శ్రేష్ఠి గారు:—గుంటూరు జిల్లా ఒంగోలు తాలూకా అల్లూరు గ్రామము వీరి స్వస్థలము. వీరు చెన్నపురియందలి సామి కృష్ణస్వామిశ్రేష్ఠి గారి స్వీకారపుత్రులు. ఆంధ్రాంగ్లేయభాషలందు మంచి వక్తలు. మాతృభాషాపోషకులు, సంఘసేవాపరాయణులు, ధర్మతత్పరులు, ఉదారస్వభావులు, కార్యశూరులు. ఐదవ యార్యవైశ్యమహాసభయందు స్వచ్ఛిక భటనాయకులుగ పని చేసి ప్రశంసాపాత్రులైరి. ఆర్యవైశ్యమహాసభలోను దక్షిణహిందూదేశవైశ్యసంఘములోను కార్యదర్శులుగా పనిచేయుచున్నారు. ఇటీవల శ్రీకన్యకాపరమేశ్వరీ ధర్మస్థానమందొక ధర్మకర్తగా నెన్నుకొనబడుట వీరి స్వకులగణ్యతకును చెన్నపురాంధ్రసభా సహాకార్యదర్శిగ నెన్నుకొనబడుట వీరి యాంధ్రలోకగణ్యతకును ప్రత్యక్ష నిదర్శనములు. వీరు చెన్నపురాంధ్రసభాగ్రంథాలయోద్యమమున కొసంగిన వేయి రూప్యముల విరాళము వీరి దానధర్మములలో ప్రత్యేకించి ప్రశంసింపదగినది. వీరి యాచార్య మాంధ్రమాతృసేవాపరమై యత్యంతఫలవంత మగు ననుటకు సందియము లేదు.

కొని పెద్ద యెత్తున వ్యాపారము చేయుచున్నారు. వీరి పురుషాంతరములో వీరును ప్రయోజకులుగ ప్రసిద్ధి నొందినారు. వీరు పూర్వాచారపరాయణులు, నిష్ఠాగరిష్ఠులు; వీరి సౌశీల్యము ప్రశంసాపాత్రము.

వాళము వేంకటరత్నము గారు:—వీరు లక్ష్మీకాంతము గారి యనుజులు, రసికాగ్రేసరులు, ఉదారస్వభావులు, భాషాభిమానులు, పరోపకారపరాయణులు.

పేరూరి విశ్వనాథము గారు:—వీరు జగ్గయ్యపేట వర్తకులు; బొంబాయిలోను చెన్నపురిలోను కూడ విరివిగ వ్యాపారమును నడిపిన సుప్రసిద్ధులు. ప్రస్తుతము చెన్నపురి వీరి స్థిరనివాసము. వీరికి స్వభాషాభిమానమును స్వదేశాభిమానమును మెండు. ఉదారస్వభావులును పరోపకారులు నగు వీరి సౌశీల్యము ప్రశంసనీయము.

పింగల సుబ్రహ్మణ్యము శ్రేష్ఠి గారు:— వీరు దేవాంగులు, వేటపాలెము వాస్తవ్యులు. ఇక్కడ పెక్కుకాలము నుండి లుంగీల వ్యాపారము చేయుచున్నారు. ఉదారులు, దానధర్మప్రియులు, సంఘసేవా పరాయణులు, ఆంధ్రోద్యమాభిమానులు, స్వభాషాప్రోత్సాహకులు. వీరు చెన్నపురాంధ్రసభ ప్రతిష్ఠాపకులలో నొకరు; ప్రారంభమునుండియు లలితకళాశాఖా కార్యదర్శిగ పనిచేయుచు సభాభివృద్ధికై పాటుపడుచున్నారు. ఇటీవల చెన్నపురి యందు సమావేశమైన రాష్ట్రీయ బ్రాహ్మణేతర మహాసభాహ్వానసంఘమునకు సహకార్యదర్శిగ నెన్నుకొనఁబడిన సుప్రసిద్ధులు.

శ్రీ వత్సవాయ వేంకటనరసింహము రాజు గారు:—సూర్యవంశ క్షత్రియులలో ప్రఖ్యాతి చెందిన పెద్దాపుర సంస్థానాధీశులకు సమీప జ్ఞాతులును మహాదేవ్యుణునంపల్లి వత్సవాయ కుటుంబమునకు మూలపురుషు లగు శ్రీ జగ్గరాజ భూపాలునికి మూడవ పురుషాంతరము వారును నగు వత్సవాయ సుబ్బరాజుగారికి వేంకటనరసింహ రాజు గారు రెండవ కుమారులు. వీరి తండ్రి గారి యద్వితీయ వితరణ శీలము సుప్రసిద్ధము. వీ రాయుర్వేదమునందును ఛాయాపట గ్రహణాది చిత్రకళలయందును విశేష నైపుణ్యము నొందినవారు. వీరికి వేటాడుటయం దతి ప్రీతి. ఆయుర్వేదమునందు విశేష నిపుణత నొంది మహాకష్టములు నున్నగు సనివార్యరోగములను 9 దినములలో నివారింప గల యౌషధములను గనిపెట్టి సత్కీర్తి గడించిరి. వీరి మహారోగౌషధశాల చెన్నపురియందు జయప్రదముగ నిర్వహింపబడుచు, అసంఖ్యాకు లగు రోగుల నాకర్షించుఁ గాక! వీరు పేదల కుచితముగ చికిత్స చేయుటకై యొక ధర్మవైద్యాలయమును స్థాపించుటకు ప్రయత్నించుచుండుట ప్రశంసనీయము.

గజ్జె పార్థసారథి శ్రేష్ఠి గారు :—చెన్నపురియందలి సుప్రసిద్ధవైశ్యకుటుంబములలో వీరి దొకటి. వీరు గొప్ప వర్తకులు, లౌకికవ్యవహారవేత్తలు, ఉదారస్వభావులు, స్వభాషాభిమానులు, దానధర్మప్రియులు. ఇటీవల శ్రీ కన్యకాపరమేశ్వరీదేవస్థానమునకు ధర్మకర్తగా నెన్నుకొనఁబడినారు. వీరి సామర్థ్యసంపదౌదార్యములు సంఘసేవాపరములై వీరికి చిరకీర్తి సంపాదింపఁగల వని యూహింపఁబడుచున్నది.

రాయచోటి గిరిరావు పంతులు గారు:—వీరు చిత్తూరు మండలములోని మదనపల్లి వాస్తవ్యులు. గొప్ప విద్యాంగవేత్తలు, జాతీయవిశ్వవిద్యాలయమునకు ప్రధానాంగముగ నుండఁబోవుచున్న కళాశాలను సంస్థాపించిన మహనీయులు. తాము సంపాదించిన విత్తము నెల్ల విద్యాభివృద్ధికి వినియోగించి కీర్తి వడసినవారలు. ఆంధ్ర రాష్ట్రోద్యమునకు ప్రజల సానుభూతి నొసఁగు దత్తమండల వాస్తవ్యులలో నొకరు. పేద బాలుర పాలిటి పితరులు.

వైరాంగపస్త్రీల లక్ష్మీవిలాససభ:— క్రింది వరుసలోని పేర్లు—1. సీ. పట్టమ్మాళ్; 2. పి. లక్ష్మమ్మ; 3. పి. ముత్తు లక్ష్మిఅమ్మాళ్; 4. టి. వి. శేషగిరి అయ్యరుగారి భార్య; 5. ఎం. లక్ష్మిఅమ్మాళ్, (ప్రెసిడెంటు); 6. మాసిలామణి మొదలియారు గారి భార్య; 7. వల్లా సౌందర్యవల్లి అమ్మ. రెండవ వరుసలో 1. కే. అనుమాబాయి, (జాయింటు సెక్రెటరి); 2. పి. మంగరాజమ్మ; 3. మీనాక్షి అమ్మాళ్; 4. కే. రంగమ్మాళ్; 5. ఎస్. అమ్మణిఅమ్మ; 6. జానకిఅమ్మాళ్; 7. అ. చిన్నమ్మ. పైవరుసలో 1. ఎస్. పార్వతి అమ్మాళ్; 2. కే నారాయణమ్మ; 3. వై. సుకన్యమ్మ; (జాయింటు సెక్రెటరి) 4. డి. శృంగారమ్మ ; 5 సీ. చెల్లమ్మాళ్.

విస్సా కమలాక్షమ్మ గారు:— ఈమె మండి వాస్తవ్యులు అన్నమురాజు నరసింహయ్య పంతులు గారి కొమార్తె. నెల్లూరు వకీలు వి. రాజగోపాలు గారి సతీమణి. పసితనమునుండియు స్త్రీసంఘ సంస్కరణమునందును స్త్రీవిద్యాభివృద్ధి యందును మిగుల నుత్సాహము గలిగి మిక్కిలి పాటుపడియె. నెల్లూరునందు వారమున కొకసారి స్త్రీల నందఱి నొకచోట చేర్చి సద్విషయములను ప్రసంగించి కాలము పుచ్చుచుండుట కేర్పాటు చేయుటకై ఈమె చాల పాటుపడి కొంత కాలము అట్లు జరుపుచుండెను. స్త్రీలకుఁ గాను ఏర్పాటుపఁబడిన పరీక్షలను కొన్నింటిని ఈమె దగ్గఱనుండి జరిపెను. ఈమె మిక్కిలి పసితనముననే అనఁగా 19-వ సంవత్సరముననే ఒక యాఁడు బిడ్డను గని కాలగతి నొందెను. నెల్లూరు మండలమున జరిగిన యాంధ్ర స్త్రీల సభలోని మొదటి తీర్మానము ఈమె వియోగమును గుఱించియే.

జాతీయవిశ్వవిద్యాలయములోని యాంధ్రవిద్యార్థులు:—గత సంవత్సరము జూలయి నెలలో అఖిలభారతీయజాతీయ విశ్వవిద్యాలయమునకు ప్రధానాంగముగ మదనపల్లియందు నెలకొల్పఁబడిన విశ్వవిద్యాలయ కళాశాలయందు ప్రకృతము దేశములోని వివిధప్రాంతములనుండి వచ్చి సుమారు వందమంది విద్యార్థులు చదువుకొనుచున్నారు. అందు ఆంధ్ర దేశమునుండి వచ్చిన యువకుల సంఖ్య ప్రోత్సాహకరముగా నున్నది. వారిలో అన్యోన్యప్రేమానురాగము లుండుట కొఱకు సంఘము "ఆంధ్ర భ్రాతృసమితి" యను నామమున నెలకొల్పఁబడినది. ఈ ఛాయాపటమున నున్నవారలు:— మొదటివరుస (నేలమీఁద కూర్చున్నవారలు):— హనుమంతప్ప

